# మాండలిక వృత్తిపదకోశం

## మేదర - సంబంధిత వృత్తులు

సంపాదకులు :

పోరంకి దక్షిణామూర్తి




తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

1992

# MĀNDALIKA VRITTIPADAKOSAM

## (A Dialect Dictionary of Occupational Vocabularies)

## BASKET WEAVING AND OTHER OCCUPATIONS

**Editor and Complex : PORANKI DAKSHINAMURTHI**


తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ : 124

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1992

ప్రతులు : 1000

వెల : రూ. 60/-

ప్రతులకు :

రిజిస్ట్రార్,
తెలుగు విశ్వవిద్యాలయం,
లలిత కళాక్షేత్రం,
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :

భాగ్యం క్వాలిటి ప్రింటర్స్,
48-B, రామానుజ అయ్యర్ స్ట్రీట్,
మద్రాసు - 600 021.

# భూమిక

తెలుగుభాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖ వికసనానికి, వికసనానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాసనసభ చేసిన చట్టంప్రకారం 1985 డిసెంబరు 2 వ తేదీన రూపుదాల్చిన విశిష్ట విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. బోధన, పరిశోధన, ప్రచురణలతోపాటు విస్తరణసేవ, రాష్ట్రేతర రాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పనవంటి బహుముఖీన కార్యక్రమాలను కూడా ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. పూర్వంవున్న అకాడమీలు, తెలుగు భాషాసమితి, అంతర్జాతీయ తెలుగు కేంద్రం విలీనంకావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాలు, కేంద్రాలు, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తున్నది.

తెలుగుజాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధానాశయాల్లో ఒకటి. విశ్వవిద్యాలయంలో విలీనం అయిన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవిశ్రాంత కృషిద్వారా దేశ సాహిత్యరంగంలో విశిష్టస్థానం సమకూర్చుకుంది. 1957 ఆగస్టు 7 వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఈ అకాడమి దేశం మొత్తంమీద ప్రప్రథమ రాష్ట్రస్థాయి అకాడమికావడం విశేషం. ఈ అకాడమి ప్రామాణికమైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనాసాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవితచరిత్రలు, అనువాదాలు మొదలైనవి 163 గ్రంథాలు ప్రచురించింది.

తెలుగు విశ్వవిద్యాలయం ఈ ప్రచురణ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తూ ఇప్పటివరకు 120 గ్రంథాలను వెలువరించింది.

ప్రస్తుత గ్రంథం 'మాండలిక వృత్తి పదకోశం - మేదర, ఇతర పనులు'. లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి చేపట్టిన గ్రంథప్రచురణ కార్యక్రమాల్లో మాండలిక వృత్తిపదకోశ నిర్మాణం ఎంతో ప్రత్యేకతను సంతరించుకుంది. అకాడమి ఆధ్వర్యంలో వ్యవసాయం, చేనేత, కుమ్మరం, మో॥వ వృత్తి పదకోశాలు ప్రచురితమయ్యాయి. తెలుగు విశ్వవిద్యాలయం ఈ పరంపరలో కుత్స్యపరిశ్రమ, వడ్రంగం, లోహకార వృత్తి పదకోశాలు వెలువరించింది. మరో పదకోశం ముద్రణలో వుంది. మరికొన్ని పదకోశాలు నిర్మాణదశలో వున్నాయి.

తెలుగుసీమ అనేక వృత్తులకు ఆటపట్టుగా వర్ధిల్లింది. ఈ వృత్తులను జీవికలుగాచేసుకుని కుటుంబపోషణ చేస్తున్నవారు లక్షలాదిగా వున్నారు. ప్రతి రంగంలోనూ సుసంపన్నమైన పదజాలం వాడుకలో వుంది. అమూల్యమైన ఈ పదజాలాన్ని సేకరించి, విశ్లేషించి అర్థవివరణతోనూ, ఇతర విశేషాలతోనూ పాఠకలోకానికి అందించే ప్రయత్నమే ఈ వృత్తిపదకోశ ప్రచురణోద్దేశం.

ఆయా వృత్తిరంగాలతో విశేషపరిచయం సముపార్జించుకున్న భాషా సాహిత్యవేత్తలు ఈ పదకోశాల నిర్మాణబాధ్యతల్ని స్వీకరించారు.

ఈ 'మేదర, ఇతరపనుల' వృత్తిపదకోశం డా॥ పోరంకి దక్షిణామూర్తిగారి సంపాదకత్వంలో రూపుదిద్దుకుంది. వెదురు. ఈతకమ్మలు, తుంగ, తాటి ఆకులు, తాటి కమ్మలు, కొబ్బరిపీచు ఈనెలు, పేము, గోగునార, జనపనార మొదలైనవాటిని ఉపయోగించి తయారుచేసే అనేక రకాల వస్తువులు, ఈ వృత్తికారులు వాడే పనిముట్లు, వారి జీవితంతో పెనవేసుకున్న వివిధ అంశాలు ఈ పదకోశంలో చోటుచేసుకున్నాయి. ఎంతో శ్రమించి ఈ గ్రంథప్రామాణ్యాన్ని ఇనుమడింపచేసిన సంపాదకులు డా॥ పోరంకి దక్షిణామూర్తిగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

యథాపూర్వంగా ఈ ప్రచురణకూడా అందరి ఆదరాభిమానాలు చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు
**18-12-1991**

## మాండలిక వృత్తిపదకోశం తయారీలో సహకరించినవారు

శ్రీ సుంకిరెడ్డి నారాయణరెడ్డి, పర్యటన పరిశోధకుడు

శ్రీ కె. నరసింహాచారి, పర్యటన పరిశోధకుడు

శ్రీ ఎన్. సూర్యప్రకాశ్, రేఖాచిత్ర రచయిత

డా॥ ఎ. వి. పద్మాకరరెడ్డి, పరిష్కరణ సహాయకుడు

# విషయ సూచిక

# రేఖా చిత్రాలు

## చాపల అల్లకం

## పీచు పని



## పేము పని



## చీపురు, తాటి ఈనెలు, నులక

# మేదర - ఇతర పనులు కథనాత్మక వివరణ

మేదరిపనికి ప్రధానంగా కావలసిన ముడిసరుకు వెదురుబొంగు. అడవికి దగ్గరగా ఉన్నవాళ్ళు వెదురు బొంగును తామే నరుక్కొని తెచ్చుకోటంగానీ మన్నెం కాపులూ మొ॥నవాళ్ళు నరుక్కొస్తే కొనటంగానీ చేస్తారు. దూరప్రాంతాల్లో ఉన్న మేదరివాళ్ళు తమ సహకారసంఘాల ద్వారాఅడవికివెళ్ళి తెచ్చుకోటంగానీ వ్యాపారస్తులదగ్గర కొనటంగానీ చేస్తారు. వెదురుబొంగుల్లో నాణ్యాన్నిబట్టీ సైజునుబట్టీ చాలా రకాలున్నాయి. మేదరిపనికి మంచిగా పనికొచ్చేవి మేదరికఱ్ఱ (సాదనం బొంగు), మెదురుబొంగు, స్పెషల్ బొంగు.

వెదురుబొంగు పచ్చిదైతే అలాగే చీరతారు. ఎండినదైతే నీళ్ళలో నానబెట్టి చీలుస్తారు లేదా బద్దలుగా చీల్చి నానబెడతారు. చీల్చడంలో ఉపయోగపడే సాధనాలు : కత్తి (మేదరికత్తి), మొద్దు. కత్తుల్లో రెండు రకాలున్నాయి. బొంగును నరకడానికీ, చీల్చడానికీ ఉపయోగించే కత్తి బిడ్డు కత్తి. ఇది మందంగానూ బరువుగానూ ఉంటుంది. పేడును చీల్చే కత్తి లిక్కత్తి. ఇది బరువు తక్కువగానూ, వాడిగానూ ఉంటుంది. వెదురుబొంగు మొ॥ వాటిని నరికే టప్పుడు కత్తి నేలకు తగిలి మొక్కబోకుండా అడుగున ఉంచడానికి మొద్దు పనికొస్తుంది. వెదురుబొంగు మొదటి భాగాన్ని కత్తితో మట్టగించి బొగ్గుతో గాని, కత్తితోగాని బొంగులో సగానికి గుర్తుగా గీత పెడతారు. ఆ గీతమీంచి కత్తిని కరిపించి మొద్దుతో కత్తిమీంచి బాదుతారు. బొంగు మధ్యలోకి ఒక గజంవరకూ పోయిన తరవాత కత్తిని కుడిచేత్తో పట్టుకొని కొంతభాగం రెండుగా చీల్చిన బొంగుపక్షాన్ని కాలికింద తొక్కిపట్టి, ఎడంచేత్తో రెండోపక్షాన్ని పట్టి లాగుతూ గంట్లదగ్గర కత్తితో కొడుతూ బొంగును పొడుగ్గా రెండు భాగాలుగా పగలగొడతారు. ఇలాటి భాగాన్ని చెక్క అంటారు. ఈ చెక్కను కత్తితో కొంతవరకూ చీల్చినతరవాత రెండు చేతులతో పట్టుకొని రెండు భాగాలుగా పొపుతారు. పాపిన భాగాన్ని బద్ద అంటారు. ఇది రెండు రకాలు : ఒకటి సుద్దిబద్ద, దీన్నించి పేడు, కఱ్ఱ తీస్తారు. రెండోది గంటిబద్ద. దీన్నించి నిలువులు, కఱ్ఱ మొ॥వి తీస్తారు. బద్దకుండే బొడుపులను కత్తితో చెక్కి గరిగేసి కఱ్ఱ కోసమైతే పొడుగ్గా నాలుగయిదు గోవలుగా చీలుస్తారు. ఒక్కొక్క గోవనుంచీ పరిమాణాన్నిబట్టి నాలుగయిదు కఱ్ఱల్ని తీస్తారు. పేడు కోసమైతే బద్దను అడ్డంగా రెండు మూడు తుంటలుగా (సుమారు మూడుమూళ్ళ జానెడు కొలతలో) నరికి ఒక్కొక్క తుంటలో వెడల్పుగా బద్ద వెడల్పును బట్టి రెండు మూడు పలుకులుగా చీలుస్తారు. వంకెమీదగాని ఏదైనా కఱ్ఱమీద గాని పేడును ఆనించి దానిమీద కత్తి పదునుభాగాన్ని ఆనించి పేడున్ని లాగుతూ నునుపుగా గీకు తారు. గోవనుంచి సరాసరిగాని, సీర్పదీసి, సీర్పనుంచి గాని కఱ్ఱలు చీలుస్తారు. అల్లే వస్తువును బట్టీ, వస్తువులో అల్లే స్థానాన్ని బట్టీ పేడులోనూ కఱ్ఱలోనూ పరిమాణంలో (వెడల్పు, మందం, పొడవు మొ॥న) తేడాలుంటాయి. మేదరి పనిలో ఎక్కువ వస్తువులు పైన వివరించిన భాగాలతో అల్లుతారు. అయితే కొన్ని వస్తువుల అల్లకాన్నిబట్టి పేడుతో బొంగునుంచి చీల్చిన భాగాలకు చాలా రకాల పేర్లున్నాయి (ఉదా : సలుగు, వార, పెండెవార, సరుము మొ॥వి).

అల్లకం విషయానికొస్తే - మేదరిపనిలో అల్లకాన్నంతనూ ఒకే రకమని చెప్పగూడదు. వస్తువునుబట్టీ అల్లకం మారుతుంది కాబట్టి మేదరిపనిలో వస్తువుల తయారీని మూడు విధాలుగా విభజించవచ్చు: (1) పేడల్లకం, (2) నిలువులు-కర్రల్లకం, (3) పేడూ నిలువులూ కర్రా ఉపయోగించకుండా కేవలం వెదురుబద్దలతోనూ బొంగుల తోనూ మేకులు కొట్టి చేసే పని. పేడల్లకంలోనూ నిలువులతో అల్లే అల్లకంలోనూ అవసరమయేసాధనం అమ్ముకత్తి. అమ్ముకు బదులుగా కొన్నిచోట్ల దబ్బనం, ఆరె, చురకత్తి మొ॥వి ఉపయోగిస్తారు. తిరిగి వీటిలో భేదాలున్నాయి.

పేడల్లకం: నిలువులు ఉపయోగించకుండా కేవలం పేడుతో అల్లే విధానం. చేట, జల్లెడ, విసనగర్ర, గూడ, మానె, మచ్చిక, శూర్క-బుట్ట, సారెపెట్టె, దాగర, ఉల్వాడి, జంగిడి, బండిజల్ల, కచ్చడం బండి తడక, చాప, బట్టలపెట్టె మొ॥వి అల్లుతారు. వస్తువునుబట్టి ఉపయోగించే పేడు పరిమాణంలో (మందం, వెడల్పు పొడుగు తేడాలుంటాయి. మళ్ళీ ఈ విధానంలో గూడా స్వల్పమైన భేదాలున్నాయి.

ఒంటిపేడల్లకం (ఒంటిగచ్చం): ఈ విధానంలో వరసగా పేళ్ళను పరిచి వాటికడ్డంగావేసే పేళ్ళు నిలువు పేళ్ళలో ఒకదాని కిందినుంచీ ఒకదాని మీదినుంచీ మళ్ళా ఒకదాని కిందినుంచీ మళ్ళా ఒకదాని మీదినుంచీ ఇలా తిరుగుతూ వస్తాయి.

రొంటాలల్లకం: ఈ విధానంలో రెండు పేళ్ళ మీదినుంచి రెండు పేళ్ళ కిందినుంచి మళ్ళా రెండు పేళ్ళ మీదినుంచి ఇలా అడ్డం పేడు తిరుగుతూ వస్తుంది.

మూటాల అల్లకం: మూడుపేళ్ళ మీదినుంచీ, నాలుగుపేళ్ళ కిందినుంచి అడ్డంపేడు తిరుగుతూ వస్తుంది.

నోటాల అల్లకం: నాలుగుపేళ్ళ మీదినుంచీ, నాలుగుపేళ్ళ కిందినుంచి అడ్డంపేడు తిరుగుతూ వస్తుంది. ఈ నాలుగు విధానాల్లోనూ చేట, చాప, విసనగర్ర అల్లుతారు.

పైన పేర్కొన్న వస్తువుల అల్లకం ఒకే మాదిరిగా ఉన్నా కొన్నిచోట్ల భేదిస్తుంది.

చేట: నాలుగుపేళ్ళు కొమ్ముకేసి (చూ. కొమ్ము) మూడుపేళ్ళు వీడిచి ఒకపేడు లేపి కొమ్ముకడ్డంగా తిప్పి మరోపేడు లేపి మళ్ళా మూడుపేళ్ళు విడిచి ఒక పేడు లేపి కొమ్ముకడ్డంగా తిప్పుతూ కొమ్మునిండా పేళ్ళు వేస్తూ అల్లి కొమ్ము చివరినుంచి పేడును మలిచి దాన్ని తిప్పుతూ ఇంతకుముందు వేసిన పేళ్ళలో రెంటి మీదినుంచీ రెంటి కిందినుంచీ (రెండు విడిచి రెండు లేపుకుంటూ) అల్లి మూలలు గోటుతారు. మూలదగ్గర మిగిలిన పేళ్ళను అమ్ముతో కోసేస్తారు. అంచుచుట్టూ లోగట్టు, బయటికట్టు (వెనకకట్టు) వేసి ఆ రెంటిమీంచీ కర్రవేసి అమ్ముతో రంధ్రంపొడిచి

కట్టుముంగుతో కట్లు బిగిస్తారు. దీన్ని అచుగట్టడం అంటారు. గూడ, సారెపెట్టె, బుట్టలపెట్టె మొ॥ వాటినిగూడా ఇదే మాదిరిగా అల్లి లోగట్టూ, బయటికట్టూవేసి కట్లు బిగిస్తారు. విసనగర్ర అల్లకం ఇదేమాధిరిగా ఉంటుంగిగాని స్థూలా మలపటం ఉండదు.

జల్లెడ: నాలుగుపేళ్ళతో అడుగుదొక్కి అడ్డంగా ఒక్కొక్క పేకును రెండు పేళ్ళకు మీదినుంచి, రెండు పేళ్ళకు కిందినుంచి తిప్పుతూ సన్నని రంధ్రాలు వచ్చేట్టు చతురస్రంగా జల్లెడ తట్టు అల్లి దానిమీంచి గుండుపెట్టి తట్టును గుండ్రంగా కత్తితో కత్తిరిస్తారు. గుండుచుట్టూ తట్టును మలిచి బయటిగుండు (చూ. బిలుకు) వేసి అమ్ముతో రంధ్రాలు పొడిచి కట్టుముంగుతో చిన్నకట్టు (చూ. మోదుకట్టు) బిగించి రెండు గుండ్లమీంచి కర్రవేసి మళ్ళీ కట్టు ముంగుతో పెద్దకట్టు బిగించి 'గురిజెముడి' వేస్తారు. ఇలా అంచుకట్టడాన్ని 'కోతగట్టడం' అంటారు.

బండిజల్లా, కొన్నిరకాల చాపలూ ఒంటిపేడల్లకంతో అల్లుతారు. బండిజల్ల మూలమలిపి సొడుగంపలన్న సన్నని వెదురుబొంగులు తొడుగుతారు.

గూనె, మచ్చిక, గూర్కబుట్ట, చాప మొ॥ వాటి అంచులకు కట్లు (బద్దలు) వెయ్యరు.

రెండోది నిలువులూ కర్రతో అల్లకం. ఈ అల్లకంలో నిలువులతో అడుగుదొక్కి (నిలువుల్ని బండిచక్రం ఆకారంలో పరిచి కాలి బొటనవేలితో తొక్కి పడతారు) అడిపోగుతో ఒక నిలువు వదిలి ఒక నిలువుచుట్టూ చుడుతూ బొడ్డడుగూ, అడుగూ అల్లి, నిలువుల్ని క్రమంగా ఎత్తుభాగంకోసం పైకి వంచుతూ కర్ర (తీగలాంటి వెదురుభాగ)తో ఎత్తుభాగం అల్లి పెండోరతో గట్టిదనంకోసం తల కట్టువేసి మిగిలిన కొనల్ని లోపలికి మలిచి దోపుతారు. వస్తువునుబట్టి అడుగు అంచుదగ్గరా, ఎత్తుభాగం మధ్యనా క్రమంగా కిందికట్టూ, నడిమికట్టూ వేస్తారు. తట్ట, బుట్ట, గంప, గుల్ల, సిబ్బి, తడక, గుమ్మి మొ॥ చాలా వస్తువులు ఈ విధానంలో అల్లుతారు. పై రెండురకాల అల్లకాల్లోనూ వస్తువునుబట్టి స్వల్పమైన భేదాలు చాలా ఉన్నాయి.

మూడోది: పేడూ, కర్రా, నిలువులూ లేకుండా కేవలం వెదురుబద్దలతోనూ బొంగులతోనూ వస్తువుల్ని చేసే విధానం. ఈ విధానంలో కావలసిన సాధనం ఉలి. వస్తువునుబట్టి వెదురుబద్దల్నీ, బొంగుల్నీ కావలసిన సైజులో నరుక్కొని కావలసినచోట ఉలితో తొలిచేసి, అవసరమున్నచోట మేకులు గొట్టి వస్తువులు తయారు చేస్తాను. మంచం, నిచ్చెన, సిపాయి, చెరుకు నిచ్చెన, గోవ, జాలితడక, బల్ల, బెంచీ, కుర్చీ మొ॥ వస్తువులు ఈ పద్ధతిలో చేస్తారు.

ఈ రకంగా వివిధ పద్ధతుల్లో మేదరివాళ్ళు నీళ్ళచేద, చెంబు, గ్లాసు మొదలుకొని మంచం, కుర్చీ, బల్ల వరకు మానవునికి నిత్యావసర వస్తువులనెన్నింటినో తయారుచేస్తున్నారు. కాలంతోబాటు వీళ్ళు తమ పద్ధతుల్ని కూడా మార్చుకొని ఆధునికుల అభిరుచుల మేరకు రంగులూ, ప్లాస్టిక్ వైరూ ఉపయోగించి కొత్తరకం బుట్టల్ని, షో కేసుల్లో అమర్చుకునే బోటు మోడళ్ళు, ఫ్లవర్‌వాజ్‌లూ, ట్రేలూ భోజనం చేసేటప్పుడు ప్లేట్ల కింద పరుచుకునే చాపలూ చేస్తున్నారు.

మేదరివాళ్ళు అడవుల్ని వదిలి మైదానప్రాంతాల్లోకి వచ్చి చాలాకాలం కావటంవల్ల వాళ్ళ జీవన విధానం సామాన్య సంస్కృతిలో అంతర్భాగమైపోయింది. అందరూ మొక్కే దేముళ్ళనే వీళ్లూ మొక్కుతారు. అయితే వీళ్ళకు ప్రత్యేకంగా 'మలలమ్మ' పండుగ అని ఒకటి ఉంది. ఈ పండుగ వీళ్ళకు చాలా ముఖ్యమయింది. వీళ్ళ గురువు కేతయ్య. ఈ వృత్తికి చెందిన దూదయ్య, చెన్నబసవయ్య, మొ॥ శైవభక్తుల ప్రస్తావన బసవపురాణం మొ॥ గ్రంథాల్లో ఉంది. వీళ్ళ గోత్రాలన్నీ శివుని ప్రమథగణాల పేర్లతో ఉన్నాయి. అడవులకు దగ్గిరగా ఉన్న మేదరివాళ్ళలో గిరిజన సంస్కృతి (కట్టూ బొట్టూ, కట్టుబాట్లూ, మొదలయిన విషయాల్లో) బలంగా కనిపిస్తుంది.

స్థూలంగా మేదరివాళ్ళ జీవిత విధానమూ, పనివిధానమూ ఇది. అయితే ప్రధానంగా ఇదే పని వేరొక ముడి సరుకుతో పనిచేసే ఎరకలివాళ్ళ తెగ ఒకటి ఉంది. వీళ్ళు ఎక్కువ ప్రాంతాల్లో ఈత కరుగులతోనూ, కొన్ని ప్రాంతాల్లో వెదురుబద్దలతోనూ అల్లకం పని చేస్తారు. కొన్ని ప్రాంతాల్లో కొన్ని వస్తువుల్ని బండిజల్ల, గుమ్మి, తడక మొ॥ నల్లెడ, వావిలి, మోదుగుబెల్లెంత, అల్లికర్ర, బంకజేనకట్టె, పుల్చేరు, ఈడుగు మొ॥ వాటి బరుగులతోగూడా అల్లుతారు. వెదురుబద్దలతో అల్లేవాళ్ళు ఇంచుమించు మేదరివాళ్ళమాదిరిగానే అల్లుతారు. వీళ్ళు ప్రధానంగా వాడే ముడిసరుకు ఈత బరుగు. నాణ్యాన్నిబట్టీ, సైజునుబట్టీ దీంట్లో చాలా రకాలున్నాయి. మెత్తటి బరుగు అల్లకం పనికి చాలా ఉపయోగం.

తోపుకు చద్దులుగట్టుకొనిపోయి ఈతచెట్టుమీంచి కొడవలి (ఎరకలికత్తి) తో ఈతకమ్మల్ని కోస్తారు. (వీళ్ళకు మొత్తం పనిలో ఉపయోగపడే సాధనం కొడవలి ఒక్కటే). కోసి, కొడవలితో ఈతమట్టనూ, ఆకుల్నీ, ముళ్ళనూ చెలిగి మండెవేస్తారు. చెలిగితే వచ్చివదాన్ని ఈతబరుగు అంటారు. బరుగుతో కట్టి, నెత్తిమీదగాని బళ్ళమీదగాని ఇంటికి తెచ్చి ఎండకేస్తారు. ఎండింతరవాత కొడవలితో చీరతారు. ఇలా చీరితే ఒక్కబరుగునుంచి కండదబ్బ (ఇది బరుగు పొట్టభాగానికీ, వెన్నుభాగానికీ మధ్యనుంచి వస్తుంది. గంప మొ॥ వాటి అడుగుభాగం, ఎత్తుభాగం సగందాకా అల్లడానికి పనికొస్తుంది), వెన్నుదబ్బ (ఇది చెట్టుకున్న స్థితిలో నేలవేపు ఉండే భాగంనుంచి తీసింది. గంప మొ॥వాటి ఎత్తుభాగం అల్లటానికి ఉపయోగిస్తారు), పొట్టదబ్బ (పై భాగంనుంచి తీసినది. గంప మొ॥వాటి నిలువులకు ఉపయోగిస్తారు) అని మూడురకాల బద్దలు వస్తాయి. అవసరాన్నిబట్టి ఇంకా సన్నగా కూడా చీరుతారు. బండిజల్ల మొ॥న కొన్ని వస్తువులకు బరుగును చీరకుండానే అల్లుతారు.

వస్తువునుబట్టి నాలుగు లేదా ఆరు లేదా ఎనిమిది కాళ్ళు పెట్టి అడుగుదొక్కి అడిసుత్తితో బొద్దడుగుచుట్టు కాళ్ళు పేరుస్తారు. కండదబ్బతో అడుగుచుట్టి నిలువులువంచి ఎత్తుభాగం వెన్నుదబ్బతో అల్లి మూతిదగ్గర తలకట్టువేసి నిలువులు మలిచి లోపలికి దోపితే గంపఅల్లకం పూర్తవుతుంది. మిగతా వస్తువుల్ని (తట్ట, గుమ్మి, బండిజల్లి ఇలారం, తడక మొ॥వి) కూడా ఇదే పద్ధతిలో అల్లుతారు. చేట, జల్లెడ మొ॥వి కూడా అల్లుతారు. మూలలు మలిచే వస్తువుల్ని వీళ్ళు అల్లరు.

ఎరకలవాళ్ళు ఆంధ్రదేశమంతటా ఉన్నారు. వీళ్ళు ఒకచోట స్థిరంగా ఉండక తిరుగుతూ ఉంటారు. కాబట్టి వీరు మాట్లాడే తెలుగు ఒక నిర్దిష్టప్రాంతాన్ని సూచించదు. అందుకని వీళ్ళ వృత్తిలో వచ్చే పదాలు ప్రాంతభేదాన్ని సూచించవు. వీళ్ళు తమిళనాడునుంచి వలస వచ్చినారని కొందరి అభిప్రాయం. వీళ్ళ మాతృభాషలో ఎక్కువగా

తమిళపదాల్ని పోలిన పదాలు (కుడి, తన్ని, ఊడు మొ॥నవి) కొంతవరకు తెలుగుపదాలు (రెండు, మూడు, అర్ధు మొ॥ సంఖ్యా వాచకాలు) కనిపిస్తాయి.

ఇప్పటికీ వీళ్ళ జీవితవిధానం గిరిజన సంస్కృతి ప్రభావంలోనే ఉంది. ఇటీవలికాలంలో స్థిరనివాసం ఏర్పరచుకోటం, రంగులుపయోగించి వస్తువుల్ని ఆకర్షణీయంగా తయారు చేయటం నేర్చుకుంటున్నారు.

ఈతబరుగుతో సంబంధమున్నపని ఈ నిఘంటువులో ఇంకొకటిఉంది. అది ఈతచాప అల్లకం. ఈతచాప అల్లకానికి కావలసిన ప్రధానమైన ముడిసరుకు ఈతాకు.

ఈతచెట్టు ఎత్తుగా ఉన్నట్లయితే గైకొడవలితోనూ, ఎత్తు తక్కువగా ఉన్నట్లయితే కొడవలితోనూ ఈత కమ్మల్ని కోసుకొస్తారు. కమ్మను పొడుగ్గా సగానికి పగిలేటట్లు చీరి ఉల్లారేస్తారు. కమ్మనుంచి (కమ్మ అంటే బరుగుకు ఈతాకులుఉన్న ఈతమట్ట) ఆకుల్ని రెబ్బుతారు. రెండుపాయలుగా అంటుకొనిఉన్న దీన్ని జోడెం అంటారు. జోడేన్ని రెండుపలుకులుగా చీరతారు. మాపగాలేని పలుకునుంచి ఈనెను దీస్తారు. ఆకుల్ని (పలుకుల్ని, జోడేల్నిగూడా 'ఆకు' అనే వ్యవహరిస్తారు) ఎండేస్తారు. ఎండింతరవాత తడుపుకొని పచ్చిబట్టలో చుట్టుకొని దగ్గరపెట్టుకొని అల్లకం మొదలు పెడతారు. ఏటవాలుగా ఒకవేపు ఏడు, ఇంకొకవేపు ఆరు (కొన్నిచోట్ల ఈ సంఖ్య మారుతుంది! 5, 6: 8: 9; 6: 7 నిష్పత్తిలో పెడతారు). ఆకుల్ని రెండుచేతులతో పట్టుకొని ఒకటివిడిచి ఒకటి లేపుకుంటూ సుమారు పది పదిహేను గజాల పట్టీ అల్లుతారు. అల్లేప్పుడు పట్టెను ఎడమచేతికి చుట్టుకుంటారు. దీన్ని చుట్ట అంటారు. పట్టెను గజంన్నర పొడుగుముక్కలుగా కోసి ఒకముక్క పక్కకు ఒక ముక్కనుకలిపి దబ్బనంతో కూర్పాకునుదూర్చి కూరుస్తారు. ఇలా ఇరవై పట్టెల్ని కూర్చి అతుకులమీంచి కొడవలివీపుతో తడతారు. పొడవంచుకూ, అడ్డంచుకూ, అంచుపట్టెల్నివేసి పురికొసతోగానీ, ఈతాకు పురితోగానీ కుడతారు. సైజునుబట్టి (పొడుగు, వెడల్పు, చదర, పదహారుచాపపట్టెల, పద్దెనిమిదిపట్టెల చాప మొ॥వి) ఈ చాపలో రకాలున్నాయి.

ఈతచాప అల్లకానికి ప్రత్యేకంగా ఒక కులమంటూలేదు. ముఖ్యంగా శారదగాళ్ళు, జంగాలవాళ్ళు మొ॥ వాళ్ళు ఎక్కువగా అల్లుతారు.

## తుంగచాపల నేత

తుంగ లేదా జమ్ముచాపల నేతపనికి సంబంధించిన పదాలుకూడా ఈ పదకోశంలో ఉన్నాయి.

తుంగచాప అల్లకానికి కావలసిన ముడిసరుకు తుంగ, కలబందపట్ట, రంగులు మొ॥నవి. తుంగ కాలవల వెంబడీ, వాగులవెంబడీ, చెరువులవెంబడీ, అడవుల్లోనూ పెరుగుతుంది.

తుంగచాప నేతపనివాళ్ళు తుంగదొరికే ప్రాంతానికివెళ్ళి నెలా రెణ్ణెళ్ళు మకాంవేసి కొడవలితో కోస్తారు. జమ్ముకత్తితో ఒక్కొక్కపోచను రెండు, మూడుదబ్బలుగా చీలుస్తారు. సాధారణంగా దీన్నికూడా పోచ అనే వ్యవహరిస్తారు. బాగా ఎండేసి కట్టలుగట్టి లారీలమీద ఇంటికి తెచ్చుకుంటారు. తుంగను నానేసి బానలో ఎసరుపెట్టి కాగిన

తరవాత ఎసట్లో రంగువేస్తారు. (పూర్వకాలంలో వాళ్ళే రంగు తయారుచేసుకునేవాళ్ళు.) ఇప్పుడు మార్కెట్లో దొరికే రంగుల్నే ఉపయోగిస్తున్నారు. నానిన తుంగను ముదురుజుట్టి అందులో ఎసరుకాగిన బానలోపెట్టి తుంగకు రంగు పట్టేంతవరకు ఉడకనిచ్చి తీస్తారు. తీసి, ఎండకేసి అరినతరవాత కట్టలుకడతారు. తుంగలో ఉప్పుతుంగ బొర్సుతుంగ వంటి చాలారకాలు ఉన్నాయి. దీన్లో గుండు, జమ్ము, సేలంజమ్ము చాపనేతకు బాగా పనికొస్తాయి. కలబందపట్ట గుమ్మల్ని రైతులు చేలకు కంచెగాపెడతారు. బీడుభూములు, చవిటిభూములు, గట్లు మొ॥ చోట్లకూడా ఇవి మొలుస్తాయి. చాపనేతపనివాళ్ళు కొడవలితో కలబందపట్టల్ని కోసుకొచ్చి పక్కముల్లు జబరేస్తారు. కొన, మొదలు నరికేస్తారు. పట్టను చాకుతో రెండు ఒప్పలుగా చీరతారు. ఒక్కొక్క ఒప్పను పీతిరిపలకమొద్దుమీద పరిచి రేకువేసిన పట్టలుతోసే చెక్కతో అడ్డంగాగీకుతారు. ఇది చేసినప్పుడు పట్టమీది పసరుభాగమంతాపోయి దారాలుమాత్రం మిగులుతాయి. ఎండకేసి కొన్నిదారాల్నికలిపి ఏకులుచేసి కట్టగడతారు. ఏకుల్నితీసి పురిపెడతారు. పురిపెట్టే సాధనంపేరు పురిబిళ్ళ (కదురు). మూరెడుపొడుగు కట్టెపుల్లకు ఒకచివర చెక్కబిళ్ళను తొడిగితే పురిబిళ్ళ అవుతుంది. కొన్నిచోట్ల ఇనప చువ్వకు ఇనపబిళ్ళను తొడుగుతారు. ఏకునుంచి ఒక దారాన్నితీసి పురిబిళ్ళ కొసకుకడతారు. బిళ్ళవేపుభాగాన్ని చేత్తో తిప్పుతూఉంటే దారం పురెక్కుతుంది. పురిని ఒక కట్టెపుల్లకు ఉండగాచుట్టుకుంటారు. ఇటీవలికాలంనుంచి కలబంద నారపోగులకు బదులుగా ప్లాస్టిక్‌దారాల్ని, నూలుదారాల్ని ఉపయోగిస్తున్నారు.

తుంగచాపనేతకు కావలసిన సాధనం మగ్గం. అయితే ఈ మగ్గాల్లో రకాలున్నాయి. వాటిల్లో ఎక్కువగా మిగతావాటితో భేదించేది చేతిమగ్గం. రెండుగజాల పొడుగున్న లావుపాటి వెదురుబొంగుకు బెత్తెడు ఎడానికొకటి చొప్పున బొంగుచుట్టూ గరి(గాటు) పెడతారు. ఆ గాట్లలో రాళ్ళుకట్టిన దారాల్ని వేలాడదీస్తారు. బొంగును రెండు కొయ్యలమీద వేలాడదీసి దారాలమీంచి తుంగపోచలనుఉంచి ఒకటివిడిచి ఒకటిగా దారాల్ని అవతలివేపువేసి మళ్ళీ పోచపెట్టి అవతలిదారాల్ని ఇవతలివేపుకువేసి మళ్ళీ పోచపెట్టి దారాల్ని అవతలివేస్తూవేస్తూ చాప నేస్తారు.

మామూలు మగ్గానికైతే పురిపెట్టిన దారపోగులను పొడుగ్గా వరసగా ఎగదండు (ఎగదండుకుండే రంధ్రాలకుగాని, దారపు రంగులకుగాని, పొడవాటి చువ్వకుగాని)నుంచి అచ్చులోంచీ అనికర్రకుండే దారపు రింగుల్లొంచీదూర్చి దిగదండుకు కడతారు. ఇలా కట్టడాన్ని పడుగుబెట్టటం అంటారు. కొన్నిరకాల మగ్గాలకు ముందచ్చు, వెనకచ్చులనుంచీ దూర్చి దిగదండుకు కడతారు. ఈ పోగుల్లో ఒకటివిడిచి ఒకటిగాఉన్న ఒక పోగులపరసను 'అని' అంటారు. ఇవి రెండు ఉంటాయి. ఒక అనిపోగుల్ని అనికర్రకుండే దారపురింగుల్నించి దూరుస్తారు. కొన్ని మగ్గాల్లో ఒక అని పోగుల్ని ముందచ్చునుంచీ, ఒక అనిపోగుల్ని వెనకచ్చునుంచీ దూరుస్తారు. ఇంకొన్ని మగ్గాల్లో ఒక అనిపోగుల్ని ఒక ఉళ్ళకట్టనుంచి దూరుస్తారు (ఇవి రెండుంటాయి.)

మగ్గంలో మొదట నేతపనివాడు కూర్చునేవేపు ఎగదండుఉంటుంది. దానికి మూరెడుదూరంలో అచ్చు ఉంటుంది. దానితరవాత మూడుముక్కనాల కట్టెలకు అనికర్ర వేలాడదీసిఉంటుంది. దానితరవాత తొక్కుడుదబ్బా, దానితరవాత లోబొంగూ ఉంటాయి. తొక్కుడుదబ్బను కిందికినొక్కితే ఒకటి కిందికీ ఒకటి పైకీ జరిగి వడి ఏర్పడు

తుంది. ఆ పడి మధ్యపోగులకడ్డంగా లాకదబ్బసాయంతో తుంగపోచనుదూర్చి అచ్చును ముందుకు లాక్కుంటారు. ఇలా చేయటంవల్ల ఒకదానితరవాత ఒకటిగాపెట్టే పోచలు దగ్గరగాజరిగి అల్లకం చిక్కగావస్తుంది. ఇలా అనులు మార్చుకుంటూ తుంగపోచను పెట్టుకుంటూ చాప నేస్తారు. కొన్ని మగ్గాల్లో తొక్కుడుచెక్క [భూమిలోని గుంతలో ఉండే ఈ చెక్క ఉగ్గకట్టకుగాని (కొన్ని మగ్గాల్లో) వెనకచ్చు ఖందచ్చులకుగానీ (కొన్ని మగ్గాల్లో) తాడుతోకట్టి ఉంటుంది.] సాయంతో అనులు మార్చుకుంటారు. అల్లినతరవాత నిలువంచులకు బట్టవేసి అంచుకుడతారు.

డిజైన్‌నుబట్టీ, సైజునుబట్టీ, నాణ్యాన్నిబట్టీ, రంగునుబట్టీ తుంగపోచలో చాలా రకాలున్నాయి. ఉదా॥ డైమన్‌చాప, గళ్ళచాప, పచ్చీసుచాప, గజంచాప, మూడుజేనలచాప, చదరబంతిచాప, బొర్సుచాప, సేలంచాప, మొ॥వి.

తుంగచాప నేయటమే వృత్తిగాగల ప్రత్యేక కులమేదీలేదు. మాల, బెస్త మొ॥ కులాలవాళ్లూ సాయిబులూ నేస్తారు. ఈ పని ఎక్కువగా సాగరతీరాంధ్రంలోనూ, రాయలసీమలోనూ ఉంది.

తాటిచాపల అల్లకం: తాటిరేకుతో కూడా చాపలు అల్లుతారు. కల్లు గీయటం వృత్తిగాగల గౌండ్లవాళ్ళు ఉపవృత్తిగా ఈ పని చేస్తారు.

తాటిచెట్టెక్కి కత్తితో కమ్మలు కోసుకొచ్చి ఎండబెడతారు. ఎండినతరవాత తెల్లవారుజామున మంచుకు వేయటంగానీ నీళ్ళు చల్లటంగానీ చేస్తే మెత్తబడుతుంది. దాన్ని పొడుగ్గా రెండు పాయలుగా చీలుస్తారు. పాయల బుగ్గ దీసి (అంచువెంట గీకటం) మోడు చివర కోసేసి పాయనుంచి రేకుల్ని చీరతారు. రేకునుంచి ఈనెనూ పొట్టనూ చింపేసి సాపు చేస్తారు. ఇలా సాపు చేయటాన్ని వజ్జెట్టటం అంటారు.

ఇలా సాపుచేసిన రేకుల్ని జమిలిగాపెట్టి ఒకమూల దగ్గర మొదలేసి వెదురుచాప మాదిరిగా అల్లుకుంటూ, రేకులు అయిపోయినప్పుడు అతుకులు కలుపుకుంటూ అల్లుకుంటూ రెండోమూలా మూడోమూలా విరిచి నాలుగోమూల మడవడంతో అల్లకం పూర్తవుతుంది. అక్కడక్కడ బయటికి కనిపించే రేకుల్ని కోసేస్తారు. సైజునుబట్టి దీనిలో కురచచాప, గజంచాప, తోకచాప మొదలయిన రకాలున్నాయి.

## పీ చు ప ని

ఈ పదకోశంలో కొబ్బరిపీచుతో తాళ్లూ, గోదిసీలూ చేసేపనికి సంబంధించిన పదాలుకూడా ఉన్నాయి. కొబ్బరి తోటనుంచి గానీ కొబ్బరికాయల వ్యాపారస్తుల దగ్గరనుంచి గానీ కొబ్బరిమట్టల్ని తెచ్చుకొని గూటంతో చితగ్గొడతారు. గోలెంలో గానీ చిన్నచిన్న నీటిమడుగుల్లో గానీ రెండు రోజుల్నుంచి పది రోజులవరకు ఊరేసి తెచ్చి మళ్ళీ చితగ్గొడతారు. చితగ్గొట్టినదాన్ని దులిపి ఎండేస్తారు. ఎండిన తరవాత పీటమీద ఒత్తులు చేస్తారు. ఒత్తుల్ని కట్టలుగా కట్టిపెట్టుకొని పేనేప్పుడు విప్పి రెండు ఒత్తుల్ని రెండు చేతుల్తో పట్టుకొని రెండింటినీ విడివిడిగా చేతుల్లోనే

పురిపెడుతూ రెండిటినీ కలిపి మెలి దిప్పుకుంటూ తాడు పేన్తారు. ఇది సన్నగా దబ్బనమంతలావు ఉంటుంది. దీన్ని ఉండలుగా చుట్టి మంచం నులకకోసం అమ్ముతారు. అవసరాన్నిబట్టి మూడు నాలుగు పేటలతో లావుగానూ పేన్తారు.

ఇటీవలి కాలంలో తాళ్ళు పేనే మిషన్ వచ్చింది. దీనిమీద పేనేవాళ్ళు కొబ్బరిపీచు బేళ్ళను కొను క్కొచ్చుకొని కొంత పీచును చేత్తో పట్టుకొని ఒక కొసను మిషన్ చక్రానికి కడతారు. మిషన్ తిరుగుతూ ఉంటే కొబ్బరి పీచు వడి తిరుగుతూంటుంది. పీచును పట్టుకున్న మనిషి ఈవడికి పీచును అందిస్తూ వెనక్కి జరుగుతూ పోతాడు. కొంతదూరం వెళ్ళాక రెండోకొసని మిషన్‌లోని మరొక చక్రానికి కట్టి వడిదిరిగిన పురి పొడుగులో మధ్యభాగంలో పట్టుకుంటాడు. అవి రెండూ కలిపి మెలిదిరిగి తాడవుతుంది.

కొబ్బరిపీచుతో పేనే తాళ్ళలో ముఖ్యమైనవి మంచం నులక, పలుపు, సిగమోర, ఉట్టి, కావడి ఉట్టి, మోకు మొదలైనవి.

ఇక కొబ్బరిపీచుతో కాళ్ళు తుడుచుకోడానికి గుమ్మాలముందు వేసే గోదినీలు చేసే విధానం: గోదినీలు చేసే చట్రానికి (అడుగు వెడల్పు, అడుగున్నర పొడుగూ దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది) పాతిక నిలువు పోచలూ 12 అడ్డంపోచలూ వేస్తారు. నిలువుపోచలకు ఒకదాన్ని విడిచి ఒకటి కాయలు పెడతారు. అడ్డంపోచలు మారుస్తారు. దాన్ని ఇనపబిళ్ళతో దిగ్గొడతారు. అలాగే ఇంతకుముందు విడిచిన పోచలకు మళ్ళీ కాయలు ముడేస్తారు. అల్లింతరవాత అంచుచుట్టూ తాడుతో జెడ అల్లుతారు. కత్తెరతో బయటికి కనిపించే పోచల్ని కత్తిరిస్తారు. బ్రష్షుతో దువ్వుతారు. పొట్టు రాలిపోతుంది. తరవాత వివిధ రకాలైన డజైన్లున్న (ఉదా॥ welcome మొ॥) రేకులతో రంగులద్దుతారు.

పీచుపని చేయడం కులవృత్తిగాగల కులమేదీ లేదు. అయితే చేపలు పట్టడం వృత్తిగాగల జాలరి, వాడ బలిజ మొదలైన కులాల ఆడవాళ్ళు ఈ పని ఎక్కువగా చేస్తున్నారు. ఈ పనికూడా ఎక్కువగా సాగరతీరాంధ్రంలోనే ఉంది.

## పేము పని

ఈ పదకోశంలోవచ్చే మరొక ప్రధానమైన పని పేముతో కుర్చీలు, టేబుళ్ళు మొ॥వాటి అల్లకానికి సంబంధించినవి. ఈ పనిలో ఎక్కువగా హిందీ, ఇంగ్లీషు పదాలే వాడుకలో ఉన్నాయి. తెలుగుపదాలు చాలా తక్కువ.

పేము సముద్రతీరాలవెంటా, అడవుల్లోనూ పెరుగుతుంది. నేలమీద పాకుతుంది. చెట్లకు అల్లుకుంటుంది. వెదురుబొంగుమాదిరిగా కణుపులు కణుపులుగా ఉంటుంది. కణుపు కణుపుకూ ముల్లూ, చెరుకుగడకుమాదిరిగా చుట్టూ ఆకులపొరా ఉంటాయి. తగలబెడితే ముల్లు పూర్తిగానూ ఆకుపొర కొంతవరకూ కాలిపోయి పేముబెత్తం మిగులుతుంది. దాన్ని కోసి, నరికి ఆకును చెలిగి వందపేముల్ని ఒక కట్టగాకట్టితెస్తారు. ఒక్కొక్కటి సుమారు 10 గజాల పొడు

గుంటుంది. సైజునుబట్టీ, నాణ్యాన్నిబట్టీ, దొరికే ప్రాంతాన్నిబట్టీ దీంట్లో రకాలున్నాయి. (ఉదా॥ బిర్సుపేము, నాటుపేము, జావాపేము, లావుపేము, సన్నపేము మొ॥వి.) లావుపేము ($\frac{1}{2}$ నుంచి 3 అంగుళాలవరకు మందముంటుంది) కుర్చీ మొదలగు వస్తువుల ఫ్రేమ్ తయారుచేయటానికీ, సన్నపేము ($\frac{1}{8}$ నుంచి $\frac{1}{4}$ అంగుళంవరకు మందముంటుంది.) ఉన్నదున్నట్లుగానూ పేడుగాచీల్చి బుట్టలూ, బొగ్గుతట్టలూ, కుర్చీసీటు మొ॥ అల్లటానికీ పనికొస్తుంది. ఆంధ్రప్రదేశ్‌కు, అస్సాం, గోవా, సింగపూర్, కలకత్తా, మైసూరు మొ॥ ప్రాంతాలనుంచి పేము దిగుమతి అవుతుంది. మన రాష్ట్రంలో నెల్లూరుజిల్లా సూళ్ళూరుపేట తాలూకాలోనూ, పాకాల చెరువుకిందా, రాజమండ్రిదగ్గరా సన్నపేము దొరుకుతుంది. ఇటీవలికాలంనుంచి మన రాష్ట్రంలో (నంద్యాల మొ॥చోట్ల) పేముమొక్కల పెంపకంకూడా చేస్తున్నారు. మనకు దిగుమతి అయ్యే పేములో సింగపూరుపేము నాణ్యమైనది.

కత్తితో (రేకత్తి, మొద్దుకత్తి) కణుపుచెక్కి పొడుగ్గా ఐదుభాగాలుగా చీలుస్తారు. దీన్ని బద్ద అంటారు. ఈ బద్దను పేడుగా (తీగ) చేయటానికుపయోగించే సాధనం గూటంపెట్టె, ఒక కొయ్యదిమ్మకు మూడుజతల కత్తుల్ని (బాకులవంటివి) నాటతారు. ఈ కత్తులజతలో ఒకదాన్ని నిలువుకత్తి అనీ (ఇది నిటారుగా నిలబడిఉంటుంది.) ఒకదాన్ని పడకత్తి అనీ (కొంచెం ఏటవాలుగా నిలువుకత్తి పదునుకు దగ్గరగావచ్చేట్లు నాటిన కత్తి) అంటారు. ఒక్కొక్క కత్తుల జత మధ్యఉండే సందుల్లో తేడా ఉంటుంది. బద్దను ఒక కత్తులజతమధ్యనుంచి లాగితే ఇంకొంత బెండుపోతుంది. ఇంకోదానిలోంచి లాగితే ఇంకొంతబెండు పోతుంది. చివరిదాన్లోంచి లాగితే మొత్తంబెండుపోయి గట్టి తీగమాత్రం మిగులుతుంది. దీన్ని పేడు అంటారు. ఇలా లాగటాన్ని తీగలాగడం అంటారు. (పేడు మెత్తగా రావటంకోసం పేమును రెండురోజులు నానేస్తారు.) ఈ పేడు కుర్చీ మొ॥వి అల్లడానికీ, అతుకులమీంచి కట్టుకట్టడానికీ పనికొస్తుంది.

వస్తువులకు కావలసిన సైజుల్లో పేములనుకోసి వంచుకుంటారు. దీన్ని బెండింగ్ అంటారు. దీనికి కావలసిన సాధనాలు మూడు స్టౌ (బ్లో లాంప్), రంపం, భూమ్మీదపాతిన రెండు ఇనపచువ్వలు. వీటిని కమ్ములు లేదా రాడ్లు అంటారు. కొన్నిచోట్ల వంపేమొద్దును ఉపయోగిస్తారు. పేముకు స్టౌ సెగచూపి ఇనపచువ్వలమధ్య ఉంచి కావలసిన ఆకారంలో వంచుకుంటారు.

బైండింగ్‌చేసిన పేముబెత్తాల్ని కావలసినవస్తువుల ఆకారంలో మేకులుకొట్టి బిగిస్తారు. అతుకులున్నచోటా కుర్చీ మొ॥వాటి కాళ్ళచుట్టూ తీగతోచుడతారు. వస్తువులకు కావలసినచోట నిలువుగా పేళ్ళు(తీగ)వేసి అడ్డంగా ఒక పేడునువిడిచి ఒక పేడుమీంచి చుట్టుకొస్తారు. అల్లినతరవాత బెత్తంచుట్టూ స్టౌసెగ చూపిస్తూ ఎమిరీపేపరు (ఉప్పు కాగితం)తో రుద్దుతారు. ఇలాచేయటాన్ని 'పేపరుకొట్టడం' అంటారు. (పేపరుకొట్టి బెత్తం పైపొరను తియ్యకపోయినట్లయితే పెయింటింగ్ తొందరగా రాలిపోతుంది) పేపర్‌కొట్టి బ్రష్‌తో మొదట వైట్‌ప్రైమర్‌వేసి ఒకరోజు ఆరనిస్తారు. ఆరిన తరవాత రెండోపూతకు అవసరమున్న రంగు వేస్తారు. ఎక్కువభాగం బిస్కట్‌కలర్‌వేస్తారు. ఈ పద్ధతిలోచేసే వస్తువులు రౌండ్ టీపాయ్, సిలోన్ కుర్చీ, టేబుల్, రింగారంకుర్చీ, ఉయ్యాలతొట్టీ, సోఫా, స్టాండుయ్యాల, బాస్కెట్, బీరువా పార్టిషన్‌జాలీ, స్టూల్, ఉయ్యాల, మంచం మొదలైనవి.

కొంచెం భిన్నమైన పద్ధతిలో నెల్లూరు మొదలయిన ప్రాంతాల్లో ఎరకలి మొ॥ వాళ్ళు సన్నని పేముపుల్లల తోనూ తీగ (పేదు)తోనూ వెదురుగంప, బుట్ట మొ॥ వాటి మాదిరిగా ''పేముగంప. చేతిబుట్ట, మొ॥న వస్తువులు అల్లుతారు.

పేముపని ప్రత్యేకంగా కులవృత్తిగా లేదు.

చీపుళ్లు కట్టటం : ఈ పదకోశంలో వచ్చే మరొకపని చీపుళ్ళు (పొరకలు) కట్టే పని. వెంపలిమొక్కలు, కందిమండలు, ఈతకమ్మ (ఈతమట్ట) చివర్లు, తాటిపాటలు, నునిగడ్డి, మొ॥ వాటితో కట్టిన పొడవాటి చీపురు ఇల్లూ వాకిలీ ఊడ్చుకోటానికీ, కందిమండలు, వెంపలి మొ॥వాటితో కట్టిన చీపురు కళ్ళమూ, వాకిలీ, పశువుల దొడ్లూ ఊడ్చుకో టానికీ; కామంచి పుల్లలతో కట్టిన చీపురు కళ్ళం ఊడ్చుకోటానికీ పనికొస్తాయి.

చేలల్లోనూ, బీళ్ళల్లోనూ కుంటలవెంటా సుమారు మూరెడెత్తు పెరిగే వెంపలి మొక్కల్ని కోసుకొని మోపు గట్టి ఇంటికిదెచ్చి రెండురోజులు మాగబెడతారు. తరవాత ఎండేసి ఆకు దులుపుతారు. పంగలన్నీ ఒకవైపూ మొదళ్ళన్నీ ఒకవైపూ పెట్టి జనపతాడుతో పిడికిలి కట్టువేసి పక్క కట్టువేసి బండకిందా అణగబెడతారు.

గుంటలవెంటా బీళ్ళలోనూ సుమారు గజమెత్తు పెరిగే నునుగడ్డినీ, మొదెంగడ్డినీ కోసుకొచ్చి ఎండేస్తారు. ఎండినతరవాత గంటలుగా పెరిగినవాటిని గనె దగ్గర రిక్కేసి మొదళ్ళు ఒకవేపూ చివర్లు ఒకవేపూ పెట్టి పిడిదగ్గర తాడుతో కట్టు కడతారు.

తాటిచెట్టుమీంచి తాటిపాటలను తెంపి ఎండేసి నానబెట్టి పాటను రెండుపచ్చెలుగా చీరతారు. తాటినారతో పురి బెడతారు. రెండుబెత్తల పొడవు పురిని వదిలి అక్కణ్ణించి ఒక్కొక్క పాటను పెట్టుకుంటూ పోయి సరిపోను మందమూ వెడల్పూ పూర్తయిన తరవాత పిడిచుట్టూ గాజులు వేస్తారు. గాజులు వేయగా మిగిలిన పురిని పిడిలోపట్నించి తీసి మొదట వదిలిన రెండుబెత్తల పురినీ దాన్ని కలిపి జెడలల్లుతారు. చీపురు వెడల్పు భాగంవేపు మూడు పాయలుగా విడదీసి కట్టు కడతారు.

ఈతపొరక : చెట్టుమీంచి ఈతమట్టల్ని కోసుకొచ్చి రెండు పచ్చెలుగా చీలుస్తారు. కత్తెతో కొడుతూ చీల్చిన మట్టకున్న ముల్లు విరగ్గొడతారు. మట్టమొదళ్ళు విరిచేసి చివళ్ళను మాత్రమే ఈతనార పురికి పెట్టుకుంటూ పురిని గుండ్రంగానూ, ఏటవాలుగానూ చుట్టుకుంటూ పూర్తయినతరవాత పిడిచుట్టూ గాజులు వేసి వెడల్పుభాగం వేపు కట్టు కడతారు.

కందిమండల పొరక : ఎండిన కందిమండల్ని గానీ పచ్చి కందిమండల్ని గానీ తెచ్చి మొదళ్ళన్నీ ఒకవేపు, పంగలన్నీ మరోవేపు ఒకదాని మీద ఒకటి పరిచి మొదళ్ళచుట్టూ తాడుతో కట్టు కడతారు. పంగలవేపు పాయలుగా విడదీసి కట్టు కడతారు.

కామంచి పుల్లల పొరక : గట్లమీదా బీళ్ళలోనూ పెరిగే కామంచిగడ్డిని కోసుకొచ్చి పుల్లలు తీసి వరసగా మడతపెట్టి తాడుతో కడతారు.

## తాటి ఈనెలతోను, రేకులతోను బుట్టలు అల్లటం

వెదురుపేళ్ళతో బాటు తాటి ఈనెలతోను, రేకులతోను చిన్నచిన్న బుట్టలు అల్లుతారు.

మేదరివాళ్ళు మూలలు మలిపి సారెపెట్టె, దాగర, మచ్చిక మొ॥వి అల్లే విధంగా తాటిరేకులతో మాలలూ మొ॥వాళ్ళు బుట్టలు అల్లుతారు. వీళ్ళు తాటిరేకుల్నించి చీల్చివేసిన ఈ నెలతో ఎరకలి మొ॥వాళ్ళు బుట్టలు మొ॥నవి అల్లుతారు.

కుండలో రెండు గంటలపాటు రంగును ఉడకనిచ్చి తాటి ఈనెల్ని అందులో ముంచి రంగు పట్టిస్తారు. మేదరివాళ్ళు నిలువుకర్రతో బుట్టలల్లినట్లుగానే అడికాలు (నిలువు) పెట్టి అల్లకం ఈనె చుట్టుకొచ్చి నిలువుల్ని మలిపి అంచు కడతారు. ఈనెలతో పూలసజ్జ, బ్యాగ్, వేస్టుపేపర్ బుట్ట మొ॥వి అల్లుతారు.

నార తీయటం, తాళ్ళు పేనటం, మంచానికి నుల్లక అల్లటం : ఈ వృత్తిపద కోశంలో వచ్చే మరికొన్ని పనులు నార తీయటం, తాళ్ళు పేనటం, మంచానికి నులకల్లటం, కలబందమట్ట (గాజంగి మట్ట), గోగు మొక్క, జనప మొక్క, తాటిమట్ట, ఈతమట్ట (—తమ్మ, —మండ) మొ॥ వాటినుంచి తాళ్ళు పేనటం కోసం నార తీస్తారు.

గోగునార, జనపదార : కాపుకాసిన గోగు మొక్కల్ని, జనప మొక్కల్ని కోసి ఎండబెట్టి కట్టలు గట్టి గింజలు రాలగొట్టి (గోగు గింజల్ని దూసేస్తారు) ఏ కట్ట కా కట్టను నీళ్ళలో ఊరేసి కట్టలమీద రాళ్ళెత్తుతారు. గోగు కట్టల్నయితే పదిహేను రోజులూ, జనుము కట్టల్నయితే అయిదురోజులూ ఊరేస్తారు. ఇలా ఊరేయటంవల్ల కట్టె చుట్టూ ఉండే పొర కట్టెనుంచి సులభంగా విడదీయటానికి వీలుగా కుళ్ళి మెత్తగా అవుతుంది. నీళ్ళలోంచి బయటికి తీసి గోగుకట్టనుంచి అయితే అప్పుడే నార చీరి బండకేసి ఉతికి నీళ్ళలో జాడించి ఎండేస్తారు. జనపకట్టెమీద నీళ్ళు చల్లుకుంటూ దాన్నించి నార తీసి ఎండేస్తారు. తరవాత పిళ్ళు కట్టి మోపులు కట్టి ఉంచుకుంటారు. నీళ్ళలో తడిపే తాళ్ళు తప్ప అన్నీ పేన్తారు.

కలబంద నార : కలబంద గుమ్మినుంచి కలబంద మట్టను కొడవలితో కోసుకొచ్చి గర్లు దిద్దుతారు. (చూ. గర్లు దిద్దు). కొన, మొదలు జివిరి పట్టను కట్టెతో చితగ్గొట్టిగాని కొడవలితో పగలగొట్టి గాని, కట్టలు కట్టి 15 రోజులుపాటు నీళ్ళలో ఊరేస్తారు. బాగా కుళ్ళిన తరవాత తీసి బండకేసి ఉతికితే పొట్టంతా గుజ్జుగుజ్జుగా నలుగు నలుగుతుంది. కొన్నిచోట్ల ఊరినమట్టను బండమీద ఉంచి తుండుతో కొదతారు. నీళ్ళల్లో జాడిస్తే పొట్టంతా పోయి

నారపోచలు మిగులుతాయి. ఎండేసి పిళ్ళు కట్టి కట్టలు కడతారు. ఈ నారకు దురద పుట్టించే గుణం ఉండటంవల్ల మంచం నులక, పగ్గం తప్ప అన్ని తాళ్లూ పేన్తారు.

తాటి నార : తాటి చెట్టుమీంచి కొడవలితో తాటిమట్టల్ని కోసుకొచ్చి గర్లు తీస్తారు. మట్ట పైభాగం నుంచి బెత్తెడు భాగంనుంచి బెత్తెడు పొడవుగానూ, ఐదారాకుల మందంగానూ, చీలికలు వచ్చేట్టు కత్తితో ఒత్తుతారు. ఒక్కో చీలిక పట్టుకొని మట్టను కాలికింద తొక్కిపట్టి తడపలు చీరుతారు. పిర్రమట్టవేపు వచ్చిన ఉడుపభాగాన్ని మొగ రానికేసి కొడతారు. ఇలా కొట్టటంవల్ల ఆ భాగం తడప నలిగి మెత్తగా అవుతుంది. తడపల్ని ఎండబెట్టి మోపుల్ని గట్టి దాచుకుంటారు. అవసరమున్నప్పుడు మోపు విప్పి తడపల్ని తీసి గంటసేపు నానబెడతారు. తడపను చేత్తో సన్నని పోచలుగా చీరతారు.

ఈతనార : చెట్టుమీంచి మొగలకత్తితో ఈతమట్టల్ని కోసుకొచ్చి మట్టను ఎడంచేత్తో పట్టుకొని. కుడిచేత్తో కట్టెను పట్టుకొని, మట్టమీంచి జారకొడుతూ ముండ్లను విరగ్గొడతారు. ఇలా చేయటంవల్ల ఆకు చివర ఉండే ముల్లు విరిగిపోతుంది. నార చీల్చేప్పుడు గుచ్చుకోకుండా ఇలా చేస్తారు. మట్టని కొద్దిసేపు ఉల్లారేస్తారు. తరువాత మొదలు ఎదుర్రొమ్ముమ్మవేపు వచ్చేట్టు మట్టను చంకసందున పెట్టుకొని కత్తితో మొదటిభాగాన అంగుళం పొడుగూ ఆకు మందమూ చీలికలయేటట్లు ఒత్తుతారు. తరవాత మట్టను చేత్తో పొడుగ్గా రెండు భాగాలుగా చీరతారు. దీన్ని పచ్చె అంటారు. పచ్చె మొదటి భాగాన్ని కాలి బొటనవేలికింద అదిమిపట్టి ఒక్కొక్క చీలికను కుడిచేత్తో పట్టుకొని చీలుస్తూ ఎడమచేత్తో మట్టను పైకి ఎత్తుతూ చివరికంటా చీలుస్తారు. ఇలా చీరిన నారను ఎండబెట్టి పిళ్ళుకట్టి మోపులు కడతారు. అవసర మున్నప్పుడు తీసి పది ఇరవై నిమిషాలసేపు నానబెట్టి తాడు పేన్తారు. సాధారణంగా నీళ్ళలో తడిసే తాళ్ళను ఈతనార, తాటినారలతో పేన్తారు.

తాడు పేనటం రెండు మూడు రకాలుగా ఉంటుంది. రెండు నారపోచల మొదటి భాగాల్ని మెలిబెట్టి, మెలిబెట్టిన భాగాల్ని కాలిబొటన వేలికింద అదిమిపట్టి రెండు అరచేతులమధ్య ఆ రెండు నారపోచల పాయల్నే ఉంచుకొని చేతుల్లోనే ఏ పాయ కా పాయను వడిబెడుతూ రెండు పురుల్ని కలిపి పెనవేస్తూ పేనటం ఒక పద్ధతి. ఈ పద్ధతిని తాల్చటం అంటారు. ఈ పద్ధతిలో మంచం నులకవంటి సన్నటితాళ్ళను మాత్రమే పేన్తారు. ఇలా అన్ని నారలతోనూ పేన్తారు. ఎడంకాలి బొటనవేలికి ఐదారుపోచల మొదళ్ళను చుట్టి అయిపోయినకొద్దీ పోచల్ని పురి పెట్టుకొంటూ పురిని బొటనవేలినుంచి మోకాలికీ, మోకాలినుంచి బొటనవేలికీ చుడతారు. ఇలా చుట్టిన వరసల్ని 'కాండ్లు' గా లెక్క పెడతారు. అనుకున్న కొలత పూర్తయినతరవాత పురిని సగభాగం కట్టెపుల్లకు చుట్టుకొని మిగిలిన సగభాగం కొసను దూరంగా దేనికైనా కట్టె రెండింటినీ పెనవేస్తూ పేన్తారు. ఈ పద్ధతిని పురిబెట్టి తాడేయటం అంటారు. ఈ పద్ధతిలో చేంతాడు అసలుకట్టు, తొండంతాడు, పలుపు మొ॥వి పేన్తారు. సాధారణంగా ఈతనార తాటినారలతో మాత్రమే ఈ పద్ధతిలో పేన్తారు. ఈ రెండు పద్ధతులూ కాక మరో పద్ధతి ఉంది. ఈ పద్ధతిలో మొదటి రెండు పురులతో తాడు తాల్చి ఆ రెంటిమీంచి మూడోపురి (ముప్పురి) వేసి ఆ తాడు చివరను దేనికైనా కట్టి రెండో చివరను దూరంగా పట్టుకొని పురి

బెట్టి సగభాగం కట్టెకు చుట్టుకొని రెంటినీ పెనవేస్తూ కట్టెకు చుట్టిన పురిని మళ్ళీ పురిబెడుతూ పేస్తారు. దీన్ని ఇరుపురి తాడు అంటారు. ఈ తాడు చుట్టూ మళ్ళీ ఒక పురిని పెనవేస్తూ పేస్తారు. దీన్ని ముప్పురితాడు అంటారు. గోగునార కలబందనార, జనపనారలతో ఈ పద్ధతిలో పేస్తారు. బండిమోకు, పగ్గం మొ॥వి-ఈ పద్ధతిలో పేనడం జరుగుతుంది.

మంచానికి నులక అల్లటంలో తడకల్లకం, విసనగర్రల్లకం మొ॥న పద్ధతులున్నాయి. మంచానికి కాళ్ళవేపు ఉండే అడ్డంపట్టెకు మూరెడుదూరాన రెండు నిలువుపట్టెల్నికలుపుతూ దండెంతాడుకడతారు. కాళ్ళవేపు అల్లకం ఈ దండెంతాడువరకే ఉంటుంది. ఐమూలగా మొదటి ఆరుపోగులతో (నులకతాడు వరస) రాణిపట్టెవేసి అని మొత్తంఅల్లి మీదినుంచి మళ్ళీ రెండు అయిమూలగా 8 పోగులలో రాజుపట్టెవేసి అల్లుతారు. ఇలా అల్లేప్పుడు పోగులు జారి ఒక్క-దగ్గరికిపోకుండా గుర్రంతాడును ఉపయోగిస్తారు. అల్లకం పూర్తయినతరవాత దండెంతాడునుంచి కాళ్ళవేపు పట్టెకు వరసగాబిగించి తాళ్ళుకడతారు. దీన్ని కాళ్ళకట్ట అంటారు.

నారతీయటం, తాళ్ళుపేనటం మంచమల్లకం పల్లెటూళ్ళల్లో సాధారణంగా అందరూచేస్తారు. ఎరకలి, దాసరి మాల, మాదిగ మొ॥ కులాలవాళ్ళు ఎక్కు-వగాచేస్తారు.

దుసేరు తీగలతో ఎడ్లబుట్ట, సిబ్బి అల్లటం, తాడుపేనటం :

బుట్ట, సిబ్బి మొ॥నవి వెదురుపేడుతోగాక దుసేరు తీగలతోకూడా అల్లుతారు. అలాగే తాళ్ళు నారతోనేగాక దుసేరు తీగలతోకూడా పేస్తారు.

చేలలోనూ, బీళ్ళలోనూ, భూమ్మీదపాకే దుసేరుతీగలను పీక్కొ-చ్చి చుట్టచుట్టి చుట్టలతోనే ఎండబెట్టి దాచు కుంటారు. అవసరమున్నప్పుడు చుట్టలతోనే ఒకరాత్రల్లా (12 గంటలపాటు) నానేస్తారు. పిల్లపంగలుగిల్లి ఆకులు దూసేసి అల్లకానికనువుగా తయారుచేస్తారు. సిబ్బి, వెదురుపేడుతో అల్లినట్లుగానే అల్లుతారు. అయితే దుసేరుతీగల సిబ్బికి మధ్యన పట్టుకోటానికి వీలుగా తీగలతోపేనిన తాడుంటుంది. ఎడ్లబుట్ట మొ॥ బుట్లను ఆరుతీగలు పురిబెట్టి రెండు కడేలువేసి కింద ఒక కడెంమీద ఒక కడెం అమర్చి ఆ రెండుకడేలను కలిపి ఖానాలువచ్చేట్టు అల్లుతారు. తొట్టితాడు మొ॥ తాళ్ళను ఆరుతీగలతో పురిబెట్టి నారతో వేసినట్టుగానే తాడువేస్తారు. ఈ పనినిగూడా పల్లెటూళ్ళల్లో సాధారణంగా అందరూ తమ అవసరంకోసం చేసుకుంటారు.

సుంకిరెడ్డి నారాయణరెడ్డి

# పరిశోధకుల పర్యటన వివరాలు

| ప్రాంతం ఊరి సంఖ్య | పర్యటించిన ఊరు | తాలూకా | జిల్లా | పేరు | కులం | వయస్సు | ప్రధానవృత్తి | ఉపవృత్తి | చదువు | పర్యట పరిశోధకుని నామ సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 1. | సూళ్ళూరుపేట | సూళ్ళూరుపేట | నెల్లూరు | కుమ్మ బత్తయ్య | ఎరకలి | 30 | వెదురుబుట్టల అల్లకం | — | సంతకం వచ్చు | S N R |
| కో. 2. | వెంకటగిరి | వెంకటగిరి | ,, | కె. రమణయ్య | మేదరి (మహేంద్ర) | 50 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| కో. 3. | నెల్లూరు | నెల్లూరు | ,, | సూదేపల్లి శ్రీరాములు | ,, | 50 | ,, | వెదురు బుట్టలవ్యాపారం | ,, | ,, |
| | | | | కె. రాజు | — | 30 | పేముకుర్చీలు మొ॥వాటి అల్లకం | — | 7వ తరగతి | ,, |
| | | | | దేవరకొండ వెంకటయ్య | ఎరకలి | 35 | పేముబుట్టల అల్లకం | ఈతబుట్టల అల్లకం | సంతకం వచ్చు | ,, |
| | | | | నల్లగొండ నాగయ్య | ,, | 38 | ఈతబరుగు బుట్టలూ, తట్టలూ అల్లకం | — | అక్షరజ్ఞానం | ,, |
| | | | | నెల్లూరు రమణయ్య | మన్నెకాపు | 60 | తుంగచాపనేత | — | — | ,, |
| కో. 4. | కుళ్ళాయిపల్లి | ఉదయగిరి | ,, | పెనుగొండ రోశయ్య | దబ్బలెరకలి | 35 | వెదురుబుట్టలు మొ॥వాటి అల్లకం | మేకల పెంపకం | ,, | ,, |
| కో. 5. | ఒంగోలు | ఒంగోలు | ప్రకాశం | పెనగవరపు కోటయ్య | మేదరి | 50 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| | | | | పెనగవరపు శ్రీనివాసులు | ,, | 27 | ,, (అలంకారవస్తువుల తయారీ) | — | బి. కాం. | ,, |
| | కొత్తపట్నం | ,, | ,, | లాల్ | ముస్లిం | 45 | కొబ్బరిపీచుతో తాళ్ళుపేనడం | — | ఫస్ట్‌ఫారం | ,, |
| కో. 6. | కనిగిరి | కనిగిరి | ,, | వీరనర్సింలు | మేదరి | 60 | మేదరిపని | — | — | K N C |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 7. | మార్కాపురం | మార్కాపురం | ,, | కాకర్ల నెమిలయ్య | మేదరి | 27 | ,, | — | — | ,, |
| కో. 8. | వినుకొండ | వినుకొండ | గుంటూరు | సందా వెంకట్రావు | ,, | 40 | ,, | — | అక్షరజ్ఞానం | ,, |
| | అయినవోలు | ,, | ,, | యాకింగె నర్సయ్య | — | 70 | తుంగచాపనేత | కూలిపని | — | ,, |
| కో. 9. | మాచెర్ల | మాచెర్ల | ,, | పాతకోటి రంగనాయకులు | మేదరి | 43 | మేదరిపని | బుర్రకథలు రాయడం, చెప్పడం | 10వ తరగతి | ,, |
| కో. 10. | గుంటూరు | గుంటూరు | ,, | దూలిపాళ వెంకటేశ్వర్లు | ,, | 30 | ,, | — | — | ,, |
| | తెనాలి | తెనాలి | ,, | జోరీగ శేషయ్య | ,, | 40 | ,, | — | 8వ తరగతి | ,, |
| | | | | హరనాగరి బరమన్న | | 65 | పేముపని | — | 3వ తరగతి | ,, |
| కో. 11. | నందిగామ | నందిగామ | కృష్ణా | కనికరపు పేరయ్య | ,, | 60 | మేదరిపని | — | సంతకంవచ్చు | ,, |
| | | | | కొండా సాంబశివరావు | — | 23 | పేముతో కుర్చీలు అల్లడం | మేదరిపని | — | ,, |
| కో. 12. | విజయవాడ | విజయవాడ | ,, | సిరిగిరి గంగరాజు | మేదరి | 65 | మేదరిపని | — | సంతకంవచ్చు | ,, |
| | | | | జె. చిట్టిబాబు | నాయుడు | 40 | పేముపని (బైండింగ్ చేయడం) | | (అరవంలో అక్షరజ్ఞానం) | ,, |
| | | | | వైదిలింగ నాయకర్ | నాయకర్ | 40 | పేముపని | — | 8వ తరగతి (అరవంలో) | ,, |
| | | | | నాగినేని సుధాకర్ | మేదరి | 35 | ,, | — | అక్షరజ్ఞానం | ,, |
| | | | | సాత్పాడి రమణయ్య | ఎరకలి | 40 | తాటేకుతో, ఈనెలలో బుట్టలు అల్లడం | — | — | ,, |
| కో. 13. | మచిలీపట్నం | మచిలీపట్నం | కృష్ణా | బొమిడిచెర్ల వెంకటేశ్వర్లు | మేదరి | 50 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| కో. 14. | నూజివీడు | నూజివీడు | ,, | కోడె సూర్యప్రకాశరావు | ,, | 61 | ,, | — | ,, | ,, |
| కో. 15. | చింతలపూడి | చింతలపూడి | పశ్చిమ గోదావరి | సీదరాల వెంకటేశ్వరరావు | ,, | 35 | ,, | — | ,, | ,, |
| కో. 16. | ఏలూరు | ఏలూరు | ,, | కందికట్టు సీతయ్య | ,, | 50 | ,, | — | 8వ తరగతి | ,, |
| కో. 17. | భీమవరం | భీమవరం | ,, | జొరిగె భీమేశ్వరరావు | ,, | 52 | ,, | — | ఫస్టుఫారం | ,, |
| కో. 18. | పోలవరం | పోలవరం | ,, | జొరిగె నర్సింహమూర్తి | ,, | 47 | ,, | — | — | ,, |
| కో. 19. | రాజమండ్రి | రాజమండ్రి | తూర్పు గోదావరి | గ్రంధి డాంగే | ,, | 32 | ,, | — | బి.కాం. | ,, |

| | | | |
|---|---|---|---|
| | భీమునిపట్నం | భీమునిపట్నం | ,, |
| కో. 26. | విజయనగరం | విజయనగరం | విజయనగరం |
| | ద్వారపూడి | ,, | ,, |
| కో. 27. | సాలూరు | సాలూరు | ,, |
| | మామిడిపల్లి | ,, | ,, |
| కో. 28. | పార్వతీపురం | పార్వతీపురం | ,, |
| | పెదబొండపల్లి | ,, | ,, |
| కో. 29. | శ్రీకాకుళం | శ్రీకాకుళం | శ్రీకాకుళం |
| | మత్స్యవేశం (కళింగపట్నం) | ,, | ,, |
| కో. 30. | పాతపట్నం | పాతపట్నం | ,, |
| | సుందరాడ | ,, | ,, |
| | నౌతల | ,, | ,, |
| కో. 31. | సోంపేట | సోంపేట | ,, |
| తె. 1. | అలంపురం | అలంపురం | మహబూబ్‌నగర్ |
| | ఊట్కూరు | ,, | ,, |
| తె. 2. | గద్వాల | గద్వాల | ,, |
| తె. 3. | కొడంగల్లు | కొడంగల్లు | ,, |
| తె. 4. | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ | ,, |

| ప్రాంతం ఊరి సంఖ్య | పర్యటించిన ఊరు | తాలూకా | జిల్లా | పేరు | కులం | వయస్సు | ప్రధానవృత్తి | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నామ సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 19. | రాజమండ్రి | రాజమండ్రి | తూర్పు గోదావరి | రామచంద్రప్రభు సూర్యనారాయణ | — | 35 | పేముపని | — | — | ,, |
| | | | | రాచెర్ల వీర్రాజు | — | 52 | ,, | — | సెకండ్ఫారం | ,, |
| కో. 20. | అమలాపురం | అమలాపురం | ,, | గ్రంధి అప్పారావు | మేదరి | 50 | మేదరిపని | — | — | ,, |
| | పాశర్లపూడిలంక | రాజోలు | ,, | అడ్డాల బుచ్చెయ్య | తెలగ | 50 | కొబ్బరిపీచుతో అల్లకంపని | — | అక్షరజ్ఞానం | ,, |
| కో. 21. | యానాం | | | గ్రంధి అప్పన్న | మేదరి | 60 | మేదరిపని | — | — | ,, |
| | మేకలగురువు | కాకినాడ | తూర్పు గోదావరి | వాసంచెట్టు పార్వతి | సెట్టిబలిజె | 35 | కూలిపని | చాపనేత | — | ,, |
| | తాళ్ళరేవు | ,, | ,, | వాతాట సావిత్రి | అగ్నికుల క్షత్రియ | 30 | ,, | కొబ్బరిపీచుతో తాళ్ళుపేనడం | — | ,, |
| కో. 22. | అడ్డగీతల | ఎల్లవరం | ,, | రొట్ట సూకరాజు | మేదరి | 40 | మేదరిపని | — | SSLC | SNR |
| | దొరమామిడి | ,, | ,, | పెద్దోజి లక్ష్మణరావు | మన్నెంకాపు | 25 | వ్యవసాయం | వెదురుకర్రలు కొట్టి అమ్మడం | — | ,, |
| కో. 23. | నర్సీపట్నం | నర్సీపట్నం | విశాఖపట్నం | రొట్ట బాపనయ్య | మేదరి | 45 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| | దౌనూరు | ,, | ,, | దాసం పోతురాజు | గదబ | 40 | వ్యవసాయం | వెదురుకర్రలు కొట్టి అమ్మడం | — | ,, |
| | బుచ్చెంపేట | ,, | ,, | పోలవరపు మాలక్ష్మి | సెట్టిబలిజె | 25 | తాటిచాపలూ, చేదలూ అల్లడం | కూలిపని | — | ,, |
| | ఎండవల్లి | ,, | ,, | గడమాల మాలక్ష్మి | హరిజన | 40 | కొబ్బరితాళ్ళు పేనడం | ,, | — | ,, |
| కో. 24. | మినిములూరు | పాడేరు | ,, | వంతల పోతురాజు | గదబ | 40 | మేదరిపని | ,, | — | ,, |
| కో. 25. | విశాఖపట్నం | విశాఖపట్నం | ,, | పిల్లి రాములు | మేదరి | 45 | మేదరిపని | — | — | ,, |
| | అనకాపల్లి | అనకాపల్లి | ,, | దాసరి వెంటారావు | ఎరకలి | 29 | తట్టలూ బుట్టలూ అల్లడం | — | 6వ తరగతి | ,, |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | భీమునిపట్నం | భీమునిపట్నం | ,, | చింతపల్లి ఎల్లయ్య | జాలరి | 35 | చేపలుపట్టడం | కొబ్బరితాళ్ల పేనడం | — | ,, |
| కో. 26. | విజయనగరం | విజయనగరం | విజయనగరం | నర్రు పైడయ్య | మేదరి | 50 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| | ద్వారపూడి | ,, | ,, | ముద్సుం రాములప్పడు | సెట్టిబలిజె (గౌండ్ల) | 30 | కల్లుగీయటం | తాటిచాపల అల్లకం | — | ,, |
| కో. 27. | సాలూరు | సాలూరు | ,, | పిల్లి రామారావు | మేదరి | 35 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| | మామిడిపల్లి | ,, | ,, | నిమ్మకి రాజయ్య | జాతాపి దొరలు | 40 | వ్యవసాయం | వెదుళ్లుకొట్టి అమ్మడం | — | ,, |
| | | | | గ్రంధి రామస్వామి | మేదరి | 35 | గిరిజనులకు మేదరిపని నేర్పడం | మేదరిపని | S S L. C. | ,, ,, |
| కో. 28. | పార్వతీపురం | పార్వతీపురం | ,, | పిల్లి సంగమేసు | ,, | 50 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| | | | | సుబ్బారావు నరహరి | గౌడగలి (ఒడ్డెమేదరి ఒరియామేదరి) | 40 | ,, | — | ఒరియా అక్షరజ్ఞానం | ,, |
| | పెదబొండపల్లి | ,, | ,, | దాసరి పైడితల్లి | ఎరకలి | 25 | వెదురుబుట్టలూ తట్టలూ అల్లడం | — | — | |
| కో. 29. | శ్రీకాకుళం | శ్రీకాకుళం | శ్రీకాకుళం | యాదం చిన్నఅప్పలస్వామి | మేదలి | 45 | మేదరిపని | — | — | ,, |
| | మత్స్యవేశం (కళింగపట్నం) | ,, | ,, | కొంచెపు నందెమ్మ | వాడబలజె | 40 | కొబ్బరితాళ్ళు పేనడం | కూలిపని | — | ,, |
| కో. 30. | పాతపట్నం | పాతపట్నం | ,, | సరాడి దండాశి | మాల | 40 | పాయకారి(భూమిని కౌలుకు చెయ్యడం) | తుంగచాప నేత | — | ,, |
| | సుందరాడ | ,, | ,, | సాపంగి దాలయ్య | ,, | 40 | కూలిపని | కొబ్బరితాళ్ళు పేనడం | — | ,, |
| | నౌతల | ,, | ,, | బైరి లచ్చయ్య | మేదరి | 40 | మేదరిపని | — | సంతకంపచ్చు | ,, |
| కో. 31. | సోంపేట | సోంపేట | ,, | తెల్లి మల్లేశ్వరరావు | ,, | 30 | ,, | — | — | ,, |
| తె. 1. | అలంపురం | అలంపురం | మహబూబ్‌నగర్ | తుమ్మలగోతం పుల్లన్న | ,, | 40 | ,, | — | — | KNC |
| | ఊటూకూరు | ,, | ,, | ఒనేటి నడిపిసుంకన్న | ,, | 50 | ,, | — | — | ,, |
| తె. 2. | గద్వాల | గద్వాల | ,, | సుర్సుర్ సోమన్న | ,, | 40 | ,, | — | — | ,, |
| తె. 3. | కొడంగల్లు | కొడంగల్లు | ,, | మేదరి అంజిలమ్మ | ,, | 50 | ,, | వ్యవసాయం | — | ,, |
| తె. 4. | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ | ,, | దుర్గసాయిలు | ,, | 40 | ,, | — | — | ,, |

| ప్రాంతం ఊరి సంఖ్య | పర్యటించిన ఊరు | తాలూకా | జిల్లా | పేరు | కులం | వయస్సు | ప్రధానవృత్తి | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని-నామ సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మహబూబ్ నగర్ | మహబూబ్ నగర్ | మహబూబ్ నగర్ | మేదరి నాగన్న | ,, | 22 | ,, | — | సంతకంవచ్చు | ,, |
| | వేపూరు | ,, | ,, | మేదరి బాలకిష్టయ్య | ,, | 40 | ,, | — | — | ,, |
| తె. 5. | అచ్చెంపేట | అచ్చెంపేట | ,, | గుడిపెల్లి ఎల్లయ్య | ,, | 50 | ,, | — | — | ,, |
| తె. 6. | దేవరకొండ | దేవరకొండ | నల్లగొండ | పాతకోట రామయ్య | ,, | 72 | ,, | — | — | S N R |
| తె. 7. | హుజూర్ నగర్ | హుజూర్ నగర్ | ,, | జోరీగల రాజయ్య | ,, | 60 | ,, | వెదురు బొంగుల వ్యాపారం | అక్షరజ్ఞానం | ,, |
| | | | | కుమ్మం పెదకోటయ్య | ఎరకలి | 70 | ఎరకలిపని | — | — | ,, |
| తె. 8. | సూర్యాపేట | సూర్యాపేట | ,, | కలూరి శ్రీరాములు | మేదరి | 51 | మేదరిపని | — | 4 వ తరగతి | ,, |
| తె. 9. | నల్లగొండ | నల్లగొండ | ,, | నోముల శీనయ్య | ,, | 55 | వెదుళ్ళ వ్యాపారం | — | అక్షరజ్ఞానం | ,, |
| | మంచివీళ్ళ బావిగుండెం | ,, | ,, | చిదేడి కృష్ణారెడ్డి | రెడ్డి | 30 | వ్యవసాయం | పొరకలు కట్టడం | ఇంటర్మీడియట్ | ,, |
| | గడ్డంవారి ఎడవల్లి | ,, | ,, | మానిపాటి ఎల్లమ్మ | ఎరకలి | 30 | ఎరకలిపని | — | — | ,, |
| | వగిడిమర్రి | ,, | ,, | కొయిగూర అంజిరెడ్డి | రెడ్డి | 30 | వ్యవసాయం | నార తియ్యడం తాళ్లుపేనడం | 9 వ తరగతి | ,, |
| తె. 10. | భువనగిరి | భువనగిరి | ,, | ఎల్మల మల్లయ్య | మేదరి | 35 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| తె. 11. | కొత్తూరు | షాద్ నగర్ | మహబూబ్ నగర్ | ఎరకలి సాయన్న | ఎరకలి | 60 | ఎరకలిపని | వ్యవసాయం | — | K N C |
| తె. 12. | తాండూరు | తాండూరు | రంగారెడ్డి | సిన్నబసయ్య | మేదరి | 35 | మేదరిపని | — | — | ,, |
| తె. 13. | చేవెళ్ళ | చేవెళ్ళ | ,, | మేదరి మల్లయ్య | మేదరి | 65 | ,, | కూలిపని | — | SNR |
| | పూరెల్ల | ,, | ,, | ఎరకలి దశరథ | ఎరకలి | 40 | ఎరకలిపని | పందుల పెంపకం | — | ,, |
| తె. 14. | రామ్ నగర్ | హైదరాబాదు | హైదరాబాదు | ధర్మరెడ్డిపల్లె సామి | మేదరి | 65 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | KNC |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | (హైదరాబాదు) | | | | | | | | | |
| | | | | చంద్రమ్మ | ,, | 30 | ,, | — | — | ,, |
| | అంబర్‌పేట (హైదరాబాదు) | ,, | ,, | దేవరాజు మైసయ్య | ఎరకలి | 45 | ఎరకలిపని | — | — | SNR |
| | | | | కూరాకుల కిష్టయ్య | ,, | 35 | ,, | — | — | ,, |
| | | | | ఎ. సత్యనారాయణ | ,, | 19 | ,, | — | — | ,, |
| | చాదర్‌ఘాట్ (హైదరాబాదు) | ,, | ,, | అనుమడు ఎల్లయ్య | ,, | 20 | ,, | — | 5వ తరగతి | ,, |
| | గొలిగూడా (హైదరాబాదు) | ,, | ,, | నల్లగొండ బాలప్ప | ,, | 35 | ,, | — | — | ,, |
| తె. 15. | అంగడిపేట | సంగారెడ్డి | మెదక్ | బొమ్మిడి సాయన్న | మేదరి | 55 | మేదరిపని | వ్యవసాయం | — | ,, |
| తె. 16. | కోహిర్ | జహీరాబాదు | ,, | మేదరి భీమయ్య | ,, | 55 | ,, | — | — | ,, |
| | జహీరాబాదు | ,, | ,, | ఎరకలి రాములు | ఎరకలి | 50 | ఎరకలిపని | కూలిపని | — | ,, |
| తె. 17. | మెదక్ | మెదక్ | మెదక్ | నందికంటి రామకృష్ణయ్య | మేదరి | 40 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| తె. 18. | సిద్దిపేట | సిద్దిపేట | ,, | కోనం శంకరయ్య | ,, | 45 | ,, | — | ,, | ,, |
| తె. 19. | కామారెడ్డి | కామారెడ్డి | నిజామాబాదు | పిల్లి లచ్చయ్య | ,, | 55 | ,, | — | — | ,, |
| | రంగంపేట | ,, | ,, | శిల్తారి పాపయ్య | శారదగాళ్ళు | 40 | కూలి | ఈతచాపల అల్లకం | — | ,, |
| తె. 20. | నిజామాబాదు | నిజామాబాదు | ,, | దర్శనం చినమల్లయ్య | మేదరి | 60 | మేదరిపని | — | అక్షరజ్ఞానం | ,, |
| | | | | రావొల్లు మల్లయ్య | ఎరకలి | 45 | ఎరకలిపని | ఇసకఅమ్మకం | — | ,, |
| తె. 21. | నిర్మల్ | నిర్మల్ | ఆదిలాబాదు | మదిరె పెద్దమ్మ | మేదరి | 60 | మేదరిపని | — | — | ,, |
| | సారంగపురక | ,, | ,, | కద్మంచి శివరాం | శారదగాళ్ళు | 70 | కథలుచెప్పడం | ఈతచాపల అల్లకం | — | ,, |
| | లక్ష్మీపురం | ,, | ,, | బస్సపెల్లి అడెల్లు | మాల | 60 | స్వీపర్ ఉద్యోగం | చీపుళ్ళు కట్టడం | — | ,, |
| తె. 22. | ఆదిలాబాదు | ఆదిలాబాదు | ,, | పిల్లి అడొల్లు | మేదరి | 45 | మేదరిపని | — | — | ,, |
| | ఉట్నూరు | ఉట్నూరు | ,, | వేముల బాలయ్య | ,, | 45 | ,, | — | — | ,, |
| | | | | కె. రాజన్న | ,, | 35 | మేముపని నేర్పడం (ఉద్యోగం) | — | 10వ తరగతి | ,, |

| ప్రాంతం ఊరి సంఖ్య | పర్యటించిన ఊరు | తాలూకా పేరు | జిల్లా | పేరు | కులం | వయస్సు | ప్రధానవృత్తి | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నామ సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఇంద్రపెల్లి | ,, | ,, | శివరాత్రి కోటయ్య | మున్రాసు | 55 | పందుల పెంపకం, నాటుమందుల తయారీ | ఈతచాపల అల్లకం | — | ,, |
| తె. 23. | జెన్నారం | లక్సెట్టిపేట | ,, | ఎం. వి. రాజన్న | మేదరి | 50 | నెమళ్ళవ్యాపారం | — | 5వ తరగతి | ,, |
| | అంకుశాపురం | అసీఫాబాదు | ,, | సులువ భీమయ్య | ,, | 30 | మేదరిపని | — | ,, | ,, |
| తె. 24. | జగిత్యాల | జగిత్యాల | కరీంనగర్ | వేముల చిన్ననర్సయ్య | మేదరి | 48 | మేదరిపని | — | — | ,, |
| తె. 25. | వేములవాడ | వేములవాడ | ,, | కనికరపు రాములు | ,, | 50 | ,, | వ్యవసాయం | — | ,, |
| తె. 26. | వరంగల్లు | వరంగల్లు | వరంగల్లు | ప్రతాపగిరి చిన్నరామయ్య | ,, | 55 | ,, | కలపవ్యాపారం | — | KNC |
| | | | | ప్రతాపగిరి గట్టయ్య | ,, | 50 | ఫారెస్ట్ కాంట్రాక్టర్ | — | HSC | ,, |
| | వంగపాడు | ,, | ,, | మునుకు భిక్షపతి | — | 35 | ఈతచాపల అల్లకం | పందుల పెంపకం | — | ,, |
| తె. 27. | మానుకోట | మహబూబాబాదు | ,, | గుల్ల అగయ్య | మేదరి | — | మేదరిపని | — | — | ,, |
| తె. 28. | చెల్వాయి | ములుగు | ,, | దీకొండ ఉప్పలయ్య | మేదరి | 48 | ,, | — | — | ,, |
| తె. 29. | జెల్ల | నూగూరు | ఖమ్మం | మొడెం సూరయ్య | కోయ ? | 50. | వ్యవసాయం | మేదరిపని | — | ,, |
| తె. 30. | గౌతాపూర్ | బూర్గంపాడు | ,, | కోడె రాములు | మేదరి | 45 | మేదరిపని | — | — | ,, |
| తె. 31. | ఖమ్మం | ఖమ్మం | ,, | చందా సత్యనారాయణ | ,, | 25 | ,, | — | 10వ తరగతి | ,, |
| రా. 1. | కృష్ణదాసనపల్లె | కుప్పం | చిత్తూరు | మేదరి మునుసామి | ,, | 50 | ,, | వ్యవసాయం | — | ,, |
| రా. 2. | మదనపల్లి | మదనపల్లి | ,, | నల్లింకి పెద్దప్ప | ,, | 60 | ,, | — | — | ,, |
| | రచవారిపల్లి (గారబురుజు) | ,, | ,, | పఠాన్ సన్నిభీ | ముస్లిం | 50 | తుంగచాపనేత | వ్యవసాయం | — | ,, |
| రా. 3. | తిరుపతి | తిరుపతి | ,, | రొడ్డ రామయ్య | ఎరకలి | 35 | మేదరిపని | — | — | ,, |
| | కొటాల | ,, | ,, | పట్టుమరుపు దేశయ్య | చేటలవాళ్ళు (మాదిగ) | 65 | చేటలల్లకం | — | — | ,, |
| రా. 4. | రాజంపేట | రాజంపేట | కడప | టంగుటూరు బాలయ్య | మేదరి | 65 | మేదరిపని | — | — | ,, |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కోనగి | రిపల్లె | ,, | ,, | తిరుపతి వెంకటయ్య | ఎరకలి | 30 | ,, | — | — | ,, |
| | నారాయణ | ,, | ,, | వేలూరు సుబ్బారాయుడు | — | 55 | తుంగచాపల నేత | వ్యవసాయం | — | ,, |
| | నెల్లూరు కోసూరు | ,, | ,, | బసినేని చెన్నయ్య | ఉప్పెరకలి | 42 | నులకపేనడం | — | — | ,, |
| రా. 5. | పులివెందల | పులివెందల | ,, | టంగుటూరి సంజీవరాయుడు | మేదరి | 50 | మేదరిపని | — | — | ,, |
| | ,, | ,, | ,, | కావేటి ఎరకలి కొండప్ప | ఎరకలి | 55 | నులకపేనడం | వ్యవసాయం | — | ,, |
| రా. 6. | హిందూపురం | హిందూపురం | అనంతపురం | దేవమ్మ | మేదరి | 35 | మేదరిపని | — | — | S N R |
| | హొన్నంపల్లి | ,, | ,, | దాసరి నారాయణప్ప | మాల | 30 | తుంగచాపల నేత | — | 1 వ తరగతి | ,, |
| రా. 7. | రాయదుర్గం | రాయదుర్గం | ,, | మేదరి బర్మప్ప | మేదరి | 59 | మేదరిపని | — | 5 వ తరగతి | ,, |
| రా. 8. | అనంతపురం | అనంతపురం | ,, | తమ్మినేని నర్సిములు | ,, | 63 | ,, | — | 4 వ తరగతి | ,, |
| | | | | సాకె గంగన్న | ఎరకలి | 35 | ఎరకలిపని మేదరిపని | — | ఫస్టుఫారం | ,, |
| రా. 9. | పత్తికొండ | పత్తికొండ | కర్నూలు | తమ్మనాయిన రామన్న | మేదరి | 60 | మేదరిపని | — | 4వ తరగతి | ,, |
| | | | | తల్మారి శాంతమ్మ | జంగం | 40 | తుంగచాపలనేత | భిక్షాటన | — | ,, |
| | | | | కొత్తపేట నాగన్న | ఎరకలి | 35 | ఎరకలిపని | గొర్రెల పెంపకం | సంతకంవచ్చు | ,, |
| రా. 10. | నంద్యాల | నంద్యాల | ,, | టి. ఎం. రామయ్య | ,, | 35 | మేదరిపని | — | 5వ తరగతి | ,, |
| | గోరుకల్లు | ,, | ,, | టుపాకుల పెదనర్సిములు | తెలుగు బెస్త ముత్రాసు | 70 | తుంగచాపలనేత | చేపలు పట్టడం | — | ,, |
| రా. 11. | కర్నూలు | కర్నూలు | ,, | మాదాసు చంద్రయ్య | మేదరి | 36 | మేదరిపని | — | 6వ తరగతి | ,, |

SNR = సుంకిరెడ్డి నారాయణరెడ్డి — పర్యటన పరిశోధకుడు.

KNC = కె. నరసింహాచారి — పర్యటన పరిశోధకుడు

# ప్రధాన సంకేత వివరణ

ఇం. = ఇంగ్లీషు

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు)

ఏ. = ఏకవచనం

కో. = కోస్తాజిల్లా

క్రి. = క్రియాపదం

చూ. = చూడు

తె. = తెలంగాణా

పర్యా. = పర్యాయపదం

రా. = రాయలసీమ

రూ. = రూపాంతరం (రూపాంతరాలు)

వి. = విశేష్యం

విణ. = విశేషణం

సం. = సంస్కృతం

హిం. = హిందూస్తానీ

[ < > ] చారిత్రక నిష్పత్తి సూచనకు గుర్తు; మొన వైపున్న రూపం అర్వాచీనం (నిష్పన్నం) రెండోవైపున్నది ప్రాచీనం (మూలరూపం).




# పదసంగ్రాహకులు పర్యటించిన ఊళ్ళు

# మాండలిక వృత్తిపదకోశం - 10

## మేదర - సంబంధిత వృత్తులు

### అ

**అకండంతడక:** (< సం. అఖండం-) ఉ. -తడ్క-. పొడుగాటి తడక; బండిమీద వేసేటప్పుడు పెద్దగా ఒకే శాల్తీగా (అఖండంగా) అడుగునా పక్కలా కూడా పరవడానికి సరిపడేటంత ఉంటుంది (తె. 16).

**అకండందబ్బ:** (< సం. అఖండం-) పర్యా. పెద్ద బద్ద. మధ్యలో నరుకు లేకుండా ఉన్న పొడుగాటి వెదురుబద్ద (తె. 4).

**అగదాడు:** పర్యా. కాళ్ళకట్ట. మంచంలో కాళ్ళు చాపుకొనే వైపు నులకకూ అడ్డపట్టెకూ మధ్య బిగించి కట్టే తాడు; ఇలాటివి పట్టె పొడుగునా వరసగా ఉంటాయి (రా. 5).

**అగరుబత్తిపుల్ల:** పర్యా. ఊదుబత్తిపుల్ల. అగరొత్తి తయారు చేయడానికి వాడే వెదురుపుల్ల (కో. 9).

**అగ్గిపెట్టెలచాప:** ఉ. సాప; పర్యా. అగ్గిపెట్టెలనయం చాప. అగ్గిపెట్టెల్లాంటి గళ్ళు వచ్చేటట్లు నేసిన (తుంగ) చాప (రా. 6).

**అగ్గిపెట్టెలనయంచాప:** ఉ. సాప; పర్యా. అగ్గిపెట్టెల చాప. అగ్గిపెట్టెల్లాంటి గళ్ళు వచ్చేటట్లు నేసిన (తుంగ) చాప (రా. 10).

**అంకిసం:** పది సంవత్సరాల కాలం; దశకం (కో. 23).

**అంగూరుగంప:** (< హిం. అంగూర్-) ఉ.అంగూర-; పర్యా. చూ. ద్రాక్షబుట్ట (2). ద్రాక్షపళ్ళుపెట్టుకొనే బుట్ట, పూర్తిగా ఈతపేడుతో అల్లుతారు (తె. 14).

**అంగూరుగుల్ల:** (< హిం. అంగూర్-) ఉ. అంగూర-; పర్యా. చూ. ద్రాక్షబుట్ట (2). ద్రాక్షపళ్ళుపెట్టుకొనే బుట్ట; పూర్తిగా ఈతపేడు (చూ.)తో అల్లుతారు (తె. 14).

**అంగూరుబుట్ట:** (< హిం. అంగూర్-) ఉ. అంగూర-, అంగూర్, -బుట్టి; **1.** పర్యా. ద్రాక్షబుట్ట (1). ద్రాక్షపళ్ళు పార్సెల్ చేయడానికి అల్లిన బుట్ట; మోటు వెదురుపేడుతో వదులుగా అల్లుతారు; బొక్కెన ఆకారంలో ఉంటుంది; కొన్నిటికి కమాన్‌బద్ద ఉంటుంది (తె. 4, 18, 24). **2.** పర్యా. చూ. ద్రాక్షబుట్ట (2). ద్రాక్షపళ్ళు పెట్టుకొనే బుట్ట; పూర్తిగా ఈతపేడు (చూ.)తో అల్లుతారు (తె. 9).

**అచ్చు:** పర్యా. జిన్క-పలక,పలక(2), బల్ల, మగ్గం(2), మచ్చు (2). తుంగచాప నేసేటప్పుడు అడ్డానికి వేసిన తుంగపోచను దగ్గరకు నెట్టడానికి చేత్తో ఒత్తే కొయ్యపలక; దీర్ఘచతురస్రాకారంగా ఉంటుంది; దీనికి సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాల గుండా పోగులు దూరుస్తారు; తుంగపోచను పోగుల మధ్యకు దూర్చిన తరవాత ఆ పోచ అంతకు ముందున్న పోచలను అనుకొని ఉండేటట్లు ఈ పలకతో నెడతారు; కొన్నిచోట్ల ఇనపచువ్వల పలక వాడతారు. చూ. చిత్రాలు 105, 120 క. 5 (కో. 3; రా. 2, 4).

**అచ్చుకత్తి:** ఒకరకం కత్తి; పేముతీగ తీయడానికీ బెత్తం చీల్చడానికీ వాడతారు (కో. 10, 19).

**అంచు:** ఉ. అనుసు, అన్సు. **1.** పర్యా. గేడి (1). వెదురుబద్ద చీలిన భాగం; ఇటువంటివి బద్దపొడుగునా పల్లపు భాగానికి ఇటూ అటూ ఉంటాయి (కో. 5); 2. పర్యా. చూ. పలుకు(2). సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా బద్దవెడల్పులో సగానికి చీల్చిన భాగం (గడలో ఎనిమిదో భాగం); దీన్నించి పేడు తీస్తారు; వేలెడు వెడల్పు ఉంటుంది (కో. 2); **3.** పర్యా. చూ. ముక్కు (1). కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥వి) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రాలు 12 జ. 3; 16 చ. 5. (కో. 2); **4.** పర్యా. చూ. తల (1). ఒకరకం మేదరి కత్తికి వెడల్పు భాగం చివర (కో. 2); **5.** పర్యా. చూ. పొన్ను(1). మేదరికత్తి, చురకత్తి, మచ్చుకత్తి, ఉలి మొ॥ వాటి కట్టెపిడి పగలకుండా పిడిచుట్టూ వేసిన ఇనపకట్టు

చూ. చిత్రాలు 12 వ. 2; 16 వ. 2. (తె. 15, 17, 19), **6.** పర్యా. కట్టు (9), పెడెంచు, పొన్ను(2), బల. ఎరకలి కత్తి (కొడవలి) కట్టెపిడి చుట్టూ వేసిన ఇనపపట్టీ. చూ. చిత్రం 118. 2. (తె. 9, 13, 14, 16, 20; రా. 8); **7.** పర్యా. గేడి (2), మట్టం (2). ఆకులా ఉండే అంబు (చూ.)కు పదునున్న భాగం; ఇలాటివి రెండుంటాయి; కొన్నిటికి పదునుండదు (కో. 6; తె. 3); **8.** పర్యా. చూ. ముక్కు(2). అంబు (చూ.) పడగ చివరి కోసు చూ. చిత్రం 15 క. 2 (కో. 2); **9.** జేంపు, సిబ్బి, గుమ్మి, గంప మొ॥ వాటికి కర్ర (= వెదురు బద్ద చీరి తీసిన తీగ)తో అల్లిన అంచుభాగం; ఉబ్బెత్తుగా వచ్చేటట్లు గట్టిగా, చిక్కగా అల్లుతారు. చూ. చిత్రం 47 త. 1(తె. 27, 31; రా. 7, 9); **10.** సిక్కగూడ, ఉల్వాడి, సారెపెట్టె, సారెపెట్టె మూత మొ॥ వాటికి పైభాగంలో వెదురుబద్దలు వేసి కట్టిన అంచు. చూ. చిత్రం 84. 1(తె. 11, 19, 25); **11.** పర్యా. చూ. గోడ (5). జల్లెడ చుట్టూ ఎత్తుగా ఉన్న భాగం. చూ. చిత్రం 30. చ. 1 (తె. 3, 12; రా. 10), **12** ఊకజల్లకు నాలుగు పక్కలా పలకగా ఉండే గోడ, పక్షం (తె. 3); **13.** పర్యా. ఏడె (1), కుచ్చు (1), గోటు(6), పెంకు(2), పెండె(4). కట్టు(బద్ద), కర్ర (= కడ్డీ లాంటిది) పెట్టి చేటచుట్టూ కట్లు కట్టిన భాగం చూ. చిత్రం 29. 5 (కో. 23; తె. 3, 8, 13, 30; రా.3); **14.** ఈతగంప మొ॥ వాటి మూతి అల్లకంలో మిగిలిన నిలువులను లోపలికి దోపి గట్టిగా, ఉబ్బెత్తుగా అల్లిన చివరిభాగం (తె. 9, 11, 13, 20); **15.** ఈతచాప చుట్టూ కొనలను మూసేస్తూ అంచుపట్టెతో కుట్టగా ఏర్పడిన ఉబ్బెత్తు భాగం. చూ. చిత్రం 122. 1 (తె. 21, 22); **16.** గుడ్డవేసి మడిచికుట్టిన (తుంగ) చాప పొడుగుభాగం; ఇటువంటివి రెండంచులుంటాయి (కో. 3; రా. 10); **17.** పేముబుట్ట మూతి చివరిభాగం. చూ. చిత్రం 139. 3 (కో. 3).

అంచుకట్టు: **1.** పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచు చుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లిన భాగం. చూ. చిత్రం 47 క. 5 (తె. 29; రా. 11); **2.** (క్రి.) పర్యా. గోటువేయు. తుంగచాప రెండు నిలువు అంచులనూ మడిచి గుడ్డవేసి కుట్టడం (కో. 8; రా. 2, 6); 3. (క్రి) తాటి ఈనెలతో అల్లే పూలసజ్జ అంచు దగ్గర మిగిలిన నిలువులను లోపలికి మలిచి దోపడం (కో. 12).

అంచుకట్టుబద్ద. పర్యా. అంచుపట్టె (1), పచ్చబద్ద (2), పైబద్ద (2), బిలుకు (5). గూడ, ఉయ్యాల, పెళ్ళిపెట్టె, బుట్ట మొ॥ వాటి అల్లకంలో వాటి అంచు చుట్టూ గట్టిదనంకోసం కట్టిన పలచటి వెదురుబద్ద. చూ. చిత్రం 30. క. 2 (కో. 29).

అంచుకట్టె: పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్లం మొ॥ వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర. చూ. చిత్రం 32.1 (రా. 10).

అంచుకమ్మ: ఈతచాప అల్లకంలో అంచుకు వాడే ఆకు (తె. 26).

అంచుకర్ర: ఉ.-గర్రె; పర్యా. అంచుకట్టె, అంచు చిట్టె, అంచుబొంగు, అంచువాసం, కర్ర (6), గుండుచిప, దండె (2), నియపు (4), పక్కకట్టె, పక్కబొంగు, బొవపుదండె, పైడుబొంగు. బండి జల్ల మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర చూ. చిత్రం 32.1 (కో. 1, 3, 5, 7, 9, 10, 12, 15, 18; తె. 30, 31).

అంచుగట్టు: (క్రి.) 1. పర్యా. అంచుమురుచు. గంప, సిబ్బి, బుట్ట మొ॥ వాటికి అంచుచుట్టూ గట్టిదనం కోసం గోలుకర్ర (= గుండ్రటి వెదురుతీగ)తో గాని సన్నటి కర్రతోగాని జెడలాగ గట్టిగా అల్లడం (కో. 3, 22; తె. 27); 2. పర్యా. చూ. చేటకట్టు (1). చేట అల్లకంలో అంచుచుట్టూ లోపలినుంచి ఒక బద్దా (లోగట్టు) బయటినుంచి ఒకబద్దా (బయటి కట్టు) పెట్టి ఆ రెంటిమధ్యా ఒక చువ్వ (చూ. కర్ర) ఇరికించి కట్టుమొంగు (= పలచటిపేడు లేదా తీగ)తో కట్లువేసి బిగించడం; చేట, జల్లెడ, మొంటె మొ॥ వాటికి ఇలా బిగిస్తారు (కో. 10, 12; తె. 12, 27).

అంచుచిట్టె: ఉ.-శ్టె; పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల మొ॥ వాటి అంచులకు తొడిగే వెదురు కర్ర. చూ. చిత్రం 32.1 (రా. 10).

అంచుజుబురు: (క్రి.) పర్యా. జివురు (3). నేత పూర్తయిన తరవాత చాప అంచులను సమంగా కత్తెరతో కత్తిరించడం (రా. 6).

అంచుదబ్బ: **1.** పర్యా. చూ. గంటిబద్ద (1). గంటి గనుపు గుర్తు (=వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు

దీన్ని పారేస్తారు చూ. చిత్రం 9 (కో. 1); **2.** పర్యా. చూ. కట్టు (6). చేట, విసనగర్ర, పెట్టె, తిరుమాన్‌పెట్టె ...వాటి అల్లికంలో అంచుకు లోపలనుంచి, బయటినుంచి చుట్టూ వేసే వెదురుబద్ద; వేలెడుగాని, రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది (కో. 6, 21, 22).

అంచుపట్టె: **1** పర్యా. చూ. అంచుకట్టుబద్ద. గూడ, ఉయ్యాల, పెళ్ళిపెట్టె, బుట్ట మొ॥ వాటి అల్లికంలో వాటి అంచుచుట్టూ గట్టిదనంకోసం కట్టిన పలచటి వెదురుబద్ద (తె. 27); **2.** పర్యా. కల్సారిపట్టె, గోటు (8). ఈతచాప చుట్టూ కొసలను మూసేస్తూ కుట్టడానికి అల్లిన పట్టె; చాపలో వరసలుగా వచ్చే పట్టెలకన్న దీని వెడల్పు తక్కువగా ఉంటుంది; చాప అంచులు ఊడిగిపోకుండా ఉండడానికి ఈ పట్టెను కలిపి కుడతారు. చూ. చిత్రం 122.1 (తె. 26; రా. 9).

అంచుబద్ద: పర్యా. దండె, (3) దబ్బ, (7) పక్క దబ్బ, పైడుదబ్బ. తడక అంచుకు తొడిగిన వెదురు బద్ద (కో. 19).

అంచుబరిగె: ఉ. బర్గు; గూడపొనక అంచుకుపెట్టే వెదురుచువ్వ (బరిగె) (రా. 9).

అంచుబొంగు పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల మొ॥ వాటి అంచు కు తొడిగే వెదురుకర్ర చూ. చిత్రం 32.1 (తె. 31).

అంచుబొద్దు: పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, పొనె, గుమ్మి మొ॥ వాటి అంచుచుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం. చూ. చిత్రం 47 క. 5. (కో. 8).

అంచుమురుచు: (క్రి.) పర్యా. అంచుగట్టు(1). గంప, సిబ్బి మొ॥ వాటికి అంచుచుట్టూ గట్టిదనం కోసం గోలుకర్ర (=గుండ్రటి వెదురుతీగ)తో గాని సన్నటి కర్రతోగాని జెడలాగ గట్టిగా అల్లడం (తె. 15).

అంచువాసం: పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల మొ॥ వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర. చూ. చిత్రం 32.1 (కో. 8, 13).

అంచె: **1.** పర్యా. చూ. రొట్టె(ల) గుల్ల (1). రొట్టెలు పెట్టుకొనే వెదురుపేళ్ళ గుల్ల; రకరకాలుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి సమాంతరంగా రెండుబెత్తల ఎత్తూ జేనెడు బెత్తెడు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి కింద వెడల్పు తక్కువగానూ పోనుపోను వెడల్పు ఎక్కువగానూ ఉంటుంది; కొన్నిచోట్ల అర్ధచంద్రాకృతిలో ఉంటుంది (తె. 18). **2.** పర్యా. చూ. ఉప్పుతట్ట. ఇళ్ళ కట్టుబడిపనిలో మన్ను, సిమెంటూ మొ॥ మోయడానికి వాడే తట్ట; ఇనపపెంకె ఆకారంలో ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి గిన్నెమాదిరిగా ఉంటుంది (తె. 22); **4.** పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతోగాని ఈతపేళ్ళతో గాని అల్లిన పళ్ళెం; గుండ్రంగా ఉంటుంది. చూ. చిత్రం 66 (తె. 10, 14).

అంచెపుటికె: పర్యా. అంచెబుట్ట (1). అంచెలంచెలుగా మోసే వెదురుబుట్ట, చిన్న పళ్ళెంమాదిరిగా ఉంటుంది; బావిలో పూడిక తీసేటప్పుడు మట్టితట్టలను కూలివాళ్ళు అంచెలంచెలుగా బయటికి చేరవేస్తారు (తె. 13).

అంచెబుట్ట: ఉ.—బుట్టి; **1.** పర్యా. అంచెపుటికె. అంచెలంచెలుగా మోసే వెదురుబుట్ట; చిన్న పళ్ళెంమాదిరిగా ఉంటుంది; బావిలో పూడిక తీసేటప్పుడు మట్టితట్టలను కూలివాళ్ళు అంచెలంచెలుగా బయటికి చేరవేస్తారు (తె. 11); **2.** పర్యా. కల్లుకుండగంప. కల్లుకుండలు చేరవేసే వెదురుగంప; అంచెలంచెలుగా చేరవేస్తారు (తె. 9); **3.** పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసిపెట్టుకోడానికి వెదురుపేళ్ళతో గాని ఈతపేళ్ళతోగాని అల్లిన పళ్ళెం; గుండ్రంగా ఉంటుంది. చూ. చిత్రం 66 (తె. 10).

అటువ: పర్యా. చూ. ఖానా (1). వెదురుగడలు నిలవ చేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండు గడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి వాటికి ఎదురుగా గజం ఎడంలో మరో రెండు గడలు (లేదా సరుగుడుకర్రలు) పాతి ఆ నాలిగింటి పై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవేపు ఖాళీ ఉంచుతారు. ఖాళీ ఉన్న వేపునుంచి గడలు దూర్చి నిలబెడతారు; ఖాళీవేపును గొలుసుతో గాని గడతో గాని మూసి తాళం గూడా వేసుకోవచ్చు (తె. 19).

అట్టె: విసనగర్ర అల్లేటప్పుడు అంచు కట్టడంలో వెనక పక్క వచ్చే పేడు (తె. 29).

అట్టెబద్ద: పర్యా. చూ. కట్టు (7). విసనగర్ర అంచు కట్టడానికి ఒకపక్క బిగించిన వెదురుబద్ద

చూ. చిత్రం 31. క. 1 (తె. 29).

అడ: ఒక కొలత (మూరకన్న చాలా చిన్నది) (రా. 6).

అడకుంచె: పర్యా. చూ. కైంచి (1). వెదురు గడలు నిలబెట్టడానికి రెండు పొడుగాటి కర్రలకు దండెం కట్టి చేసిన ఏర్పాటు; రెండు గజాల ఎడంలో రెండు వెదురు గడలు గాని సరుగుడు కట్టెలు గాని పాతి ఆ రెంటి పై చివర్లను కలుపుతూ అడ్డంగా మరొక కర్రను కడతారు; అడ్డంగా కట్టిన కర్రకు వెదురు గడలు ఆనించి నిలబెడతారు. చూ. చిత్రం 8. ట. (తె. 22).

అడికాలు: 1. పర్యా. నిలువు (7). ఈతగంప మొ॥ వాటి అల్లకంలో నిలువుకు పెట్టే బద్ద (కో. 3); 2. పూలసజ్జ అల్లకంలో నిలువుగా వచ్చే తాటి ఈనె (కో. 12).

అడికొమ్ము: 1. పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందు భాగంలో రెండు మూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగా వేసిన చిటికెన వేలెడు లావు వెదురు బద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29. 2 (కో. 7); 2. పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరి భాగంలో మొదట వేసిన కొమ్ము దగ్గర కిందినుంచి గాని మీదినుంచి గాని అదనంగా వేసే మరో కొమ్ము; మొదటిదానికి తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము (కో. 6).

అడితి: ఉ. అడ్తి, అడ్డీ, అద్తి; 1. పర్యా. దుకాణం, దొడ్డి (2), మోటు (2), వెదురడితి. వెదురుగడల అమ్మకం జరిగే చోటు; అడవి నుంచి తెచ్చి ఇక్కడ అమ్ముతారు (కో. 5, 8, 10, 15, 17, 18; తె. 7, 15); 2. పర్యా. గంజు. వెదురుగడలు వేలం పాడే చోటు; మామూలుగా ప్రభుత్వం వెదురుడిపో దగ్గరే వేలం పాడతారు (కో. 9).

అడిపోగు: 1. రూ. అడుపొంగు; పర్యా. అడిసుత్తు, అడుగీనె, అకు(1), కర్ర బడుము(1), గోరు(3), చుట్టకమీనె, తిత్తెం, తీగ(1), పలచని గోరు, పలుకు(11), బడుంకర్ర, బడుము(1), బొణుగు, సన్నపేడు, సెల్లెపుల్ల(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥ వాటి అల్లకంలో బొద్దుడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటి పేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కిందిపేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తు భాగం మూతి దగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47. క. 3 (కో. 15; తె. 17–19, 22–28, 30); 2. పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసిన పేడు; పసరు పేడుకూ బెండు పేడుకూ మధ్యభాగం లోది; తెల్లగా ఉంటుంది (తె. 17).

అడిసుత్తు: రూ. అడుసుత్తి, అడుసుత్తు; పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥ వాటి అల్లకంలో బొద్దడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కింది పేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతి దగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47. క. 3 (కో. 1).

అడుగీనె: (< అడుగు + ఈనె). పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥ వాటి అల్లకంలో బొద్దడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కింది పేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (రా. 4).

అడుగు: ఉ. అడ్గు; 1. పర్యా. చదర (4), చేటడుగు, చేటతట్టు, పెనక (3), మంతు (2), సకం. చేట సమతలభాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపకముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట. చూ. మంతు (కో. 2, 9, 12, 15–18, 20, 26–28; తె. 29; రా. 1–3, 7–11); 2. పర్యా. వీపు (6). నేలకు ఆనే చేట కిందిభాగం (తె. 23); 3. పర్యా. చూ. తట్టు (2). జల్లెడ అడుగు అల్లకంలో పేడుకూ పేడుకూ మధ్య సన్నగా ఎడం వదులుతూ అల్లిన భాగం; జల్లించవలసినవి దీంట్లో పోసుకొంటారు; దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడువేళ్ళ ఎత్తున గోడుగా అంచు ఉంటుంది. చూ. చిత్రం 31 క. 4. (కో. 2, 7, 8, 20, 22, 23, 25, 28; తె. 7, 10; రా. 6, 11). 4. రూ. అడువు; పర్యా. మట్టు (1). గంప, తట్ట, బుట్ట, కోళ్ళగూడు, గుమ్మి, సిబ్బి మొ॥ వాటి కిందిభాగం; వాటిలో పోసేవి నిలవడానికి ఆధారం. చూ. చిత్రాలు 47 ట. 1; 65. చ. 1. (కో. 2, 3, 5, 28, 31; తె. 2, 15–18, 23, 24, 26, 27–31; రా. 5, 6, 8, 10, 11); 5. పర్యా. కిందడుగు (1), మట్టు (5). ఈత గంప మొ॥ వాటి అడుగుభాగం (తె. 9, 11, 14, 16, 20;

రా. 8, 9); **6.** పేముబుట్ట అడుగుభాగం. చూ. చిత్రం 139.1. (కో. 3).

**అడుగు అల్లు:** (క్రి.) గంప అడుగుభాగం అల్లడం; చక్రం ఆకారంలో అల్లకానికనువుగా నిలువులు పేర్చి కాలికింద తొక్కిపట్టి పేడుతోగాని కర్రతో గాని అల్లుతారు (కో. 8).

**అడుగుకట్టు:** ఉ. అడుగ్—, అడ్గు—; పర్యా. చూ. కిందికట్టు. గంప, గుమ్మి, తట్ట మొ॥ వాటి అల్లకంలో అడుగు పూర్తిచేసి ఎత్తుభాగం అల్లడానికి నిలువులు వంచేటప్పుడు వేసే కట్టు. చూ. చిత్రం 47 క. 4. (తె. 13, 22).

**అడుగుకానా:** (< హిం.—ఖానా) ఉయ్యాలలో అడుగున ఉంచిన కంత; పిల్లలు మూత్రంపోస్తే పోవడానికి ఇలాటి కంతలు పెడతారు; రెండు మూడంగుళాల కొకటి చొ॥న ఉంటాయి (తె. 27).

**అడుగుగోటు:** (క్రి.) పర్యా. చూ. మూలపట్టు. చేట అల్లకంలో అడుగు అల్లినతరవాత వెనకభాగం రెండుమూలలా దొప్పలాగా వచ్చేటట్లు అల్లే విభాగం (కో. 15).

**అడుగుచుట్టు:** ఉ.—సుట్టు; పర్యా. చుట్టు (1). వెదురు గుల్ల అడుగున వెలుపలనుంచి ఉబ్బెత్తుగా వెదురు కర్ర (=తీగలాంటిది) చుట్టి వేసిన కట్టు (రా. 1).

**అడుగుతట్టు:** పర్యా. చూ. తట్టు (2). జల్లెడ అడుగు అల్లకంలో పేడుకూ పేడుకూ మధ్య సన్నగా ఎడం వదులుతూ అల్లిన భాగం; జల్లించవలసినవి దీంట్లో పోసుకొంటారు; దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడువేళ్ళ ఎత్తున గోడుగా అంచు ఉంటుంది. చూ. చిత్రం 30. క. 4 (తె. 27).

**అడుగుతడక:** ఉ.—తడికె,—తడ్క; పర్యా. బండీ తడక (2). బండిచట్రంమీద (అడుగున) పరిచే తడక (తె. 1; రా. 5).

**అడుగుదబ్బ:** ఉ. అడ్గు—; **1.** పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥ వాటి అల్లకంలో నిలువుగా వచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్ద నుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి (రా. 6); **2.** పర్యా. చూ. అడుగుపేడు. గంప మొ॥వాటి అడుగున అమర్చిన మందంపేడు; ఎత్తుభాగం అల్లకంకోసం వంచిన తరవాత ఇదే నిలువవుతుంది; దీన్ని గంటిబద్ద (చూ.) నుంచి తీస్తారు. చూ. చిత్రం 47 చ. 3. (తె. 1); **3.** చూ. అడుగుబద్ద (రా. 3, 5); **4.** శవాన్ని కూర్చోబెట్టి తీసుకువెళ్ళే రథానికి అడుగున పెట్టే బద్ద (కో. 2).

**అడుగుదొక్కు:** (క్రి.) ఉ.—తొక్కు, అడ్గు—; పర్యా. అడుగుమట్టు, అడుగువేయు (1), అనిదొక్కు, అనివేయు (2), మట్టు (9), మట్టుదొక్కు, మట్టుబెట్టు, మట్టువేయు. వెదురుగంప; తడక మొ॥ (అడుగు) అల్లకం మొదలుపెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చక్రం ఆకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకానికనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు (కో. 7, 8, 13, 14; తె. 1, 9, 11, 24, 30; రా. 4).

**అడుగుపాసికం:** పర్యా. చూ. నిలుగు(2), గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥ వాటి అల్లకంలో అడుగు నుంచి అంచుదాకా నిలువుగా వేసిన మందంపేడు; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు (కో. 19),

**అడుగుపెండె:** పర్యా. చూ. కిందికట్టు. గంప, గుమ్మి, తట్ట, మొ॥ వాటి అల్లకంలో అడుగు పూర్తి చేసి ఎత్తుభాగం అల్లడానికి నిలువులు వంచేటప్పుడు వేసే కట్టు. చూ. చిత్రం 47. క. 4 (కో. 31).

**అడుగుపేడు:** పర్యా. అడుగుదబ్బ(2), కాలు(2), మట్టుబద్దగంప మొ॥ వాటి అడుగున అమర్చిన మందం పేడు; ఎత్తుభాగం అల్లకంకోసం వంచిన తరవాత ఇదే నిలువవుతుంది; దీన్ని గంటిబద్ద (చూ) నుంచి తీస్తారు. చూ. చిత్రం 47 చ. 3. (కో. 7; తె. 26).

**అడుగుబద్ద:** ఉ. అడ్గు—; రూ. అడుగుదబ్బ (3); పర్యా. గుద్దకిందిబద్ద. మానె, గంప, గుల్ల, తట్ట, మొ॥ వాటి అల్లకం పూర్తయినతరవాత గట్టిదనం కోసం అడుగున అడ్డంగాగాని నిలువుగాగాని తొడిగిన వెదురుబద్ద (కో. 11, 28, 30; తె. 22, 24, 30).

**అడుగుబొద్దు:** ఉ. అడ్గు—; 1. పర్యా. చూ. కింది కట్టు. గంప, గుమ్మి, తట్ట మొ॥ వాటి అల్లకంలో అడుగు పూర్తిచేసి ఎత్తుభాగం అల్లడానికి నిలువులు వంచేటప్పుడు వేసే కట్టు. చూ. చిత్రం 47 క. 4. (కో. 1, 8; రా. 3, 6, 8); 2. బుట్ట అడుగు (=నేలకు ఆనేది) భాగాన వేసిన బొద్దు. చూ. చిత్రం 48.1 (కో. 3).

**అడుగుమట్టు:** (క్రి.) పర్యా. చూ. అడుగుదొక్కు. **వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం**

మొదలుపెట్టేటప్పుడు నిలువుల్ని (గుంపు చక్రం ఆకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకాని కనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు (కో. 28).

**అడుగుమూల:** చేపలబుట్టకు అడుగున రెండు భుజాలు కలిసిన చోటు; ఇలాటివి బుట్టకు నాలుగుంటాయి (కో. 23).

**అడుగు వేయు** (క్రి.) ఉ. అడుగేయు; **1.** పర్యా. చూ. అడుగుదొక్కు. వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం మొదలుపెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చక్రం ఆకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకానికనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూవస్తారు (కో. 5, 9); **2.** చేట అల్లకంలో అడుగు (చూ.) భాగం అల్లడం (కో. 11).

**అడుపొంగు:** చూ. అడిపోగు (1) (తె. 16).

**అడువు:** చూ. అడుగు (4) (కో. 30).

**అడుసుతడక:** ఉ.—తడికె; మట్టిమిద్దె ఇంటికి వాసాలమీద కప్పే తడక (కో. 8).

**అడుసుత్తి:** చూ. అడిసుత్తు (రా. 3).

**అడుసుత్తు:** చూ. అడిసుత్తు (రా 4).

**అడ్డ:** **1.** పర్యా. చూ. మండె (1). వెదురుగడల పోగు; మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్ని చోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని ప్రభుత్వం వారి వెదురు డిపోలోగాని అడితిల్లోగాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తంలేదు (కో. 19; తె 25); **2.** పర్యా. అడ్డంకట్టె (1), అడ్డంగడ, అడ్డంపట్టె, అడ్డంబొంగు (1). వెదురు మంచం తయారీలో నిలువులమధ్య వెడల్పుభాగం వేపు అమర్చే వెదురుగడ. చూ. చిత్రం 108.5. (తె. 8, 19); **3.** బియ్యం మొ॥ కొలిచే ఒక పాత్ర; వెదురుగడతో చేస్తారు (కో. 31); **4.** మూడున్నరశేర్ల ధాన్యం కొలత (తె. 17); **5.** పదికిలోల ధాన్యం కొలత (తె. 24).

**అడ్డకర్ర:** పర్యా. చూ. మెట్టు (1). నిచ్చెన తయారీలో వెదురుగడలకు అడ్డంగా సుమారు మూరెడు పొడుగున బిగించిన వెదురుగడముక్క; నిచ్చెనకు సుమారు మూరెడేసి ఎడంలో నిలువు గడలకు చిల్లులు చేసి వాటిలో బిగిస్తారు (తె. 31).

**అడ్డకురచచేట:** ఉ.—కుర్సచేట; ఎక్కువ పొడుగులేని (కురచ) చేట (కో. 23).

**అడ్డకొయ్య:** పర్యా. చూ. అడ్డంబద్ద (1). అల్లకం పూర్తయిన తరవాత తడకమీంచి అడ్డంగా గట్టివనం కోసం కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 36. క. 2. (కో. 5).

**అడ్డగచ్చం.** చేట అల్లకంలో అడ్డంగా వచ్చే గచ్చం; చూ. గచ్చం; చూ. చిత్రం 21 (కో. 3).

**అడ్డగడె.** చూ. అడ్డంగడ (తె. 6).

**అడ్డగర్ర:** వెదురు అలమారు తయారీలో వెడల్పు భాగంలో బిగించిన వెదురుగడ. చూ. చిత్రం 101.3 (తె. 8).

**అడ్డగుల్ల:** అడ్డెడు (=పది కిలోలు) ధాన్యం పట్టే వెదురుగుల్ల (తె. 24).

**అడ్డంకట్టె:** **1.** పర్యా. చూ. అడ్డ (2). వెదురుమంచం తయారీలో నిలువులమధ్య వెడల్పు భాగంవేపు అమర్చే వెదురుగడ. చూ. చిత్రం 108.5. (తె.17); **2.** చెరుకునిచ్చెన మెట్టు (తె. 16).

**అడ్డంగడ:** రూ. అడ్డగడె; పర్యా. చూ. అడ్డ (2). వెదురుమంచం తయారీలో నిలువులమధ్య వెడల్పు భాగంవేపు అమర్చే వెదురుగడ. చూ. చిత్రం 108.5. (తె. 16).

**అడ్డంచు** తుంగచాప, తాటిచాప మొ॥ వాటికి వెడల్పు (అడ్డం) భాగంలో ఒక చివర (కో. 23, 30).

**అడ్డతీగలవెదురు** అడ్డతీగల ప్రాంతం అడవిలో పుట్టిన వెదురు (కో. 18).

**అడ్డంతడక:** ఉ.—తడ్క; బండికి ముందుభాగంలో కట్టే తడక; పక్కతడకలకన్న పొడుగు తక్కువ (తె. 9).

**అడ్డంతుంట:** పర్యా. చూ. సిర్సముక్క. సుమారు మూరెడుపొడుగు వెదురుగడముక్క; వెదురుమంచం తయారీలో కాలుగాగాని నిచ్చెన కట్టుబడిలో మెట్టుగా గాని వాడతారు (తె. 16).

**అడ్డందబ్బ:** ఉ.—డబ్బ; **1.** చూ. అడ్డంబద్ద (1) (రా. 11); **2.** చూ. అడ్డంబద్ద (2) (తె. 6; రా. 2); **3.** పర్యా. అడ్డంవాసం. చంద్రిక (=పట్టు పురుగులు పెంచడానికి అల్లిన ఒకరకం తడక) తయారీలో అడ్డంగా వేసిన వెదురుబద్ద; ఇలాటివి పది ఉంటాయి(రా. 1); **4.** వెదురుబద్దల అలమారు తయారీలో రెండు నిలువుగడలను కలుపుతూ కొట్టిన బద్ద. చూ. చిత్రం 101.4 (తె. 3, 4).

**అడ్డపట్టె:** చూ. అడ్డంపట్టె (కో. 9).

**అడ్డపాసికం:** వెదురుతడకకు అడ్డంగా అల్లే పాసికి

(చూ); రెండుపేళ్ళ మందముంటుంది (కో. 27).

**అడ్డబద్ద:** 1. చూ. అడ్డంబద్ద (1) (కో. 12, 13, 15), 2 కప్పడంబండి తడకకు అడ్డంగా పెట్టే వెదురు బద్ద; పొట్టిగా ఉంటుంది. చూ. చిత్రం 34 క. 1 (తె. 8).

**అడ్డం:** పర్యా. అడ్డంబద్ద (2), అల్లికంపేడు (1), అల్లికంబద్ద, అల్లినబద్ద, ఈనె (6), చుట్టుపాసిక, చుట్టుబద్ద (1), దబ్బంపేడు (2), పేడు (2), బిలుకు (7), బెండు (8), సలుగు. తడక, బండిజల్ల, పిల్లలపోది, ఉయ్యాల, చెంద్రిక మొ॥ వాటి నిలువుల చుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు లేదా పలచటి బద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది (కో. 7; తె. 28, రా. 5).

**అడ్డమంచు:** ఈతచాప అడ్డంలో కొసలను మూసేస్తూ అంచుపట్టెతో కుట్టగా ఏర్పడిన ఉబ్బెత్తుభాగం (తె. 22).

**అడ్డంపట్టె:** రూ. అడ్డపట్టె; పర్యా. చూ. అడ్డ (2). వెదురుమంచం తయారీలో నిలువులమధ్య వెడల్పు భాగంవేపు అమర్చే వెదురుగడ. చూ. చిత్రం 108.5. (రా. 11).

**అడ్డంబద్ద:** 1. రూ. అడ్డందబ్బ (1), అడ్డబద్ద, అడ్డుదబ్బ, అడ్డుబద్ద (2); పర్యా. అడ్డకొయ్య, నడిమధ్యచిట్టె. అల్లడం పూర్తయినతరవాత తడకమీంచి అడ్డంగా గట్టిదనంకోసం కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 36 క. 2. (కో. 10, 22, 29; తె. 17); 2. రూ. అడ్డందబ్బ (2); పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపోది, ఉయ్యాల, చెంద్రిక మొ॥ వాటి నిలువులచుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు లేదా పలచటి బద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది (కో. 13; తె. 25).

**అడ్డంబొంగు:** 1 పర్యా. చూ. అడ్డ (2). వెదురు మంచం తయారీలో నిలువులమధ్య వెడల్పుభాగం వేపు అమర్చే వెదురుగడ. చూ. చిత్రం 108.5. (తె. 10); 2. పందిరిగుంజలమీద అడ్డంగావేసిన వెదురుగడ (తె. 26).

**అడ్డంవాసం:** ఉ. అడ్డమాసం; పర్యా. అడ్డందబ్బ (3). చెంద్రిక (=పట్టుపురుగులు పెంచడానికి అల్లిన ఒకరకం తడక) తయారీలో అడ్డంగా వేసిన వెదురు బద్ద; ఇలాటివి పది ఉంటాయి (తె. 28).

**అడ్డి:** పర్యా. చూ. క్రైంచి (1). వెదురుగడలు నిలబెట్టడానికి రెండు పొడుగాటికర్రలకు దండెంకట్టి చేసిన ఏర్పాటు; రెండుగజాల ఎడంలో రెండు వెదురుగడలుగాని సరుగుడు కట్టెలుగాని పాతి ఆ రెంటి పైచివర్లను కలుపుతూ అడ్డంగా మరొక కర్రను కడతారు; అడ్డంగా కట్టిన కర్రకు వెదురు గడలు ఆనించి నిలబెడతారు. చూ. చిత్రం 8 ట (కో. 13, 15).

**అడ్డుకట్టె:** పర్యా. చూ. మెట్టు (1). నిచ్చెన తయారీలో వెదురుగడలకు అడ్డంగా సుమారు మూరెడు పొడుగున బిగించిన వెదురుగడముక్క; నిచ్చెనకు సుమారు మూరెడేసి ఎడంలో నిలువుగడలకు చిల్లులు చేసి వాటిలో బిగిస్తారు (రా. 5).

**అడ్డుకల విసనగర్ర:** ఉ. అడ్డుకలిస్నకర్ర; అడికెల (=ఒకరకం నగలోవచ్చే బిళ్ళలు) మాదిరిగా డిజైనుండే విసనగర్ర (తె. 15).

**అడ్డుదండె.** తడక చట్రంలో అడ్డంచుకు వేసిన వెదురు కర్ర (కో. 31).

**అడ్డుదబ్బ:** చూ. అడ్డందబ్బ (కో. 3).

**అడ్డుబద్ద:** 2. పర్యా. అనిబద్ద. తడకచట్రంలో నిలువు బద్దల్ని కలుపుతూ అడ్డంగా వేసిన వెదురుబద్ద (కో. 23); 2. చూ. అడ్డంబద్ద (కో. 20).

**అడ్డెడుగుల్ల:** అడ్డెడు(=మూడున్నరశేర్లు; 3 కిలోలు?) ధాన్యం పట్టే గుల్ల (తె. 17, 25).

**అడ్డెం:** పర్యా. పెంట (1). అడవిలో చిందరవందరగా వేసిన వెదుళ్ళకుప్ప (తె. 6).

**అణి:** చూ. అని (2) (రా. 1).

**అంటివాసం:** చూ. అరటివాసం (కో. 20).

**అంటు:** అతుక్కొని ఉండడం; జోడేనికి (చూ. జోడెం) ఒక చివర కర్రలు (చూ.) విడిగానూ ఒక చివర అతుక్కొనీ ఉంటాయి (తె. 21).

**అంటువాసం:** మేదరిపనికి ఉపయోగించే వెదురు కర్రల్లో ఒకరకం (కో. 21).

**అండ:** పర్యా. మోడె. వెదురుగడల మొదళ్ళు మట్టగించి ఒకచోట వేసిన నూరు గడల కుప్ప (తె.21).

**అతియన్:** త్రిభుజాకారం తడకలో రెండుభుజాలు కలిసేచోట ఏర్పడిన వంపు. చూ. చిత్రం 37 (కో. 31).

**అతియన్‌తడక:** పర్యా. చూ. క్రాస్‌తడక (1). త్రిభుజాకారంలో ఉండే తడక; తడకలతో కట్టే ఇంటికి కప్పువేపు త్రిభుజాకారం వచ్చేపక్క దీన్ని కడతారు. చూ. చిత్రం 37 (కో. 31).

**అతుకు:** ఉ. అత్కు; 1. పర్యా. చూ. పేడు (1). వెదురుబద్ద సన్నగాచీలిస్తే వచ్చే పాయ; సుమారు

చిటికెన వేలెడు వెడల్పూ గోరంత మందమూ గజన్నర పొడుగూ ఉంటుంది; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి వాడతారు; అల్లే వస్తువునుబట్టి దీని పొడుగువెడల్పులు నిర్ణయించుకొంటారు. (తె. 20, 21, 25); **2.** పర్యా. చూ. కోతపేడు. చేట, గూడ, బుంగ మొ॥ అల్లినతరవాత వాటి మూలలదగ్గర మిగిలిన పేడు(లు); వీటిని కోసేస్తారు; దేనికీ పనికిరావు (కో. 5).

**అతుకుకలుపు**: (క్రి.) తాటిచాప అల్లకంలో రేకు (ఆకు) అయిపోయినప్పుడు దాని స్థానంలో మరొక రేకు పెట్టడం (కో. 23).

**అతుకువేయు**: (క్రి.) ఉ. అతుకేయు; వెదురుతడక మొ॥ వాటి అల్లకంలో పేడు అయిపోయినప్పుడు మరో పేడుపెట్టి అల్లడం (కో. 10).

**అతేర**: (హిం. హథియార్) పనిముట్టు (తె. 18).

**అత్తరుపెట్టె**: అత్తరు మొ॥ సుగంధద్రవ్యాలు పెట్టుకోడానికి అల్లిన వెదురుపేళ్ళ పెట్టె (కో. 15).

**అత్తి** మేడిచెట్టు (కో. 4).

**అదరగొట్టు**: (క్రి.) కలబందమట్టను నారతీయడానికి మెత్తబడేటట్లు గూటంతో చితగ్గొట్టడం (రా. 5).

**అన**: గంప అడుగున అమర్చే బిలుకు (చూ.) ల జత (తె. 30).

**అని** (—ఎగురు, —ఎత్తు, — కట్టు, — తొక్కు, — వేయు) **1.** గంప, తడక మొ॥ వాటి అల్లకంలో నిలువు పేడూ (లేదా ఐమూలగా వచ్చింది) అడ్డ పేడూ కలిసే చోటు; ఒక పేడు పైకీ ఒక పేడు కిందికీ వస్తుంది; అలాటి కూర్పు (కో. 2, 7; రా. 3,5,10). **2.** రూ. అణి; పర్యా. చూ. గచ్చు. చేట, జల్లెడ, విసనగర్ర మొ॥ వాటి అల్లకంలో (కొన్నిచోట్ల తెర అల్లికలో మాదిరిగా) లెక్కప్రకారం దగ్గర దగ్గరగా వచ్చే పేళ్ళ కూర్పు; అయిమూలగాగాని నిలువుగాగాని ఉన్న ఒక పేడుమీంచి ఒక్కొక్కటి గాని రెండేసిగాని మూడేసిగాని నాలుగేసిగాని పేళ్ళు పైకీ కిందికీ వస్తుంటాయి; పేడు సన్నగా ఉంటే గచ్చుల సంఖ్య పెరుగుతుంది; వెడల్పుగా ఉంటే తగ్గుతుంది; చేటలో ఐమూలగా ఎనిమిది గచ్చు లుంటాయి; మూడేసి పేళ్ళ గచ్చులు నాలుగయితే ఒక చేట తయారుకావచ్చు. చూ. చిత్రం 21 (తె. 1). **3.** జల్లెడ అల్లేటప్పుడు రెండేసి పేళ్ళ వరసలకు మధ్య వచ్చే సందు (తె. 6). **4.** పర్యా. చూ. చట్రం (1). మంచం, ఒడ్లతడక, చాటు తడక, చెంద్రిక తడక, కళ్యాణమంటపం మొ॥ వాటి తయారీకి నాలుగు వెదురుబద్దలతోగాని గడలతో గాని (దీర్ఘచతురస్రాకారంగాగాని చతురస్రాకారంగాగాని) చేసిన దొడ్డి. చూ. చిత్రం 82.2. (కో. 2). **5.** పర్యా. చూ. కుప్పె (1). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ అల్లగా మిగిలిన నిలువు కొస(లు); వీటిని వెనక్కి మలిచి అంచు లోపలికి దోపుతారు (రా. 11). **6** గొర్రెపిల్లల జల్ల (చూ.). అల్లకంలో మిగిలిన నిలువులను వెనక్కి దోపిన చోట కనబడే (నిలువు) గుర్తు. చూ. చిత్రం 77.1. (తె. 2); **7.** మొదలు (3, 5, 6, 8-11, 13, 15, 17; తె. 2; రా. 2-5); **8.** పర్యా. చూ. పట్టె (2). ఈతచువ్వతో అల్లే గుమ్మి, తడక మొ॥ వాటిలో నిలువుగా వచ్చే నాలుగుబద్దల కూర్పు (రా. 8). **9.** పర్యా. వడి. ఈతచాప అల్లడానికి ఒక చేతిలోకి తీసుకొన్న (ఆరు) ఆకులను ఇంకో చేతిలోకి తీసుకొన్న (ఏడు) ఆకులతో పడుగు పేకలుగా కూర్చిన భాగం (రా. 9); **10.** (తుంగ) చాప నేసే మగ్గంలో ఎగదండు (చూ.) నుంచి దిగదండు (చూ.) వరకు గజం వెడల్పున బెత్తెడు దూరానికొకటి చొప్పున కట్టిన పోగుల (దారంగాని నారపోచలుగాని) వరస; ఒకటి విడిచి ఒకటి ఈ పోగుల్లో సగంపోగులు ఒక అనిగానూ మిగిలిన పోగులు ఇంకో అనిగానూ ఉంటాయి; నేసేటప్పుడు ఒక అని కిందికీ ఒక అని పైకీ మారుతూ ఉంటాయి; ఇలా మారిన ప్రతిసారీ అనుల మధ్యన తుంగపోచను దూరుస్తూ చాప నేస్తారు; రొప్పుకుచవ్వ (చూ.), అనికర్ర (చూ.) కలిసి ఒక అనిని పైకి లేపుతాయి; లో బొంగు (చూ.) ఒక అనిని కిందికి తొక్కి పడుతుంది. చూ. చిత్రం 120 ట.5 (కో. 3, 8; రా. 4, 6, 10): **11.** తాడు పేనడానికి మొవట వేసే పురి (రా. 4, 5); **12.** మంచానికి నులక అల్లడంలో విసనగర్ర డిజైను అల్లేటప్పుడు కిందికీ మీదికీ తిప్పేతాళ్ళు (రా. 5); **13.** పేము అల్లకం మొదలుపెట్టేటప్పుడు తీగలు మొ॥ ఒకదానికొకటి కిందుమీదులుగా వచ్చేటట్లు అమర్చిన వరస (కో.3).

**అని ఎగురు**: (క్రి.) (తుంగ) చాపనేతలో మగ్గాని కున్న ఒక పోగులవరస పైకిలేవడం; పోగులమధ్య దూర్చిన బొంగును కిందికి ఒత్తినప్పుడు ఒక పోగుల వరస కిందికీ ఇంకో పోగులవరస పైకి లేస్తాయి; ఈ రెండు వరసలమధ్యా తుంగపోచ దూర్చి మళ్ళీ ఈ పోగుల వరసల్లో పైది కిందికీ కిందిది పైకీ మారుస్తూ నేస్తారు (రా. 4).

**అనికర్ర:** పర్యా. అనిపుల్ల, ఉట్లకట్టె, ఉట్లకర్ర. చాపనేత మగ్గంలో ఒక అని (=ఒకటి విడిచి ఒకటిగా ఉండే పోగులవరస)ని అదిమిపట్టి ఉంచే గజంపొడుగు కర్ర; ఇది ముక్కాలకర్రలకు (=గుడిసె మాదిరిగా నిలబెట్టి ఉన్న మూడుకర్రలు) వేలాడదీసి ఉంటుంది; దీనికి పొడుగునా ఉండే దారాల కొలుకుల్లోంచి ఒకవరస అనిపోగులు దూర్చి ఒకచివర ఎగదండుకూ, ఇంకోచివర దిగదండుకూ కడతారు; ఈ అనికర్రను కిందికి దింపినప్పుడు ఒకవరస అనిపోగులు కిందికివచ్చి ఒకవరస అనిపోగులు పైకిలేస్తాయి; అప్పుడా పోగులమధ్య తుంగపోచ దూర్చి మళ్ళీ అనిమార్చి మరో తుంగపోచను దూరుస్తారు. చూ. చిత్రం 120 క 4. (కో. 3, 8).

**అనిగట్టు:** (క్రి.) చాపనేత మగ్గానికి (ఒకటి విడిచి ఒకటి చొ॥న) బిగించిన (పడుగు) నారపోగుల్లో సగంపోగుల్ని అనికర్ర (చూ.) కుండే కొలుకుల్లోంచి (దారపు రింగుల్లోంచి) వచ్చేటట్లు కట్టడం; అనికర్ర కిందికి దింపితే సగంపోగులు కిందికి వస్తాయి. (కో. 3; రా. 10).

**అనితాడు:** చాపనేత మగ్గంలో అనికర్ర (చూ.) పొడుగునా పోగులు దూర్చడానికి కొలుకుల్లు కట్టిన లావుపాటి దారం. (కో. 3).

**అనిదొక్కు:** (క్రి.) పర్యా. చూ. అడుగుదొక్కు. వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం మొదలుపెట్టేటప్పుడు నిలువున్ని (గంపకు చక్రం ఆకారంలోనూ, తడకకు నిలువుగానూ అల్లకాని కనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతో, గాని అల్లుకుంటూ వస్తారు. (కో. 5, 7).

**అనిపుల్ల:** పర్యా. చూ. అనికర్ర. చాపనేత మగ్గంలో ఒక అని (=ఒకటివిడిచి ఒకటిగా ఉండే పోగుల వరస)ని అదిమిపట్టి ఉంచే గజంపొడుగు కర్ర; ఇది ముక్కాలకర్రలకు (=గుడిసె మాదిరిగా నిలబెట్టి ఉన్న మూడుకర్రలు) వేలాడదీసి ఉంటుంది; దీనికి పొడుగునా ఉండే దారాల కొలుకుల్లోంచి ఒకవరస అనిపోగులు దూర్చి ఒకచివర ఎగదండుకూ ఇంకోచివర దిగదండుకూ కడతారు; ఈ అనికర్రను కిందికి దింపినప్పుడు ఒకవరస అనిపోగుల కిందికివచ్చి ఒకవరస అనిపోగులు పైకిలేస్తాయి; అప్పుడా పోగులమధ్య తుంగపోచ దూర్చి మళ్ళీ అనిమార్చి మరో తుంగపోచను దూరుస్తారు. చూ. చిత్రం 120 క. 4. (రా. 10).

**అనిబద్ద:** పర్యా. అడ్డుబద్ద (1). తడక చట్రంలో నిలువుబద్దల్ని కలుపుతూ అడ్డంగా వేసిన వెదురు బద్ద. (కో. 5).

**అనివేయు:** (క్రి.) ఉ. అనేయు; **1.** పర్యా. అనెత్తు, కొమ్ముకువేయు, కొమ్ముమట్టు, గచ్చుయెక్కించు, మొదలువేయు. చేట, విసనగర్ర అల్లకం ఆరంభంలో కొమ్ము (చూ.)కు రెండుగాని మూడుగాని నాలుగుగాని (అల్లకం విధానాన్నిబట్టి) పేళ్ళు ఎక్కించి అల్లకం మొదలుపెట్టడం. (కో. 3, 5, 6, 8-15; తె. 2; రా. 2-5, 10); **2** పర్యా చూ. అడుగుదొక్కు. వెదురుగంప, తడక, మొ॥ (అడుగు) అల్లకం మొదలుపెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చక్రం ఆకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకాని కనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు. (కో. 8).

**అనెత్తు:** (< అని ఎత్తు) (క్రి.) పర్యా. చూ. అనివేయు(1). చేట, విసనగర్ర అల్లకం ఆరంభంలో కొమ్ము (చూ.)కు రెండుగాని మూడుగాని నాలుగుగాని (అల్లకం విధానాన్నిబట్టి) పేళ్ళుఎక్కించి అల్లకం మొదలుపెట్టడం (రా. 2).

**అంతస్తు:** పర్యా. చూ. అర(2). వెదురుబద్దలతోనూ బొంగులతోనూ చేసిన అలమారు (బీరువా)లో సామాను పెట్టుకోడానికి ఏర్పరచిన భాగం. ఇలాటివి ఐదుంటాయి. చూ. చిత్రం 101.1 (తె. 8).

**అందాజపాంచె:** (క్రి. విశే) ఉ. అంజేజ—, సుమారుగా (తె. 16).

**అంద్రం:** (< సం. రంధ్రం) గైకట్టె దూర్చడానికి వీలుగా ఒకరకం కొడవలి (కొడకు బదులుగా ఉండే) గొట్టానికి ఉన్న చిల్లి (తె. 26).

**అన్నందాగర:** అన్నం ఆరబోసుకునే దాగర(చూ.); కిందివేపు చదరంగా నాలుగుమూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది; జేనెడుఎత్తు ఉంటుంది. చూ. చిత్రం 45. (కో. 25).

**అన్నంబుట్ట:** అన్నంపెట్టుకొని వెళ్ళేబుట్ట. (తె. 9).

**అన్నంవార్పుసిబ్బి:** గంజి వార్చేటప్పుడు కుండ, గుండిగ మొ॥వాటి మీదపెట్టే వెదురుపేళ్ళసిబ్బి (కో. 14).

**అన్మారి:** చూ. అల్మారి (తె. 9).

**అమాసగనుపువెదురు:** ఉ. —గెన్నెదురు. కణుపుల

పక్కపక్కన అనుకొన్నట్లుండే వెదురుగడ; అమావాస్యరోజున పుట్టడంవల్ల ఇలా ఉంటుం దంటారు. (కో. 1).

అడ్డాలచెట్టు: ఉ. సెట్టు. ఒకేపుదురులో మొలిచిన రెండు లేదా అంతకంటె ఎక్కువ ఈతచెట్లు (తె. 11).

అంబటిగంప: ఉ. అంబడి—; పర్యా. చద్దితట్ట. అంబలి మొ॥ పొలానికి చేరవేసేగంప (తె. 11, 13, 14).

అంబడిగుల్ల: పర్యా. చూ. అంబడితట్ట. పొలందగ్గరికి అంబలి (= జొన్నరవ్వతో కాచిన జావ) మొ॥ ఆహారపదార్థాన్ని తీసుకువెళ్ళేతట్ట; కొన్ని తట్ట ఆకారంలోనూ (కిందినుంచి మీదివరకు సమానంగా), కొన్ని గుల్లఆకారంలోనూ (=గుండ్రంగానూ కింద వెడల్పు తక్కువగానూ పోనుపోను వెడల్పుగానూ) ఉంటాయి. (తె. 17).

అంబడితట్ట: పర్యా. అంబడిగుల్ల, అంబలిగంప, అంబలిమానె. పొలందగ్గరికి అంబలి (=జొన్నరవ్వతో కాచిన జావ) మొ॥ ఆహారపదార్థాల్ని తీసుకువెళ్ళేతట్ట; కొన్ని తట్టఆకారంలోనూ (=కింది నుంచి మీదివరకు సమానంగా), కొన్ని గుల్లఆకారం లోనూ (=గుండ్రంగానూ కింది వెడల్పు తక్కువగానూ పోనుపోను వెడల్పుగానూ) ఉంటాయి. (కో. 26).

అంబలిగంప. పర్యా. చూ. అంబడితట్ట. పొలందగ్గరికి అంబలి (=జొన్నరవ్వతో కాచిన జావ) మొ॥ ఆహారపదార్థాల్ని తీసుకువెళ్ళేతట్ట; కొన్ని తట్ట ఆకారంలోనూ (=కిందినుంచి మీదివరకు సమానంగా), కొన్ని గుల్లఆకారంలోనూ (=గుండ్రంగానూ కింద వెడల్పు తక్కువగానూ పోనుపోను వెడల్పుగానూ) ఉంటాయి. (తె. 4).

అంబలిమానె: ఉ. —మాని; పర్యా. చూ. అంబడితట్ట పొలం దగ్గరికి అంబలి (జొన్న రవ్వతో కాచిన జావ) మొ॥ ఆహారపదార్థాల్ని తీసుకువెళ్ళే తట్ట; కొన్నితట్ట ఆకారంలోనూ (=కిందినుంచి మీది వరకు సమానంగా), కొన్నిగుల్ల ఆకారంలోనూ (గుండ్రంగానూ కింద వెడల్పు తక్కువగానూ పోనుపోను వెడల్పుగానూ) ఉంటాయి (కో. 28).

అంబు. 1. ఉ. వొంబు, రూ. అమ్ము (1). బాణం కొసనుండే ఉక్కుముక్కలాంటి పనిముట్టు; మేదరి అల్లకంలో మిగిలినసేపు తెంపడానికీ, చేట, జల్లెడ మొ॥వాటికి అంచు కట్టేటప్పుడు చిల్లులు పొడవడానికీ వాడతారు; కొన్నిచోట్ల గుల్ల మొ॥వాటి అల్లకం పూర్తిఅయిన తరవాత మిగిలిన నిలువులను వంచి లోపలికి దోపడానికి కూడా వాడతారు; ఇనపది; ఉరుపునుబట్టి ఆకారాన్నిబట్టి రకరకాలుగా ఉంటాయి. చూ. చిత్రాలు 15. క, చ. (కో. 2, 3, 5–18; తె. 1–3, 8, 12, 19, 30, 31; రా. 2, 4–9, 11); 2. ఉలిపిడికి తొడిగిన ఇనపకట్టు. (తె. 19); 3. పర్యా. జమ్ముకత్తి. జమ్ముపోచల్ని నిలువుగా చీరేకత్తి; సన్నగా, పలచగా, పొడుగ్గా, కోసుగా ఉంటుంది, కొన్నిటికి పిడి ఉంటుంది. (కో. 3).

అంబుగడ్డం: పర్యా. గడ్డం (2). అంబు. (చూ.) పడగ వెడల్పుగా ఉన్నచోట వంపుదిరిగిన భాగం. ఇలాటివి రెండుంటాయి. (కో. 10).

అంబుపడగ: పర్యా. చూ. పడగ (1). అంబు (చూ.)కు వెడల్పుగా ఉన్న భాగం; పాముపడగ, బరిసె మొ॥వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండే బిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; సేపు తెంపడానికి చిల్లులు పొడవడానికి పనికొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి; కొన్ని మొండిగా ఉంటాయి; కాడకొసతో చిల్లులు పొడవడానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు. చూ. చిత్రం 15 ట. (కో. 18).

అంబుసూది: పర్యా. చూ. కూలు (2). ఒకరకం అంబు (చూ.)కు మొనదేలి ఉండేకాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥వాటికి కట్టు కట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. 1. (కో. 18).

అంబుసూరకత్తి: అమ్ము (బాణం మాదిరిది) ఆకారమూ, చురకత్తి ఆకారమూ రెండూ కలిసి ఉన్న చురకత్తి; పిడివేపు భాగం అమ్ములా మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 17. (కో.13,16).

అమ్ము: 1. చూ. అంబు (1). (తె. 6, 7, 9, 10, 13–25, 28; రా. 10); 2. పర్యా. చూ. ముక్కు (2). అంబు (చూ.) పడగ చివరికోసు. చూ. చిత్రం 15 క. 2. (తె. 10).

అమ్ముమొదలు: పర్యా. చూ. కూలు (2). ఒకరకం అంబు (చూ.)కు మొనదేలి ఉండే కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥వాటికి కట్టుకట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ.

చిత్రం 15 క. 1. (తె. 15).

అమ్ముగవాయి: పర్యా. అలుగు (2). అంబు (చూ.) కున్న పదును; రెండువేపులా ఉంటుంది. (తె.15).

అర: **1.** పర్యా. చూ. ఖానా(1). వెదురుగడలు నిలవ చేయడానికి చేసినకట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండుగడలు (లేదా సరుగుడుకర్రలు) పాతి వాటికి ఎదురుగా గజంఎడంలో మరో రెండుగడలు (లేదా సరుగుడుకర్రలు) పాతి ఆనాలిగింటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవేపు ఖాళీ ఉంచుతారు; ఖాళీఉన్న వేపునుంచి గడలు దూర్చినిలబెడతారు, ఖాళీవేపును గొలుసుతోగాని గడతోగాని మూసి తాళంగూడా వేసుకోవచ్చు (రా. 6, 11); 2 ఉ అర్ర; పర్యా. అంతస్తు, కానా(5). వెదురుబద్దలతోనూ బొంగులతోనూ చేసిన అలమారు (బీరువా)లో సామాను పెట్టుకోడానికి ఏర్పరిచిన భాగం; ఇలాటివి ఐదుంటాయి. చూ. చిత్రం 101. 1. (తె. 4, 5, 10); **3.** కవల లయ్యాలపెట్టెలో ఒకభాగం; ఇలాటివి రెండుంటాయి. (కో. 5).

అరకట్టు: **1.** పర్యా. బద్ద(ల)కట్ట. 25 వెదురుగడల్ని బద్దలుగా చీల్చికట్టిన కట్ట; ఇందులో 100 బద్దలుంటాయి. (తె. 26); **2.** 18 ఉద్లు (ఉద్ద - నాలుగు బద్దల మోపు (కో. 6).

అరగంటు: చూ. అరగంటి (కో. 20).

అరటితోటవాసం: పర్యా. అరటివాసం. అరటిచెట్లు గాలికి పడిపోకుండా ఆనుగాపెట్టే లావుపాటి వెదురుగడ; దీనికి దబ్బనం బట్టేటంత బోలుంటుంది; మేదరిపనికి పనికిరాదు. (కో. 18).

అరటిపండ్లబుట్ట: అరటిపళ్ళుంచుకోడానికి అల్లిన వెదురుపేళ్ళబుట్ట; ద్రాక్షపళ్ళబుట్టలాగే అడుగున గద్దెలేకుండా అల్లుతారు. (తె. 24).

అరటిమొగ్గ: తుంగచాప మధ్యలో అరటిమొగ్గ ఆకారంలోపడే డిజైను (కో. 3; రా. 4).

అరటిమొగ్గలచాప. మధ్యభాగంలో అరటిమొగ్గలాంటి డిజైనుఉండే తుంగచాప (కో. 3; రా. 4)

అరటివాసం: ఉ. అరిటి—, అర్టి—; రూ. అంటివాసం; పర్యా. అరటితోటవాసం. అరటిచెట్లు గాలికి పడిపోకుండా అనుగాపెట్టే లావుపాటి వెదురుగడ; దీనికి దబ్బనం బట్టేటంత బోలుంటుంది. మేదరిపనికి పనికిరాదు. (కో. 16, 17, 23, 25).

అరవమేదరి: ఉ. అర్వ—; మేదరివాళ్ళలో ఒకతెగ; పూర్వం వెదురుబద్దలు దొంగతనం చేసినందుకు వీళ్ళను కులంనుంచి వెలివేశారట; కొన్నిచోట్ల ఈ తెగవాళ్ళు చేటలుతప్ప మిగతావి మాత్రం అల్లుతారు; కొన్నిచోట్ల అరవంగాని కన్నడంగాని మాట్లాడే మేదర్లు; మామూలుమేదర్లకూ వీళ్ళకూ వియ్యం పొత్తులేదు (తె. 10, 26, 28; రా. 8).

అరవాయి: పర్యా. చూ. పదును(1). కత్తి అంబు, చురకత్తి, ఉలి మొ॥ వాటి వాడి; మెత్తగా తెగే భాగం; కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు 12 క-డ, 16 క-ప. (కో. 3).

అరవీసెఉక్కుకత్తి: ఉ. అరీసుక్కు-కత్తి అరవీసెడు ఉక్కుతో చేసిన మేదరికత్తి (రా. 4).

అరుగుతడక: ఉ. —తడ్క, ఇంటికి వెనకభాగంలో అరుగుమీది నుంచి కట్టేతడక; దీర్ఘచతురస్రంగా ఉంటుంది. (తె. 23).

అరుసుకొను: (క్రి.) ఉ. అర్సుకొను; అడిగి తెలుసుకోడం; వాకబుచెయ్యడం (తె. 20).

అర్రతడక: ఉ. అరతడ్క; పర్యా. చూ. చాటు తడక(1). ఇంట్లో గదులుగా విభజించడానికిగాని వరండాలో చాటుకోసంగాని అడ్డంగాకట్టే వెదురు పేళ్ళతడక. చూ. చిత్రం 36 చ. (తె. 23).

అలకటిబొంగు: (< హిం. హల్కా —) ఉ అల్కటి బొంగు; బరువు తక్కువగా ఉండే వెదురుగడ. (తె. 17).

అలమారు: చూ. అల్మారి (కో. 19).

అలవ: పర్యా. ఎనుగు. కంచె; చేనుచుట్టూ కంపతో గాని వెదురుగడలలోగాని కడతారు. (తె. 28).

అలుగు ఉ. అల్గు; **1** పర్యా. చూ. పదును (1). కత్తి. అంబు చురకత్తి, ఉలి మొ॥ వాటి వాడి; మెత్తగా తెగే భాగం; కొయ్యడానికీ నరకడానికీ వీయినది. చూ. చిత్రాలు 12 క-డ; 16 క-ప. (తె. 14); **2** పర్యా. అమ్ముగవాయి. అంబు (చూ.) కున్న పదును; రెండువేపులా ఉంటుంది. (తె. 6,7, 9, 13, 31). **3** పర్యా. చూ. ముక్కు (2). అంబు (చూ) పదగ చివరికోసు. చూ. చిత్రం 16 క. 2 (కో. 6; తె. 9).

అల్మరా: చూ. అల్మారి. (తె. 10).

అల్మారి. (< ఇం. Almirah). రూ. అన్మారి, అలమారు. అల్మరా; వెదురుగడలతోనూ బద్దలతోనూ అరలరలుగా చేసిన అలమారు (బీరువా) చూ. చిత్రం 101. (తె. 4. 5, 8).

అల్లికం: రూ. అల్లిక; పర్యా ఒడుపుకం, నేత. వెదురు పేళ్ళు పడుగుపేకలుగా దూర్చి బిగించడం; ఒక పేడు

కిందినుంచి తరవాత మరోపేడు పైనుంచి ఆతరవాత మళ్ళీ కిందినుంచి వచ్చేటట్లు అల్లుతారు; తట్ట, బుట్ట, గంప, చేట మొ॥వి ఇలా అల్లుతారు. (కో; తె; రా.)

అల్లకమీనె: (< అల్లకం+ఈనె). ఉ. అల్లుకం పీనె; 1. పర్యా. చూ. చుట్టుకర్ర. గంప, బుట్ట, తట్ట మొ॥ వాటి అల్లకంలో ఎత్తుభాగం అల్లడానికి వాడే కర్ర. (చూ.); పేడు వెడల్పులో సగముంటుంది; పేడుకన్న మందంగా ఉంటుంది. (కో. 10; రా. 5); 2. పూలసజ్జ తయారీలో అల్లకానికి పనికొచ్చే తాటి ఈనె. (కో. 12).

అల్లకంపేడు: 1. పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చంద్రిక మొ॥ వాటి నిలువులచుట్టూ అడ్డంగా అల్లే మందం పేడు లేదా పలచటిబద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (కో. 1, 13); 2. పర్యా. చూ. చుట్టుకర్ర. గంప, బుట్ట, తట్ట మొ॥ వాటి అల్లకంలో ఎత్తుభాగం అల్లడానికి వాడే కర్ర. (చూ.); పేడు వెడల్పులో సగముంటుంది, పేడుకన్న మందంగా ఉంటుంది. (కో. 12).

అల్లకంబద్ద: పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చంద్రిక మొ॥ వాటి నిలువుల చుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు లేదా పలచటి బద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (కో. 8, 12).

అల్లారుకేన్: (< ఇం. Cane). సముద్ర తీర ప్రాంతంలో పెరిగే ఒకరకం పేము. (కో. 11).

అల్లి. పేకతట్టలు మొ॥ అల్లడానికి పనికొచ్చే చువ్వలు వచ్చే ఒకచెట్టు; చువ్వలు నల్లగా, సన్నగా ఉంటాయి. (కో. 25).

అల్లిక: చూ. అల్లకం. (కో. 27)

అల్లికర్ర: అల్లిచెట్టునుంచి తీసిన చువ్వ (బరిగె); సన్నగా నల్లగా ఉంటుంది; పేకతట్టలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 25).

అల్లినదండి: తాటిచాప అల్లకంలో పని మొదలుపెట్టిన వేపు పెట్టే అడ్డంచు; అల్లకంలో పూర్తి అయినది. (కో. 26).

అల్లినబద్ద: పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చంద్రిక మొ॥వాటి నిలువుల చుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు లేదా పలచటి బద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (కో. 28).

అల్లు: (క్రి.) 1. పర్యా నేయు. (వెదురుపేళ్ళు) ఒకటి పైకి ఒకటి కిందికి వచ్చేటట్లు కూర్చడం, కొన్ని చోట్ల రెండేసి పేళ్ళనుంచి నాలుగేసి పేళ్ళవరకు పెట్టి కూరుస్తారు; కొన్నిచోట్ల కూర్పు ఐమూలగా వస్తుంది; గంప, తట్ట, చేట, విసనకర్ర మొ॥ ఇలా తయారుచేస్తారు. (కో; తె; రా.); 2 పర్యా. పేంచు. ఈతబద్దతో గంప, బండిజల్ల మొ॥ తయారు చేయడం. (తె. 13; రా. 8).

అవుజు: (< హిం. హౌజ్). పర్యా. గాబు. నీళ్ళు నిలక ఉంచుకోడానికి సిమెంటుతోగాని మట్టితోగాని చేసిన పెద్దతొట్టి. (తె. 4).

అసలుకట్టు: బురద (అసులు) నాగలిపణతనుంచి వారిణను కలిపికట్టే తాడు; ఈతదారదిగాని తాటి నారదిగాని. (తె. 9).

అసిఫాబాద్‌బొంగు: అసిఫాబాద్ అడవుల్లో పెరిగిన వెదురుగడ; నాణ్యమైంది. (తె. 24).

అసులు: బురదమన్ను. (రా. 10).

అసులుగంప: మిద్దె కట్టేటప్పుడు చెక్కలమీద పరవడానికి అసులు (బురద) మోసేగంప. (రా. 10).

అస్తర్: కచ్చడం బండికిపైన గుడిశెలా కప్పే ఈత చాప. (తె. 22).

అస్సాంబెత్తం: అస్సాంరాష్ట్రంలో దొరికే పేము కర్ర; అల్లకంతీగ తీయడానికి పనికొస్తుంది. (కో. 19).

అహోబిలంవెదురు: ఉ. అహోబులం—; అహోబిలం (కర్నూలుజిల్లా) ప్రాంతంలో పుట్టిన వెదురు. (రా. 4).

## ఆ

ఆకాశపుల్ల: పర్యా. పటాకీపుల్ల. తారాజువ్వ, దీపావళికి వేసే తారాజువ్వలకు కొన్నిచోట్ల వెదురుపుల్ల వాడతారు. (కో. 2).

ఆకు: 1. పర్యా. చూ. అడిపోగు (1). గంప, బుట్ట, పిబ్బి మొ॥ వాటి అల్లకంలో బొద్దుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి, సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండు భాగాలుగా నిలువునాచీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (తె. 3); 2. పర్యా. చూ. పేడు (1). వెదురుబద్ద సన్నగాచీలిస్తే వచ్చే పాయ సుమారు చిటికెనవేలెడు వెడల్పూ గోరంత మందమూ గజంన్నర పొడుగూ ఉంటుంది; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి వాడతారు; అల్లే వస్తువును

బట్టి దీని పొడుగు వెడల్పులు నిర్ణయించుకొంటారు. (రా. 1); 3. పర్యా. చూ. గావు. ఎరకలికత్తి (కొడవలి)లో వంపుదిరిగి పదునుగా ఉన్న భాగం. చూ. చిత్రం 118. 3. (తె. 11); 4. పర్యా. చూ. ఈతాకు. ఈతచెట్టు మట్టనుంచి తీసిన ఆకు, $\frac{1}{4}$ అంగుళం వెడల్పూ గోరుమందమూ ఉంటుంది; దీని మొదటిభాగం మధ్యభాగంకన్నా వెడల్పు తక్కువగాఉండి, కొస సన్నగా మొనదేలి ఉంటుంది; తెల్లగానూ లేత పసుపుపచ్చగానూ ఉంటుంది; మామూలుగా అంటుకొని ఉన్న రెండు పాయల్నీ విడదీసిన తరవాత ఒక పాయనుకూడా ఈతాకు అనే అంటారు. చూ. చిత్రాలు 2. 2, 115. (తె. 7, 9, 11, 19, 20; రా. 13); 5. పర్యా. రేకు (4) కొబ్బరికమ్మ పక్కంచులో సన్నగా పొడుగ్గా పెరిగే ఆకుపచ్చ భాగం; రెండు పాయలుగాఉండి మధ్యలో ఈనె ఉంటుంది; చెట్టుకు ఆకు వెనక్కి వాలి ఉన్నప్పుడు బోర్లించినట్లుండి ఈనె పైకిఉంటుంది. (కో. 20).

ఆకుచిల్లబొంగు: ఉ.—శిల్ల–; పర్యా. చూ. పూస గనుపు కర్ర. కొమ్మ నరికేసినప్పుడు కణుపువగ్గర చిన్న గుర్తుపడే వెదురుగడ; కణుపుదగ్గర పెరిగే కొమ్మ సన్నగా ఉండడంవల్ల దాన్ని నరికినప్పుడు సన్నటి గుర్తుపడుతుంది; దీన్ని చీల్చడం సులువు. (తె. 22).

ఆకుజమ్ము: వెన్ను పొడుగ్గా పెరిగే ఒకరకం జమ్ము. (రా. 6).

ఆకుత్రొరబొంగు: పర్యా. చూ. ఆకు బోలుబొంగు, కణుపుకు కణుపుకూమధ్య లోపల చాలా ఎక్కువ గుల్లగాఉండే వెదురుగడ, మామూలు లావుఉంటుంది; దీన్నుంచి పేళ్ళు తక్కువగా వస్తాయి. (కో. 7).

ఆకుపచ్చబొంగు: పర్యా. పచ్చబొంగు, పచ్చవాసం. ఆకుపచ్చరంగులో ఉండే వెదురుగడ; లేతగా ఉంటుంది. (తె. 4).

ఆకుబుట్ట: పర్యా. చూ. ఆకులగంప. తమలపాకులు తీసుకువెళ్ళే గంప; అంచుచుట్టూ కట్టు (= పెండె లేదా బొద్దు) ఉండదు. (కో. 6, 24).

ఆకుబోలు: వెదురుగడ లోపల ఎక్కువ వెడల్పుగా ఉండే ఖాళీ. (కో. 12, 13–15, 17, 18).

ఆకుబోలుకర్ర: పర్యా. చూ. ఆకుబోలు బొంగు. కణుపుకు కణుపుకూ మధ్య లోపల చాలా ఎక్కువ గుల్లగాఉండే వెదురుగడ; మామూలు లావుఉంటుంది; దీన్నుంచి పేళ్ళు తక్కువగా వస్తాయి. (కో. 12,14).

ఆకుబోలుబొంగు: పర్యా. ఆకుత్రొరబొంగు, ఆకుబోలుకర్ర, ఆకుబోలువెదురు. కణుపుకు కణుపుకూ మధ్య లోపల చాలా ఎక్కువ గుల్లగాఉండే వెదురుగడ, మామూలు లావు ఉంటుంది; దీన్నుంచి పేళ్ళు తక్కువగా వస్తాయి. (కో. 8, 9).

ఆకుబోలువెదురు: పర్యా. చూ. ఆకుబోలుబొంగు. కణుపుకు కణుపుకూ మధ్య లోపల చాలాఎక్కువ గుల్లగాఉండే వెదురుగడ; మామూలు లావు ఉంటుంది; దీన్నుంచి పేళ్ళు తక్కువగా వస్తాయి. (కో. 11).

ఆకుముల్లు: పర్యా. చూ. ఈతాకుముల్లు. ఈతాకు చివరి సూదిలాంటి మొన చూ. చిత్రం 115.4. (తె. 16).

ఆకురాయి: కొడవలినూరే ఇనపపట్టీ; గరుగ్గా ఉంటుంది. (తె. 20).

ఆకులగంప: పర్యా. ఆకుబుట్ట, ఆకులబుట్ట(1). తమలపాకులు తీసుకువెళ్ళేగంప; అంచుచుట్టూ కట్టు (= పెండె లేదా బొద్దు) ఉండదు (కో. 3; రా. 4).

ఆకులగంపవార: ఉ. —గంపోర; తమలపాకులు తీసుకువెళ్ళేగంప అల్లడానికి వాడే పేడు; వెడల్పుగా ఉంటుంది; అంతమెత్తగా ఉండదు (కో. 31).

ఆకులగుజ్జెడ: పెళ్ళిసందర్భంలో సారెసామాను పెట్టి ఇచ్చే వెదురుపేళ్ళ పెట్టె; చతురస్రాకారంగా మూరెడు పొడుగు ఉంటుంది; రెండు పొరలుగా ఉంటుంది; వెలుపలిపొర అల్లికంలో పేళ్ళమధ్య సందులు ఉంటాయి. (తె. 19).

ఆకులగుజ్జెన: 1. పర్యా. ఆకులబుట్ట(2), కరండి, కానాలబుట్ట ఇంట్లో వాడకంకోసం తమలపాకులు పెట్టుకొనే చిన్నబుట్ట; దీనికి కమాన్‌బద్ద ( పట్టుకో డానికి వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) ఉంటుంది; కొన్నిటికి మూత ఉంటుంది; పేళ్ళమధ్య సందులు (ఖానాలు) ఉంటాయి; గద్దె ఉండదు (తె. 6, 9, 10, 14); 2. తమలపాకులు పెట్టుకొనే గుండ్రటి చిన్నబుట్ట; సారెపెట్టెలో మిగతా సామానుతోపాటు ఇది కూడా పెడతారు; దీనికి కమాన్ బద్దగాని గద్దె గాని ఉండదు; చుట్టూ కళ్ళుంటాయి (తె. 8).

ఆకులపెట్టె: తమలపాకులు పెట్టుకొనే చిన్న వెదురు పేళ్ళపెట్టె; బొట్టుపెట్టెలాంటిది. (తె. 22).

ఆకులబుట్ట: ఉ. —బుట్టి; 1. పర్యా. చూ. ఆకుల గంప. తమలపాకులు తీసుకువెళ్ళేగంప; అంచు చుట్టూకట్టు (= పెండె లేదా బొద్దు) ఉండదు

(కో. 9; తె. 17); **2.** పర్యా. చూ. అకుల గుజ్జెన(1). ఇంట్లో వాడకంకోసం తమలపాకులు పెట్టుకొనే చిన్నబుట్ట; దీనికి కమాన్‌బద్ద ( పట్టుకోడానికి వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) ఉంటుంది; కొన్నిటికి మూత ఉంటుంది; పేళ్ళమధ్య సందులు (ఖానాలు) ఉంటాయి; గద్దె ఉండదు. (తె. 17, 21, 22); **3.** తమలపాకులు పెట్టుకొనే ఈతాకుల బుట్ట; పొడుగ్గా ఉంటుంది. (రా. 9).

ఆడమోకు: చిరతలు లేకుండా ఒకవేపు తాడులోనే పొటొంజి (చూ.) వచ్చేటట్లుపేనిన మోకు. (కో. 30).

ఆడికట్టె: పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరి పనికి ఉపయోగపడుతుంది. (తె. 13).

ఆడిలొద్దిబొంగు; ఆడిలొద్ది అనే లోయలో పెరిగిన వెదురు (తె. 23).

ఆది: పర్యా. చూ. ఆయం. కొలత; పరిమాణం; చేట, తడక మొ॥ అల్లడానికి ముందు కొలతలు నిర్ణయించుకొంటారు; అల్లకానికి కావలసిన పేడు చీరుకోడానికి బద్ద మొ॥ వాటిని కొలిచి చూసుకొంటారు. (కో. 2).

ఆంధ్రఎరకలి: ఉ. —ఎర్కలి; ఆంధ్రప్రాంతంలో ఉండే ఎరకలివాళ్ళు; బుట్టలు మొ॥ అల్లుతారు (తె. 28).

ఆయం: ఉ. వాయం, వాయి. రూ. ఆయి; పర్యా. ఆది, ఆత్రి, కొల. కొలత; పరిమాణం; చేట, తడక మొ॥ అల్లడానికి ముందు కొలతలు నిర్ణయించుకొంటారు; అల్లకానికి కావలసిన పేడు చీరుకోడానికి బద్ద మొ॥ వాటిని కొలిచి చూసుకొంటారు. (కో. 2, 3, 5, 6; తె. 6, 13, 18, 22; రా. 4, 5, 10).

ఆయి: చూ. ఆయం. (తె. 17, 20, 23).

ఆరగంటి: రూ. అరగంటు; వెదురుబొంగుకు రెండు కణుపులమధ్య ఎడం. చూ. చిత్రం 4.4. (కో. 19).

ఆరడ్డలగుల్ల: అరుఅడ్డల (36 కిలోల) ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 22).

ఆరాకుపట్టె: పర్యా. ఏకేరుపట్టె. ఒకఆకు తప్పించి ఒకఆకు ఎక్కిస్తూ అల్లిన ఈతాకుపట్టె. (తె. 19).

ఆరుకట్లచేట: అంచుకు ఆరుకట్లు కట్టినచేట. (కో. 10).

ఆరుకడవలగాదె: రెండుక్వింటాళ్ళ ధాన్యం పట్టే గుమ్మి. (రా. 4).

ఆరుమళ్ళగుమ్మి: ఆరుమణుగుల ధాన్యంపట్టే గాదె. (తె. 21, 22).

ఆరుమానికలగుల్ల: ఉ. —మాన్కల—; 48 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగంప. (తె. 21).

ఆరువు: దున్నేటప్పుడు భూమిలోకి దిగే నాగలికొన; మొనదేలి ఉంటుంది. (కో. 30).

ఆరె: కట్టెపిడి బిగించిన దబ్బనంలాంటి పనిముట్టు; చేట, జల్లెడ మొ॥ వాటికి కట్లుకట్టేటప్పుడు చిల్లులు పొడవడానికి వాడతారు. చూ. చిత్రం 19. (రా. 3).

ఆరెమొన: ఆరె(చూ.) కొన; సూదిలా ఉంటుంది. (రా. 3).

ఆరేయు: (< అరవేయు) (క్రి.) పర్యా. చూ. ఎండేయు. పచ్చి ఆరిపోవడానికి ఎండలోవేయడం; ఈతకమ్మలు కొట్టి ఎండలోవేస్తారు. (రా. 8).

ఆర్చి: (< ఇం. arch) పర్యా. కమాన్(2). వీధికి అడ్డంగా గాని ఇంటి సింహద్వారం ముందుగాని తోరణాలు కట్టడానికి విలుపంపుగా వెదురుబద్దలతో కట్టినచట్రం. చూ చిత్రం 111. (తె. 14; రా. 8).

ఆర్టినరీబొంగు: ఉ. అర్టెనరీ. ఆర్డనర్. ఆర్డనరీ; పర్యా. చూ. తర్డ్‌క్లాస్‌బొంగు. దాదాపు 8 సెం. మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ; చింతకాయలు రాలగొట్టడానికీ అంపర్ల తయారీకీ పనికొస్తుంది; పేడుచీయడానికి పనికిరాదు. (తె. 17–19, 24)

ఆత్రి: పర్యా. చూ. ఆయం. కొలత, పరిమాణం; చేట, తడక మొ॥ అల్లడానికి ముందు కొలతలు నిర్ణయించుకొంటారు; అల్లడానికి కావలసిన పేడు చీరుకోడానికి బద్ద మొ॥ వాటిని కొలిచి చూసుకొంటారు. (రా. 6).

ఆసామి: పర్యా. శేట్. వెదురుగడల వ్యాపారి. (కో. 7; రా. 4).

ఆసు: కొడప మూతిభాగంలో లోపల ఆసులగుండుకు మధ్యభాగంలో అమర్చిన పుల్లలకూరుని; పుల్లల కొస ఒకటి గుండుకూ మరొకకొస మూతిమధ్యకూ ఉండి పుల్లలన్నీ ఎదురు బదురుగా ఉంటాయి; వీటిమధ్య నుంచి చేప లోపలికి దూరేటప్పుడు ఇవి అడ్డంరావు; కాని చేప తిరిగిబయటికి పోకుండా అడ్డుకుంటాయి. (కో. 4).

ఆసుగా: (క్రి. విశ). పర్యా. సాపుగా. నున్నగా; వెదురుపేడు చెక్కడానికి సంబంధించిన వాడుక. (రా. 1).

ఆసుగుండు: పర్యా. పిర్రగుండు. కొడమ. (చూ.) అడుగుభాగంలో వృత్తాకారంలో అమర్చిన వెదురు బద్ద. చూ. చిత్రం 73 క. 5. (కో. 2).

ఆసులగుండు: కొడమ తయారీలో మూతిభాగం

లోపల ఆసు. (చూ.) దగ్గరచుట్టూ వృత్తాకారంలో అమర్చిన వెదురుబద్ద (గుండు); దీనికే ఆసు అమర్చి ఉంటుంది; ఆసూ గుండూ కలిపి చేవలు లోపలికి పోవడానికి వీలుగా కడతారు. చూ. చిత్రం 73 క 4. (కో. 4).

## ఇ

ఇగ్గు: (క్రి.) పర్యా. గుంజు². లాగడం; చేట, జల్లెడ మొ॥ వాటికి కట్టుముంగుతో కట్టుగట్టేటప్పుడు ముడి వేస్తూ లాగుతారు. (తె. 2, 24; రా. 4).

ఇంగలం: ఉ. ఇంగులం, యింగలం, నిప్పు. (తె.15).

ఇంగలంముట్టి: (< ఇంగలం + ఉట్టి). ఉ. ఇంగుల ముట్టి; పర్యా. ఉట్టి (2). కుంపటి, తిక్కడి (2) శ్మశానానికి నిప్పుల (ఇంగలం) కుండ తీసుకు వెళ్ళడానికి వెదురుబద్దలతో కట్టిన చట్రం; ఉట్టి మాదిరిగా, పట్టుకోడానికి బద్దలకు తాళ్ళుకడతారు. (చట్రంమీద కుండ పెడతారు). చూ. చిత్రం 99). (తె. 15).

ఇంజు: (క్రి.) గుంజడం, లాగడం. (రా. 6).

ఇంటిపండుగ: ఉ. యిటిం ; గడబవాళ్ళు మామిడి పళ్ళు పండినప్పుడు చేసుకొనే పండుగ. (కో. 24).

ఇంటికప్పుబద్ద: ఇళ్ళకు కప్పే బెంగుళూరు పెంకుకు ఆధారంగాపరిచే వెదురుబద్ద. (తె. 10).

ఇద్దుంగుమ్మి: రెండుతూముల (ఇద్దుం) ధాన్యంపట్టే గాదె. (తె. 21).

ఇనపకట్టు: పర్యా. చూ. పొన్ను (1). మేదరికత్తి, చురకత్తి, మచ్చుకత్తి, ఉలి మొ॥ వాటి కట్టెపిడి పగలకుండా పిడిచుట్టూ బిగించిన ఇనపరేకు. చూ. చిత్రాలు 12 ట. 2; 16 ప. 2. (కో. 28).

ఇనపకడ్డీ: చాప నేతమగ్గానికి దోణిమొద్దు (దోని మాను) బిగించే పొడుగాటి ఇనపచువ్వ; దీనికి నిలుపు (పడుగు) పోగుల కొసలు కడతారు. (రా. 6).

ఇనపపట్టీ: పేముబెత్తాన్ని వంచే మొద్దు పగలకుండా వెజ్జానికిపేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 134. 2. (తె. 22).

ఇనపపుల్ల: చాప నేతమగ్గంపలకకు అడ్డంగాపెట్టిన చిన్న ఇనపచువ్వ. (రా. 6).

ఇమాలం: (< విమానం). పర్యా. చూ. పాడె. శవాన్ని శ్మశానానికి తీసుకవెళ్ళడానికి వెదురుగడలతో కట్టిన సాధనం. చూ. చిత్రం 100. (తె. 10).

ఇరవైపట్టెలచాప: ఉ. యిర్వయిబట్టెల సాప; ఇరవై ఈతాకుపట్టె (చూ.)లను పక్కపక్కగా చేర్చి కుట్టిన ఈతచాప. (తె. 19, 21, 22).

ఇరవైముంతలగంప: ఇరవైముంత (ఒక కొలత)ల ధాన్యంపట్టే వెదురుగంప. (రా. 4).

ఇరసగంప: ఉ. ఇ:స ; 1 పర్యా. చూ. గంప (5). ఈతచువ్వలతో అల్లిన గంప; గుల్లకన్న పెద్దది; ధాన్యం పోసుకోడానికీ ఎరువు చేరవేయడానికీ వాడతారు. (కో. 3); 2. ఇరస (= ఎనిమిది మానికెల) ధాన్యంపట్టే ఈత గంప. (తె. 11); 3. ఆరడ్డల (36 కిలోల) ధాన్యంపట్టే గంప. (తె. 22).

ఇరసగుల్ల: ఉ. ఇర్స—; ఒక ఇరస (13 కిలోల) ధాన్యంపట్టే గుల్ల. (తె. 25).

ఇరిగిడి: ఉ. యిరిగిడి, పర్యా. ఇరుపురి. లావుతాడు పేనేటప్పుడు వచ్చే రెండుపాయల పురి. (కో. 23).

ఇరించు: (క్రి.) ఉ. యిరించు; కులం వాళ్ళంతా కలిసి తప్పు చేసినవాణ్ణి నిలదీసి అడగడం. (కో. 24).

ఇరించేయు: (క్రి.) వెదురుగడ, పొదలో చిక్కకోడం; ఇలా చిక్కుకొంటే గడ పెరగదు. (కో. 24).

ఇరుకు: (తుంగ, జమ్ము) చాపనేతలో ఒకచాప నేసినతరవాత మరో చాపనేత మొదలుపెట్టడానికి రెంటికీమధ్య వదిలిన సందు; నాలుగు మూరలకొక ఇరుకు ఉంటుంది. (రా. 4).

ఇరుపురి. ఉ. ఇరువురి; పర్యా. ఇరిగిడి. లావుతాడు పేనేటప్పుడు వచ్చే రెండుపాయల పురి. (తె. 9; రా. 5).

ఇలారం: ఉ. యిలారం; 1. పర్యా. గాదె (3). రెండు పుట్లనుంచి (పుట్టి ఆరు క్వింటాళ్ళు) ఇరవై పుట్లదాకా ధాన్యం నిలవ ఉంచుకొనే పెద్ద గుమ్మి (చూ. గుమ్మి); ఇంటి ముందుగాని ఇంటి ఆవరణలోగాని అరుగుమీదగాని స్థిరంగా ఉండేటట్లు అల్లుతారు; పుల్చేరుకట్టె, వావిలికట్టె, గువ్వదాడు కట్టె మొ॥వాటితో దీన్ని అల్లుతారు; కొప్పులాగా దీనికి కప్పు ఉంటుంది. (తె. 9); 2 గుమ్మి (చూ.) మీద ఈత చువ్వలతోను గడ్డితోను వేసిన కప్పు; పైకి కోసుగా శిఖరంలా తేలుతుంది. చూ. చిత్రం 74 ప. 4. (తె. 7).

ఇల్లారి: ఇంటిగవాక్షి ( మిద్దెమీదికంత) మీద కప్పే మూత. చూ. చిత్రం 75. (రా. 8).

ఇవ్వడం తివ్వడం: పర్యా. వియ్యంపొత్తు. (పెళ్ళి

సంబంధాల్లో) ఆడపిల్లలను ఇచ్చిపుచ్చుకోడాలు; వియ్యమందడం; పెళ్ళి సంబంధం కలుపుకొనే అనుకూలత. (రా. 1).

ఇసకజల్లెడ: ఉ. జల్లెడి; ఇసక జల్లించుకోడానికి మూరెడు బెత్తెడు వెడల్పుపెట్టి అల్లినజల్లెడ. (కో. 24).

ఇసరం: (< సం. విసరం). ఉ. ఇసిరం, ఇస్రం; విశాలం (తె. 1, 4).

ఇసికజల్లు: ఇసకపోసుకు రావడానికి బండిమీద వేసే జల. (కో. 15).

ఇస్తవతాడు: పడవలు కట్టడానికి వాడే కొబ్బరితాడు. (కో. 21).

## ఈ

ఈక: పర్యా. చూ. రెప్ప. ఈతచాపకు వెనకవైపు కనిపించే అకు మొదటిభాగం. చూ. చిత్రం 122 క. (తె. 22).

ఈటె: ఈటెగా చేసిన వెదురుకర్ర. (కో. 9).

ఈతకట్టె: పర్యా. చూ. ఈతబరిగె. ఈతచెట్టు మట్టచీరి తీసినచువ్వ (బరిగె); సుమారు గజంనుంచి గజంన్నర వరకు పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉంటుంది; దీంతో గుమ్మలు, గంపలు బండి జల్లలు, తట్టలు మొ॥ అల్లుతారు. చూ. చిత్రం 11. (తె. 9, 13, 16).

ఈతకమ్మ: పర్యా. ఈతమట్ట (1), సుడిమట్ట. ఈతచెట్టు కాండానికి (బోదె) అంటుకొని ఉన్నచోటినుంచి చివరివరకు రెండువేపులా అకులు పెరిగిన కట్టె, (బరిగె); మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. చూ. చిత్రాలు 2.1, 10. (కో. 19, 25; తె. 7, 11, 13, 16, 26).

ఈతచాప: ఉ. యీత్యాప. ఈతాకుతో అల్లిన చాప; ఒకవైపే నున్నగా ఉంటుంది. చూ. చిత్రం 122. (తె. 19, 21, 22, 26; రా. 8).

ఈతచువ్వ: పర్యా. చూ. ఈతబరిగె. ఈతచెట్టు మట్ట చీరి తీసినచువ్వ (బరిగె); సుమారు గజంనుంచి గజంన్నర వరకు పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉంటుంది; దీంతో గుమ్మలు, గంపలు, బండి జల్లలు తట్టలు మొ॥ అల్లుతారు. చూ. చిత్రం 11. (తె. 7, 9).

ఈత(చెట్టు): ఉ. యీతసెట్టు; రూ. ఈదు. కొబ్బరిచెట్టు ఆకారంలో ఉండే ఒకరకం చెట్టు; ఎత్తు తక్కువ; దీని కాండంచుట్టూ కొయ్యలుంటాయి; తలచుట్టూ మట్టలుంటాయి; కమ్మకు రెండువేపులా వేలెడు వెడల్పు అకులు ఉంటాయి; అకుకొనక ముల్లుంటుంది; చాపలు మొ॥ అల్లడానికి పనికొస్తాయి; ఈ చెట్టుకు కల్లు పారుతుంది; మట్టల నుంచి నార తియ్యవచ్చు; Date Palm, Wild Date Tree, Phoenix Sylvestris, Roxb. చూ. చిత్రం 2. (కో; తె; రా).

ఈతపిల్ల: పర్యా. లేతచెట్టు. పెరుగుతున్న లేత ఈత చెట్టు. (తె. 11).

ఈతపుల్లెరకలి: ఉ. పుల్లెర్కలి, పర్యా. చూ. ఈతెరకలి. ఈత బరిగెలతోనూ అకులతోనూ బుట్టలూ చాపలూ మొ॥ అల్లి జీవించే ఎరకలివాళ్ళు. (కో. 4).

ఈతపోట్టె: చేట మొ॥వాటికి కట్లు కట్టడానికి ఈత బరిగెనుంచి తీసినపేడు. (తె. 7, 8).

ఈతపోరక: ఈతమట్టల్ని రెండుపాయలుగా పొడుగ్గా చీల్చి మొదళ్ళు విరిచేసి కట్టిన చీపురు. చూ. చిత్రం 142. (తె. 9).

ఈతబరిగె: ఉ. -బర్గె, బర్రిగె; రూ. ఈతబర్ర-. పర్యా. ఈతకట్టె, ఈతచువ్వ, ఈతరువ్వ. ఈతచెట్టు మట్టచీరి తీసిన చువ్వ (బరిగె); సుమారు గజంనుంచి గజంన్నర వరకు పొడుగూ చిటికెన వేలెడులావూ ఉంటుంది; దీంతో గుమ్మలు, గంపలు, బండి జల్లలు, తట్టలు మొ॥ అల్లుతారు. చూ. చిత్రం 11. (తె. 11, 14).

ఈతబర్ర: చూ. ఈతబరిగె. (రా. 8, 9).

ఈతమట్ట: 1. రూ. ఈతమండ; పర్యా. చూ. ఈతకమ్మ. ఈతచెట్టు కాండానికి (బోదె) అంటుకొని ఉన్నచోటి నుంచి చివరివరకు రెండువేపులా అకులు పెరిగినకట్టె (బరిగె); మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. చూ. చిత్రం 2.1, 10. (తె. 14, 19, 20, 22, 26); 2 పర్యా. కొయ్య (7), జెగ్గ, మొట్టె (2). ఈతచెట్టు కాండానికి (బోదె) అంటుకొని ఉన్న కమ్మ మొదటి భాగం; రెండుమూడు వేళ్ళ వెడల్పూ వేలెడు మందమూ ఉంటుంది; మొదట వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; నరికినప్పుడు కొన్ని చోట్ల చెట్టుకే మిగిలిపోతుంది. చూ. చిత్రం 10). (కో. 3, 19, 25; తె. 20).

ఈతమండ: చూ. ఈతమట్ట (1) (కో. 3; తె. 9).

ఈతమాను: పర్యా. చూ. పెద్దీతచెట్టు. లావుగా పొడుగ్గా పెరిగే ఈతచెట్టు. (రా. 8).

**ఈతరువ్వ:** పర్యా. చూ. ఈతబరిగె. ఈతచెట్టుమట్ట చీరి తీసిన చువ్వ (బరిగె); సుమారు గజంనుంచి గజంన్నర వరకు పొడుగూ చిటికెనవేలెడు లావు ఉంటుంది; దీంతో గుమ్మలు, గంపలు, బండిజల్లలు, తట్టలు మొ॥ అల్లుతారు. చూ. చిత్రం 11. (కో. 11).

**ఈతలెరకలి:** ఉ. —ఎర్కలి; పర్యా. చూ. ఈతెరకలి. ఈతబరిగెలతోనూ ఆకులతోనూ బుట్టలూ చాపలూ మొ॥ అల్లి జీవించే ఎరకలివాళ్ళు. (రా. 8).

**ఈతాకు:** ఉ. యీతాకు; పర్యా. ఆకు(4), కమ్మ(3), రేకు(5). ఈతచెట్టుమట్ట నుంచితీసిన ఆకు; ½అంగుళం వెడల్పూ గోరుమందమూ ఉంటుంది; దీని మొదటిభాగం మధ్యభాగంకన్నా వెడల్పు తక్కువగాఉండి, కొససన్నగా మొనదేలి ఉంటుంది; తెల్లగానూ లేతపసుపుపచ్చగానూ ఉంటుంది; మామూలుగా అంటుకొని ఉన్న రెండుపాయల్నీ విడదీసిన తరవాత ఒకపాయకు కూడా ఈతాకు అనే అంటారు. చూ. చిత్రాలు 2.2, 115. (తె. 7, 9, 11, 13, 19, 22; రా. 8, 9).

**ఈతాకుముల్లు:** పర్యా. ఆకుముల్లు, ముల్లు(4). ఈతాకుచివరి సూదిలాటి మొన చూ. చిత్రం 115.4. (రా. 8).

**ఈతెరకలి:** ఉ. ఈతెర్కలి; పర్యా. ఈతపుల్లెరకలి, ఈతలెరకలి. ఈతబరిగెలతోనూ ఆకులతోనూ బుట్టలూ, చాపలూ మొ॥ అల్లి జీవించే ఎరకలివాళ్ళు (తె. 1).

**దు:** చూ. ఈత (చెట్టు) (తె. 9).

**దులనిచ్చెన:** ఉ. యీదుల—; కల్లుతీసేవాళ్ళు ఈతచెట్టు ఎక్కడానికి వేసుకొనే నిచ్చెన; మిద్దెల నిచ్చెనకన్న చిన్నది; నిలువుగడలూ మెట్లూసన్నగా, పొట్టిగా ఉంటాయి; మోసుకుపోవడానికి వీలుగా బరువుతక్కువ ఉంటుంది (తె. 17; రా. 8).

**నె:** ఉ. ఈన, యీన, యీని, యీనె, వీన;1. రూ. యానె, యేన; పర్యా. చూ. పేడు(1). వెదురుబద్ద సన్నగా చీలిస్తేవచ్చేపాయ; సుమారు చిటికెనవేలెడు వెడల్పూ గోరంత మందమూ గజంన్నర పొడుగూ ఉంటుంది; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి వాడతారు; అల్లేవస్తువునుబట్టి దీని పొడుగు వెడల్పులు నిర్ణయించుకొంటారు. (కో. 20, 23-25, 27-31); 2. రూ. ఈనేం; పర్యా. చూ. సన్న(ం)పేడు. వెడల్పు చాలాతక్కువగా ఉన్న వెదురుపేడు; కొన్నిచోట్ల చాలాపలచగా ఉన్నది. (తె. 1, 2; రా. 5). 3. పర్యా. చూ. కర్ర(3). గోవ (వార) నుంచి పొడుగ్గా తీగలావచ్చేటట్టు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది: పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువుల చుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ.1. (కో. 1, 3-5, 7, 8, 10, 12, 13, 15, 16, 18; తె. 20); 4. పర్యా. చూ. చుట్టుకర్ర. గంప, బుట్ట, తట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తుభాగం అల్లడానికివాడే కర్ర (చూ.); పేడువెడల్పులో సగముంటుంది. పేడుకన్నా మందంగా ఉంటుంది. (రా. 3, 4); 5 పర్యా. చూ. తడకపేడు. తడకఅల్లడానికి వెదురుబద్ద చీరితీసినపేడు; వెడల్పుగానూ (= రెండు వేళ్ళపాటి) మందంగానూ ఉంటుంది. (కో. 19, 26); 6. పర్యా. చూ. అడ్డం. తడక, బండి జల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చెంద్రిక మొ॥వాటి నిలువులచుట్టూ అడ్డంగాఅల్లే మందంపేడు లేదా పలచటిబద్ద; మామూలు పేడుకన్న మందగానూ వెడల్పుగానూ ఉంటుంది. (కో. 20, 25, 31); 7. పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకంపనికోకట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పూ కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకుపల్లంగా ఉండేభాగం నుంచి చీల్చి తీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (కో. 17); 8. పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొడ్డడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండుభాగాలుగా నిలువుగా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. (తె. 31; రా. 3); 9. ఈతకమ్మ వెన్ను చీరితీసిన సన్నటితీగలాంటి భాగం; బుట్టలల్లడానికి పనికొస్తుంది. (కో. 3; రా. 8); 10. ఈత, తాటి, కొబ్బరి ఆకుల రేకులు ఒకదాన్నొకటి అంటుకొని ఉండేచోట పొడుగ్గా సన్నటితీగలా ఉండేపుల్ల; చెట్టున ఉన్నప్పుడు పైవైపు పొట్ట, కిందివైపు ఈనె ఉంటాయి. (కో. 12, 19-23, 26; తె. 19 22, 26); 11. పర్యా. చూ. రెప్ప. ఈతచాపకు వెనకవైపు కనిపించే ఆకుమొదటిభాగం. చూ. చిత్రం 122.3. (రా. 9).

**ఈనెకట్టు:** ఉ. యీనె షార్కబుట్ట (చూ.)కు

మధ్యభాగంలో ఒకే ఈనెతో పలచగావేసిన కట్టు. చూ. చిత్రం 49 1. (కో. 24).

ఈనెకర్రలబియ్యం: గోధుమల్లా ఉండే వెదురు ధాన్యం. (కో. 24).

ఈనెజేబు: వెదురు ఈనెలతో అల్లిన జేబు; చూ. జేంపు. (కో. 10).

ఈనెబుట్ట: వెదురు ఈనెలతోగాని, తాటి ఈనెలతో గాని అల్లినబుట్ట. (కో. 9, 12).

ఈనెబొద్దు: గంప మొ॥ వాటికి మూతి మొ॥ చోట్ల కర్ర (ఈనె)తో గట్టిగా, చిక్కగా అల్లిన ఉబ్బెత్తు భాగం. (కో. 8).

ఈనెలాగు. (క్రి.) ఉ. ఈన ; వెదురుబద్ద చీరి కర్ర (=సన్నటి తీగలాంటిది) తియ్యడం. (కో. 12).

ఈనెవెదురు: ఉ. యీనెదురు. కణుపులమధ్య మూరెడు కన్న ఎక్కువ ఎడముండి లావుగా ఉండే వెదురు గడ; మామూలుగా బోలుగాఉండి కండ తక్కువ ఉండటంవల్లా వంకలు వంకలుగా ఉండటంవల్లా ఇది మేదరిపనికి ఉపయోగపడదు, ఇంటివాసాలకూ కంచెలకూ వాడతారు. (కో. 23-25).

ఈనేం: చూ. ఈనె (2). (తె. 29).

ఈప్తి: ఉ. ఈప్తె; చూ. విబూది. (తె. 5, 19).

ఈబు: చూ. విబూది. (తె. 12).

ఈర్పెనవిసనగర్ర: ఉ. యీర్పెన ఇసనగర్ర. ఈర్పెన (=ఈళ్ళుతీసే దువ్వెన)లాంటి డిజైనువచ్చే విసన గర్ర. (తె. 18).

## ఉ

ఉగ్గండబ్బ: ఉ.—డబ్బ; పర్యా.చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచికట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 6).

ఉగ్గం: పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచి కట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించ డానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి)మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (కో. 29; తె. 22, 24).

ఉగ్గి: ఉ. వుగ్గి. వెదురుబద్దతో గుండ్రంగా వంచిచేసిన రింగు; చేటకు అంచుకట్టేటప్పుడు అంచుచుట్టూ బద్దలు (లోపలినుంచి వెలుపలినుంచి) పెట్టి కొమ్ము వేపుబద్దలు అంచుకుపట్టుకొని ఉండేటట్లు దీన్ని చేట ముందలిభాగంలో తొడుగుతారు. (కో. 28).

ఉంగరం: కమ్మకత్తి (చూ.)ని వెదురుగడకు బిగించి ఉంచడానికి రెంటికీకలిపి తొడిగిన ఇనపచుట్టు. చూ. చిత్రం 14 క. 3.

ఉట్టి: ఉ. వుట్టి. 1. చిలక్కొయ్య, దూలం మొ॥ వాటికి వేలాడదీసే చిక్కం; సుమారు గజంపొడుగు తాళ్ళు మూడు చక్రంలా అల్లినమట్టుకు కలిపి ఉంటాయి; పైనించి దీన్ని దూలానికి వేలాడదీసి లోపల కుండలు, పాత్రలు పెట్టుకుంటారు. చూ. చిత్రం 146. (కో. 20, 25, 29; రా. 4, 5); 2. పర్యా. చూ. ఇంగలముట్టి. శ్మశానానికి నిప్పుల (ఇంగలం) కుండ తీసుకువెళ్ళడానికి వెదురుబద్దలతో కట్టిన చట్రం; ఉట్టిమాదిరిగా పట్టుకోడానికి బద్దలకు తాళ్ళు కడతారు (చట్రంమీద కుండపెడతారు). చూ. చిత్రం 99. (తె. 10); 3. అనిపోగులు దూర్చడానికి ఉట్లకర్ర (చూ.)కు వేసిన దారపుముడి. (రా. 4).

ఉట్లకట్టె: పర్యా. చూ. అనికర్ర. చాప నేతమగ్గంలో ఒక అని (=ఒకటివిడిచి ఒకటిగాఉండే పోగుల వరస)ని అదిమిపట్టి ఉంచే గజంపొడుగు కర్ర; ఇది ముక్కాలి కర్రలకు (=గుడిసెమాదిరిగా నిలబెట్టిఉన్న మూడు కర్రలు) వేలాడదీసిఉంటుంది; దీనికి పొడుగునా ఉండే దారాల కొలుకుల్లోంచి ఒక వరస అనిపోగులు దూర్చి ఒకచివర ఎగదండుకూ ఇంకోచివర దిగదండుకూ కడతారు; ఈ అనికర్రను కిందికి దింపినప్పుడు ఒకవరస అనిపోగులు కిందికి వచ్చి ఒకవరస అనిపోగులు పైకిలేస్తాయి; అప్పుడా పోగులమధ్య తుంగపోచను దూరుస్తారు. చూ. చిత్రం 120 క. 4. (రా. 4).

ఉట్లకర్ర: పర్యా. చూ. అనికర్ర. చాపనేతమగ్గంలో ఒకఅనిని (చూ. అని(10) )అదిమిపట్టి ఉంచే గజం పొడుగు కర్ర; ఇది ముక్కాల కర్రలకు (=గుడిసెమాదిరిగా నిలబెట్టి ఉన్న మూడుకర్రలు) వేలాడదీసి ఉంటుంది; దీనికి పొడుగునా ఉండే దారాల కొలుకుల్లోంచి ఒకవరస అనిపోగులు దూర్చి ఒక చివర ఎగదండుకూ ఇంకోచివర దిగదండుకూ కడతారు; ఈ అనికర్రను కిందికి దింపినప్పుడు ఒకవరస అనిపోగులు కిందికివచ్చి ఒకవరస అనిపోగులు పైకిలేస్తాయి; అప్పుడా పోగులమధ్య తుంగపోచ దూర్చి మళ్ళీ అనిమార్చి మరో తుంగ పోచను దూరుస్తారు. చూ. చిత్రం 120 క. 4.

(కో. 3).

ఉద్ద: నాలుగు వెదురుబద్దల లెక్క. (కో. 6).

ఉండ. ఉ వుంట 1. పర్యా. పిడిస్తి, బింప. కొబ్బరి తాడుచుట్ట; బంతిలా గుండ్రంగా గాని నూరెడు పొడుగైన చక్రంలాగాని చుట్టినది (కో. 5, 19, 29); 2 పర్యా. కండె కంబిండసారసేవి పొడుగ్గా గాని గుండ్రంగాగాని చుట్టినవి. (కో. 3; రా. 6).

ఉద్ది: బండచక్రం. (కో. 30).

ఉప్పరతట్ట: పర్యా. అంపె(2); ఉప్పరపట్టిక, తాపీ సూనె, మట్టితట్ట(2). ఇళ్ళు కట్టేటప్పుడు ఇసుకా సిమెంటూ మొ॥ మోయడానికి వాడేతట్ట; ఇనప పెంకె ఆకారంలో ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి గిన్నెమాదిరిగా ఉంటుంది. (కో. 25).

ఉప్పరపట్టిక పర్యా. చూ. ఉప్పరతట్ట. ఇళ్ళుకట్టుబడి పనిలో ఇసుకా సిమెంటూ మొ॥ మోయడానికి వాడేతట్ట; ఇనపపెంకె ఆకారంలో ఉంటుంది; కొనిచోట్ల అడుగు సమతలంగా ఉండి గిన్నె మాదిరిగా ఉంటుంది. (కో. 12).

ఉప్పలం: వెదురుమొక్కకు సోకే ఒకతెగులు; గడ ఎండిపోతుంది. (కో. 7).

ఉప్పుతుంగ ఉప్పువాగుల్లోనూ సముద్రతీరంలోనూ పెరిగేతుంగ; నమిలితే ఉప్పగా ఉంటుంది; మధ్యలో నిలువునా బోలుగా ఉంటుంది; దీన్ని చీల్చకుండానే చాపలునేస్తారు; ఇళ్ళు కప్పడానికి కూడా పనికొస్తుంది. (కో. 3).

ఉప్పుబుట్ట: ఉ. —బుట్టి. ఉప్పుపోసి పెట్టుకోడానికి అల్లిన చిన్న వెదురుపేళ్ళబుట్ట. (కో. 4, 28; తె. 8).

ఉప్పెరకలి: ఉ. ఉప్పెర్కలి. ఉప్పుపండించి అమ్మే ఎరకలివాళ్ళు; ఒకతెగ. (కో. 4).

ఉయ్యాల: పర్యా. ఉయ్యాలతట్ట, ఉయ్యాలతొట్టె, ఉయ్యాలపెట్టె, తొట్టె. పసిపిల్లల్ని పడుకోబెట్టి ఊపేది; వెదురుపేళ్ళతోగాని ఈతచువ్వలతోగాని పేముతోగాని అల్లుతారు. చూ. చిత్రం 44. (కో. 3-7, 8, 11, 31; రా. 4).

ఉయ్యాలఖానా: ఉ. —ఖాన; పర్యా. చూ. ఖానా(5) ఉయ్యాల అల్లకంలో అడుగుభాగంలోనూ పక్కలా బద్దలమధ్య వచ్చినసందు; గడి. (రా. 11).

ఉయ్యాలతట్ట: ఉ. వుయ్యాల—, పర్యా. చూ. ఉయ్యాల. పసిపిల్లల్ని పడుకోబెట్టి ఊపేది; వెదురు పేళ్ళతోగాని ఈతచువ్వలతోగాని పేముతోగాని అల్లుతారు. చూ. చిత్రం 44. (కో. 31).

ఉయ్యాలతొట్టె: ఉ. తొట్టి; బ. ఉయ్యాలతొట్టెలు; పర్యా. చూ. ఉయ్యాల. పసిపిల్లల్ని పడుకోబెట్టి ఊపేది: వెదురుపేళ్ళతోగాని ఈతచువ్వలతోగాని పేముతోగాని అల్లుతారు. చూ. చిత్రం 44. (కో. 3, 10, 11, 15; తె. 7, 27, 30, 31; రా. 3).

ఉయ్యాలతొట్టెలు: చూ. ఉయ్యాలతొట్టె (తె. 6-9, 14).

ఉయ్యాలపెట్టె పర్యా. చూ. ఉయ్యాల పసిపిల్లల్ని పడుకోబెట్టి ఊపేది వెదురుపేళ్ళతోగాని ఈత చువ్వలతోగాని పేముతోగాని అల్లుతారు. చూ. చిత్రం 44. (కో. 4, 5).

ఉయ్యాలమంచం పేముతో తయారుచేసిన చదరపు బల్ల; కూర్చొని ఉయ్యాల ఊగుతారు. (తె. 22).

ఉలి: పర్యా. చీ ౖం. సుమారు రెండువేళ్ళ వెడల్పు చిటికెనవేలుకన్న తక్కువ మందమూ రెండుజెత్తల పొడుగూ ఉండే ఇనపకమ్మికి ఒక వేపకొయ్య పిడి అమర్చిఉన్న పనిముట్టు; కొన్నిటికి పిడి ఉండదు; వెడల్పుగా ఉన్న వేపు పదునుంటుంది; వీటిలో పెద్దవీ చిన్నవీ ఉంటాయి; వెదురుగడలతో నిచ్చెనలూ మంచాలూ మొ॥ చేసేటప్పుడు గడకు చిల్లిచెయ్యడానికి మేదరివాళ్ళు వాడతారు. చూ. చిత్రాలు 20. క, చ. (కో. 29; తె. 6, 15, 17, 19, 31; రా. 5, 6).

ఉలివాయి: ఉ. వులి—, ఉలికి పదునున్న భాగం; చిల్లి చేసేటప్పుడు కట్టెలోకి దిగేది (తె. 15).

ఉల్లారు: (క్రి.) పూర్తిగా ఎండడం. (తె. 23).

ఉల్లిగడ్డలబుట్ట: ఉ.- బుట్టి. ఉల్లిగడ్డలు పెట్టుకోడానికి జాలీలు జాలీలుగా అల్లిన వెదురుపేళ్ళ బుట్ట. (తె. 28).

ఉల్వడి: బియ్యం గాలించే గుల్ల; కింద కోసుగా సన్నగాఉండి పోనుపోను పైన వెడల్పు అవుతుంది. చూ. చిత్రం 84. (తె. 25).

ఉళ్ళుకట్టు: (< ? ఉరులకట్టు). తుంగచాప నేతలో నిలువు (పడుగు) పోగులను దూర్చడానికి కొలుకులుగా తీర్చిన దారాలు. (రా. 2).

ఊ

ఊకగంప: ఉ. ఊగ్గంప. పర్యా. ఊకతట్ట, జల్లగంప, పొట్టుగంప (1), పొట్టుజల్ల (2). వరిపొట్టు (ఊక) మోసుకుపోవడానికీ పశువులకు మేతగాపెట్టే ఉలవల పొట్టూ సెనగపొట్టూ మొ॥ మోసుకుపోవడానికీ

వాడే పెద్ద గంప. (కో. 15, 17, 18).

ఊకజల్ల: పర్యా. పొట్టుజల్ల (1). పొట్టు (ఊక) రవాణాచేసే బండిమీద పరవడానికి అల్లిన జల్ల. (కో. 10, 13, 15, 17; తె. 31).

ఊకతట్ట: పర్యా. చూ. ఊకగంప. వరిపొట్టు (ఊక) మోసుకుపోవడానికీ పశువులకు మేతగాపెట్టే ఉలవల పొట్టూ సెనగపొట్టూ మొ॥ మోసుకుపోవడానికీ వాడే పెద్ద గంప. (కో. 19).

ఊచ: ఉ. ఊస; 1 పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 22, 23). 2. అంబు (చూ.) కాడ. (కో. 10).

ఊచగా: (క్రి. విశ.). ఉ. ఊసగ. సన్నగా; వెదురు గడ సన్నగా ఉన్నప్పుడు ఇలా ఉంటారు. (కో. 1).

ఊచతల: ఉ. ఊస; పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం (కాడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (తె. 22).

ఊచమడిమె: ఉ. ఊస –; పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడ మాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (తె. 28).

ఊడుగుకట్టె: ఉ. ఊడుగ్గట్టె. పర్యా. చూ. ఊడుగు బరిగె. ఊడుగుపొద నుంచి తీసిన చువ్వ (బరిగె); గచ్చకాయ రంగులో ఉంటుంది; దీని ఆకు మూడు వేళ్ళ వెడల్పున వేలెడు పొడుగ్గా ఉంటుంది; ఈ చువ్వను మట్టితట్టలు, పశువుల మేతజల్ల (సొమ్ముల కొల్లం) మొ॥ అల్లడానికి వాడతారు. (తె. 14).

ఊడుగుబరిగె: ఉ. ఊడుగ్—; పర్యా. ఊడుగుకట్టె; ఊడుగురువ్వ. ఊడుగు పొదనుంచి తీసిన చువ్వ (బరిగె); గచ్చకాయ రంగులో ఉంటుంది; దీని ఆకు మూడువేళ్ళ వెడల్పున వేలెడు పొడుగ్గా ఉంటుంది; ఈ చువ్వను మట్టితట్టలు, పశువుల మేతజల్ల (సొమ్ముల కొల్లం) మొ॥ అల్లడానికి వాడతారు. (తె. 14).

ఊడుగురువ్వ: పర్యా. చూ. ఊడుగుబరిగె. ఊడుగు పొదనుంచి తీసినచువ్వ (బరిగె); గచ్చకాయ రంగులో ఉంటుంది; దీని ఆకు మూడువేళ్ళ వెడల్పున వేలెడు పొడుగ్గా ఉంటుంది; ఈ చువ్వను మట్టితట్టలు, పశువుల మేతజల్ల (సొమ్ములకొల్లం) మొ॥ అల్లడానికి వాడతారు. (కో. 25).

ఊత: 1. పర్యా. చూ. కోళ్ళగూడు (1). కోళ్ళను కమ్మడానికి (మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచు భాగంవేపు కమ్మతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి మధ్యనుంచి సన్నటి భాగంవేపు మొత్తం గళ్ళు గళ్ళుగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు. చూ. చిత్రాలు 65 క. ప. (తె. 30). 2. పర్యా. చూ. చేపలబుట్ట (2). చెరువు మొ॥చోట్ల చేపలుపట్టి వేసుకొనే ఊతబుట్ట; కింద వెడల్పుగా ఉండి మూతి సన్నగా ఉంటుంది. (తె. 16).

ఊదివి: పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (తె. 23).

ఊదుగొయ్య: పర్యా. చూ. ఊదురుగొట్టం. పొయ్యి ఊదుకోడానికి లోపల బోలుగా ఉన్న వెదురు గొట్టం. (తె. 28).

ఊదుడుగొట్టం: పర్యా. ఊదుగొయ్య, గొట్టం (2). పుక్కిగొట్టం, వెదురుగొట్టం (2). పొయ్యి ఊదుకోడానికి లోపల బోలుగా ఉన్న వెదురుగొట్టం. (తె. 6).

ఊదుబత్తిపుల్ల: పర్యా. అగరుబత్తిపుల్ల. అగరొత్తి తయారుచేయడానికి వాడే వెదురుపుల్ల. (తె. 31).

ఊద్దాని: (< ఊదు + దాని) పర్యా. బర్కటిబుట్ట, సాంబ్రాణిబుట్ట. తలవెంట్రుకలకు సాంబ్రాణి (ఊదు) పొగ వేసుకోడానికి వాడేబుట్ట; అడుగు భాగంలో పేళ్ళమధ్య సందులుండేలాగా అల్లుతారు; సాంబ్రాణి చల్లిన కుంపటిమీద దీన్ని బోర్లించి దీనిమీద తలవెంట్రుకలు పరిచి పడుకొంటారు; ముస్లింస్త్రీలు ఎక్కువగా వాడతారు. చూ. చిత్రం 79. (తె. 26, 28).

ఊపురం: 1. పర్యా. చూ. వెన్ను (4). మేదరి కత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు

పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 డ. 3. (కో. 10; తె. 23); 2. చూ. మూపురం. (కో. 13).

ఊంబుట్ట: ఉమ్మివేసే బుట్ట; చిన్న కాయితాల బుట్ట మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 61. (కో. 3).

ఊరినకర్ర: ఉ. ఊర్న ; పర్యా. ఊరినబొంగు. మెత్తబడటానికి నీళ్ళలో నానవేసిన వెదురుగడ; పేడు తీయడానికి ఎండినగడ నానవేస్తారు; పేడు నాణ్యంగా ఉండదు. (కో. 12).

ఊరినబొంగు. ఉ. ఊర్న—; పర్యా. ఊరినకర్ర. మెత్తబడటానికి నీళ్ళలో నానవేసిన వెదురుగడ; పేడు తీయడానికి ఎండినగడ నానవేస్తారు; పేడు నాణ్యంగా ఉండదు. (కో. 11).

ఊరుమేదరి: మైదాన ప్రాంతాల్లోని ఊళ్ళలో నివసించే మేదర్ల తెగ. (తె. 10).

ఊరేయు: (< ఊరవేయు) (క్రి.) పర్యా. చూ. నానబెట్టు నీళ్ళలోవేసి ఉంచడం; ఎండిన వెదురుగడలు, బద్దలు, కొబ్బరిసొక్కలు, గోగుకట్టె, కలబంద మట్టలు, ఈతబరిగెలు మొ॥ మెత్తబడటానికి నీళ్ళలో వేసి కొంతకాలం ఉంచుతారు. (కో. 5, 10, 11, 23, 25, 29, 30; రా. 1).

ఊర్క: చిన్నపిల్లలు ఆడుకోడానికి అల్లిన చిన్న వెదురుపేళ్ళ గంప. (తె. 29).

ఊలు: పర్యా. చూ. బోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపునుంచి మరొక కణుపువరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలుండదు. చూ. చిత్రం 4.1. (కో. 22).

ఎ

ఎగదండు: పర్యా. దిగువతండు, దోణిమొద్దు, దోనిమాను, బొర్రులుబల్ల, మొదలుబొంగు, వెనకబొంగు, సుత్తిబరి. చాపనేతమగ్గం మొదటిభాగంలో (= నేత పనివాడు కూర్చొనేవైపు) అమర్చిన లావాటిపలక; పోగులను లాగిపట్టి ఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూ పోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాల గుండా పోగులను దూర్చి దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు దారం కొలుకులుగాని పొడుగాటి ఇనపచువ్వగాని తొడుగుతారు. చూ. చిత్రం 120. చ. 3. (కో. 3).

ఎగబెట్టుకొను: (క్రి.) తీసిపెట్టుకోడం; చేట అల్లకం పనిలో అంచుకు కట్టుకట్టే తీగనతీగలను ఎండబెట్టిన తరవాత తీసిపెట్టుకొంటారు; వీటిని అవసరమున్నప్పుడు నానవేసుకొని ఉపయోగిస్తారు. (రా 5).

ఎగిరెకట్టె: రూ. ఎవుటికట్టె; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాల నుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి మూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చని గడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (తె. 16).

ఎగువతండు: పర్యా. చూ. దిగదండు. చాప నేత మగ్గంచివర అమర్చిన వెదురుగడ; నిలువుపోగులను ఎగదండు (= నేతగాడు కూర్చొనేవైపు ఉండేది) నుంచి చాపి దీనికి కడతారు; నేతపనివాడికి ఎదురుగా ఉంటుంది; పోగుల్ని లాగి ఉంచుతుంది. చూ. చిత్రం 120 చ. 8. (రా. 4).

ఎగుసం: (< వ్యవసాయం) సేద్యం. (కో. 17).

ఎగుసంచేట: (< వ్యవసాయం ) వ్యవసాయంచేసేటప్పుడు (రైతులు) ఉపయోగించే చేట; దీనికి ఆరు కట్లు ( - అంచుకు తీగతోచుట్టిన చుట్లు) ఉంటాయి. (కో. 17).

ఎంజాంబొంగు. వారిపాక కట్టుబడిలో గూటాలమీద అడ్డంగావేసిన వెదురుగడ. (తె. 1).

ఎడ: ( పెట్టు) దేవతకు అర్పించేది; నైవేద్యం. (తె. 1).

ఎడిగడ్డి ఒకరకం గడ్డి; బీడుగా పెరుగుతుంది; గుడిసెలు కప్పటానికి పనికొస్తుంది. (తె. 10).

ఎడదాపుగంటు. పర్యా. జంపుగంటు. వెదురుగడకు రెండు కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువగా పొడుగున్న భాగం. (తె. 3).

ఎడదాపుగంటుదబ్బ: కణుపు కణుపుకూమధ్య ఎడం పోనుపోను ఎక్కువగా ఉంటూండే వెదురుగడనుంచి చీరినబద్ద; దీన్నించి జల్లెడ అల్లకానికి కావలసిన పేడు తీస్తారు. (తె. 3).

ఎడపబ్బెదురు: (< ఎడపబ్బ + వెదురు) పర్యా. చూ. నిడుపు (గనె) బొంగు. కణుపులమధ్య మూరెడు

గాని అంతకన్న ఎక్కువగా ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసిన పేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 31).

ఎడవెట్టు: (క్రి.) దేవతకు నైవేద్యంపెట్టడం (తె. 1).

ఎడ్లబుట్ట: ఉ.–బుట్టి. పర్యా. చూ. ఎద్దుబుట్ట. చేను మేయకుండా పశువుల మూతికి తొడిగేబుట్ట; గాలి ఆడడానికి వేళ్ళమధ్య సందులువచ్చేటట్లు అల్లుతారు; ఈతపేడుతోగాని వెదురుపేడుతోగాని దుసేరు తీగలతోగాని అల్లుతారు. (తె. 9).

ఎడుము. చూ. ఎలుము. (రా. 1).

ఎంటకెళ్ళి: ఉ. యెంటకెల్లి. వెనకనుంచి (–కెళ్ళి–నుంచి) (తె. 13).

ఎంటసిరి: ఉ. యెంటశిరి. తరవాత; వెనకసిరి. (తె. 16).

ఎండకేయు: (< ఎండకువేయు) (క్రి.) పర్యా. చూ. ఎండేయు. పచ్చి ఆరిపోవడానికి ఎండలో వేయడం; ఈతకమ్మలుకొట్టి ఎండలో వేస్తారు. (కో. 3).

ఎండగొప్పకఱ్ఱ: పర్యా. రాళ్ళబొంగు. రాళ్ళదగ్గర పెరిగిన వెదురుకఱ్ఱ; బరువుగా కొంచెం పండి పోయి ఉంటుంది; పేడు సరిగారాదు. (కో. 24).

ఎండుకఱ్ఱ: 1. పర్యా. చూ. ఎండుబొంగు (1). ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలం తెగులుసోకిగాని నీళ్ళు అందకగాని పొదమీదే గడ ఎండిపోతుంది. (కో. 22, 30); 2. పర్యా. ఎండుగడ, ఎండుబొంగు (2), ఎండువెదురు(2), వట్టిబొంగు. ఇంటికి తెచ్చిన తరవాత ఎండిపోయిన వెదురుగడ; నాలుగు రోజులు నానేసి దీన్నించి పేడుతీస్తారు. (కో. 14, 17, 24, 26, 27).

ఎండుగడ: ఉ. ఎండిగెడ; పర్యా. చూ. ఎండుకఱ్ఱ (2). ఇంటికితెచ్చిన తరవాత ఎండిపోయిన వెదురుగడ; నాలుగురోజులు నానేసి దీన్నించి పేడుతీస్తారు. (కో. 16).

ఎండుజాతి: ఎండిపోయిన వెదురుకఱ్ఱ; వేలెడు లావుంటుంది (కో. 22).

ఎండుతుంగ: ఎండిపోయినతుంగ; చూ. తుంగ (కో. 21).

ఎండుబొంగు: ఉ. యెండు–. 1. పర్యా. ఎండుకఱ్ఱ(1), ఎండువెదురు(1), దొల్లయెత్తెదురు, నిలవరంకఱ్ఱ, నిలువెండుబొంగు, వట్టికఱ్ఱ. ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలం తెగులుసోకిగాని నీళ్ళు అందకగాని పొదమీదే గడ ఎండిపోతుంది. (కో. 7); 2. పర్యా. చూ. ఎండుకఱ్ఱ(2). ఇంటికి తెచ్చినతర్వాత ఎండిపోయిన వెదురుగడ; నాలుగు రోజులు నానేసి దీన్నించి పేడుతీస్తారు. (కో. 11, 15; తె. 25).

ఎండుమట్ట: ఉ. యెండు–. ఎండిపోయిన కొబ్బరి మట్ట (చూ. బొక్క–) (కో. 23).

ఎండువెదురు: ఉ. యెండెదురు; 1. పర్యా. చూ. ఎండుబొంగు(1). ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలం తెగులుసోకిగాని నీళ్ళు అందకగాని పొదమీదే గడ ఎండిపోతుంది. (కో. 22); 2. పర్యా. చూ. ఎండుకఱ్ఱ(2). ఇంటికి తెచ్చిన తరవాత ఎండిపోయిన వెదురుగడ; నాలుగురోజులు నానేసి దీన్నించి పేడుతీస్తారు. (కో. 25; రా. 3,4).

ఎండేయు: (< ఎండవేయు) (క్రి.) పర్యా. ఆరేయు, ఎండకేయు. పచ్చి అరిపోవడానికి ఎండలో వేయడం; ఈతకమ్మలు కొట్టి ఎండలో వేస్తారు. (తె. 9, 14).

ఎత్తుదబ్బ: చాపనేతలో అడ్డానికి (తుంగ) పోచలు దూర్చేబద్ద కిందపడకుండా అడ్డంగా ఎత్తుపెట్టే వెదురుబద్ద; స్టాండుమాదిరిగా ఉంటుంది. (రా. 2).

ఎదటికట్టు: (< వెదటి –) పర్యా. చూ. కట్టు(6). చేట, విసనగఱ్ఱ, పెట్టె, తిరుమాన్‌పెట్టె మొ॥వాటి అల్లకంలో అంచునుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద; వేలెడుగాని రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది. (తె. 9, 26).

ఎదటికఱ్ఱ: (< వెదటి –)పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోను పోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చిచేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చని గడ నిచ్చెన, చేతికఱ్ఱ మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (తె. 6, 10).

ఎదటిబొంగు: (< వెదటి–) పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదటలావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడ లోపలగుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట,

జల్లెడగంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (తె. 6).

ఎదురుగచ్చం: ఉ. యెదురు—; పర్యా. నిలువుగచ్చం. చేట అల్లకంలో నిలువుగా వచ్చే పేళ్ళకూర్పు. చూ. చిత్రం 23. (కో. 3).

ఎదురుగచ్చాలల్లకం: చేటఅల్లకంలో నాలుగువైపుల నుంచి చదరంగా డిజైనువచ్చి మధ్యలో పువ్వు వచ్చేటట్లు అల్లడం. (కో. 14-18).

ఎదురునిలువు: ఉ. యెదురునిల్వు. పేముబుట్ట అల్లేటప్పుడు నిలువుకర్ర పొడుగు సరిపోనప్పుడు దానికి ఎదురుగాపెట్టే మరొకనిలువు (కో. 3).

ఎదురుబదురు(గా): ఉ. యెదురు -; ఒకదానికొకటి ఎదురుదిశ(గా); ఈతకట్టె పేర్చేటప్పుడు కొన్ని చువ్వల మొదళ్ళు ఒకవైపు కొన్నిచువ్వల కొనలు ఒకవైపు వచ్చేటట్లుపెడతారు; కొన్నిటి మొదళ్ళకు కొన్నిటి కొనలు ఎదురుదిక్కుగా ఉంటాయి. (తె. 13).

ఎదురువేయు: (క్రి.) పర్యా. సందుపెట్టు. చేట మొ॥ అల్లేటప్పుడు అల్లుతున్నపేడు అయిపోతే అల్లకం కొనసాగడానికి దానికి ఇంకోపేడు కలిపిపెట్టడం (తె. 1).

ఎదురెక్కించు: (క్రి.) పర్యా. చూ. మలుచు(2). అల్లకం పూర్తయిన తరవాత (గంప మొ॥ వాటికి) మిగిలిన నిలువులను లోపలివైపువంచి అంచులోపలికి దోపడం (తె. 20).

ఎద్దుబుట్ట: ఉ. - బుట్టి. పర్యా. ఎడ్లబుట్ట, ఎద్దుల చిక్కం, చిక్కం(1). చేనుమేయకుండా పశువుల మూతికి తొడిగేబుట్ట; గాలి ఆడడానికి పేళ్ళమధ్య సందులు వచ్చేటట్లు అల్లుతారు; ఈతపేడుతోగాని వెదురుపేడుతోగాని దుసేరు తీగలలోగాని అల్లుతారు. (తె. 22).

ఎద్దులచిక్కం: ఉ. యెద్దులశిక్కం. పర్యా. చూ. ఎద్దుబుట్ట. చేనుమేయకుండా పశువుల మూతికితొడిగే బుట్ట; గాలిఆడడానికి పేళ్ళమధ్య సందులువచ్చేటట్లు అల్లుతారు; ఈతపేడుతోగాని వెదురుపేడుతోగాని దుసేరుతీగలతోగాని అల్లుతారు. (రా. 9).

ఎన: ఉ. యెన. పర్యా జమిలిబద్దలు, జోడినిలుగు. పెద్దగుమ్మి అల్లకంలోవచ్చే నిలువుబద్దలజత (=రెండు నిలువుబద్దలపట్టీ) (కో. 29).

ఎనబెట్టు: (క్రి.) ఉ. యెన ; గుమ్మి(చూ.) అల్లకంలో నిలువుబలంగా ఉండడంకోసం రెండు బద్దల్ని జతచేసి పెట్టడం. (కో. 28).

ఎనిగెజమ్ము: ఉ. యెన్గె—; పర్యా. దబ్బజమ్ము. పొడుగ్గానూ లావుగానూ (సుమారు వేలెడులావు) కొంచెం పలకగానూ ఉండేకమ్ము; ఇళ్ళకప్పు కొంటారు; చాపనేతకు పనికిరాదు. (రా. 10).

ఎనిమిదికడవలగాదె: ఉ. —గాదె; రెండున్నర క్వింటాళ్ళధాన్యంపట్టే ఈతగుమ్మి. చూ. గుమ్మి. (రా. 9).

ఎనిమిదిపట్టెలచాప: ఉ. ఎన్మిదిబట్టెలసాప. ఎనిమిది పట్టెలను పక్కపక్కగా చేర్చికట్టిన ఈతచాప, ఇలాకుడితే ఒక్కమనిషి పడుకొనేటంత వెడల్పు వస్తుంది. (తె. 21).

ఎనిమిదిమళ్ళగుమ్మి: ఉ. యెన్మిది—; ఎనిమిది మణుగుల ధాన్యంపట్టే గాదె (తె. 22).

ఎనిమిదిమానికలగుల్ల: ఉ. ఎన్మిదిమాన్కల ; 1. 64 కిలోల ధాన్యంపట్టే గంప (తె. 21); 2 40 కిలోల ధాన్యంపట్టేగంప. (తె. 21).

ఎనుగు: రూ. ఎలుగు; పర్యా. అడవ. కంచె; చేను చుట్టూ కంపతోగాని వెదురుగడలతోగాని వేస్తారు. (తె. 28).

ఎమినీపేపర్: గరుక్కాయితం; గరుకుగా ఉండే (ఉప్పు) కాగితం; రంగువేసేముందు దీంతో పేము కుర్చీని రుద్దుతారు. (కో. 12).

ఎమ్మివాసం: పర్యా. చూ. కడెంబారు. పొడుగ్గానూ సన్నగానూ గట్టిగానూఉండే ఒకరకం వెదురుగడ; ఏటవాలుగా కప్పువేసే ఇళ్ళకు సన్నటివాసాలుగా ఉపయోగిస్తారు; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 17).

ఎమ్ము: ఉ. యెమ్ము. చూ. ఎలుము (కో. 1).

ఎరకలతట్ట. ఉ. యెర్కల—; ఎరకలివాళ్ళు వాడే తట్ట; బెంకె మాదిరిగా ఉంటుంది; అల్లకం చిక్కగా ఉంటుంది. (కో. 23).

ఎరకలికత్తి: ఉ. ఎర్కలి—; 1 పర్యా. చూ. కొడవలి (1). చంద్రవంకలా వంపుదిరిగిఉన్న ఒకరకం ఇనపకత్తి; ఈతచెట్టునుంచి కమ్మ కొయ్యడానికీ కోసినది చీల్చడానికీ ఎరకలివాళ్ళు వాడతారు; కొన్నిటికి వంపు తక్కువగాఉంటుంది. చూ. చిత్రాలు 13 క, చ. (కో. 25; తె. 11); 2. ఎరకలివాళ్ళు చేసే మేదరిపనిలో వెదురుగడ పగలగొట్టడానికిగాని చీల్చడానికీగాని వాడే ఒకరకం కత్తి. (రా. 3).

ఎరకలికొడవలి: ఉ. యెర్కలి కొడ్వలి, యెర్కలి కొడ్వెలి. పర్యా. చూ. కొడవలి (1). చంద్రవంకలా

వంపుదిరిగిఉన్న ఒకరకం ఇనపకత్తి; ఈతచెట్టు నుంచి కమ్మ కొయ్యడానికీ కోసినది చీల్చడానికీ ఎరకలివాళ్ళు వాడతారు, కొన్నిటికి వంపుతక్కువగా ఉంటుంది. చూ. చిత్రాలు 13 క. చ. (తె. 7, రా. 9).

ఎరకలిగంప: ఉ. ఎరకలి . బరువుసామాన్లు మోసుకుపోయే వెదురుగంప; చిక్కగా అల్లుతారు; పెద్ద బరువులుకూడా ఆపుతుంది. (రా. 11).

ఎరకలిబుట్ట: ఉ. - బుట్టి; పర్యా. ఎల్లమ్మబుట్ట. 'ఎరుక' చెప్పే ఎరుకలామె ఎల్లమ్మదేవతను పెట్టుకొనివెళ్ళే (ఈతాకు) గంప; ఎరుకచెప్పగా వచ్చే బియ్యం, డబ్బులు మొ॥ ఇందులో వేసుకొంటారు. చూ. చిత్రం 60. (తె. 9).

ఎరకలిమేదరి: ఉ. ఎర్కలి—; వెదురుబుట్టలు మొ॥ అల్లే ఎరకలివాళ్ళు; ఒక తెగ. (తె. 26).

ఎరికి: పొయ్యిలో కట్టెలు. (తె. 29).

ఎరువుపానక: ఉ. యెరువుపొన్క; పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొనిరావడానికి బంటిమీదవేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచిఉంటాయి. చూ. చిత్రం 32. (తె. 23).

ఎర్రకాసెగడ్డి: ఎరుపురంగులో ఉండే కాసెగడ్డి; ఎండాకాలంలో చల్లదనంకోసం దీంతో తడకలుకట్టి గుమ్మాలకూ కిటికీలకూ వేలాడగడతారు; పందిళ్ళ మీదపరిచి నీళ్ళతో తడుపుతారు. (తె. 10, 17).

ఎర్రగడదీయు: (క్రి.) వెదురుగడమొదలు కాలిపోయి విరిగిపోవడం. (కో. 28).

ఎర్రగర్ర: ఎర్రరంగులో ఉండే పేముకర్ర; అస్సాం ప్రాంతంలో పెరుగుతుంది. (కో. 12).

ఎర్రటేపు: సిరిచాప (తుంగచాప)కు గోటు (అంచు) కుట్టడానికి వాడే ఎర్రటిపట్టీ. (రా. 2).

ఎర్రనేలకులం: ఉ.యర్నేల—. ఎర్రనేల (=రాయలసీమ) ప్రాంతంలో నివసించే మేదర్లలో ఒక తెగ. (రా. 8).

ఎర్రబొంగు: పర్యా. ఎర్రబొంబు, కాకివెదురు (3). ముదురు ఎరుపురంగులో ఉండే వెదురుగడ. (తె. 15).

ఎర్రబొంబు: పర్యా. చూ. ఎర్రబొంగు. ముదురు ఎరుపురంగులో ఉండే వెదురుగడ. (రా. 1).

ఎర్రవట్టివేరు: ఉ.–వట్టేరు; సన్నగా ఎరుపురంగులో ఉండే వట్టివేరు; తడకలుకట్టడానికి ఉపయోగిస్తారు. (తె. 10).

ఎర్లగాలిపోవు: (క్రి.) బద్దనుంచి పేడు రావడానికి కావలసిన తడి ఆరిపోవడం. (కో. 8).

ఎలగటిపగ్గం: ఉ. ఎల్గటి—. ఎలగటి నాగలి దున్నేటప్పుడు ఎద్దుకొమ్ములకూ మేడితోకకూ కలిపికట్టి ఎద్దును మలపటానికి ఉపయోగించే పగ్గం. (తె.9).

ఎలగటివాన్రె: ఉ. ఎల్గటాన్రె. ఎలగటి అరకకు కాడి అమర్చడానికి వాడేవాన్రె; చూ. వాన్రె. (తె. 9).

ఎలగతట్ట: రైతులు పేడ తీసుకుపోవడానికి కాయగూరలుదెచ్చి అమ్ముకోడానికి వాడేతట్ట; పెంకెలా ఉంటుంది. (కో. 23).

ఎలవ (< ? విలువ): ఉ. యెలవ. కొడవలి చేసినందుకు కమ్మరివాడికిచ్చే కూలి (ఖర్చు). (రా. 9).

ఎలాంకర్ర: ఉ. యెలాం—; పర్యా. చూ. మొత్తకర్ర. వెడల్పుగానూ పలకగానూ ఉండే వెదురుకర్ర. (తె. 16).

ఎలాం: చూ. ఎలుము. (తె. 16).

ఎలుగు: ఉ. యెలుగు. చూ. ఎనుగు. (కో. 24).

ఎలుము: ఉ యెల్మ; రూ. ఎడుము, ఎప్మ, ఎలాం. వెడల్పు. (తె. 21, 23).

ఎలుమునిలుగు: ఉ. యెల్మనిల్గు. అల్లికంలో నిలువుకు వాడే వెడల్పయిన వెదురుబద్ద. (తె. 21)

ఎలువునజీరు: (క్రి.) ఒత్తిన ఈతమట్టను చీరేటప్పుడు చీరుతున్న చీలికతోపాటు మట్టను ఎడమ చేత్తో బాగా కిందికివంచి చీరడం; ఇలా చీరడంవల్ల నారిపోచ మందంగా వస్తుంది. (తె. 9)

ఎగ్గిడ: పర్యా. సెక. నిప్పుసెగ; వేడి. (తె. 14).

ఎత్తెకట్టె: ఉ. యెత్తె : పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, బుల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (తె. 15).

ఎత్తెగడ: ఉ. యెత్తె—; పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమిలోపల వేళ్ళతోసహా ఉన్న దుంప; వెదురుగింజ భూమిలో పడిన తరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ

లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్ని పిల్లవేళ్లూ భూమిలోకి పారతాయి. (తె. 20).

ఎత్తెచెట్టు: ఉ. యెత్తెశెట్టు; పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురుగడలు పెరిగిన పొద; ఒక చదరపు గజం నుంచి మూడునాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి. వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాత గాని పొదలో ఒక వెదురుగడను కొట్టకుండా వది లేసిన తరవాతగాని పొద కావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపు కాస్తుంది. చూ. చిత్రం 1. (తె. 19).

ఎత్తెపాలు: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది, మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్ట వ్యాధి నివారణకూ తేలుకాటుకూ అజీర్ణవ్యాధికీ మేహరోగాలకూ కడుపునొప్పికీ విరేచనాలకూ ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలి నప్పుడు తెల్లతిరుమనిగౌర, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెలోకలిపి రాస్తే తగ్గుతుంది. (తె. 20).

ఎత్తెబొంగు: ఉ. యెత్తె—; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ళ మందనుంచి దూలమంత మందంవరకు లావు ఉంటుంది; మొదట లావుగాఉంది పోను పోను సన్నమవుతుంది. మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చిచేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (తె. 17, 19, 20).

ఎల్పు: వెడల్పు. (తె. 15).

ఎల్పుకర్ర: ఉ. యెల్పు—; పర్యా. చూ. మెత్తకర్ర. వెడల్పుగానూ పలకగానూ ఉండే వెదురుకర్ర; చూ. (తె. 15).

ఎల్పుచాప: ఉ. యెల్పుసాప; రెండుమూరల వెడల్పూ మూడుమూరల పొడుగూ ఉండేతాటిచాప. (కో. 26).

ఎల్పుపేడు: ఉ. ఎల్పువేడు, ఎలుప్పేడు; చూ. వెడల్పుపేడు. (కో. 24; తె. 1, 4; రా. 2).

ఎల్పుపేళ్ళగంప: (< వెడల్పుపేళ్ళ -) ఉ, ఎల్పేల్ల గంప. వెడల్పయిన వెదురుపేళ్ళలో అల్లినగంప. (తె. 1).

ఎల్పుపేళ్ళచేట: ఉ. ఎల్పేల్లశాట. పర్యా. చూ. పెద్ద పేళ్ళచేట. వెడల్పాటి పేళ్ళలో అల్లినచేట; దీన్ని మామూలుగా ఒంటిపేడుమీదగాని రెండుపేళ్ళ (చూ. రెంటాలు) మీదగాని అల్లుతారు. (రా. 5).

ఎల్పుపేళ్ళల్లకం: వెడల్పుగా ఉండే రెండేసిపేళ్ళతో అల్లేతీగ; చూ. రెంటాలు. (రా. 8).

ఎల్పురేకు: వెడల్పు ఎక్కువగా ఉండే తాటేకు (రేకు) (కో. 26).

ఎల్లమ్మ: ఎరుకచెప్పే ఎరకలాయె కొలిచేదేవత; ఈ దేవత బొమ్మను ఒక ఈతాకుబుట్ట. (చూ. ఎల్లమ్మ బుట్ట)లో పెట్టి తీసుకువెళ్తారు. (తె. 9).

ఎల్లమ్మబుట్ట: ఉ. - బుట్టి. పర్యా. ఎరకలిబుట్ట. 'ఎరుక' చెప్పే ఎరుకలామె ఎల్లమ్మదేవతను పెట్టుకొనివెళ్ళే (ఈతాకు) గంప; ఎరుకచెప్పగా వచ్చే బియ్యం డబ్బులు మొ॥ ఇందులో వేసు కొంటారు. చూ. చిత్రం 60. (తె. 9).

ఎల్లికవ్వరుబొంగు: పర్యా. బుడ్డకవురుబొంగు (2). నీళ్ళు కొంతవరకు అందీ కొంతవరకు అందకా సగం పచ్చగానూ సగంపాలిపోయీ ఉండే వెదురు గడ (తె. 22).

ఎవుటికట్టె: ఉ. యెవుటి , చూ. ఎగిటెకట్టె(తె. 13).

ఎవుటెబొంగు: ఉ. యెవుటె—; పర్యా. చూ. వెదురు బొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందం నుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడనిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (తె. 13).

ఎస: చిటికెడు కొలత. (రా. 2).

ఎసరు: చాప అల్లకానికి వాడే తుంగకు రంగువేయ డానికి కాగబెట్టేనీళ్ళు; నీళ్ళలో రంగు కలుపుతారు,

(కో. 3).

ఎస్-కట్టు: ఒకరకం పేముకుర్చీ; అడ్డంతిప్పిన 'ఎస్' అక్షరం (ω) ఆకారంలో కర్రవంచి బిగించినది. (కో. 11).

ఎస్-పాటు: పర్యా. ఎస్-మాడల్. ఒకరకం పేముకుర్చీ; పడక్కుర్చీ మాదిరిగా ఉంటుంది; పక్కన బలంకోసం అడ్డంతిప్పిన 'ఎస్' అక్షరం (ω) ఆకారంలో కర్రలువంచి బిగిస్తారు; రెండుపక్కలా బిగిస్తారు. (కో. 11).

ఎస్-మాడల్: (S-mo lel) పర్యా. చూ. ఎస్-పాటు. ఒకరకం పేముకుర్చీ; పడక్కుర్చీమాదిరిగా ఉంటుంది; పక్కన బలంకోసం అడ్డంతిప్పిన 'ఎస్' అక్షరం (ω) ఆకారంలో కర్రలువంచి బిగిస్తారు; రెండుపక్కలా బిగిస్తారు. (కో. 11).

## ఏ

ఏకరాత్రిపెళ్ళి: ఉ. —పెళ్ళి. కొందరు మారుమనువు చేసుకొన్నప్పుడు ఒకేరాత్రితో తంతుముగిసే పెళ్ళి. (కో. 23).

ఏకు: ఉ. యేకు. పర్యా. బత్తి. జేనెడు పొడుగూ వేలెడులావూ ఉండేలా తాల్చిన కొబ్బరిపీచు; పదిపదిహేను విడిపోచలు పీటమీదగాని నేలమీదగాని పెట్టి చేత్తో తాలుస్తారు; కొన్నిచోట్ల కలబందనార పోచలు తాల్చినది. (కో. 5, 30; రా. 6).

ఏకేరుపట్టె: పర్యా. ఆరాకుపట్టె. ఒకఆకు తప్పించి ఒకఆకు ఎక్కిస్తూ అల్లిన ఈతాకుపట్టె. (తె. 27).

ఏగునాలు: (? యజ్ఞాలు) ఉ. యేగునాలు. బ్రాహ్మణుడు చదివే మంత్రాలు. (తె. 21).

ఏగ్గాడు: పర్యా. బూడిగకర్ర. కణుపులదగ్గర కొయ్యలు వేయని వెదురుగడ; దీనికి గంటికనుపు ఉండదు; గడ సాపుగా ఉంటుంది. (కో. 18).

ఏంచు: (క్రి.) లెక్కపెట్టడం; ఎంచడం. (తె. 1).

ఏటా్రనె: (< ఏడు + వా్రనె); ఏడుపురుల (పురి = తాల్చిన సన్నటి తాడు)తో పేనిన వా్రనె; గోగునారతో పేనతారు; ఎలగటి (= మెట్ట)నాగలి ఏడి కర్ర (కోల)నూ కాడినీ దీంతో కడతారు. (తె. 9).

ఏటికర్ర: నాగలికోల. (కో. 30).

ఏడుమళ్ళగుమ్మి: ఏడుమణుగుల ధాన్యంపట్టే గుమ్మి (గాదె). (తె. 22).

ఏడుమానికలగుల్ల: ఉ. ఏడుమాన్కల—; 35 కిలోల ధాన్యంపట్టే గుల్ల. (తె. 24).

ఏడే: 1. పర్యా. చూ. అంచు (3). కట్టు (బద్ద), కర్ర (= కడ్డీ లాంటిది)పెట్టి చేటచుట్టూ కట్టుకట్టిన భాగం చూ. చిత్రం 29 5. (తె. 2); 2. పర్యా. చూ. గోడ (5). జల్లెడచుట్టూ ఎత్తుగా ఉన్నభాగం. చూ చిత్రం 30. చ. 1. (తె. 2).

ఏడెబద్ద: బండిజల్ల అంచుకు బిగించిన వెదురుబద్ద (తె. 30).

ఏతి: పర్యా. చేట. ధాన్యం మొ॥ చెరుక్కోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; దోసిలి ఆకారంలో ఉంటుంది; ఎత్తుగాఉన్న వేపుకన్న రెండోవేపు వెడల్పు ఎక్కువ ఉంటుంది. చూ. చిత్రం 29. (తె. 29).

ఏదుంగుమ్మి: ఒకటిన్నర క్వింటాల్ (పదికుండల) ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (తె. 9, 14).

ఏనాదిమేదరి: ఉ. యేనాది —, మేదరిపనిచేసే ఏనాదుల తెగ; కోస్తాప్రాంతంలో ఉంటారు. (తె. 9).

ఏను: ఉ. ఏన్, యేను. 1. చూ. వెన్ను (4). (తె. 6; రా. 3); 2 వెదురుగడ రెండుగా చీరినప్పుడువచ్చే బద్ద అంచు (తె. 8); 3 పర్యా. చూ. గూడ (3). వెదురుబద్దలతో అల్లిన నీళ్ళగూడకు అడుగునుంచి అంచుదాకా ఎత్తుగాఉండే భాగం. (తె. 28). 4. చూ. వెన్ను (3) (తె. 11).

ఏనుకొను: (క్రి.) జల్లెడ అల్లకంలో అడుగున పేళ్ళు అల్లడం. (రా. 3).

ఏందుడుతాడు: ఎగదండు (= చాపనేత మొదలుపెట్టే పైపుఉండే లావాటిపలక)కు పోగులుకలిపి కట్టడం కోసం తండుచుట్టూ చుట్టిన తాడు; చాప అల్లకం అయిపోయిన తరవాత విప్పుతారు. (రా. 4).

ఏ్రనగుత్తి: మేదరివాళ్ళలో ఒక తెగ. (రా. 1).

ఏరు[1]: (< వేరు) పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్న కొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండుగజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెర కర్రగానూ గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలిఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 9).

ఏరు[2]: (క్రి.) కొబ్బరిపీచులో ఒక్కొక్క పోచ విడిగా తియ్యడం. (కో. 29).

ఏరు[3]: నది. (తె. 1, 2).

ఏసు: పర్యా. పీచుపోగు. కొబ్బరిపీచులో ఒక విడి పోచ; సన్నగా దారంలా ఉంటుంది; సుమారు జేనెడు పొడుగుంటుంది. (కో. 20, 21).

ఐ

ఐజ్జేన్లచాప: పర్యా. పెద్దచాప (1). ఐదుజేనల వెడల్పూ ఐదు అడుగుల పొడుగూ ఉండేటట్లు నేసిన (తుంగ) చాప. (కో. 3).

ఐజ్జేన్లతుంగ: ఐదుజేనల పొడుగు పెరిగే ఒకరకం తుంగ. (కో. 3).

ఐదడ్డలగుల్ల: 30 కిలోల (ఐదు అడ్డల) ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గంప. (తె. 22).

ఐదుగుంచాలగుల్ల. ఐదుకుంచాల (32 ½ కిలోల) ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గంప. (తె. 25).

ఐదుపూలచాప. ఉ.—సాప; ఐదుపూలు డిజైనుగా పడేటట్లు నేసిన తుంగచాప. (కో. 3).

ఐదుపూలవిసనగర్ర: ఉ.– పూలిసనకర్ర. మధ్యలో ఐదుపూల పనివరస ( = డిజైను) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (రా. 4).

ఐదుమళ్ళగుమ్మి: ఐదుమణుగుల ధాన్యంపట్టే గుమ్మి (గాదె) (తె. 21, 22).

ఐదుమానికలగుల్ల: ఉ. ఐదుమాన్కల—; 1. 40 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల (తె. 21); 2. 25 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 21).

ఐదుసంచులగుమ్మి: ఐదుబస్తాల ధాన్యంపట్టే వెదురు పేళ్ళగాదె. (తె. 20).

ఐమూలబద్ద: పర్యా. చూ. మూలబద్ద(3). తడక, చెంద్రికతడక మొ॥ వాటికి గట్టిదనం కోసం ' ' ఆకారంలో బిగించిన బద్దల్లో ఒకటి చూ. చిత్రం 36 క. 1. (కో. 10, 12).

ఐసుపుల్ల: ఉ. ఐస్—; పర్యా. ఐస్క్రేట్పుల్ల. ఐస్క్రీంపుల్ల. ఐస్క్రీమ్ (ఫ్రూట్)లో గుచ్చిన వెదురుపుల్ల; తినేటప్పుడు పట్టుకోడానికి పెడతారు. (కో. 9, 26; తె 8, 31)

ఐస్క్రేట్పుల్ల పర్యా. చూ. ఐసుపుల్ల. ఐస్క్రీమ్ (ఫ్రూట్)లో గుచ్చిన వెదురుపుల్ల; తినేటప్పుడు పట్టుకోడానికి పెడతారు. (తె. 28).

ఐస్క్రీంపుల్ల: ఉ. ఐసికిరీం ; పర్యా. చూ. ఐసుపుల్ల. ఐస్క్రీమ్ (ఫ్రూట్)లో గుచ్చిన వెదురుపుల్ల; తినేటప్పుడు పట్టుకోడానికి పెడతారు. (తె. 26).

ఒ

ఒకటోరకం: పర్యా. చూ. ఫస్ట్క్లాస్ బొంగు. 12 నుంచి 15 సెం.మీ. వరకు లావుండే మేలిరకం వెదురుగడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుకలోకివచ్చిన పేరు. (రా. 9).

ఒగుడు: పర్యా పువ్వు (4), ఒవిది (2). ఈతమట్టకు మధ్య ఆకులసందున ఉండే ఎర్రటిపొట్టు. (రా. 9).

ఒగ్గు: (క్రి.) విడిచిపెట్టడం; ఒక పేడువిడిచి ఇంకో పేడు ఎత్తి మళ్ళీ మొదటిపేడు విడిచిపెడుతూ చేటలు అల్లుతారు. (కో. 24).

ఒడిబాలు: ఉ. వొడిబాలు. ఒడిబియ్యం. (రా. 1).

ఒడుదబ్బ: పర్యా. చూ. వెన్నుదబ్బ ఈతకమ్మ వెన్నుచీరి తీసినబద్ద; గంప మొ॥ వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. చూ. చిత్రం 11. 4. (తె.14).

ఒడుపుకం: ఉ. వొడ్పుకం. పర్యా. చూ. అల్లకం. వెదురుపేళ్ళు పడుగుపేకలుగా కూర్చి బిగించడం; ఒక పేడు కిందినుంచి తరవాత మరోపేడు పైనుంచి ఆతరువాత మళ్ళీ కిందినుంచి వచ్చేటట్లు అల్లుతారు; తట్ట, బుట్ట, గంప, చేట మొ॥వి ఇలా అల్లుతారు. (తె. 4).

ఒడ్డుకత్తి: వెదురుగడ పగలగొట్టే పెద్ద కత్తి; మామూలు మేదరికత్తికన్న బరువుగానూ పెద్దగానూ ఉంటుంది. చూ. చిత్రం 12 క. (కో. 12; తె. 20, 23, 28).

ఒడ్డువార: ఉ. ఒడ్డార, ఒడ్డోర; 1. పర్యా. చూ. కర్ర (2). చేట అంచుకట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలనుంచి ఒక బద్దా వెలుపలి నుంచి ఒకబద్దా పెట్టి ఈ రెంటిమీదినుంచి, ఈ రెంటికీమధ్య సందులోఇరికేటట్లు సందునుమూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్రపెట్టిన తరవాత కట్లు కడతారు. (కో. 28, 31); 2 పర్యా. చూ. కర్ర (4). జల్లెడ అంచుకట్టడానికి లోపలిగుండు, బిలుకు (వెలుపలిబద్ద)లమీంచి, ఆ రెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూవేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద (కో. 28).

ఒడ్డెగంప. పర్యా. చూ. మట్టితట్ట(1). బావులనుంచిగాని బయటగాని ఒడ్డెరవాళ్ళు మన్ను మోసేతట్ట; మూతి విశాలంగా పళ్ళెంమాదిరిగా ఉంటుంది. (రా. 9).

ఒడ్డెరతట్ట: పర్యా చూ. మట్టితట్ట(1). బావులనుంచి గాని బయటగాని ఒడ్డెరవాళ్ళు మన్నుమోసేతట్ట; మూతివిశాలంగా పళ్ళెంమాదిరిగా ఉంటుంది. (తె.9).

ఒంటికన్ను: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (=కొమ్మ) నరికేసి నప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈగుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 24).

ఒంటిగచ్చం: పర్యా. చూ. ఒంటిపేడల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం; వెదురుపేళ్ళు వరసగాపరిచి వాటికిఅడ్డంగా వేసేపేడును నిలువు పేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినించీ మళ్ళీఒకదానికి కిందినించీ తిప్పుతూ అల్లుతారు. (కో. 31).

ఒంటిగచ్చమల్లకం: పర్యా. చూ. ఒంటిపేడల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం, వెదురుపేళ్ళు వరసగాపరిచి వాటికి అడ్డంగా వేసేపేడును నిలువు పేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినించీ మళ్ళీ ఒకదానికి కిందినించీ తిప్పుతూ అల్లుతారు. (కో. 22, 28).

ఒంటిపేడల్లకం: (< పేడు + అల్లకం) పర్యా. ఒంటిగచ్చం, ఒంటిగచ్చమల్లకం, ఒంటిబద్దలల్లకం, ఒంటీనెగచ్చం, ఒంటెతుకుగచ్చం, ఒంటెని (అల్లకం). ఒంటెల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం; వెదురుపేళ్ళు వరసగాపరిచి వాటికి అడ్డంగా వేసేపేడును నిలువుపేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినించీ మళ్ళీఒకదానికి కింది నించీ తిప్పుతూ అల్లుతారు. (కో. 2, 9; తె. 19; రా. 8, 11).

ఒంటిబద్దలల్లకం: (< -బద్ద+అల్లకం) పర్యా. చూ. ఒంటిపేడల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం; వెదురుపేళ్ళు వరసగాపరిచి వాటికి అడ్డంగా వేసేపేడును నిలువుపేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినించీ మళ్ళీ ఒకదానికి కిందినించీ తిప్పుతూ అల్లుతారు. (కో. 29).

ఒంటీనెగచ్చం: (< ఒంటి + ఈనె—) ఉ. ఒంటానె ; పర్యా. చూ. ఒంటిపేడల్లం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం; వెదురుపేళ్ళు వరసగా పరిచి వాటికి అడ్డంగా వేసే పేడును నిలువు పేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినించీ మళ్ళీ ఒకదానికి కిందినించీ తిప్పుతూ అల్లుతారు. (కో. 25).

ఒంటెద్దుపగ్గం: ఒక్కఎద్దును కట్టేయడానికి నాగలి దున్నేటప్పుడు ఎద్దుకొమ్ముకూ మేడితోకకూ కలిపి కట్టి ఎద్దును మలపడానికి కట్టేతాడు; దీనికి ఒకచివర చీలవర ఉంటుంది; గోగునార, జనపనారలతో పేనుతారు. (తె. 9).

ఒంటెంచు: (< ఒంటి + అంచు) పర్యా. సపాయిగోటు. ఈతచాప నిలువులో కొసలను మూసేస్తూ ఒకచేపొరగా కుట్టిన అంచుపట్టె; అడ్డంకొసలను మూస్తూ రెండు అంచుపట్టెలను కుడితే నిలువు కొసలను ఒప్పగానికి ఒంటెంచుపట్టె కుడతారు. (తె. 19).

ఒంటెతుకుగచ్చం: (< ఒంటి + అతుకు ) ఉ. ఒంటెతుక్కు ; పర్యా. చూ. ఒంటిపేడల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లేవిధానం; వెదురుపేళ్ళు వరసగాపరిచి వాటికి అడ్డంగా వేసేపేడును నిలువు పేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినుంచి మళ్ళీ ఒకదానికి కిందినించి తిప్పుతూ అల్లుతారు. (తె. 21).

ఒంటెని: (అల్లకం) (< ఒంటి + అని) పర్యా. చూ. ఒంటిపేడల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం; వెదురుపేళ్ళు వరసగా పరిచి వాటికి అడ్డంగావేసే పేడును నిలువుపేళ్ళలో ఒకదానికి కిందినుంచీ ఒకదానికి మీదినుంచీ మళ్ళీ ఒకదానికి కిందినించీ తిప్పుతూ అల్లుతారు. (రా. 5; 7).

ఒంటెల్లకం: (< ఒంటి + అల్లకం) పర్యా. చూ. ఒంటిపేడల్లకం. ఒక్కపేడుతో (అడ్డం) అల్లే విధానం; వెదురుపేళ్ళు వరసగాపరిచి వాటికి అడ్డంగావేసే పేడును నిలువుపేళ్ళలో ఒకదానికి కిందినించీ ఒకదానికి మీదినుంచి మళ్ళీ ఒకదానికి కిందినించీ తిప్పుతూ అల్లుతారు. (కో. 5; రా. 6).

ఒత్తి: ఉ. వొత్తి, వొత్తు. పర్యా. ఏకు. జేనెడు పొడుగూ వేలెడులావూ ఉండేలా తాల్చిన కొబ్బరి పీచు; పది పదిహేను విడిపోచలు పీటమీదగాని నేలమీదగాని పెట్టి చేత్తో తాలుస్తారు; కొన్నిచోట్ల కలబందనార పోచలు తాల్చినది. (కో. 20, 21, 23, 25, 29).

ఒత్తు: (క్రి.) 1. పర్యా. చూ. పాపు. భాగాలుగా విడదీయడం; వెదురుగడనుగాని బద్దనుగాని ఒకచివర కత్తితో చీల్చిన తరవాత ఒకపాయ కాలికింద తొక్కిపట్టి రెండోపాయ చేత్తోపట్టి లాగుతూగాని రెండుబద్దల్నీ రెండుచేతులతో విడదీస్తూగాని వేరు చేస్తారు. (కో. 22, 25, 28); 2. వెదురుగడ చీరడానికి దిగుపకత్తి దూర్చి ముందుకు నెట్టడం, (తె. 23); 3. ఈతమట్టలోకి కత్తి దిగేటట్లు నొక్కడం; ఈతమట్ట మొదటిభాగాన్ని అంగుళం పొడుగున చీలికలు చేస్తారు; తరవాత ఒక్కొక్క చీలికను పట్టుకొని చీరుస్తారు; మట్ట మొదటిభాగం రొమ్ముకేపు వచ్చేట్లుగా చంకకింద పెట్టుకొని కత్తి నొక్కుతారు. (తె. 9). 4 తాటిమట్ట చివరన బెత్తెడు పొడుగ్గానూ ఐదారాకుల మందంగానూ

కత్తితో చీల్చడం; తరవాత ఈ చీలికలను పట్టి లాగితే తడప (చూ.) వస్తుంది. (తె. 9). 5 చేట అల్లికంలో పేటును పైకి ఎత్తడం. (కో. 23).

ఒత్తుడుకర్ర: పర్యా. చూ. తొక్కుడుదబ్బ. చాపనేత మగ్గంలో అనికర్రకూ లోవెదురు గడకూ మధ్య ఉండే గజంపొడుగు గడ లేదా కర్ర; అనులు మార్చినప్పుడు పోగుల్ని అణిచిపట్టడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 120 క. 3. (రా. 4).

ఒత్తుడుకర్ర: పర్యా. చూ. తొక్కుడుదబ్బ. చాపనేత మగ్గంలో అనికర్రకూ లోవెదురు గడకూ మధ్య ఉండే గజంపొడుగు గడ లేదా కర్ర; అనులు మార్చినప్పుడు పోగుల్ని అణిచిపట్టడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 120 క. 3. (కో. 8).

ఒత్తుడుపుల్ల: ఉ. వొత్తుడు-, పర్యా. చూ. తొక్కుడుదబ్బ. చాపనేత మగ్గంలో అనికర్రకూ లోవెదురు గడకూ మధ్య ఉండే గజంపొడుగు గడ లేదా కర్ర; అనులు మార్చినప్పుడు పోగుల్ని అణిచిపట్టడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 120 క. 3.

ఒత్తుతీగలు: (బహు.) ఉ. —తీగెలు. అనుగుండు (చూ.)లో వెదురుపుల్లల్ని (కొసల్ని) అనుగుండుకు కట్టే మొగిలితీగలు; చూ. కొడపు. (కో. 4).

ఒత్తులకట్ట: కట్టగాకట్టిన కొబ్బరిపీచు ఒత్తులు (కో. 23, 29).

ఒదువు: (క్రి.) ఉ. వొదువు. పనికిరావడం; "వొదివేది లేదు" = పనికిరాదు. (రా. 1).

ఒందబ్బ: పర్యా. చూ. పొట్టదబ్బ. ఈతకమ్మపొట్ట (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11. 2. (తె 14).

ఒప్ప: 1. చూ. ఒప్ప (1). (కో. 7, తె. 2, 8; రా. 8, 10); 2. పర్యా. చూ. దబ్బ (9). ఈతకమ్మ నిలువుగా రెండుమూడు పాయలు చీరితీసిన భాగం. (రా. 9); 3. పర్యా. చూ. దబ్బ (10). తుంగపోచను నిలువుగా మధ్యకు చీరితే వచ్చేభాగం, బద్ద. (రా. 6).

ఒప్ప: 1. రూ. ఒప్ప (1); పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తేవచ్చే ఒక భాగం. (కో. 1, 3-5, 9-12; తె. 30, 31; రా. 1, 4, 5). 2 ఉ. అప్ప; పర్యా. చూ. బద్ద (1). వెదురుగడ నిలువుగా నాలుగుభాగాలుగా చీలిస్తేవచ్చే భాగం; గడంతపొడుగునా సుమారు రెండువేళ్ళ వెడల్పు ఉంటుంది. (కో. 15; తె. 22); 3. పర్యా. చూ. గోవ (2). నిలువుగాచీరిన గంటిబద్ద (చూ.) మూడు నాలుగుభాగాల్లో ఒకటి; గంటిబద్ద వెడల్పులో మూడోవంతుగాని నాలుగోవంతుగాని ఉంటుంది; దీన్నించి గంపలూ, బుట్టలూ మొ॥ అల్లడానికి సరిపోయే ఈనె (= తీగలాంటి సన్నటి భాగం)లు తీస్తారు. (తె. 20).

ఒంబు. పర్యా. చూ. లోబొంగు. (తుంగ) చాపనేత మగ్గంలో ఒకవైపు పోగుల అని లేవడానికి పోగుల నడుమ దూర్చిన లావుపాటి వెదురుగడ; గజం పొడుగుంటుంది; తొక్కుడుదబ్బకూ దిగుదండుకూ మధ్య ఉంటుంది. చూ. చిత్రం 120 క. 2. (రా. 2).

ఒరదబ్బ: రూ. ఒరుగుదబ్బ; పర్యా. చూ. పొట్టదబ్బ. ఈతకమ్మ పొట్ట (చూ.) చీరితీసిన బద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11. 2. (కో. 3; తె. 7).

ఒరుగుదబ్బ: ఉ. ఒర్గు—, వొరుగు—; చూ. ఒరదబ్బ. (తె. 7, 14).

ఒలుగుబట్టు: (క్రి.) వార (చూ.) మొదటిభాగంలో పేడు చీల్చడానికి కత్తి కరిపించడం. (కో. 3, 5).

ఒలుచు: (క్రి.) 1. పైతొక్క (పీచుతోబాటు) తీసెయ్యడం; మామూలుగా కొబ్బరికాయలు గునపం (గడ్డపార)తో ఒలుస్తారు, మొన పైకిఉండేటట్లు గునపం నేలలోకిదిగవేసి మొనమీద కొబ్బరికాయ ఒత్తి డొక్క పెకలిస్తారు; ఒక్కొక్కప్పుడు కత్తితో గాని కత్తిపీటతోగాని ఒలుస్తారు. (కో. 19, 25); 2. పర్యా. రెబ్బు (1). ఈతమట్టనుంచి ఆకులను చేత్తో తెంపడం. (తె. 26).

ఒలుపు: ఒలవడం. (కో. 19, 25).

ఒలెం: కోళ్ళగూడు అడుగుభాగానికి మధ్యలో గుహ్వం వడిదబ్బలతో దట్టంగా అల్లినభాగం. (తె. 9).

## ఓ

ఓడ: 1. పర్యా. చూ. వెన్ను (4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12. డ. 3. (తె. 24); 2 చేట అంచు చుట్టూ లోపలినుంచి బయటినుంచి బద్దలు (కట్లు) పెట్టినప్పుడు చుట్టూరా ఆరెండు బద్దలమధ్య ఏర్పడ్డ సందు; తరవాత ఈ సందును కప్పేస్తూ కర్ర (=కడ్డీలాంటిది) పెట్టికడతారు. (తె. 18); 3.

పర్యా. చూ, గూడ (6). చేటకు రెండుమూలల మధ్య ఎత్తుగా ఉండేభాగం. (తె. 24); 4 జల్లెడ అంచు కట్టేటప్పుడు లోపలిగుండు (బద్ద), వెలుపలి గుండు (బద్ద) పెట్టినప్పుడు చుట్టూరా ఆరెంటి మధ్యా ఏర్పడ్డసందు; ఈ సందులోనే జల్లెడ అడుగు కర్కెడ ( చిక్కగా అల్లిన అంచు) ఇమిడి ఉంటుంది; పైనుంచి చుట్టూరా ఈ సందులో ఇముడుస్తూ జల్లెడకర్ర (మందం బద్ద) పెడతారు. (తె. 18); 5. పర్యా. చూ. గోడ (5). జల్లెడ చుట్టూ ఎత్తుగా ఉన్నభాగం. చూ. చిత్రం 30 చ. 1 (తె. 21, 22), 6 పర్యా చూ. గోడ (2). గుల్ల, బుట్ట, గంప మొ॥వాటికి అడుగునుంచి అంచువరకు ఎత్తుగా అల్లినభాగం. (తె. 19); 7. 'కుకిరె' (కోళ్ళు గుడ్లుపొదిగే బుట్ట)కు ఎత్తుగా ఉన్న భాగం. (తె. 24).

ఒడ్క్ర: ఉ. ఒడక్ర, వొడ్క్ర, వోడ్క్ర; 1. పర్యా. చూ. బద్ద (1). వెదురుగడ నిలువుగా నాలుగు భాగాలుగా చీలిస్తే వచ్చే ఒకభాగం; గడంత పొడుగునా సుమారు రెండువేళ్ళ వెడల్పు ఉంటుంది. (తె. 1); 2. పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తేవచ్చే ఒకభాగం. (కో. 6; తె. 1; రా. 9); 3. పర్యా. చూ. పలుకు (2). సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా బద్ద వెడల్పుగా సగానికి చీల్చినభాగం (గడలో ఎనిమిదో భాగం); దీన్నించి పేడుతీస్తారు; వేలెడు వెడల్పు ఉంటుంది. (రా. 8).

ఓదించు: (క్రి.) పర్యా. మోదు (1). జల్లెడ అల్లకంలో అడుగు (చూ.) మీద లోపలిగుండు బయటి గుండు ( చక్రంలా గుండ్రంగా చేసిన బద్దలు) పెట్టి అడుగు చివర్లను ఆరెండు గుండ్లమధ్య ఇరికిస్తూ ఆ మూడింటినీ కలిపి కట్టుముంగ (= పలచటిపేడు లేదా తీగ)తో చిన్నకట్లు వేయడం. (రా. 10).

ఓలి: పర్యా. మోలు. పిల్ల నిచ్చినందుకు పెళ్ళికూతురి (కన్య) తండ్రికి ముట్టచెప్పే రొక్కం; కన్యాశుల్కం; ఈ ఆచారం మేదరివాళ్ళలో పూర్వం ఉండేది. (కో. 2, 4, 24 25; తె. 7).

ఓలెం: అన్నం వార్చుకొనే సిబ్బి అంచు. (తె. 9).

## ఔ

ఔరాబుట్ట: (<? హౌరా—) పెద్దపెద్ద చేపలను పార్సెల్‌చేసే వెదురుబుట్ట. (కో. 10).

## క

కకుర్ర: పర్యా. చూ, గరి(1). వెదురుబద్ద అంచుకుండే పదును. (కో. 9).

కంపకాయ: వెదురుకాయ (తె. 28).

కంకకఱ్ఱలు. పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురు గడలు పెరిగినపొద; ఒకచదరపు గజంనుంచి మూడు నాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలో పడ్డతరవాతగాని పొదలో ఒకవెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాతగాని పొదకాపుదానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది, 20-30 సం॥లకు కాస్తుంది. చూ. చిత్రం 1. (తె. 18).

కంకగింజలు: (బహు) పర్యా. వెదురుధాన్యం. వెదురుపొదకు కాసినగింజలు, పువ్వులోపల ఉంటాయి; మామూలుగా గోధుమగింజ ఉరువులో ఉంటాయి; పైపొట్టు తీసేస్తే వెదురుబియ్యం వస్తాయి; కాపుకాసే సమయంలో పొదచుట్టూ అంటి రాలిన గింజలను ఏరుకొనితెచ్చుకొంటారు. (తె.28).

కంకచెట్టు: పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురుగడలు పెరిగినపొద; ఒకచదరపు గజంనుంచి మూడు నాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొనిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలో పడ్డతరవాతగాని పొదలో ఒక వెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాత గాని పొదకాపుదానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (తె. 28).

కంకపాలు: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది;కొన్నికణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగాఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది. స్త్రీల తెల్లబట్ట వ్యాధినివారణకూ తేలుకాటుకూ అజీర్ణవ్యాధికీ మేహరోగాలకూ కడుపునొప్పికీ విరేచనాలకూ ఉబ్బసానికీ మందుగా వాడతారు. నాలిక పగిలినప్పుడు తెల్లతిరుమనిగౌర, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది.

పెదవులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (తె. 22-25, 28).

కంకపూత: వెదురుపూత; గోధుమకంకి మాదిరిగా ఉంటుంది; వెదురుపొద అరవై ఏళ్ళకు పూత పూస్తుందట (తె. 23, 28).

కంకపెనెం: పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురు గడలు పెరిగినపొద; ఒక చదరపుగజం నుంచి మూడు నాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాతగాని పొదలో ఒక వెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాతగాని పొదకావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (తె. 23).

కంకపొక్కు: జేనెడుపొడుగు పెరిగిన వెదురుమొక్క; మూడు నాలుగురోజుల్లో పెరిగింది; దీని పైపొర తీసేస్తే తీగలాంటిది వస్తుంది; దాన్ని కూరవండుకుంటారు. (తె. 22).

కంకబియ్యం: పర్యా. చూ. వెదురుబియ్యం. వెదురు పొదకు 12-60 సం॥ల మధ్య కాసిన గింజలమీది పొట్టుతీస్తే వచ్చేవి; సాదనం వెదురుబియ్యం జొన్నల్లాగానూ, ముల్లెం వెదురుబియ్యం గోధుమల్లాగానూ ఉంటాయి; వీటిని (గోండు, కోయ, మన్నెం మొ॥) అడవిజాతులవాళ్ళు తింటారు; కొందరు అన్నం వండుకుంటారు; కొందరు రవ్వగాగాని పిండిగాగాని విసిరి గటక (జావలాంటిది) కాచుకుంటారు; లేదా రొట్టెలు చేసుకుంటారు; పేలాలుగూడా చేసుకుంటారు; మంచి బలవర్ధక ఆహారమేగాక వేడిచేస్తుంది కూడా; సాదనం వెదురు 12 సం॥ల ప్రాంతంలోనూ ముల్లెం వెదురు 60 సం॥ల ప్రాంతంలోనూ కాస్తుంది; కాసిన తరవాత వెదురు పొద ఎండిపోతుంది. (తె. 28).

కంకబొంగు: 1 పర్యా. చూ. వెదురుబొంగు. వెదురు పొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళమందంనుంచి దూలమంత మందంవరకు లావు ఉంటుంది; మొదట లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది, మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగాఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4, (తె. 8, 21-25, 28); 2. పర్యా. చూ. వంకకర్ర (2). ప్రతి కణుపుదగ్గరా వంపుతిరుగుతూ పెరిగే వెదురుగడ, మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 17).

కంకమసి: ఉ. మశి. 1. పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడచుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది (తె. 22); 2. పర్యా. పాకూర్, మసి, మైల. వర్షానికి తడిసి ఎండిన ముదురు వెదురుగడమీద ఏర్పడే నల్లటి పొడి. (తె. 23).

కంకరపానక: ఉ.—పొన్క. కంకర పోసుకుపోయే బండిలోపరిచే జల్ల; ఆదిలాబాద్, అసిఫాబాద్ ప్రాంతాల్లో వాడే చిన్న బండ్లలోపరుస్తారు. (తె. 28).

కంకిజల్ల: 1. పర్యా. గుండుజల్ల, జల్ల (2), జల్ల బుట్ట, పెద్దగంప (3), మక్కెర, మూలజల్ల. సజ్జ కంకి, జొన్నకంకి మొ॥ వాటిని పొలాలనుంచి మోసుకురావడానికి వాడే ఒకరకం పెద్దగంప; గజం ఎత్తూ మూరన్నరవెడల్పూ ఉంటుంది (తె. 6, 31); 2 పర్యా. జల్ల (3). సజ్జ, జొన్న మొ॥ వాటి కంకులను మోసుకొచ్చే పెద్ద ఈతగంప. (తె. 9).

కంకులవిసనగర్ర: ఉ. ఇస్నకర్ర. మొక్కజొన్న పొత్తులు (కంకులు) కాల్చి అమ్మేవాళ్ళు కుంపటి విసిరే విసనగర్ర, దీనికి కాడ ఉండదు; పేళ్ళు వంచి అల్లుతారు. (తె. 28).

కచ్చడంచాప: ఉ. — సాప, రూ. కచ్చరంచాప; పర్యా. చూ. కచ్చడంతడక. కచ్చడం బండిమీద నీడకోసం గుడిసెమాదిరిగా కప్పే తడక లేదా చాప, కొన్నిటికి ముందువేపూ కొన్నిటికి ముందువెనకలా పడగమాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండుపొరలుగా అల్లి జతకూరుస్తారు; దీని అంచుచుట్టూ చేటమాదిరిగా కట్టు(బద్ద)వేసి అంచుకడతారు; పలచటిపేడుతో అల్లినదాన్ని చాప అనీ, నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లినదాన్నిగాని చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డం బద్దలూ వేసినదాన్నిగాని బద్దలపళంగా అల్లినదాన్నిగాని పలచటిబద్దలతో అల్లినదాన్నిగాని తడక అనీ అనడం మామూలు. చూ. చిత్రాలు 34 క. చ. (తె. 8, 31).

కచ్చడంతడక: రూ. కచ్చరంతడక; పర్యా. కచ్చడం

చాప, బగ్గితడక, బురకతడక, రింగితడక, సవారి కచ్చురంచాప, సవారిచాప, సవారిబండి తడక. కచ్చడం బండిమీద నీడకోసం గుడిసె మాదిరిగా కప్పేతడక లేదా చాప; కొన్నిటికి ముందువేపూ కొన్నిటికి ముందు వెనకలా పడగ మాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండుపొరలుగా అల్లిజత కూరుస్తారు; దీని అంచు చుట్టూ చేట మాదిరిగా కట్టు (బద్ద)వేసి అంచు కడతారు; పలచటి పేడుతో అల్లినదాన్ని చాప అనీ నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లినదాన్నిగాని చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డంబద్దలూ వేసినదాన్నిగాని బద్దలపళంగా అల్లినదాన్నిగాని పలచటి బద్దలతో అల్లినదాన్నిగాని తడక అనీ అనడం మామూలు. చూ. చిత్రాలు 34 క. చ. (తె. 7, 9, 25).

కచ్చడంపొనక: ఉ. పొన్క; కచ్చడంబండి (చిన్న బండిమీద వేసే బండిజల్ల (చూ.); ఉరువు చిన్నది. (తె. 25).

కచ్చురంచాప: ఉ. చాప; చూ. కచ్చడం చాప. (తె. 19).

కచ్చురంతడక: ఉ. -తడ్క; చూ. కచ్చడం తడక. (తె. 14).

కచ్చు: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1; (కో. 9).

కచ్చుబద్ద: పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (= వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతం వాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 9).

కచ్చుబొంగు: పర్యా. చూ. ముల్లెం(పు) బొంగు వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 2).

కటకటాలతడక. పర్యా. చూ. జాలితడక (1). వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి మేకులుకొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూమధ్య సందులు చతురస్రంగాగాని డైమన్ ఆకారంలో గాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకొంటారు. (కో. 23).

కటుకుపిడెం. కాపుకాసిన వెదురుపొద; పుట్టినప్పటి నుంచి 20-30 సం॥ల తరవాత కాపు కాస్తుందట. (కో. 22).

కటుకుబొంగు: ఉ. కట్కు ; పర్యా. చూ. గడుసు బొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (తె. 17).

కట్ట: 1. పర్యా. బొద్దు (1), మోపు (1), వాసాలకట్ట, వెదురుబొద్దు. ఒక్కచోటికి చేర్చికట్టిన వెదురుగడలు లేదా వెదురుబద్దలు; ఒకమనిషి మోయదానికి వీలయినవి (కో. 6, 11, 23, 25, 29; 16-18, 28; రా. 9); 2. పర్యా. బండిలు, మోపు(2). కొన్ని ఈతమువ్వ (బరిగె)లు కలిపికట్టినది. (కో. 3, 25; తె. 7, 9, 14).

కట్టనిచేట: ఉ. —శాట; పర్యా. చూ. మంతు(1), ఒకరకంచేట; కట్టు(బద్ద), కర్ర (కడ్డీలాంటి సన్నటి వెదురుబద్ద) వేసి కట్టుకట్టనిది; మూలలు మలిపి అంచుకట్టకుండా వదిలేసిన దాన్ని ఇలా అంటారు. (తె. 28).

కట్టబొంగు: 1. పర్యా. చూ. సన్నం(పు) బొంగు. రెండంగుళాల నుంచి ఆరంగుళాల వరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపుసన్నగా ఉండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (తె. 6); 2. పర్యా. చూ. గుట్ట(ల) బొంగు. కొండలమీదా గుట్టలమీదా గట్లమీదా పెరిగే వెదురుకర్ర; పెళుసుగా ఉంటుంది; పేడుతీయడం కష్టం; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 6).

కట్టీనె: (< కట్టు + ఈనె) ఉ. కట్టీన. పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే

కఱ్ఱ (చూ. కఱ్ఱ); పేడులో సగంవెడల్పూ కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగాఉండే భాగంనుంచి చీల్చి తీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (కో. 10, 16, 18; తె. 29).

కట్టు: **1.** పర్యా. పెండె (2), బొద్దు (7). గంప, గుమ్మి మొ॥ వాటి అల్లకంలో గట్టిదనంకోసం వెలుపలినుంచి మూతిదగ్గరా మధ్యలోనూ అడుగు అంచుదగ్గరా కఱ్ఱ (తీగలాంటిది)తో గట్టిగానూ ఉబ్బెత్తుగానూ అల్లినభాగం; రెండువేళ్ళ వెడల్పు మొదలు బెత్తెడు వెడల్పుదాకు ఉంటుంది. చూ. చిత్రం 47 త. 1. (కో. 10, 12, 13, 15, 16, 18; తె. 1-3, 6-18, 22, 27, 31; రా. 2, 11); **2** పర్యా. చూ. కట్టుముంగు. చేట, జల్లెడ. విసనగఱ్ఱ మొ॥ వాటికి కట్టుకట్టడాని కుపయోగించే పలచటి పేడు; దీన్ని వెదురుబద్దనుంచిగాని ఈతబరిగె నుంచిగాని తాటిమట్టనుంచిగాని తీస్తారు. (రా. 1) **3**. చేట, జల్లెడ, విసనగఱ్ఱ మొ॥ వాటి అంచు చుట్టూ కట్టుముంగు (వెదురుపేడు తీగ, మొగిలి తీగ మొ॥)తో రింగులాచుట్టి చేసిన బిగింపు చూ. చిత్రం 29. 4. (కో. 2, 5. 10. 19, 22 24-26, 28, 31; తె. 21-27; రా. 6, 8-11; **4** పర్యా చూ. గుండు (1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడతట్టమీద దీన్నిపెట్టి తట్ట చివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటి నుంచి ఒక బద్ద, ఈ రెంటిమీంచి ఇంకోమందం బద్దవేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 3, 25); **5** పర్యా. చూ. బిళుకు (1). జల్లెడ అంచుకట్ట డానికి వెలుపలినుంచి లోపలి గుండుచుట్టూ వేసే రెండుమూడువేళ్ళ వెడల్పు వెదురుబద్ద, లోపలి గుండుకూ బిళుకుకూ మధ్యన జల్లెడతట్టు చివర్లు (కర్పడ) ఇమిడ్చిఉంటాయి; ఈ రెండుబద్దలపైనా మరో మందంబద్ద (కఱ్ఱ) ఉంటుంది. చూ. చిత్రం 30. క. 3 (తె. 15, 17), **6** పర్యా. అంచుదబ్బ (2), ఎదటికట్టు, కట్టుగఱ్ఱ (4), కట్టుబద్ద (2), గోడదబ్బ, గోడుదబ్బ (2), పెండె (3), పెండెకట్టు, పెండెబద్ద(2). చేట, విసనగఱ్ఱ పెట్టె. తిరుమాన్‌పెట్టె మొ॥ వాటి అల్లకంలో అంచుకు లోపలినుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద; వేలెడుగాని రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది. (కో. 3, 5, 7, 9-11, 13, 15, 17-20, 25 26, 28, 31; తె. 6-9, 15, 16, 21॥ రా. 2, 4-6, 8-10); **7** పర్యా. అట్టెబద్ద. బిళుకు(4). విసనగఱ్ఱ అంచుకట్టడానికి ఒకపక్క బిగించిన వెదురుబద్ద. చూ. చిత్రం 31 క. 1. (తె. 13, 15-17); 8 కొదవు (చూ.) పుల్లల్ని కలుపుతూ దారంతో గొలుసులా చుట్టిన వరస. చూ. చిత్రం 3 క. 3. (కో. 4); **9** పర్యా. చూ. అంచు (8). ఎరకరిక (కొడవలి) కట్టెపిడి చుట్టూ వేసిన ఇనుపకట్టీ. చూ. చిత్రం 118 2. (తె. 9); **10** పర్యా. గట్టి బొద్దు (8). ఈత బద్దలతో అల్లే గంప, గుమ్మి మొ॥వాటికి అంచు చుట్టూగాని మధ్యనగాని అడుగునగాని ఉబ్బెత్తుగా అల్లినభాగం; వెడల్పు రెండువేళ్ళ మందం ఉంటుంది. (కో. 25; తె 7, 9, 16, 20, రా.9); **11** తాటాకుతోనేసే చేతిసంగంమీద నేత పూర్తయిన తరువాత వాక అడ్డంలో వెత్తెడు ఎత్తానికి ఒకటి చొ॥న వచ్చే తాళ్ళవరస. (కో. 30); **12.** తీగ బిగించి చేసినక్కళ్ళ అల్లకంలో అక్కడక్కడ వెదురుబద్దలు విడిపోకుండా చోట తీగతో కట్టువేస్తారు. చూ. చిత్రం 133 6 (తె. 22); **13**. పర్యా. చూ. కొసకట్టు (2). చీపురు పిడిచుట్టూ నాలుగువేళ్ళ వెడల్పున సన్నటి తాడుతోగాని పురితోగాని చుట్టి బిగించినది; చీపురు గట్టిగా ఉండడానికి చుడతారు. (రా. 8).

కట్టుకట్టు. (క్రి.) పర్యా. చూ. చేటకట్టు (1). చేట అల్లకంలో అంచుచుట్టూ లోపలినుంచి ఒకబద్దా (లోగట్టు) బయటినుంచి ఒకబద్దా (బయటికట్టు) పెట్టి ఆ రెంటిమధ్యా ఒకచువ్వ (చూ. కఱ్ఱ ఇరికించి కట్టుముంగు (పలచటిపేడు లేదా తీగ)తో కట్టువేసి బిగించడం; చేట, జల్లెడ, మొంటె మొ॥ వాటికి ఇలా బిగిస్తారు. (కో. 7).

కట్టుగఱ్ఱ: ఉ. - కఱ్ఱ. **1** పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచుకట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండు మూడువేళ్ళ వెడల్పు బద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిపెట్టి తట్టు చివర్లను దీని చుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్దవేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (రా. 6); **2** పర్యా. చూ. పెండెవార. బుట్ట తట్ట. గంప మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించేకఱ్ఱ (చూ. కఱ్ఱ); పేడులో సగంవెడల్పూ కొంచెం

గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (తె. 15, 18. 19, 26); **3.** పర్యా. చూ. క్రర(3). గోవ(వారి) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడువెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది, గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥ వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (తె. 2); **4.** పర్యా. చూ. కట్టు(6). చేట, విసనగ్రర, పెట్టె, తిరుమాన్‌పెట్టె మొ॥ వాటి అల్లకంలో అంచుకు లోపలనుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద; వేలెడుగాని రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది. (తె. 9, 13, 14; రా. 6); **5.** పర్యా. చూ. క్రర(4). జల్లెడ అంచుకట్టడానికి లోపలిగుండు బిలుకు (వెలుపలి బద్ద)ల మీంచి, ఆరెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా వంచి కట్టిన రెండు మూడువేళ్ళ వెడల్పుబద్ద (తె. 30); **6.** పర్యా. చూ. క్రర(2). చేట అంచుకట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒకబద్దా వెలుపలినుంచి ఒకబద్దాపెట్టి ఈ రెంటిమీదినుంచి ఈ రెంటికీ మధ్యనందులో ఇరికేటట్లు సందును మూసేస్తూ 'క్రర'ను పెడతారు; క్రరపెట్టిన తరవాత కట్లుకడతారు. (రా. 9, 11).

కట్టుగ్రరబద్ద: పర్యా. చూ. గుండు(1). జల్లెడఅంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిబెట్టి తట్టుచివర్లను దీని చుట్టూవంచుతారు; ఇది జల్లెడ అంచులోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 10).

కట్టుచెత్త: పర్యా. చూ. గరిగిపీచు. వెదురుబద్ద నున్నగా గీకేటప్పుడు వచ్చేతుక్కు. (కో. 15).

కట్టుతడప: పర్యా. కట్టుముంగు. చేట, జల్లెడ, విసనగ్రర మొ॥ వాటికి కట్టుకట్టడాని కుపయోగించే పలచటి పేడు; దీన్ని వెదుర్నుంచిగాని ఈత బరిగెనుంచిగాని తాటిమట్టనుంచిగాని తీస్తారు. (కో. 17, 18).

కట్టుతీగ: పేముబుట్టకు కట్టుకట్టడానికి పేముపుల్ల చీరి తీసిన పలచటిపేడు. (కో. 3).

కట్టుదబ్బ: ఉ. కటదబ్బ; చూ. కట్టుబద్ద (2). (కో. 7; రా. 3).

కట్టుపీచు: ఉ. పీసు; పర్యా. చూ. గరిగిపీచు. వెదురు బద్ద నున్నగా గీకేటప్పుడు వచ్చేతుక్కు. (కో. 15).

కట్టుపురి. పర్యా. కాలుపురి. తాడు పేనడానికి కాలి బొటనవేలికి చుట్టిన పురి; కాలి బొటనవేలికి ఒక పురిచుట్టి, కుడిచేత్తో ఇంకోపురి పట్టుకొని రెంటినీ పెనవేస్తూ తాడు అల్లుతారు. (రా. 5).

కట్టుపేడు: ఉ. పేడు; పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే క్రర; పేడులో సగంవెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చి తీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (తె. 2).

కట్టుబద్ద. **1.** పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిబెట్టి తట్ట చివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచులోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈరెంటి మీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 22); **2.** రూ. కట్టుదబ్బ; పర్యా. చూ. కట్టు (6). చేట, విసనగ్రర, పెట్టె, అరుమాన్‌పెట్టె మొ॥వాటి అల్లకంలో అంచుకు లోపలి నుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద; వేలెడుగాని రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది. (కో. 12); **3.** పర్యా. చూ. నడి (1). చేట, జల్లెడ, విసనగ్రర మొ॥వాటికి కట్లు కట్టడానికి లేత వెదురుగడనుంచి తీసిన పలచటి మెత్తటిపేడు; ఎటువంచినా విరగదు. (కో. 11).

కట్టుబొద్దు: గంప, బుట్ట మొ॥ వాటి అల్లకంలో గట్టిదనంకోసం గంటిబద్దనుంచి తీసిన దళసరి పేడు (గోడుదబ్బ)తో అంచుదగ్గర అల్లిన భాగం. (కో. 17).

కట్టుముకు: చూ. కట్టుముంగు. (తె. 19, 21, 22).

కట్టుముక్కు: ఉ. కట్మొక్కు; చూ. కట్టుముంగు. (తె. 5, 14, 26).

కట్టుముంగు: ఉ. కట్మొంగు, కడ్మొంగు; రూ. కట్టుముకు, కట్టుముక్కు. కట్టుమూకు; పర్యా. కట్టు (2), కట్టుతడప, కట్లాక, కడువేరు, తడప (1), పొట్టె (3), బందివి. చేట, జల్లెడ, విసనగ్రర మొ॥ వాటికి కట్టుకట్టడాని కుపయోగించే పలచటి పేడు; దీన్ని

వెదురున్నుంచిగాని ఈతబరిగెనుంచిగాని తాటిమట్ట నుంచిగానితీస్తారు. (తె. 1, 3, 4, 12, 13, 16, 17).

కట్టుమూకు: చూ. కట్టుముంగు. (తె. 6, 15, 18, 23, 24, 28).

కట్టె: **1.** పర్యా. కొడితి, తుంట (2). వెదురుగడ పగలగొట్టేటప్పుడు గడకు కరిపించిన కత్తిమీద దెబ్బలుకొట్టడానికీ చిల్లిచేసేటప్పుడు ఉలిమీదపెట్టి కొట్టడానికీ వాడే కర్ర; మూరెడుపొడుగ్గా చెయ్యంత లావు ఉంటుంది. (తె. 16); **2.** పర్యా. చూ. బద్ద (4) విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టంజారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట 2. (రా. 6); **3** పర్యా. చూ. బరిగె(1). సుమారు వేలెడులావుండే కడ్డీలాంటి పొడుగాటి పుల్ల; ఈత, పుల్చేరు మొ॥ చెట్లనుంచి ఊడుగు మొ॥ పొదలనుంచి దీన్ని తీస్తారు; ఈతకమ్మ మధ్యకర్ర (రెండు పక్కలా ఆకులు వేసేది) బండిజల్ల, పిల్లలపొది, తట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 7, 9, 13, 14, 16); **4.** చాపనేతమగ్గానికి బయట పత్తాలనార పోగులను గుంజిపట్టే కట్టె (రా. 6); **5.** చాపనేసినంత మట్టుకు దానిమానుకు చుట్టడానికి మానుతిప్పేకర్ర; కొన్నిచోట్ల ఇనపఊచ వాడతారు; చూ. బిగింపు కమ్మి. (రా. 6).

కట్లాక: (<కట్టు లాక) పర్యా. చూ. కట్టుముంగు చేట, జల్లెడ, విసనగర్ర మొ॥ వాటికి కట్టుకట్టడానికుపయోగించే పలచటి పేడు; దీన్ని వెదురున్నుంచిగాని ఈతబరిగెనుంచిగాని తాటిమట్టనుంచిగాని తీస్తారు. (రా. 3).

కడ **1** పర్యా. చూ కొస (7). వెదురుగడ చివరి సన్నటిభాగం. (కో. 30); **2** పర్యా. తట్టు (3). వైపు చోట. (తె 21).

కడువద్ద పర్యా చూ. కొము (2). చేట ముందు భాగంలో రెండుమూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన ఓటికెన వేలెడులావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళుఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు చూ. చిత్రం 29. 2. (రా. 3)

కడుపొద్దు పర్యా. చూ. మూతికట్టు(1). గంప, తట్ట మానె గుమ్మి మొ॥ వాటి అంచుమ్బూ వెలుపలి నుంచి కర్రతో వేలెడు తేటా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం చూ. చిత్రం 47 క. 5. (రా. 8).

కడం: (<కడియం) పశువుల మూతిబుట్టకు గుండ్రంగా అల్లిన కడియం. (రా. 9).

కడవ: 32 కిలోల బరువుతూగే ధాన్యం కొలమానం; కొలమానిక. (రా. 9).

కడుపు: చేట పల్లపుభాగం; ధాన్యం మొ॥ నిలబడేది (తె. 21).

కడుపుకసి: తాటేకు (రేకు) ముందు (కడుపు) భాగం; కొంచెం పల్లంగా ఉంటుంది. (కో. 26).

కడుపుదబ్బ పర్యా. చూ. కర్ర (2). చేట అంచు కట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒకబద్దా, వెలుపలినుంచి ఒక బద్దాపెట్టి ఈ రెంటి మీదినుంచి, ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్లు సందును మూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్ర పెట్టిన తరవాత కట్లుకడతారు. (రా. 3).

కడుపుపేడు: పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురు బద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండు పేడుకూ మధ్య భాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె 14).

కడువేడు: (<కట్టుపేడు) పర్యా. చూ. కట్టుముంగు. చేట, జల్లెడ, విసనగర్ర మొ॥వాటికి కట్టుకట్టడానికుపయోగించే పలచటిపేడు; దీన్ని వెదురున్నుంచిగాని ఈతబరిగెనుంచిగాని తాటి మట్టినుంచిగాని తీస్తారు. (రా. 2).

కడెం (<కడియం) **1** పర్యా. చూ. గుండు(1). జల్లెడ అంచుకట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచి కట్టిన రెండు మూడువేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిబెట్టి తట్టుచివర్లను దీని చుట్టూవంచుతారు; ఇది జల్లెడఅంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒకబద్ద. ఈ రెంటి మీంచి ఇంకోమందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1 (తె. 4); **2.** పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచికట్టినబద్ద. చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికి వీలుగా ఉంటుంది; కమాను (అర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 27).

కడెంబద్ద (<కడియం ) పర్యా. చూ. కమాన్ బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచి కట్టినబద్ద; చేత్తో పట్టుకోడానికి

మేకును తగిలించడానికి వీలుగా ఉండే గొలుసు కొక్కెం, (అర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 10. 4. (కో. 8).

కడెంబారు: ఉ. కడి—; పర్యా. ఎట్టివాసం, కడెం బారువాసం, తోకవాసం. పొడుగ్గానూ సన్నగానూ గట్టిగానూ ఉండే ఒకరకం వెదురుగడ; ఏటవాలుగా కప్పువేసే ఇళ్ళకు సన్నటి వాసాలుగా ఉపయో గిస్తారు; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 10, 15-20, 24; తె. 7).

కడెంబారువాసం: పర్యా. చూ. కడెంబారు. పొడుగ్గానూ సన్నగానూ గట్టిగానూ ఉండే ఒకరకం వెదురుగడ; ఏటవాలుగా కప్పువేసే ఇళ్ళకు సన్నటి వాసాలుగా ఉపయోగిస్తారు; మేద పనికి ఉపయోగ పడదు. (కో. 14),

కడ్డి: పర్యా. చూ. కొమ్ము (2). చేటబుంగ భాగంలో రెండు మూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగా వేసిన చిటికెనవేలెడులావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కడ్డించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29. 2. (రా. 7).

కడ్డీకఱ్ఱ: పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల మాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టి వెదురుకఱ్ఱ; సుమారు మూడునాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్టు, గుతపకఱ్ఱ, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 16).

కడ్డీవెదురు: ఉ. —ఎదురు; పర్యా. చూ. గనుసు బొంగు. పెళుసైన వెదురుకఱ్ఱ; పేతుతీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీద మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 18).

కడ్సరం: (< ?కడ + సరం) ఉ. కద్సరం; చూ. కర్సడ (1).(తె. 21, 22).

కణాదిబొంగు: రూ. కనాదిబొంగు; పర్యా. చూ. ముల్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యి లావు నుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; ఉపయోగపడదు; నిచ్చెనబండి దండి (రొట్టిగర). ఇంటివాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువ కాలం పాడవకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగేకొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది; కొబట్ట దీన్ని చీల్చడంకష్టం; మామూలుగా దీని [illegible] ఇది ఎక్కువగా [illegible] మొలుస్తుంది [illegible]

కణుపు: రూ. కనుపు(1). గణ, గణుపు(1), గన(1), గనెపె. గనుపు(1), గనె(1), గన్ను(1); పర్యా. గంటు(2), గనుపు(2), పచ్చగనుపు, బొమ్మ, ముడి(1), ముప్పండు, సొదాగణుపు, సుద్దిగనుపు(1). వెదురుగడకు అక్కడక్కడ ఉండేపట్టు; గడచుట్టూ అల్లుకు ఉంటుంది; అంతమేరకు లోపలి భాగాన్ని మూసేస్తుంది; పక్వం; ఇక్కడ కొమ్మవేస్తుంది. చూ. చిత్రం 1. 2. (కో. 20).

కంటుంబద్ద: (< సం. కంఠం—) పర్యా. చూ. కొమ్ము(2) చేటబుంగు భాగంలో రెండు మూతుల (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కడ్డించే అల్లకం మొద లెడతారు. చూ. చిత్రం 29. 2. (రా. 1).

కంఠం: ఉ. కంటం; బుట్ట (చూ.), గుమ్మి(చూ.) తల భాగంలో చుట్టూ ఉండే అంచు; పిడికెడు మంద ముంటుంది. (రా. 8).

కండ: 1. పర్యా. కుసుం, గూటం. వెదురుగడకు పైన పచ్చగా ఉండే భాగానికి బోలుగా ఉండే లోపలి భాగానికీ మధ్యనున్న గట్టిపదార్థం; బద్దమందాన్ని బట్టి గడ ఎంతలావుగా ఉన్నదీ తెలుస్తుంది. (తె. 26); 2 పర్యా. చూ. కండబద్ద(1). లావుపాటి వెదురుకఱ్ఱను బొట్టుగా మధ్యభాగంనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥వి అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్ట డానికీ ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పని కొస్తుంది. చూ. చిత్రం 11.3; (కో. 25; తె. 11).

కండకఱ్ఱ: పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టివెదురుకఱ్ఱ; సుమారు మూడునాలు గంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్టు, గుతపకఱ్ఱ, గైకట్టె; మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 22, 23).

కండబద్ద: 1. పర్యా. చూ. బెండుదబ్బ (1). వెదురు గడ చీల్చినప్పుడు బోలుగా ఉన్న భాగంనుంచి తీసినబద్ద. (కో. 4); 2. పర్యా. చూ. పసరుకింది కఱ్ఱ. వెదురుబద్దకుపైన నున్నగా పచ్చగా ఉండే (పసరు)భాగం కిందినించి తీసినకఱ్ఱ; చూ. కఱ్ఱ. (రా. 6); 3. పర్యా. చూ. గంటిబద్ద (1). గంటి గనుపుగుర్తు (=వెదురుగడకు పెరిగిన కొమ్మ

డానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (రా. 4).

కత్తిబుర్ర: పర్యా. చూ. మూపురం. మేదరికత్తికి వెన్ను (చూ.) పదునంచు వైపు వంపుదిరిగినభాగం. చూ. చిత్రం 12 జ. 4. (కో. 27).

కత్తిమడమ: పర్యా. కత్తికాడ. మేదరికత్తి పట్టుకునే సన్నటిభాగం; కొన్నిటికి కడ్డీమాదిరిగానూ కొన్నిటికి తొడిమెమాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 12 ప. 1. (కో. 27).

కత్తిరించు: (క్రి.) కత్తితో కొయ్యడం; జల్లెడతట్టు (= అడుగు) మీద గుండుపెట్టి గుండ్రంగా కత్తితో కోస్తారు. (రా. 10).

కత్తివేయు: (క్రి.) ఉ. కత్తేయు; పర్యా. చూ. కరిపించు(1). వెదురుగడకు దిగువగాటుపెట్టి కత్తి దూర్చడం; గడ రెండుబద్దలుగా చీరడానికి కత్తి దూర్చి చేత్తోగాని కొయ్యమొద్దుతోగాని కొడతారు. (కో. 7, 24; తె. 21).

కత్తులదుక్క: ఉ. కత్తుల్దుక్క; పర్యా. చూ. కత్తులపెట్టె. పేముకర్ర తీగగా చీరేపనిముట్టు; ఒకకొయ్యదిమ్మకు మూడుజతల కత్తులు మూడురకాలుగా అమర్చి ఉంటాయి; ఆ జతల్లోంచి పేముబెత్తం నుంచి చీల్చితీసిన బద్దను లాగుతారు; మొదటి జతలోంచి లాగితే బద్దకుండే బెండువంటి పదార్థం పోతుంది; రెండోజతలో లాగితే పూర్తిగా బెండు రాలిపోయి బద్ద సన్నబడుతుంది; మూడోజతలోంచి లాగితే సన్నగానున్నగా ఉండే తీగ వస్తుంది. చూ. చిత్రం 137. (కో. 19).

కత్తులపెట్టె: పర్యా. కత్తులదుక్క, గూటంపెట్టె, గోదంపెట్టె, తీగలాగేపెట్టె, పేముకర్ర తీగగా చీరే పనిముట్టు; ఒక కొయ్యదిమ్మకు మూడుజతల కత్తులు మూడురకాలుగా అమర్చి ఉంటాయి; ఆ జతల్లోంచి పేముబెత్తంనుంచి చీల్చితీసిన బద్దను లాగుతారు; మొదటి జతలోంచి లాగితే బద్దకుండే బెండువంటి పదార్థం రాలిపోతుంది; రెండో జతలోంచి లాగితే పూర్తిగా బెండురాలిపోయి బద్ద సన్నబడుతుంది; మూడోజతలోంచి లాగితే సన్నగా నున్నగా ఉండే తీగవస్తుంది. చూ. చిత్రం 137.

కత్తెర: ఉ. కత్తిరించడానికి వాడే ఇనపపనిముట్టు; గోదిసీ (చూ.)ల వెనకభాగాన్నిగాని చాపనేసిన తరవాత అంచులకు గోటుకట్టడానికిగాని దీంతో కత్తిరిస్తారు. (కో. 20; రా. 2).

కత్తెరదబ్బ: పర్యా. చూ. క్రాసుబద్ద. వెదురుమంచం తయారీలో వెడల్పుభాగాన ఉన్న రెండుకోళ్ళను (కోళ్ళను) కలుపుతూగాని కాలినీ నిలువుగడ (నిలువు పట్టెనూ) కలుపుతూగాని కాలినీ అడ్డంబొంగు (అడ్డంపట్టె)నూ కలుపుతూగాని మూలదగ్గర అడ్డం పట్టెనూ నిలువుపట్టెనూ కలుపుతూగాని ఐమూలగా కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 108. 1. (తె. 3)

కత్తెరవాసం ఉ. కత్తెరోసం; పర్యా. చూ. పూలబద్ది (3). తడక, చెంద్రిక తడక మొ॥ వాటికి గట్టివసంకోసం 'X' ఆకారంలో బిగించిన బద్దల్లో ఒకటి. చూ. చిత్రం 36 క. 1. (రా. 1)

కదురు: పర్యా. పురిపకిరి పురిబిళ్ళ, బిళ్ళ (4). నార పోవల్ని సన్నటితాడుగా పడికే పనిముట్టు; సన్నటి వెదురుపుల్లకుగాని ఇనుపచువ్వకుగాని చెక్కబిళ్ళ లేదా ఇనపబిళ్ళ తొడిగి ఉంటుంది. చూ. చిత్రం 119. (కో. 3; రా. 10).

కదురుపుల్ల: పర్యా. వెదురుపుల్ల. కదురుబిళ్ళకు తొడిగేపుల్ల; వెదురుపుల్లగాని ఇనపకడ్డీగాని వాడతారు. చూ. చిత్రం 119. 1. (రా. 10).

కనాదిబొంగు: చూ. కణాదిబొంగు. (కో. 10, 12, 14, 15, 17, 25, 26).

కని: చూ. కనుపు (2). (కో. 21).

కనికెరాయి: పర్యా. చూ. సూర్రౌతు. మేదరికత్తిగాని, అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (రా. 6).

కనిబోగులు: (< కనిపోగులు) తామరపువ్వు డిజైను (డామరపదం) వచ్చేటట్లు అల్లిన విసనగర్రలో నాలుగుమూలలా వచ్చే పేళ్ళు. (రా. 3).

కనుపు: ఉ. కన్పు; 1 చూ. కణుపు. (కో. 21-23). 2. రూ. కని, గన (2), గనుపు (4), గనె (2); పర్యా. చూ. గనుపుసందు. వెదురుగడకు రెండు కణుపులమధ్య భాగం; కొన్నిటికి పొడుగ్గానూ కొన్నిటికి పొట్టిగానూ ఉంటుంది. (కో. 19).

కనుపువేయు: మొదలు నరకగా మిగిలిన గడకింది కణుపులోంచి ఇంకో కొమ్మ పుట్టడం. (కో. 22).

కన్కపాలు: పర్యా. చూ. వెదురుబియ్యం. వెదురు పొదకు 12-60 సం॥ల మధ్య కాసిన గింజలమీది పొట్టుతీస్తే వచ్చేవి; సాదనం వెదురుబియ్యం జొన్నల్లాగానూ ముల్లెం వెదురుబియ్యం గోధుమల్లాగానూ ఉంటాయి; వీటిని (గోండ్లు, కోయ, మన్నెం మొ॥) అడవిజాతులవాళ్ళు తింటారు; కొందరు అన్నం

వండుకుంటారు; కొందరు రవ్వగాగాని పిండిగాగాని విసిరి గటక (జావలాంటిది) కాచుకుంటారు లేదా రొట్టెలు చేసుకుంటారు; పేలాలుగూడా చేసుకొంటారు; మంచి బలవర్ధక ఆహారమేగాక వేడిచేస్తుంది కూడా; సాధనం వెదురు 12 సం॥ల ప్రాంతంలోనూ ముల్లెంవెదురు 60 సం॥ల ప్రాంతంలోనూ కాస్తుంది;కాసినతరవాత వెదురుపొద ఎండిపోతుంది. (తె. 21).

కంత: **1.** పర్యా. కన్నం (1), కన్ను (4), కానా (1), గండి (1), జల్లెడకన్నం, జల్లెడకన్ను, జల్లెడ గడి, జల్లెడ దుంక, జల్లెడ బెజ్జం, జల్లెడ సందు, తూటు (1), బెజ్జం, సందు (3). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్యఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2; (కో. 2, 3, 5–10, 15, 17, 24, 26; రా. 4); **2.** పర్యా. కన్ను (6), ఖానా (4), గడి, జేలి (6), జేలిఖానా. గళ్ళతడక (= బద్దలతో గళ్ళు గళ్ళుగా కట్టిన తడక) తయారీలో బద్దలమధ్యవచ్చే సందు; కొన్నిటికి చతురస్రాకారంలోనూ కొన్నిటికి డైమన్ ఆకారంలోనూ ఉంటుంది. చూ. చిత్రం 38 చ. 1. (కో. 1, 2); **3.** పర్యా. కన్ను (12). మూతబుట్ట, చిత్తుకాయితాలబుట్ట మొ॥ వాటి అల్లకంలోవచ్చే చిన్న సందు. చూ. చిత్రం 78 క. 2. (కో. 1); **4.** పర్యా. చూ. ఖానా (5). ఉయ్యాల అల్లకంలో అడుగుభాగంలోనూ పక్కలా బద్దల మధ్యవచ్చిన సందు; గడి. (కో. 8,10); **5.** కొడమ (చూ.) అడుగుభాగంలో కొడమలోంచి చేపల్ని బయటికితీయడానికి ఏర్పాటుచేసిన సందు. చూ. చిత్రం 73 క. 9. (కో. 4); **6.** పర్యా. చూ. దారి. ఈతబద్దలతో అల్లే కోళ్ళగూడులోకి కోళ్ళను వేయడానికి పెట్టిన ద్వారం. (తె. 7); **7.** పర్యా. చూ. బొక్క (4). చాపలనేత మగ్గం అచ్చు (= తుంగపోచ నేతలో కలవడానికి దగ్గరగాజరిపే పలక)కుండే బెజ్జం; ఇలాటివి సుమారు ముప్పై ఉంటాయి; ఈ బెజ్జాలగుండా పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 105. 1; (రా. 10).

కంతతడక: ఉ. –తడికె. పర్యా. చూ. జేలితడక (1). వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి మేకులుకొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూమధ్య సందులు చతురస్రంగాగాని డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకొంటారు. (కో. 5).

కంతబుట్ట: పర్యా. కళ్ళసజ్జ, తూటుబుట్ట, బజారుబుట్ట (2), మూతబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి (గాలి తగలడం కోసం) ఉల్లిగడ్డలు మొ॥ పోసి పెట్టుకోడానికీ వాడే ఒకరకం బుట్ట, చేత్తో పట్టుకోడానికీ వాడే ఒకరకం బుట్ట; చేత్తో పట్టుకోడానికి చిలకొయ్యకు తగిలించడానికీ వీలుగా పైన వంచికట్టిన వెదురుబద్ద ఉంటుంది; దీనిమూత సిబ్బిమాదిరిగానూ కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగానూ కొప్పుమాదిరిగానూ ఉంటుంది, దీని ఎత్తుభాగం వెలుపలనుంచి చుట్టూ మధ్యభాగంలో కళ్ళు (కంతలు) వచ్చేట్టు అల్లుతారు; కొన్నిటికి గద్దె ఉంటుంది. చూ. చిత్రం 69 క. (కో. 1).

కంతలతడక: ఉ. కంతల్తడికె; పర్యా. చూ. జేలితడక (1). వెదురుబద్దలు ఎడం ఎడంగా పెట్టి మేకులుకొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూ మధ్యసందులు చతురస్రంగాగాని డైమన్ఆకారంలోగాని ఉంటాయి, ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకొంటారు. (కో. 10).

కంతలవిసనగర్ర: ఉ. కంతలిసనగర్ర, పర్యా. చూ. జేలి విసనగర్ర. పేళ్ళమధ్య సందులు (జేలీలు) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 త. (కో. 3).

కంతిరికులం: సంకరమయిన కులం; చెడిపోయిన కులం; ఎరకలివాళ్ళ వాడుక. (తె 3).

కందబ్బ: (< కన్ను + దబ్బ) చూ. కన్నుబద్ద (రా.8).

కందాడు: పర్యా. చూ. మోకు (1). బండిమీద బరువు (గడ్డి, వొప్ప మొ॥) పేర్చినప్పుడు కిందపడకుండా బిగించికట్టే లావాటి కొబ్బరితాడు; నాలుగుపేటలుగా పేంతారు; పన్నెండు బారలనుంచి ముప్పై బారల వరకు పొడుగుంటుంది. (కో. 29, 30).

కందిపొడకర్ర: చుట్టూ నల్లటిమచ్చలుండే వెదురు గడ. (కో. 23).

కందిమండ: ఆకులతోఉన్న కందిమొక్క కొమ్మ(లు) (తె. 9).

కందిమండలపొరక: ఎండిన కందిమండలతోగాని పచ్చి కందిమండలతోగాని కట్టిన చీపురు; పశువుల దొడ్లు ఊడ్చుకోడానికి పనికొస్తుంది. (తె. 9).

కందూరి. ఒక మేకపోతును ముస్లిందేవుడిపేర విడిచి ఒక ముహూర్తాన దాన్నికోసి చేసుకొనే పండుగ. (తె. 21).

కన్నం: 1. పర్యా. చూ. [illegible] (1). [illegible] అల్లకంతో పేళ్ళమధ్య [illegible] కొనేటప్పుడు నూకలు మొ [illegible] కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 [illegible]. 2. 30. [illegible] (కో. 21, 22, 25, 33; [illegible] 1); 2 [illegible] జ్రెలి (1). కోళ్ళగూడు మొ॥ [illegible] కోళ్ళకు గాలి ఆడడానికి వీలుగా [illegible] సందు. చూ. చిత్రం 65 ట. 1. (కో. 3); [illegible] తొలి (2). [illegible] తయారీలో [illegible] ఉలితోచేసిన చిల్లి. (కో. 21); 4. [illegible] రంలో ఉండే కోళ్ళగూడుకు అడుగుభాగంలోని గడ. (తె. 23); 5. తాటిచాప అల్లకంలో రేకుకూ రేకుకూ (ఆకు) మధ్య ఏర్పడే సన్నటి [illegible]. (కో. 29).

కన్నాపురంబొంగు: పర్యా. [illegible] కన్నాపురం అడవుల్లో పెరిగిన వెదురుగడ; [illegible] మైంది. (కో. 14).

కన్నాపురంసరుకు: పర్యా. [illegible] కన్నాపురం అడవుల్లో పెరిగిన వెదురుగడ; [illegible] మైంది. (కో. 19).

కన్ను: 1. పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురు కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ [illegible] కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొద్దులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (కో. 24); 2. పర్యా. చూ. బొద్దు గనుపు (1). వెదురుగడ [illegible] పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు లోతుగాపడే బొద్దు లాంటి గుర్తు. చూ. చిత్రం 9. 1. (రా. 6); 3. నేలలోంచి వేళ్ళతోసహా పీకిన వెదురుగడకు మొదలు వంపుదిరిగినచోట వేరు చెలిగేసినప్పుడు మచ్చలా కనిపించే గుర్తు; ఇలాటివి కొన్ని ఉంటాయి. (కో. 22, 27; తె. 6, 7, 9, 17, 18, 20; రా. 9); 4. పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లికంలో పేళ్ళమధ్య ఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతల గుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2; 30 చ. 2. (తె. 3-5, 7, 17, 19); 5. పర్యా. చూ. ఖానా (3). పూలబుట్ట, గద్దెబుట్ట మొ॥ వాటి అల్లికంలో ఎత్తుగా అల్లిన భాగానికి మధ్యన బయటినుంచి ఏర్పరచిన సందు; ఇలాటివి చుట్టూ ఉంటాయి, [illegible] మొ॥వాటికి గాలి [illegible] (తె. 19); 6. [illegible] చూ. కంత (1). [illegible] (- బద్దలతో [illegible]) తయారీలో బద్దలమధ్య వచ్చే [illegible]; [illegible] ప్రాంతంలోనూ [illegible] ఉంటుంది. చూ. చిత్రం 38 [illegible]. 1. (తె. 9); 7. పర్యా. చూ. [illegible] (1). [illegible] (పశువుల మూతికి [illegible] బుట్ట) అల్లికంలో ఏర్పడిన బెంత; పశు వు [illegible] గాలి ఆడడానికి వీలుగా ఏర్పాటు చేస్తారు. [illegible] రా. 1); 8. పుట్టి (- నీటిమీద తేలేది) అల్లకంలో వచ్చే బెజ్జం. (రా. 8); 9 పర్యా. చూ. ఖానా (5). ఉయ్యాల అల్లకంలో అడుగు భాగంలోనూ పక్కలా బద్దలమధ్య వచ్చిన సందు; గడి (తె. 7); 10. పర్యా. చూ. బొక్క (2). గొర్రెపిల్లల గూడులోకి [illegible] వేయడానికి ఉంచిన సందు; [illegible] గొర్రెపిల్ల పట్టేంత సందు [illegible]. చూ. చిత్రం 77.4. (తె. 2); 11. పర్యా. చూ. జ్రెలి (1). కోళ్ళగూడు మొ॥వాటి అల్లకంలో కోళ్ళకు గాలి ఆడడానికి వీలుగా బద్దల మధ్య పెట్టిన సందు. చూ. చిత్రం 65 ట. 1. (కో. 31); 12. పర్యా. కంత (3). మూతబుట్ట, చిత్తుగాయితాల బుట్ట మొ॥వాటి అల్లకంలో వచ్చే చిన్నసందు. చూ. చిత్రం 78 క. 2. (కో. 27, 29); 13. పర్యా. ఖానా (6). చెంద్రిక (చూ.)లో అమర్చే 'పువ్వు' అల్లకంలో వచ్చే సందు; రంధ్రం. (రా. 6); 14. పర్యా. చూ. చిత్రం (2). ఈతచాప అల్లకంలో ఒక ఆకుకూ మరొక ఆకుకూ మధ్య ఏర్పడ్డ సందు; సూది దూరేటంత ఉంటుంది. (తె. 22); 15 పర్యా. చూ. బొక్క (4). చాపలనేత మగ్గం అచ్చు (- తుంగపోచ నేతలో కలవడానికి దగ్గరగా జరిపే పలక) కుండే బెజ్జం; ఇలాటివి సుమారు ముప్పై ఉంటాయి; ఈ బెజ్జాల గుండా పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 105.1. (కో. 3); 16. కొబ్బరికాయ జుట్టు (పట్టుకొనే పీచు)కు కింద గుండ్రంగా ఏర్పడిన మెత్తటిభాగం: దీన్ని పొడిస్తే బెజ్జంపడుతుంది; ఇలాటివి మూడుంటాయి. (కో. 25); 17. చూ. కన్నె (3). (తె. 11); 18. (—వేయు). పర్యా. చూ. గీద్ద నరుకు. వెదురుగడ మొదలు కత్తితో కొట్టకంపల్ల గుండ్రంగాపడ్డ నరుకు. (కో. 21); 19. పలుపుకు ఉండే రెండు పేటలమధ్య ముడిదూర్చే సందు.

చూ. చిత్రం 145.1; (తె. 11).

కన్నుకత్తి: పర్యా. చూ. వంకకత్తి (1). పొడుగు మాదిరిగా మొదలువంపు దిగిగిన వెదురుకత్తి; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెరిగేసిన చోట్ల మచ్చలుంటాయి, వేతింత్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (తె. 19).

కన్నుగుంపు: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరుపును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1; (కో. 27).

కన్నుదబ్బ: చూ. కన్నుబద్ద (రా. 8).

కన్నుపేడు: పర్యా. చూ. గంటీనె. గంటిబద్దనుంచి తీసిన పేడు; ఇది జల్లెడ, చేట మొ॥ అల్లడానికి పనికిరాదు; మోటువస్తువులు అల్లడానికి పనికొస్తుంది. (కో. 24).

కన్నుబద్ద: రూ. కన్నుదబ్బ, కంచబ్బ. పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (= వెదురు గడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతం వాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 8. (కో. 24).

కన్నె[1]: 1. పర్యా. చూ. ఖానా (3). పూలబుట్ట, గద్దె బుట్ట మొ॥ వాటి అల్లకంలో ఎత్తుగా అల్లినభాగానికి మధ్యన బయటినుంచి ఏర్పరిచిన సందు, ఇలాటివి చుట్టూ ఉంటాయి; లోపలఉండే పూలు మొ॥ వాటికి గాలి తగలడానికీ అందానికీ సందులు పెడతారు. (తె. 18); 2. పర్యా. చూ. ఖానా (5). ఉయ్యాల అల్లకంలో అడుగుభాగంలోనూ పక్కలా బద్దల మధ్యవచ్చిన సందు; గడి. (తె. 8); 3. రూ. కన్ను. (17); పర్యా. గండి (4), జేలి (7). ఈతబద్దతో అల్లిన ఉయ్యాల, కోళ్ళగంప మొ॥ వాటిలో గాలి ఆడేటందుకు వీలుగా పెట్టిన సందు (తె. 7, 9, 11); 4. ఉ. కన్ని, కన్నీ; పర్యా. పలుపు (1). పశువులమెడకు వేసి గుంజకు కట్టేసే తాడు; సుమారుగా గజంపొడుగూ మూడువేళ్ళ లావూ ఉంటుంది; తాడు రెండుచివర్లా రెండు పాయలుగా ఉంటుంది; ఒక పాయకు చివరముడి మరొకపాయకు చివర కొలికి ఉంటుంది; తాడును పశువుమెడకు తగిలించి ఒకపాయ చివరిముడిని రెండోపాయ చివరికొంకిలోకి దూరుస్తారు, తాడుకు రెండోవైపుండే భాగాన్ని గుంజకు కడతారు, కొన్ని రకాల కన్నెలకు పొడుగు తాడుమధ్య ముడివేసిన అమరుంటుంది. చూ. చిత్రం 115. (కో. 20, 25, 29, 30). 5. ఉ. కన్ని, కొన్నిరకాల కన్నెలలో మధ్యన రెండు కొయ్యలు (రింగులు) తగిలించిన ఏర్పాటు, చూ. చిత్రం 131. (కో. 20)

కన్నె[2] ఒక మోస్తరు పొడుగుండే ఈతచెట్టు. (తె. 13).

కన్నెలబుట్ట (<కండెలబుట్ట) సాలెవాళ్ళు దారం కండెలు వేసుకొనే ఈతబుట్ట. (తె. 9).

కన్యాదానంగంప: పర్యా. చూ. పెళ్ళికూతురు గంప. పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టడానికి అల్లే వెదురుగంప; కింద నాలుగుమూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది: కొన్నిచోట్ల దీని అంచుచుట్టూ చేట కట్టు (= వెదురుబద్దలతో బిగింపు)లాంటి కట్టు ఉంటుంది, కొన్నిచోట్ల ఏమీఉండదు; పెళ్ళికూతురు గౌరీపూజ చేసేచోట పెళ్ళికూతుర్ని అందులో కూర్చోబెడ తారు; పూజ అయి మంత్రాలు చెప్పినతరవాత పెళ్ళి కూతురు కూర్చున్న గంపను పెళ్ళిమండపంలోకి ఎత్తుకువస్తారు; పెళ్ళి (ముహూర్తంవేళ జరిగే తతంగం) అయ్యేవరకు పెళ్ళికూతురు ఆ గంపలోనే ఉంటుంది. (కో. 9)

కపిలమోకు: రైతులు మోట (కపిల) బావినుంచి నీళ్ళుతోడే పెద్ద బొక్కెనకుకట్టే లావుపాటి తాడు. (రా. 5).

కప్పచిమ్మెబుడుపు. ఉ. –కిమ్మె ; పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు కనిపించే పెకల్పు గుర్తు; కొమ్మ లావుగా ఉండడంవల్లగాని ఒకేచోట రెండు మూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికి నప్పుడు పెద్ద గుర్తుపడుతుంది; ఇలాటి కణుపుఉన్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 4).

కప్పతీగ: చేట కట్టుకట్టడానికి పనికొచ్చే ఒకరకం తీగ. (కో. 23).

కప్పలబుట్ట: కప్పలు పార్సెల్‌చేసే బుట్ట. (కో. 26).

కప్పు: ఉ. కొప్పు. 1. పర్యా. చూ. మూత (1). చేతిబుట్ట (మూతబుట్ట, కమాన్‌బుట్ట) మూయడానికి వెదురుపేళ్ళతో అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; కొన్ని బుట్టలకు దీన్ని బోర్లావేసి వేస్తారు; కొన్నిటికి వెల్లకిలా వేస్తారు. చూ. చిత్రం 59 1. (కో. 22, 23, 26, 28, 31); 2. పర్యా. చూ. మూత (5).

సారెపెట్టె, బట్టలపెట్టెలను మూసే కప్పు; దీర్ఘ చతురస్రాకారం పళ్ళెంమాదిరిగాఉంటుంది; కొన్నిటి అంచులకు బద్దతో కట్టువేస్తారు. చూ. చిత్రం 41.1. (కో. 22); **3.** పర్యా. చూ. సిబ్బి (2). చేతిబుట్ట (మూతబుట్ట), పూలబుట్ట, ఆకులగంప మొ॥ వాటి మూతిభాగాన్ని మూసే కప్పు, అన్నం వార్చుకొనే సిబ్బిమాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 72.(కో.31); **4.** చతురస్రాకారపు కోళ్ళగూడుకు పైన అల్లిన (అడుగు) భాగం; ఇలాటివి పైనాకిందా (కింది అడుగు, అడుగు) ఉంటాయి. (తె. 23, 26).

కప్పుదబ్బ: శవాన్ని తీసుకువెళ్ళే రథంమీద కప్పుకు బిగించే బద్ద. (కో. 2).

కప్పుదాగర: పెట్టెలాంటి దాగర (చూ.) మీది మూత. (కో. 30).

కప్పుబద్ద: **1.** వెదురుబద్దల అలమారుకు పక్కల బద్దలుకొట్టి ఆ బద్దలమీదుగా చుట్టూ చట్రం మాదిరిగా కొట్టినబద్ద. (తె. 8); **2.** దీర్ఘచతురస్రపు కోళ్ళగూడు కప్పుమీంచి గట్టిదనంకోసం వేసినబద్ద. (తె. 22).

కమలపు విసనగర్ర. ఉ. కంవలపిస్నకర్ర; పర్యా. చూ. పద్మాలవిసనగర్ర. తామరపువ్వు (పద్మం) వంటి డిజైను వచ్చేటట్లు అల్లిన (వెదురుపేళ్ళ) విసనగర్ర. (తె. 26).

కమలాలపంకా: ఉ. కమ్లాలపంక; పర్యా. చూ. పద్మాల విసనగర్ర. తామరపువ్వు (పద్మం)వంటి డిజైను వచ్చేటట్లు అల్లిన (వెదురుపేళ్ళ) విసనగర్ర. (తె. 17).

కమాన్: (హిం.) **1.** పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట; గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచికట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 6, 7, 9, 10, 13, 17, 19, 23); **2.** పర్యా. ఆర్చి. వీధికి అడ్డంగాగాని, ఇంటి సింహద్వారం ముందుగాని తోరణాలు కట్టడానికి విలువంపుగా వెదురుబద్దలతో కట్టినచట్రం. చూ. చిత్రం 111. (తె. 9, 16).

కమానుదబ్బ: **1.** చూ. కమాన్‌బద్ద (1). (రా. 2); **2.** శవాన్ని తీసుకువెళ్ళే రథంమీద విలువంపుగా కట్టిన వెదురుబద్ద. (కో. 2).

కమాన్‌కట్టె: పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికి వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 13).

కమాన్‌బద్ద: ఉ. కమానుబద్ద; **1** రూ. కమానుదబ్బ; పర్యా. ఉగ్గందబ్బ. ఉగ్గం, కడెం (2), కడెంబద్ద, కమాన్ (1), కమాన్‌కట్టె, కాడ (7), కొయ్యి (4), గొబ్బం, చుట్టుబద్ద (2), చేతిబుట్టదబ్బ, చేదబ్బ, తూకు, తూకుదబ్బ, పైదబ్బ (2), బద్ద (5), వంకెబద్ద, వంపుడుబద్ద (1), వెదురుబద్ద, సజ్జకొయ్య, సజ్జబద్ద. చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచికట్టినబద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 7, 9, 10, 15, 18, 28, 31; రా. 10); **2** పర్యా. చూ. క్రాసుబద్ద. వెదురుమంచం తయారీలో వెడల్పుభాగాన ఉన్న రెండుకాళ్ళను (కోళ్ళను) కలుపుతూగాని కాలిసీ అడ్డంబొంగు (అడ్డంపట్టె)నూ కలుపుతూగాని మూలదగ్గర అడ్డంపట్టెనూ నిలువుపట్టెనూ కలుపుతూగాని ఐమూలగా కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 108.1; (తె. 16).

కమాన్‌బుట్ట: ఉ. —బుట్టి; పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్దవంచి కడతారు; పైనమూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట పళ్ళెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈబుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటానీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు. చూ. చిత్రం 139. (తె. 7, 10, 13-15).

కంపచిల్లబొంగు: ఉ.—శిల్ల—; పర్యా. చిల్లబొంగు. కణుపుచుట్టూ చిన్నచిన్న చిల్ల (కొమ్మ)లూ ఆ చిల్లలకు ఇంకా చిన్నచిల్లలూ ఉన్న వెదురుగడ; వంకులు వంకులుగా ఉంటుంది; కంచె కట్టడానికి ఉపయోగిస్తారు. (తె. 23).

కమ్మ: **1.** పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికిచీలిస్తే వచ్చే ఒకభాగం. (కో. 19, 20-23, 26-28, 30-31); **2.** పర్యా.చూ. బద్ద (1). వెదురుగడ నిలువుగా నాలుగుభాగాలుగా చీలిస్తే వచ్చే భాగం; గడంతపొడుగునా సుమారు రెండు

వేళ్ళ వెడల్పుఉంటుంది. (కో. 23); 3. సర్యా చూ. ఈతాకు. ఈతచెట్టు మట్టనుంచి తీసిన ఆకు; ¼ అంగుళం వెడల్పు గోరుమందమూ ఉంటుంది, దీని క్రిందటిభాగం మధ్యభాగంకన్న వెడల్పు తక్కువగాఉండి, కొస సన్నగా మొనదేలిఉంటుంది; తెల్లగానూ లేత పసుప్పచ్చగానూ ఉంటుంది; మామూలుగా అంటుకొనిఉన్న రెండుపాయల్ని విడదీసిన ఒక పాయనుకూడా ఈతాకు అనే అంటారు. చూ. చిత్రం 2. 2, 115. (తె. 19); 4. పర్యా. కొబ్బరి కమ్మ. కొబ్బరిమట్టకు చివర ఆకులు పెరిగినభాగం; కమ్మ పక్కంచులకు ఆకులుపెరుగుతాయి. (కో.20); 5. పర్యా. చూ. తాటికమ్మ. తాటిమట్టకు చివర నొక్కుడురేకుల మాదిరిగా పచ్చగా పలచగా విస్తరించిన భాగం; ఇళ్ళు, పందిళ్ళు మొ॥ కప్పడానికీ దడికట్టడానికీ వాడతారు. చూ. చిత్రం 123. (కో. 12, 26).

కమ్మకత్తి: ఈతకమ్మకోసే ఒకరకం కత్తి; దీన్ని పొడుగాటి వెదురుగడకుకట్టి సన్నటికమ్మలు కిందికి గుంజుతారు; చెట్టు ఎత్తుగాఉంటే ఇలా చేస్తారు. చూ. చిత్రం 145. (తె. 13).

కమ్మకొడవలి: ఉ. కొడలి; పర్యా. చూ. గైకొడవలి. భూమ్మీద నిలబడి ఈతచెట్టుమీంచి మట్టలు కొయ్యడానికి పొడుగాటి కర్రకు అమర్చినకొడవలి; కొన్నిచోట్ల ఈ కొడవలికాడ చివరిభాగం ఉంగరంలా వంపుదిరిగి ఉంటుంది; మరికొన్నిచోట్ల గొట్టంలా ఉంటుంది. చూ. చిత్రం 116, 117. (తె. 22).

కమ్మచెక్క: పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికిచీలిస్తే వచ్చే ఒక భాగం. (కో. 20, 23).

కమ్మబద్ద: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగా రాదు; ప్రతి గడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 21).

కమ్మముల్లు: పర్యా. తోకముల్లు. ఈతచాప అల్లిన తరవాత మిగిలిన ఆకు కొసముల్లు. (తె. 22).

కమ్మరివాళ్ళు: ఉ. కమ్మరోల్లు; పర్యా. చూ. కమ్మర్లు. ఇనప పనిముట్లూ మొ॥ చేసే పనివాళ్ళు. (కో. 28).

కమ్మర్లు: ఉ. కమ్మార్లు; పర్యా. కమ్మరివాళ్ళు, సరాబులు. ఇనప పనిముట్లూ మొ॥ చేసే పనివాళ్ళు. (కో. 24).

కమ్మి పర్యా. రాడ్డు. పేముకర్రల్ని అవసరమైన విధంగా వంచుకోడానికి నేలలో పాతిన ఇనపకడ్డీ; ఇలాటివి రెండుంటాయి. (కో. 12).

కమ్మిన్: గోడిసీమీద 'Come in'' అనే అక్షరాల డిజైను. (కో. 20)

క్రమా: (హిం.) ఉ. క్రమ; పర్యా. చూ. ఖానా (1). వెదురుగడలు నిలవవేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి వాటికి ఎదురుగా గజం ఎడంలో మరో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి ఆ నాలిగింటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు)కట్టి ఒక వైపు ఖాళీ ఉంచుతారు; ఖాళీవేపును గొలుసుతోగాని గడతోగాని మూసి తాళంగూడా వేసుకోవచ్చు. (తె. 13).

కరండి: (< సం. కరండ). పర్యా. చూ. ఆకులగుజ్జైన (1). ఇంట్లో వాడకంకోసం తమలపాకులు పెట్టుకొనే చిన్నబుట్ట; దీనికి కమాన్‌బద్ద (=పట్టుకోడానికి వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) ఉంటుంది; కొన్నిటికి మూత ఉంటుంది, పేళ్ళమధ్య సందులు (భాగాలు) ఉంటాయి; గద్దె ఉండదు. (తె. 22).

కరదబ్బ: పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందు భాగంలో రెండుమూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు చూ. చిత్రం 29.2; (రా. 3).

కరి: వడి; పురి; తాడునుగాని పాయనుగాని అప్పడం వల్లవచ్చిన బిగువు: కరిబెట్టకుండా పేనితే తాడు బిగువుగా రాక (సడలిపోయి) తొందరగా తెగుతుంది (తె. 9).

కరిపించు: (క్రి.) ఉ. కరిపిచ్చు. 1. పర్యా. కత్తి వేయు, నాటు, నాటువేయు. వెదురుగడకు దిగువ గాటుపెట్టి కత్తి దూర్చడం; గడ రెండుబద్దలుగా చీరడానికి కత్తిదూర్చి చేత్తోగాని కొయ్యమొద్దుతో గాని కొడతారు. (కో. 2, 3, 5, 16, 19, 22, 23; తె. 6, 23, రా. 8-10); 2. పర్యా. కూడిగటట్టు, చెక్కదీయు, పలుకుబట్టు. పేడు చీరేటప్పుడు వార (=వేలెడు వెడల్పుబద్ద) లేదా పలుకు మొదటి భాగంలో ఒకంగుళం పొడుగువరకు వరసగా పేళ్ళు చీరి ఉంచడం; కొత్తగా పని నేర్చుకొనేవాళ్ళకు ఇలాచీరి ఇస్తారు; ఆ తరవాతబద్ద చీరడం

సుఒపవుతుంది. (కో. 22, 27).

కరిబెట్టు: (క్రి) పడిబెట్టిన పుల్లకొనను దేనికైనాకట్టి రెండోకొన పట్టుకొని దూరంగాపోయి మళ్ళీ అప్పడం; పడిబెట్టడం. (తె. 9).

కరివేపాకు ఎరకలి: ఉ. కరిప్పాకు యెక్కలి; కరివేపాకు అమ్ముకొని జీవించే ఎరకలివాళ్ళు; ఒక తెగ. (కో. 4).

కర్దవ: పొగచూరిన దుమ్ము. (రా. 3).

కర్ర: **1.** పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి మూలమంత మందం వరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ. గంప మొ॥వి అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతి కర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (కో. 29); **2** పర్యా. ఒడ్డువార (1), కట్టుగర్ర (6), కడుపుదబ్బ, గోవ (4), చుట్టుగట్టుకర్ర, చేట కర్ర, వార (8), వెన్నుగర్ర (4), సిరిపెందె. చేట అంచుకట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకులోపలి నుంచి ఒకబద్దా వెలుపలినుంచి ఒకబద్దాపెట్టి ఈ రెంటి మీదినుంచి, ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్లు సందును మూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్రపెట్టిన తరవాత కట్లుకడతారు. (కో. 2, 5 9‒11, 13, 15, 17; తె. 3, 4, 7‒10, 12, 13, 15‒25, 31; రా. 2, 4‒6 8‒11); **3.** పర్యా. ఈనె (3), కట్టుగర్ర (3), గోడు (1), గోరు (2), చువ్వ (2), జోడెం (2), పుల్ల (1). పూర్ల (2), పోగు (1) బదుము (3), వార (6). వెదురీనె, సన్నకర్ర (3), సెల్గెపుల్ల (2). గోవ (వార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువ గాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47. చ. 1. (కో. 2; తె. 1‒5, 7, 10, 12‒15, 17, 19, 21‒23; రా. 8‒11); **4.** పర్యా. బదువార (2), కట్టుగర్ర (5); గుండు (2); చెక్రం (1), జల్లెడకర్ర (1), జల్లెడగుండు (1), జల్లెడమూర, సైగుండు (2), రౌండుకట్టు, వార (9), వెదురుకడెం. జల్లెడ అంచు కట్టడానికి లోపలిగుండు, బయకు (వెలుపలిబద్ద)ల మీంచి, ఆ రెంటిమధ్య కొంతభాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా పంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుబద్ద (కో. 3, 10, 12; తె. 15, 17, 18, 22, 25, 28, 30; రా. 10), **5.** కొడమలో గుండ్ల మధ్య జేత అమర్చడానికి వాడే తీగలాంటి వెదురు ఈనె (కో. 2); **6.** పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల మొ॥ వాటి అంచులకు తొడిగే వెదురు కర్ర. చూ. చిత్రం 32. 1. (కో. 1); **7.** చెంద్రిక పువ్వు అల్లే పంచటిపేడు. (రా. 6); **8.** పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టం తొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట.2. (కో. 24, 27, 30, 31; తె. 7, 8, 10, 13, 16, 18); **9.** నులకమంచం అల్లకంలో చేట డిజైన్‌లోవచ్చే తాడు. (రా. 4); **10.** పర్యా. చూ. వంకె కర్ర. వంకె (చూ.) నిర్మాణంలో 'X' ఆకారం కర్రలకు కట్టిన గజంపొడుగు వెదురుకర్ర. చూ. చిత్రం 14. చ. 1. (కో. 24; తె. 31).

కర్రపని: అల్లకంలేకుండా వెదురుగడలతోనూ బద్దల తోనూ చేసేపని; కుర్చీలు, బెంచీలు మొ॥ ఇలా చేస్తారు. (తె. 28).

కర్రపోచ: ఉ. — పోస; పర్యా. చూ. గోలుకర్ర. గుండ్రంగానూ కాస్తలావుగానూ ఉండేకర్ర (చూ. కర్ర); గంప మొ॥ వాటి అల్లకంపనిలో కట్టు చుట్టడానికీ అడుగుదొక్కడానికీ పనికొస్తుంది. (తె 27).

కర్రబదుము: ఉ. – బదుం; **1.** పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥ వాటి అల్లకంలో బొడ్డడుగూ అడుగూ అల్లడానికివాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతి దగ్గర అల్లడానికీ ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (తె. 6, 14, 18); **2.** పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించేకర్ర (చూ. కర్ర); పేడులో సగంవెడల్పూ కొంచెం

గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (తె. 16).

కర్నకట్టె: పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీద మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 14).

కర్నడ: 1. రూ. కడ్నరం; పేళ్ళమధ్య సందులు లేకుండా చిక్కగా అల్లిన జల్లెడతట్ట; చుట్టూ ఉండే చివరిభాగం; దీనికి రెండుగుండ్ల (చూ. గుండు) మధ్య (బద్దలు) ఇరికించి అంచుకడతారు. (తె 18, 19, 25-28; 2. గుమ్మి (గాదె) అడుగు అల్లిన తరవాత నిలువులను పైకిలేపే ముందు చిట్టి బిలుకుతో అల్లిన చిక్కటి అల్లకం. (తె. 28).

కలడుగు: (కల+అడుగు) పర్యా. చూ. జమిలడుగు. వెదురుపేళ్ళ గంప మొ॥వాటికి రెండుపొరలుగా అల్లిన కిందిభాగం (అడుగు), గట్టిదనంకోసం ఒక అడుగు కర్రతోనూ ఒక అడుగు పేడుతోనూ అల్లుతారు; రెండడుగులూ వేరువేరుగా అల్లి అతుకుతారు. (రా. 4).

కలనేతచాప: ఉ. కల్నేత్సాప; — సాప; మూడు రంగులు పోచలుకలిసి నేసే తుంగచాప. (కో. 3).

కలపడితి: (<కలప+అడితి), కలప (సరివికట్టె, వెదురుగడ, ఈతకట్టె మొ॥వాటి) దుకాణం. (కో. 18).

కలబంద: రూ. కలమంద. నారతియ్యడానికి పనికి వచ్చే ఒకరకం మొక్క; దీనిమట్ట దళసరిగా ఉంటుంది; వీటిని నానబెట్టి బండకువేసి ఉతికితే నార వస్తుంది. Aloe borbadensis (రా. 3).

కలబందగుమ్మి: రూ. కలమందగూమి, పొదలాగ విస్తరించిన కలబందమొక్క; విచ్చుకొన్న పువ్వులాగ ఉంటుంది; ఆకులచుట్టూ ముళ్ళుండడంవల్ల కంచెలా వాడతారు; దీని మట్టలనుంచి నారతీస్తారు. (రా. 5).

కలబందనార: రూ. కలమందనార; కలబందమట్టలు నానబెట్టి బండకువేసి ఉతికితే వచ్చే సన్నటిపోగులు; దీంతో తాళ్ళు పేనవచ్చు. (రా. 5).

కలబందపట్ట: పర్యా. కత్తాలపట్ట. (తుంగ) చాప నేతలో నిలువుకు అవసరమైన నారపోచలుతీసే మట్ట; సుమారు బెత్తెడువెడల్పున లేతాకు పచ్చ రంగులో ఉంటుంది; అంచులకు రంపంపళ్ళలాంటి ముళ్ళు ఉంటాయి; మొదట వెడల్పుగాఉండి పోను పోను సన్నంగా మొనదేలి ఉంటుంది. (కో. 3).

కలబందమట్ట: కలబంద ఆకు, బాగా దళసరిగా ఉంటుంది; దీన్నించి నార తీస్తారు. (రా. 5).

కలబందముల్లు: కలబందమట్టకు ఉండే ముల్లు. (రా. 5).

కలమంద: చూ. కలబంద. (రా. 4).

కలమందనార. చూ. కలబందనార. (రా. 4).

కలంపుల్ల: పేముకుర్చీ అల్లకంలో పూలపని వరసలు వచ్చిన భాగాలకు రంగువేసే కుంచె లేదా సన్నటి పుల్ల. (కో. 12).

కలర్‌చాప: ఉ. -సాప; పర్యా. రంగుచాప. (తుంగ) పోచలకు రంగులద్ది డిజైన్లు వచ్చేటట్లు నేసిన చాప. (రా. 6).

కల్లిబోవు: (క్రి.) పర్యా. తుర్రెముపో- తూలిపోవు. రాళ్ళు తగిలి మేదరికత్తికి పదునువేపు ముక్క విరిగి పోవడం. (కో. 3).

కల్లుకుండగంప: పర్యా. అంచెబుట్ట (2). కల్లు కుండలు చేరవేసే వెదురుగంప, అంచెలంచెలుగా చేరవేస్తారు. (తె. 14).

కల్యాణిపట్టె: పర్యా. చూ. అంచుపట్టె (2). ఈతచాప చుట్టూ కొసలను మూసేస్తూ కుట్టడానికి అల్లినపట్టె; చాపలో వరసలుగా వచ్చే పట్టెంకన్న దీని వెడల్పు తక్కువగా ఉంటుంది; చాప అంచులు చిరిగి పోకుండా ఉండటానికి ఈపట్టెను కలిపి కుడతారు. చూ. చిత్రం 122.1, (తె. 22).

కళ్యాణమంటపం: ఉ. కల్యాన-; పర్యా. పెండ్లి పందిరి, లగ్గంపందిరి. వెదురుతోగాని కొబ్బరి మట్టలతోగాని అల్లిన పెళ్ళిమంటపం; పెళ్ళివేళ పెళ్ళికొడుకునూ పెళ్ళికూతుర్నీ ఇందులో కూర్చో బెడతారు. చూ. చిత్రం 102. (తె. 4, 28, 31).

కళ్ళజంగిడి: ఉ. కల్ల-; ఉడికిన కూరగాయ ముక్కలు వడకట్టడానికి వాడే చిన్నదాగర (చూ.); దీనికి అడుగున చిల్లులు (కళ్లు) ఉంటాయి; కూర గాయల్లోని వేణ్ణీళ్ళు ఓడిపోడానికి ఇందులో పోస్తారు, జేనెడు పొడుగూ రెండుబెత్తల వెడల్పూ బెత్తెడు ఎత్తూ ఉంటుంది. (కో. 26, 28, 29).

కళ్ళంజల్లెడ: ఉ. కల్లం—; సాసులు, చోళ్ళు మొ॥వి కళ్ళంలో శుభ్రం చేయడానికి వాడేజల్లెడ. (కో. 23).

కళ్ళనేత: ఉ. కళ—; పర్యా. చూ. కేన్‌గవాచి నేత. పేముతీగల మధ్య సందులు వచ్చేటట్లు అల్లడం;

కొన్నిచోట్ల కుర్చీలు మొ॥వి ఇలా అల్లుతారు (కో. 19).

కళ్ళనేతతీగ: ఉ. కళ—; కళ్ళనేత (చూ.)కు వాడే పేముతీగ; పేముబెత్తాన్ని నిలువునా ఆకుబద్దలుగా చీరినప్పుడు వచ్చేది. (కో. 19).

కళ్ళసజ్జ: ఉ. కల్ల—; పర్యా. చూ. కంతబుట్ట. బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికీ (గాలి తగలడంకోసం) ఉల్లిగడ్డలు మొ॥ పోసి పెట్టుకోడానికీ వాడే ఒకరకం బుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా పైన వంచికట్టిన వెదురుబద్ద ఉంటుంది; దీని మూత సిబ్బి మాదిరిగానూ కొన్నిచోట్ల పళ్ళెంమాదిరిగానూ కొప్పుమాదిరిగానూ ఉంటుంది; దీని ఎత్తుభాగం వెలుపలినుంచి చుట్టూ మధ్యభాగంలో కళ్ళు(కంతలు) వచ్చేట్టు అల్లుతారు; కొన్నిటికి గద్దె ఉంటుంది. చూ. చిత్రం 69 క. (కో. 29).

కళ్ళాలచేట: ఉ. కల్లాల—; కళ్ళం (= పంట నూర్చడానికి అలికి నున్నగా తయారుచేసిన చోటు)లో వరిపంటనూర్చి తూర్పారబట్టడానికి వాడే చేట. (కో. 3).

కవరప్‌బద్ద: (ఇం. Cover up—) పర్యా. చూ. బిర్రుదబ్బ. వెదురుతడక వంగిపోకుండా గట్టిదనం కోసం అడ్డంగాగాని నిలువుగాగాని వేసినబద్ద. (తె. 31).

కవలలుయ్యాలపెట్టె: (< కవలల + ఉయ్యాలపెట్టె) కవల పిల్లలను పడుకోబెట్టే ఉయ్యాల; దీంట్లో రెండు అరలుంటాయి. (కో. 9).

కవాచిబల్ల: ఉ. కవాసి—; పర్యా. మునుపలక. మగ్గం ముందుభాగంలో నేసేవాడు కూర్చునే పొడుగాటి చెక్క. చూ. చిత్రం 120 ట. 1. (కో. 21).

కవాపుల్ల: (హిం. కబాబ్—) ఉ. కావాపుల్ల; చూ. కవాబ్‌పుల్ల (తె. 8, 31).

కవాబ్‌పుల్ల: (< హిం. కబాబ్) రూ. కవాపుల్ల. కాల్చుకోడానికి మాంసంముక్క (కబాబ్) గుచ్చే వెదురుపుల్ల; కల్లుపాకల దగ్గర మాంసంముక్కలు కాల్చి అమ్మేవాళ్ళు వాడతారు. (కో. 25, 26).

కవిరికర్ర: భూమిలోనుంచి పురుగు లోపలికిచేరి కొట్టిన వెదురుగడ్డ; కిందినుంచి పైదాకా కొడుతుంది; పచ్చిగాఉన్న వెదురు క్రమంగా పాలిపోతుంది; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 27).

కవురు: ఉ. కౌరు 1. పర్యా. పెడసు. వంచితే విరిగిపోయేలక్షణం; పెళుసు; వెదురుపొదకు నీళ్ళుసరిగా అందకపోవడంవల్ల గడ పెళుసవుతుంది. (కో. 11); **2.** పాలిపోయిన; వెదురుమొక్క లేతగా ఉన్నప్పుడు కొండముచ్చు చివర్లు కొరికెయ్యడంవల్ల సరిగా పెరగకపోవడంవల్ల వెదురుగడ పాలిపోతుంది. (తె. 19).

కవురుకర్ర: ఉ. కవుర—; పర్యా. చూ. కవురుబొంగు (1). తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురుగడ; తెల్లగాగాని నల్లగాగాని అవుతుంది; సరయిన జిగిఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; జెలితడకలకు మాత్రం పనికొస్తుంది. (కో. 24–26, 28).

కవురుబొంగు: ఉ. కౌరు ; **1.** పర్యా. కవురుకర్ర, కొటిబొంగు, దప్పకర్ర (2), పెడుసుబొంగు, బొండుకర్ర, మెత్తకవురుబొంగు, లొట్టబొంగు; సొప్పకర్ర. తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురుగడ; తెల్లగాగాని నల్లగాగాని అవుతుంది; సరయిన జిగిఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; జెలితడకలకు మాత్రం పనికొస్తుంది. (కో. 2, 6, 25–27; తె. 14, 16–23, 25–28; రా. 7, 10, 11); **2.** ఆకులిచ్చుకోకముందు నరికిన వెదురుగడ; పేడు తీయడానికి పనికిరాదు. (తె. 7).

కవులబొంగు: పర్యా. చూ. లేతబొంగు (1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతిముందు కోతకు వస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగాఉండి పేడు సులువుగా చీల్చడానికి వీలవుతుంది; లోపల బోలు తక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడిఉంటుంది; (ఈ బూడిదనుబట్టి మొక్కవయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చరంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (తె. 22).

కవుటు: **1.** పర్యా. చూ. కుతికె (1). మేదరికత్తికి పదునుభాగమూ కాడా కలిసినచోట వంపుదిరిగిన భాగం (తె. 24); **2** పర్యా. చూ. గడ్డం (1). మేదరికత్తి కాడపేపునుంచి పదును మొదలయ్యే చోట కొంచెం మొనదేలిన భాగం. చూ. చిత్రం 12 జ. 5. (తె. 22).

కవేలు: పెంకు కప్పుగల ఇల్లు; పెంకుటిల్లు. (తె. 4).

కవేలితడక: ఉ. కవే ల్తడ్క; ఇళ్ళకు కవేలిపెంకు కప్పేటప్పుడు పెంకుకిందవేసే తడక. (తె. 9).

కవ్వం: పెరుగుచిలికే వెదురుగడ. (తె. 10).

కవ్వు: బావిలో కూడినమట్టి; పూడిక. (కో. 25).

కవ్వుదీయు: (క్రి.) బావిలో పూడిక తీయడం. (కో. 25).

కాకిములస: ఉ.—ముల్స; నలుపురంగులో ఉన్న ములస. (కో. 15).

కాకివాసం: **1.** పర్యా.చూ. సైరబొంగు (1). వంకలు లేకుండా నిటారుగాపెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గాఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 5, 10), **2.** మామూలు లావూ కణువులమధ్య ఎక్కువ ఎడమూ ఉండే వెదురుగడ; లోపల బోలుగా ఉంటుంది, పొడుగ్గా ఉండడంవల్ల కాకివాసమని పేరు వచ్చిందంటారు' (తె. 7); **3.** పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర, చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతి కర్రలకూ ఉపయోగిస్తారు. (రా. 11).

కాకివెదురు: ఉ. కాకెదురు; **1.** పర్యా. చూ. సైరబొంగు (1). వంకలు లేకుండా నిటారుగా పెరిగిన వెదురుగడ; బోలుఎక్కువగా ఉండి తేలిగ్గా ఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 1); **2.** పర్యా. చూ. పసరుబొంగు. పసరు దనం ఉండే వెదురుగడ; లేతగా ఉంటుంది. (కో. 6); **3.** పర్యా. చూ. ఎర్రబొంగు. ముదురు ఎరుపురంగులో ఉండే వెదురుగడ. (కో. 7, 10); **4.** పర్యా. చూ. గడుసుబొంగు, పెళుసైన వెదురు కర్ర; పేదు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగి పోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెలకట్టుబడికీ పనికొస్తుంది. (రా. 3).

కాకెడుగు: (< కాకి + అడుగు) ఉ. - అడ్గు; పర్యా. చూ. జమిలడుగు. వెదురుపేళ్ళగంప మొ॥ వాటికి రెండుపొరలుగా అల్లిన కిందిభాగం (అడుగు; గట్టి దనంకోసం ఒక అడుగుకర్రతోనూ ఒక అడుగు పేదుతోనూ అల్లుతారు; రెండడుగులు వేరువేరుగా అల్లి అతుకుతారు. (తె. 18).

కాంచి: చూ. క్రైంచి(2). (తె. 5).

కాంచీడు: చూ. క్రైంచి(2). (తె. 4).

కాటాజిబ్బిలి: పర్యా. చూ. తరాజుసిబ్బి(1). వెదురు పేడుతోఅల్లిన తక్కెడపళ్ళెం. (కో. 23).

కాటిపాపలు: శ్మశానం (కాడు)లో బిచ్చమెత్తుకొనే ఒకతెగ; ఎవరైనా చనిపోయినప్పుడు చనిపోయిన వ్యక్తికి సంబంధించిన వాళ్ళదగ్గర అడుక్కుంటారు; బిచ్చంపెట్టకపోతే శవాన్ని దహనం చెయ్యకుండా అడ్డుకుంటారు. (తె 21).

కాటుకపూసలు: పర్యా. నల్లమాణిక్యాలు. వెదురు గడను చీల్చినప్పుడు కొన్నికణుపుల దగ్గర అరుదుగా కనిపించే నల్లటిఉండలు; దేనికీపనికిరావు (మొదట అవి నల్లవజ్రాలట; మేదరివానికి తెలియక "అయ్యేమిటి? నల్లగ తగలబడ్డయి'' అని అన్నాడట. శంకరుడు ''అట్లానే కానీ'' అన్నాడట. అప్పట్నుంచీ అవి ఉత్త మసిఉండ లయినాయట). (కో 9).

కాటుదుంప: పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకు తగిలి మొక్కపోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంతలావు ఉంటుంది; వెదురు గడ పగలగొట్టడానికి గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (తె. 27).

కాటుమొద్దు: పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తినేలకు తగిలి మొక్కపోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (కో. 11; తె. 12, 28, 31).

కాడ: **1.** పర్యా. ఊచమడిమె, కాలు(1), కొస(1), చివర(5), చేతులపిడి, తొడిమె(1), తోక(1), దామ(1), నడుము(1), పిడి(2), బుడుము(1), మడం(3), మొచ్చుపిడి, మొండెం. మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (కో. 3, 5-11, 13, 15-18; తె. 2, 3, 5-9, 22, 26, 27, 30, 31); **2.** పర్యా. చూ. తొడిమె(4).మొనదేలకుండా పలకగా ఉండే అంబు (చూ.) కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ వేలెడుగాని రెండు వేళ్ళుగాని వెడల్పూ

ఉంటుంది; ఇలాంటి కొడుగల అంచుకుండే పడగ భాగం మొనదేలి ఉంటుంది, చిల్లులు పొడిచేటప్పుడు ఈకొడ పట్టుకొంటారు. (తె. 3); 3. పర్యా. చూ. కూలు (2). ఒకరకం అంచు (చూ.)కు మొనదేరి ఉండేకొడ; సుమారు రెండుబెత్తల పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥ వాటికి కట్టు కట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. 1. (కో. 10, 13, తె. 9); 4. కొయ్యపిడి లేని ఉలి పట్టుకోడానికుండే లావాటి భాగం; కడ్డీలాంటిది. (తె. 6); 5. పర్యా. దంగి (2). ఎరకలికత్తి (కొడవలి) పిడికీ వెన్నుకూ మధ్య ఉండేకొడ. చూ. చిత్రం 13 క. 2. (తె. 11); 6. పర్యా చూ. బద్ద (4). విసనగ్ర[illegible] పట్టుకో[illegible]నికి అల్లకంలో ఒక అంచు వెంబడి అ[illegible] సన్నటి [illegible]బద్ద; కొన్నిచోట్ల [illegible]నికి గొట్టు [illegible] [illegible] [illegible]ట్ట తొడిగే బద్దకు [illegible]గొట్టం [illegible]కుండా [illegible] బుడిపె ఉంటుంది. [illegible] [illegible] 31 [illegible]. 2. (కో. 5, 17, 23, 26 [illegible]. 2); 7 [illegible] చూ. [illegible]పాన్‌బద్ద (1) చేతబుట్ట, క[illegible]తబుట్ట. [illegible]ద్దెబుట్ట. గ్లాసుబుట్ట మొ॥ వాటికి [illegible]ంచి ట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది [illegible]మాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. [illegible]త్రం 69 క. 4. (కో. 1-3 5, 20, 22; తె. 8). 8. కొబ్బ[illegible]కాయి మూచికుపైన సుమారు చిటికె[illegible]వేలెడు లావుండే తీగ; కొబ్బరికాయను చెట్టుకుపట్టి ఉంచేది. (కో. 25); 9. కొబ్బరి డొక్కలు చితగ్గొట్టే కొయ్యదుక్క (చూ.) కుండే పిడి. (కో. 23); 10. పేముబుట్ట పైభాగంలో పట్టుకొనే కర్ర; మూలిచుట్టూ తీగలతో చుడతారు. చూ. చిత్రం 139.4; (కో. 3).

కొడబుట్ట: పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైనమూత ఉంటుంది; మూతలు కొన్ని చోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట్ల [illegible]మాదిరి గాను ఉంటాయి, కొన్నిచోట్ల ఈబుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు. చూ. చిత్రం 139. (కో. 5;

కాడుచేట: ఉ. కాడ్సాట; శ్మశానం (కాడ)లో శవం కాలగా మిగిలిన బూడిద ఎత్తిపోసే చేట; అల్లకంలో దీనికి అంచుకట్టరు. (తె. 24).

కా[illegible]ప్పు: (బహు.) ఒకకొంత; పురిని కాలిబొటన వేలి నుంచి మోకాలిచుట్టూ తిప్పి మళ్ళీ వేలివరకు చుడుతూ వచ్చిన కొన్ని వరసలు; ఒక్కొక్క తొడుకు కొన్ని కాండ్ల చొ॥న కొలత ఉంటుంది. (తె. 9).

కానా: (< హిం. ఖానా) ఉ. కాన. 1· పర్యా. చూ. కంత(1). జల్లెడఅడుగు అల్లకంలో పేళ్ళమధ్య ఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రాలు 30 క. 2; 30 చ. 2. (తె. 12, 26); 2. పర్యా. చూ. జైలి(2). అల్లకంలో విసనగర్ర పేళ్ళ మధ్యసందు. (తె. 4); 3. చూ. ఖానా(1). (తె. 23); 4. చూ. ఖానా(5). (కో. 11; తె. 5); 5 [illegible] చూ [illegible] (2) వెదురుబద్దలతోనూ [illegible] [illegible] [illegible]సిన [illegible] (బీరువా)లో [illegible] పెట్ట[illegible]నికి ఏర్పరిచిన భాగం; ఇలాటివి [illegible] టాయి చూ [illegible]త్రం 101. 1. (తె 3, 8); 6. పర్యా. కన్ను(13). చెంద్రిక (చూ.)లో అసుర్లే 'పుష్ప' అల్లకంలో వచ్చేసందు; రంధ్రం. (తె. 28).

కానాలబుట్ట ఉ. బుట్ట; పర్యా.చూ. ఆకులగుజ్జెన(1). ఇంట్లోవాడకం కోసం తమలపాకులు పెట్టుకొనే చిన్నబుట్ట; దీనికి కమాన్‌బద్ద (= పట్టుకోడానికి వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) ఉంటుంది; కొన్నిటికి మూత ఉంటుంది; పేళ్ళమధ్య సందులు (ఖానాలు) ఉంటాయి; గద్దె ఉండదు. (తె 24).

కాపుగదబు: వ్యవసాయం చేసుకొని బతికే ఒకతెగ వాళ్ళు; గదబభాష మాట్లాడతారు; వీళ్ళకు కొల్వాయి గదబలతో కంచం పొత్తుగానీ వియ్యం పొత్తుగానీ లేదు; పెద్ద గదబలతోనూ కిరం గదబలతోనూ కంచంపొత్తు మాత్రమే ఉంది. (కో. 24).

కాఫిట్రే (ఇం. Co[illegible] T[illegible]) కాఫీకప్పులు మొ॥ పెట్టుకోడానికి వెదురుతో అల్లిన పళ్ళెం; దీర్ఘ చతురస్రాకారంలో ఉంటుంది. (కో. 27).

కామ: ఉ. కమ్మ. కావ కోవ, 1. పెద్దకత్తి (చూ.) పట్టుకొనే కర్ర; సుమారు మూరెడు జేనెడు పొడు గుంటుంది. (కో. 24); 2 కొబ్బరి డొక్కలు చితగ్గొట్టే కొయ్యకత్తి పట్టుకోడానికి తొడిగిన కర్ర. (కో. 25).

**కామంచిగడ్డి:** ఉ. కాఁవంచగడ్డి; పర్యా. కాసెగడ్డి అడవిలో పెరిగే ఒకరకం గడ్డి. (చూ. మా. వృ. కోశం. 4—వాస్తుపదజాలం, పుట 68); ఎండా కాలంలో చల్లదనంకోసం దీంతో తడకలుకట్టి గుమ్మాలకూ కిటికీలకూ వేలాడగడతారు; పందిళ్ళ మీద పరిచి నీళ్ళతో తడుపుతారు. చూ. చిత్రం 93.2; (తె. 7).

**కామంచిపుల్లు:** ఉ. కాఁవంచ—; గట్లమీద పెరిగే ఒకరకం గడ్డి (కామంచి) మొక్కనుంచి తీసిన పుల్ల; చీపుళ్ళు కట్టుకోడానికి వాడతారు. (తె. 9).

**కామంచిపుల్లలపొరక:** ఉ. కాఁవంచ ; కామంచి గడ్డిపుల్లలతో కట్టిన చీపురు; కళ్ళం ఊడ్చుకోడానికి మాత్రమే పనికొస్తుంది. (తె. 9).

**కామునిచేట:** కామదహనం (హోళీపండుగ)నాడు కాముణ్ణి కూర్చోబెట్టి తగలబెట్టే చేట, కట్టుగ్ర పొట్టిలేకుండా (అంచుకట్టకుండా) అల్లుతారు (తె.9).

**కామునిపున్నం:** ఫాల్గుణమాసంలో వచ్చే పూర్ణిమ; అంతకుముందురోజు రాత్రి కామదహనం, పూర్ణిమ నాడు హోళీపండుగ జరుపుకొంటారు. (తె. 15).

**కాయ:** కొబ్బరిపీచు పరిమాణం: ఇరవై ఐదు పీచు పోగులు; కాయలా మడిచిపెడతారు, గోదినీలు తయారుచేసే చట్రం (చూ.)లో నిలువుతాళ్ళ మధ్య పెట్టి అడ్డతాళ్ళతో బిగిస్తారు.

**కాయగూరలబుట్ట:** ఉ.—బుట్టి, చూ. కూరగాయల బుట్ట (3). (తె. 22).

**కాయపీచు:** పచ్చికొబ్బరినుంచి తీసినపీచు. (కో.21).

**కాయితబ్బుట్ట:** (< కాయితపు + బుట్ట) పర్యా. చూ. కాయితాలబుట్ట. చిత్తుకాగితాలు చేసుకోడానికి వాడే బుట్ట; కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ కొన్ని మైలబుట్ట ఆకారంలోనూ (దీనికి కాళ్ళుంటాయి) కొన్ని పళ్ళబుట్ట ఆకారంలోనూ (దీన్ని దారం లాంటి వెదురుపుల్లలతో నాణ్యంగా అల్లుతారు) ఉంటాయి. చూ. చిత్రం 78 క, చ. (కో. 9).

**కాయితంపొర:** పర్యా. చూ. పొట్టయేను. వెదురుగడ చీరినప్పుడు లోపలి వల్లపుభాగంలో కనిపించే పలచటి ఉల్లిపొర కాయితంలాంటి పొర. (కో. 4).

**కాయితాలబుట్ట:** ఉ. కాయితం—; —బుట్టి; పర్యా. కాయితబ్బుట్ట, చిత్తుకాయితాలబుట్ట, రద్దు కాయితాల బుట్ట. చిత్తుకాగితాలు వేసుకోడానికి వాడే బుట్ట; కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ కొన్ని మైలబుట్ట ఆకారంలోనూ (దీనికి కాళ్ళుంటాయి) కొన్ని పళ్ళబుట్ట ఆకారంలోనూ (దీన్ని దారం లాంటి వెదురుపుల్లలతో నాణ్యంగా అల్లుతారు) ఉంటాయి. చూ. చిత్రం 78 క, చ. (కో. 3) తె. 9, 14, 22, 28).

**కాయిల:** (< ? ఖాయిలా) సన్నటిపేడు. (కో. 18).

**కారంజల్లెడ:** మిరపకారం జల్లించుకొనే జల్లెడ, ఉరువు చిన్నది; పేళ్ళమధ్య సన్నటి సందులుపెట్టి అల్లుతారు. (తె. 7, 9).

**కారిపోతుపెట్టె:** ఒకరకం డిజైను (కారు)తో అల్లిన వెదురుపేళ్ళ పెట్టె; సారెసామాను పెట్టి ఇవ్వడానికి పనికొస్తుంది; పొరలుగా అల్లి బద్దలతో అంచు గడతారు. (తె. 23).

**కారు:** పెట్టె అల్లకంలో వచ్చే ఒకరకం డిజైను. (తె. 23).

**కార్యం:** పెళ్ళికి, పండుగ పబ్బాలకు చేసే ఉత్సవం. (తె. 8).

**కాలికిందదుక్క:** పర్యా. చూ. మొద్దు (3). వెదురు బద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్ద అడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (కో. 30).

**కాలికిందిమొద్దు:** ఉ. కాలి్కంది—; పర్యా. చూ. మొద్దు (3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్ద అడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (తె. 2, 10).

**కాలు:** **1.** పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తోడిమెమాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది; చూ. చిత్రం 16 క. 1. (కో. 23, 30); **2.** పర్యా. చూ. అడుగుపేడు. గంప మొ॥వాటి అడుగున అమర్చిన మందంపేడు; ఎత్తుభాగం అల్లకంకోసం వంచిన తరవాత ఇదే నిలువవుతుంది; దీన్ని గంటిబద్ద (చూ.) నుంచి తీస్తారు. చూ. చిత్రం 47 చ. 3. (రా. 1); **3.** పర్యా. కొయ్య (3), మేకు (1). వెదురుతో అల్లిన ఉయ్యాల,

సారెపెట్టె, కాయితాలబుట్ట, మైలబుట్ట మొ॥వి నేల మీద నిలబడడానికి ఏర్పరిచిన ఆధారం; సుమారు జేనెడుపొడుగు వెదురుబద్ద ముక్క; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిటికి గుండ్రంగ ఉంటాయి. చూ. చిత్రం 71.1; (కో. 2; 3, 5, 31; తె. 30; రా. 7); **4.** చెంద్రిక (చూ.) నిలబడడానికి ఆధారంగా అమర్చిన వెదురుబద్ద లేదా వెదురుగడ; ఇలాటివి నాలుగుంటాయి (రా. 6); **5.** వెదురు అలమారు (బీరువా) నిలబడ డానికి సుమారు జేనెడు పొడుగున అమర్చిన వెదురుగడ ముక్క; ఇలాటివి నాలుగుమూలలా నాలుగుంటాయి. చూ. చిత్రం 101.2 (తె. 3-5); **6:** పర్యా. కోడు. వెదురుమంచం నేలమీద నిలబడ డానికి సుమారు మూరెడు పొడుగున ఉన్న వెదురు గడముక్క; ఇలాటివి నాలుగుమూలలా నాలు గుంటాయి. చూ. చిత్రం 103.2 (కో. 9, 10; తె. 1, 2-3, 12, 17, 18, 31; రా. 2, 11); **7.** వెదురుబద్దల కుర్చీకాలు; నాలుగుంటాయి. చూ. చిత్రం 104.1 (తె. 31); **8.** పర్యా. చూ. మెట్టు (1). నిచ్చెనతయారీలో వెదురుగడలకు అడ్డంగా సుమారు మూరెడుపొడుగున బిగించిన వెదురుగడముక్క; నిచ్చెనకు సుమారు మూరెడేసి ఎడంలో నిలువుగడలకు చిల్లులుచేసి వాటిలో బిగిస్తారు. (తె. 2, 19; రా. 9, 11); **9.** పర్యా. జోడి, నిలువని(2). ఈతచువ్వతో గంప మొ॥ అల్లడానికి పెట్టే నిలువులజత. (తె. 13, 16, 20); **10.** పర్యా. చూ. పట్టె(2). ఈతచువ్వతో అల్లే గుమ్మి, తడక మొ॥ వాటిలో నిలువుగావచ్చే నాలుగు బద్దలకూర్పు (తె. 20); **11.** నులకమంచం కోడు; ఇలాటివి నాలుగుంటాయి. (రా. 4); **12.** సానరాయి నిలబడడానికి ఆధారం; రెండం గుళాల పొడుగుంటుంది; ఇలాటివి మామూలుగా మూడుంటాయి. (తె. 15); **13.** పర్యా. వంకెకాలు. వంకె(చూ.)కు X ఆకారంలోని కిందిభాగం (కింది రెండుకర్రలు లేదా బద్దముక్కలు) చూ. చిత్రం 14 చ. 3. (కో. 24); **14.** ఉట్టిలో అడుగుకొలికికి కట్టినతాడు; మూడువైపులా మూడు కడతారు. చూ. చిత్రం 146. 2. (రా. 5).

కాలుపురి: పర్యా. కట్టుపురి. తాడుపేనడానికి కాలి బొటనవేలికి చుట్టినపురి; కాలిబొటనవేలికి ఒక పురిచుట్టి కుడిచేత్తో ఇంకో పురి పట్టుకొని రెంటినీ పేనవేస్తూ తాడుఅల్లుతారు. (రా. 4).

కాలువీసె ఉక్కుకత్తి: ఉ. కాలీసుక్కుకత్తి. పావువీసెడుఉక్కుతో చేసిన మేదరికత్తి. (రా. 4).

కాల్దబ్బ: (< కాలు+దబ్బ) చూ. కాల్బద్ద. (కో. 19).

కాల్తొక్కించుడుగుల్ల: (< కాలు + తొక్కించుడు—) పెళ్ళిలో వధూవరులచేత పరస్పరం కాలుతొక్కించ డానికి పెట్టే బుట్ట. (తె. 17).

కాల్బద్ద. (< కాలు+బద్ద) రూ. కాల్దబ్బ; పేముకుర్చీ అల్లికంలో నిలువుగా వచ్చేపేడు (తిగ). (కో. 12).

కాళ్ళఉయ్యాల: నిలబడడానికి కాళ్ళు (కోళ్ళు) అమర్చిన ఉయ్యాల. (రా. 8).

కాళ్ళకట్టు: ఉ. కాల్ల —; పర్యా. అగదాడు. మంచంలో కాళ్ళు చాపుకొనేవైపు నులకకూ అడ్డపట్టెకూ మధ్య బిగించి కట్టేతాడు. (కో. 5; రా. 4).

కాళ్ళతుంట: ఉ. కాల్ల —; పర్యా. చూ. మెట్టు(1). నిచ్చెనతయారీలో వెదురుగడలకు అడ్డంగా సుమారు మూరెడు పొడుగున బిగించిన వెదురుగడముక్క; నిచ్చెనకు సుమారు మూరెడేసి ఎడంలో నిలువు గడలకు చిల్లులుచేసి వాటిలో బిగిస్తారు. (తె. 17).

కాళ్ళుచెక్క: (క్రి.) ఉ. కాల్లు —; మంచం నిలువు గడకు చేసినచిల్లిలో మంచంకాలు పట్టడానికి వీలుగా కాలుకు ఒకకొసన ఏటవాలుగా, నలుపలకలుగా, చెక్కడం. (రా. 11).

కావడిఉట్టి: ఉ. కాదుట్టి, కావిడుట్టి, కావిడిపుట్టి, కావడిబద్దకు చివర వేలాడదీసే పొడుగాటి ఉట్టి; చూ. చిత్రం 130. (కో. 23, 29, 30).

కావడిచేరు: ఉ. కావిడిశేరు. కావడిబద్దకు తొడిగే ఉట్టితాడు; గజం పొడుగుంటుంది; ఇటువంటివి మూడు మట్టుకు బిగించి ఉంటాయి. (కో. 5, 23, 30).

కావడిపెట్టె: ఉ. కావిడి—; అల్యూమినియం సామాను అమ్ముకొనేవాళ్ళు కావడికి తగిలించుకొని పోయే వెదురుపేళ్ళ పెట్టె. (కో. 15).

కావడిబద్ద: ఉ. కావిడి—; బరువులు మొయ్యడానికి కావడిమట్లు తగిలించే మందపాటి వెదురుబద్ద; మట్టుజారిపోకుండా బద్దకు రెండుకొసలా బుడిపె లుంటాయి; చివరలు సన్నగానూ మధ్యన మందం గానూ ఉంటుంది. (కో. 9; తె. 6).

కావడిమట్టు: ఉ. కావిడి —; కావడిఉట్టిలో అడుగున చక్రంలా అల్లినతాడు; దీనిమీద బిందె, కుండ మొ॥ పెడతారు. (కో. 20, 23).

కావలివాళ్ళు: ఉ. కావిలోల్లు; ఎరకలివాళ్ళలో ఒకతెగ; ఊరుమీద దొంగలు పడకుండా కాపలాకాస్తారు;

ఇంటికిన్ని చొ॥న వడ్లు తీసుకొంటారు. (తె. 7)

కావాడి: మేదరివాళ్ళలో ఒకతెగ. (రా. 1).

కాశారమీతకట్టె: (< కాశారం+ఈతకట్టె) కాశారం అనే ప్రాంతంనుంచి తెచ్చిన ఈతకట్టె. (తె. 13).

కాసెగడ్డి: ఉ. కాశెగడ్డి; పర్యా. కామంచిగడ్డి. అడవిలో పెరిగే ఒకరకం గడ్డి; (చూ. మా. వృ. కోశం 4—వాస్తుపదజాలం, పుట 68). ఎండాకాలంలో చల్లదనంకోసం దీంతో తడకలుకట్టి గుమ్మాలకూ కిటికీలకూ వేలాడగడతారు; పందిళ్ళమీదపరిచి నీళ్ళతో తడుపుతారు Cymbopogon caesius, Stoaf. (కో. 4, 6, 8-10, 17).

కిందడుగు: (< కింద+అడుగు). 1. పర్యా. చూ. అడుగు (5). ఈతగంప మొ॥ వాటి అడుగుభాగం. (తె. 1); 2. పర్యా. దట్ట. కోళ్ళగూడు (జేంపు) కుంధే రెండు అడుగుల్లో (క్రింద ఒకటి, పైన ఒకటి) కిందిది. (తె. 7).

కిందికట్టు: పర్యా. అడుగుకట్టు, అడుగుపెండె; అడుగుబొద్దు (1), కిందిబొద్దు, తొలికట్టు, పిర్రబొద్దు. గంప, గుమ్మి, తట్ట మొ॥వాటి అల్లకంలో అడుగు పూర్తిచేసి ఎత్తుభాగం అల్లడానికి నిలువులు వంచేటప్పుడువేసే కట్టు. చూ. చిత్రం 47 క. 4. (తె. 17, 23, 29; రా. 9, 11).

కిందికొమ్ము: పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరిభాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కింది నుంచిగాని మీదినుంచిగాని అదనంగావేసే మరో కొమ్ము; మొదటిదానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము. (కో. 5).

కిందిదబ్బ: తడకకు కింది అంచుకు వేసినబద్ద. (కో. 3).

కిందిబొద్దు: పర్యా. చూ. కిందికట్టు. గంప, గుమ్మి, తట్ట మొ॥వాటి అల్లకంలో అడుగు పూర్తిచేసి ఎత్తుభాగం అల్లడానికి నిలువులు వంచేటప్పుడు వేసే కట్టు. చూ. చిత్రం 47 క. 4. (రా. 3).

కిందిమూల: 1. పర్యా. చూ. మూల (6). నీళ్ళగూడుకు అడుగున ఏర్పడ్డ కోసు (దొప్పలాంటిది). చూ. చిత్రం 35 క. 1. 2. చేపల బుర్రికి కింద ఉండే మూల; రెండుంటాయి. (కో. 28).

కిరంగదబ: బుట్టలల్లడం నారచీరడం మొ॥ పనులు చేసే గదబలు; ఒకతెగ. (కో. 24).

కిరాసు: (< ఇం. Cross) ఐమూలవాటం; ఇలా అల్లిన వెదురుతడక త్రిభుజాకారంలో ఉంటుంది. (తె. 1).

కీడు: (క్రి.) రూ. చీడు; పర్యా. తీడు. నూరడం; మేదరికత్తి పదునుపోయి మొండిగా అయినప్పుడు దాన్ని సానరాయిమీద నూరతారు. (కో. 22, 25).

కీడురాయి: ఉ. కీడరాయి, కీడ్రాయి; పర్యా. చూ. నూర్రాతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (కో. 25, 26).

కుంకుమపెట్టె: ఉ. కుంకం—, కూకుం—; పర్యా. చూ. బొట్టుపెట్టె. ఆడవాళ్ళు కుంకుమ, అద్దం, దువ్వెన, బొట్టుపుల్ల, కాటిక మొ॥ అలంకరణ సామగ్రి ఉంచుకొనే చిన్నపెట్టె. (తె. 15, 17, 18, 25).

కుంకుమబరిణె: ఉ. —బరణ; పర్యా. చూ. బొట్టుపెట్టె. ఆడవాళ్ళు కుంకుమ, అద్దం, దువ్వెన, బొట్టుపుల్ల, కాటిక మొ॥ అలంకరణ సామగ్రి ఉంచుకొనే చిన్నపెట్టె. (తె. 19).

కుచ్చు[1]: పర్యా. చూ. అంచు (13). కట్టు (బద్ద), కర్ర (=కడ్డీలాంటిది) పెట్టి చేటచుట్టూ కట్టుకట్టిన భాగం. చూ. చిత్రం 29.5. (తె. 5).

కుచ్చు[2]: (క్రి.) చూ. గుచ్చు. (తె. 1, 5).

కుచ్చులకర్ర: సాముగరిడీలకు వాడే వెదురుకర్ర. (కో. 9).

కుచ్చెలగర్ర: ఉ. కుచ్చెల్—; పర్యా. చూ. లాకదబ్బ. (తుంగ) చాప నేసేటప్పుడు మగ్గంపోగుల మధ్య (తుంగ) పోచనుదూర్చే బద్ద; దీనిచివర బెజ్జముంటుంది; అందులోకి (తుంగ)పోచ కొస దూర్చి లాకదబ్బను పోగులమధ్య దోపుతారు. చూ. చిత్రం 120, 121 క. 6. (కో. 3).

కుంచతట్ట: పర్యా. తట్ట (7). ధాన్యం పోసుకొనే ఈతబద్దల గంప; మూతి వెడల్పుగా ఉంటుంది. (కో. 3).

కుంచపుగుల్ల: పర్యా. కుంచెడుగుల్ల (2). కుంచెడు (? 20 కిలోల) ధాన్యంపట్టే గుల్ల. (తె. 24).

కుంచం: 1. మూడుకిలోల ధాన్యంకొలత. (కో. 30); 2. ఐదుశేర్ల ధాన్యంకొలత. (తె. 14); 3. ఆరున్నర కిలోల ధాన్యంకొలత. (తె. 25); 4. ఇరవై కిలోల ధాన్యంకొలత. (తె. 24).

కుంచు: (క్రి.) పర్యా. మోదు (2). మంతు (=అంచులు కట్టనిచేట)కు చేటరూపం రావడానికి అంచు కట్టేటప్పుడు చేతులతో దగ్గరికి వంచడం. (కో. 15, 16).

కుంచె: ఉ. కుంచి. 1. పర్యా. చూ. ముందరిమొత్త.

బండిజల్ల ముందరిభాగంలో రెండు పక్కలను కలుపుతూ వంపుదిరిగిన గూడు. చూ. చిత్రం 32.2 (తె. 11, 13); 2. వెంట్రుకల్లో చిక్కులు తీసుకొనే దువ్వెనలాంటి పరికరం. (తె. 1).

కుంచెకల్లెరకలి: ఉ. కుంచెకల్లెర్కలి; పర్యా. కుంచెరకలి. ఎరకలి వాళ్ళలో ఒకతెగ; సాలెవాళ్ళు పడుగు సరిచెయ్యడానికి వాడే కుంచెలు తయారు చేసే (కట్టే) వాళ్ళు; ఎరుక (చెప్పే) బుట్టలుకూడా అల్లుతారు, ఎరుక చెప్పడం, పిట్టలను పట్టడం, పందులు బేరం చెయ్యడం మొ॥ పనులు చేస్తారు. (తె. 13).

కుంచెడుగంప: పర్యా. కుంచెడుగుల్ల (1). కుంచెడు ధాన్యంపట్టే ఈతగంప. (తె. 14).

కుంచెడుగుల్ల: 1. పర్యా. కుంచెడుగంప. కుంచెడు ధాన్యంపట్టే ఈతగంప. (తె. 14); 2. పర్యా. కుంచపుగుల్ల. కుంచెడు (? 20 కిలోల) ధాన్యం పట్టేగుల్ల. (తె. 25).

కుంచెతడక: ఉ. – తడ్క; పర్యా. చూ. బండిజల్ల(2). ఎరువు మొ॥ చేరవేయడానికి బండిమీద పరిచే తడక; ఈతపేళ్ళతో అల్లుతారు. (తె. 13).

కుంచెబద్ద: గంజిపెట్టిన పడుగు దువ్వడానికి వాడే పనిముట్టు (కుంచె) తయారీలో పురి బిగవడానికి కట్టినబద్ద; ఇలాటివి కుంచెకు రెండుపక్కలా ఉంటాయి. (కో. 9).

కుంచెరకలి: ఉ. —ఎర్కలి; పర్యా. కుంచెకల్లెరకలి. ఎరకలివాళ్ళలో ఒకతెగ; సాలెవాళ్ళు పడుగు సరిచెయ్యడానికి వాడే కుంచెలు తయారుచేసే(కట్టే) వాళ్ళు; ఎరుక (చెప్పే) బుట్టలుకూడా అల్లుతారు; ఎరుకచెప్పడం, పిట్టలను పట్టడం, పందులుబేరం చెయ్యడం మొ॥ పనులు చేస్తారు. (తె. 1, 7, 9, 11, 20; రా. 8, 9).

కుంజు పర్యా. చూ. కొబ్బరిపుచ్చె. కొబ్బరిగెలకువేసిన పిందె, పిందెలు క్రమంగా పెరిగి కాయలవుతాయి. (కో. 25).

కుటారి: జొన్నపొట్టు. (తె. 23).

కుటారిగుమ్మి: జొన్నపొట్టు పోసిపెట్టే గుమ్మి. (తె. 23).

కుట్టుడుకమ్మి: పర్యా. కూర్నాకు. ఈతచాప అల్లకంలో రెండు పట్టీలను కూర్చికుట్టే పొడుగాటి సన్నటి ఈతాకు. (తె. 26).

కుడక: ఉ. కుడ్క; 1. కొబ్బరికాయలో ఉండే కొబ్బరిలో సగభాగం; చిప్ప. (కో. 20); 2. పర్యా. చూ. వరగ(2). మొవరికత్తి వెన్నుకూ పదును భాగానికీ మధ్యఉండే వంప చూ. చిత్రం 12 ద. 3, (తె. 19).

కుడిగణుపు: రూ. కడిగనుపు; పర్యా. చూ. కురచ గనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జానెడుబెత్తెడు కన్న తక్కువ ఉంటుంది. (కో. 15).

కుడిగనుపు: చూ. కుడిగణుపు. (కో. 10, 16).

కుడిగనుపుకర్ర: ఉ. —గెన్ను—; పర్యా. చూ. కురచగనెవాసం. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు, తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 29).

కుడితిగుల్ల: ఉ. కుడ్తి—; పర్యా. చూ. దానాబుట్ట. పశువులకు మేత (దాణా; తడిపిన ఉలవపిండి మొ॥) పెట్టడానికి వాడేగుల్ల; లోతుపొడుగుగా ఉంటుంది; లోపలిపొర సన్నటిపేడుతో అల్లుతారు; (పశువుల నాలికలకు గుచ్చుకుపోకుండా) వెలుపలిపొర మందం పేడుతో అల్లుతారు; అంచుకు బద్దలువేసి కడతారు; కొన్నిచోట్ల కింద చతురస్రంగానూ నాలుగుమూలలా దొప్పలుగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకటే పొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (కో. 21).

కుడుందబ్బ: పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా సన్నగా ఉండేభాగానికి కింది నుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (రా. 1).

కుడుం: పర్యా. చూ. కండ(1). వెదురుగడకు పైన పచ్చగా ఉండే భాగానికీ బోలుగా ఉండే లోపలి భాగానికీ మధ్య ఏర్పడిన గట్టిపదార్థం; బద్దమందాన్ని బట్టి గడ ఎంత కండబట్టినదీ తెలుస్తుంది. (రా. 1).

కుంట: గుంట, నీళ్ళనిలవ ఉన్న చిన్నమడుగు. (తె. 14).

కుంటివెదురు: ఉ. కుంటెదురు; పర్యా. చూ. వంక కర్ర(2). ప్రతికణుపు దగ్గరా వంపుతిరుగుతూ పెరిగేవెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు. (రా. 4).

కుండ: 1. ఇరవై శేర్ల ధాన్యం కొలమానం. (తె. 7–9); 2. ఇరవై రెండు శేర్ల ధాన్యం కొలమానం. (తె. 14).

కుండగంప: (=20 శేర్లు, 14 కిలోలు) ధాన్యంపట్టే గంప. (తె. 8).

కుండలగంప: కుమ్మరివాళ్ళ ఇంటిదగ్గరినుంచి

కుండలు మోసుకొచ్చే పెద్దగంప. (కో. 4)

కుండీబద్ద: పర్యా. చూ. గుండు(1). జల్లెడఅంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండు మూడువేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిబెట్టి తట్టుచివర్లను దీని చుట్టూవంచుతారు; ఇది జల్లెడఅంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒకబద్ద ఈ రెంటిమీంచి ఇంకోమందం బద్దవేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 28).

కుండెడుగుల్ల పర్యా. కుండెడు వడ్లగంప. కుండెడు ధాన్యం పట్టే ఈతగంప. (తె. 14).

కుండెడువడ్లగంప: పర్యా. కుండెడుగుల్ల. కుండెడు ధాన్యంపట్టే ఈతగంప. (తె. 14).

కుతికె: ఉ. కుత్కె; 1. పర్యా. కవులు(1), గద్దె(1). మేదరికత్తికి పదునుభాగమూ కాడా కలిసినచోట వంపుదిరిగిన భాగం. (తె. 20, 23); 2. పర్యా. చెక్కిలి. అంబు(చూ.) కాడకు పడగకలిసిన భాగం. చూ. చిత్రం 15 క. 2. (తె. 20 23).

కుత్తిగనుపు: పర్యా. చూ. కురచగనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (కో. 18).

కుత్తెం: కొద్దిపాటి (స్థలం). (తె. 25).

కుదురు: 1. పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురు గడలు పెరిగిన పొద; ఒక చదరపుగజంనుంచి మూడు నాలుగు చదరపుగజాల వైశాల్యంఉంటుంది. కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాతగాని పొదలో ఒక వెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాత గాని పొదకావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (తె. 18-20, 29). 2. పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమిలోపల వేళ్ళతో సహా ఉన్న దుంప; వెదురుగింజ భూమిలోపడిన తరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లి వేరూ కొన్ని పిల్లవేళ్ళూ భూమిలోకి పాకతాయి. (తె. 13, 15); 3. పర్యా. రోకటికుదురు, రోటి కుదురు; వడ్లు మొ॥ ధాన్యం దంచేటప్పుడు గింజలు చిందిపోకుండా రోటిమీద పెట్టే కుదిపిపూడిదిది, పైనా కిందా తెరిచిఉంటుంది; కింద సన్నగానూ పోను పైన వెడల్పుగానూ ఉంటుంది. చూ. చిత్రం 80. (కో. 8, 9; తె. 9, రా. 1, 2); 4. పర్యా. చూ. గద్దె (2). కాయితాలబుట్ట, చేతిబుట్ట, పూల బుట్ట, కంతబుట్ట మొ॥వి నేలమీద నిలబడడానికి వీలుగా అల్లిన అడుగుభాగం; కొంచెం ఎత్తుగా సమతలంగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 1. (రా. 3).

కుదేయు: (క్రి.) పర్యా. చూ. దిగగొట్టు(1). గంప మొ॥ వాటి అల్లకం పూర్తయిన తరవాత చుట్టిన కర్ర (తీగలా సన్నటిది)కూ కర్రకూ మధ్య సందులు లేకుండా అల్లకం చిక్కబడడానికి అంచు దగ్గర అల్లినభాగం కిందికి దిగేటట్లు అంబు (చూ.) మడిమెతో కొట్టడం. (తె. 24).

కుందేలుబుట్ట: కుందేళ్ళనుపట్టి వేసుకొనే బుట్ట. చూ. చిత్రం 62. (కో. 3).

కుప్ప: 1. రూ. కువ్వ; పర్యా. చూ. మండె (1). వెదురుగడల పోగు; మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్నిచోట్ల వరసగా పేర్చినవి; అడవిలో గాని ప్రభుత్వంవారి వెదురుడిపోలోగాని అడితీల్లో గాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తంలేదు. (కో. 28, 29; తె. 17, 22, 25); 2. పర్యా మండె (2). ఈతచువ్వ (బరిగె)లను గాని వాటి కట్టలనుగాని పేర్చిన గుట్ట; కొన్నిచోట్ల చిందరవందరగా పోగు పెడతారు. (తె. 7, 14).

కుప్పు: (క్రి.) బండిజల్ల అల్లకంలో పక్కన బద్దల్ని లోపలికి గుచ్చటం. (కో. 7).

కుప్పనం: చూ. కుప్పె (1). (తె. 21, 22).

కుప్పె: ఉ. కుప్పి, కుప్పు; 1. రూ. కుప్పనం; పర్యా. అని (5); మలుపు (1), ముక్కు (4). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ అల్లగా మిగిలిన నిలువు కొస(లు); వీటిని వెనక్కిమలిపి అంచు లోపలికి దోపుతారు. (కో. 2, 3; తె. 25; రా. 8, 10), 2. పర్యా. చూ. మడుపు (1). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ వస్తువుల అల్లకం పూర్తయినే తరవాత మిగిలిన నిలువుల చివర్లను వెనక్కితిప్పి అంచు లోపలికి దోపినప్పుడు వచ్చిన వంపు. చూ. చిత్రం 47 క. 1). (తె. 3, 19).

కుంపటి: పర్యా. చూ. ఇంగలముట్టి. శ్మశానానికి నిప్పుల (ఇంగలం)కుండ తీసుకువెళ్ళడానికి వెదురు బద్దలతోకట్టిన చట్రం; ఉట్టిమాదిరిగా పట్టుకోడానికి బద్దలకు తాళ్ళు కడతారు (చట్రంమీద కుండ పెడతారు. చూ. చిత్రం 89. (కో. 2).

కుమ్మరిజల్లెడ: పర్యా. మట్టిజల్లెడ. కుమ్మరివాళ్ళు కుండలు చేయడానికి కావలసిన మెత్తటిమట్టిని జల్లించుకొనే జల్లెడ; కారంజల్లెడ మాదిరిగా పేళ్ళ మధ్య సన్నటి సందులు వచ్చేటట్లు అల్లుతారు. (కో. 5; తె. 6).

కుమ్మర్లొంకబొంగు: (< కుమ్మర్ల + వంక) ఆసిఫాబాద్ అడవిలో కుమ్మర్లొంకఅనే లోయలో పెరిగిన వెదురుగడ; ముదురుగా ఉంటుంది; కణుపులు దూర దూరంగా ఉంటాయి. (తె. 23).

కురగనుపు: చూ. కురచగనుపు (కో. 8).

కురచకట్టె: ఉ. కుర్స—; పర్యా. చూ. కురచబొంగు. పదిమూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ. (రా. 4).

కురచకఱ్ఱ: ఉ. కుర్స—; పర్యా. చూ. కురచబొంగు. పదిమూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ (కో. 8, 9, 17, 27).

కురచగడ: ఉ. కుర్సగెడ; పర్యా. చూ. కురచబొంగు. పదిమూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ (కో. 15, 16).

కురచగంటు: ఉ. కుర్స -; పర్యా. చూ. కురచగనుపు వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (తె. 3).

కురచగనుపు: ఉ. కుర్సగెనుపు; రూ. కురగనుపు, కురిగనుపు, కుఱగనుపు; పర్యా. కుడిగణుపు, కత్తిగనుపు, కురచగంటు, కురచదూరం, గనకురచ, చిట్టిగనుపు (1), జిట్టగనె, బోరగాలు, మట్టంపిచ్చె. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (రా. 5).

కురచగనెబొంగు: ఉ. కుర్స—; పర్యా. కుడిగనుపుకఱ్ఱ, కురిగనెబొంగు, కురిగుంపెదురు, గణకురచగడ, గనెకురచబొంగు, దగ్గరికనుపుకఱ్ఱ, దగ్గరిగనుపుబొంగు, దగ్గరిగనె(ల) బొంగు, దగ్గరిగుంపుకఱ్ఱ, దగ్గరిగుంపెదురు, పురిగనుపుబొంగు, పురిగనుపులకఱ్ఱ. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 19, 22).

కురచచాప: ఉ. కుర్ససాప; ఐదుమూరల పొడుగూ రెండుమూరల జేనెడు వెడల్పూపెట్టి అల్లిన ఈటిచాప (కో. 23).

కురచదూరం: ఉ. కుర్సదూరెం; పర్యా. చూ. కురచగనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్నభాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (కో. 14).

కురచనిలుగు: ఉ. కుర్సనిల్గు; కోళ్ళగూడుకు నిలువుగ పెట్టిన పొట్టిబద్ద. (తె. 23).

కురచబరిగె: ఉ. కుర్స—; పర్యా. తుంటుబఱ్ఱ, బుడ్డబఱ్ఱ. పొట్టిగా ఉన్న ఈతబరిగె; జిట్టీతచెట్టు నుంచిగాని పెద్దీతచెట్టు నుంచిగాని తీసింది. (తె. 14, 20).

కురచబొంగు: ఉ. కుర్స—; పర్యా. కురచకట్టె, కురచకఱ్ఱ, కురచగడ, కురచవాసం, కురచవెదురు, చిన్నబొంబు, పొట్టికట్టె, పొట్టికఱ్ఱ, బొంగుతుంట. పది మూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ. (కో. 8, 10, తె. 3, 24, 25, 30, 31; రా. 11).

కురచవాసం: ఉ. కుర్స—; పర్యా. చూ. కురచబొంగు. పదిమూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ. (కో. 8).

కురచవెదురు: ఉ. కర్సవెదురు, కురచెదురు, కుర్సెదురు; పర్యా. చూ. కురచబొంగు. పదిమూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ. (కో. 11; తె. 29; రా. 2, 5).

కురచాకు: ఉ. కుర్సాకు; పర్యా. జిట్టీతకమ్మ, జిట్టీతాకు, జిట్టెడుకమ్మ. పొడుగుతక్కువగా ఉండే ఈతాకు; ఇది సుమారు జిట్టెడు (వేళ్ళు చాపినప్పుడు బొటనవేలికొననుంచి చూపుడువేలి కొనవరకు ఉన్న) పొడుగు ఉంటుంది; పొట్టిగాఉన్న ఈతచెట్టు (జిట్టీతచెట్టు) నుంచితీసింది; చాపలఅల్లకానికి పనికిరాదు (తె. 22)

కురమగంప: ఉ. కుర్మ—; కురమలు (గొఱ్ఱెలుకాసే ఒకతెగ) అంబలి తీసుకువెళ్ళడానికి వాడేగంప; గుల్లకంటె పెద్దగా ఉంటుంది; రెండడుగుల పొడుగుంటుంది. చూ. చిత్రం 54. (తె. 19).

కురిగనుపు: ఉ. —గెనుపు; చూ. కురచగనుపు (కో. 6, 13).

కురిగనెబొంగు: పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలాతక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 21).

కురిగుంపెదురు: పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ

ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది (కో. 31).

కురిడీకాయ: ఉ. కొరిడీ—; నీళ్ళు లోపలికి ఇంకిపోయిన ఎండుకొబ్బరి (కుడక)కాయ. (కో. 20).

కురిడీకాయపీచు: ఉ. పీసు; నీళ్ళు ఇంకిపోయిన కొబ్బరికాయ (కురిడీకాయ) నుంచి తీసినపీచు. (కో. 20).

కుర్చీ: (< హి. కుర్సీ) ఉ. కుర్చి; పర్యా. కుర్చీపీట. కూర్చోడానికి వెదురుగడలతోగాని బద్దలతోగాని పేముతోగాని చేసిన ఆసనం. చూ. చిత్రాలు 104, 138. (కో. 3; తె. 10, 22, 31).

కుర్చీపీట: ఉ. కుర్చి—; పర్యా. కుర్చీ. కూర్చోడానికి వెదురుగడలతోగాని బద్దలతోగాని పేముతోగాని చేసిన ఆసనం. చూ. చిత్రాలు 104, 138.

కుర్రగనుపు: ఉ. —గెనుపు; చూ. కురచగనుపు. (కో. 7).

కులంకట్టు: కులం కట్టుబాటు; కులమర్యాద; మేదర్లూ మొదలయినవాళ్ళు పాటిస్తారు. (రా. 4).

కులబంతి: పెళ్ళి మొ॥ సందర్భాల్లో భోజనానికి పిలిచి కూర్చోబెట్టిన తమకులంవాళ్ళ వరస (పంక్తి). (తె. 8, 13).

కువ్వ: చూ. కుప్ప(1). (కో. 4).

కుశిరె: ఉ. కుశిర; పర్యా. కోడిగుడ్డుబుట్ట, కోళ్ళగంప(2). కోడిగుడ్లు పెట్టడానికీ పొదగడానికీ ఉంచేబుట్ట, వేలాడదీయడాని కనువుగా దీనికి వంచికట్టిన బద్దలుంటాయి; ఇందులో గడ్డివేసి వేలాడదీస్తారు; కోడిదాంట్లోకి ఎగిరి గుడ్లుపెడుతుంది; దాంట్లోనే గుడ్లు పొదుగుతుంది. చూ. చిత్రం 55. (తె. 23, 24).

కుషన్‌సెట్టు: (< ఇం. Cushion set) సోఫాసెట్టు మాదిరిగా అల్లిన పేముకుర్చీలసెట్టు. (కో. 12).

కుసి: ఉ. కుశి; పర్యా. కూలు(4). కొడవలి కాడకొస; సన్నగా ఉంటుంది; కాడ పిడికి తొడిగి ఈ కొసను వెనక్కివంచుతారు. చూ. చిత్రం 14 క. 2. (తె. 7, 8).

కూకు: పర్యా. చూ. బూడిద. లేతవెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (తె. 2).

కూజాబుట్ట: ఉ. —బుట్టి; కూజా ఆకారంలో ఉండే బుట్ట; చిత్తుకాగితాలు వేసుకొంటారు. (కో. 9).

**కూడిగలబట్టు:** (క్రి.) పర్యా. చూ. కరిపించు(2). పేడు చీరేటప్పుడు వార (=వేలెడు వెడల్పుబద్ద) లేదా పలుకు మొదటిభాగంలో ఒకంగుళం పొడుగువరకు వరసగా పేళ్ళుచీరి ఉంచడం; కొత్తగా పని నేర్చుకొనేవాళ్ళకు ఇలా చీరి ఇస్తారు; ఆతరవాత బద్ద చీరడం సులువవుతుంది. (కో. 31).

కూపు: చూ. కోపు (1). (కో. 6).

కూరగాయలగంప: పర్యా. కూరగాయల గుల్ల (2). కూరగాయలు మోసుకొచ్చే ఈతగంప. (తె. 14).

కూరగాయలగుల్ల: **1.** పర్యా. చూ. కూరగాయల బుట్ట. కూరగాయలు పోసుకొనే వెదురుపేళ్ళ బుట్ట. చూ. చిత్రం 70. (తె. 17); **2.** పర్యా. కూరగాయలు మోసుకొచ్చే ఈతగంప. (తె. 9).

కూరగాయలపుటికె: ఉ. పుట్కె; పర్యా. కూరగాయలబుట్ట. కూరగాయలు పోసుకొనే వెదురుపేళ్ళ బుట్ట. చూ. చిత్రం 70. (తె. 17).

కూరగాయలబుట్ట: ఉ. —బుట్టి. **1.** పర్యా. కూరగాయలగుల్ల, కూరగాయల పుటికె. కూరగాయలు పోసుకొనే వెదురుపేళ్ళ బుట్ట. చూ. చిత్రం 70. (తె. 7, 18); 2. బజారునుంచి కూరగాయలు తెచ్చుకొనే ఒకరకం బుట్ట; దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; పట్టుకోడానికి కాడలువంచి కడతారు. చూ. చిత్రం 70. (కో. 5); **3.** రూ. కాయగూరల బుట్ట; పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైనమూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట్ల పళ్ళెంమాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బతాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు. చూ. చిత్రం 139. (కో. 9).

కూరగాయలసిబ్బి: ఉ. —శిబ్బి; పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులుపోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతోగాని ఈత పేళ్ళతోగాని అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది. చూ. చిత్రం 66. (కో. 3).

కూరబుట్ట: ఉ. —బుట్ట; పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికి చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైనమూత ఉంటుంది; మూతలు

కొన్నిచోట్ల సిబ్బెమాదిరిగాను కొన్నిచోట్ల పళ్లెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బరాణీలు, వేరుసెనక్కా-యలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్లు ఉండవు. చూ. చిత్రం 139. (తె. 27).

కూరమళ్ళవిసనగ్ర: ఉ. కూరమల్ల ఇస్నకర్ర; కూరగాయలమళ్ళలాంటి పనివరస (డిజైను) వచ్చేటట్లు అల్లిన విసనగ్ర. (తె. 5).

కూర్చు: (క్రి) పర్యా. దంటబోయు. ఈతచాప తయారీకి అల్లిన రెండుపట్టెలనూ కలిపి కూర్పాకుతో కుట్టడం. (తె. 19, 21, 22).

కూర్పటాకు: చూ. కూర్పాకు; (తె. 21).

కూర్పాకు: (< కూర్పు + ఆకు) రూ. కూర్పటాకు; పర్యా. కుట్టుడుకమ్మ. ఈతచాప అల్లకంలో రెండు పట్టెలను కూర్చికుట్టే పొడుగాటి సన్నటి ఈతాకు. (తె. 19, 22; రా. 9).

కూలమ్ము: (< కూలు + అమ్ము) కొడభాగం మొనదేలిఉండే అమ్ము (చూ.); కాడవేపు చిల్లులు చేయడానికీ బిళ్ళవేపు పేడు తెంపడానికీ పని కొస్తుంది. (తె. 28).

కూలు: ఉ. కూల్, కూలి; 1. చురకత్తికాడ; ఇది సన్నగా మొనదేలి ఉంటుంది. (కో. 24); 2 పర్యా. అంబుసూది, అమ్ముమొదలు, కాడ(3), కోన, దాను(3), ములికి, ముల్లు(5), మొన(3), ఒకరకం అంబు(చూ.)కు మొనదేలిఉండే కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥ వాటికి కట్టు కట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. 1. (కో. 9, 10, 17; తె. 6-8, 28, 31; రా. 9, 11); 3. కట్టెపిడి తొడగడానికి వీలుగా మచ్చుకత్తి (చూ.)కి సన్నగా మొనదేలి ఉన్న కాడ (రా. 3); 4. పర్యా. కుసి. కొడవలి కాడకొస; సన్నగా ఉంటుంది; కాడపిడికి తొడిగి ఈ కొసను వెనక్కి వంచుతారు. చూ. చిత్రం 14 క. 2. (తె. 11, 13); 5. పర్యా. చూ. కొంది. మేదరికత్తి, చురకత్తి, మొ॥ వాటి పిడిలోనుంచి బయటికి పొడుచుకువచ్చిన కాడకొస; కిందికివంగి ఉంటుంది. చూ. చిత్రం 16 చ. 1. (కో. 28).

కూసం: గుమ్మంతడకకు పెట్టిన గుంజలో బయటికి వచ్చిన భాగం; దీన్ని భూమిలోపాతుతారు; ఇటువంటివి రెండుంటాయి. (కో. 10).

కూసు: నేలలోపాతిన కొయ్యదిమ్మ; చాపనేతమగ్గంలో నూలు మానుకూ దోనిమానుకూ రెండుపక్కలా రెండేసి (మొత్తం నాలుగు) దిమ్మలుపాతి ఉంటాయి. (రా. 2).

కెన్న: పర్యా. చూ. చిల్ల(1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాలపొడుగూ ఉంటుంది; ముల్లుగర్ర గానూ దోమతెరకర్రగానూ గాలంబరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలిఉంటుంది. (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉనికినిబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 31).

కెర్న: పర్యా. గాదె(2). వడ్లు మొ॥ ధాన్యం నిలవ ఉంచుకోడానికి వెదురుబద్దలతో అల్లినది; ఇంటి ముందర గజంవిస్తీర్ణంలో వృత్తాకారంగా మందం బద్దలుపాతి వాటిచుట్టూ బద్దలతో అల్లుకొచ్చి పూర్తయిన తరవాత చుట్టూరా మన్నుమెత్తుతారు; (తెలంగాణాలో దీన్నే పెద్దసైజులో అల్లుతారు; ఇలారం అంటారు; వర్షంవచ్చినా తడవకుండా పైన కప్పుతారు). (రా. 11).

కేంచి: చూ. కైంచి (2). (తె. 1).

కేతయ్య: మేదరివాళ్ళ కులగురువు. (రా. 11).

కేన్‌కాల్నేత: పర్యా. చూ. కేన్‌గవాచి నేత. పేము తీగలమధ్య సందులు వచ్చేటట్లు అల్లడం; కొన్ని చోట్ల కుర్చీలు మొ॥ ఇలా అల్లుతారు. (కో. 11).

కేన్‌గవాచినేత: పర్యా. కళ్ళనేత, కేన్‌కాల్నేత. పేము తీగలమధ్య సందులు వచ్చేటట్లు అల్లడం; కొన్నిచోట్ల కుర్చీలు మొ॥ ఇలా అల్లుతారు. (కో. 11).

కేన్‌డైమన్‌నేత: (< ఇం. Cane Diamond—). పర్యా డైమన్‌పేములో డైమన్‌డిజైన్లు వచ్చేటట్లు అల్లేవిధానం; కొన్నిచోట్ల చేటనేత లాంటిది (కో. 11).

కేన్‌బెత్తం: (ఇం. Cane—). పర్యా. చూ. పేము[1]. నిటారుగా పొదలా పెరిగే ఒకరకం గడ్డిమొక్క; కర్రకు మధ్యమధ్య కణుపులుంటాయి; సన్నరకం పేము చీలితీసిన తీగతో బుట్టలు మొ॥ అల్లుతారు; లావుపాటి కర్రకుర్చీలు, సోఫాలు మొ॥ చేయడానికి పనికొస్తుంది; (Calamus Fasciculatus, Br. C. Rotang. Man) చూ. చిత్రం 133. (కో. 11).

కైకొమ్ము: పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముంతతీ

భాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కిందినుంచి గాని మీదినుంచిగాని అదనంగా వేసే మరోకొమ్ము; మొదటిదానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము. (కో. 3).

క్రైంచి: ఉ. క్రైంచ్. **1.** పర్యా. అడకుంచె, అడ్డిఖానా (2), గూడ (2). వెదురుగడలు నిలబెట్టడానికి రెండు పొడుగాటి కర్రలకు దండెలకట్టి చేసిన ఏర్పాటు; రెండుగజాల ఎడంలో రెండు వెదురుగడలుగాని సరుగుడు కట్టెలుగాని పాతి ఆ రెంటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మరొక కర్రను కడతారు; అడ్డంగా కట్టిన కర్రకు వెదురు గడలు ఆనించి నిలబెడతారు. చూ. చిత్రం 8 ట. (తె. 7, 8); **2** రూ. కాంచి, కాంచీడు, కేంచి; పర్యా చూ. క్రాసుబద్ద. వెదురుమంచం తయారీలో వెడల్పుభాగాన ఉన్న రెండుకాళ్ళను (కోళ్ళను) కలుపుతూగాని కాలినీ నిలువుగడ (నిలువుపట్టె)నూ కలుపుతూగాని కాలినీ అడ్డంబొంగు (అడ్డంపట్టె)ను కలుపుతూగాని మూలదగ్గర అడ్డంపట్టెనూ నిలువు పట్టెనూ కలుపుతూగాని ఐమూలగా కొట్టిన వెదురు బద్ద. చూ. చిత్రం 108.1; (తె 10, 12).

క్రైంచితడక: ఉ. క్రైంచ్—; పర్యా. చూ. డైమన్ తడక. డైమను ఆకారంలోగడి (కంత) వచ్చేటట్టు వెదురుబద్దల ఎకం ఎడంగాపెట్టి తయారుచేసిన తడక; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు కట్టుకోడం మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 40 క. (రా. 8).

క్రైంచీదబ్బ: చూ. క్రైంచీబద్ద. (రా. 11).

క్రైంచీబద్ద: (< హిం. కెంచీ -) ఉ. క్రైంచ్; **1** రూ. క్రైంచీదబ్బ; పర్యా. చూ. క్రాసుబద్ద. వెదురుమంచం తయారీలో వెడల్పుభాగాన ఉన్న రెండుకాళ్ళను (కోళ్ళను) కలుపుతూగాని కాలినీ నిలువుగడ(నిలువు పట్టె)నూ కలుపుతూగాని కాలినీ అడ్డంబొంగు(అడ్డం పట్టె)నూ కలుపుతూగాని మూలదగ్గర అడ్డంపట్టెనూ నిలువుపట్టెనూ కలుపుతూగాని ఐమూలగా కొట్టిన వెదురుబద్ద చూ. చిత్రం 108. 1. (తె. 17); **2.** కమాను ( వీధికి అడ్డంగా తోరణాలు. పతాకాలు మొ॥ కట్టడానికి అమర్చేది) తయారీలో రెండు నిలువుగడలను కలుపుతూ ఏటవాలుగా కొట్టిన వెదురుబద్ద(లు) చూ. చిత్రం 111. 2. (తె. 16); **3.** పూసలగంప అల్లినతరవాత రెండు బద్దలు ఒకదానిమీది కొకటి 'X' ఆకారంలో వచ్చేటట్లు తొడిగినబదలు; ఇలాటివి గంపచుట్టూ మూడు నాలుగుచోట్ల ఉంటాయి. (తె. 15).

క్రైముదిరినకర్ర: పర్యా. లేతపండుబొంగు. అంత లేతా అంతముదురూ కాకుండా మధ్యరకంగా ఉన్న వెదురుగడ; ఇది విసనగర్రలకూ చేటలకూ పనికొస్తుంది. (కో. 13).

క్రైముదిరినబొంగు. పర్యా. చూ. పంటకర్ర. వెదురు ధాన్యం కాసినగడ; మొక్క మొలిచిన తరవాత సుమారు 20 సం॥లకు కాపుకాస్తుంది; ఇంటి వాసాలకూ గోవలకూ పనికొస్తుంది. (కో. 11).

కొక్కి: పుల్లిరుసు ( పెద్దగిలక)ను వేలాడదీసే ఇనప కొక్కెం. చూ. చిత్రం 120 వ. 4. (రా. 2).

కొంక: గొల్లగూడు ( గొర్రెలగూడు) తయారీ పూర్తయిన తరవాత కిందిపైపు చుట్టూ చుట్టినబద్దలు ఊడిపోకుండా దింపిన వంకరకట్టె. (తె. 24).

కొంకదిగవేయు: (క్రి.) ఉ. —దిగేయు; గొల్లగూడు (=గొర్రెల గూడు) అల్లకం పూర్తయిన తరవాత అడుగు ఊడిపోకుండా ఉండడానికి అడుగునుంచి చుట్టూ వంకకట్టెల దూర్చడం. (తె. 24).

కొంకిడి: వంకకర్ర (చూ.) వంపు. (తె. 21).

కొంకిడికట్టె: **1.** పర్యా. చూ. వంకకర్ర(1). పాము పడగ మాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (తె. 16, 24); **2.** కొక్కెం మాదిరిగా మొదలు వంపుదిరిగి ఉన్న వెదురుకర్ర; సుమారు మూరెడు పొడుగుంటుంది; ఇంటికప్పు నుంచి వేలాడదీసి కొక్కినికి ఏవయినా తగిలిస్తారు. చూ. చిత్రం 8 క. (తె. 16).

కొట్నంజంగిడి: పెళ్ళిళ్ళప్పుడు కోట్నాలు (వడ్లు) దంపడానికి అల్లిన జంగిడి. నలుచదరంగా ఉంటుంది; దీంట్లో వడ్లుపోసి లాంఛనంగా రోకలితో రెండు మూడు పోట్లువేస్తారు. (కో. 29).

కొట్నందాగర: పెళ్ళిళ్ళప్పుడు కొట్నాలు దంపడానికి (వడ్లు దంపడానికి) నలుచదరంగా అల్లినదాగర (చూ.); దీంట్లో వడ్లుపోసి లాంఛనంగా రోకలితో రెండుమూడు పోట్లువేస్తారు. (కో. 30).

కొట్నం: వడ్లుకొట్టడం (దంపడం); పెళ్ళిళ్ళకు వడ్లు మొ॥ లాంఛనంగా దంపుతారు. (కో. 29-31).

కొట్నాలబుట్ట: పెళ్ళిళ్ళప్పుడు కొట్నాలు దంపడానికి (వడ్లుదంపడానికి) అల్లినబుట్ట; దీంట్లో వడ్లుపోసి లాంఛనంగా రోకలితో రెండుమూడు **పోట్లు వేస్తారు.** (కో. 23).

**కొడమ:** ఉ. కొడం, కొడ(ఁవ్; పర్యా. మావు. కాలవ కడ్డంగాపెట్టి చేపలుపట్టే సాధనం; బాల్చీ ఆకారంలో ఉంటుంది; దీన్ని ప్రవాహంలోగాని నిలవనీటిలో గాని పెడతారు; దీంట్లోకి పోయినచేప తిరిగి బయటికి రాకుండా పుల్లలు అడ్డుకుంటాయి. చూ. చిత్రం 73 క. (కో. 2, 4, 5).

**కొడమతడక:** ఉ. కొడంతడికె; కొడమ తయారీ కోసం సన్నటి వెదురుపుల్లలతోనూ దారంతోనూ అల్లినతడక. చూ. చిత్రం 73 క. 7. (కో. 4).

**కొడంపుల్ల:** (< కొడమ—). పర్యా. పుల్ల (5), మావు పుల్ల. కొడమ తయారీలో కొడమచుట్టూ మూసే తడకా పిర్రతడకా తయారుచేయడానికి వాడే సన్నటి వెదురుపుల్ల; ఐస్‌ఫ్రూట్‌పుల్లంత లావు ఉంటుంది. చూ. చిత్రం 73 క. 2. (కో. 4).

**కొడవలి:** ఉ. కొదలి, కొడవెలి, కొడ్వాలి, కొడ్విలి, కొడ్వెలి; **1.** పర్యా. ఎరకలికత్తి (1), ఎరకలి కొడవలి, కత్తి (3). చంద్రవంకలా వంపుదిరిగి ఉన్న ఒకరకం ఇనపకత్తి; ఈతచెట్టునుంచి కమ్మ కొయ్యడానికీ కోసినది చీల్చడానికీ ఎరకలివాళ్ళు వాడతారు; కొన్నిటికి వంపు తక్కువగా ఉంటుంది. చూ. చిత్రాలు 13. క. చ. (తె. 7, 9, 14, 16, 20; రా. 8, 9); **2.** ఈతమట్టలు మొ॥వి కోయ డానికి పనికొచ్చే ఇనప పనిముట్టు; నెలవంకలా వంపుదిరిగి ఉంటుంది; చేత్తో పట్టుకునే కొడవలికి కట్టెపిడి ఉంటుంది; గైకట్టె కమర్చే కొడవళ్ళలో కొన్నిటికి కాడచివర ఉంగరంలా వంపుదిరిగి ఉంటుంది; కొన్నిటికి గొట్టంలా ఉంటుంది; చూ. చిత్రం 118. (తె. 21, 22, 26); **3.** వంపుగా ఉండే, పదునున్న సాధనం; ఇనపది; తుంగనుగాని కలబంద మట్టల్నిగాని దీంతో కోస్తారు. (కో. 3, 30; రా. 6, 10).

**కొడారుచిమ్మెబుడుపు:** ఉ. —శిమ్మె—; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 4).

**కొడితి:** ఉ. కొత్తి; పర్యా. చూ. కట్టె(1). వెదురుగడ పగలగొట్టేటప్పుడు గడకు కరిపించిన కత్తిమీద దెబ్బలు కొట్టడానికీ చిల్లి చేసేటప్పుడు ఉలిమీదపెట్టి కొట్టడానికీ వాడేకర్ర; మూరెడు పొడుగ్గా చెయ్యంత లావు ఉంటుంది. (తె. 2).

**కొడుపు:** పర్యా. చూ. మెట్టు (1). నిచ్చెన తయారీలో వెదురుగడలకు అడ్డంగా సుమారు మూరెడు పొడుగున బిగించిన వెదురుగడ ముక్క; నిచ్చెనకు సుమారు మూరెడేసి ఎడంలో నిలువుగడలకు చిల్లులుచేసి వాటిలో బిగిస్తారు. (తె. 24).

**కొడ్పె:** పర్యా. చూ. గొట్టం (1). విసనగర్ర కాడకు తొడిగిన వెదురుగడ ముక్క; లోపల గుల్లగా ఉన్నది; విసురుకొనేటప్పుడు సులువుగా ఉండడానికి ఇది తొడుగుతారు. చూ. చిత్రం 31 ట. 1. (రా. 6).

**కొణతం:** ఉ. కొంత్తం; పర్యా. పూదు (1). కొన్ని రకాల కన్నె (చూ.)లకు రెండుపాయల మధ్య ఉండే పొడుగాటి తాడు. (కో. 30).

**కొండకర్రలబియ్యం:** జొన్నల్లా ఉండే వెదురు ధాన్యం. (కో. 24).

**కొండకేన్:** (ఇం. Cane). అడవి ప్రాంతంలో కొండమీద పెరిగే పేము. (కో. 11).

**కొండంగిమోటు:** చూ. కొండెంగమొట్టు. (తె. 31).

**కొండచీపురు:** కొండల్లో పెరిగే ఒకరకం గడ్డిమొక్క పుల్లలతోకట్టిన చీపురు; పుల్లచుట్టూ సుమారు మూరెడుభాగంలో మెత్తటికుచ్చు ఉంటుంది; నున్నటినేల తుడుచుకోడానికి ఈ చీపురు వాడతారు. (కో. 19).

**కొండజెర్రి:** ఒకరకం జెర్రి; సుమారు ఎనిమి దంగుళాలు పొడుగుండి నలుపు, ఎరుపు, తెలుపు, పసుపురంగుల్లో ఉండేది; ఇది కుడితే దీనికి ఎన్ని రంగులు ఉంటాయో మనిషి అన్నిరంగులు మారతాడట. (కో. 1).

**కొండబొంగు:** పర్యా. చూ. గుట్ట(ల) బొంగు. కొండల మీదా గుట్టలమీదా గట్లమీదా పెరిగే వెదురుకర్ర; పెళుసుగా ఉంటుంది; పేదు తీయడం కష్టం; మేదరి పనికి ఉపయోగపడదు. (తె. 5).

**కొండమేదరి:** అడవి ప్రాంతంలో నివసించే మేదర్ల తెగ. (తె. 10).

**కొండవెదురు:** ఉ. కొండెదురు; పర్యా. చూ. గుట్ట(ల) బొంగు. కొండలమీదా, గుట్టలమీదా, గట్ల మీదా పెరిగే వెదురుకర్ర; పెళుసుగా ఉంటుంది; పేదు తియ్యడం కష్టం; మేదరిపనికి ఉపయోగ పడదు. (కో. 24; రా. 1, 4).

**కొండి:** పర్యా. కూలు (5), దామ (4), పిడిచివర, మేదరికత్తి, చురకత్తి మొ॥వాటి పిడిలోనుంచి బయటికి పొడుచుకువచ్చిన కాడకొన; కిందికివంగి ఉంటుంది. చూ. చిత్రం 16 చ. 1. (కో. 4).

**కొండీతపుల్ల:** (< కొండ + ఈత—) కొండలమీద

పుట్టిన పొట్టి ఈతచెట్టు చువ్వ; అల్లకానికి పనికి రాదు. (కో. 3).

కొండెంగ: ఉ. కొండంగి, కొండంగె; రూ. గండంగి, గన్నంగి; పర్యా. మసవ, ముచ్చు (2). కొండ ముచ్చు; వెదురుమొక్క లేతగా తియ్యగా ఉన్నప్పుడు కొండముచ్చులు దానితల కొరుక్కు తింటాయి. (తె. 22, 23, 27, 28, 31).

కొండెంగముడుసు: ఉ. —ముడ్సు; పర్యా చూ. కొండెంగ మొట్టు. ఒకరకం వెదురుగడ; లేత మొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (తె. 28).

కొండెంగమొట్టు: ఉ. కొండంగి—; కొండంగె—; రూ. కొండంగిమోటు; పర్యా. కొండెంగముడుసు; కోతికాటుబొంగు, కోతిమురుకబొంగు, గండంగి కాటుబొంగు, గండంగిమోటుకర్ర, గన్నంగిమోటు, తలజచ్చినవెదురు, తలబోడుకర్ర, తలబోడెదురు, తలమొండికర్ర, తలమోటు, తలమోడుకర్ర, తుంట(1), తోకమొండికర్ర, మసవకొరికినబొంగు, మాసుగొట్టు, ముచ్చుగొట్టుకర్ర, ముచ్చుమెండు కర్ర, మొజ్జుకర్ర, మొండకర్ర, మొండిబొంగు, మోటుకర్ర, హనుమంతుకర్ర. ఒకరకంవెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల అగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందుఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (తె. 22, 23, 27, 31).

కొత్తకర్ర: పర్యా. చూ. లేతబొంగు(1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతి ముందు కోతకువస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చ డానికి వీలవుతుంది; లోపల బోలుతక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థంఏర్పడి ఉంటుంది (ఈ బూడిదనుబట్టి మొక్కవయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ. ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడమూడు నాలుగంగుళాల మంద ముంటుంది. (కో. 23, 28).

**కొత్తకోటచేట: ఉ. —కోట; అంచుకు పొడుగాటి** కల్లువేసిన చేట; చూ. గొడగలచేట. (కో. 23).

కొత్తవెదురు: ఉ. కొత్తెదురు; పర్యా. చూ. లేతబొంగు (1). ఒక సం॥నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేతవెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీక మాసంలో పుట్టి సంక్రాంతి ముందు కోతకువస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చడానికి వీలవుతుంది, లోపల బోలు తక్కువ; గడచుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది (ఈ బూడిదనుబట్టి మొక్కవయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, అకుపచ్చ, లేతానుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (కో. 31).

కొద: పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురుగడలు పెరిగినపొద; ఒకచదరపు గజంనుంచి మూడునాలుగు చదరపు గజాలవైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒకపొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలో పడ్డతరవాతగాని పొదకావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (కో. 26).

కొదువ: (< కుదువ) ఎరకలివాళ్ళ పెళ్ళిళ్ళలో రెండో పెళ్ళి చేసుకొనే అమ్మాయి తల్లిదండ్రులకు మగపెళ్ళివారు ఇచ్చే బంగారంగాని డబ్బుగాని; ఇద్దరుపిల్లలు పుట్టి అల్లుడిగుణం అత్తమామలకు నచ్చితే ఈ కొదవ అబ్బాయి తల్లిదండ్రులకు తిరిగి ఇచ్చేస్తారు. (కో. 25).

కొన: **1.** పర్యా. చూ. కొస(7). వెదురుగడచివరి సన్నటిభాగం. (కో. 1; తె. 3-5, 12-23; రా. 2-4, 6, 8); **2.** పర్యా. చూ. కొస (8) ఈతకమ్మ చివరి సన్నటిభాగం. చూ. చిత్రం 11.7. (తె. 16; రా. 8); **3.** పర్యా. కొస(9). ఈతాకు (రేకు) చివర సన్నగా ఉండేభాగం; మొదలుకన్న సన్నగా ఉంటు ది; చివరముల్లు ఉంటుంది. చూ. చిత్రం 115. 3. (తె. 19, 21); **4.** పర్యా. చూ. ముక్కు(1). కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి. చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. (తె. 15, 19; రా. 1, 2, 9).

కొనదబ్బ: పర్యా. చూ. కొస (7). వెదురుగడ చివరి సన్నటిభాగం. (తె. 4).

కొనపిచ్చ: పర్యా. చూ. కొస (7). వెదురుగడ చివరి సన్నటిభాగం. (రా. 1).

కొనముక్కు: **1.** పర్యా. చూ. ముక్కు (1). కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 12 జ. 3, 16 చ. 5. (తె 6); **2** పర్యా. చూ. కొస (6). కొడవలికి కోసుగా ఉన్న భాగం. చూ. చిత్రం 13 చ. 5. (రా. 6); **3** పర్యా. చూ. ముక్కు (2). అంబు (చూ.) పడగ చివరికోసు. చూ. చిత్రం 15 క. 2. (తె. 13).

కొబ్బరికాయ: రూ. కొవ్వరికాయ; పర్యా. టెంకాయ. కొబ్బరిచెట్టుకు కాసిన కాయ; పైన పచ్చగా తాట ఉంటుంది; లోపల దట్టంగా పీచు పీచుమధ్య గట్టి టెంకు, టెంకులో తియ్యటి నీళ్ళు, కొబ్బరి ఉంటాయి. చూ. చిత్రం 126. (కో. 25).

కొబ్బరిగెల: కొబ్బరిపుచ్చె (పిందె)లుగాని కాయలు గాని కలిసి ఉన్న గుత్తి. (కో. 19, 20).

కొబ్బరిచీపురు: కొబ్బరి ఈనెలతో కట్టిన చీపురుకట్ట. (కో. 19).

కొబ్బరిపుచ్చె: ఉ. —పుచ్చి; పర్యా. కుంజు, కొబ్బరి బంతి, కొవ్వరికుంజు. పుచ్చె. కొబ్బరిగెలకు వేసిన పిందె; పిందెలు క్రమంగా పెరిగి కాయలవుతాయి. (కో. 19, 20).

కొబ్బరిపొట్టు: రూ. కొవ్వరిపొట్టు. పర్యా. చూ. పొట్టు (3). కొబ్బరిపీచు నలిపినప్పుడుగాని దులిపినప్పుడు గాని రాలే (ఎర్రటి)పొడి. (కో. 19, 20).

కొబ్బరిబంతి: పర్యా. కొబ్బరిపుచ్చె. కొబ్బరిగెలకు వేసిన పిందె; పిందెలు క్రమంగా పెరిగి కాయ లవుతాయి (కో. 20).

కొబ్బరిబొండం: పర్యా. బొండంకాయ, బొండం; నీళ్ళు ఎక్కువగానూ కొబ్బరి పలచగానూ ఉండే పెద్దకొబ్బరికాయ; లేతది; వేసంగుల్లో బొండం నీళ్ళు తాగుతారు. (కో. 19, 21).

కొబ్బరిమట్ట: రూ. కొబ్బరిమండ, కొవ్వరిమట్ట; కొబ్బరిచెట్టుకు అంటుకొని ఉండే కొమ్మ మొదటి భాగం; కాండంనుంచి ఆకులవరకు ఉండేది; వెడల్పుగా మందంగా ఉండి పోనుపోను సన్న మవుతుంది. (కో. 19, 20).

కొబ్బరిమండ: ఉ. కొబ్బెరి—; చూ. కొబ్బరిమట్ట. (తె. 6).

కొమర: ఉ. కోమురు, కొమెర; త్రిభుజాకారంలో ఉండే వెదురు (కొమారు) తడకకు పైకోసు. (రా. 8-10).

కొమరతడక: ఉ. కొమురుతడక, కొమెరతడ్క; పర్యా. చూ. క్రాస్తడక (1). త్రిభుజాకారంలో ఉండే తడక; తడకలతో కట్టే ఇంటికి కప్పువేపు త్రిభుజాకారం వచ్చేపక్క దీన్ని కడతారు. చూ. చిత్రం 37. (రా. 8-10).

కొమ్మ: పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడు లావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లు గర్రగానూ దోమతెర కర్రగానూ గాలంబరుగు గానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది. (చూ. గంటి గనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (రా. 7).

కొమ్ము: **1.** పర్యా. చూ. వెదురుమొలక; జేనెడు పొడుగునుంచి మూరెడు పొడుగుదాకా నిటారుగా కోసుగా పెరిగింది; ముట్టుకుంటే విరిగిపోయేటట్లు మెత్తగా ఉంటుంది; దీనికి ఆకులూ రెమ్మలూ ఉండవు, మామూలుగా వెదురు దుంపలోంచిగానీ, నరకగా మిగిలిన గడకణుపు లోంచిగానీ పుడుతుంది; (? మూడు నాలుగురోజుల వయస్సులో) లేతగా ఉన్నప్పుడు దీనిపైపొర తీసేసి లోపలిభాగాన్ని కూర వండుకుంటారు; చూ. చిత్రం 3. (కో. 22, 24, 27, 30); **2.** పర్యా. అడికొమ్ము (1), కడదబ్బ, కడ్డీ, కంటుందబ్బ, కరదబ్బ, కొమ్ము గర్ర, కొమ్ముబద్ద, గోవ(5) చేటకొమ్ము, దబ్బ(5), నాలిక(3), నాలికబద్ద, ముంగోడు, లోనగొమ్ము, వంజేరు. చేట ముందుభాగంలో రెండుమూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళుఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29. 2. (కో. 2-28, 31; తె. 1-31; రా. 9-11); **3.** పర్యా. చూ. బద్ద(4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒకఅంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 8, 9, 12, 13, 15, 17, 19, 21); **4.** విసనగర్ర అల్లకంలో అంచుకు పెట్టిన చేటకొమ్ము లాంటిబద్ద; విసనగర్రంత పొడుగు మాత్రమే ఉంటుంది (పట్టుకోడానికి వీలుగా బయటికి ఉండదు). చూ. చిత్రం 31 చ. 1. (తె. 31); **5** చింపగూడ మూతిభాగంలో బయటికి తేలిన వెదురుకర్ర చూ. చిత్రం 73 చ. 2,

(కో. 31); 6. పర్యా. చాపమూల(3). ఈతచాప మూలభాగంలో ఉండే అంచుపట్టె చివరిభాగం; నాసుగు మూలలా ఇలా తోకలా కనిపిస్తుంది. చూ. చిత్రం 122. 2. (తె. 19); 7 చాపనేత నిలువు పోగుల మధ్యనుంచి అడ్డంగా జమ్మిపోగు దూర్చేది; లాకదబ్బ(చూ.) కన్న వేరుగా ఉంటుంది. (రా. 2).

కొమ్ముకట్టు: పర్యా. చూ. నక్కు-(2). చేటముందరి భాగంలో రెండు కొమ్ములను (—కిందికొమ్ము, పైకొమ్ము) కలిపి కట్టుముంగు (చూ.)తో చేసిన బిగింపు (కో. 3).

కొమ్ముకువేయు: (క్రి.) ఉ. కొమ్ముకేయు; పర్యా. చూ. అనివేయు(1). చేట, విసనగర్ర అల్లకం అరంభంలో కొమ్ము (చూ.)కు రెండుగాని నాలుగు గాని (అల్లకం విధానాన్నిబట్టి) పేళ్ళుఎక్కించి అల్లకం మొదలుపెట్టడం. (కో. 2, 15, 16-18, 20).

కొమ్ముగర్ర: పర్యా. చూ. కొమ్ము(2). చేట ముందు భాగంలో రెండు మూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2, (తె. 31).

కొమ్ముగీయు: (క్రి.) చేట అల్లకానికి అవసరమయ్యే కొమ్ము (చూ.)ను తయారుచేయడం; కత్తితో నున్నగా గీస్తారు. (కో. 18).

కొమ్ముపంకా: ఉ. —పంక; పర్యా. కొమ్ము విసన గర్ర. పట్టుకోడానికి వీలుగా ఒక అంచువెంట పొడుగ్గా వేలెడులావు వెదురుకర్ర (కొమ్ము)పెట్టి అల్లిన విసనగర్ర; చూ. చిత్రం 31 చ. (తె. 9).

కొమ్ముబద్ద: పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందు భాగంలో రెండు మూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2. (కో. 11).

కొమ్ముమట్టు: (క్రి.) పర్యా. చూ. అనివేయు (1). చేట, విసనగర్ర అల్లకం ఆరంభంలో కొమ్ము (చూ.)కు రెండుగాని, మూడుగాని, నాలుగుగాని (అల్లకం విధానాన్నిబట్టి) పేళ్ళు ఎక్కించి అల్లకం మొదలుపెట్టడం. (కో. 23).

కొమ్ములకట్టె: ఎద్దుకొమ్ముల్లా మొదటిభాగం రెండు వంపులు తిరిగిన వెదురుకర్ర. చూ. చిత్రం 7. (తె. 22).

కొమ్ములగూడు: ఉ. —గోడ; పర్యా. గూడుపొనక, జిమ్మతొత్తి. కాలవ కడ్డంగాపెట్టి చేపలుపట్టే సాధనం; నీళ్ళగూడ ఆకారంలో ఉంటుంది; అంచుకు వేసినబద్దలు కొమ్ముల్లాగా బయటికి తేలి ఉండడం వల్ల ఈపేరు వచ్చింది; కాలవకడ్డంగా మధ్యలో గూడ నిలిపి నీళ్ళు గూడలోంచి పోయేటట్లు చేస్తారు; నీళ్ళలోని చేపలు దీంట్లో చిక్కుబడిపోతాయి. చూ. చిత్రం 73 ట. (కో. 31).

కొమ్ము విసనగర్ర: ఉ. కొమ్మిసనగర్ర; పర్యా. కొమ్ముపంకా. పట్టుకోడానికి వీలుగా ఒక అంచు వెంట పొడుగ్గా వేలెడులావు వెదురుకర్ర (కొమ్ము) పెట్టి అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 చ. (తె. 8).

కొయ్య: 1 పర్యా. మొద్దు (1). వెదురుగడ నరికేసి నప్పుడు పొదకు మిగిలిన మూరెడు జేనెడు పొడుగు ముక్క; ఇది ఎండిపోతుంది; లేదా దీని కణుపు లోంచి ఇంకోకొమ్మ పుడుతుంది. (కో. 24); 2 పర్యా. చూ. చెరుకువాసం (1). చెరుకుతోటల్లో మొక్కకు ఆనుగా పెట్టడానికి ఉపయోగపడే లావుపాటి వెదురుగడ; మేదరపనికి ఉపయోగ పడదు. (కో. 23); 3 పర్యా. చూ. కాలు(3). వెదురుతో అల్లిన ఉయ్యాల, సారెపెట్టె, కాయితాల బుట్ట, మైలబుట్ట మొ॥వి నేలమీద నిలబడడానికి ఏర్పరిచిన ఆధారం; సుమారు జేనెడుపొడుగు వెదురుబద్ద ముక్క; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిటికి గుండ్రంగా ఉంటాయి. చూ. చిత్రం 71. 1. (తె. 9, 31); 4. పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గడ్డెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి పంచికట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (కో. 26); 5. పర్యా. మూలకొయ్య. నీళ్ళతోడే గూడకు రెండుపక్కలా మూలదగ్గర్నించి అంచుదాకా వేసిన వెదురుబద్ద; ఇలాటివి నాలుగుంటాయి. (కో. 15-17); 6. చెలమ్మొట్టు (చూ.) చుట్టూ బయటినుంచి తొడిగినబద్ద (లు). చూ. చిత్రం 90. 1. (కో. 29); 7. పర్యా. చూ. ఈతమట్ట(2). ఈతచెట్టుకాండానికి (బోదె) అంటుకొని ఉన్న కమ్మ మొదటిభాగం; రెండుమూడువేళ్ళ వెడల్పు వేలెడు మందమూ ఉంటుంది; మొదట వెడల్పుగా ఉండి పోనుపోను

సన్నమవుతుంది; నరికినప్పుడు కొన్నిచోట్ల చెట్టుకే మిగిలిపోతుంది. (రా. 8).

కొరకొత్తపండుగ: ఉ. —పండుగు; కొత్తధాన్యం ఇంటికి వచ్చినప్పుడు గదబవాళ్ళు చేసుకొనే పండుగ. (కో. 24).

కొరచీమ: ఉ. కొర్చీమ; అడవిలో పెరిగే ఒకరకం చీమ; ఈ చీమలు వెదురుగడ తొలిచేస్తాయి. (తె. 27, 28).

కొరటుమొట్టు: చూ. కొరడుమొట్టు. (తె. 28).

కొరడి: చూ. కొరడు (తె. 21, 22).

కొరడిమెట్టు: చూ. కొరడుమొట్టు. (తె. 22).

కొరడిమొట్టు: చూ. కొరడుమొట్టు. (తె. 23, 25).

కొరడిమొదు. చూ. కొరడుమొద్దు. (తె. 20).

కొరడు: రూ. కొరడి; పర్యా. చూ. మొద్దు(3) వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు: కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తికరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (తె. 26).

కొరడుమొట్టు: రూ. కొరటుమొట్టు, కొరడిమెట్టు, కొరడిమొట్టు; పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్ద అడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు. కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి కూడా వాడతారు. (తె. 24).

కొరడుమొద్దు: రూ. కొరడిమొద్దు; పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకుకత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (తె. 19).

కొల: పర్యా. చూ. ఆయం. కొలత; పరిమాణం; చేట, తడక మొ॥ అల్లడానికిముందు కొలతలు నిర్ణయించుకొంటారు. అల్లకానికి కావలసినపేడు చీరుకోడానికి బద్ద మొ॥ వాటిని కొలిచి చూసుకొంటారు. (తె. 15, 16).

కొలబద్ద: 1. మూడు మూరలపొడుగు (కొలత) ఉండే వెదురుబద్ద (కో. 26); 2. పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేసినచోట (గంటగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండుసుద్దిబద్దల వస్తాయి; ఇవికర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 25).

కొలయీనె: కొలతప్రకారల చీల్చిన వెదురుపేడు; చేటల అల్లకానికి మూడుమూళ్ళ జేనెడు పొడుగున్న పేడు వాడతారు. (కో. 31).

కొలికి: పలుపుతాడుకుండే రెండుపాయల్లో ఒకపాయకు చివర తాడుతో వేసిన చుట్టు; కన్ను మాదిరిగా ఉంటుంది; రెండో పాయకుండే ముడి దీంట్లో దూరుస్తారు. చూ. చిత్రం 145.2. (రా. 5).

కొలుకు: (<కొలికి) కొన్నిరకాల కన్నె (చూ.)లకు మధ్యలో మరొకతాడు కలపడానికి కొక్కెంలా గుండ్రంగా వేసిన మెలిక; చుట్టు. (కో. 20).

కొల్లం: పర్యా. చూ. పిల్లలగూడు, తల్లులవెంట మేతకు పోలేని చిన్నచిన్న గొర్రెపిల్లలనూ మేకపిల్లలనూ కమ్మడానికి మందపాటి వెదురుబద్దలతో అల్లినది; బోర్లించిన గంట ఆకారంలో ఉంటుంది; పిల్లల్ని వేయడానికి ద్వారం ఏర్పాటుచేస్తారు; పిల్లలు ఇందులో నిలబడి మంద అందిస్తే తింటాయి. చూ. చిత్రం 77. (కో. 25).

కొల్లాపురంబొంగు: కొల్లాపురం ప్రాంతంనుంచి తెచ్చిన వెదురుగడ; బోలుగా ఉంటుంది. (తె. 3, 5, 12, 13, 15). కొల్లాపురమ్మ మేదరివాళ్ళ కుల దేవత. (కో. 4).

కొల్లాం: పర్యా. చూ. గడ్డిబుట్ట. పశువులకు గడ్డి వేయడానికి వాడే పెద్దగంప; అడుగున వెడల్పు తక్కువుండి పోనుపోను మూతి విశాలమవుతుంది; గడ్డి కింద వేస్తే పశువులు తొక్కుతాయని దీంట్లో వేస్తారు. చూ. చిత్రం 91. (కో. 23, 25).

కొల్వాయిగదబ: పొలం పనిచేసే ఒకతెగ (గదబవాళ్ళు). (కో. 24).

కొవ్వరికమ్మ: పర్యా. కమ్మ (4). కొబ్బరిమట్టకు చివర ఆకులు పెరిగిన భాగం; కమ్మ పక్కంచులకు ఆకులు పెరుగుతాయి. (కో. 25).

కొవ్వరికాయ: చూ. కొబ్బరికాయ. (కో. 25).

కొవ్వరికుంజు: పర్యా. చూ. కొబ్బరిపుచ్చె. కొబ్బరిగెలకు వేసినపిందె; పిందెలు క్రమంగా పెరిగి కాయలవుతాయి. (కో. 25).

కొవ్వరిగెల: చూ. కొబ్బరిగెల. (కో. 25).

కొవ్వరిపొట్టు: చూ. కొబ్బరిపొట్టు. (కో. 25).

కొవ్వరిమట్ట: చూ. కొబ్బరిమట్ట. (కో. 25).

కొస: ఉ. కొసి. **1.** పర్యా. చూ. కాడ (1). మేదరి కత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడ మాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రాలు 12 జ. 3; 16 క. 1; 16 చ. 5. (కో. 26, 28); **2** పర్యా. చూ. మడిమె (3). మేదరికత్తి కాడకొస. (తె. 22, 29); **3.** పర్యా. చూ. ముక్కు (1). కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. (కో. 1; రా. 4, 8); **4** పర్యా. చూ. మొన(2). ఒకరకం అంబు (చూ.) కాడకొస, మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 15 చ. 3. (కో. 7; తె. 9; రా. 8); **5.** పర్యా. చూ. ముక్కు (2). అంబు (చూ.) పడగ చివరికోసు. చూ. చిత్రం 15 క. 2. (తె. 2, 28); **6.** పర్యా. కొనముక్కు (2), మొన (5). కొడవలికి కోసుగా ఉన్నభాగం. చూ. చిత్రం 13 చ. 5. (కో. 3); **7.** పర్యా. కడ (1), కొన (1), కొనదబ్బ, కొనపిచ్చ, చిగురు (4), చివర (1), సుత. వెదురుగడ చివరి సన్నటిభాగం. (కో. 2-7; 9, 19, 28. 31; తె. 1, 2, 6-10, 24, 27; రా. 4, 5, 7, 9-11). **8.** పర్యా. కొన (2), చివర (4). ఈతకమ్మ చివరి సన్నటిభాగం. చూ. చిత్రం 11.7; (కో. 3; తె. 9, 13, 14; రా. 9); **9.** పర్యా. కొన (3). ఈతాకు (రేకు) చివర సన్నగా ఉండే భాగం; మొదలుకన్న సన్నగా ఉంటుంది; చివర ముల్లు ఉంటుంది. చూ. చిత్రం 115.3; (తె. 22, 26; రా. 9); **10.** పేము కర్ర చివరిభాగం; మొదలుకన్న సన్నగా ఉంటుంది. (కో. 8); **11.** తుంగపోచకు చివరిభాగం; మొదలు కన్న సన్నగా సూదిలా ఉంటుంది. (కో. 8, 21, 30; రా. 10).

కొసకవురు: సగంనుంచి పైదాకా పెళుసుగా ఉండే వెదురుగడ. (తె. 23).

కొసముక్కు: **1.** పర్యా. చూ. ముక్కు (1). కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రాలు 12 జ. 3; 16 చ. 5. (తె. 7, 9, 29); **2.** పర్యా. చూ. ముక్కు (2). అంబు (చూ.) పడగ చివరికోసు. చూ. చిత్రం 15 క. 2. (తె. 23), **3.** పర్యా. చూ. ముక్కు (3). ఎరకలి కత్తి (కొడవలి) పదునుభాగం కొస; కోసుగా ఉంటుంది. (తె. 9).

కోళ్లపెట్టె: పర్యా. చూ. పెట్టె(1). చీరలూ పంచెలూ మొ॥ బట్టలుపెట్టుకునే వెదురుబద్దలపెట్టె; చతురస్రాకారంలోనూ దీర్ఘచతురస్రాకారంలోనూ ఉంటుంది; చూ. చిత్రం 41. (కో. 26).

కోంచె: పర్యా. మోడా. వీధుల్లో తిరుగుతూ తినుబండారాలు అమ్మేవాళ్ళు పళ్ళెంపెట్టుకొనే స్టాండు; కడ్డీల్లాంటి వెదురుపుల్లలు కూర్చికడతారు; తిరిగేటప్పుడు దీన్ని చంకలోపెట్టుకొంటారు. చూ. చిత్రం 94. (తె. 10, 4).

కోట: పర్యా. దొడ్డి(1). వెదురువ్యాపారులు దుకాణానికి వెనక పెద్దమొత్తంలో వెదురుగడల నిలవఉంచే ప్రదేశం. (తె. 18).

కోడిగంప: పర్యా. చూ. కోళ్ళను కమ్మడానికి (= మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటి మధ్యనుంచి సన్నటిభాగంవేపు మొత్తంగళ్ళుగా అల్లకముటుంది; కొన్నిటికి వెడల్పుభాగంవేపు మూసి ఎత్తుభాగం వేపుకోళ్ళను వెయ్యడానికి ద్వారం ఉంచుతారు. చూ. చిత్రాలు 65 క-ప. (రా. 8).

కోడిగాబు: పర్యా. చూ. కోళ్ళగూడు(1). కోళ్ళను కమ్మడానికి (= మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటిభాగంవేపు మొత్తంగళ్ళు గళ్ళుగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పుభాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు. చూ. చిత్రాలు 65 క-ప. (కో. 24).

కోడిగుడ్డుబుట్ట: పర్యా. చూ. కుశిరె. కోడిగుడ్లు పెట్టడానికీ పొదగడానికీ ఉంచేబుట్ట; వేలాడదీయడానికనువుగా దీనికి వంచికట్టిన బద్దలుంటాయి; ఇందులో గడ్డివేసి వేలాడదీస్తారు; కోడి దాంట్లోకి ఎగిరిగుడ్లు పెడుతుంది; దాంట్లోనే గుడ్లు పొదుగుతుంది. చూ. చిత్రం 55. (కో. 13).

కోడిగుడ్లగంప: పర్యా. చూ. కోడిగుడ్లబుట్ట. కోడిగుడ్లను భద్రపరుచుకొనేబుట్ట. (కో. 16).

కోడిగుడ్లబుట్ట: పర్యా. కోడిగుడ్లగంప, గుడ్డుబుట్ట, గుడ్లబుట్ట. కోడిగుడ్లను భద్రపరుచుకొనే బుట్ట. (కో. 16).

కోడిపిల్లలగూడి: పర్యా. పిల్లలగూడి. కోడిపిల్లల్ని కమ్మడానికుపయోగించే బుట్ట. (కో. 23).

కోడిపుంజులగూడు: కోడిపుంజులను కమ్మడానికి (మూసిపెట్టడానికి) వాడేగంప; కోళ్ళగూడుకన్న పెద్దగా ఉంటుంది; రెండోభాగంవేపు గూడ మూసేసి కోడిపుంజులను వేయడానికి ఎత్తుభాగంవేపు ద్వారం ఉంచుతారు; పొలందగ్గరికి మోసుకుపోవడానికి వీలుగా ఉంటుంది. (కో. 23).

కోడిబుట్ట: 1. పర్యా. చూ. కోళ్ళగూడు(1). కోళ్ళను కమ్మడానికి (=మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటిభాగంవేపు మొత్తంగళ్ళు గళ్ళుగా అల్లక ముంటుంది; కొన్నిటికి వెడల్పుభాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు; చూ. చిత్రాలు 65 క-ప. (కో. 6; రా. 4); 2. కోళ్ళను కమ్మడానికీ బజారునుంచి వస్తువులు తేవడానికి ఉపయోగించే కమానుబుట్ట; దీనికి మూయడానికిగాను మూతా, పట్టుకోడానికిగాను వంచికట్టిన (కమానుబద్ద) బద్దా ఉంటాయి. (తె. 28).

కోడిసిబ్బి: పర్యా. సిబ్బి(6). కోళ్ళను పార్సల్‌చేసే బుట్ట ద్వారాన్ని మూసేది; అన్నంవార్చుకొనే సిబ్బిలా ఉంటుంది. చూ. చిత్రం 65 చ. 1. (కో. 6).

కోడు: పర్యా. కాలు(6). వెదురుమంచం నేలమీద నిలబడడానికి సుమారు మూరెడుపొడుగున ఉన్న వెదురుగడ ముక్క; ఇలాటివి నాలుగుమూలలా నాలుగుంటాయి. చూ. చిత్రం 108. 2. (తె. 16).

కోడులాగు: (క్రి.) పర్యా. చూ. తీగలాగు(2). పేము కర్రనుంచి సన్నటిపేడు (తీగ) చీరడానికి కత్తుల పెట్టెలో అమర్చిన కత్తులజతల మధ్యనుంచి సన్నటికర్ర లాగడం. (కో. 11).

కోతతుకు: (< కోత + అతుకు) ఉ. కోతతుక్కు; చేట అల్లకం పూర్తిఅయిన తరవాత దానికి మిగిలిఉన్న పేడు; దాన్ని కోసేస్తారు. (తె. 22).

కోతపేడు: పర్యా. అతుకు(2), పెచ్చినె, పైపేడు(2), మూలపేడు, రద్దుపేడు. చేట, గూడ, బుంగ మొ॥ అల్లినతరవాత వాటి మూలలదగ్గర మిగిలిన పేడు(లు); వీటిని కోసేస్తారు; దేనికీ పనికిరావు. (కో. 15).

కోతికాటుబొంగు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (కో. 2).

కోతిమురుకబొంగు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం ఏదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (రా. 7).

కోతులెకలివాళ్ళు: (< కోతుల ఎరకలి -) ఉ. కోతులెక్కలోల్లు; కోతులను ఆడించి బతికే ఎరకలివాళ్ళు (తె. 20).

కోన: పర్యా. చూ. కూలు(2). ఒకరకం అంబు(చూ.)కు మొనదేలి ఉండేకాడ; సుమారు రెండుబెత్తలపొడుగూ చిటికెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥ వాటికి కట్టు గట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. 1. (కో. 11).

కోను: (< ఇం. Cone) పర్యా. మూల(2). జంగిడి, మచ్చిక, శూర్కబుట్ట మొ॥ వాటికి అడుగున రెండుపక్కలు కలిసిన (దొప్పలాంటి) భాగం; ఇలాటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 49. 2. (కో. 24).

కోనేటల్లకం: (< కోనేటి + అల్లకం) మూడు వెదురు పేళ్ళతో చదరంగా డిజైను వచ్చేటట్లు అల్లేవిధానం. చూ. చిత్రం 27. (కో. 3).

కోపు: 1. రూ. కూపు. వెదురుపొదలు పెరిగిన అడవి ప్రదేశం; ప్రభుత్వం వెదురుడిపో దీనికి దగ్గరగానే ఏర్పాటు చేస్తారు. (తె. 7, 26, 28); 2. మెత్తటి నేల; వెదురుపొదలు పెరిగేది. (తె. 31); 3. వర్షాకాలంలో నీళ్ళునిలిచి ఉండేగుంట. (తె. 14).

కోపుకర్ర: పర్యా. చదరంబొంగు. మెత్తటినేలలో (కోపులో) పెరిగిన వెదురుకర్ర. (తె. 31).

కోయు: (క్రి.) పర్యా. చటాయించు. కత్తితోగాని

[illegible] 11, 13, 14, 20; రా. 8, 9)

కొల: పర్యా. చూ. గరి(1). వెడల్పుబద్ద అంచుకుండే పదును. (రా. [illegible]).

కోడుగట్టు: (క్రి.) ఉ. కోర్గట్టు; జల్లెడ అల్లకంలో అడుగు (చూ.) మీద గుండ్రంగా బద్దలు అమర్చి అంచు (కోరు) బిగించడం. (తె. 3).

కొల: చాపనేతమగ్గం అచ్చుకు కిందిభాగ లో అచ్చును కిందికి గుంజడానికి పెట్టిన కర్ర; తొక్కుడు చెక్కకూ అచ్చుకూ మధ్యగా ఉంటుంది. (రా. 6).

కోలకట్టె: గుంజుడుతడక గొట్టాలద్వారా పక్కకు జరగడానికి గొట్టాలలో దూర్చి గోడ తడకకుకట్టిన వెదురుగడ. చూ. చిత్రం 39.2; (తె. 23).

కోళ్ళగంప: 1. పర్యా. చూ. కోళ్ళగూడు(1). కోళ్ళను కమ్మడానికి (=మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచు భాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటి భాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తు భాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు; చూ. చిత్రం 65 క, ప. (కో. 9, 13); 2. పర్యా. చూ. కుశెరె. కోడిగుడ్లు పెట్టడానికీ పొదగడానికీ ఉంచేబుట్ట; వేలాడదీయడాని కనువుగ దీనికి వంచికట్టిన బద్దలుంటాయి; ఇందులో గడ్డివేసి వేలాడదీస్తారు; కోడి దాంట్లోకి ఎగిరి గుడ్లు పెడుతుంది; దాంట్లోనే గుడ్లు పొదుగుతుంది; చూ. చిత్రం 65. (కో. 5); 3. పర్యా. చూ. కోళ్ళ పార్సెల్‌గంప. వ్యాపారం చేసేవాళ్ళు కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళ గంప; జేనెడు ఎత్తూ గజం వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికి వెయ్యడానికి పైన తెరిపి ఉంటుంది; కొన్ని ఇదే రూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పూ రెండుమూరల ఎత్తూ ఉంటాయి. (తె.14).

కోళ్ళగూడు: ఉ. కోల్గూడు, కోల్లగూడు; కోళ్ళగూడి; 1. పర్యా. ఈత (1), కోడిగంప, కోడిగాబు, కోడిబుట్ట (1), కోళ్ళగంప (1), కోళ్ళజేపు (1), కోళ్ళబుట్ట (1), కోళ్ళబేంద, జేబిలి, జేంపు, పంజెరం. కోళ్ళను కమ్మడానికి (మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగాను పోను పోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటి భాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు, చూ. చిత్రం 65 క,ప. (కో. 1, 3, 15, 18, 19, 22, 25, 26, 31; తె. 21-26, 28, 30; రా. 3, 4); 2. పర్యా. చూ. కోళ్ళ పార్సెల్‌గంప. వ్యాపారం చేసేవాళ్ళు కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళ గంప; జేనెడు ఎత్తు గజం వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికి వేయడానికి పైన తెరిపి ఉంటుంది; కొన్ని ఇదే రూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పు రెండుమూరల ఎత్తు ఉంటాయి. (కో. 31; తె. 9, 20, 27).

కోళ్ళజేపు: 1. రూ. కోళ్ళజేబు; పర్యా. చూ. కోళ్ళగూడు (1). కోళ్ళను కమ్మడానికి (మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటిభాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు. చూ. చిత్రం 65 క,ప. (తె. 20, 24); 2. పర్యా. చూ. కోళ్ళ పార్సెల్ గంప. వ్యాపారం చేసేవాళ్ళు కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళ గంప; జేనెడు ఎత్తూ గజం వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికి వేయడానికి పైన తెరిపి ఉంటుంది; కొన్ని ఇదేరూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పూ రెండు మూరల ఎత్తూ ఉంటాయి. (తె. 14; రా. 8).

కోళ్ళజేబు: చూ. కోళ్లజేపు. (కో. 1, 10, 11, 18; తె. 31; రా. 11).

కోళ్ళపంజరం: ఉ. కోల్లపింజెరం; 1. కోళ్లనువేసే పంజెరం; చూ. చిత్రం 65 గ. (తె. 17); 2. కోడిని పొదగవేయడానికి వీలుగా అల్లిన వెదురు గంప; గుడ్లనుపొదిగే కోడిపెట్టమీద బోర్లిస్తారు; ఆకారం కోడిగుడ్డు గుల్లలో సగంభాగం బోర్లించి

నట్లు ఉంటుంది. (రా. 2).

**కోళ్ళపార్సెల్‌గంప:** పర్యా. కోళ్లగంప (3), కోళ్ళగూడు (2), కోళ్ళజేపు (2), కోళ్లబుట్ట (2), గరేగూడి, డాగు, పార్సెలుగంప. వ్యాపారం చేసేవాళ్లు కోళ్లను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్లగంప; జేనెడు ఎత్తు గజం వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్లను లోపలికి వేయడానికి పైన తెరిచి ఉంటుంది; కొన్ని ఇదే రూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పూ రెండుమూరల ఎత్తూ ఉంటాయి. (కో. 5; తె. 31).

**కోళ్ళబుట్ట:** ఉ. —బుట్టి; 1. పర్యా. చూ. కోళ్ళగూడు(1). కోళ్ళను కమ్మడానికి (మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగం వేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటిభాగంవేపు మొత్తం గళ్ళగళ్ళగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు ళ్ళనుకో వేయడానికి ద్వారం ఉంచుతారు. చూ. చిత్రాలు 65 క-ప. (తె. 11; రా. 5); 2. పర్యా. చూ. కోళ్ళపార్సెల్‌గంప. వ్యాపారం చేసేవాళ్ళ కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళగంప; జేనెడుఎత్తు గజం వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికి వెయ్యడానికి పైన తెరిచి ఉంటుంది; కొన్ని ఇదేరూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పూ రెండు మూరల ఎత్తు ఉంటాయి. (తె. 16).

**కోళ్ళబేంద:** పర్యా. చూ. కోళ్ళగూడు(1). కోళ్ళను కమ్మడానికి (=మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోను పోను ఎక్కువగానూ ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటిభాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లకముంటుంది; కొన్నిటికి వెడల్పుభాగంవేపు మూసి ఎత్తుభాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు. చూ. చిత్రాలు 65 క-ప. (తె. 22).

**కోసుతడక:** ఉ. —తడ్క; పర్యా. చూ. క్రాస్‌తడక(1). త్రిభుజాకారంలో ఉండేతడక; తడకలతో కట్టే ఇంటికికప్పువేపు త్రిభుజాకారం వచ్చేపక్క దీన్ని కడతారు. చూ. చిత్రం 37 (తె. 1).

**క్రాటిబొంగు:** పర్యా. చూ. కవురుబొంగు(1). తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురుగడ; తెల్లగాగాని నల్లగాగాని అవుతుంది; సరయిన జిగి ఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది. జేలితడకలకు మాత్రం పనికొస్తుంది. (రా. 11).

**క్రాసుదబ్బ:** చూ. క్రాసుబద్ద. (తె. 2).

**క్రాసుబద్ద:** (< ఇం. Cross—) రూ. క్రాసుదబ్బ; పర్యా. కత్తెరదబ్బ, కమాన్‌బద్ద(2), క్రైంచీబద్ద(1). బిర్రుబద్ద. వెదురుమంచం తయారీలో వెడల్పుభాగాన ఉన్న రెండుకాళ్ళను (కోళ్ళను) కలుపుతూగాని, కాలిసీ నిలువుగడ (నిలువుపట్టె)నూ కలుపుతూగాని, కాలిసీ అడ్డం బొంగు (అడ్డంపట్టె)నూ కలుపుతూ గాని, మూలదగ్గర అడ్డంపట్టెనూ నిలువుపట్టెనూ కలుపుతూగాని ఐమూలగా కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 108. 1. (కో. 9; తె. 31).

**క్రాస్‌తడక:** ఉ. —తడికి, —తడికె, క్రాస్‌తడికి; 1. అతియన్ తడక, కామరతడక, కోసుతడక, గోల్తడక(1). చెన్నతడక. త్రిభుజాకారంలో ఉండేతడక; తడకలతో కట్టేఇంటికి కప్పువేపు త్రిభుజాకారం వచ్చేపక్క దీన్ని కడతారు. చూ. చిత్రం 37. (కో. 5. 23, 25); 2. త్రికోణాకారంలో ఉండే వెదురుబద్దల తడక; ఇటువంటివి మూడువైపులా చేర్చి కోళ్ళుగుడ్లు పెట్టడానికి అనువుగా చేస్తారు. (కో. 2).

## ఖ

**ఖర్జూరచువ్వ:** ఉ. ఖర్జూర్సువ్వ: ఖర్జూరచెట్టు కమ్మ (బరిగె); పెళుసుగా ఉండడంవల్ల అల్లకానికి పనికి రాదు. (తె. 7).

**ఖర్జూరీదు:** (< ఖర్జూర + ఈదు). ఉ. ఖజ్జూరీదు; ఖర్జూరంపళ్లు కాసేచెట్టు. ఈతచెట్టు మాదిరిగా ఉంటుందికాని దానికంటె ఎత్తుగా ఉంటుంది. (తె. 9).

**ఖానా:** (హిం.) 1. రూ. కానా (3); పర్యా. అటువ, అర (1), క్రమా, గడంచ (1), గోవ (1), చిడీ (1), దీమి, పొది (2), బొంగుగోవ. వెదురుగడలు నిలవచేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండుగడలు (లేదా సరుగుడుకర్రలు) పాతి వాటికి ఎదురుగా గజం ఎడంలో మరో రెండు గడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి ఆ

నాలిగింటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడు గడలు (లేదా సరుగుడు కర్రలు)కట్టి ఒకవేపు ఖాళీ ఉంచుతారు; ఖాళీ ఉన్న వేపునుంచి గడలుదూర్చి నిలబెడతారు; ఖాళీవేపును గొలుసుతోగాని గడతో గాని మూసి తాళంగూడా వేసుకోవచ్చు. (తె. 16, 20); 2. పర్యా. చూ. క్రైంచి (1). వెదురుగడలు నిలబెట్టడానికి రెండు పొడుగాటి కర్రలకు దండె కట్టి చేసిన ఏర్పాటు; రెండుగజాల ఎడంలో రెండు వెదురుగడలుగాని సరుగుడు కర్రలుగాని పాతి ఆ రెంటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మరో కర్రను కడతారు; అడ్డంగా కట్టినకర్రకు వెదురు గడలు ఆనించి నిలబెడతారు. చూ. చిత్రం 8 ట (తె. 9); 3. పర్యా. కన్ను (5). కన్నె (1). జైలి(5) పూలబుట్ట, గద్దెబుట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తుగా అల్లిన భాగానికి మధ్యన బయటినుంచి ఏర్పరిచిన సందు; ఇలాటివి చుట్టూ ఉంటాయి; లోపలి ఉండే పూలు మొ॥వాటికి గాలి తగలడానికీ అందానికీ సందులు పెడతారు. (తె. 10, 17, 22). 4. పర్యా. చూ. కంత(2). గళ్లతడక (=బద్దలతో గళ్లుగళ్లుగా కట్టిన తడక) తయారీలో బద్దలమధ్య వచ్చే సందు; కొన్నిటికి చతురస్రాకారంలోనూ కొన్నిటికి డైమన్ ఆకారంలోనూ ఉంటుంది. చూ. చిత్రం 38 చ. 1. (తె. 12); 5. రూ. ఖానా (4); పర్యా. ఉయ్యాలఖానా, కంత (4), కన్ను (9), కన్నె (2), గండి (2), జైలి (4), బద్దసందు, సందు (4). ఉయ్యాల అల్లకంలో అడుగుభాగం లోనూ పక్కలా బద్దలమధ్య వచ్చిన సందు; గడి. (కో. 9; తె. 6, 7; రా. 10, 11).

## గ

గంగపెట్టె: గొల్లవాళ్ళు గంగమ్మ (=ఒకదేవత)ను పెట్టుకొని పోయేపెట్టె; దీర్ఘ చతురస్రాకారంగా ఉంటుంది; చూ. చిత్రం 141. (కో. 9).

గచ్చంతడక: ఉ. —తడికె; తడ్క; పర్యా. గచ్చపు చాప, వేతచాప. ఒకమూలనుంచి పేళ్ళువేసుకుంటూ గచ్చాలు (చూ. గచ్చం) వచ్చేటట్లు చేటమాదిరిగా అల్లిన వెదురుచాప. (తె. 8, 31).

గచ్చపుచాప: ఉ. — సాప; పర్యా. చూ. గచ్చంతడక. ఒక మూలనుంచి పేళ్ళు వేసుకుంటూ గచ్చాలు (చూ. గచ్చం) వచ్చేటట్లు చేటమాదిరిగా అల్లిన వెదురుచాప. (తె. 26).

గచ్చం: ఉ. గెచ్చం; రూ. గుచ్చం; పర్యా. అని(2). చేట, జల్లెడ, విసనగర్ర మొ॥ వాటి అల్లకంలో (కొన్నిచోట్ల జెడఅల్లికలో మాదిరిగా) లెక్క ప్రకారం దగ్గర దగ్గరగా వచ్చేపేళ్ళ కూర్పు; అయిమూలగాగాని నిలువుగాగాని ఉన్న ఒకపేడు మీంచి ఒక్కొక్కటిగాని రెండేసిగాని మూడేసిగాని నాలుగేసిగాని పేళ్ళు పైకీ కిందికీ వస్తుంటాయి; పేడు సన్నగా ఉంటే గచ్చాల సంఖ్య పెరుగుతుంది; వెడల్పుగా ఉంటే తగ్గుతుంది; చేటలో ఐమూలగా ఎనిమిది గచ్చాలుంటాయి; మూడేసి పేళ్ళగచ్చాలు నాలుగయితే ఒకచేట తయారుకావచ్చు. చూ. చిత్రం 21. (కో. 3 9. 13 15. 17. 21, 23, 27; తె. 3–6, 8, 12–16, 16, 18, 22 25–27, 30; రా. 2).

గచ్చవల్లికం (< గచ్చం+అల్లికం) పర్యా. చూ. చేటల్లికం(1). నిలువులు లేకుండా కేవలం పేడుతోనే ఎదురుబదురుగా గచ్చం వచ్చేటట్లు (చూ. గచ్చం) అల్లకం; చేట జల్లెడ, విసనగర్ర, చాప మొ॥వి ఇలా అల్లుతారు. (తె. 30, 31).

గచ్చమెక్కించు: (క్రి.) (< గచ్చం + ఎక్కించు); పర్యా. చూ. అనివేయు(1). చేట, విసనగర్ర అల్లకం ఆరంభంలో కొమ్ము(చూ.)కు రెండుగాని మూడుగాని నాలుగుగాని (అల్లకం విధానాన్నిబట్టి) పేళ్ళు ఎక్కించి అల్లకం మొదలుపెట్టడం. (రా.11).

గజంగనుపు: ఉ. —గెనుపు; వెదురుగడ కణుపుల మధ్య గజం ఎడం. (కో. 9).

గజంచాప: ఉ. —సాప; 1. ఐదుగజాల పొడుగూ గజం వెడల్పూపెట్టి అల్లిన వెదురుపేళ్ళచాప; ఒక్కరు పడుకోడానికి సరిపోతుంది. (కో. 23); 2. పర్యా. గజమల్తిచాప. గజంవెడల్పుగల తుంగ చాప. చూ. అల్తి. (కో. 3).

గజంతుంగ: గజంపొడుగు పెరిగేతుంగ; చూ. తుంగ. (కో. 3).

గజమాల్తిచాప: ఉ. —సాప; పర్యా. గజంచాప(2). గజంవెడల్పుగల తుంగచాప; చూ. అల్తి. (రా. 6).

గజంబద్ద: గజంపొడుగుండె కొలబద్ద; పేముకర్రల్ని అవసరమైన విధంగా కొయ్యడానికి కొలుచు కొంటారు. (కో. 19).

గజంబారుపేడు: ఉ. గిజం—; గజంపొడుగున (=రెండు కణుపుల మధ్యదూరం) ఉండే వెదురు గడనుంచి తీసినపేడు. (కో. 17).

గజ్జెముడి: ఒకరకం ముడి; ఈతబద్దతో పిల్చి అల్లిన తరవాత నిలువులను లోపలికిదోపి మళ్ళీబయటికి తీసేటప్పుడు బద్ద తిప్పేవిధానం. (తె. 13).

గంజరం: పర్యా. పంచితం. ఆవుమూత్రం. (రా. 3).

గంజు: పర్యా. అదితి(2). వెదురుగడల వేలంపాడే చోటు; మామూలుగా ప్రభుత్వం వెదురుడిపో దగ్గరే వేలంపాడతారు. (కో. 9).

గటం: (< సం. ఘటం) వెదురు ధాన్యంగింజల గుత్తి; గెల; అటువంటి గెలల సమూహం. (తె. 21, 23).

గట్టు: పర్యా. చూ. కట్టు (10). ఈత బద్దలతో అల్లే గంప; గుమ్మి మొ॥వాటికి అంచుచుట్టూగాని మధ్యన గాని అడుగునగాని ఉబ్బెత్తుగా అల్లినభాగం; వేలెడు రెండువేళ్ల మందం ఉంటుంది. (తె. 14).

గట్టికంక: పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 23).

గట్టికట్టె: పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 21; రా. 4, 5).

గట్టికర్ర: ఉ. గ్ఘట్టి—; 1. పర్యా. కండ(గల) బొంగు, కండబొంగు (2), కండమందం కర్ర, గట్టిబొంగు(2), గట్టివెదురు(2), చిట్టకర్ర, దళసరి కర్ర, నెద్దెదురు, సూదిబోలు. సూది పట్టేంత ఖాళీ మొదలు వేలెడంత ఖాళీవరకు లోపల బోలుగాఉండే గట్టి వెదురుకర్ర; గుట్టలమీదా రాళ్ల దగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాల వరకు లావుగా ఉంటుంది. (కో. 6, 7, 9, 12, 17, 30); 2. పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టివెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥వాటికి పనికొస్తుంది. (కో. 3, 4, 28, 29; తె. 9, 16; రా. 5).

గట్టిజల్లెడ: ఉ. గ్ఘట్టి—; పర్యా. సాదాజల్లెడ. పేళ్లు దగ్గరదగ్గరగాపెట్టి చిక్కగా అల్లిన జల్లెడ; కన్నాలు చాలా సన్నగా ఉంటాయి; మామూలుగా వడ్లలోని మట్టిపెళ్లలూ మెరిగెలూ మొ॥వి తీసెయ్యడానికి వాడతారు. (రా. 9, 10).

గట్టితడక: ఉ. గ్ఘట్టి—; పూర్తిగా ఈతకమ్మ వెన్ను నుంచి తీసినబద్దతో చిక్కగా(గట్టిగా) అల్లినతడక. (రా. 9).

గట్టితుంగ: ఉ. గ్ఘట్టి—; మధ్యలో బోలుగాలేకుండా గట్టిగా ఉండేతుంగ చూ. తుంగ. (కో. 3; రా. 4).

గట్టిదబ్బ: ఉ. గ్ఘట్టి—; పర్యా. చూ. తెల్లపేడు. వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (రా. 5).

గట్టిబొంగు: ఉ. గ్ఘట్టి—; 1. పర్యా. కడ్డీకర్ర, కండకర్ర, కండబొంగు(1), గట్టికంక, గట్టికట్టె, గట్టికర్ర(2), గట్టివాసం, గట్టివెదురు(1),గంట్కెదురు, గూజుబొంగు, చిట్టెదురు(2), దంతె(1). నిద్దకర్ర, మందంకర్ర, మందవాసికట్టె, మొదలుపోటు కర్ర(2). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టివెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 3-5, 8, 10, 15-17, 22, 24, 25, 28, 29, 31; రా. 6-9, 11); 2. పర్యా. చూ. గట్టికర్ర(1). సూదిపట్టేటంతఖాళీ మొదలు వేలెడంతఖాళీ వరకు లోపల బోలుగా ఉండే గట్టివెదురుకర్ర; గుట్టలమీదా రాళ్ళదగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాలవరకు లావుగా ఉంటుంది. (కో. 5, 7).

గట్టివాసం: పర్యా. చూ. గట్టిబొంగు(1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టిఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 11).

గట్టివెదురు: ఉ. గ్ఘట్టెదురు; 1. పర్యా. చూ. గట్టిబొంగు(1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టిఉన్న గట్టివెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 1; తె. 4; రా. 3, 4); 2. పర్యా. చూ. గట్టికర్ర(1). సూదిపట్టేంత ఖాళీ మొదలు వేలెడంతఖాళీ వరకు లోపల బోలుగాఉండే గట్టివెదురుకర్ర; గుట్టలమీద రాళ్లదగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాలవరకు

లావుగా ఉంటుంది. (కో. 2, 31).

గట్టిసజ్జ: ఉ. గెట్టి ; పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికి చిలక్కొ-య్యకు తగిలించడానికి వీలుగా ఒకవెదురు బద్ద వంచి కడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట్ల పళ్లెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరు సెనక్కా-యలు మొ॥ అమ్మేవాళ్లుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్లు ఉండవు. చూ. చిత్రం 139. (తె. 28, 29).

గట్టిసజ్జబుట్ట: చిక్క-గా అల్లినసజ్జ; పట్టుకోడానికి వెదురుబద్ద ఒకటి వంచికడతారు; కిందగద్దె ఉండదు; పళ్లెంలాంటి మూత ఉంటుంది. (కో. 29).

గట్టుబొంగు: పర్యా. చూ. గుట్ట(ల) బొంగు. కొండల మీదా గుట్టలమీదా గట్లమీదా పెరిగే వెదురుకఱ్ఱ; పెళుసుగా ఉంటుంది; పేడు తీయడం కష్టం; మేదరి పనికి ఉపయోగపడదు. (కో. 9; తె. 26).

గడ: ఉ. గెడ; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురు పొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ల మందంనుంచి దూల మంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూర కొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికఱ్ఱ మొ॥వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (కో. 17, 19).

గడకఱ్ఱ: ఉ. గెడకఱ్ఱ; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది; సుమారు 5 గజాలనుంచి దూలమంత మందంవరకు లావూఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికఱ్ఱ మొ॥వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (కో. 16); 2. పొడుగాటి వెదుకఱ్ఱ; ఏతాం తోడ డానికి పనికొస్తుంది. (కో. 29).

గడంచు: 1. పర్యా. చూ. ఖానా(1). వెదురుగడలు నిలవ చేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండుగడలు (లేదా సరుగుడుకఱ్ఱలు) పాతి వాటికి ఎదురుగా గజంఎడంలో మరోరెండు గడలు (లేదా సరుగుడు కఱ్ఱలు) పాతి అనాలిగింటి పైచివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కఱ్ఱలు) కట్టి ఒకవైపు ఖాళీ ఉంచుతారు; ఖాళీఉన్న వేపునుంచి గడలుదూర్చి నిలబెడతారు; ఖాళీవేపును గొలుసుతోగాని గడతో గాని మూసి తాళం గూడా వేసుకోవచ్చు (తె. 22); 2. చూ. గడమంచం. (తె. 12, 26).

గడమంచం: ఉ. గడె—; రూ. గడంచ(2). పక్క-బట్టలు మొ॥ పెట్టుకోడానికి చేసిన చిన్న వెదురు మంచం. చూ. చిత్రం. 109. (కో. 9; తె. 8).

గడి: పర్యా. చూ. కంత(2). గళ్ళతడక (=బద్దలతో గళ్ళుగళ్ళుగా కట్టినతడక) తయారీలో బద్దలమధ్య వచ్చేసందు; కొన్నిటికి చతురస్రాకారంలోనూ కొన్నిటికి డైమన్ ఆకారంలోనూ ఉంటుంది. చూ. చిత్రం 38 చ. 1. (తె. 6).

గడుసు: (విణ) ఉ. గెడ్సు; గట్టి; వెదురుగడపేడు తీసేటప్పుడు సులువుగా రాకుండా (గట్టిగా) ఉన్నప్పుడు వాడేమాట (తె. 17).

గడుసుకణుపు: ఉ. గడ్సు- ; పర్యా. చూ. గంటీ గనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మఉరువునుబట్టి కొన్నిటికి పెద్దగానూ కొన్నిటికి చిన్నగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (రా. 7).

గడుసుగడ: ఉ. —గెడ; పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకఱ్ఱ; పేడు తీసేటప్పుడు ఎక్క-డి కక్క-డ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 16).

గడుసుగనె: ఉ. గడ్సు—; పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసిప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలావుగా ఉండడం వల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడం వల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపుఉన్న వెదురుగడను చీల్చడంకష్టం. (తె. 10).

గడుసుబొంగు: ఉ. గడ్సు—, గెడ్సు—; రూ. గరుసుబొంగు; పర్యా. కటుకుబొంగు, కడ్డీవెదురు, కర్మకట్టె, కాకివెదురు(4). గడుసుగడ, గడ్డమోదు

బొంగు, గడ్డుకర్ర, డెప్పకర్ర, బిరుసుబొంగు, బిరుసువెదురు, బెట్టువాసం, బెండుకర్ర(2). పెళుసైనవెదురుకర్ర; పేడుతీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (తె. 7, 21, 23; రా. 7).

గడ్డ: 1. పర్యా. గొప్పు. ఎత్తుమీదఉన్న భూమి. (తె. 15); 2. పర్యా. చూ. వెదురుగడకు భూమిలోపల వేళ్ళతో సహాఉన్నదుంప; వెదురుగింజ భూమిలోపడిన తరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రగానూ లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్నిపిల్లవేళ్ళూ భూమిలోకి పారతాయి. (కో. 9; తె. 6, 17, 18, 19, 23, 26); 3. పర్యా. చూ. మూపురం. మేదరికత్తి వెన్ను (చూ.) పదునంచువైపు వంపు దిరిగిన భాగం చూ. చిత్రం 12 జ. 4. (తె. 7); 4. పర్యా. చూ. బొద్దె(3). విసనగర్ర గొట్టం (= కాడకుతొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండేభాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (తె. 18).

గడ్డబొంగు: వేళ్ళతోసహా పీకిన వెదురుగడ. (తె. 8).

గడ్డం: ఉ. గెడ్డం; 1. పర్యా. కవులు (2), బొరిగె. మేదరికత్తికి కాడవేపునుంచి పదును మొదలైనచోట ఉన్న మొన. చూ. చిత్రం 12 జ. 5. (కో. 3, [illegible], 11, 15-18); 2. పర్యా. అంబుగడ్డం. అంబు (చూ.) పదగ వెడల్పుగా ఉన్నచోట వంపుదిరిగిన భాగం; ఇలాటివి రెండుంటాయి. (కో. 6); 3. ఏరకలి కొడవలికాడ వంపుదిరిగిన మొదటిభాగం; దీని తరవాత పదును ఉంటుంది. (రా. 9); 4 పర్యా. చూ. బొద్దె (3). విసనగర్రగొట్టం (= కొడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండేభాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (కో. 10).

గడ్డమోడుబొంగు: పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 9).

గడ్డి: (< కర్ది). పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర కట్టుకోడానికి అల్లకంలో ఒకఅంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (రా. 1).

గడ్డిగంప: పర్యా. గడ్డిమానె. వెదురుబద్దలతో రెండు మూరల వెడల్పూ మూరెడు ఎత్తూపెట్టి అల్లినగంప; దీంట్లో గడ్డి వేసుకొస్తారు. (కో. 6).

గడ్డిగాడి: పశువులు కట్టేచోట గడ్డి వెయ్యడానికి ఏర్పరిచిన చోటు. (కో. 27).

గడ్డిచీపురు: ఉ. —శీపురు; ఇల్లు ఊడ్చుకోడానికి గడ్డితో కట్టిన చీపురు; మొదెంగడ్డి, నునుగడ్డి మొ॥ రకాల గడ్డి దీనికి వాడతారు; చీపురు పొడుగ్గా ఉంటుంది. (తె. 21).

గడ్డిబుట్ట: పర్యా. కొల్లాం, గాదితట్ట, మేతజల్ల, సెంగెరిగంప. పశువులకు గడ్డి వేయడానికి వాడే పెద్దగంప; అడుగున వెడల్పు తక్కువుండి పోనుపోను మూతి విశాలమవుతుంది; గడ్డికింద వేస్తే పశువులు తొక్కుతాయని దీంట్లో వేస్తారు. చూ. చిత్రం 31. (కో. 10, 15, 16)

గడ్డిమానె: ఉ. —మాని; పర్యా. గడ్డిగంప. వెదురు బద్దలతో రెండుమూరల వెడల్పూ, మూరెడు ఎత్తూపెట్టి అల్లినగంప; దీంట్లో గడ్డి వేసుకొస్తారు. (కో. 28).

గడ్డుకర్ర: పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 15).

గణ: చూ. కణుపు. (కో. 15).

గణకురచగడ: ఉ. —కుర్సగెడ; పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరి పనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥వాటికి పనికొస్తుంది. (కో. 15).

గణబద్ద: చూ. గనెబద్ద. (కో. 15).

గణబారుగడ: ఉ. —గెడ; పర్యా. చూ. నిడుపు (గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 15).

గణుపు: 1. చూ. కణుపు. (కో. 15; రా. 7); 2. (—చెక్కు). చూ. గనుపు (3); పేముకర్రకు

అక్కడక్కడ ఉండే హద్దు; కణుపు. (కో. 12; తె. 22).

గంట: ఒకే కుదురుకు పెరిగిన మూడునాలుగు గడ్డి పోచల సమూహం. (తె. 21).

గంటకుడక: ఉ. —కుడ్క—; కొబ్బరికుడీ (కుడక)లో సగం; బోర్లిస్తే గంటమాదిరిగా ఉంటుంది. (తె.21).

గంటల్లొదిబొంగు: అసిఫాబాద్ అడవిలో గంటల్లొద్ది అనే లోయలో పెరిగిన వెదురుగడ; మెత్తగా ఉంటుంది; పేడు బాగా వస్తుంది. (తె. 23).

గంటి: ఉ. గెంటి, గొంటు 1. పర్యా. చూ. గంటి బద్ద (1). గంటిగనుపు గుర్తు ( వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి, ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవి ప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 6, 7, 10, 15, 26); 2. పర్యా. చూ. బొద్దె (1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు. (రా. 6); 3. చూ. గంటు (1). (తె. 14); 4. చూ. గంటు (2). (కో. 7, 10, 11, 15, 16; తె. 6, 17, 26, 31; రా. 10).

గంటిగన: చూ. గంటిగనుపు (1). (తె. 18).

గంటిగనుపు: ఉ. గంటిగన్పు, గంటిగెనుపు, గెంటి గెనుపు, గెంటిగెన్పు; రూ. గంటిగన, గంటిగనె; పర్యా. కచ్చు, కన్ను (1), కన్నుగుంపు, గదుసు కణుపు, గంటు (1), గంటుగుంపు, గనుపు (5), గనుపుకణ్ణు, గుంపు (1), చిట్టె (3), చిల్ల (2), నుచ్చుగుంపు, పిట్టకనుపు, పెట్టగుంపు, పెంట గుంపు, బజ్జ, బుడుపు (1), బొడుసు (1), బొద్దు(1), బొద్దుగన, బొద్దుగుంపు, ముచ్చు[1], ముడి (3), ముడిగంటు, ముడిగనుపు, రిల్ల, లాక (1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొద్దులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (కో. 3, 5, 6, 8, 13, 14, 17, 18; తె. 13; రా. 10); 2. పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపువగ్గర పెరిగిన కొమ్మ నరికేసి నప్పుడు కనిపించే పెడల్పుగుర్తు; కొమ్మ లావుగా ఉండడంవల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్ద గుర్తు పడుతుంది; ఇలాటి కణుపుఉన్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 2).

గంటిగనె: చూ. గంటిగనుపు (1). (తె. 7).

గంటిచెక్క: ఉ.—చెక్క—; పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు ( = వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురు బద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (తె. 5).

గంటితబ్బ: చూ. గంటిబద్ద (1). (తె. 6).

గంటిదబ్బ: ఉ. గంటు— —గెంటి –; చూ. గంటి బద్ద (1). (కో. 2, 3, 7, 10; తె. 2–4, 7, 12; రా. 2, 8, 9, 11).

గంటిపలుకు: గంటిబద్దనుంచి చీల్చితీసిన నిలువు; చూ. పలుకు. (కో. 10).

గంటిపేడు: పర్యా చూ. గంటీనె. గంటిబద్దనుంచి తీసినపేడు; ఇది జల్లెడ, చేట మొ॥ అల్లడానికి పనికిరాదు; మోటువస్తువులు అల్లడానికి పని కొస్తుంది. (రా. 5).

గంటిబద్ద: ఉ. గంటు—, గంచె—, గెంటి—; 1. రూ. గంటితబ్బ, గంటిదబ్బ; పర్యా. అంచు దబ్బ (1). కచ్చుబద్ద, కండదబ్బ (3), కన్నుబద్ద, గంటి(1), గంటిచెక్క, గనుపు(6), గనె(3), గనెబద్ద, గుంపు(4), గుంపుబద్ద, గెండుతునిగ, చిల్లబద్ద, దుగిరందబ్బ, పెట్టగుంపుబద్ద, పెనబద్ద, పెంటిబద్ద, పోకు, బొడుసు(2), బొడిబద్ద, ముడిబద్ద, వారగర్రె(1). గంటిగనుపుగుర్తు ( = వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు)ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి, ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతం వాళ్ళు దీన్నిపారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 5, 6, 8–11, 13, 16–18, 25, 29–31; తె. 7, 10, 13, 14, 17–19, 22, 25–28, 31; రా. 6); 2. ఉ. గంట—; రెండుగంటిగనుపు (చూ.)ల మధ్యనుంచి తీసిన వెదురుబద్ద. (కో. 19–21).

గంటీనె: ( < గంటి + ఈనె) ఉ. గంటీన; పర్యా. కన్నుపేడు, గంటిపేడు. గంటిబద్దనుంచి తీసినపేడు; ఇది జల్లెడ, చేట మొ॥ అల్లడానికి పనికిరాదు; మోటువస్తువుల అల్లడానికి పనికొస్తుంది. (కో. 21, 31).

గంటు: 1. రూ. గంటి(3). పర్యా. చూ. గంటి గనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు;

కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (తె. 3, 12; రా. 9); **2.** రూ. గంటి(4); పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉండే హద్దు; గడచుట్టూ ఉబ్బెత్తుగా ఉంటుంది; అంతమేరకు లోపలిఖాళీని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మవేస్తుంది. చూ. చిత్రం 4. 3. (తె. 4; రా. 11).

గంటుగుంపు: పర్యా. చూ. గంటిగనుపు(1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (కో. 29, 31).

గంటెక్కెదురు: (< ? గంటక్క + ఎదురు) పర్యా. చూ. గట్టిబొంగు(1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టిఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్లు, గుతపకర్ర, గైకట్టె, మంచంపట్టె మొ॥వాటికి పనికొస్తుంది. (రా. 2).

గండంగి: చూ. కొండెంగ. (కో. 2, 3).

గండంగికాటుబొంగు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 2).

గండంగిమోటుకర్ర: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 9).

గండి: **1.** పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్యఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (రా. 6. 8, 10, 11); **2.** పర్యా. చూ. ఖానా (5). ఉయ్యాల అల్లకంలో అడుగుభాగంలోనూ పక్కలా బద్దల మధ్యవచ్చిన సందు; గడి. (రా. 11); **3.** చాటు తడక అల్లకంలో పేడుకూ పేడుకూ మధ్యవచ్చే సన్నటి సందు. (తె. 1); **4.** పర్యా. చూ. కన్నె (3). ఈతబద్దతో అల్లిన ఉయ్యాల, కోళ్ళగంప మొ॥ వాటిలో గాలి ఆడేటందుకు వీలుగాపెట్టిన సందు. (రా. 8).

గండివిసనగర్ర: ఉ. గండిసనగర్ర; పర్యా. చూ. జేలి విసనగర్ర. పేళ్ళమధ్య సందులు (జేతలు) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 త. (రా. 8).

గండుచీమకాటుబొంగు: పర్యా. చూ. చీమపోటు బొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగువచ్చిన వెదురుగడ. (కో. 2).

గండ్లజల్లెడ: పర్యా. బొక్కల జల్లెడ. పేళ్ళమధ్య సందులు (కండ్లు) పెద్దగా ఉండేటట్లు అల్లిన జల్లెడ; బియ్యంలో నూకలు తియ్యడానికి వాడతారు. (రా. 8-10).

గండ్లతడక: ఉ.—తడ్క; **1.** పర్యా. చూ. జేల తడక (1). వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి మేకులుకొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూ మధ్య సందులు చతురస్రంగాగాని డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకొంటారు. (తె.1; రా. 10); **2.** బిలుకు (= పలచటి వెదురుబద్ద)లతో మధ్యమధ్య సందులు వచ్చేటట్లు అల్లిన తడక. (8, 11).

గండ్లబుట్ట: పర్యా. చూ. పూలబుట్ట (1). పూలు ఏర డానికీ గుడికి తీసుకెళ్ళడానికీ ఉపయోగించే బుట్ట; మామూలుగా దీనికి కమాన్‌బద్దా (= పట్టుకోడానికి వీలుగా వంచికట్టిన వెదురుబద) గద్దె ఉంటాయి, చుట్టూ కళ్ళు (కంతలు) పెడతారు; కొన్ని మర చెంబు ఆకారంలోనూ కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ కొన్ని ఎత్తుపళ్ళెం ఆకారంలోనూ ఉంటాయి; కొన్నిటికి మూతకూడా ఉంటుంది. (రా. 10).

గండ్లవిసనగర్ర: పర్యా. చూ. జేలి విసనగర్ర. పేళ్ళ మధ్య సందులు (జేలిలు) వచ్చేటట్లు అల్లిన విసన గర్ర; చూ. చిత్రం 31 త. (రా. 10).

గతుకులు: (బహు.) హెచ్చుతగ్గులు; మిట్టపల్లాలు. (రా. 9).

గదమముల్లు: ఉ. గద్మ—; చూ. గవదముల్లు. (తె. 16).

గదులపెట్టె: అరలరలుగా ఉండే పెట్టె; కొన్నిటికి మధ్యన పెద్ద అరా దానిచుట్టూ తొమ్మిది చిన్న అరలు ఉంటాయి. (కో. 19, 23, 25, 26).

గద్దె: 1. పర్యా. చూ. కుతికె (1). మేదరికత్తికి పదును భాగమూ కాడా కలిసినచోట వంపుదిరిగిన భాగం. (కో. 30); 2. పర్యా. కుదురు (4), పాదం (2), మట్టు (3); కాయితాలబుట్ట, చేతిబుట్ట, పూలబుట్ట, కంతబుట్ట మొ॥ నేలమీద నిలబడడానికి వీలుగా అల్లిన అడుగుభాగం; కొంచెం ఎత్తుగా సమతలంగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 1. (తె. 4, 10, 14, 17-22, 24, 26).

గద్దెగుల్ల: పర్యా. చూ. పూలబుట్ట (1). పూలు ఏరడానికీ గుడికి తీసుకెళ్ళడానికీ ఉపయోగించే చిన్న బుట్ట; మామూలుగా దీనికి కమాన్‌బద్దా (= పట్టుకోడానికి వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) గద్దే ఉంటాయి; చుట్టూకళ్ళు (కంతలు) పెడతారు; కొన్ని మరచెంబు ఆకారంలోనూ కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ కొన్ని ఎత్తుపళ్ళెం ఆకారంలోనూ ఉంటాయి; కొన్నిటికి మూతకూడా ఉంటుంది. (తె. 24).

గద్దెబుట్ట: పర్యా. చూ. పూలబుట్ట (1). పూలు ఏరడానికీ గుడికి తీసుకెళ్ళడానికీఉపయోగించే చిన్న బుట్ట; మామూలుగా దీనికి కమాన్‌బద్దా (= పట్టుకోడానికి వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) గద్దే ఉంటాయి; చుట్టూకళ్ళు (కంతలు) పెడతారు; కొన్ని మరచెంబు ఆకారంలోనూ కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ కొన్ని ఎత్తుపళ్లెం ఆకారంలోనూ ఉంటాయి; కొన్నిటికి మూతకూడా ఉంటుంది. (తె. 8-10).

గన: ఉ. గనె; 1. చూ. కణుపు (తె. 18, 23, 29, 30); 2. చూ. కనుపు (2). (కో. 28, 29; తె. 31); 3. పర్యా. చూ. బొద్దె (3). విసనగర్ర గొట్టం (= కాడకు తొడిగింది) జారిపోకుండా కాడ చివర ఉబ్బెత్తుగా ఉండేభాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (తె. 29).

గనకర్ర: ఉ. గని—; గెన—; చూ. గనుపుకర్ర. (కో. 21, 28).

గనకురచ: ఉ. —కుర్స. గనికుర్స; పర్యా. చూ. కురచగనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (కో. 11, 17, 21).

గనగనబద్ద: పర్యా. గనబారు (2), మయానబద్ద. రెండు కణుపుల మధ్యభాగం (చూ. గన) నుంచి చీరిన వెదురుబద్ద. (కో. 17).

గనపలుకు: గంటిబద్ద (చూ.)నుంచి తీసిన వెదురు పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది, బండిజల్లలూ మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 18).

గనపిచ్చె: ఉ. గనిపిచ్చి; పర్యా. చూ. మూరగనుపు. వెదురుగడ కణుపులమధ్య మూరెడు ఎడమున్న భాగం. (రా. 2).

గనబద్ద: చూ. గనెబద్ద. (కో. 18).

గనబారు: 1. పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్న భాగం. (కో. 10, 13); 2. పర్యా. చూ. గనగనబద్ద. రెండు కణుపుల మధ్యభాగం (చూ. గన) నుంచి చీరిన వెదురుబద్ద. (కో. 17).

గనబారుకర్ర: పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్న భాగం. (కో. 10).

గనసందు: ఉ. గన్సందు; చూ. గనుపుసందు. (తె. 18, 30).

గనసాగుడు: పర్యా. గనబారు (1), గనబారుకర్ర, గనసాగుడుకర్ర, గనసాపు, గనెసాగుడుగనె, పొడుపిచ్చె, బారుగణుపు, బారుదూరం సాగుడు, సాగుడుగనుపు. వెదురుగడ కణుపులమధ్య మూరెడు కన్న ఎక్కువ ఎడమున్నభాగం. (కో. 8, 11, 13, 14, 17, 18; తె. 31).

గనసాగుడుకర్ర: పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడకణుపుల మధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్నభాగం. (కో. 10).

గనసాగుడుపేడు: రెండు కణుపులమధ్య ఎడం(గన) ఎక్కువగా ఉండే వెదురుగడనుంచి తీసినపేడు. (కో. 16).

గనసాపు: పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్న భాగం. (కో. 18).

గనికె: ఉ. గెనికె; చూ. కణుపు. (తె. 1).

గనుపు: ఉ. గన్పు గెణుపు, గెన్పు, గ్రెనుపు. గ్రెన్పు, గ్రెంపు; 1. చూ. కణుపు. (కో. 1-13, 16-18; తె. 1-2, 6-7, 9, 13, 15 27, 31; రా. 1-5, 8-10); 2. పర్యా. చూ. బొద్దె(1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు. (కో. 11, 12, 19); 3. చూ. గణుపు(2). (కో. 3); 4. చూ. కనుపు. (కో. 6, 12, 16-18; రా. 4, 5): 5. పర్యా. చూ. గంటి

గనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (తె. 15, 16); 6. పర్యా. చూ. గంటిబద్ద(1). గంటిగనుపు గుర్తు (=వెదురుగడకు పెరిగిన కొమ్మనరికేస్తే మిగిలేకొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇదికర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు దీన్నిపారేస్తారు. చూ. చిత్రం 9. (తె. 27); 7. పర్యా. చూ. బొడ్డె(3). విసనగర్ర గొట్టం (కాడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండేభాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెతారు. చూ. చిత్రం 31 త. 3. (కో. 8, 11; రా. 2).

గనుపుకణ్ణు: పర్యా. చూ. గంటిగనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (రా. 1).

గనుపుకర్ర: ఉ. గెన్పు -; రూ. గనకర్ర; పర్యా. చూ. నిడుపు(గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 3, 12).

గనుపుపేడు: 1 పర్యా. చూ. జల్లెడపేడు. జల్లెడతట్టు (చూ.) అల్లడంకోసం మూ౹గనుపు (రెండు కణుపులమధ్య మూరెడు ఎడంఉండే గడభాగం) గడనుంచి చీరినపేడు; కణుపులేకుండా మూరెడు పొడుగుంటుంది; చేట పేడుకన్న వెడల్పు తక్కువగా ఉంటుంది. (రా. 4); 2. పర్యా. విసనగర్రపేడు. విసనగర్ర అల్లకంకోసం పొడుగు గనుపుల గల (మూరెడుగాని అంతకన్న పొడుగ్గాగాని ఉన్న) వెదురుగడనుంచి తీసినపేడు; దీనికి మధ్యన కణుపుల గుర్తులుండవు (కణుపుల గుర్తులుంటే అల్లకం కుదరదు. (కో. 8, 10).

గనుపుబొడ్డు: ఉ. గెనుపు ; పర్యా. చూ. బొడ్డె(1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు. (రా. 4).

గనుపుసందు: ఉ. గెనుపు ; రూ. గనసందు; గనేసందు; పర్యా. కనుపు (2), గుద్దు(1), నడికనుపు, పిచ్చె, పొబ్బ, వెదురుపిచ్చె. వెదురుగడకు రెండు కణుపుల మధ్యభాగం; కొన్నిటికి పొడుగ్గానూ కొన్నిటికి పొట్టిగానూ ఉంటుంది. (కో. 6, 7; రా. 3).

గనుబ్బారుకర్ర: (< గనుపు + బారుకర్ర) పర్యా. చూ. నిడుపు(గనె)బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించితీసిన పేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 12).

గనుమతడక: ఉ. గన్వ౹తడక, గన్వ౹తడ్క; రూ. గల్మతడక; పర్యా. చూ. వాకిలితడక (1) గుమ్మానికి అడ్డంగా తలుపుమాదిరిగా పెట్టే వెదురుతడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (తె. 9).

గనె: ఉ. గెనె, గ్గనె; 1. చూ. కణుపు. (తె. 7, 8, 10, 12, 14-17, 19-22, 24-26); 2. చూ. కనుపు. (కో. 20, 30; తె. 9); 3. పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపుగుర్తు (= వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేస్తే మిగిలేకొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతం వాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (తె.21); 4. కణుపు; గడ్డిపోచకు మధ్యమధ్యన చుట్టూ ఉబ్బెత్తుఉండే భాగం; వెదురుకర్ర కణుపుమాదిరిగా ఉంటుంది; మొదెం గడ్డిపోచకు మరోపోచ పెరిగే చోట చుట్టూ ఇలా ఉంటుంది. (తె. 21).

గనెకట్టుకు: ఉ.-కట్కు; కత్తికికూడా తెగనంత గట్టిగాఉండే వెదురుకణుపు. (తె. 27).

గనెకురచబొంగు: పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 17, 26, 29).

గనెబద్ద: రూ. గణబద్ద, గనబద్ద; పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (=వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (తె. 16, 20, 23, 24, 30, 31).

గనెసందు: చూ. గనుపుసందు. (తె. 6-8, 20

26, 28).

గనెసాగుడుగనె: పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్నభాగం. (తె. 27).

గనెసాగుపేడు: వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్న భాగంనుంచి తీసినపేడు, దీన్ని జల్లెడ అల్లకానికి ఉపయోగిస్తారు; కణుపు గుర్తులున్న పేడు అల్లకానికి పనికిరాదు. (తె. 27).

గంతలల్లకం: (< గంతలు + అల్లకం) మూడువరసల తాళ్ళతో మంచానికి నులక అల్లే విధానం. (రా. 5).

గన్నంగి చూ. కొండెంగ. (కో. 7).

గన్నంగిమోటు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేత మొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 7).

గన్ను[1]: ఉ. గ్రెన్ను; చూ. కణుపు. (రా. 6).

గన్ను[2]: సమ్మెట; పెద్దసుత్తి. (తె. 14, 26).

గన్నుకామ: సమ్మెట (గన్ను) తూముకు తొడిగిన వెదురు కర్రముక్క. (తె. 26).

గబ్బితొర్ర: వెదురుగడని కొరచీమలు మొ॥ కీటకాలు తొలవగా ఏర్పడిన రంధ్రాలు; పేడు చీల్చేటప్పుడు ఈ రంధ్రాలున్నచోట గడ విరిగిపోతుంది. (తె. 27, 28).

గబ్బితొర్రలబొంగు: పర్యా. గొగ్గితొర్రల బొంగు. తియ్యని గుజ్జుకోసం గబ్బపురుగులు రంధ్రాలు చేసిన వెదురుగడ; గడ పెరిగినకొద్దీ రంధ్రాలు వెడల్పవుతాయి; చీరేటప్పుడు ఈ రంధ్రాల దగ్గర పేడు విరిగిపోతుంది. (తె. 22).

గబ్బిపురుగు: వెదురు మొక్కకు రంధ్రాలు చేసుకొని లోపలికిదూరి తియ్యటికండ తినే ఒకరకం పురుగు. (తె. 22).

గంప: 1. ధాన్యం మొ॥పోసి పెట్టుకోడానికీ మోసుకు వెళ్ళడానికీ కూరగాయలు మోసుకెళ్ళడానికీ వెదురు పేడుతో అల్లిన ఒకరకం పెద్దబుట్ట; ఆకారంలోనూ సైజులోనూ దీనిలో చాలా రకాలున్నాయి; కొన్ని కిందివైపుకంటె మీదివైపు వెడల్పుగా ఉంటాయి; చూ. చిత్రం 47 క, త. (కో; తె; రా.); 2. ధాన్యం పోసిపెట్టుకోడానికీ మోసుకువెళ్ళడానికీ వెదురుపేడుతో అల్లిన పెద్దగంప; దీనికి నిలువు బందవు; మొత్తం పేడుతోనే చేట అల్లకంలా అల్లుతారు; కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 27, 28); 3. పర్యా చూ. బియ్యం గడుగుబుట్ట. బియ్యం కడిగి గాలించిన తరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసిఉంచే బుట్ట; కొంచెం పలచగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద సన్నగా ఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి ఒకే తీరుగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగుమూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది; (దీన్ని చేటమాదిరిగా అల్లుతారు); సంతర్పణ వంటలకు వాడతారు; చూ. చిత్రం 48. (రా. 10); 4. పర్యా. చూ. జల్లిగంప (1). అన్నంగంజి వార్చడానికి సన్నటి పేళ్ళతో మధ్య సందులుండేటట్లు అల్లినగంప; అన్న సంతర్పణ వంటలకు వాడతారు; చూ. చిత్రం 52. (కో. 17; రా. 10); 5. పర్యా. ఇసకగంప, వడ్లగంప. ఈత చువ్వలతో అల్లినగంప; గుల్లకన్న పెద్దది; ధాన్యం పోసుకోడానికీ ఎరువు చేరవేయడానికీ వాడతారు (తె. 9, 11; రా. 8). 6. పర్యా. చూ. పుట్టి. చేపలు పట్టడానికి చెరువులోకి వెళ్ళే చిన్నపడవ; దీన్ని దొడ్డి (ఫ్రేమ్) వెదురుతో తయారుచేసి బయటినుంచి చుట్టూ తోలువేసి కుడతారు. (రా. 8).

గంపల్లకం· (< గంప + అల్లకం) గంప అల్లే విధానం; నిలువుల చుట్టూ అడ్డపేళ్ళు తిరిగివచ్చేటట్లు గంప, బుట్ట మొ॥ అల్లుతారు. (రా. 2).

గరి: (బహు. గర్లు) ఉ. గిరి; 1 పర్యా. కక్కు, కోర, గాడి. వెదురుబద్ద అంచుకుండే పదును (కో. 11-1; 15, 16, 18; తె 17, 18 20); 2. వెదురుబద్దకు పదునుగా ఉండే అంచు (తె. 21-23); 3 తాటిమట్టకుగాని గాజంగి మట్టకుగాని అంచులవెంట ఉండే రంపంపళ్ళలాంటి ముళ్ళవరస, బాగాపదును; చూ. చిత్రం 123. 2. (తె. 9); 4. తాటికమ్మకు పదునుగా ఉండే అంచు; పలచగా పళ్ళవరస మాదిరిగా, కమ్మకు రెండువైపులా ఉంటుంది. (కో. 13); 5. పర్యా. చూ. బొడుపు (2). ఈతకమ్మకున్న ఆకుతెంపిన తరవాత ఆకుతెగినచోటపడే గుర్తు. (కో. 25); 6. చాపలునేసే చేతి మగ్గంకర్ర (లావాటి వెదురుగడ)కు బెత్తెడేసి ఎడానికీ ఒకటి చొ॥న చుట్టూపెట్టిన గాటు. ఈ గాటులో రాయికట్టిన తాడు ఇరికించి వేలాడగడతారు. (కో. 30).

గరిగిపీచు: ఉ. - పీసు; పర్యా. కట్టుచెత్త. కట్టుపీచు,

వెదురుబద్ద సన్నగా గీకేటప్పుడు వచ్చేతుక్క. (కో. 15).

గరిగీయు: (క్రి.) పర్యా. గరిబట్టు. వెదురుబద్దకు పదునుగా ఉండే అంచు(గరి) కత్తితో సన్నగా గీకడం (కో. 13, 15, 16, 18).

గరిదెగు: (క్రి.) పదునుగా ఉండే వెదురుబద్ద అంచు (గరి) తగిలి చెయ్యితెగడం. (కో. 15, 16, 18).

గరిపీచు: ఉ. —పీసు; వెదురుబద్దకు పదునుగాఉండే భాగాన్ని (గరి) కత్తితో గీసేస్తే వచ్చేతుక్క. (కో. 15).

గరిబట్టు: (క్రి.) పర్యా. గరిగీయు. వెదురుబద్దకు పదునుగా ఉండే అంచు (గరి) కత్తితో సన్నగా గీకడం. (తె. 17).

గరిబోవు (క్రి.) ఉ. గరివోవు; వెదురుగడ బలహీనమై పోవడం. (కో. 6).

గరిసె: ఉ. గరిశె; **1.** పర్యా. చూ. బండిజల్ల(1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (కో. 28); **2.** పర్యా. చూ. బండిజల్ల(2). ఎరువు మొ॥ చేరవేయడానికి బండిమీద పరిచేతడక; ఈతపేళ్ళతో అల్లుతారు. (కో. 25).

గరుసుబొంగు: ఉ. గర్సు -; చూ. గరుసుబొంగు. (రా. 11).

గరేగూడి: పర్యా. చూ. కోళ్ళపార్సెల్‌గంప. వ్యాపారం చేసేవాళ్ళు కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళగంప; జేనెడుఎత్తూ గజంవ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికివేయడానికి పైన తెరిపి ఉంటుంది; కొన్ని ఇదే రూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పు రెండుమూరల ఎత్తూ ఉంటాయి. (కో.26).

గర్జ: ఒకరకం తీపివంటకం; కజ్జికాయ(లు). (తె. 15).

గర్భతాడు: మోటమోకులో బయటికి కనిపించకుండా లోపలినుంచి పొడుగునా ఉండేతాడు; బయటికి కనిపించే (నాలుగు) తాళ్ళకన్న సన్నగా ఉంటుంది. (తె. 9).

గ్రరన: (క్రి. విశ.) గట్టిగా; బిర్రుగా; జల్లెడ అల్లకంలో అడుగు (చూ.) మీదగుండ్లు (చూ.) గుండుమీద మందంకర్ర(చూ.) పెట్టి ఆ మూడింటినీ కలిపి గట్టిగా కడతారు. (రా. 9).

గర్లుదిద్దు: (క్రి.) పర్యా. గర్లుదీయు. తాటిమట్టకుగాని గాజంగిమట్టకుగాని అంచువెంట ఉండే ముళ్ళను (గరులు) కత్తితో గీకడం. (తె. 9).

గర్లుదీయు. (క్రి.) పర్యా. గర్లుదిద్దు. తాటిమట్టకుగాని గాజంగిమట్టకుగాని అంచువెంట ఉండే ముళ్ళను (గరులు) కత్తితో గీకేయడం. (తె. 9).

గలుమ: రూ. గల్మ(2). పర్యా. తోవ, మూతి(2), ముత్త(4), రంధ్రం. కోళ్ళగూడులోకి కోళ్ళను వేయడానికి పెట్టినకంత. చూ. చిత్రం 65 ప. 3. (తె. 8, 23).

గలుమతడక: పర్యా. మూత(4), మూతతడక(1). ముత్తతడక(2). కోళ్ళగూడు కంతనుమూసే చిన్న వెదురుతడక; సుమారు జేనెడేసిపొడుగూ వెడల్పూ ఉంటుంది. చూ. చిత్రం 65 ప. 4. (తె. 23).

గల్మ: (< గలుమ) **1**. పర్యా. చూ. బొక్క (2). గొర్రెపిల్లల గూడులోకి పిల్లల్ని వేయడానికి ఉంచిన సందు; అల్లేటప్పుడు ఒక గొర్రెపిల్లపట్టేంత సందు వదులుతారు. చూ చిత్రం 77. 4 (తె. 29); **2.** చూ. గలుమ. (తె. 8); **3.** చాటుతడకకుండే దారి (కంత) (తె. 23); **4.** పర్యా. చూ. దారి. ఈతబద్దలతో అల్లిన కోళ్ళగూడులోకి కోళ్ళను వేయడానికి పెట్టిన ద్వారం. (తె. 9).

గల్మతడక: చూ. గలుమతడక.

గళ్ళచాప: ఉ.—సాప; గళ్ళుగళ్ళుగా నేసిన తుంగ చాప. (కో. 3).

గళ్ళతడక: పర్యా. చూ. జేలికమాన్‌తడక. పైఅంచు (కమాన్) పొడుగునా మూరెడుమొదలు గజం వెడల్పువరకు గళ్ళుగా జేలీలున్న తడక; తడకలతో కట్టిన ఇంటి ముందుభాగంలోగాని వరండాకు అడ్డంగాగాని తలుపుతోసహా అమరుస్తారు. చూ. చిత్రం 38 చ. (కో. 23).

గవదముల్లు: రూ. గదమముల్లు; పర్యా. చూ. దవడ ముల్లు. ఈతమట్ట మొదటిభాగంలో ఉండే ముల్లు; దబ్బనంలా ఉంటుంది. చూ. చిత్రం 10.1. (రా.8).

గాజంగిగదుమ: ఉ.—గదుంవ; గాజంగిమట్టలు గుది గుచ్చినట్లుగా పెరిగిన గాజంగి గుమ్మి. (తె. 9).

గాజంగిమట్ట: **1.** గాజంగి గదుమనుంచి కోసితీసిన మట్ట; సుమారు బెత్తెడుమీద రెండువేళ్ళ వెడల్పు గానూ వేలెడు మందంగానూ గజం పొడుగ్గానూ ఉంటుంది; మొదట వెడల్పుగామా మధ్య ఇంకా వెడల్పుగానూ పోనుపోను చివర కోసుగానూ ఉంటుంది; అంచులకు రంపంముళ్ళలాంటి ముళ్ళు ఉంటాయి చివర దబ్బనంలాంటి ముల్లుంటుంది;

(తె. 9); **2.** తుంగ (జమ్మ) చాప నేతలో నిలువుకు అవసరమైన నారపోచలు తీసే గాజంగి మొక్కమట్ట. (తె. 7).

గాజు: **1.** వా(నె (చూ.) పేనిన తరవాత మొదలు పెట్టినచోటా పూర్తయినచోటా అతుకుమీద పురితో చుట్టిన చుట్టు; ఇలా వరసగా చుడతారు. (తె. 9); **2.** తాటిచీపురు (పొరక) పిడిమీంచి పురితో చుట్టిన చుట్టు; గట్టిదనంకోసం ఇలా వరసగా చుడతారు. (తె. 9).

గాజులపల్లివెదురు: గాజులపల్లి ప్రాంతంనుంచి తెచ్చిన వెదురుకర్ర. (కో. 3).

గాజులపెట్టి: గాజులమ్మేవాళ్ళు గాజులుపెట్టి తీసుకు వెళ్ళే బుట్ట; పొడుగు ఎక్కువా వెడల్పు తక్కువా ఉంటుంది. (కో. 23).

గాడి: వెదురుగడలను అడ్డంగాపేర్చి నిలవచేయడానికి ఏర్పాటుచేసిన చోటు; గోడకు గజం, అర్ధగజం ఎడంలో రెండుమూడు చిన్నగుంజలు పాతి గుంజలకూ గోడకూమధ్య గడలు పేరుస్తారు. (కో. 8).

గాడితట్ట: పర్యా. చూ. గడ్డిబుట్ట. పశువులకు గడ్డి వేయడానికి వాడే పెద్దగంప; అడుగున వెడల్పు తక్కువుండి పోనుపోను మూతి విశాలమవుతుంది; గడ్డి కిందపేస్తే పశువులు తొక్కుతాయని దీంట్లో వేస్తారు. చూ. చిత్రం 91. (కో. 25).

గాదె: ఉ. గాజె, గాది; **1.** పర్యా. చూ. గుమ్మి (2). ఒకచోట స్థిరంగా ఉంచి పెద్దమొత్తంలో వడ్లు మొ॥ ధాన్యంపోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; సుమారు గజంఎత్తూ ముప్పావు గజం నుంచి గజంన్నర వరకు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ, కొన్నిచోట్ల కిందినుంచి మీదికి గుండ్రంగానూ, కొన్నిచోట్ల కింద వెడల్పుగా గుండ్రంగానూ మధ్యన కొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను మూసుకొచ్చే విధంగానూ, కొన్నిచోట్ల కింద గుండ్రంగానూ పోనుపోను పైన సన్నగానూ ఉంటుంది; కొన్నిచోట్ల దీనికి శిఖరంలాంటి కప్పు ఉంటుంది; రెండు బస్తాలనుంచి 12 బస్తాలవరకు ధాన్యంపట్టే పరిమాణంలో ఉంటాయి; చూ. చిత్రం 14 క, ట. (కో. 1, 3, 8-10, 23, 27, 29, 30; తె. 2); పర్యా. కెర్నవడ్లు మొ॥ ధాన్యం నిలవ ఉంచుకోడానికి వెదురుబద్దలతో అల్లినది; ఇంటి ముందర గజం విస్తీర్ణంలో వృత్తాకారంగా మందం బద్దలుపాతి వాటిచుట్టూ బద్దలతో అల్లుకొచ్చి పూర్తయిన తరవాత చుట్టూరా మన్ను మెత్తుతారు (తెలంగాణాలో దీన్నే పెద్దసైజులో అల్లుతారు; ఇలారం అంటారు; వర్షంవచ్చినా తడవకుండా పైన కప్పుతారు) (కో. 28); **3.** పర్యా. ఇలారం (1). రెండుపుట్లనుంచి (పుట్టి - ఆరు క్వింటాళ్ళు) ఇరవై పుట్లదాకా ధాన్యం నిలవ ఉంచుకొనే పెద్దగుమ్మి (చూ. గుమ్మి); ఇంటి ముందుగాని ఇంటి ఆవరణలోగాని అటుగుమీదగాని స్థిరంగా ఉండేటట్లు అల్లుతారు; పుల్చేరుకట్టె, వావిలికట్టె, గువ్వదాడుకట్టె మొ॥ వాటితో దీన్ని అల్లుతారు; కొప్పులాగా దీనికి కప్పు ఉంటుంది. (తె. 14), **4.** పర్యా. చూ. గుమ్మి (3). వడ్లు మొ॥ ధాన్యం నిలవచేసుకోడానికి ఈతచువ్వతో అల్లినది; గజంనుంచి రెండుగజాల వరకు చుట్టు కొలతా, ఐదడుగుల ఎత్తూ ఉంటుంది; రెండుబస్తాల నుంచి ఇరవై బస్తాలవరకు ధాన్యం పడతాయి. (కో. 3; రా. 8, 9).

గాదెబుట్ట: ఉ. - బుట్ట; పర్యా. చూ. గుమ్మి (2). ఒకచోట స్థిరంగాఉంచి పెద్దమొత్తంలో వడ్లు మొ॥ పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; సుమారు గజంఎత్తూ ముప్పావు గజంనుంచి గజంన్నర వరకు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ, కొన్నిచోట్ల కిందినుంచి మీదికి గుండ్రంగానూ, కొన్నిచోట్ల కింద వెడల్పుగా గుండ్రంగానూ మధ్య కొంచెం వెడల్పుగానూ ఉండి పోనుపోను మూసు కొచ్చే విధంగానూ, కొన్నిచోట్ల కింద గుండ్రంగానూ పోనుపోను పైన సన్నగానూ ఉంటుంది; కొన్నిచోట్ల దీనికి శిఖరంలాంటి కప్పు ఉంటుంది; రెండు బస్తాలనుంచి 12 బస్తాలవరకు ధాన్యంపట్టే పరిమాణంలో ఉంటాయి. చూ. చిత్రం 74 క, ట. (తె 30).

గాబు: పర్యా. అవుజు. నీళ్ళు నిలవ ఉంచుకోడానికి సిమెంట్‌తోగాని మట్టితోగాని చేసిన పెద్దతొట్టి. (తె. 8).

గాబుమీదిమూతతడక: ఉ. - తడక; పర్యా. చూ. గోలెంమీది తడక. నీళ్ళ(తొట్టి)మీద మూతగావేసే తడక; తొట్టి ఆకారాన్నిబట్టి దీర్ఘచతురస్రంగానూ చతురస్రంగానూ గుండ్రంగానూ ఉంటుంది. (తె. 8).

గాయిశేరుచాప: పుల్లలుపుల్లలుగా ఉండే ఒకరకం తుంగతో నేసిన చాప. (కో. 3).

గాయిశేరుతుంగ: పుల్లలుపుల్లలుగా ఉండే ఒకరకం తుంగ. (కో. 31).

గార; 1. చూ. గారు (2) (తె. 7); 2. చేట మొ॥ వాటి అల్లకంలో వచ్చే ఒకరకం డిజైను. చూ. చిత్రం 26. (కో. 2).

గారల్లకం: (< గారు + అల్లకం). పర్యా. పూలల్లకం. చేట మధ్యభాగంలో ఒకరకం పువ్వులాంటి డిజైన్ వచ్చేటట్లు అల్లే విధానం; చూ. గారు. (కో. 2).

గారు: 1 చేట అల్లకంలో ఒకమూల అల్లి రెండో మూల అల్లకం మొదలు పెట్టేటప్పుడు అడ్డంగా వేసినపేడు (కో. 3, 5); 2. చూ. గార(1). చేట మొ॥వాటి మధ్య వెడల్పుభాగంలో నాలుగు చదరం డిజైన్లలో వచ్చే అన్నిటికన్న లోపల ఉన్న చదరం. చూ. చిత్రం 26. (తె. 10); 3. చేట అల్లకంలో మధ్యభాగంలో వచ్చేపువ్వులాంటి డిజైను. (కో. 2); 4. చేట అల్లకంలో నాలుగు మూలలా ఏటవాలుగావచ్చే నాలుగు పచ్చపేళ్ళు; మూలకొక గారు చొ॥న వస్తుంది. (కో. 6); 5. గూడ (చూ.) అడుగున రెండుమూలలకు మధ్య డొల్లగా ఉన్న భాగం. (తె. 30).

గారుగట్టు: (క్రి) చేట అల్లకంలో ఒక మూల అల్లి రెండోమూల అల్లడం మొదలుపెట్టేటప్పుడు ఒక పేడు అడ్డంగాపెట్టడం. (కో. 3, 5).

గారుచేట: ఉ. గార్చాట; పర్యా బాసింగంచేట. మధ్య భాగంలో చదరంగా డిజైనువచ్చేటట్లు అల్లిన చేట. (తె. 7).

గాలపుకట్టె: పర్యా. చూ. గాలంబరిగె. చేపలు పట్టడానికి గాలంకట్టే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావు ఉంటుంది. (తె. 21).

గాలపుచువ్వ: ఉ.—సువ్వ; పర్యా. చూ. గాలంబరిగె. చేపలుపట్టడానికి గాలంకట్టే వెదురుకర్ర; చిటికెన వేలెడు లావు ఉంటుంది. (తె. 29).

గాలపుపేడు: పర్యా. చూ. గాలంబరిగె. చేపలు పట్టడానికి గాలంకట్టే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావు ఉంటుంది. (తె. 5).

గాలంబరిగె: పర్యా. గాలపుకట్టె, గాలపుచువ్వ, గాలపుపేడు. చేపలుపట్టడానికి గాలంకట్టే వెదురు కర్ర; చిటికెనవేలెడు లావు ఉంటుంది. (తె. 10,19).

గాలించుకొను: (క్రి.) తుంగపోచలను కొనలు పట్టుకొని పైకిఎత్తి జాడించడం; ఇలాచేస్తే చిన్న చిన్న పోచలు జారిపోయి అన్నీ ఒకేసైజు పోచలు మిగులుతాయి. (కో. 8).

గాలివాసం: గాలికి లేవకుండా ఈతగడ్డిమీద వేసే వెదురుకర్ర. (తె. 29).

గావు: పర్యా. అకు, దొడ్డి (3), వంపు (2). ఎరకలి కత్తి (కొడవలి)లో వంపుదిరిగి పదునుగా ఉన్న భాగం. చూ. చిత్రం 113. 3. (తె. 13, 16, 20).

గింజలగంప: ధాన్యంగింజలు పోసిపెట్టుకొనే వెదురు గంప (తె. 4).

గిడుగు: కామలేని చిన్నగొడుగు; ఎండావానలనుంచి కాపుదలగా తలమీద టోపీలా పెట్టుకోడానికి వెదురు బద్దలతోచేసి పైన తాటాకు కప్పుతారు. చూ. చిత్రం 88. (కో. 30).

గిద్దనరుకు: పర్యా. కన్ను (18); మేదరనరుకు. వెదురుగడ మొదలు కత్తితోకొట్టడంవల్ల గుండ్రంగా గిద్ద నరుకు. (కో. 18).

గిద్దలూరుబొంగు: గిద్దలూరు ప్రాంతంలో దొరికే వెదురుగడ; పెళుసుగా ఉంటుంది. (కో. 8).

గిన్నెదురు: పర్యా. చూ. మల్లెం(పు)బొంగు. వెదురు గడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లుఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥ వాటికి పనికొస్తుంది;ఎక్కువకాలం పొదకు ఉండడం వల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది. కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది. (రా. 9).

గిన్నెమోత: ఎరకలివాళ్ళ పెళ్ళిళ్ళకు డప్పులవాద్యం బదులు గిన్నె మోగించడం; అల్యూమినియం గిన్నెనుగాని ఇత్తడిగిన్నెనుగాని కట్టెతో కొడతారు. (తె. 7).

గిరక: ఉ. గిర్క; చూ. గిలక (1). (తె. 8, 10, 13, 15).

గిరకపంకా: ఉ. గిర్కపన్క; పర్యా. చూ. గొట్టం విసనగర్ర. సులువుగా తిప్పుకోడానికి వీలుగా వెదురుగొట్టం తొడిగిన విసనగర్ర; చూ. చిత్రం 31. ట. (తె. 10).

గిరకవిసనగర్ర: ఉ. గిర్క ఇసనగర్ర; చూ. గిలక విసనగర్ర. (తె. 10).

గిర్ర: పర్యా. చూ. చార. గీటు; గీర; మామూలుగా పొడుగ్గా సాగినరేఖ; మేదరిపనిలో బొగ్గుతోగాని

సుద్దముక్కతోగాని గుర్తుగా చిన్నగీట్లు పెట్టు కొంటారు. (తె. 6).

గిలక: ఉ. గిల్క; 1. రూ. గిరక; పర్యా. చూ. గొట్టం (1). విసనగర్ర కాడకు తొడిగిన వెదురు గడముక్క; లోపల గుల్లగా ఉన్నది; విసురుకొనే టప్పుడు సులువుగా ఉండడానికి ఇది తొడుగుతారు. చూ. చిత్రం 31 ట. 1. (కో. 3, 5, 7, 8, 10–13, 26). 2. కొబ్బరికాయ మొదటిభాగంలో కాయను కప్పుకొని వేలాడే ఆకు. (కో. 25).

గిలకవిసనగర్ర: ఉ. గిల్క యిసనగర్ర, గిలకిసన గర్ర, గిల్కిసనగర్ర; రూ. గిరక విసనగర్ర; పర్యా. చూ. గొట్టం విసనకర్ర. సులువుగా తిప్పుకో డానికి వీలుగా వెదురుగొట్టంతొడిగిన విసనగర్ర; చూ. చిత్రం 31 ట. (కో. 3, 7, 8, 11, 13, 26).

గిలాసబుట్ట. ఉ. —బుట్టి; నీళ్ళుతాగే గాజుగ్లాసు దాచి పెట్టుకొనే చిన్నబుట్ట; గ్లాసుసైజులో ఉంటుంది; దీనికి కమాన్‌బద్దా (= పట్టుకోడానికీ చిల క్కొయ్యకు తగిలించడానికీ వీలుగా వంచికట్టిన వెదురుబద్ద) మూతా ఉంటాయి; చూ. చిత్రం 87. (తె. 6, 8, 22).

గిల్లు: (క్రి.) తుంచడం; దుసేరు తీగలకుండే పిల్లపంగలను తుంగపోచల చివరి కంకులనూ తుంచేస్తారు. (తె. 9; రా. 4).

గీకు: (క్రి.) 1. పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపుల దగ్గరికొమ్మలను గాని మొనదేలిఉన్న ముక్కలనుగాని బొడుపులను గాని సమానంగా కత్తితో చెక్కుతారు (తె. 24); 2. పర్యా. చూ. గీయు (1). వెదురుబద్దగాని పేడు గాని కర్ర (= తీగలాంటి సన్నటి వెదురుచువ్వ) గాని కత్తితో నున్నగా గీకడం. (తె. 8, 18, 22–24).

గీత: 1. (—పెట్టు). పర్యా. గీర. వెదురుగడ పగల గొట్టేటప్పుడు సుద్దిబద్దకూ గంటిబద్దకూ మధ్య కత్తితో పెట్టినగాటు (కో. 5; 23); 2. పర్యా. చూ. చార. గీటు; గీర; మామూలుగా పొడుగ్గా సాగినరేఖ; మేదరిపనిలో బొగ్గుతోగాని సుద్ద ముక్కతోగాని గుర్తుగా చిన్న గీట్లు పెట్టు కొంటారు. (తె. 22).

గీతబట్టు: (క్రి.) ఉ. గీతవట్టు; పర్యా. దూగోడగుంజు, పేడుగీయు, పేడుచెక్కు(1). వెదురుపేడు నున్నగా గీకడం; బొద్దుభాగంవైపు పసరుభాగంవైపు— రెండు వైపులాగీకుతారు; పసరుభాగంవైపు గీకడంవల్ల అల్లే టప్పుడు జారకుండా పొందికగా ఉంటుంది; మొద్దుకు లేదా వంకెకూ కత్తిపదునుకూ మధ్య పేడుపెట్టి లాగుతూ గీకుతారు. (తె. 4, 21, 22; రా. 9).

గీయు: (క్రి.) 1. పర్యా. గీకు(2). గీరు, చెక్కు(2), చెక్కేయు, జివ్వు, పైదు(1), సాపుచేయు. వెదురు బద్దగాని పేడుగాని కర్ర (= తీగలాంటి సన్నటి వెదురుచువ్వ)గాని కత్తితో నున్నగా గీకడం. (కో. 5, 23, 25, 26, 28, 31; తె. 7); 2. పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపులదగ్గరి కొమ్మలనుగాని మొనదేలి ఉన్న ముక్కలనుగాని బొడుపులనుగాని సమానంగా కత్తితో చెక్కుతారు. (కో. 18).

గీర: పర్యా. గీత(1). వెదురుగడ పగలగొట్టేటప్పుడు సుద్దిబద్దకూ గంటిబద్దకూ మధ్య కత్తితో పెట్టినగాటు. (తె. 16, 17, 19)

గీరు: (క్రి.) పర్యా. చూ. గీయు(1). వెదురుబద్దగాని పేడుగాని కర్ర (= తీగలాంటి సన్నటి వెదురు చువ్వ)గాని కత్తితో నున్నగా గీకడం. (తె. 3).

గుచ్చం: చూ. గచ్చం. (తె. 23).

గుచ్చు: (క్రి.) రూ. కుచ్చు(2); పర్యా. చూ. దోపు(2). దూర్చడం; గంప, తడక మొ॥వాటి అల్లకంలో అంచుదగ్గర మిగిలిన నిలువులను వెనక్కిమడిచి అంచు లోపలికి దూరుస్తారు. (కో. 3, 5, 13, 15–22, 26).

గుజురు: పర్యా. గుంజి, గుడ్డు(2). లేతకొబ్బరికాయలో ఉండే తెల్లటిపదార్థం, గుంజు; క్రమంగా గట్టిపడి కొబ్బరి అవుతుంది. (కో. 25).

గుంజ: 1. పర్యా. దిమ్మ. పందిరి, కొట్టం, కళ్యాణ మంటపం మొ॥వాటి నిర్మాణంలో నేలలో పాతిన లావుపాటి వెదురుగడ చూ. చిత్రం 120. 1. (తె. 6, 26); 2. చాపనేతమగ్గానికి పక్కన పాతిన కొయ్యగూటం. (రా. 6).

గుంజపలుపు: పశువును కట్టేటప్పుడు గుంజకు తగిలించడానికి కన్నె(చూ.)కు ఒకచివర ఉండేతాడు; మెడపలుపుకన్న పొడుగుతక్కువ. (కో. 5).

గుంజి: పర్యా. చూ. గుజురు. లేతకొబ్బరికాయలో ఉండే తెల్లటిపదార్థం; గుంజు, క్రమంగా గట్టిపడి కొబ్బరి అవుతుంది. (కో. 20).

గుంజు[1]: కలబంద పట్టనుంచి నారతీసేసిన తరవాత మిగిలే పచ్చటిపదార్థం. (కో. 3).

గుంజు[2]: (క్రి.) పర్యా. ఇగ్గు. లాగడం; చేట, జల్లెడ మొ॥వాటికి కట్టుముంగుతో కట్టుగట్టేటప్పుడు

ముడివేస్తూ లాగుతారు. (తె. 6, 12, 16, 13, 22; రా. 9).

గుంజుడుతడక: ఇంటిగుమ్మానికి అడ్డంగా, పక్కకు జరుపుకోడానికి (గుంజుకోడానికి) వీలుగా పెట్టిన తడక; పక్కకు జరుపుకోడానికి దీనికి గొట్టా ఉంటాయి. చూ. చిత్రం 39. (తె. 23(.

గుంజుపుల్ల: పర్యా. చూ. కండదబ్బ (4). ఈత కమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగంనుంచి నిలువుగా చీలినబద్ద; గంప మొ॥వి అల్లేటప్పుడు అడుగు భాగంలో చుట్టడానికీ ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పనికొస్తుంది. చూ. చిత్రం 11.3. (కో. 3).

గుట్ట: పర్యా. చూ. మండె (1). వెదురుగడలపోగు; మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్నిచోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని ప్రభుత్వంవారి వెదురు డిపోలోగాని అడితిల్లోగాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తంలేదు. (కో. 3, 9, 18).

గుట్ట(ల)బొంగు: పర్యా. కట్టబొంగు (2), కొండ బొంగు, కొండవెదురు, గట్టుబొంగు, గుట్టవెదురు (1), పర్వతంబొంగు, బొరికెంబొంగు. కొండల మీదా గుట్టలమీదా గట్లమీ ా పెరిగే వెదురుకర్ర; పెళుసుగా ఉంటుంది; పేడుతీయడం కష్టం; మేదరి పనికి ఉపయోగపడదు. (తె. 8, 9, 20, 28, 31).

గుట్టవెదురు: ఉ. గుట్టెదురు; 1. పర్యా. చూ. గుట్ట(ల)బొంగు. కొండలమీదా గుట్టలమీదా గట్ల మీదా పెరిగే వెదురుకర్ర; పెళుసుగాఉంటుంది; పేడు తీయడం కష్టం; మేదరిపనికి ఉపయోగపడదు. (రా. 2); 2. గుట్టమీదపెరిగే ఒకరకం వెదురుగడ; పొడుగ్గా ఉంటుంది; మేదరిపనికి బాగా ఉపయోగ పడుతుంది. (తె. 29).

గుడిసె: వెదురుపుల్లలతో అల్లిన గుడిసెబొమ్మ; ఇళ్ళలో అలంకారానికి పెట్టుకొంటారు. (కో. 29).

గుడిసెకట్టెలు: ఉ.—కట్లు, గుడ్సె—; పర్యా. చూ. ముక్కానాల కర్రలు. (తుంగ)చాప నేసే మగ్గం మధ్యభాగంలో గుడిసెమాదిరిగా అమర్చి నిలబెట్టిన మూడు కర్రలు; వీటిలో సమాంతరంగా నిలబడి ఉండే రెండుకర్రలకు అని కర్ర (=అని మార్చడానికి)ను వేలాడదీస్తారు; కొన్ని ప్రాంతాల్లో దీనికి అచ్చు (=తుంగపోచలను దగ్గరికి జరపడానికి పోగులుదూర్చిన చెక్క)ను వేలాడదీస్తారు. చూ. చిత్రం 121 క. 1. (కో. 8; రా. 10).

గుడుప: పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం [illegible] తొంగిపె) జారిపోకుండా కడపిపెట్ట ఉబ్బెత్తుగాఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (రా. 5).

గుడ్డలపెట్టె: పర్యా. చూ. పెట్టె (1). చీరలూ పంచెలూ మొ॥ బట్టలుపెట్టుకొనే వెదురుబద్దల పెట్టె; చతురస్రాకారంలోనూ దీర్ఘచతురస్రాకారం లోనూ ఉంటుంది. చూ. చిత్రం 41. (కో. 4).

గుడ్డిగనుపు: పర్యా. చూ. బొడ్డుగనుపు (1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు లోతుగాపడే బొడ్డులాంటి గుర్తు. చూ. చిత్రం 9. 1. (కో. 30).

గుడ్డిపువ్వువిసనగర్ర: ఉ. గుడిపువ్విసనకర్ర; మధ్యలో ఒకరకంపువ్వులాంటిపనివరస(=డిజైను) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (తె. 18, 23).

గుడ్డు: 1. పర్యా. చూ. గనుపుసందు. వెదురుగడకు రెండు కణుపుల మధ్యభాగం; కొన్నిటికి పొడుగ్గానూ కొన్నిటికి పొట్టిగానూ ఉంటుంది. (తె. 16); 2. పర్యా. చూ. గుజురు. లేత కొబ్బరికాయలో ఉండే తెల్లటి పదార్థం; గుంజు; క్రమంగా గట్టిపడి కొబ్బరి అవుతుంది. (కో. 20).

గుడ్డుపువ్వు: చేట అల్లకంలో మధ్యభాగంలో వచ్చే పువ్వులాంటి డిజైను. (కో. 18).

గుడ్డుబుట్ట: పర్యా. చూ. కోడిగుడ్లబుట్ట. కోడిగుడ్లను భద్రపరుచుకొనే బుట్ట. (కో. 17).

గుడ్లబుట్ట: పర్యా. చూ. కోడిగుడ్లబుట్ట. కోడిగుడ్లను భద్రపరుచుకునే బుట్ట. (కో. 10).

గుంటగనుపు: ఉ. — గెన్పు; పర్యా. చూ. బొడ్డు గనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు లోతుగాపడే బొడ్డులాంటి గుర్తు. చూ. చిత్రం 9.1; (కో. 5).

గుండు: 1. పర్యా. కట్టు (4), కట్టుగర్ర (1), కట్టు గర్రబద్ద, కట్టుబద్ద (1), కడెం (1), కుండీబద్ద, గోడుదబ్బ (3), జల్లెడకట్టు (1), జల్లెడకంటం, జల్లెడగుండు (2), జల్లెడరౌను, దబ్బగుండు, పెండెబద్ద (1), బిలుకు (3), రౌన్‌కట్టు, లోగుండీ లోపటిగుండు. జల్లెడ అంచుకట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడుపేళ్ళ వెడల్పు బద్ద; జల్లెడతట్టుమీద దీన్నిబెట్టి తట్టు చివర్లను దీని చుట్టూ వంచుతారు; ఇది జల్లెడఅంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద

వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 21, 23; తె. 2, 4-8, 10, 13, 15, 17-23, రా. 2-5, 8, 10). 2. పర్యా. చూ. కర్ర (4). జల్లెడఅంచు కట్టడానికి లోపలిగుండు, బిలుకు (వెలుపలిబద్ద)ల మీంచి, ఆ రెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుగల మందంబద్ద. (కో. 2, 3, 6, 7, 26; తె. 25-27); 3. పర్యా. పెనుగుండు. కొడమగోడ మధ్యభాగంలో లోపలినుంచి వృత్తాకారంలో అమర్చిన వెదురుబద్ద; కొన్నిటికి బెత్తెడేసి ఎడంలో రెండుంటాయి. (కో. 4); 4. పర్యా. చూ. కండదబ్బ (4). ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగంనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్టడానికీ, ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పనికొస్తుంది. చూ. చిత్రం 11.3; (రా. 9).

గుండుకర్ర: పర్యా. చూ. గోలుకర్ర. గుండ్రంగానూ కాస్త లావుగానూ ఉండేకర్ర. (చూ. కర్ర); గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టు చుట్టడానికీ అడుగు దొక్కడానికీ పనికొస్తుంది. (తె. 13, 28).

గుండుగంప: పర్యా. గుండుగుల్ల. గుండ్రంగా ఉండే ఈతగంప. (తె. 4, 16).

గుండుగుల్ల: పర్యా. గుండుగంప. గుండ్రంగా ఉండే ఈతగంప. (తె. 11).

గుండుగోలు: పీపుదబ్బ (=ఈతకమ్మ వెన్నుచీరి తీసినబద్ద)నుంచి నిలువుగా చీరినబద్ద. (రా. 9).

గుండుచివ: ఉ. —శివ; పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర. చూ. చిత్రం 32.1; (రా. 6).

గుండుజమ్ము: పోచ గుండ్రంగా ఉండే జమ్ము; చాపలు నేయడానికి బాగా పనికొస్తుంది. (రా. 2, 6, 10).

గుండుజల్ల: పర్యా. చూ. కంకిజల్ల (1). సజ్జకంకి, జొన్నకంకి మొ॥ వాటిని పొలాలనుంచి మోసుకు రావడానికి వాడే ఒకరకం పెద్దగంప; గజంఎత్తూ మూరన్నర వెడల్పూ ఉంటుంది. (కో. 4).

గుండుదబ్బ: ఉ. —దెబ్బ; 1. గుండ్రంగా ఉండే వెదురుబద్ద; పేడతట్టల అల్లకానికి వాడతారు. 2. పర్యా. చూ. పొట్టదబ్బ. ఈతకమ్మపొట్ట (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11.2 (తె. 20); 3. రూ. గుందబ్బ; పర్యా. చూ. వెన్నుదబ్బ. ఈతకమ్మ వెన్ను (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. చూ. చిత్రం 11.4; (తె. 16).

గుండుబరిగె: ఉ. - బరుగు; గుండ్రంగా ఉండే ఈతచువ్వ (బరిగె); అంబడిగంప, గుల్ల, గుమ్మి మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 13).

గుండూరుగా: పర్యా. గోలుగా, గుండ్రంగా; జల్లెడ అడుగును గుండ్రంగా కత్తిరిస్తారు. ఈతగంప మొ॥ అల్లేటప్పుడు నిలువుల్ని చక్రాకారంగా పరుస్తారు. (తె. 4).

గుండ్రటి విసనగర్ర: ఉ. గుండ్రటిసన్నకర్ర: పర్యా. రౌండిసనగర్ర. అంచులు గుండ్రంగా వచ్చేటట్లు అల్లిన విసనగర్ర; కొన్నిచోట్ల దీనికికాడ, గొట్టం ఉంటాయి. (కో. 10, తె. 26).

గుతప: ఉ. గుత్ప; పర్యా. చూ. చేతికర్ర(1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళ లావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసా మొదలూ ఒకేలావుంటాయి; సాముచేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (తె. 10).

గుత్తపకర్ర: ఉ. గుత్ప—; పర్యా. చూ. చేతికర్ర(1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళ లావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలులేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసామొదలూ ఒకే లావుంటాయి; సాముచేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (తె. 14, 19).

గుద్ద: 1. కిందిభాగం; కొబ్బరిపట్టకుగాని కాయకుగాని చూ. చిత్రం 126. 4. (కో. 23, 25, 29); 2. చూ. గుద్దపురి.

గుద్దకిందికట్టు: పర్యా. మట్టుబొద్దు. గుల్ల, మానె మొ॥వాటి అల్లకంలో అడుగుఅల్లి ఎత్తుభాగం అల్లడానికి నిలువుల్ని పైకి వంచేముందు వేసినకట్టు. చూ. చిత్రం 50. 1. (తె. 19, 25).

గుద్దకిందిబద్ద: పర్యా. అడుగుబద్ద. మానె, గంప, గుల్ల, తట్ట మొ॥వాటి అల్లకం పూర్తయిన తరవాత గట్టిదనంకోసం అడుగున అడ్డంగాగాని నిలువుగాగాని తొడిగిన వెదురుబద్ద. (తె. 25).

గుద్దపురి: రూ. గుద్ద(2); ఉట్టిలో పాత్రపెట్టడానికి అడుగున గుండ్రంగా అల్లినమట్టు. చూ. చిత్రం 146.1. (రా. 4).

గుద్దలికాడ: గుద్దలి (రైతులుపయోగించే ఒకరకం పనిముట్టు, చూ. మాం.వృ.కోశం; వ్యవసాయ

పదాలు, పు. 91) పట్టుకోడానికి తొటిగేవెదురుకర్ర; గట్టిగా బోలు లేకుండా ఉంటుంది. (తె. 5).

గుద్దసిబ్బి: ఉ. —శిబ్బి; పర్యా. సెంగేరీబుట్ట. అడుగున మట్టు(గద్దె) ఉండే ఒకరకంబుట్ట; పళ్ళెంమాదిరిగా గుండ్రంగానూ ఎత్తుతక్కువగానూ ఉంటుంది. చూ. చిత్రం 67. (రా. 11).

గుద్దు: (క్రి.) పర్యా. చూ. తట్టు(1). కొట్టడం; వెదురుగడ పగలగొట్టడానికి కత్తిమీద మొద్దుతో కొడతారు. (తె. 24).

గుద్దుమూరెడు: మూరెడుమీద పిడికెడు కొలత. (తె. 7).

గుద్దులుగుద్దులుగా: (క్రి. విణ.) పర్యా. జల్లిగా. సందులు సందులుగా; చిల్లులు చిల్లులుగా; జల్లెడ, చేట మొ॥ అల్లేటప్పుడు అల్లకం వదులు వదులుగా ఉన్నప్పుడు పేళ్ళమధ్య సందులు వస్తాయి. (తె. 4).

గునపంఒలుపు: ఉ. గులపం ఒలుపు; గునపం (గడ్డపార)తో ఒలవడం; మొనపైకి ఉండేటట్లు గునపం నేలలోకి దిగవేసి మొనమీద కొబ్బరికాయ ఒత్తి డొక్కపెకలిస్తారు; కాయచుట్టూ ఇలా డొక్కలు తీసేస్తారు. (కో. 25).

గుంత: 1. పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండుపాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగా ఉండే భాగం (తె. 1); 2. తక్కెడ సిబ్బిలో పల్లపు భాగం. (కో. 3).

గుందబ్బ: చూ. గుండుదబ్బ(3). (తె. 7, 13, 14).

గుంపు: 1. పర్యా. చూ. గంటిగనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (కో. 20); 2. పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉండేహద్దు; గడచుట్టూ ఉబ్బెత్తుగా ఉంటుంది; అంతమేరకు లోపలిభాగాని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మవేస్తుంది. చూ. చిత్రం 4. 3. (కో. 19, 20, 24-30) 3. పర్యా. చూ. బొడ్డె(1). వెదురుబద్దకు పల్లపు భాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు. (కో. 21, 31). 4. పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (=వెదురు గడకు పెరిగిన కొమ్మనరికేస్తే మిగిలేకొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవి ప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 20-24).

గుంపుబద్ద: ఉ. గ్రెంప ; పర్యా.చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (=వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురు బద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 21, 24, 27, 28; తె. 15).

గుమ్మటం: ఉ. గమ్మటం; పర్యా. సవార్లగుమ్మటం. సవారులోపల కడియం (రింగు)లా వంచికట్టిన వెదురుబద్ద; ఇలాటివి ఏడుఉంటాయి; కింద వెడల్పు బద్దపెట్టి రానురాను సన్నటివి పెడతారు. చూ. చిత్రం 95. (తె. 10).

గుమ్మడిదబ్బలచాప: ఉ. —సాప; గుమ్మడికాయ బద్దల డిజైన్‌వచ్చేటట్లు నేసిన తుంగచాప. (కో. 3).

గుమ్మంతడక: ఉ.—తడిక; 1. పర్యా. చూ. వాకిలి తడక (1). గుమ్మానికి అడ్డంగా తలుపుమాదిరిగా పెట్టే వెదురుతడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (కో. 10, 12; తె. 29). 2. పర్యా. చూ. దర్వాజా తడక. తడకలతో కట్టిన ఇంటి ముందుభాగానికి తలుపుతోసహా అమర్చిన పెద్ద తడక. చూ. చిత్రం 38 క. (కో. 16).

గుమ్మం: తెరుచుకోడానికి గుమ్మంతడక (చూ.)కు పెట్టిన తలుపు. (కో. 16).

గుమ్మి: 1. పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురుగడలు పెరిగిన పొద; ఒక చదరపుగజంనుంచి మూడు నాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్ని చోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురు విత్తనం భూమిలోపడ్డ తరవాతగాని పొదలో ఒక వెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాతగాని పొదకావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపు కాస్తుంది. చూ. చిత్రం 1. (కో. 9; తె. 6, 31; రా. 2, 4). 2. పర్యా. గాదె (1), గాదెబుట్ట, ధాన్యంబుట్ట, బొట్ట (1), వడ్లగాదె. ఒకచోట స్థిరంగాఉంచి పెద్ద మొత్తంలో వడ్లు మొ॥వి పోసిపెట్టుకోడానికి వెదురు పేళ్ళతో అల్లినది; సుమారు గజంఎత్తూ ముప్పావు గజంనుంచి గజంన్నరవరకు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగుమూలలుగానూ పైన

గుండ్రంగానూ, కొన్నిచోట్ల కిందినుంచి మీదికి గుండ్రంగానూ, కొన్నిచోట్ల కింద వెడల్పుగా గుండ్రంగానూ మధ్య కొంచెం వెడల్పుగాఉండి పోనుపోను మూసుకొచ్చేవిధంగానూ, కొన్నిచోట్ల కింద గుండ్రంగానూ పోనుపోను పైన సన్నగానూ ఉంటుంది; కొన్నిచోట్ల దీనికి శిఖరంలాంటి కప్పు ఉంటుంది; రెండు బస్తాలనుంచి 12 బస్తాలవరకు ధాన్యంబట్టే పరిమాణంలో ఉంటాయి. చూ. చిత్రం 74 క-ట. (తె. 1, 3, 5, 6, 10, 19, 21, 22, 25, 26, 28-31); **3.** పర్యా. గాదె (4), పొనక (2), బొట్ట (2). వడ్లు మొ॥ ధాన్యం నిలవచేసుకోడానికి ఈతచువ్వతో అల్లినది; గజంనుంచి రెండు గజాలవరకు చుట్టుకొలత ఐదడుగులవరకు ఎత్తు ఉంటుంది ; రెండుబస్తాలనుంచి ఇరవై బస్తాలవరకు ధాన్యంపడతాయి. (తె. 7, 9, 11, 14, 16).

గుమ్మ: (క్రి.) గూడతో నీళ్ళు పైకితోడడం. (తె.31).

గురికిపీచు: ఉ. గురిగిపీసు; రూ. గురిపీచు. చేట పేడుకు మెరుగుదిద్దేటప్పుడు వచ్చేపీచు. (కో. 14-16).

గురిగి: చిన్నమట్టిపిడత. (తె. 15).

గురిపీచు: ఉ. గురిపీసు, చూ. గురికిపీచు. (కో. 17).

గురుగువీసు: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండినగడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహ రోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలుక పగిలినప్పుడు తెల్ల తిరుమనిగౌర, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలుకగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (తె. 21).

గుర్జమలుపు: (క్రి.) ఉ. -మల్పు; చేట, జల్లెడ మొ॥వాటి అల్లికంలో అంచుకట్టేటప్పుడు కట్టుముంగుతో ముడివేస్తూ కట్టుముంగును ఒకపద్ధతిలో వడిదిప్పడం. (తె. 24).

గుర్జముడి: ఉ. గురిజెముడి; పర్యా. గుల్లముడి. చేట, జల్లెడ మొ॥వాటి అల్లికంలో అంచుకట్టేటప్పుడు కట్టుముంగు చుడుతూ వేసే ఒకరకం ముడి; చూ. గుర్జమలుపు. (తె. 19, 21, 22, 25).

గుర్రం: **1.** పర్యా. చూ. వంకె. వెదురుపేడు గీకడానికి వాడే ఒక పనిముట్టు; 'X' ఆకారం బద్దల/కర్రలమీద ఒక పొడుగాటి కర్రగాని బద్దగాని అమరుస్తారు; దానిమీద పేడు ఆనించి కత్తిని వెనక్కూ ముందుకూ లాగుతూ పేడు గీకుతారు. చూ. చిత్రం 14 చ. (కో. 24); **2.** మంచానికి నులక అల్లేటప్పుడు అల్లినపోగులు ఒకచోటికి రాకుండా అడ్డుకోడానికి ముడిఉన్న తాడు. (తె. 9).

గుర్రంకర్ర: పర్యా. చూ. వంకె. వెదురుపేడు గీకడానికి వాడే ఒక పనిముట్టు; 'X' ఆకారం బద్దల/కర్రలమీద ఒకపొడుగాటి కర్రగాని బద్దగాని అమరుస్తారు; దానిమీద పేడుఆనించి కత్తిని వెనక్కూముందుకూ లాగుతూ పేడుగీకుతారు. చూ. చిత్రం 14 చ. (కో. 28).

గుర్రబ్బండిచాప: ఉ. -సాప. పర్యా. టాపుతడక. గుర్రబ్బండిమీద నీడకోసం గూడు మాదిరిగా కప్పిన (వెదురు) చాప; దీన్ని ఎప్పటికీ ఊడకుండా బద్దలు వేసి బిగిస్తారు. (కో. 14; రా. 8).

గుర్రంబుట్ట: ఉ. -బుట్టి; గుర్రానికి దాణాపెట్టేబుట్ట; మూరెడెత్తు ఉంటుంది; నడుస్తూ తినడానికి దీన్ని మెడకుకూడా తగిలించవచ్చు; నిలువులూ అడ్డం పేడూ లేకుండా చేట అల్లేవిధంగా కింద నాలుగు మూలలూ పైన గుండ్రంగానూ వచ్చేటట్లు అల్లుతారు. (కో. 28, 30).

గుర్రాలతుంగ: ఉ. గుర్రాల్తుంగ; ఒకరకం తుంగ; చాపలనేతకు పనికివస్తుంది. (రా. 2).

గుల్ల: **1.** పర్యా. చూ. బోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపునుంచి మరొక కణుపువరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1; (కో. 12, 13, 15-18, 23-31); **2.** ధాన్యం మొ॥వి మోసుకు వెళ్ళడానికి వెదురుపేళ్ళతో అల్లిన ఒకరకం గంప; అడుగున వెడల్పు తక్కువగానూ మూతి విశాలంగానూ చుట్టూ గుండ్రంగానూ ఉంటుంది; ఉరువులోనూ ఆకారంలోనూ తేడాలుంటాయి. (తె. 10, 13, 14, 19-26); **3.** రొట్టెలు ఉంచుకోడానికి కొద్దిపాటి జొన్నలుపోసి పెట్టుకోడానికీ శుభకార్యాల్లో అన్నం వడ్డించడానికీ వాడే ఒకరకం వెదురుబుట్ట; పళ్ళెంమాదిరిగా మూతి విశాలంగానూ ఎత్తు తక్కువగానూ ఉంటుంది; సుమారు మూరెడు

వెడల్పు రెండుబెత్తల ఎత్తూ ఉంటుంది. (తె. 15, 16); 4. పర్యా. పుటికె (1). ధాన్యం పోసుకోడానికీ మోసుకువెళ్ళడానికీ వెదురుతో అల్లిన ఒక రకం చిన్నగంప; మామూలు గంపకన్న చిన్నది; కొన్ని కిందినుంచి మీదికి ఒకే తీరుగానూ, కొన్ని గుండ్రంగానూ మూతి విశాలంగానూ ఉంటాయి. (తె. 9, 11, 20); 5. అన్నంకుండమీద ఉంచే బుట్ట. (తె. 9).

గుల్లకఱ్ఱ: పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకణుపుకు మధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరి పనికి ఉపయోగపడుతుంది. (కో. 12, 17-21, 23, 25, 28-30).

గుల్లపుటికె: ధాన్యం మోసుకువెళ్ళడానికి అల్లిన ఒక రకం వెదురుగంప; మామూలు గంపకన్న చిన్నగానూ గుండ్రంగానూ ఉంటుంది. (రా. 2).

గుల్లబుట్ట: ఉ. – బుట్ట; పర్యా. చిన్నబుట్ట(2). చిన్న వెదురుబుట్ట. (రా. 3).

గుల్లబొంగు: పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకు మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరి పనికి ఉపయోగపడుతుంది. (కో. 13).

గుల్లముడి: పర్యా. గుర్జముడి. చేట, జల్లెడ మొ॥వాటి అల్లకంలో అంచుకట్టేటప్పుడు కట్టుముంగు చుడుతూవేసే ఒకరకం ముడి; చూ. గుర్జమలుపు. (తె. 17).

గుల్లవెదురు: ఉ. గుల్లెదురు; పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 22, 31).

గువ్వదాడుచువ్వ: చూ. గూబదాడుచువ్వ. (తె. 9).

గువ్వం: 1. ? వెదురుమొక్క లోపలికండ; తియ్యగా ఉంటుంది; మొక్కలేతగా ఉన్నప్పుడు గబ్బి పురుగులు రంధ్రాలు చేసుకొని లోపలికిదూరి దీన్ని తినేస్తాయి. (తె. 22); 2. పర్యా. చూ. కండదబ్బ(4). ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్య భాగంనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్టడానికీ ఎత్తు భాగంలో సగందాకా చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 11. 3. (తె. 9).

గువ్వంపొట్టు: తాటిమట్టకండ (గువ్వం) నుంచి చీరిన పేడు; చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (తె. 27).

గూగు: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందటారు; పండినగడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలుక పగిలినప్పుడు తెల్లతిరుమని గౌర, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలుకగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (రా. 2).

గూజుబొంగు: పర్యా. చూ. గట్టిబొంగు(1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టి వెదురుకఱ్ఱ, సుమారు మూడునాలు గంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్లు, గుతపకఱ్ఱ, గైకట్టె, మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (తె. 18).

గూటం: 1. పర్యా. మేకు(2). గాదె, బండిజల్ల మొ॥ వాటి అల్లకంలో అడుగు అల్లకం పూర్తయిన తరవాత నిలువులను పైకి నిలబెట్టేటప్పుడు అడుగు భాగం కదలకుండా నిలువులువంగి ఉండేటందుకు నేలకుపాతిన వెదురుకఱ్ఱ లేదా ఇనపమేకు. (కో. 1; తె. 30, రా. 9); 2. వారపాక కట్టుబడిలో నిలువుగా నేలలోకి పాతిన వెదురుగడ. (తె. 1); 3. పర్యా. గొట్టి, బిర్రుగుంజ. చాపనేతమగ్గాన్ని బిగబట్టడానికి మూలగా పాతినగుంజ; ఇలాటివి మగ్గం నాలుగు మూలలా ఉంటాయి. (కో. 3, 8); 4. పర్యా. చూ. మత్తిలి. పచ్చికొబ్బరి డొక్కల నలగ్గొట్టే కొయ్య సుత్తి. (కో. 5); 5. పర్యా. తక్క. నీళ్ళలో ఊరిన కొబ్బరిడొక్కలను నలగ్గొట్టే కఱ్ఱ; లావుపాటి కడ్డీలా ఉంటుంది; సుమారు మూరెడుపొడుగు చెయ్యంత లావు ఉంటుంది; కొన్నిచోట్ల పట్టుకోడానికి ఒకవైపు కాడ రెండోవైపు దీర్ఘచతురస్రం గాను ఉంటుంది; చూ. చిత్రం 127. (కో. 21, 25); 6. కలబందమట్టను నారలియ్యడానికి మెత్తబడేటట్లు చితగ్గొట్టేందుకు వాడే కొయ్య. (రా. 5).

గూటంపెట్టె: పర్యా. చూ. కత్తులపెట్టె. పేముకఱ్ఱ తీగగా చీరే పనిముట్టు; ఒక కొయ్యదిమ్మకు మూడు జతల కత్తులు మూడు రకాలుగా అమర్చి ఉంటారు; ఆ జతల్లోంచి పేముబెత్తం నుంచి చీల్చితీసిన

బద్దను లాగుతారు; మొదటి జతలోంచి లాగితే పేముబద్దకుండే బెండువంటి పదార్థం రాలిపోతుంది; రెండో జతలోంచి లాగితే పూర్తిగా బెండురాలి పోయి బద్ద సన్నబడుతుంది; మూడో జతలోంచి లాగితే సన్నగా నున్నగాఉండే తీగవస్తుంది. చూ. చిత్రం 137. (కో. 12).

గూటేరు: పర్యా. చూ. తల్లివేరు. వెదురుముక్క దుంపనుంచి పారిన పెద్దవేరు; లావుగా పొడుగ్గా ఉంటుంది, నేల లోపలికి చాలాదూరం పాకుతుంది; దీన్నుంచి సన్నటి దారాల్లా పిల్లవేళ్ళు పుట్టు కొస్తాయి. (తె. 23).

గూడ: ఉ. గోడ; 1. పర్యా. గూడచేట, గూడపొనక, గూడబుట్ట, గూడబొక్కెన, నీళ్ళగూడ. కాలవ లోంచిగాని వాగులోంచిగాని గుంటలోంచిగాని చేతి కందేటంత లోతునుంచి పొలంలోకి నీళ్ళ ఎత్తి పోసేబుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడూ పెట్ట కుండా మొత్తం పేడుతోనే చేటలా అల్లుతారు; కొన్నిటికి చేట అంచు మాదిరిగా బద్దలువేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టిన తాళ్ళను ఇద్దరు మనుషులు చెరోవైపూ నిలబడి పట్టుకొని దీంతో నీళ్ళతోడి గట్టు కవతల ఉండే పొలంలోకి పోస్తారు. చూ. చిత్రం 35 క, చ. (కో. 2, 3, 6-20, 24, 26, 29; తె. 14, 8-10, 14, 26, 28, 30, 31; రా. 3, 4, 8); 2. పర్యా. చూ. కైంచి (1). వెదురుగడలు నిలబెట్టడానికి రెండు పొడుగాటి కర్రలకు దండెంకట్టి చేసిన ఏర్పాటు; రెండుగజాల ఎడంలో రెండు వెదురుగడలుగాని సరుగుడు కట్టెలుగాని పాతి ఆరెంటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మరొక కర్రను కడతారు; అడ్డంగా కట్టిన కర్రకు వెదురుగడల ఆనించి నిలబెడతారు. చూ. చిత్రం 8 ట. (కో. 17); 3. పర్యా. ఏను(3), గోడ(3). వెదురుబద్దలతో అల్లిన నీళ్ళగూడకు అడుగునుంచి అంచుదాకా ఎత్తుగా ఉండేభాగం. (కో. 2); 4. పర్యా. మూత(3), మూల(3). వెదురుపేళ్ళతో అల్లిన బండిజల్లకు ముందువైపు మూసిఉన్న భాగం. చూ. చిత్రం 32. 3. (కో. 3, 7, 8, 10; రా.8); 5. పర్యా. చూ. గోడ(5). జల్లెడచుట్టూ ఎత్తుగా ఉన్నభాగం చూ. చిత్రం 30 చ. 1. (తె. 25); 6. పర్యా. ఓడ(3), గోడ(4), పెనక(2). చేటకు రెండు మూలలమధ్య ఎత్తుగా ఉండేభాగం (తె. 26); 7. ? గూడ (చూ.) అడుగుభాగం. (తె. 31).

గూడచేట: ఉ. —శాట; పర్యా. చూ. గూడ(1). కాలవలోంచిగాని వాగులోంచిగాని గుంటలోంచిగాని చేతికందేటంత లోతునుంచి పొలంలోకి నీళ్ళుఎత్తి పోసేబుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడూ పెట్టకుండా మొత్తంపేడుతోనే చేటలా అల్లుతారు. కొన్నిటికి చేటఅంచు మాదిరిగా బద్దలువేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టినతాళ్ళను ఇద్దరుమనుషులు చెరోవైపూ నిలబడి పట్టుకొని దీంతో నీళ్ళతోడి గట్టుకవతల ఉండే పొలంలోకి పోస్తారు. చూ. చిత్రాలు 35 క, చ. (కో. 15; 4).

గూడపేడు: నీళ్ళగూడ అల్లడానికి ఉపయోగించే గజం పొడుగు వెదురుపేడు. (కో. 13).

గూడపొనక: పర్యా. చూ. గూడ(1). కాలవలోంచి గాని వాగులోంచిగాని గుంటలోంచిగాని చేతికందే టంత లోతునుంచి పొలంలోకి నీళ్ళు ఎత్తిపోసే బుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడూ పెట్టకుండా మొత్తం పేడుతోనే చేటలా అల్లుతారు; కొన్నిటికి చేటఅంచు మాదిరిగా బద్దలువేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టినతాళ్ళను ఇద్దరు మనుషులు చెరోవైపూ నిలబడి పట్టుకొని దీంతో నీళ్ళతోడి గట్టుకవతల ఉండే పొలంలోకి పోస్తారు. చూ. చిత్రాలు 35 క, చ. (తె. 1).

గూడబట్టు: (క్రి.) పర్యా. గూడమలుపు. బండిజల్ల అల్లికంలో అడుగు పూర్తయిన తరవాత అడ్డంలో ఒకభాగంవైపు మూసివేస్తూ అల్లే విధానం. (కో. 3, 7, 8).

గూడబుట్ట: పర్యా. చూ. గూడ(1). కాలవలోంచిగాని గుంటలోంచిగాని చేతికందేటంత లోతునుంచి పొలంలోకి నీళ్ళు ఎత్తిపోసేబుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడు పెట్టకుండా మొత్తంపేడుతోనే చేటలా అల్లుతారు; కొన్నిటికి చేటఅంచు మాదిరిగా బద్దలు వేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టిన తాళ్ళను ఇద్దరుమనుషులు చెరోవైపు నిలబడి పట్టుకొని దీంతో నీళ్ళతోడి గట్టు కవతల ఉండే పొలంలోకి పోస్తారు. చూ. చిత్రాలు 35 క,చ. (కో. 15, 26).

గూడబొక్కెన: పర్యా. చూ. గూడ(1). కాలవలోంచి గాని వాగులోంచిగాని గుంటలోంచిగాని చేతికందే టంత లోతునుంచి పొలంలోకి నీళ్ళు ఎత్తిపోసే బుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడూ పెట్టకుండా మొత్తంపేడుతోనే చేటలా అల్లుతారు; కొన్నిటికి చేటఅంచు మాదిరిగా బద్దలువేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టిన తాళ్ళను ఇద్దరుమనుషులు

చెరోవైపూ నిలబడి పట్టుకొని దీంతో నీళ్ళతోడి గట్టుకవతల ఉండే పొలంలోకి పోస్తారు. చూ. చిత్రాలు 35 క,చ. (తె. 9, 10, 14).

గూడమలుపు: (క్రి.) ఉ. —మల్పు; పర్యా. గూడబట్టు బండిజల్ల అల్లికంలో అడుగు పూర్తయిన తరవాత అడ్డంలో ఒకభాగంవైపు మూసివేస్తూ అల్లే విధానం. (తె. 28).

గూడమూల: పర్యా. చూ. మూల(6). నీళ్ళ గూడకు అడుగున ఏర్పడ్డ కోసు (దొప్పలాంటిది) చూ. చిత్రం 35 క. 1. (కో. 20).

గూడు: కొడమ (చూ.) మూతిభాగంలో చేపలు దూర డానికి ఏర్పాటు చేసినద్వారం. చూ. చిత్రం 73 క. 10. (కో. 2).

గూడుపొనక: పర్యా. చూ. కొమ్ములగూడ. కాలవ కడ్డంగా పెట్టి చేపలుపట్టే సాధనం; నీళ్ళగూడ ఆకారంలో ఉంటుంది; అంచుకువేసిన బద్దలు కొమ్ముల్లాగా బయటికి తేలి ఉండడంవల్ల ఈ పేరు వచ్చింది; కాలవకడ్డంగా మధ్యలో గూడనిలిపి నీళ్ళు గూడలోంచి పోయేటట్లు చేస్తారు; నీళ్ళలోని చేపలు దీంట్లో చిక్కుబడిపోతాయి. చూ. చిత్రం 73 ట. (రా. 9).

గూన: 1. కొబ్బరిదొక్కలు ఊరేసే మట్టికుండ; మామూలు కుండకన్న పెద్దగా దళసరిగా ఉంటుంది; మూతి బాగా వెడల్పు. (కో. 29); 2. పెంకు; మట్టితోచేసి కాల్చినది; మామూలుగా ఇళ్ళకప్పు డానికి వాడతారు. (తె. 26).

గూబదాడుచువ్వ: రూ. గువ్వదాడుచువ్వ; అడవిలో పెరిగే ఒకరకం చెట్టుచువ్వ (బరిగె); నాలుగు మూరలపొడుగున గుండ్రంగా గచ్చకాయరంగులో ఉంటుంది. (తె. 7).

గూబం: పర్యా. చూ. కండ(1). వెదురుగడకు పైన పచ్చగా ఉండే భాగానికీ బోలుగా ఉండే లోపలి భాగానికీ మధ్య ఏర్పడిన గట్టిపదార్థం; బద్దమందాన్ని బట్టి గడ ఎంతకండ బట్టినదీ తెలుస్తుంది. (తె. 26)

గూబంపేడు: పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండు పేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 31).

గెండుతునిగ: పర్యా.చూ. గంటిబద్ద(1). గంటిగనుపు గుర్తు (=వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేస్తే మిగిలేకొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాంటివి గడకు రెండువస్తాయి; ఇదికర్రకూ నిచ్చెనలకూ పనికొస్తుంది; అడవిప్రాంత వాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (రా. 3).

గెనికె: పర్యా. చూ. సిర్సముక్క. సుమారు మూరెడు పొడుగు వెదురుగడ ముక్క, వెదురుమంచం తయారీలో కాలుగాగాని నిచ్చెన కట్టుబడిలో మెట్టుగా గాని వాడతారు. (రా. 19).

గెల: రూ. గొల(1); వెదురుధాన్యం గింజలగుత్తి; కంకి మాదిరిది. (కో. 19, 23).

గేడి: 1. రూ. గోడి(2); పర్యా. చూ. అంచు(1). వెదురుబద్ద చీలినభాగం; ఇటువంటివి బద్దపొడుగునా పల్లపుభాగానికి ఇటూ అటూ ఉంటాయి. (కో. 5); 2. పర్యా. చూ. అంచు(7). ఆకులా ఉండే అంచు (చూ.)కు పదునున్న భాగం; ఇలాటివి రెండుం టాయి; కొన్నిటికి పదునుండదు. (కో. 8; రా. 5); 3. పర్యా. పెడక. కట్టు(బద్ద), కర్ర (=కడ్డీ లాంటిది) పెట్టకుండానూ, కట్టు (=చుట్టినది) కట్టకుండానూ ఉన్న చేటఅంచు; తరవాత అంచు కట్టేటప్పుడు ఇది కట్ల (లోపలిబద్ద, బయటిబద్ద) మధ్యకు పోతుంది. (రా. 3).

గేడికిదిప్పు: (క్రి.) పర్యా. చూ. మెండించు. వెదురు గడ చీల్చేటప్పుడు కణుపు సులువుగా తెగడానికి కత్తిని అడ్డంగా మెలిదిప్పడం. (కో. 3).

గేడిగా: (క్రి. విశ.) పర్యా. వారగా, ఏటవాలుగా; పుల్లలతడక (చూ. చిల్కాను) కట్టడానికి పుల్లలను ఇలాచెక్కుతారు. (కో. 3).

గేడె: పర్యా. చూ. బెండు(1). వెదురుగడలోపల గుల్లగా ఉన్నభాగం; గోడ; పొడుగ్గా పల్లంగా ఉంటుంది. (రా. 8).

గేబుల్‌తడక: (< ఇం. Gable) ఉ. —తడ్క; ఇంటిచుట్టూ బండలుపాతి వాటిపైనుంచి కట్టేతడక; చూ. క్రాస్‌తడక. (రా. 8).

గైకట్టె: 1. పర్యా. బరిగె(2). కొవడలికట్టే పొడుగాటి వెదురుకర్ర; చూ. గైకొడవలి చూ. చిత్రం 116. 1. (తె. 26); 2. పర్యా. గైబొంగు, చింతకాయ బొంగు. చింత మొ॥ చెట్లనుంచి కాయలు రాలగొట్ట డానికి ఉపయోగించే వెదురుకర్ర; పొడుగ్గా గట్టిగా ఉంటుంది. (తె. 14, 19).

గైకొడవలి: పర్యా. కమ్మకొడవలి. వేటకొడవలి. భూమ్మీద నిలబడి ఈతచెట్టు మీంచి మట్టలు కొయ్య డానికి పొడుగాటి కట్టెకు అమర్చిన కొడవలి; కొన్నిచోట్ల ఈ కొడవలికాడ చివరిభాగం ఉంగరంతో

వంపుదిరిగి ఉంటుంది; మరికొన్నిచోట్ల గొట్టంలా ఉంటుంది. చూ. చిత్రాలు 116, 117. (తె. 26).

గైబొంగు: పర్యా. చూ. గైకట్టె(2). చింత మొ॥ చెట్లనుంచి కాయలు రాలగొట్టడానికి ఉపయోగించే వెదురుకర్ర; పొడుగ్గా గట్టిగా ఉంటుంది. (తె. 18).

గైరుకర్ర: లావుగా పొడుగ్గా ఉండే నాణ్యమైన వెదురు గడ. (కో. 13, 14).

గొగ్గితొర్రలబొంగు: పర్యా. గబ్బితొర్రల బొంగు. తియ్యని గువ్వంకోసం గబ్బిపురుగులు రంధ్రాలు చేసిన వెదురుగడ; గడ పెరిగినకొద్దీ రంధ్రాలు వెడల్పవుతాయి; చీరేటప్పుడు ఈ రంధ్రాలదగ్గర పేడు విరిగిపోతుంది. (తె. 23).

గొచ్చు: పర్యా. తాడొంజు. సుమారు రెండుజేనల పొడుగున గుండ్రంగా చుట్టిన వందవరసల కొబ్బరి నులక తాడుచుట్ట. (కో. 29).

గొట్టంకర్ర: పర్యా. చూ. బద్ద(4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబటి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టం తొడిగే బద్దకుచివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 31).

గొట్టం: 1. రూ. గొంటాం; పర్యా. కొడ్వె, గిలక(.), పిరికి, బుర్ర(3), మాష్టి. విసనగర్రకాడకు తొడిగిన వెదురుగడముక్క; లోపలగుల్లగా ఉన్నది; విసురుకొనేటప్పుడు సులువుగా ఉండడానికి ఇది తొడుగుతారు. చూ. చిత్రం 31 ట. 1. (కో. 25; తె. 5. 9, 10, 14 17-28; తె. 30, 31; రా. 5, 10); 2. పర్యా. చూ. ఊదుడుగొట్టం. పొయ్యి ఊదుకోడానికి లోపల బోలుగా ఉన్న వెదురుగొట్టం. (తె. 10. 16); 3. పర్యా. చూ. మందుగొట్టం పశువులకు మందుపోసే వెదురుగొట్టం; మొత్తం బోలుగా ఉండి ఒకచివర మూసి ఉంటుంది; రెండో చివర పశువునోట్లో దూర్చడానికి వీలుగా ఏటవాలుగా చెక్కి ఉంటుంది. చూ. చిత్రం 113. (తె. 15); 4. గుంజుడుతడక పక్కకు జరగడానికి తడకకు అమర్చిన వెదురుకర్రముక్క; గుల్లగా ఉంటుంది. చూ. చిత్రం 99. 1. (తె. 23).

గొట్టంవిసనగర్ర: ఉ. గొట్టమిసనగర్ర,గొట్టపిస్నగర్ర, గోంటాం ఇసిన్‌గర్ర; పర్యా. గిరకపంకా, గిలక విసనగర్ర, పిరికివిసనగర్ర, బురకవిసనగర్ర. సులువుగా తిప్పుకోడానికి వీలుగా వెదురుగొట్టం తొడిగిన విసనగర్ర. చూ. చిత్రం 31 ట. (కో. 25; తె. 10; 28, 29, 31; రా. 5, 10).

గొట్టిమేదరి: మేదరిపనిజేసే గోండ్లు. (తె. 29).

గొట్టైకొమ్మసగరు: గొట్టైకమ్మసగరు అనే ప్రాంతంలో పుట్టిన బొంగు; "బర్సుగా" ఉంటుంది. (తె. 23).

గొడగలచేట: ఉ. గొడగల్చాట; గొడగల (ఒకకులం) వాళ్ళు అల్లినచేట; (అంచుకుతీగచుట్టి) పొడుగ్గా కట్లుకట్టిన చేట. (కో. 23).

గొడుగుకట్టె: గొడుగుకామగా వాడే పేముకట్టె. (తె. 22).

గొడ్డలికామ: గొడ్డలికి తొడిగిన వెదురుకర్ర ముక్క. (తె. 10, 26).

గొడ్డుగుంపు: పర్యా. చూ. బొడ్డుగనుపు(1). వెదురు గడ. కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు లోతుగాపడే బొడ్డులాంటి గుర్తు. చూ. చిత్రం 9. 1. (కో. 28).

గొత్తి: పర్యా. చూ. గూటం(3). చాపనేతమగ్గాన్ని బిగబట్టడానికి మూలగా పాతిన గుంజ; ఇలాటివి మగ్గం నాలుగు మూలలా ఉంటాయి. (రా. 2).

గొంటాం: చూ. గొట్టం(1). (తె. 29).

గొన్నపొట్ట: పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండుపాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగా ఉండే భాగం. (తె. 6).

గొప్పు: పర్యా. గడ్డ(1). ఎత్తుమీద ఉన్న భూమి (కో. 22).

గొబ్బాం: పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గడెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టినబద్ద; చేత్తోపట్టుకోడానికి మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ చిత్రం 60 క. 4. (కో. 23).

గొరసకత్తి: ఉ. గొర్స -. పేముకర్ర కోసే ఒకరకం కత్తి; వంపుదిరిగి ఉంటుంది; పొడుగాటి కర్రపిడి ఉంటుంది. చూ. చిత్రం 135. (కో. 3).

గొర్రెపిల్లలగూడు: పర్యా. చూ. పిల్లలగూడు తల్లి వెంట మేతకుపోలేని చిన్నచిన్న గొర్రెపిల్లలనూ మేకపిల్లలనూ కమ్మడానికి మందపాటి వెదురుబద్దతో అల్లింది; బోర్లించిన గంటఆకారంలో ఉంటుంది; పిల్లల్ని వేయడానికి ద్వారం ఏర్పాటుచేస్తారు; పిల్లలు ఇందులో నిలబడి మంద అందిస్తే తింటాయి. చూ. చిత్రం 77. (తె. 1; రా. 9).

గొర్రెపిల్లలజల్ల: పర్యా. చూ. పిల్లలగూడు. తల్లిత

వెంట మేతకుపోలేని చిన్నచిన్న గొర్రెపిల్లలనూ, మేకపిల్లలనూ కమ్మడానికి మందపాటి వెదురు బద్దలతో అల్లినది; బోర్లించిన గంటఆకారంలో ఉంటుంది; పిల్లల్ని వేయడానికి ద్వారం ఏర్పాటు చేస్తారు; పిల్లలు ఇందులో నిలబడి మంద అందిస్తే తింటాయి. చూ. చిత్రం 77. (తె. 2).

గొర్రెలతడక: ఉ. గొర్లతడిగ; గొర్రెతడ్క; పర్యా. గొల్లతడక, జువ్వాలతడక. గొర్రెలను తోలే దొడ్డి ఏర్పాటుకు అమర్చే వెదురుబద్దల తడక; గొల్లలు అమర్చుకొంటారు. చూ. చిత్రం 40 చ. (కో. 9; తె. 28).

గొల: 1. చూ. గెల (తె. 21), 2. ? తాటిచెట్టు మీద మట్టల మొదటిభాగం దగ్గరఉండే ముల్లక్కొంచు ల్లాంటిగుత్తి; గెల. (తె. 9).

గొలుసుకట్టు: ఉ. గొల్సు—; కోళ్ళగూడులో రెండు పెండెవారలు మెలికతిప్పుతూ గొలుసులాగా అల్లే పద్ధతి. (కో. 22).

గొలుసుపెట్టె: పర్యా. బురికెపెట్టె. పసుపు పోయ డానికి వాడే చిన్న వెదురుపేళ్ళ పెట్టె; బొట్టుపెట్టె కన్న చిన్నగా ఉంటుంది; దీనికప్పు అంచుకు గొలుసుకట్టు ( = గొలుసు మాదిరిగా వంకువంకగ వేసేకట్టు) వేస్తారు. (కో. 29).

గొల్లగూడు: పర్యా. చూ. పిల్లలగూడు. తల్లులతో మేతకు పోలేని చిన్నచిన్న గొర్రెపిల్లలనూ, మేక పిల్లలనూ కమ్మడానికి మందపాటి వెదురుబద్దలతో అల్లినది; బోర్లించిన గంట ఆకారంలో ఉంటుంది; పిల్లల్ని వేయడానికి ద్వారం ఏర్పాటుచేస్తారు; పిల్లలు ఇందులో నిలబడి మంద అందిస్తే తింటాయి. చూ. చిత్రం 77. (తె. 23, 24).

గొల్లతడక: ఉ. —తడ్క; పర్యా. చూ. గొర్రెల తడక. గొర్రెలను తోలే దొడ్డి ఏర్పాటుకు అమర్చే వెదురుబద్దల తడక, గొల్లలు అమర్చుకొంటారు. చూ. చిత్రం 40 చ. (తె. 26).

గోకవరం వెదురు: ఉ. గోకారమెదురు; రాజమండ్రి దగ్గర గోకవరం ప్రాంతంలో పెరిగిన వెదురు కర్ర. (కో. 18).

గోగ: చూ. గోవ (1). (తె. 18)

గోగుకట్టె: ఉ. గోక్కట్టె; ఎండిన గోగుమొక్కకాడ; దీన్ని నానబెట్టి నార తీస్తారు. (రా. 4).

గోగునార: గోగుమొక్కలను నానబెట్టితీసిన పైపొరను జాడిస్తేవచ్చే సన్నటిపోగులు; దీంతో తాళ్ళు పేనవచ్చు. (రా. 4).

గోచిమేదరి: ఉ. గోసి -; ఆడవాళ్ళు గోచిపోసి చీరకట్టే అలవాటున్న మేదర్లు, కామారెడ్డి ప్రాంతంలో కనిపిస్తారు. (తె. 5).

గోచీలెరకలివాళ్ళు: ఉ. గోశిలెర్కలోల్లు; ఎరకలి వాళ్ళలో ఒకతెగ; గోచీలు పెట్టుకొంటారు; పందు లను కాస్తారు. (తె. 20).

గోటినచేట: ఉ. గోట్నశాట; పర్యా. చూ. మంతు (I). ఒకరకం చేట; కట్టు (బద్ద), కర్ర (కడ్డీ లాంటి సన్నటి వెదురుబద్ద)వేసి కట్లు కట్టనిది; మూలలుపులిపి అంచు కట్టకుండా వదిలేసినదాన్ని ఇలా అంటారు. (కో. 23).

గోటు: (క్రి.) 1. పర్యా. కోయు, మోట్లుగోటు. చేట మొ॥వాటి అల్లికంలో మూలపులిపి అల్లిన తరవాత మిగిలిన పేళ్ళను కత్తితో కోసెయ్యడం లేదా లోపలికి దోపడం. (కో. 13, 18; తె. 4, 6; రా. 8, 10, 11); 2. చేట అల్లికంలో మూల (పులిపి) అల్లడం. (తె. 14); 3. పర్యా. చూ. మూలపట్టు. చేట అల్లికంలో అడుగు అల్లినతరవాత వెనకభాగం రెండుమూలలా దొప్పలాగా వచ్చేటట్లు అల్లేవిధానం. (కో. 22, 23, 25, 28; తె. 19, 21 22, 24, 25); 4. విసనగర్ర అల్లకంలో అడుగు అల్లిన తరవాత పక్కలకు మిగిలిన పేళ్ళను లోపలికి దోపుతూ అల్లే విధానం. (రా. 4); 5. మచ్చిక (చూ.) అల్లకంలో మూల ఏర్పడే భాగం నుంచి పెట్టిన వెదురుఈనె; పైఐదువరసల్లో పెడతారు; ఇవి పెట్టడంవల్ల మూల ఏర్పడుతుంది. (కో. 28); 6. పర్యా. చూ. అంచు (13). కట్టు (బద్ద), కర్ర ( = కడ్డీలాంటిది) పెట్టి చేటచుట్టు కట్లుకట్టిన భాగం. చూ. చిత్రం 29.5. (తె. 1). 7. సిరిచాపకు పొడుగునా ఎర్రపట్టీ మడిచి కుట్టిన భాగం; రెండుపక్కలా కుడతారు. (రా. 2). 8. పర్యా. చూ. అంచుపట్టె (2). ఈత చాపచుట్టూ కొసలను మూసేస్తూ కుట్టడానికి అల్లినపట్టె; చాపలో వరసలుగా వచ్చే పట్టెలకన్న దీనివెడల్పు తక్కువగా ఉంటుంది; చాప అంచులు చిరిగి పోకుండా ఉండటానికి ఈ పట్టెనుకలిపి కుడతారు. చూ. చిత్రం 122.1 (తె. 21).

గోటువేయు: (క్రి.) పర్యా. చూ. అంచుకట్టు (2). తుంగచాప రెండు నిలువుఅంచులనూ మడిచి గుడ్డ వేసి కుట్టడం. (రా. 4).

గోడ: 1. పర్యా. నట్టి. వెదురుపేడుతో అల్లిన కోళ్ళ గూడుకు కొంతమేర ఎత్తుగా చిక్కగా అల్లిన

భాగం. చూ. చిత్రం 65 క. 1. (కో. 14, 22, 23, 26, 31); **2.** పర్యా. ఓడ (6), గోడు (4). గుల్ల, బుట్ట, గంప మొ॥ వాటికి అడుగునుంచి అంచువరకు ఎత్తుగా అల్లినభాగం. (తె. 27, 28); **3.** పర్యా. చూ. గూడ(6). వెదురుబద్దలతో అల్లిన నీళ్ళగూడకు అడుగునుంచి అంచుదాకా ఎత్తుగా ఉండే భాగం. (తె. 31); **4.** పర్యా. చూ. గూడ (6). చేటకు రెండుమూలల మధ్య ఎత్తుగాఉండే భాగం. (తె. 28); **5.** పర్యా అంచు (11), ఏదె (2), ఓడ (5), గూడ (5) జల్లెడచుట్టూ ఎత్తుగాఉన్న భాగం. చూ. చిత్రం 30 చ. 1. (కో. 2, 3, 4, 22, 23; రా. 3); **6.** గడప. (తె. 29)

గోడదబ్బ: పర్యా. చూ కట్టు (6). చేట, విసనగర్ర, పెట్టె, తిరుమాన్‌పెట్టె మొ॥వాటి అల్లికంలో అంచుకు లోపలినుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద, వేలెడుగాని రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది. (తె. 29).

గోడంపెట్టె: పర్యా. చూ. కత్తులపెట్టె. పేముకర్ర తీగగా చీరేపనిముట్టు; ఒక కొయ్యదిమ్మకు మూడు జతల కత్తులు మూడురకాలుగా అమర్చిఉంటాయి; ఆజతల్లోంచి పేము బెత్తంనుంచి చీల్చితీసిన బద్దను లాగుతారు; మొదటి జతలోంచి లాగితే బద్దకుండే బెండువంటి పదార్థం రాలిపోతుంది; రెండోజతలో లాగితే పూర్తిగా బెండు రాలిపోయి బద్ద సన్నబడుతుంది; మూడోజతలో లాగితే సన్నగా నున్నగా ఉండే తీగవస్తుంది. చూ. చిత్రం 137. (కో. 11).

గోడి: **1.** ఒకరకం వెదురుపేము; మామూలు వెదురు పేడుకంటె కాస్త మందంగా ఉంటుంది; అంత మెత్తగా ఉండదు; కోళ్ళగూడు అల్లకానికి ఎత్తు భాగంలో కింద జేనెడు ఎత్తుమీద దీంతో చుడతారు. (కో. 25); **2.** చూ. గేడి (1). (కో. 25).

గోడిదాలెం: వెదురుబద్ద అంచు (చూ.) వెంటతీసిన దాలెం (చూ.); పేడంత వెడల్పు ఉంటుంది. (కో. 25).

గోడిబద్ద: పర్యా. చూ. గోవ(2). నిలువుగా చీరిన గంటిబద్ద (చూ.) మూడునాలుగు భాగాల్లో ఒకటి; గంటిబద్ద వెడల్పులో మూడోవంతుగాని నాలుగోవంతుగాని ఉంటుంది; దీన్నుంచి గంపలు బుట్టలు మొ॥ అల్లడానికి సరిపోయే ఈనె (- తీగలాటి సన్నటిభాగం)లు తీస్తారు. (కో. 25).

గోడివార: చూ. గోడువార (కో. 23).

గోడీ: చూ. గోదు(3). (కో. 23).

గోడు: **1.** పర్యా. చూ. కిర్ర(3). గోవ(నార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (కో. 28); **2.** పర్యా. గంటిపేడు గంటిబద్ద (చూ.) చీల్చితీసిన వెదురుపేడు; గంటిగనుపు (చూ.)ల మధ్యనిరికి తీసినది కావడంవల్ల పొట్టిగా ఉంటుంది. (కో. 17), **3.** రూ. గోడీ, గోదు(5), గోలు(2); పర్యా. చూ. నిలువు(1). తడక; పిల్లలపొది, కావడు మొ॥వాటి అల్లికంలో నిలువుగావచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది, దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. (కో. 25); **4.** పర్యా. చూ. గోడ(2). గుల్ల, బుట్ట, గంప మొ॥వాటికి అడుగునుంచి అంచువరకు ఎత్తుగా అల్లినభాగం (రా. 1); **5.** కత్తులపెట్టె (—పేముతీగ తీసే పనిముట్టు)లో బిగించిన కత్తుల అమరిక. (కో. 11); **6.** చూ. గోరు(3). (కో. 28).

గోడుగచ్చం: రూ. గోరుగచ్చం; చేట అల్లకంలో మధ్యభాగంలో వచ్చే పువ్వులాంటి డిజైను. చూ. చిత్రం 24. (తె. 3, 4).

గోడుదబ్బ: **1.** పర్యా. వాదగర్ర(2) ఊకగంప మొ॥ వాటి అల్లకంలో నిలువులకు వాడే వెదురుపేడు; మందంగానూ బద్దకంటె కొంచెం వెడల్పు తక్కువగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (కో. 17); **2.** పర్యా. చూ. కట్టు(6). చేట, విసనగర్ర, పెట్టె, తిరుమాన్‌పెట్టె మొ॥వాటి అల్లకంలో అంచుకు లోపలినుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద; వేలెడుగాని రెండువేళ్ళ వెడల్పుగాని ఉంటుంది. (రా. 1). **3.** పర్యా. చూ. గుండు(1) జల్లెడ అంచుకట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళవెడల్పు బద్ద; జల్లెడతట్టుమీద దీన్ని బెట్టి తట్టుచివర్లను దీని చుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచులోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద ఈ రెంటిమీంచి ఇంకో మందం బద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (రా. 1).

గోడువార: రూ. గోడివార; పర్యా. గోరు(1), గోలువార. వెదురుబద్దనుంచి పచ్చటిభాగం వాలుగా

వచ్చేటట్లు చీరినవార (చూ.); మామూలుపేడు వెడల్పులో సగమూ మూడుపేళ్ళ మందమూ ఉంటుంది; దీంతో గోరుతడక అల్లుతారు. (కో. 22).

గోడువారచేట: ఉ. —శాట; పర్యా. సన్నపేళ్ళ చేట. సన్నటి వెదురుపేళ్ళతో అల్లినచేట; మామూలుగా దీన్ని మూడుపేళ్ళ మీదగాని (చూ. మూటాలు) నాలుగుపేళ్ళ మీదగాని (చూ. నాటాల) అల్లుతారు. (కో. 26).

గోదినీ: కాళ్ళు తుడుచుకోడానికి గుమ్మంముందు వేసుకొనే కొబ్బరి పీచుపట్టా. చూ. చిత్రం 132. (కో. 19, 20).

గోబ: **1** చూ. గోవ(1). (తె. 15); **2.** చూ. గోవ(3). (తె. 15).

గోరజల్ల. పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్న గడ చీల్చటం సులువు. (తె. 8).

గోరీనె: (< గోరు + ఈనె) పర్యా. చూ. గోలుకర్ర. గుండ్రంగానూ కాస్తలావుగానూ ఉండే కర్ర (చూ. కర్ర); గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టు చుట్టడానికీ అడుగు దొక్కడానికీ పనికొస్తుంది. (కో. 28).

గోరు: **1.** పర్యా. చూ. గోడువార. వెదురుబద్దనుంచి పచ్చటి భాగం వాలుగా వచ్చేటట్లు చీరినవార (చూ.); మామూలుపేడు వెడల్పులో సగమూ మూడుపేళ్ళ మందమూ ఉంటుంది; దీంతో గోరుతడక అల్లుతారు. (కో. 25), **2.** పర్యా. చూ. కర్ర(3). గోవ(వార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువ గాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువుచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (కో. 28); **3.** రూ. గోడు(6); పర్యా చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దుడుగూ అల్లడానికివాడే పలచటి సన్నటిపేరు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండుభాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (కో. 26); **4.** సన్నగా పలచగా ఉండేపేడు; మామూలుపేడులో నాలుగో వంతుగాని ఐదోవంతుగాని వెడల్పా పేడుకన్న పలచగానూ పలకగానూ ఉంటుంది; సిబ్బి మొ॥వాటి బొద్దడుగు చుట్టడానికి వాడతారు; లావాటి తీగతో చుడితే నిలువులు సరిగా కుదురుకోవు కాబట్టి బొద్దడుగు దీంతో చుడతారు. (కో. 25, 39); **5.** చూ. గోడు(3). (కో. 28).

గోరుగచ్చం: చూ. గోడుగచ్చం. (తె. 14).

గోరుగాయ: ఉ. గోర్ - ; ఉలిలాంటి సన్నటిదబ్బనం; వెదురుపేడు గీకేటప్పుడు చేతిలోకి పేడుముక్క గుచ్చుకుంటే దాన్ని తియ్యడానికీ, ముల్లు మిగిలిన చోట లోపల కెలకడానికీవాడతారు. (తె. 21).

గోరుచిల్లకర్ర: ఉ. గోర్చిల్ల—; పర్యా. చూ. పూసగనుపుకర్ర. కొమ్మ నరికేసినప్పుడు కణుపుదగ్గర చిన్నగుర్తుపడే వెదురుగడ; కణుపుదగ్గర పెరిగే కొమ్మ సన్నగా ఉండడంవల్ల దాన్ని నరికినప్పుడు సన్నటిగుర్తు పడుతుంది; దీన్ని చీల్చడం సులువు. (తె. 8).

గోరుతడక: ఉ. గోర్తడికె; గోరు (=సన్నటి పసరు పేడు)తో అల్లిన తడక. (కో. 25).

గోలిపాసికం: సీర్వనుంచి వాలుగా తీసిన పాసిక. చూ. పాసిక. (కో. 27).

గోలీనె: (< గోలు + ఈనె). పర్యా. చూ. గోలుకర్ర. గుండ్రంగానూ కాస్త లావుగానూ ఉండేకర్ర (చూ. కర్ర); గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టుచుట్టడానికీ అడుగు దొక్కడానికీ పనికొస్తుంది. (కో. 31).

గోలు: **1.** పర్యా. బడుగు (3). ఊకగంప అల్లకం కోసం తీసినపేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. చూ. చిత్రం 47 చ. 2. (కో. 19); **2.** చూ. గోడు (3). (కో. 28).

గోలుకర్ర: ఉ. గోల్కర్ర; పర్యా. కర్రపోచ, గుండు కర్ర, గోరీనె, గోలీనె, వారగర్ర (3). గుండ్రంగానూ కాస్త లావుగానూ ఉండేకర్ర (చూ. కర్ర); గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టుచుట్టడానికీ అడుగుదొక్కడానికీ పనికొస్తుంది, (తె. 15, 18).

గోలుగా: (< హిం. గోల్). (క్రి. విశే.) ఉ. గోల్గా; పర్యా, గుండూరుగా, చక్రంగా, గుండ్రంగా; జల్లెడ అడుగును గుండ్రంగా కత్తిరిస్తారు; ఊత గంప మొ॥ అల్లేటప్పుడు నిలువుల్ని చక్రాకారంగా పరుస్తారు. (తె. 13, 15, 16, 21, 24).

గోలువార: పర్యా. చూ. గోడువార. వెదురుబద్దనుంచి పచ్చటిభాగం వాలుగా వచ్చేటట్లు చీరినవార (చూ.) మామూలుపేడు వెడల్పులో సగమూ మూడుపేళ

మందమూ ఉంటుంది; దీంతో గోరుతడక అల్లుతారు. (కో. 31).

గోలెం. నీళ్ళతొట్టి; మట్టిది; గుండ్రంగా దళసరిగా ఉంటుంది; కిందివైపుకన్న మీదివైపు వెడల్పు ఎక్కువ; దీంట్లో కొబ్బరిడొక్కలు ఊరవేస్తారు. (కో. 25, 29).

గోలెంమీదితడక: పర్యా. గాబుమీది మూతతడక, తొట్టిమీది తడక. నీళ్ళ (తొట్టి)మీద మూతగావేసే తడక; తొట్టి ఆకారాన్నిబట్టి దీర్ఘచతురస్రంగానూ చతురస్రంగానూ గుండ్రంగానూ ఉంటుంది (కో. 26; తె. 28).

గోల్తడక: (< గోలు + తడక). ఉ. గోల్తడికె. గోల్తడ్క; 1. పర్యా. చూ. క్రాస్‌తడ (1). త్రిభుజాకారంలో ఉండే తడక; తడకలతో కట్టే ఇంటికి కప్పువైపు త్రిభుజాకారం వచ్చేచోట దీన్ని కడతారు. చూ. చిత్రం 37. (కో. 31), 2. పర్యా. చూ. బండిజల్ల (2). ఎరువు మొ॥ చేర వేయడానికి బండిమీద పరిచేతడక; ఈతపేళ్ళతో అల్లుతారు. (తె. 13).

గోల్పుల్ల: (< గోలు + పుల్ల). పర్యా. పుల్ల (4) చిల్కాను (= పుల్లంపరదా) తయారీలో వాడే వెదురుపుల్ల; గట్టిగానూ కొంచెం గుండ్రంగానూ ఉంటుంది; ఇలాటివి వరసగా బిగిస్తారు. చూ. చిత్రం 93.4 (తె. 15).

గోవ: 1. రూ. గోగ, గోబ (1); పర్యా. చూ. ఖానా (1). వెదురుగడలు నిలవచేయడానికి చేసినకట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి, వాటికి ఎదురుగా గజం గడంలో మరో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు)పాతి ఆ నాలిగింటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవేపు ఖాళీ ఉంచుతారు; ఖాళీఉన్న వేపు నుంచి గడలుదూర్చి నిలబెడతారు; ఖాళీవేపును గొలుసుతోగాని గడతోగాని మూసి తాళంగూడా వేసుకోవచ్చు. (తె. 12, 17); 2. పర్యా. ఒప్పు (3), గోడిబద్ద, వార (3). నిలువుగా చీరిన గంటి బద్ద (చూ.) మూడునాలుగు భాగాల్లో ఒకటి; గంటి బద్ద వెడల్పులో మూడోవంతుగాని నాలుగోవంతు గాని ఉంటుంది; దీన్నించి గంపలు, బుట్టలు మొ॥ అల్లడానికి సరిపోయే ఈనె ( తీగలాంటి సన్నటి భాగం)లు తీస్తారు. (కో. 22, 23, 26-31); 3. ఉ. గోవా; రూ. గోబ (2); పర్యా. గోవతడక, పరంజి, సారవ. ఇళ్ళు కట్టేటప్పుడు తాపీమేస్త్రీలు నిలబడడానికి ఎత్తున కట్టేది. (చూ. గోవ; మాం. వృ. కోశం-1, వాస్తుపదజాలం), చూ. చిత్రం 107. (తె. 10, 13, 14); 4 పర్యా. చూ. కర్ర (2). చేట అంచుకట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒకబద్దా, వెలుపలినుంచి ఒక బద్దాపెట్టి ఈ రెంటిమీదినుంచి ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్టు సందును మూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్రపెట్టిన తరవాత కట్లు కడతారు. (కో. 19), 5. పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందుభాగంలో రెండు మూతులను (కొనలను) కలుపుతూ అడ్డంగా వేసిన చిటికెన వేలెడులావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2 (కో. 19); 6 పర్యా. చూ. దవడ ముల్లు. ఈతమట్ట మొదటిభాగంలో ఉండే ముల్లు; దబ్బనంలా ఉంటుంది. చూ. చిత్రం 10.1 (కో. 25); 7. పర్యా. చూ. పెడ (2). కొబ్బరి కాయచుట్టూ పైన పచ్చగా నున్నగాఉండే పలచటి పొర; తాట. (కో. 23).

గోవకట్టె: గోవ కట్టడానికి పనికొచ్చే వెదురుగడ (తె. 5).

గోవతడక: ఉ. - తడ్క; పర్యా. చూ. గోవ (3). ఇళ్ళు కట్టేటప్పుడు తాపీమేస్త్రీలు నిలబడడానికి ఎత్తున కట్టేది. (చూ. గోవ; మాం. వృ. కోశం-4, వాస్తుపదజాలం); చూ. చిత్రం 107. (తె. 26).

గౌడి: పర్యా. చూ. గరి (1). వెదురుబద్ద అంచుకుండే పదును. (రా. 3).

గౌడిదబ్బ: అంచులు గీకని వెదురుబద్ద. (రా. 3).

గౌడిబొంగు: పర్యా. పెద్దపేము దూలమంత లావుండే వెదురుగడ. (తె. 24).

గౌరిగంప: పర్యా. గౌరీదేవిగంప. నోముల సందర్భాల్లో ఉపయోగించే గంప; పెళ్ళికూతురుగంప లాగే ఉంటుంది. కాని దీనికి కట్టుండదు (చూ. కట్టు); కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 28).

గౌరినోము: ఉ. గౌర్‌నోము; గౌరీదేవివ్రతం; పండుగ. (తె. 1).

గౌరీతపసుబుట్ట: పర్యా. చూ. పెళ్ళికూతురుగంప. పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టడానికి అల్లే వెదురుగంప; కింద నాలుగు మూలలుగా ఉండి పైన గుండ్రంగా

ఉంటుంది; కొన్నిచోట్ల దీనిఅంచు చుట్టూ చేటకట్టు (= వెదురుబద్దలతోటి గింపు) లాంటికట్టు ఉంటుంది' కొన్నిచోట్ల ఏమీ ఉండదు; పెళ్ళికిముందు గౌరీపూజ చేసేచోట పెళ్ళికూతుర్ని అందులో కూర్చో బెడతారు; పూజ అయి ప్రవరలు చెప్పినతరవాత పెళ్ళికూతురు కూర్చున్న గంపను పెళ్ళిమండపం లోకి ఎత్తుకువస్తారు; పెళ్ళి (ముహూర్తంవేళ జరిగే తతంగం) అయ్యేవరకు పెళ్ళికూతురు ఆగంపలోనే ఉంటుంది. (కో. 23).

గౌరీదేవిగంప: పర్యా. గౌరిగంప. నోముల సందర్భాల్లో ఉపయోగించే గంప; పెళ్ళికూతురుగంప లాగే ఉంటుంది. కాని దీనికి కట్టుండదు (చూ. కట్టు); కిందనాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 26).

గ్లేసు: (< ఇం. Glass) వెదురుఈనెలతో అల్లిన చిన్నబుట్ట; గ్లేసు ఆకారంలో ఉంటుంది. (కో. 29).

చ

చక్కనికర్ర: ఉ. సక్కని ; పర్యా. చూ. సైర బొంగు(1). వంకలు లేకుండా నిటారుగా పెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గా ఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 3).

చట్టచదరంగా: (క్రి విణ) ఉ. సట్టసదరంగా; పర్యా. చూ. చౌకంగా. చతురస్రంగా; జల్లెడఅడుగు, దాగరఅడుగు మొ॥వాటిని చతురస్రంగా అల్లుతారు. (రా. 1).

చట్టదబ్బ: ఉ. సట్ట—; పర్యా. చూ. కండదబ్బ(4) ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్టడానికీ ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పనికొస్తుంది. చూ. చిత్రం 11. 3. (తె. 20).

చట్టం: ఉ. సట్టం; 1. చూ. చట్రం(1). (కో. 3; తె. 1, 4, 5, 17; రా. 10); 2. గుడిసెకప్పుకోసం వెదురుగడలు వరసగాపేర్చి వాటిమీద అడ్డంగా బద్దలుకొట్టి తయారుచేసిన చట్రం; గళ్ళుగళ్ళుగా ఉంటుంది. (తె. 14).

చట్రం: ఉ. సట్రం; సెత్రం; 1. రూ. చట్టం(1); పర్యా. అని(4), చౌకటు, జూదం, ఫ్రేం, వెదురు చట్రం, సొంచె. మంచం, బద్దలతడక, చాటుతడక, చెంద్రికతడక, కళ్యాణమంటపం మొ॥వాటి తయారీకి నాలుగు వెదురుబద్దలతోగాని గడలతోగాని (దీర్ఘ చతురస్రాకారంగా గాని చతురస్రాకారంగా గాని) చేసిన దొడ్డి. చూ. చిత్రం 82. 2. (కో. 5, 12-14, 20-23), 2. (- వేయు); పర్యా. దొడ్డి(3). తడక అల్లకంకోసం వెదురుబద్దలతో దీర్ఘచతురస్రాకారంలో ఏర్పరిచిన కైవారం. (కో. 9); 3. గోదిసీలు తయారు చేయడానికి తాళ్ళతో మగ్గంలా పన్నే నలుమూలల చట్రం (కో. 20); 4. కుర్చీ ఆకారంలో పేముకర్రలు వంచి అల్లకానికి సిద్ధంచేసిన దొడ్డి (ఫ్రేము). (కో. 12, 14).

చట్రంబిగించు (క్రి.) ఉ. సట్రం , పేముకర్రల్ని చేయవలసిన వస్తువు ఆకారంలో అమర్చి అల్లకానికి సిద్ధంచేయడం. (కో. 19).

చదర: ఉ. సదర, సదిరి, సదిరె; 1. పర్యా. చాప(2) కూర్చోడానికి నలుచదరంగా (గజం లేదా మూరెడు) అల్లిన వెదురుపేళ్ళచాప; కొన్నిచోట్ల తిరగలి (విసుర్రాయి) కింద వేస్తారు. (కో. 3, 31; తె. 10, 19, 21); 2. చిన్న ఈతచాప; ఎనిమిది నుంచి పదిపట్టెల వరకు పక్కపక్కగా చేర్చి కుడతారు; కొన్నిచాపలు గుండ్రంగానూ కొన్ని చతురస్రంగానూ మరికొన్ని దీర్ఘచతురస్రంగానూ ఉంటాయి; గుండ్రంగా ఉండేవి కూర్చోడానికీ తిరగలి (విసుర్రాయి) కింద పరుచుకోడానికీ చతురస్రంగా ఉండేవి కూర్చోడానికీ దీర్ఘచతురస్రంగా ఉండేవి పడుకోడానికీ పనికొస్తాయి. (తె. 22); 3. కూర్చోడానికి ఒకటిరెండు మూరల పరిమాణంలో నేసే చిన్న తాటిచాప. (కో. 26); 4. రూ. చదురు; పర్యా. చూ. అడుగు (1). చేట సమతలభాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపక ముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట; చూ. మంతు. (కో. 5, 13).

చదరంగా: (క్రి. విణ.) ఉ. సదరంగా; పర్యా. సవరగా. చదునుగా; సమాంతరంగా; మట్టంగా; వెదురుగడనుగాని, బద్దనుగాని (ఏటవాలుగా కాకుండా) అడ్డంగా నరికే సందర్భంలోను వెదురు గడలను చిందరవందరగా కాకుండా సమానంగా పేర్చే సందర్భంలోనూ వాడుక. (కో. 1; 4).

చదరంజేయు: (క్రి.) ఉ. సదరం—; పర్యా. చూ. పసునుచేయు. వెదురుగడకు గంటి గనుపులు (కొమ్మలు కొట్టేసినచోట మిగిలినవి) లేకుండా కత్తితో నున్నగా చెక్కేయడం. (రా. 10).

చదరం: ఉ. సదరం; నలుపలకల ఆకారం; చతురస్రం. (కో. 28, 29).

ఛదరంబొంగు: ఉ. సదరం—; పర్యా. కోపుకఱ్ఱ. మెత్తటినేలలో (కోపులో) పెరిగిన వెదురుకఱ్ఱ. (కో. 7).

చదరంవెదురు: ఉ. సదరమెదురు; పర్యా. చూ. మెదుగుబొంగు. నాణ్యమైన మెత్తటి వెదురుకఱ్ఱ; మెత్తటిపేడు వస్తుంది; మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది; నీళ్ళు బాగాఅందే లోయల్లోనూ సమతల భూముల్లోనూ మెత్తటి నేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపులమధ్య ఎడం ఎక్కువ (రా. 2).

చదురు: ఉ. సదురు; చూ. చదరం (4). (రా. 10).

చద్దితట్ట: ఉ. సద్ది—; పర్యా. అంబటిగంప. అంబలి మొ॥ పొలానికి చేరవేసే గంప. (తె. 9).

చప్పరించు: (క్రి.) ఉ. సప్పరించు; పర్యా. చూ. తట్టు (1). కొట్టడం, వెదురుగడ పగలగొట్టడానికి కత్తిమీద మొద్దుతో కొడతారు. (తె. 6).

చరిపించు: (క్రి.) ఉ. సరిపించు; పర్యా. పదును బట్టించు, పదునుబెట్టించు, పదునువేయించు సరిపిదం బెట్టించు. పదునుపోయి మొండిగా అయిన కత్తి మొ॥ వాటిని కొలిమిలో కాల్చి సుత్తితోకొట్టి వాడిగా చేయించడం; మేదరికత్తికి పదునుపోయి నప్పుడు కమ్మరిచేత ఇలా చేయిస్తారు; కొన్నిచోట్ల మేదరివాళ్ళే చేసుకుంటారు. (కో. 3, 9, 10, 18; తె. 20).

చరుచు: (క్రి.) ఉ. సర్సు; పర్యా. శాటుబెట్టు. ఎరకలి కత్తి మొ॥ వాటికి కమ్మరి కొలిమిలో పదును బెట్టడం; నిప్పుల్లోకాల్చి సుత్తితో సాగగొడతారు. (తె. 9).

చాటుతడక: ఉ. సాటుతడ్క, సాట్టడ్క; 1. పర్యా. అఱ్ఱతడక, పడసాలతడక, మచ్చు (1), మచ్చుతడక. ఇంట్లో గదులుగా విభజించడానికిగాని వరండాలో చాటుకోసంగాని అడ్డంగాకట్టే వెదురు పేళ్ళ తడక; చూ. చిత్రం 36 చ. (తె. 6, 14, 17); 2. వరండాలమధ్య పెద్దగదులమధ్య మరుగు కోసం అడ్డంగాకట్టే ఈతతడక. (తె. 1, 9, 13, 14).

చాప: ఉ. సాప; 1. వెదురుపేళ్ళతో (చేట అల్లకం మాదిరిగా) చిక్కగా అల్లిన ఒకరకం తడక; నేల మీద పరుచుకోడానికీ పందిరిమీద పరుచుకోడానికీ వెదురుమంచం మీద పరవడానికీ రేకులకప్పు కింద పరుచుకోడానికీ చంద్రిక ఫ్రేముమీద పరవడానికీ బండ్లమీద కప్పుకోడానికీ పనికొస్తుంది; నిలువులూ అడ్డాలూ లేకుండా చేట మాదిరిగా అల్లినది; మామూలుచాపమీద నిలువుబద్దలూ అడ్డంబద్దలూ కొడితే తడకవుతుంది. (కో. 17; 19, 22, 25, 27, 39, 31, తె. 1, 2, 4, 6, 16, 19, 31; రా. 6, 10); 2. పర్యా. చదర(1). కూర్చోడానికి నలుచదరంగా (గజం లేదా మూరెడు) అల్లిన వెదురుపేళ్ళచాప; కొన్నిచోట్ల తిరగలి (విసుర్రాయి) కింద వేస్తారు. (తె. 26); 3. బొమ్మలకొలువులో పెట్టుకోడానికి సన్నటి వెదురుపుల్లలతో చాప ఆకారంలో అల్లిన చిన్నచాప. (కో. 5).

చాపదబ్బ: ఉ. సాప—; పర్యా. చూ. లాకదబ్బ. (తుంగ) చాపనేసేటప్పుడు మగ్గంపోగుల మధ్య (తుంగ) పోచను దూర్చేబద్ద; దీనిచివర బెజ్జముంటుంది, అందులోకి (తుంగ) పోచకొస దూర్చి లాకదబ్బను పోగులమధ్య దోపుతారు. చూ చిత్రం 121 క. 6. (రా. 10).

చాపపన్ను: (క్రి.) ఉ. సాప్పన్ను; ? చాప అల్లకం మొదలుపెట్టడం. (కో. 19).

చాపపోయు: (క్రి) ఉ. సాపపోయు; ఈతచాప అల్లడం; "సాపవోస్కుం" అనివాడుక. (తె. 26).

చాపమూల: ఉ. సాప-; పర్యా. చూ. కొమ్ము(6). ఈతచాప మూలభాగంలో ఉండే అంచుపట్టె చివరి భాగం; నాలుగుమూలలా ఇలా తోకలా కనిపిస్తుంది. చూ; చిత్రం 122. 2. (తె. 22).

చాపలజమ్ము: ఉ. సాపజ్జమ్ము. చాపలనేయడానికి పనికొచ్చే జమ్ము; పోచగుండ్రంగా ఉంటుంది. (రా. 2).

చాపీనె: (< చాప + ఈనె) ఉ. సాపీనె; చాపఅల్లే వెదురుపేడు; సుమారు వేలెడు వెడల్పున గోరంత మందంగా ఉంటుంది. (కో. 21, 23).

చాయబొంగు: ఉ. శాయి-, శాయ—; నీలివన్నె వెదురుగడ; దీన్నించి పేడు సాఫుగా వస్తుంది; మేదరిపనికి బాగా ఉపయోగపడుతుంది. (తె. 17,18).

చార: ఉ. సార; పర్యా. గిఱ, గీత (2). గీటు; గీర; మామూలుగా పొడుగ్గా సాగినరేఖ; మేదరిపనిలో బొగ్గుతోగాని సుద్దముక్కతోగాని గుర్తుగా చిన్న గీట్లు పెట్టుకొంటారు. (కో. 6).

చావుకట్టె: ఉ. సావు—; పర్యా. చూ. పాడె. శవాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళడానికి వెదురుగడలతో కట్టినది; చూ. చిత్రం 100. (తె. 15).

చావుగంప: ఉ. సావుగంప; జంగాలు (= ఒకతెగ) శవాన్నిపెట్టి తీసుకువెళ్ళే గంప. (తె. 26).

చావుచేట: ఉ. సావుశాట; పర్యా. పీనిగచేట, ముంగటిత్తనాల చేట. శవాన్ని తీసుకువెళ్ళేటప్పుడు చల్లే పేలాలూ నవధాన్యాలూ చిల్లరపైసలూ మొ॥ పోసుకొనే చేట; అల్లకంలో దీనికి అంచుకట్టరు. (కో. 25).

చిక్కనిబుట్ట: పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైనమూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగానూ కొన్నిచోట్ల పళ్ళెంమాదిరిగానూ ఉంటాయి; కొన్నిచోట్ల ఈబుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు; చూ. చిత్రం 139. (కో. 1).

చిక్కల్లకం: (< చిక్కు- అల్లకం) 'V' ఆకారంలో అల్లేవిధానం; ఇలా అల్లడంవల్ల గూడ (= మెరక పొలంలోకి పల్లంనుంచి నీళ్ళు తోడేది) ఈ ఆకారంలో ఉంటుంది. (కో. 7).

చిక్కం: ఉ. శిక్కం, సిక్కం. **1.** పర్యా. చూ. ఎద్దుబుట్ట. చేను మేయకుండా పశువులమూతికి తొడిగే బుట్ట; గాలి ఆడడానికి పేళ్ళమధ్య సందులు వచ్చేటట్లు అల్లుతారు, ఈతపేడుతోగాని వెదురుపేడుతోగాని దుసేరుతీగలతోగాని అల్లుతారు (రా. 1, 9); **2.** పర్యా. బుట్టగుల్ల (1). పావుకిలో నుంచి అరకిలో వరకు గింజలు మొ॥ పోసిపెట్టుకోడానికి వీలయిన ఒకరకం చిన్న వెదురుబుట్ట; గుల్లమాదిరిగా గుండ్రంగా ఉంటుంది. (తె. 22).

చిక్కు: ఉ. శిక్కు; **1.** పర్యా. చూ. పుల్లలతడక. వెదురుపుల్లలూ పురికోసలూపెట్టి అల్లిన తడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు. చూ. చిత్రం 93. (తె. 10, 14). **2.** పర్యా. చిల్వాను (1). కాసెగడ్డితోగాని వట్టివేళ్ళతోగాని కట్టిన పరదా; వేసవికాలంలో దీన్ని కిటికీలకూ గుమ్మాలకూ వరండాలకూ అడ్డంగా కడతారు; దీనిమీద నీళ్ళుచల్లితే గది చల్లబడుతుంది. (తె. 10); **3.** నాగటికర్రను అరుకుబిగించే ఇనపమేకు. (కో. 30).

చిక్కుచాప: ఉ. సిక్కిసాప; పర్యా. చూ. పుల్లలతడక. వెదురుపుల్లలూ పురికోసలూపెట్టి అల్లిన తడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (కో. 31).

చిక్కుతడక: ఉ. — తడికి, — తడికె; పర్యా. చూ. పుల్లలతడక, వెదురుపుల్లలూ పురికోసలూ పెట్టి అల్లిన తడిక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (కో. 8, 12, 14, 15).

చిగురు: ఉ. శిగురు, సిగురు; **1.** వెదురుమొక్క పెరిగేటప్పుడు దాని తలపైపు కోసుగా, మెత్తగా ఉండే భాగం; ఇది పైకి పెరుగుతూంటే గడ పెరుగుతూ ఉంటుంది. (కో. 24); **2.** పర్యా. చూ. ముక్కు (1). కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగాఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 12 జ. 3; 16 చ. 5. (కో. 24), **3.** ఈతాకు చివరిభాగం. (కో. 25); **4.** పర్యా. చూ. కొన (7). వెదురుగడ చివరి సన్నటిభాగం. (కో. 24).

చిగురుపొడిచినకర్ర: ఉ. శిగురుబొడ్శిన-; సన్నటి చిగురువేసిన వెదురుగడ. (కో. 24).

చిగురుపొడుచు: (క్రి.) ఉ. శిగురు—; వెదురుగడకు చివర చిగురువేయడం; కొమ్మ కొంత పెరిగిన తరవాత చిగురువేస్తుంది; సన్నగా, మెత్తగా ఉంటుంది. (కో. 24).

చించు: చూ. చింపు (1). (రా. 1).

చించెగూడ: ఉ. — గోడ; ప్రవాహానికడ్డంగాపెట్టి చేపలుపట్టే ఒకరకం గూడ; కింద సన్నగానూ పైన వెడల్పుగానూ ఉంటుంది; సుమారు మూరెడు జేనెడు పొడుగుంటుంది; చూ. చిత్రం 73 చ. (కో. 31).

చింజల్లెడ: (< చిన్న+జల్లెడ) పిండి జల్లించుకొనే చిన్న జల్లెడ; పేళ్ళమధ్య చాలా సన్నటి సందులు పెట్టి మూడు పేళ్ళమీద అల్లుతారు. (తె. 13).

చిటపటాలతుంగ: పట్టుకొని ఒత్తితే పటపటా విరిగే పెళుసుతుంగ; గుండ్రంగా ఉంటుంది. (కో. 3).

చిటుక్కర్ర: పర్యా. చూ. శివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (కో. 2).

చిట్టకర్ర: ఉ. శిట్ట—; పర్యా. చూ. గట్టికర్ర (1). సూదిపట్టేటంత ఖాళీ మొదలు వేలెడంత ఖాళీవరకు లోపల బోలుగాఉండే గట్టి వెదురుకర్ర; గుట్టలమీదా రాళ్ళదగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాలవరకు

లావుగా ఉంటుంది. (కో. 27).

చిట్టడుగు: ఉ. శిట్టడ్గు; చిన్న అడుగు; వెదురుపేళ్ళ గుల్ల అల్లకంలో రెండుబెత్తల అడుగుచుట్టిన తరవాత మళ్ళీ నిలువులువేసి అల్లినది. (తె. 24).

చిట్టి: కిలోధాన్యం కొలత. (తె. 21).

చిట్టిగన: చూ. చిట్టిగనుపు (1). (తె. 31).

చిట్టిగనుపు: ఉ.–గెనుపు; 1. రూ. చిట్టిగన; పర్యా. కురచగనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్నభాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (కో. 9, 10; రా. 10); 2. రూ. చిట్టిగనె; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 2).

చిట్టిగనె: ఉ. సిట్టి—; చూ. చిట్టిగనుపు (2). (తె. 27).

చిట్టిపెట్టె: ఉ. శిట్టిపెట్టి; పర్యా. చూ. పసుప్పెట్టె. పెళ్ళిఅయిన కొత్తలో అమ్మాయిలు అత్తవారింటికి పసుపుకుంకుమలు తీసుకుపోవడానికి పెట్టుకొనే చిన్నపెట్టె. (కో. 23).

చిట్టిపేము: ఉ. శిట్టి—; సన్నగా పెళుసుగా ఉండే పేము. (కో. 3).

చిట్టిబర్ర: ఉ. శిట్టి—; పర్యా. చూ. సన్న(ం) బరిగె. వేలెడు లావుకన్న తక్కువఉండే ఈతచువ్వ (బరిగె); గుల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (రా. 9).

చిట్టీతచెట్టు: (< చిట్టి + ఈత—) ఉ. -శెట్టు; చూ. జిట్టీతచెట్టు. (కో. 3).

చిట్టీతపుల్ల: (< చిట్టి + ఈత—) పర్యా. చూ. జిట్టీత(చెట్టు) బరిగె. పొట్టిఈత (జిట్టీత) చెట్టుకమ్మ చీరి తీసిన చువ్వ; పొడుగు తక్కువ. (కో. 3).

చిట్టె: ఉ. చిట్టి, శిట్టి, శిట్టె, సిట్టి, సిట్టె; 1. పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర; చిటికెన వేలెడులావు నుంచి బొటనవేలెడు లావు వరకు ఉంటుంది; దీనికిలోపల ఖాళీ ఉండదు; కణుపులుదగ్గర దగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికి చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (కో. 3, 5-8; రా. 5, 7, 8, 11); 2. పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడు లావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెర కర్రగానూ గాలంబరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది. (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 1; రా. 3, 4); 3. పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 91. (రా. 2,3,4); 4. గుమ్మి (= వెదురు పేళ్ళ గాదె) అడుగు అల్లేటప్పుడు ఒకనిలువు వదిలి మరొకనిలువును మళ్ళీ వెనక్కిమలుపుతూ అల్లినది (నిలువు). (తె.28); 5. పర్యా. చూ. బద్ద(4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒకఅంచు వెంబడీ అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టం తొడిగేబద్దకు చివరి గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 17); 6. రూ. చిట్టెం; గుమ్మి అల్లకంలో అడుగు పూర్తిచేసి ఎత్తుభాగం అల్లకంకోసం నిలువులను పైకిలేపేటప్పుడు బిగించే వెదురుబద్దలజత; సుమారు వేలెడువెడల్పు ఉంటుంది; ఇలాటివి నాలుగువైపులా బిగిస్తారు. (తె. 22).

చిట్టెడుగుల్ల: చిట్టెడు (= ఒక కిలోధాన్యం) పట్టే గుల్ల. (తె. 21).

చిట్టెడుబుటిగుల్ల: ఉ. శిట్టెడు—; అరకిలోధాన్యం పట్టే గుల్ల. (తె. 22).

చిట్టెదురు: 1. పర్యా. చూ. సన్నం(పు) బొంగు. రెండంగుళాలనుంచి అరంగుళాలవరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగావుండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్నిగడలలో బోలు సన్నగాఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (కో. 1; రా. 3); 2. పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టిఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్లు, గుతపకర్ర, గైకట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (రా. 1).

చిట్టెబిలుకు: ఉ. సిట్టిబిల్కు; గుమ్మి అడుగు అల్లిన తరవాత నిలువులు పైకిలేపేముందు కర్సడ (= చిక్కటి అల్లకం) అల్లడానికి వాడే పేడు. (తె. 28).

చిట్టెబొంగు: పర్యా. చూ. సన్నం(పు) బొంగు.

రెండంగుళాలనుంచి ఆరంగుళాలవరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగాఉండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (కో. 9; రా. 10).

చిక్టాం: ఉ. శిట్టాం; చూ. చిట్టె (6). (తె. 23).

చిడీ: (< హిం. సిడీ) ఉ. శిడీ; 1. పర్యా. చూ. ఖానా (1). వెదురుగడలు నిలవచేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండు గడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి వాటికి ఎదురుగా గజం ఎడంలో మరో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి ఆ నాలిగింటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవైపు ఖాళీ ఉంచుతారు; ఖాళీఉన్న వైపు నుంచి గడలుదూర్చి నిలబెడతారు; ఖాళీవైపును గొలుసుతోగాని గడతోగాని మూసి తాళంగూడా వేసుకోవచ్చు. (తె. 13), 2. పర్యా. నిచ్చెన. అటక, మిద్దె, గోడ మొ॥ ఎక్కడానికి వెదురు గడలతో తయారుచేసినది; రెండు నిలువుగడలకు అడ్డంగా వెదురుకర్రముక్కలు మెట్లుగా అమరుస్తారు. (తె. 10, 17).

చితగ్గొట్టు: (క్రి.) ఉ. సితగ్గొట్టు; పర్యా. నంగ్గొట్టు; కొబ్బరిడొక్కలు చీలేటట్లు గూటంతో కొట్టడం. (కో. 23, 25, 29).

చిత్తనగొట్టం: చిమ్మెనగొట్టం; బోలుగా ఉంటుంది; దీనికి సన్నటి చిల్లులు చేస్తారు; హోళీ పండుగకుగాని వసంతాలాడుకోడానికి గాని దీంట్లో రంగునీళ్ళుపోసి ఒకరిమీద ఒకరు చల్లుకొంటారు. (తె. 10).

చిత్తబొడిచినకర్ర: ఉ. శిత్తబొడ్సిన—; చుట్టూ పసుపు వన్నె మచ్చలున్న వెదురుగడ. (కో. 28).

చిత్తరెట్టలచాప: ఉ. —సాప; ఒకరకండిజైను (చిత్తరెట్టల డిజైను) వచ్చేటట్లు నేసిన తుంగచాప. (కో. 3).

చిత్తుకాయితాలబుట్ట: పర్యా. చూ. కాయితాలబుట్ట. చిత్తుకాగితాలు వేసుకోడానికి వాడేబుట్ట; కొన్ని చిన్నబొక్కెన ఆకారంలోనూ కొన్ని మైలబుట్ట ఆకారంలోనూ (దీనికి కాళ్ళుంటాయి) కొన్ని పళ్ళబుట్ట ఆకారంలోనూ (దీన్ని దారంలాంటి వెదురుపుల్లలతో నాణ్యంగా అల్లుతారు) ఉంటాయి; చూ. చిత్రాలు 78 క, చ. (కో. 3).

చిత్రాసనంచాప: ఉ. —సాప; సంజవార్చుకొనేటప్పుడు కూర్చునే తుంగచాప; మూరెడు చదరంగా ఉంటుంది. (రా. 10).

చిద్రం: (< సం. ఛిద్రం) ఉ. శిద్రం, శీద్రం, సీద్రం 1. వెదురుగడనుగాని బద్దనుగాని చీమలు కొట్టడం వల్ల ఏర్పడ్డచిల్లి (తె. 14, 22, 25); 2. పర్యా. కన్ను (14), బొక్క (3), ఈతచాప అల్లకంలో ఒక ఆకుకూ మరొక ఆకుకూ మధ్య ఏర్పడ్డసందు సూది దూరేటంత ఉంటుంది. (తె. 19).

చింతకాయజల్లెడ: ఉ. సింతకాయజల్లెడి; చింతకాయ పట్టుకొనే జల్లెడ; అడుగుకన్నాలు పెద్దగా ఉంటాయి. (రా. 2).

చింతకాయబొంగు: పర్యా. చూ. గైకట్టె (2). చింత మొ॥ చెట్లనుంచి కాయలు రాలగొట్టడానికి ఉపయోగించే వెదురుకర్ర; పొడుగ్గా గట్టిగా ఉంటుంది. (తె. 5).

చింతపండుగంప: చింతపండు పెద్దమొత్తంలో రవాణాచేసే గంప; అడుగున సన్నగానూ పోను పోను పైన వెడల్పుగానూ ఉంటుంది. (రా. 11).

చింతపండుబుట్ట: ఉ. సింత—; చింతపండు పార్సెల్ చేసే చిన్నబుట్ట; బకెట్టంత, అదే ఆకారంలో ఉంటుంది (కో. 26, 28).

చిందాగర (< చిన్నదాగర) ఉరువు చిన్నగాఉండే దాగర; చూ. దాగర. (కో. 30).

చిందు: (క్రి.) పర్యా. చిల్లుడు. దంపేప్పుడు ధాన్యం రోట్లోంచి కిందికి చెదరడం. (కో. 8).

చిన్నకట్టు: పర్యా. చూ. మోమికట్టు. జల్లెడపట్టుమీద గుండు (గుండ్రంగా కట్టిన బద్ద)పెట్టి దానిచుట్టూ పట్టు చివర్లువంచి ఆ గుండుచుట్టూ వెలుపలినుంచి మరో బద్దపెట్టి ఆ మూడింటినీ కలిపి బిగిస్తూ కట్టు ముంగుతో వేసిన చిన్నకట్టు. (కో. 13, 15–19).

చిన్నకన్ను: ఉ. శిన్న—; పర్యా. చూ. పూసగనువు. వెదురుగడ గణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 24).

చిన్నకన్నుగుంపు: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్న గడ చీల్చడం సులువు. (కో. 27).

చిన్నగంటుగుంపు: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్న గడ చీల్చడం సులువు. (కో. 31).

చిన్నగంప: వెదురుగంపల్లో చిన్నరకం; మట్టి, ఇసక

కూరగాయలు తీసుకువెళ్ళడానికి వాడతారు; నిలువుల్లూ పేడూకలిపి అల్లుతారు. (రా. 5, 11).

చిన్నగుంపు: ఉ. సిన్నగుంపు; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 28).

చిన్నచాప: ఉ. సిన్నసాపు సిన్సాప; 1. గజం వెడల్పూ రెండుగజాల పొడుగూ ఉండేటట్లు అల్లిన తాటిచాప. (కో. 23); 3. మూడుజేనెల వెడల్పూ నాలుగుమూళ్ళ పొడుగూ ఉండే తుంగచాప. (కో. 30).

చిన్నచేట: ఉ. శిన్నశాట; ఉరువు చిన్నగా ఉండే చేట. (కో. 24, 25).

చిన్నచ్రేకు: పేముకుర్చీలు మొ॥ అల్లినతరవాత మిగిలిన తీగలు తెంపే పదునైన ఇనపరేకు. (తె 22).

చిన్నతట్ట: పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులుపోసి పెట్టుకోడానికి వెదురు పేళ్ళతోగాని ఈతపేళ్ళతో గాని అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది. చూ. చిత్రం 66. (కో. 2).

చిన్నతడక: ఉ. శిన్నతడ్క; కోళ్ళగూటు ద్వారానికి అడ్డంగా తలుపులాకట్టిన చిన్నతడక. (తె. 10).

చిన్నపెట్టగుంపు: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల(కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్న గడ చీల్చడం సులువు. (కో. 29).

చిన్నబద్ద: ఉ. సిన్న—; పర్యా. తుంటబద్ద; పొడుగు తక్కువగా ఉండే వెదురుబద్ద. (కో. 28).

చిన్నబల్జ: ఉ. శిన్న—; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల(కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్న గడ చీల్చడం సులువు. (కో. 23).

చిన్నబసివి: ఉ. శిన్నబస్వి; పర్యా. చూ. జిట్టీతచెట్టు. పొట్టిగా ఉండే ఒకరకం ఈతచెట్టు. (రా. 9).

చిన్నబుట్ట: ఉ. శిన్నబుట్టి, సినబుట్టి, సిన్నబుట్టి. 1. దుకాణంమీద కూరగాయలు పోసిపెట్టుకోడానికి అల్లిన వెదురుపళ్ళెం; చూ. సెంగేరి. (తె. 1, 16); 2. పర్యా. గుల్లబుట్ట). చిన్న వెదురుబుట్ట. (రా.9).

చిన్నబొంబు: (< ఇం. Bamboo). పర్యా. చూ. కురచబొంగు. పది మూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ. (రా. 1).

చిన్నమ్మి: (< చిన్న + అమ్మి). ఉరువు చిన్నగా ఉన్న అమ్మి. (తె. 23).

చిన్నరామాఫాటను: పర్యా. చిన్న రామారౌండ్, ఒకరకం చిన్న పేముకుర్చీ, (కో. 12).

చిన్నరామారౌండ్: పర్యా. చిన్న రామాఫాటను, ఒకరకం చిన్న పేముకుర్చీ. (కో. 11).

చిన్నశిడిగ: పర్యా. చూ. జంట (1). వెదురుగడ కణుపులోంచి పుట్టిన కొమ్మకు రెండువైపులా పెరిగిన చిల్లలజత; మూరెడువరకు పెరిగి ఎండిపోతాయి; కొన్ని గడలకు పెద్దకొమ్మ లేకుండా ఇవిమాత్రమే పెరుగుతాయి; ఇలాటి చిల్లలు క్రమంగా కొమ్మమాదిరిగా అవుతాయి. (కో. 22).

చిన్నులి: (< చిన్న + ఉలి). ఉరువు చిన్నగా ఉన్న ఉలి; చిన్నచిల్లులు చెయ్యడానికి పనికొస్తుంది. (రా. 7).

చిప్ప: 1. వెదురుబద్దలతో అల్లినదొన్నె; మట్టిచిప్ప లాంటిది. (తె. 4); 2. పగలగొట్టిన కొబ్బరికాయలో ఒకముక్క (సగం); లోపల కొబ్బరి ఉన్నదిగాని వట్టిపెంకుగాని. (కో. 20).

చిప్పగనుపు: ఉ. గెన్పు, శిప్పగెన్పు; పర్యా. కప్పుకొమ్మ బుడుపు, గడుసుగనె, గంటిగనుపు(2), చిప్పగనె, దొడ్డుగనె, పిట్టగుంపు, పెద్దకన్నుగుంపు, పెద్దగంటుగుంపు, పెద్దగుంపు, పెద్దపెట్టగుంపు, పెద్దబల్జ, బర్రిగుంపు, బర్రెగనె, మొద్దుగనె, మోటిగనె, సిబ్బిగనె. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మనరికేసినప్పుడు కనిపించే వెడల్పు గుర్తు; కొమ్మ లావుగా ఉండడంవల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాంటి కణుపు ఉన్న వెదురుగడను చీల్చడంకష్టం. (కో. 3, 5).

చిప్పగనుపుకర్ర: ఉ. —గెన్పు—; పర్యా. పిట్టగుంపుకర్ర. పెద్దకనుపులెదురు, ముదుసుబొంగు, మొద్దుగనె బొంగు వెదురుకొమ్మ నరికేసినప్పుడు కణుపుదగ్గరపడ్డ గుర్తు. వెడల్పుగా ఉన్న వెదురుగడ; కణుపుదగ్గర పెరిగినకొమ్మ లావుగా ఉన్నప్పుడుగాని కణుపుదగ్గర చుట్టూ రెండుమూడు కొమ్మలు పెరిగినప్పుడుగాని వాటిని నరికేస్తే వెడల్పుగా గుర్తుపడుతుంది; ఈ బొంగును చీల్చడం కష్టం; కణుపుదగ్గర పేడు విరిగిపోతూంటుంది. (కో. 3).

చిప్పగనె: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలావుగా ఉండడంవల్లగాని

ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడంకష్టం. (తె. 19).

**చింపు:** (క్రి.) ఉ. శింపు, సింపు; 1. రూ. చించు; పర్యా. చూ. చీరు(1). కత్తితోనూ చేత్తోనూ విడదియ్యడం; వెదురుగడనుంచి నిలువుగా 2నుంచి 6 వరకు బద్దలుగాని బద్దనుంచి వారలు, పలుకులు, సరుములు, దాలెం (చూ.)గాని వార మొ॥వాటి నుంచి పేడుగాని కర్ర (ఈనె)గాని కత్తితో విడదీస్తారు. (కో. 30, 31); 2. తాటిరేకునుంచి 'ఈనె'ను కత్తితో చీరేయడం. (కో. 23).

**చిమ్మట:** ఉ. శిమ్మట; చేతిలోగాని కాలిలోగాని విరిగిన ముల్లు తీయడానికి వాడే చిన్న పట్టుకారు. (తె. 21).

**చిమ్ము:** (క్రి.) ఈతమండ మొదలు కొడవలితో కొట్టేయడం. (తె. 13).

**చిమ్మె:** ఉ. చిమ్మి, శిమ్మె, సిమ్మె, సిమ్మి; పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లు గర్రగానూ దోమతెర కర్రగానూ గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దానిమొదలు కణుపుకు మిగిలిఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 4-7; తె. 2; రా. 5, 8-11).

**చిరత:** ఉ. శిర్త; నాగలిని కాడికికట్టే మోకుకు చివర తొడిగిన చిన్న కర్రముక్క; రెండుచివర్లా తొడుగుతారు; దీనికి పొటొంజి (చూ.) తగిలిస్తారు. చూ. చిత్రం 129. 1. (కో. 31).

**చిలక:** వెదురుగడముక్కలతో చేసిన చిలకబొమ్మ; అలంకారానికి ఇళ్ళల్లో గోడలకు పెట్టుకొంటారు. (కో. 29).

**చిలకటు:** ఉ. శిల్కటు; పగ్గం చివరలోంచి రెండోకొన తీసి ఉచ్చులువేసిన మెలిక; దీన్ని ఎద్దు రెండు కొమ్ములకూ తొడుగుతారు. (తె. 9).

**చిలవర:** ఉ. శిల్వర; పగ్గానికి ఒక చివరఉండే ఉంగరం; దీన్ని పశువుకొమ్ముకు తొడిగి మెలిక పెట్టి కట్టేస్తారు. (తె. 9).

**చిల్మాను:** ఉ. శిల్మాను; రూ. చిల్వాను (2), సిర్మాను; పర్యా. చూ. పుల్లల తడక. వెదురుపుల్లలూ పురికోసలూ పెట్టి అల్లిన తడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (తె. 15).

**చిల్ల:** ఉ. శిల్ల, సిల్ల, సిత్తె 1. పర్యా. ఏరు[1], కెన్న; కొమ్మ, చిట్టె (2), చిమ్మె, జంట (2), జింగిడి, జిలుగు, జెడ్డ; పంగ, పిలిక, పిల్ల, మండ, రెబ్బ, లేప; శిడిగ, సింబు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్న కొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెర కర్రగానూ, గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలుకణుపుకు మిగిలి ఉంటుంది(చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువును బట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 3, 10, 12, 13, 15, 16, 18; తె. 18, 20, 22-31; 2. పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (కో. 10, 11).

**చిల్లగనె:** ఉ. శిల్ల—, సిల్ల ; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్న గుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు (తె. 10, 21, 24, 25, 28).

**చిల్లబద్ద:** ఉ. సిల్ల—; పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు ( వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 11; తె. 27).

**చిల్లబొంగు:** పర్యా. కంపచిల్లబొంగు. కణుపుచుట్టూ చిన్నచిన్న చిల్ల (కొమ్మ)లూ ఆ చిల్లలకు ఇంకా చిన్న చిల్లలూఉన్న వెదురుగడ; వంకులువంకులుగా ఉంటుంది; కంచెకట్టడానికి ఉపయోగిస్తారు. (తె. 28).

**చిల్లాడు:** (క్రి.) ఉ. శిల్లాడు; పర్యా. చిందు. దంపేప్పుడు ధాన్యం రోట్లోంచి కిందికిచెదరడం. (తె. 17).

**చిల్వాను:** ఉ. శిల్వన, శిల్వాను; 1. పర్యా. చిక్కు (2). కాసెగడ్డితోగాని వట్టివేళ్ళతోగాని కట్టిన పరదా; వేసవికాలంలో దీన్ని కిటికీలకూ గుమ్మాలకూ వరండాలకూ అడ్డంగా కడతారు; దీనిమీద నీళ్ళుచల్లితే గది చల్లబడుతుంది. (తె. 17); 2. చూ.

చిల్మాను. (తె. 10).

చివ: ఉ. శివ; పర్యా. చూ. మూలబద్ద (3). తడక, చెంద్రికతడక మొ॥ వాటికి గట్టిదనంకోసం 'X' ఆకారంలో బిగించిన బద్దల్లో ఒకటి. చూ. చిత్రం 36. క. 1. (రా. 6).

చివర: ఉ. శివర, సివర, సివారు. 1. పర్యా. చూ. కొస (7). వెదురుగడ చివరి సన్నటిభాగం (కో. 9-12, 16-29; తె. 29-31). 2. తాకెకు (= రేకు) చివరిభాగం; సన్నగా కొంచెం మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 124. 1. (కో. 23, 26); 3. తాటీనె చివరిభాగం. (కో. 12); 4. పర్యా. చూ. కొస (8). ఈతకమ్మ చివరి సన్నటిభాగం. చూ. చిత్రం 11. 7. (కో. 25); 5. పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి, మొ॥ పట్టుకొనే కర్రలాంటిభాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తొడిమెమాదిరిగానూఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 12 క. 1. (కో. 19, 25, 29); 6. పర్యా. చూ. మక్కు (2). అంటు (చూ.) పడగ చివరికోసు. చూ. చిత్రం 15 క. 2. (తె. 31).

చివరి ఆకు: ఈతమట్ట చివరిభాగంనుంచి తీసిన ఈతాకు (తె. 26).

చివరిబద్దమేదరి. వెదురుగడను పైకొసనుంచి చీరే ఆచారమున్న మేదర్లు. (తె. 30).

చివ్వ: ఉ. సివ్వ; చూ. చువ్వ (1). (రా. 4).

చీడు: ఉ. శీడు, సీడు. 1. చూ. కీడు. (కో. 24). 2. చూ. చీరు (1). (కో. 3, 4; తె. 12).

చీపురు: ఉ. శీపురు, సీపురు; పర్యా. చీపురుకట్ట. పొరక. ఇల్లూవాకిలీ మొ॥ ఊడ్చుకోడానికి సన్నటి పుల్లలతోగాని (ఈనెలతోగాని), ఒకరకం గడ్డితో గాని, మండలతోగాని కట్టినకట్ట; ఇల్లు ఊడ్చుకో డానికి కొన్నిచోట్ల మొదెంగడ్డి, నునుగడ్డి మొ॥ వాటితోను, వాకిలి ఊడ్చుకోడానికి వెంపలి మొక్కలు మొ॥వాటితోను, కళ్ళం ఊడ్చుకోడానికి కందిమండలు మొ॥వాటతోను కడతారు, గడ్డిచీపురు పిడి గుండ్రంగాను, వెంపలిచీపురు, కందిమండల చీపురు మొ॥వాటి పిడి కొంచెం పలకగాను ఉంటుంది; వెంపలిచీపురు, కందిమండల చీపురు ఊడ్చేవైపు వెడల్పుగా ఉంటుంది; చూ. చిత్రం 142. (కో; తె; రా.)

చీపురుకట్ట: పర్యా. చూ. చీపురు. ఇల్లూవాకిలీ మొ॥ ఊడ్చుకోడానికి సన్నటి పుల్లలతోగాని (ఈనెలతోగాని), ఒకరకం గడ్డితోగాని, మండలతోగాని కట్టిన కట్ట; ఇల్లు ఊడ్చుకోడానికి కొన్నిచోట్ల మొదెం గడ్డి, నునుగడ్డి మొ॥వాటితోను, వాకిలి ఊడ్చుకోడానికి వెంపలిమొక్కలు మొ॥వాటితోను, కళ్ళం ఊడ్చుకోడానికి కందిమండలు మొ॥వాటితోను కడతారు; గడ్డిచీపురుపిడి గుండ్రంగాను, వెంపలి చీపురు, కందిమండలచీపురు మొ॥వాటిపిడి కొంచెం పలకగాను ఉంటుంది; వెంపలిచీపురు, కందిమండల చీపురు ఊడ్చేవైపు వెడల్పుగా ఉంటుంది; (కో. 19).

చీమకాటు: ఉ. సీమ—; పర్యా. చీమనాకుడు, చీమనాటు, చీమపొక్కు. వెదురుగడ లేతగా ఉన్నప్పుడు చీమలుచేసిన బెజ్జం; బెజ్జా లున్నచోట చీలిస్తే పేడు విరిగిపోతుంది. (కో. 6, 11).

చీమకాటుకర్ర: ఉ. శీమ—; పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగువచ్చిన వెదురుగడ. (కో. 3).

చీమకాటుబొంగు; ఉ. శీమ—; పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగు వచ్చిన వెదురుగడ. (కో. 2, 5).

చీమకాట్లుబొంగు: ఉ. శీమ—; పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగు వచ్చిన వెదురుగడ. (కో. 7).

చీమకొరుకుడుబొంగు: ఉ. శీమ—; పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపు రంగువచ్చిన వెదురుగడ. (తె. 22).

చీమతారుకర్ర: ఉ. శీమ—; పర్యా. చూ. చీమపోటు బొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగువచ్చిన వెదురుగడ. (కో. 22).

చీమనాకుడు: పర్యా. చూ. చీమకాటు. వెదురుగడ లేతగా ఉన్నప్పుడు చీమలుచేసిన బెజ్జం; బెజ్జాలున్న చోట చీలిస్తే పేడు విరిగిపోతుంది. (తె. 4),

చీమనాటు: పర్యా. చూ. చీమకాటు. వెదురుగడ లేతగా ఉన్నప్పుడు చీమలుచేసిన బెజ్జం; బెజ్జాలున్న చోట చీలిస్తే పేడు విరిగిపోతుంది. (కో. 14).

చీమపుప్పికర్ర: పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగు వచ్చిన వెదురు గడ. (కో. 29).

చీమపొక్కు: పర్యా. చూ. చీమకాటు. వెదురుగడ లేతగా ఉన్నప్పుడు చీమలుచేసిన బెజ్జం; బెజ్జాలున్న చోట చీలిస్తే పేడు విరిగిపోతుంది. (తె. 27).

చీమపోటుకర్ర: ఉ. చీంపోటు—; సీంపోటు—;

పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందు వల్ల నలుపురంగువచ్చిన వెదురుగడ. (కో. 28).

చీమపోటుబొంగు: ఉ. శీమపోటు –; శింపోటు—, సింపోటు—; పర్యా. గండుచీమకాటుబొంగు, చీమకాటుకర్ర, చీమకాటుబొంగు, చీమకాట్లబొంగు, చీమకొరుకుడుబొంగు. చీమతారుకర్ర, చీమపుప్పుకర్ర, చీమపోటుకర్ర, చీమపోటువెదురు, చీమలకర్ర, రేలెబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగు వచ్చిన వెదురుగడ. (రా. 6-8, 10, 11).

చీమపోటువెదురు: ఉ. శింపోటెదురు; పర్యా. చూ. చీమపోటు బొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపు రంగువచ్చిన వెదురుగడ. (కో. 1).

చీమలకర్ర: పర్యా. చూ. చీమపోటుబొంగు. చీమలు కొట్టినందువల్ల నలుపురంగువచ్చిన వెదురుగడ. (కో. 25).

చీరిక: ఉ. శీరిక; పర్యా. చూ. పలుకు (2). సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా బద్దవెడల్పులో సగానికిచీల్చిన భాగం (గడలో ఎనిమిదోభాగం); దీన్నుంచి పేడు తీస్తారు; వేలెడు వెడల్పు ఉంటుంది. (రా. 7).

చీరు: (క్రి.) ఉ. శీరు, సీరు; **1.** రూ. చీడు (2). పర్యా. చింపు (1), చీర్చు, మట్టుపోంద్రతీయు. కత్తితోనూ చేత్తోనూ విడదియ్యడం; వెదురుగడ నుంచి నిలువుగా 2 నుంచి 6 వరకు బద్దలుగాని వారలు, పలుకులు సరుములు, దాలెం (చూ.) గాని, వార మొ॥ వాటినుంచి పేడుగాని కర్ర (ఈనె)గాని కత్తితో విడదీస్తారు. (కో. 28; తె. 3-5, 9, 10, 13-17, 21, 22, 24-28, 30); **2.** ఒత్తిన (చూ. ఒత్తు) ఈతమట్టనుంచి ఒక్కొక్క చీలికను పట్టుకొని నారతీయడం; మట్ట మొదటిభాగాన్ని కాలి బొటనవేలికింద అదిమిపట్టి ఒక్కొక్క చీలికను కుడిచేతి బొటనవేలితోనూ చూపుడువేలితోనూ పట్టుకొని మట్టచివరికంటా లాగుతారు; చీలిక ముందుకు పోయేకొద్దీ చీలికవెంబడి మట్టను ఎడంచేత్తో పైకెత్తుతూ నార తీస్తారు. (తె. 9); **3.** పర్యా. చీల్చు (2). ఈతబరిగెను రెండుమూడు పాయలుగా నిలువుగా కత్తితో కొయ్యడం. (తె. 7, 9, 11, 13, 14, 16).

చీర్చు: ఉ. శీర్చు; పర్యా. చూ. చీరు (1). కత్తితోనూ చేత్తోనూ విడదియ్యడం; వెదురుగడనుంచి నిలువుగా 2 నుంచి 6 వరకు బద్దలుగాని, బద్దనుంచి వారలు, పలుకులు, సరుములు, దాలెం (చూ.) గాని, వార మొ॥ వాటినుంచి పేడుగాని కర్ర (ఈనె)గాని కత్తితో విడదీస్తారు. (కో. 26, 27; తె. 8).

చీర్నం: ఉ. శీర్నం, సీర్నం; పర్యా. ఉలి. సుమారు రెండువేళ్ళ వెడల్పు చిటికెనవేలుకన్న తక్కువ మందమూ రెండుబెత్తల పొడుగూ ఉండే ఇనప కమ్మికి ఒకవైపు కొయ్యపిడి అమర్చిఉన్న పని ముట్టు; కొన్నిటికి పిడి ఉండదు; వెడల్పుగా ఉన్న వైపు పదునుంటుంది; వీటిలో పెద్దవీ చిన్నవీ ఉంటాయి; వెదురుగడలతో నిచ్చెనలూ మంచాలూ మొ॥ చేసేటప్పుడు గడకు చిల్లి చెయ్యడానికి మేదరి వాళ్ళు వాడతారు; చూ. చిత్రం 20 క, చ.

చేలగనెబొంగు: ఉ. శీల ; పేడు చీల్చేటప్పుడు కణుపు కణుపుకూ విరిగే వెదురుగడ. (తె. 22).

చీల్చు: (క్రి.) ఉ. శీల్చు, సీలుసు, సీల్సు. **1** వెదురు గడ మొ॥వాటిని నిలువుగా పాయలుగా విడదియ్యడం; కత్తితో విడదీస్తారు. (కో. 1, 2, 5-11, 19, 23; తె. 6-9, 27; రా. 2-5, 8-11); **2.** పర్యా. చీరు (3). ఈతబరిగెను రెండుమూడు పాయలుగా నిలువుగా కత్తితో కొయ్యడం. (కో. 3; రా. 8, 9).

చుంచు: ఉ. సుంచు; పెళ్ళిబాసికానికి వేలాడదీసే రంగుకాయితం; డిజైన్లు ఉంటాయి. చూ. చిత్రం 103.2 (తె. 6).

చుట్ట: ఉ. సుట్ట; **1.** పర్యా. అడుగుచుట్ట. వెదురుగుల్ల అడుగున వెలుపలినుంచి ఉబ్బెత్తుగా వెదురుకర్ర (=తీగలాంటిది) చుట్టి వేసినకట్టు. (తె. 21, 24); **2.** గుండ్రంగా చుట్టిన ఈతాకుపట్టె; పట్టె కొంత పొడుగు అల్లినతరవాత పట్టుకోడానికి వీలుగా ఇలా చుడతారు. (తె. 21, 22); **3.** దుసేరు తీగలచుట్ట; గుండ్రంగా చుడతారు. (తె. 9).

చుట్టకపీనె: (< చుట్టకపు+ఈనె). పర్యా. చూ. చుట్టు కర్ర. గంప, బుట్ట, తట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తుభాగం అల్లడానికి వాడేకర్ర. (చూ.); పేడు వెడల్పులో సగముంటుంది; పేడుకన్న మందంగా ఉంటుంది. (కో. 7).

చుట్టకమీనె: ఉ. సుట్టకంపీనె; పర్యా. చూ. అడిపోగు (1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కింది పేడును రెండుభాగాలుగా నిలువుగా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (రా. 5).

చుట్టకంపేడు: ఉ. సుట్కం—; పర్యా. చూ. చుట్టు

కర్ర. గంప, బుట్ట, తట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తుభాగం అల్లడానికి వాడేకర్ర (చూ.); పేడు వెడల్పులో సగముంటుంది; పేడుకన్న మందంగా ఉంటుంది. (కో. 6).

చుట్టకుదురు: కుండలు, బిందెలు మొ॥పాత్రలు పెట్టడానికి వెదురుచువ్వలతో చేసిన కడియం. (కో. 9, 19).

చుట్టీనె: (< చుట్టు + ఈనె). ఉ. చుట్టీన, పర్యా. చూ. చుట్టుకర్ర. గంప, బుట్ట, తట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తుభాగం అల్లడానికి వాడేకర్ర (చూ.); పేడు వెడల్పులో సగముంటుంది; పేడుకన్న మందంగా ఉంటుంది. (కో. 16).

చుట్టు: (క్రి.) ఉ. సుట్టు; పర్యా. తింపు (2). ఈత గంప మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ ఒక నిలువువదిలి మరొక నిలువుచుట్టూ ఈతబద్ద చుట్టడం (కో. 25; తె. 11, 13; రా. 9).

చుట్టుకర్ర: పర్యా. అల్లకమీనె (1), అల్లకంపేడు (2), ఈనె (4), చుట్టకమీనె, చుట్టకంపేడు, చుట్టీనె. గంప, బుట్ట, తట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తు భాగం అల్లడానికి వాడేకర్ర (చూ.); పేడు వెడల్పులో సగముంటుంది; పేడుకన్న మందంగా ఉంటుంది. (తె. 4).

చుట్టుకాలు: ఉ. సుట్టు-; చుట్టూ తీగతో అల్లిన పేముకుర్చీకాలు. (కో. 12).

చుట్టుగట్టుకర్ర: ఉ సుట్టు-; పర్యా. చూ. కర్ర (2). చేట అంచు కట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒకబద్దా, వెలుపలినుంచి ఒక బద్దాపెట్టి ఈ రెంటిమీది నుంచి, ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్లు సందును మూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్రపెట్టిన తరవాత కట్లు కడతారు. (తె. 9).

చుట్టుగర్ర: ఉ. సుట్టు-; పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగంవెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (తె. 20).

**చుట్టుతడక: ఉ. సుట్టుతడ్క-; పైన నిలువుబద్దలూ అడ్డంబద్దలూ లేకుండా పేడుతో అల్లిన వెదురు తడక; చుట్టచుట్టడానికి వీలుగా ఉంటుంది;** గదుల మధ్య అడ్డంకట్టుకోడానికీ పందిళ్ళమీద పరుచుకోడానికీ పనికొస్తుంది. (తె. 7).

చుట్టుపాసిక: ఉ. సుట్టు-; పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చంద్రిక మొ॥వాటి నిలువులచుట్టూ అడ్డంగా అల్లే మందం పేడు లేదా పలచటిబద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (కో.30).

చుట్టుపూలపంకా: ఉ. సుట్టు—; చుట్టూ పూల డిజైను వచ్చేటట్లు అల్లిన విసనకర్ర. (తె. 14).

చుట్టుబద్ద: ఉ. సుట్టు—; 1. పర్యా. చూ. అడ్డం, తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చంద్రిక మొ॥వాటి నిలువులచుట్టూ అడ్డంగా అల్లే మందం పేడు లేదా పలచటిబద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (తె. 23). 2. పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంత బుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచికట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికి వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 26).

చుట్టూరుగా: (క్రి. విశ.) ఉ. సుట్టురాగ; పర్యా. అరుగోలె. చుట్టూరా (గుండ్రంగా); జల్లెడ చుట్టూరా కట్టు (బద్ద)పెట్టి బిగిస్తారు. (తె. 22).

చురకత్తి: ఉ. సుర్—, సుర—, సొర—; రూ. సూరకత్తి; చిన్న ఇనపకత్తి; అల్లకంలో మిగిలిన పేళ్ళు తెంపేయడానికీ, అల్లేటప్పుడు ఒకపేడు అయిపోతే మరోపేడు పెట్టడంకోసం అక్కడ తెరిచి ఉంచడానికీ చేట, జల్లెడ మొ॥ అంచు కట్టేటప్పుడు చిల్లులు పొడవడానికీ పేళ్ళు చీల్చడానికీ పనికొస్తుంది; కొన్నిటికి కత్తెపిడి ఉంటుంది; కొన్నిటికి రేకునే గొట్టంలా వంచుతారు; కొన్నిటికి పిడిలేకుండా కొన ఉంటుంది; చూ. చిత్రం 16 క, వ. (కో. 2; తె. 1, 2, 30, 31; రా. 11).

చులాగ్గా: (క్రి. విశ.) ఉ. సులాగ్గా; పలచగా; తేలికగా; వెదురుపేడుగాని బద్దగాని మందంగా లేనప్పుడు ఇలా అంటారు. (కో. 27).

చువ్వ: ఉ. సువ్వ; రూ. చివ్వ; 1. పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికిలోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (తె. 1); 2. పర్యా. చూ. కర్ర (3).

గోవ (వార)నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (కో. 11; తె. 31); 3. పర్యా. వెదురుచువ్వ. సన్నగా పొడుగ్గా ఉండే ఒకరకం వెదురుపేడు. (కో. 18). 4. పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (కో. 13); 5. పర్యా. చూ. బరిగె (1). సుమారు వేలెడు లావుండే డ్డీలాంటి పొడుగాటిపుల్ల; ఈత, పుల్చేరు మొ॥ చెట్ల నుంచి ఊడుగు మొ॥ పొదలనుంచి దీన్నితీస్తారు; ఈతకమ్మ మధ్యకర్ర (రెండుపక్కలా ఆకులు వేసేది) బండిజల్ల, పిల్లలపొది, తట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 7, 9).

**చూపు:** పర్యా. చూ. ముక్కు(2). అంబు(చూ.) పడగచివరి కోసు. చూ. చిత్రం 15 క. 2. (రా. 6).

**చూపుచాప:** ఉ. సూపుసాప; పర్యా. చూ. పుల్లలతడక, వెదురుపుల్లలూ పురికోసలూ పెట్టి అల్లిన తడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ చిత్రం 93. (కో. 28).

**చెక్క:** ఉ. సెక్క. 1. పర్యా. ఒప్పు(1), ఒడ్క(2), కమ్మ(1), కమ్మచెక్క, తవ్వె, దబ్బ(2), పక్క(1), పచ్చె(1), పెచ్చు, బిత్తం, బొంగువంక, వక్క(1), వార(1), వెదురుగమ్మ, సగంపచ్చె. వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒక భాగం. (కో. 8, 13, 15–17, 20, 23–25, 28, 29; తె. 6, 7, 27, 30); 2. పర్యా. చూ. బద్ద(1). వెదురుగడనిలువుగా నాలుగుభాగాలుగా చీలిస్తే వచ్చే భాగం; గడంతపొడుగునా సుమారు రెండువేళ్ళ వెడల్పు ఉంటుంది. (తె. 5); 3. పర్యా. చూ. తోపుడుపీట. గీకడానికి తలబందమట్టపరిచే పొడుగాటి కొయ్యపీట. (కో. 3); 4. తలబంద మట్టగీకడానికి ఇనపరేకు బిగించిన కొయ్యచెక్క; తోపుడుపీట మీద మట్టపరిచి దీంతో గీకితే మట్టకుండే పసరుపదార్థం రాలిపోతుంది. (రా. 6); 5. పర్యా. తొక్కుడుచెక్క. అనిపైకీ కిందికీ మారడానికి చాపనేతమగ్గం కిందిగుంటలో అమర్చిన చెక్క; వెనక అచ్చు కిందినుంచి వచ్చేతాడు దీనికి కడతారు; ఇలాటివి రెండు ఉంటాయి. చూ. చిత్రం 120 చ. 1. (రా. 2).

**చెక్కదీయు:** (క్రి.) పర్యా. చూ. కరిపించు (2). పేడు చీరేటప్పుడు వార ( వేలెడువెడల్పు బద్ద) లేదా పలుకు మొదటిభాగంలో ఒకంగుళం పొడుగు వరకు వరసగా పేళ్ళుచీరి ఉంచడం; కొత్తగా పని నేర్చుకొనే వాళ్ళకు ఇలా చీరి ఇస్తారు; ఆ తరవాత బద్ద చీరడం సులువవుతుంది. (కో. 23).

**చెక్కిలి:** ఉ. శెక్కిలి; పర్యా. కుతికె (2). అంబు (చూ.) కాడకు పడగ కలిసిన భాగం. చూ. చిత్రం 15. క. 2.

**చెక్కు:** (క్రి.) ఉ. సెక్కు; 1. పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపులదగ్గరి కొమ్మలనుగాని మొనదేలిఉన్న ముక్కలనుగాని బొడుపులనుగాని సమానంగా కత్తితో చెక్కుతారు. (కో. 1–4, 13, 19, 27, 28). 2. పర్యా. గీయు(1). వెదురుబద్దగాని పేడుగాని కర్ర (=తీగలాంటి సన్నటి వెదురుచువ్వ) గాని కత్తితోగాని నున్నగా గీకడం. (తె. 17; రా. 2–4, 11). 3. పర్యా. చూ. మలుచు (2); అల్లకం పూర్తయినతరవాత (గంప మొ॥ వాటికి) మిగిలిన నిలువులను లోపలివైపు వంచి అంచు లోపలికిదోపడం (తె. 11, 13). 4. పర్యా. చూ. దోపు (2). దూర్చడం; గంప, తడక మొ॥ వాటి అల్లకంలో అంచుదగ్గర మిగిలిన నిలువులను వెనక్కిమడిచి అంచు లోపలికి దూరుస్తారు. (కో. 22; తె. 13, 16, 17; రా. 8).

**చెక్కుపేళ్ళు:** ఉ. సెక్కువేళ్ళు; వక్కాకుబుట్ట ఎత్తు భాగానికి మధ్యలో బయటినుంచి 'X' ఆకారం డిజైనుకోసం దోపే వెదురుపేళ్ళు. చూ. చిత్రం 69 చ. 3. (రా. 3).

**చెక్కెయు:** పర్యా. చూ. గీయు (1). వెదురుబద్దగాని పేడుగాని కర్ర ( తీగలాంటి సన్నటి వెదురుచువ్వ)గాని కత్తితో నున్నగా గీకడం. (తె. 17).

**చెక్రంగా:** (క్రి. విశే.) పర్యా. చూ. గోలుగా, గుండ్రంగా; జల్లెడ అడుగును గుండ్రంగా కత్తిరిస్తారు; ఈతగంప మొ॥ అల్లేటప్పుడు నిలువుల్ని చక్రాకారంగా పరుస్తారు. (తె. 20).

**చెక్రం:** 1. పర్యా. చూ. కర్ర (4). జల్లెడ అంచు

కట్టడానికి లోపలిగుండు, బిలుకు (వెలుపలిబద్ద)ల మీంచి, ఆ రెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూవేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పు బద్ద (కో. 16, 19); 2. మూసగంప ఎత్తుకోసం వంచినతరవాత పాసికాలు (నిలువులు) కిందికి వాలకుండా సరిగా ఉండడానికి తొడిగే వెదురుబద్ద కడియం (కో. 19). 3. శవాన్ని మోసే పాడెకు ముందు ఉట్టి (చూ.)ని మోసేవాడు పట్టుకువెళ్ళేది; ?శ్మశానానికి నిప్పులకుండ తీసుకువెళ్ళడానికి గుండ్రంగా బిగించిన వెదురుబద్దల చట్రం; దీనిమీద కుండపెట్టి దీనికి కట్టినతాళ్ళు పట్టుకొంటారు. చూ. చిత్రం 98. (కో. 2).

చెటాయించు: (క్రి.) ఉ. శెటాయించు; పర్యా. కోయు. కత్తితోగాని కొడవలితోగాని నరకడం. (తె. 16).

చెట్టుబుట్ట: ఉ. శెట్టు—; సెట్టు—; పర్యా. చెట్లపొది. పెరిగే చెట్టుకు పశువుల్నించి రక్షణకోసం చుట్టూ పాతిన వెదురుబద్దలగుమ్మి; గాలి తగలడానికివీలుగా జాలితడకలా ఉంటుంది; చూ. చిత్రం 86. (కో. 5, 9, 10; తె. 8, 31).

చెట్టుమగ్గం: ఉ. సెట్టు ; తుంగ, జమ్ముచాపలు నేసే ఒకరకం మగ్గం; దోనిమాను, నూలుమాను, ఉళ్ళకట్ట మొ॥ ఉంటాయి; నేతగాడు కూర్చునే చోటికి ఎదురుగా గుంటచేసి అందులో రెండు చెక్కలు అమరుస్తారు; అవి తెరుచుకోడానికి ఒక సారి ఒక చెక్కను తొక్కినప్పుడు ఉళ్ళకట్ట కిందికి వస్తుంది; ఇంకోసారి ఇంకో చెక్క తొక్కినప్పుడు ఇంకా ఉళ్ళకట్ట కిందికివస్తుంది; మగ్గంతాళ్ళు వేలాడ దీయడానికి పైన పందిరిలా ఉంటుంది; చూ. మగ్గం (రా. 2).

చెట్లగుమ్మి: ఉ. శెట్ల , సెట్టు ; మొక్కల కాపుదలకోసం చుట్టూపెట్టడానికి అల్లిన ఈతగుమ్మి (చూ.); ఎండా గాలీ తగలడానికి గళ్ళుగళ్ళుగా అల్లుతారు. (తె. 9, 11, 14).

చెట్లపొది: పర్యా. చెట్టుబుట్ట. పెరిగేచెట్టుకు పశువుల్నించి రక్షణకోసం చుట్టూపాతిన వెదురుబద్దల గుమ్మి; గాలి తగలడానికి వీలుగా జాలితడకలా ఉంటుంది; చూ. చిత్రం 86. (తె. 26).

చెండ్లజమ్ము: ఉ. శెండ్ల—; వెన్ను లావుగా పెరిగి దానికి చివర బంతి (చెండు)మాదిరి పువ్వు పెరిగే జమ్ము (చూ.); పెళుసుగా ఉంటుంది; చాపల అల్లకానికి పనికిరాదు. (రా. 10).

చెత్త. ఉ. శెత్త, సత్త; 1. పర్యా. చూ. పీచు (1). వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగా ఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు. (తె. 16; రా. 8). 2. పర్యా. చూ. తుక్కు. వెదురుబద్దలూ పేడూ చీల్చేటప్పుడు వచ్చే పుల్లల్లాంటి చిన్న చిన్నముక్కలు; పొయ్యిలోకి పనికొస్తాయి. (కో. 3, 30).

చెత్తబుట్ట: ఊడ్చినచెత్త, చిత్తుకాయితాలు మొ॥ వేసుకొనే బుట్ట. (కో. 3).

చెనిగిత్తుచిల్ల: ఉ. శెనిగిత్తుశిల్ల; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (తె. 23).

చెనిగిత్తుచిల్లబొంగు ఉ. శెనిగిత్తుశిల్ల—; పర్యా. చూ. పూసగనుపుకర్ర. కొమ్మ నరికేసినప్పుడు కణుపుదగ్గర చిన్నగుర్తుపడే వెదురుగడ; కణుపు దగ్గర పెరికే కొమ్మ సన్నగా ఉండడంవల్ల దాన్ని నరికినప్పుడు సన్నటిగుర్తు పడుతుంది; దీన్ని చీల్చడం సులువు. (తె. 23).

చెంద్రదంగి: చూ. చెంద్రిక. (రా. 2).

చెంద్రదంగితట్ట: పర్యా. చూ. రేషంతట్ట. పట్టుపురుగులనుగాని పట్టుకాయ (= పట్టుపురుగుచుట్టూ కాయ మాదిరిగా ఏర్పడ్డ దారాలు)నుగాని తీసుకువెళ్ళేతట్ట; రెండుబెత్తల ఎత్తూ గజంవెడల్పూ ఉంటుంది; చూ. చిత్రం 81. (రా. 2).

చెంద్రిక: ఉ. చెంద్రిక, చెందిరిక; రూ. చెంద్రదంగి, చెంద్రింక; పర్యా. చెంద్రికేసు, పట్టుచెంద్రిక, రేషంపంకె. పట్టుపురుగుల గుడ్లు పొదగడానికీ పురుగుల్ని పెంచడానికీ గుండ్రంగా అరలరలుగా ఉన్న ఒకరకం తడక; చూ. చిత్రం 82 (కో. 15, 27; తె. 6, 28; రా. 1).

చెంద్రికతడక: ఉ. చెందిరికతడ్క; పర్యా. పట్టు తడక. చెంద్రిక (చూ.) పువ్వు అమర్చడానికి కిందవేసిన తడక. చూ. చిత్రం 82.3 (తె. 28).

చెంద్రికపట్టె: ఉ. చెందిరిక—; చెంద్రిక (= పట్టు పురుగులు పొదగడానికి అల్లినది) తడకమీద గుండ్రంగా పువ్వులా అమర్చడానికి వెదురు పేళ్ళతో పొడుగ్గా అల్లినపట్టీ; పదినుంచి ఇరవై గజాల పొడుగు ఉంటుంది; బెత్తెడు వెడల్పు

ఉంటుంది; ఖానాలు ఖానాలుగా అల్లుతారు; చూ. చిత్రం 83. (తె. 23).

చెంద్రికపువ్వు: ఉ. చెందిరిక—; పర్యా. పువ్వు(1). చెంద్రిక (=పట్టుపురుగుల గుడ్లు పొదగడానికి అల్లినది) తయారీలో తడకమీద గుండ్రంగా పువ్వు ఆకారంలో కొన్ని వరసలుగాచుట్టి అమర్చిన పట్టీ; వెదురుపేడుతో అల్లుతారు; బె త్తెడు ఎత్తు ఉంటుంది; వరసవరసకూ మధ్య బె త్తెడు ఎడముంటుంది; పట్టు పురుగులు వీటిలో పెరుగుతాయి. చూ. చిత్రం 82.1 (తె. 23; రా. 1).

చెంద్రికేసు: ఉ. సెంద్రి—; పర్యా. చూ. చెంద్రిక. పట్టుపురుగుల గుడ్లు పొదగడానికీ పురుగుల్ని పెంచ డానికీ గుండ్రంగా అరలరలుగా ఉన్న ఒకరకం తడక; చూ. చిత్రం 82. (కో. 23).

చెంద్రింక: (< చెంద్రవంక) చూ. చెంద్రి. (రా. 2, 6).

చెన్న: ఉ. శెన్న; ఏటవాలుగా కప్పే ఇంటికి వెన్న దూలం అమర్చే గోడకు శిఖరభాగం. (తె. 23)

చెన్నతడక: ఉ. శెన్న—; పర్యా. చూ. క్రాస్‌తడక, త్రిభుజాకారంలో ఉండేతడక; తడకలతో కప్పే ఇంటికి కప్పువేపు త్రిభుజాకారం వచ్చేపక్క దీన్ని కడతారు; చూ. చిత్రం 37. (తె. 23).

చెపురతడక: ఉ. శపురతడక; సాయమాను (=వాలు కప్పుగల పాక)ను కట్టే వెదురుతడక; ఇంటికప్పు ఒకవైపు దీంతో కప్పుతారు; ఒకవైపు వెడల్పు తక్కువగాను మరోకవైపు ఎక్కువగాను ఉంటుంది. (తె. 23),

చెమ్మముల్లు: ఉ. శెమ్మ—; పర్యా. చూ. దవడముల్లు. ఈతమట్ట మొదటిభాగంలో ఉండేముల్లు; దబ్బనంలా ఉంటుంది. చూ. చిత్రం 10. 1. (తె. 20).

చెంప: ఉ. శెంప, సెంప; 1. పర్యా. చూ. దబ్బ(9). ఈతకమ్మ నిలువుగా రెండుమూడు పాయలు చీరి తీసిన భాగం. (తె. 20); 2. తాటికమ్మ వెడల్పు భాగం. (కో. 26).

చెంపెడు: ఉ. శెంపెడు; బెత్తెడుకొలత. (తె. 21).

చెంబు: వెదురుపుల్లల (తీగల్లాంటి సన్నటి ఈనెల)తో అల్లిన చిన్నబుట్ట; చెంబులా ఉంటుంది; చూ. చిత్రం 89. (కో. 29; తె. 4).

చెయుపిడి: ఉ. సెయుపిడి; కలబందమట్టను చితగ్గొట్టి గూటం పట్టుకోడానికి ఉన్నపిడి. (రా. 5).

చెయిసంచి: ఉ. చెయ్—; గుడ్డతోకుట్టి పైఅంచుకు వెదురుబద్దలు అమర్చిన సంచి; పట్టుకోడానికి కూడా బద్దలు(కమాను) అమరుస్తారు; చేతిసంచి చూ. చిత్రం 96. (తె. 10).

చెరుకునిచ్చెన: ఉ. చెర్కు—; చెరుకుగడలు గాలికి వంగి విరిగిపోకుండా కొన్ని చెరుకుగడల కొసలు కలిపికట్టడానికి వేసుకొనే నిచ్చెన; ఆధారంలేకుండా దానంతట నిలబడడానికి వెనకవైపు ఆనుగొయ్య ఉంటుంది. (తె. 16).

చెరుకువాసం: 1. పర్యా. కొయ్య(2), చెరుకొయ్య. చెరుకుతోటల్లో మొక్కకు ఆనుగా పెట్టడానికి ఉపయోగపడే లావుపాటి వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 15, 21); 2. ఉ. చెర్కు—; చెరుకులా తీపి ఉండడంవల్ల తొందరగా పుచ్చిపోయే వెదురుగడ. (తె. 7).

చెరుకొయ్య: పర్యా. చూ. చెరుకువాసం(1). చెరకుతోటల్లో మొక్కకు ఆనుగా పెట్టడానికి ఉపయోగపడే లావుపాటి వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 25).

చెర్లకోలచెండు: ఉ. శెర్లకోల—; కొరడాకర్ర (చెర్ల కోల)కు పేలాడే తాడు; డిజైన్లుగా చిక్కుచిక్కుగా అల్లుతారు; దీనికోసకు తోలుముక్కలు కడతారు. (తె. 9).

చెలకమేదరి: ఉ. సెల్క—; మేదరిపని చేసేవాళ్ళలో ఒకతెగ. (తె. 30).

చెలమొుట్టు: (< చెలము+మొుట్టు) వాగులో చెలమ తీసి అది పూడిపోకుండా చెలమచుట్టూ గట్టిగా దడిలా ఉండేటట్లు అందులోకి దింపడానికి వెదురు పేళ్ళతో అల్లినది; పొడుగాటి గంపలా ఉంటుంది; అడుగుండదు; రెండువైపులా ఖాళీగా ఉంటుంది; లోపలినుంచి పేడుతోఅల్లి వెలుపలినుంచి బద్దలు వేస్తారు; చూ. చిత్రం 90. (కో. 29).

చెలిగేయు: (క్రి.) రూ. చెలిపేయు; పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపుల దగ్గరి కొమ్మలనుగాని మొనదేలి ఉన్న ముక్కలను గాని బొడుపులనుగాని సమానంగా కత్తితో చెక్కుతారు. (తె. 18).

చెలిపేయు: (క్రి.) చూ. చెలిగేయు. (కో. 24).

చెలుగు. ఉ. శెల్గు, సెరుగు, సెలుగు, సెల్గు; 1. రూ. చెలుపు; పర్యా. గీకు(1), గీయు(2), చెక్కు(1), చెలిగేయు, జివురు, దెక్కు, మట్టగించు, కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపుల దగ్గరి కొమ్మలను గాని మొనదేలిఉన్న ముక్కలనుగాని బొడుపులను గాని సమానంగా కత్తితో చెక్కుతారు. (కో. 1.

3, 5, 11, 12; తె. 4, 7, 9, 11, 13-15, 18, 20, 24, 25; రా. 3, 11).

చెలుపు: (క్రి.) ఉ. చెల్పు, సెలుపు; చూ. చెలుగు (తె. 6, 8, 21, 22, 28, 29).

చెవితాడు: ఉ. శెవుతాడు; మోటబావి బొక్కెనకుండే తొండంచెవి (ఇలాటివి రెండుంటాయి) నుంచి తొండంతొడుకు కట్టేతాడు; ఈతనారతోగాని తాటి నారతోగాని పేంతారు. (తె. 9).

చెవులకట్టె: చెవులమాదిరి గుర్తులున్న వంకరకర్ర; వేళ్ళతోసహా పీకిన వెదురుకర్రకు వంపుదరిగిన భాగంలో ఇలాటి గుర్తులుంటాయి. (తె 22).

చెవులు: (బహు.) పర్యా. వంకెచెవులు. వంకె నిర్మాణంలోని 'X' ఆకారానికి పైభాగం. చూ. చిత్రం 14 చ. 2. (కో. 24).

చేగపట్టు: ఉ. శాగ—; తుంగ (ఖమ్మ) చాపనేతకో నిలువుకు అవసరమైన నారపోగులు తీసే చేగ మొక్కమట్ట. (రా. 10).

చేగంప: ఉ. సేగంప; చేతిగంప. (కో. 12).

చేట: ఉ. శాట, శేట, సాట, సేట; పర్యా. ఏతి. ధాన్యం మొ॥ చెరుక్కోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; దోసిలి ఆకారంలో ఉంటుంది; ఎత్తుగా ఉన్నవేపుకన్న రెండోవేపు వెడల్పు ఎక్కువ ఉంటుంది; చూ. చిత్రం 28. (కో. తె. రా).

చేటకట్టు: (క్రి.) ఉ. శాట—; 1. పర్యా. అంచుగట్టు (2), కట్టుగట్టు. చేట అల్లకంలో అంచుచుట్టూ లోపలినుంచి ఒకబద్దా (లోగట్టు) బయటినుంచి ఒకబద్దా (బయటికట్టు)పెట్టి ఆ రెంటిమధ్యా ఒక చువ్వ (చూ. కర్ర) ఇరికించి కట్టుముంగు (=పలచటిపేడు లేదా తీగ)తో కట్లువేసి బిగించడం; చేట, జల్లెడ, మొంతె మొ॥వాటికి ఇలా బిగిస్తారు. (కో. 15, 18, 20; తె. 28; రా. 5); 2 పర్యా. చేటకట్టుబద్ద, చేటబద్ద. చేట అంచుచుట్టూ లోపలి నుంచి బయటనుంచి వేసే రెండువేళ్ళ వెడల్పుబద్ద. (కో. 18, 23, 28, 31; తె. 24; రా. 2).

చేటకట్టుకొట్టు: (క్రి.) చేట అంచు కట్టడానికి వాడే కట్లు తయారుచేసుకోడం; కణుపుల దగ్గర బద్ద తెగనప్పుడు కత్తితోకొట్టి చీలుస్తారు. (కో. 18).

చేటకట్టుబద్ద: పర్యా. చూ. చేటకట్టు (2). చేట అంచుచుట్టూ లోపలినుంచి బయటినుంచి వేసే రెండువేళ్ళ వెడల్పుబద్ద. (కో. 28).

చేటకర్ర: ఉ. శాట—, సాట—; పర్యా. చూ. కర్ర (2). చేట అంచు కట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒకబద్దా వెలుపలినుంచి ఒకబద్దాపెట్టి ఈ రెంటిమీదినుంచి, ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్లు సందును మూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్రపెట్టిన తరవాత కట్లు కడతారు. (కో. 2; తె. 25, 28; రా. 2).

చేటకొమ్ము: ఉ. శాట—; పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందుభాగంలో రెండు మూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగా వేసిన చిటికెన వేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2 (కో. 8, 12; తె. 27, 28).

చేటడుగు. (< చేట + అడుగు) ఉ. శాటడుగు; రూ. చేటడువు; పర్యా. చూ. అడుగు (1). చేట సమతల భాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపకముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట; చూ. మంతు (కో. 12, 18, 26-28; రా. 3).

చేటడువు: చూ. చేటడుగు. (కో. 31).

చేటతట్టు: ఉ. శాట—; పర్యా. చూ. అడుగు (1). చేట సమతలభాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపకముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట; చూ. మంతు. (కో. 23).

చేటనక్కు: ఉ. శాట—; పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరిభాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కిందినుంచిగాని మీదినుంచిగాని అదనంగా వేసే మరోకొమ్ము; మొదటిదానికిది తోడుగా ఉంటుంది; చూ. కొమ్ము (కో. 20).

చేటనేత: ఉ. శాట—; పర్యా చూ. చేటల్లకం (1). నిలువులు లేకుండా కేవలం పేడుతోనే ఎదురు బదురుగా గచ్చం వచ్చేటట్లు (చూ. గచ్చం) అల్లడం; చేట, జల్లెడ, విసనగర్ర, చాప మొ॥వి ఇలా అల్లుతారు. (తె. 30).

చేటనేతవిసనగర్ర: ఉ. శాటనేత ఇసనగర్ర; చేట అల్లినట్లు అల్లే విసనగర్ర. (కో. 11).

చేటపేడు: ఉ. శాట—; పర్యా. చేటీనె. చేట అల్లకం కోసం చీరిన పేడు; చిన్నచేట అల్లేపేడు మూడు మూరల పొడుగూ పెద్దచేట అల్లేపేడు మూడు మూరలమీద జేనెడుపొడుగూ ఉంటుంది; సుమారు వేలెడు వెడల్పూ గోరుమందమూ ఉంటుంది. (కో. 6, 8, 10, 12, 16, 17, 18; తె. 3, 5,

12, 27, 28; రా. 2, 4).

చేటబద్ద: పర్యా. చూ. చేటకట్టు (2). చేట అంచు చుట్టూ లోపలినుంచి బయటినుంచివేసే రెండువేళ్ళ వెడల్పుబద్ద. (కో. 21).

చేటబారు: చేటపొడుగు; చేట మొదటినుంచి మూల వరకు ఉండే భాగం. (కో. 17).

చేటమూల: ఉ. శాట—; పర్యా. మూల (1). చేటకు వెనకాల అడ్డమూ పొడుగూ కలిసినచోటు; దొప్పలా ఉంటుంది; ఇలాటివి రెండుంటాయి. చూ. చిత్రం 29. 3. (తె. 27, 28; రా. 3).

చేటల్లకం: (< చేట + అల్లకం) 1. పర్యా. గచ్చ మల్లకం, చేటనేత, పేడల్లకం. నిలువులులేకుండా కేవలం పేడుతోనే ఎదురుబదురుగా గచ్చం వచ్చే టట్లు (చూ. గచ్చం) అల్లడం; చేట, జల్లెడ, విసన గర్ర, చాప మొ॥వి ఇలా అల్లుతారు (కో. 20; రా. 2, 9); 2. చేట డిజైనువచ్చేటట్లు నులక మంచానికి నులక అల్లే విధానం (రా. 4).

చేటవార: ఉ. చాటోర, చేట అల్లకంపేడు తీయడాని తయారుచేసిన వార; చూ. వార. (కో. 10, 12). కి

చేటసరుము: ఉ. సాటసర్కు; పర్యా. చూ. సరుము (1). చేట అల్లకానికి కొలతప్రకారం (మూడు మూళ్ళజేనెడు) నరికి సన్నగా గీకిన సుద్దిబద్ద. (తె. 23).

చేటాయం: (< చేట + ఆయం) ఉ. శాటాయం; రూ. చేటాయి. చేట అల్లకానికి పెట్టుకొన్న కొలత; అల్లకానికి కావలసిన పేడు చీరుకోడానికి మూడు మూళ్ళజేనెడు పొడుగుండేబద్ద వాడతారు; చూ. ఆయం. (తె. 18, 19; 21, 22).

చేటాయి: (< చేట + ఆయి) ఉ. శాటాయి; చూ. చేటాయం. (తె. 20).

చేటీనె: (చేట + ఈనె) ఉ. శాటీన; పర్యా. చేటపేడు. చేట అల్లకంకోసం చీరినపేడు; చిన్నచేట అల్లే పేడు మూడుమూరల పొడుగూ, పెద్దచేట అల్లేపేడు మూడు మూరలమీద జేనెడు పొడుగూ ఉంటుంది; సుమారు వేలెడు వెడల్పూ గోరుమందమూ ఉంటుంది. (కో. 20, 21).

చేటొప్పు: (< చేట + ఒప్పు) చేటపేడు చీరడానికి తీసుకొన్న వెదురుబద్ద (ఒప్పు). (కో. 18).

చేతాడు: ఉ. శేతాడు; బావిలోంచి నీళ్ళు చేదుకునే బొక్కెనకుకట్టే పొడుగాటి తాడు; ఈతనార, తాటి నారలతో పేంతారు. (తె. 9).

చేతికట్టె: ఉ. సేతి—; 1. పర్యా. చూ. చేతికర్ర (1). చేతికి ఊతగాపట్టుకొనే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళ లావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలులేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసా మొదలూ ఒకే లావుంటాయి; సాముచేయ డానికి కూడా ఉపయోగపడుతుంది. (తె. 28); 2. పేముబెత్తం; చేత్తోపట్టుకొనే కర్ర. (తె. 22).

చేతికర్ర: 1. పర్యా. గుతప, గుతపకట్టె, చేతికట్టె(1), పట్టుకర్ర, పట్టుగోల, పట్టుడుగట్టె, బాణాకర్ర, మిగకట్టె, లారీ, లారీకట్టె, వడికట్టె. చేతికి ఊతగా పట్టుకునే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళలావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసా మొదలూ ఒకేలా వుంటాయి; సాముచేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (కో. 5, 11, 16, 26; తె 26); 2. పర్యా. చూ. వంకకర్ర(1). పాము పడగమాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (కో. 31; రా. 9); 3. వెదురు కుర్చీ తయారీలో చెయ్యి అనుకోడానికి అమర్చిన వెదురుకర్ర; ఇలాటివి రెండుంటాయి. (తె. 31).

చేతిపురి: తాడుపేనడంలో కాలికిచుట్టినపురి తిరగడానికి చేతిలో ఉండేపురి. (రా. 4).

చేతిబుట్ట: ఉ. శేతి—; సేతి—; బుట్టి—; 1. పర్యా. కమాన్‌బుట్ట, కాడబుట్ట, కూరగాయలబుట్ట(3), కూరబుట్ట, గట్టిసజ్జ, చిక్కనిబుట్ట, తూకుబుట్ట, బజారుబుట్ట(1), బటాలబుట్ట, బుట్ట(2), మూత బుట్ట(2), సజ్జ, సజ్జబుట్ట. బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తోపట్టుకోడానికి చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒకవెదురు బద్దవంచి కడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బి మాదిరిగానూ, కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగానూ ఉంటాయి; కొన్ని చోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు, దీనికికళ్ళు ఉండవు చూ. చిత్రం 139. (కో. 2, 6, 8; తె. 26, 31; రా. 4-11); 2. కూరగాయలు మొ॥ తెచ్చుకొనే పేముబుట్ట. (కో. 3).

చేతిబుట్టదబ్బ: పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టినబద్ద; చేత్తోపట్టుకోడానికీ మేకుకు తగిలించ

డానికీ వీలుగా ఉంటుంది; కమాను(ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (రా. 11).

చేతిమగ్గం: ఉ. శేతి—; (తుంగ) చాపలనేసే ఒకరకం మగ్గం (చూ.); లావుపాటి ఒకకర్రకు చివరంటా బెత్తెడేసి ఎడంలో చుట్టుగాట్లు పెట్టి ఈ గాట్లలో రాళ్ళుకట్టిన పొడుగాటి తాళ్ళు వేలాడదీస్తారు; ఈ తాళ్ళమధ్య తుంగపోచ పెట్టుకుంటు రాళ్ళు కట్టిన తాళ్ళను ఒకటి అవతలికి వేస్తూ నేస్తారు. (కో. 30).

చేతులపిడి: పర్యా. చూ. కాడ(1). మేదరికత్తి మొ॥ పట్టుకొనే కడ్డీ లాంటి భాగం; కొన్నిటికి కాడ మాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 18 క. 1. (తె. 4).

చేత్తట్ట: (< చేతి+తట్ట) ? కూరగాయలు పోసుకొని చేత్తో పట్టుకువెళ్ళే వెదురుపేళ్ళ బుట్ట. (కో. 11).

చేత్తాడు: ఉ. సేత్తాడు; చూ. చేంతాడు. (రా. 5).

చేత్తాడుకొలికి: ఉ. సేత్తాడుకొలికె; చేదతాడుకు వేసే ఒకరకం మెలిక. (రా. 5).

చేదబ్బ: పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టినబద్ద; చేత్తోపట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను(ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (రా. 7).

చేపలగంప: ఉ. శాపల—; 1. పర్యా. చూ. చేపలబుట్ట(1). చేపలు పట్టేటప్పుడు నడుముకు కట్టుకొని చేపలు వేసుకొనే బుట్ట; కొన్నిచోట్ల కింద వెడల్పుగాఉండి పోనుపోను మూతిదగ్గర సన్నగా ఉంటుంది; కొన్నిచోట్ల మధ్యన రెండు మూలలు వస్తాయి; చూ. చిత్రం 76. (కో. 10, 13); 2. చేపలు వెయ్యడానికీ పార్సెల్ చెయ్యడానికీ పనికొచ్చే పెద్దగంప. (కో. 5, 25).

చేపలటిర్రి: పర్యా. చూ. చేపలబుట్ట (1). చేపలుపట్టేటప్పుడు నడుముకు కట్టుకొని చేపలు వేసుకొనేబుట్ట; కొన్నిచోట్ల కింద వెడల్పుగాఉండి పోనుపోను మూతిదగ్గర సన్నగా ఉంటుంది; కొన్నిచోట్ల మధ్యన రెండుమూలలు వస్తాయి. చూ. చిత్రం 76. (కో. 28).

చేపలదాగర: ఉ. శాపల్దాగర; పర్యా. జీమ్మలసెంగేరి. చేపలు వేసుకొనే దాగర (చూ.); దీర్ఘచతురస్రాకారం పళ్ళెంలా ఉంటుంది. (కో. 25; 28).

చేపలబుట్ట: 1. పర్యా. చేపలగంప (1), చేపలటిర్రి, జీమ్మలబుట్ట, టిర్రి, తిర్రిబుంగ. చేపలు పట్టేటప్పుడు నడుముకు కట్టుకొని చేపలు వేసుకొనేబుట్ట; కొన్నిచోట్ల కింద వెడల్పుగా ఉండి పోనుపోను మూతిదగ్గర సన్నగా ఉంటుంది; కొన్నిచోట్ల మధ్యన రెండుమూలలు వస్తాయి. చూ. చిత్రం 76. (కో. 9, 23, రా. 1); 2. పర్యా. ఊత (2). చెరువు మొ॥చోట్ల చేపలుపట్టి వేసుకొనే ఊతబుట్ట; కింద వెడల్పుగా ఉండి మూతి సన్నగా ఉంటుంది. (కో. 3; తె. 16).

చేగవెదురు: ఉ. శాగెదురు; అడవిలో మంటలు లేచినప్పుడు సెగదగిలిగాని, తెగులు సోకిగాని పైపచ్చిపోయిపోయి తెల్లగాగాని, నల్లగాగాని అయిన వెదురుగడ; తడకబద్దలకు పనికొస్తుంది. (కో. 1).

చేత్తాడు: ఉ. సేతాడు; చూ. చేంతాడు. (కో. 29).

చేంతాడు. ఉ. శాంతాడు; రూ. చేతాడు; చేత్తాడు; పర్యా. రేకతాడు. నీళ్ళు తోడుకొనే ఇనపబొక్కెన (చేద)కు కట్టేతాడు; నాలుగుపురులతో పేంతారు; సుమారు పదిగజాల పొడుగుంటుంది; కొన్నిచోట్ల రేక (= నీళ్ళు తోడుకొనే) తాటేకుదొన్నెకు కడతారు; మామూలుగా కొబ్బరిపీచుతో అల్లినది. (కో. 20; రా. 4).

చొప్పకర్ర: ఉ. సొప్ప—; పర్యా. చూ. మొక్కకర్ర. నాలుగునెలలనుంచి సం॥ లోపు వయస్సుగల వెదురుకర్ర; చీల్చడానికి పనికిరాదు; మెత్తగాఉండి ఎటుబడితే అటు వంగిపోతుంది; చెరుకు నాటువేసినప్పుడు ఆనుగాపెట్టడానికి పనికొస్తుంది. (కో. 25).

చోళ్ళజల్లెడ: ఉ. సోలజల్లెడ; రాగులు (చోళ్ళు) జల్లించుకొనే జల్లెడ. (కో. 26).

చౌకంగా: (క్రి. విశే.) ఉ. సౌకంగా; పర్యా. చట్టచదరంగా, నాలుగుపచ్చాలుగా, చతురస్రంగా; జల్లెడ అడుగు, దాగర అడుగు మొ॥ వాటిని చతురస్రంగా అల్లుతారు. (తె. 21, 22; రా. 2).

చౌకటు: ఉ. సౌకటు; పర్యా. చూ. చట్రం (1). మంచం, బద్దలతడక, చాటుతడక, చెంద్రికతడక, కళ్యాణమంటపం మొ॥ వాటి తయారీకి నాలుగు వెదురుబద్దలతోగాని గడలతోగాని (దీర్ఘచతురస్రాకారంగాగాని, చతురస్రాకారంగాగాని) చేసిన దొడ్డి. చూ. చిత్రం 82. 2. (తె. 19).

## జ

జగిడెం: జడిగం; పొలంలో విత్తనాలువేయడానికి వాడేది; జేనెడుపొడుగూ రెండుబెత్తల వెడల్పూ ఉండి గుండ్రంగా బోలులా ఉండే కొయ్యకు సమాన్త

దూరంలో మూడుబెజ్జాలు చేస్తారు; ఈ బెజ్జాలకు కిందిభాగంలో బోలుగాఉన్న వెదురుగొట్టాలు మూడు అమరుస్తారు; పైనపోసిన విత్తనాలు మూడుబెజ్జాల గుండా గొట్టాల్లోకివచ్చి దున్నినచాళ్ళలో పడతాయి; చూ. చిత్రం 112. 1. (తె. 15).

జగిడెంలొట్ట: పర్యా. జగిడెంసరం, జడ్డిగంబుర్ర. జడ్డిగానికి అమర్చిన వెదురుగొట్టం; ఇలాటివి మూడుంటాయి; ఒకే ఎడ్లజతకు మూడు నాగళ్ళు కలిపికట్టి మూడు నాగళ్ళు దున్నినచాళ్ళలో ఒకేసారి విత్తనాలుపడేటట్లు చేస్తారు. చూ. చిత్రం 112. (తె. 15).

జగిడెంసరం: పర్యా. చూ. జగిడెంలొట్ట. జడ్డిగానికి అమర్చిన వెదురుగొట్టం; ఇలాటివి మూడుంటాయి' ఒకే ఎడ్లజతకు మూడునాగళ్ళు కలిపికట్టి మూడు నాగళ్ళు దున్నినచాళ్ళలో ఒకేసారి విత్తనాలు పడేటట్లు చేస్తారు. చూ. చిత్రం 112. (తె. 15).

జగ్గడి: ఈతచెట్లు పెరిగిన ప్రదేశం. (రా. 9).

జంగిడి: పర్యా. చూ. సెంగేరి. దుకాణాలముందర కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులుపోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతోగాని ఈతపేళ్ళతోగాని అల్లిన పళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66. (కో. 25, 31).

జంగిడిమూత: పూలబుట్టమీద మూత; పళ్ళెంలా ఉంటుంది. (కో. 10).

జజ్జు: పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకుచివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (కో. 2, 3; రా. 10); 2. వెదురుపేళ్ళతో అల్లిన బండిజల్ల అడుగుభాగంలోకి బయటినుంచి దూర్చిన ఎనిమిది బద్దలు (కో. 3).

జడ్డిగంబుర్ర: పర్యా. చూ. జగిడెంలొట్ట, జడ్డిగానికి అమర్చిన వెదురుగొట్టం; ఇలాటివి మూడుంటాయి; ఒకే ఎడ్లజతకు మూడునాగళ్ళు కలిపికట్టి మూడు నాగళ్ళు దున్నిన చాళ్ళలో ఒకేసారి విత్తనాలు పడేటట్లు చేస్తారు. చూ. చిత్రం 112. (కో. 9).

జంట: **1**. పర్యా. చిన్నకిడిగ, కిడిగ (1). వెదురుగడ కణుపులోంచి పుట్టిన కొమ్మకు రెండువైపులా పెరిగిన చిల్లలజత; మూరెడువరకు పెరిగి ఎండిపోతాయి; కొన్నిగడలకు పెద్దకొమ్మలేకుండా ఇవి మాత్రమే పెరుగుతాయి; ఇలాటి చిల్లలు క్రమంగా కొమ్మమాదిరిగా అవుతాయి (కో. 22, 24, 25, 27). **2.** పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడు లావూ ఒకటిరెండుగజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ, దోమతెర కర్రగానూ, గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువును బట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 27, 30); **3.** ఒక తుంగపోచకు మధ్యభాగం నుంచి సాగే మరికొన్ని తుంగపోచల జత(లు). (కో. 30).

జనపతాడు: ఉ. జన్ప—; పర్యా. జనపనారతాడు. జనపనారతో పేనినతాడు. (తె. 21).

జనపనారతాడు: పర్యా. జనపతాడు. జనపనారతో పేనినతాడు. (కో. 19),

జనుము: ఉ. జనుం; చేలల్లో పెంచే ఒకరకం మొక్క; నారతియ్యడానికి కాపుకాసిన తరవాత మొక్కలుపీకి ఆకులూ కాయలూ తీసేసి నీళ్ళలో మురగబెడతారు; కాడలు కుళ్ళిన తరవాత వాటి చుట్టూఉండే తొక్కతీసి నీళ్ళల్లో జాడిస్తారు. (Indian hemp, san-hemp) Crotelaria juncea, linn (కో. 19; తె. 21).

జంతిక: తుంగచాప పొడుగు భాగంలో అంచుగట్టడం కోసం ఒక సన్నటి తాడుతో కొన్నితుంగపోచలు విడుస్తూ కొన్నిటిని లేపుతూ వాటిమధ్య తాడుతో మెలికవేస్తూ అంచుకట్టే విధానం. (కో. 30).

జన్నీతచెట్టు: ఉ. —శెట్టు; పర్యా. చూ. పెద్దీతచెట్టు. లావుగా పొడుగ్గా పెరిగే ఈతచెట్టు. (తె. 13).

జన్నీదుబరిగె: పర్యా. చూ. పెద్దీతచెట్టు బరిగె. పెద్దీతచెట్టు నుంచి తీసినచువ్వ; పొడుగ్గా లావుగా మెత్తగా ఉంటుంది. (తె. 14).

జబరేయు: (క్రి.) కలబందమట్ట అంచుకుండే ముళ్ళను కత్తితో చెక్కడం. (రా. 6).

జబ్బుకర్ర: పర్యా. చూ. పుచ్చిబొంగు. పుచ్చిపోయిన వెదురుగడ; పురుగులు లోపలికిచేరి కండ తినేయడం వల్ల లోపలినుంచి పొడిరాలుతుంది; పొయ్యిలోకి తప్ప దేనికీ పనికిరాదు. (కో. 26).

జమచేయు: ఉ. జమ్మ—; (తుంగ) చాపనేసే మగ్గానికి దిగువతండు (= కూర్చునేవైపుకాక అవతలివైపు ఉండే బొంగు)కు పోగులను కలిపి కట్టడం. (రా. 4).

జమాయించు: (క్రి.) ఒకదాని పక్కన ఒకటి

చేర్చడం. (తె. 25).

జమిలడుగు: (< జమిలి + అడుగు) పర్యా. కలడుగు, కాకెడుగు, రెండడుగు(లు). వెదురుపేళ్ళగంప మొ॥ వాటికి రెండుపొరలుగా అల్లిన కిందిభాగం (అడుగు); గట్టిదనంకోసం ఒకఅడుగు కఱ్ఱతోనూ ఒక అడుగు పేడుతోను అల్లుతారు; రెండడుగులూ వేరువేరుగా అల్లి అతుకుతారు. (తె. 17, 31).

జమిలడుగుగుల్ల: పర్యా. డబుల్‌గంప. అడుగురెండు పొరలుగా ఉండే వెదురుపేళ్ళగంత; గట్టిదనంకోసం రెండడుగుల మేర ఇలా అల్లుతారు. (తె. 17).

జమిలి: (—చేయు) ఉ. జఁవిల్, జమ్లి; రూ. జములు, జమ్మట. (పేడు మొ॥వాటి) జత; జంట (కో. 24; తె. 7, 8, 17, 25).

జమిలిచేయు: (క్రి.) ఉ. జఁవిల్‌చేయు జఁవుల్‌చేయు. కలపడం; జతచేయడం; అల్లేటప్పుడు రెండు వెదురుపేళ్ళను లేదా రెండు అడుగులను జతచేస్తారు. (తె. 7, 8, 25).

జమిలిపట్టె: ఈతాకు ఒకసారి రెండు ఆకులమీంచి, మరోసారి ఒకఆకు కిందినుంచి వచ్చేటట్లు అల్లిన పట్టె. (తె. 19, 21).

జమిలిబద్దలు: ఉ. జఁవిలి—; పర్యా. చూ. ఎన. పెద్దగుమ్మి అల్లకంలో వచ్చే నిలువుబద్దలజత ( రెండునిలువు బద్దల పట్టీ). (కో. 23).

జమీల్: మూడుబద్దల మీద మూటాల అల్లకం. (తె. 29).

జములల్లకం: (< జమిలి + అల్లికం) ఉ. జఁవు అల్లకం; పర్యా. చూ. రెంటాల. రెండేసి పేళ్ళతో అల్లే విధానం; రెండుపేళ్ళకు కిందినించీ రెండు పేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండు పేళ్ళగచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పుపేళ్ళతో అల్లుతారు, చేట, జల్లెడ మొ॥వాటిని ఈ మాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (కో. 10).

జములు: (—చేయు) చూ. జమిలి. (కో. 4; తె. 15, 23).

జములుచేట: ఉ. జఁవుల్‌శాట; రెండుపొరలుగా (జమిలిగా) అల్లినచేట. (కో. 5).

జములుపేడు: ఉ. జఁవులు ; అల్లకంలో జంటగా వచ్చే పేళ్ళలో ఒకటి. (కో. 10).

జములుపేళ్ళల్లకం: ఉ. జవఁలుపేల్ల ; పర్యా. చూ. రెంటాల. రెండేసిపేళ్ళతో అల్లేవిధానం; రెండుపేళ్ళకు కిందినించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డంపేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥వాటిని ఈ మాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (కో. 9, 10).

జముల్తడక: ఉ. జఁవుల్తడ్క; తెల్లపేడుతో అల్లిన తడకా వెన్నుపేడు (పచ్చపేడు)తో అల్లిన తఁకా రెండూ జతచేసి కట్టిన తడక. (తె. 8).

జంపు: పర్యా. నిడివి, నిడుపు(2), నెరువు, పొడుము, బారు. పొడుగు(భాగం). (తె. 4, 14; రా. 6, 9).

జంపుగంటు: పర్యా. ఎడదాపుగంటు. వెదురుగడకు రెండు కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువగా పొడుగున్న భాగం. (తె. 3).

జంపుబర్ర: పర్యా. పిల్లబరిగె. పొడుగ్గా ఉండే ఈత చువ్వ (బరిగె). (రా. 8).

జంపువిడుచు: (క్రి.) ఉ. —ఇడుసు; నీళ్ళగూడ (చూ.) మూతి కట్టుబడిలో పేళ్ళు తన్నుకొనిచ్చి విశాలం కావడం. (కో. 8).

జంబల్‌లొద్దిబొంగు. అసిఫాబాద్ అడివిలో జంబల్ లొద్ది అనే లోయలో పెరిగిన వెదురుగడ; లావుగా ఉంటుంది. (తె. 23).

జమ్మట: చూ. జమిలి. (రా. 2).

జమ్మటిచాప: ఉ. —సాప; పర్యా. జోడనివాప, నయంచాప. రెండుపొరలుగా నేసిన (తుంగ)చాప. (రా. 2).

జమ్ము: చాపలు నేయడానికి పనికొచ్చే ఒకరకం గడ్డి; తుంగకంటె లావుగా సుమారు గజం పొడు గుంటుంది; నీటి మడుగుల్లోనూ కాలువలవెంటా వాగులవెంటా పెరుగుతుంది. (కో. 19; రా. 2, 6, 10).

జమ్ముకత్తి: పర్యా. అంబు (3). జమ్ముపోచల్ని నిలువుగా చీరేకత్తి; సన్నగా, పలచగా, పొడుగ్గా, కోసుగా ఉంటుంది; కొన్నిటికి పిడి ఉంటుంది. (రా. 10).

జమ్ముపుల్ల: పర్యా. జమ్ముపోగు. జమ్ముగడ్డి మొక్కకు పొడుగ్గా పెరిగిన ఒకపోచ (పుల్ల); ఇలాటి పోచలతో చాపలు నేస్తారు. (రా. 10).

జమ్ముపోగు పర్యా. జమ్ముపుల్ల. జమ్ముగడ్డిమొక్కకు పొడుగ్గాపెరిగిన ఒక పోచ(పుల్ల); ఇలాటి పోచలతో చాపలు నేస్తారు. (రా. 2).

జల్ల: 1. పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీదవేసే వెదురుతడక;

అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరచిఉంటాయి; చూ. చిత్రం 32. (కో. 1-3, 6-9; తె. 9, 28, 30, 31; రా. 3, 5, 8, 10); **2.** పర్యా. చూ. కంకిజల్లలు (1). సజ్జకంకి, జొన్నకంకి మొ॥ వాటిని పొలాలనుంచి మోసుకురావడానికి వాడే ఒక రకం పెద్దగంప; గజం ఎత్తూ మూరన్నర వెడల్పూ ఉంటుంది (తె. 5); **3.** పర్యా. కంకిజల్ల (2). సజ్జ, జొన్న మొ॥ వాటి కంకులను మోసుకొచ్చే పెద్ద ఈతగంప. (తె. 14).

జల్లగంప: పర్యా. చూ. ఈతగంప. వరిపొట్టు (ఊక) మోసుకుపోవడానికీ పశువులకు మేతగాపెట్టే ఉలవల పొట్టూ సెనగపొట్టు మొ॥ మోసుకుపోవడానికీ వాడే పెద్దగంప. (రా. 9).

జల్లంచుకర్ర. జల్లఅంచుల అల్లకానికి ఉపయోగించే సన్నటి వెదురుకర్ర. (తె. 30).

జల్లదబ్బ: పర్యా. జల్లపలుకు, బండిజల్లబెండు, బారుబద్ద (1). బండిజల్ల అల్లకంకోసం చీరిన పలచటి వెదురుబద్ద; వెడల్పు మామూలుబద్దంత ఉంటుంది, మందంబద్ద మందంలో సగం ఉంటుంది. (కో. 4).

జల్లపని నిలువులు. కర్ర, అడిపోగు (చూ.) మొ॥ పెట్టి వెదురుపేళ్ళజల్ల అల్లేవిధానం. (తె. 28).

జల్లపలుకు: పర్యా. చూ. జల్లదబ్బ బండిజల్ల అల్లకం కోసంచీరిన పలచటి వెదురుబద్ద; వెడల్పు మామూలు బద్దంత ఉంటుంది; మందంబద్ద మందంలో సగం ఉంటుంది. (కో. 18).

జల్లబుట్ట: పర్యా. చూ. కంకిజల్ల (1). సజ్జకంకి, జొన్నకంకి మొ॥ వాటిని పొలాలనుంచి మోసుకు రావడానికి వాడే ఒకరకం పెద్దగంప; గజం ఎత్తూ మూరన్నరవెడల్పూ ఉంటుంది. (తె. 30).

జల్లిగనుపుకర్ర: పర్యా. చూ. నిడుపు(గనే) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువ గాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసిన పేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది (కో. 15).

జల్లిగంప: **1.** పర్యా. గంప (4), తట్ట (2). అన్నం గంజి వార్చడానికి సన్నటిపేళ్ళతో మధ్య సందులుండేటట్లు అల్లిన గంప; అన్నసంతర్పణ వంటలకు వాడతారు; చూ. చిత్రం 52. (కో. 19, 21, 25, 26); **2.** పాలూ పెరుగూ (కుండల్లో) చద్దిముంతలూ మొ॥ తీసుకువెళ్ళడానికి వీలయిన ఒక రకం గంప; చిక్కగా అల్లుతారు. (తె. 26).

జల్లిగా. (క్రి. విశే.) పర్యా. గుద్దులుగుద్దులుగా, సందులు సందులుగా, చిల్లులు చిల్లులుగా; జల్లెడ, చేట మొ॥ అల్లేటప్పుడు అల్లకం వదులు వదులుగా ఉన్నప్పుడు పేళ్ళమధ్య సందులు వస్తాయి. (కో. 22).

జల్లిజల్లిగా: (క్రి. విశే.) సందులు సందులుగా; గంప మొ॥వాటి అల్లకం విషయంలో అంటారు. (తె. 20).

జల్లించు: (క్రి.) (ధాన్యం మొ॥) జల్లెడలో పోసి గుండ్రంగా ఆడించడం; పొల్లు, బెడ్డలు, రాళ్ళు మొ॥ తీసెయ్యడానికి ధాన్యం జల్లిస్తారు. (కో. తె. రా).

జల్లిబుట్ట: ధాన్యం మొ॥ పోసిపెట్టుకొనే ఒకరకం వెదురుబుట్ట. (తె. 27).

జల్లెడ: (—తిప్పు, పట్టు) ఉ. జల్లిడి, జల్లెదీ, జల్లెడు; ధాన్యం, బియ్యం మొ॥ జల్లించుకోడానికి గుండ్రంటి పళ్ళెం మాదిరిగా వెదురుపేళ్ళతో అల్లినది; దీనికి దాదాపు బెత్తెడు ఎత్తు (కొన్ని ప్రాంతాల్లో ఇంకా ఎత్తు) గోడ ఉంటుంది; జల్లించేటప్పుడు సన్నటివి కిందికి దిగడానికి పేళ్ళమధ్య సన్నటి సందులు ఉంటాయి; కొన్నిచోట్ల అంచుకు గుండు (బద్ద), కట్టు (తీగవి), కర్ర (మందంబద్ద) లేకుండా సాదాగా బుట్టలా ఉంటుంది; కర్రతో అంచుకు కట్టువేస్తారు; చూ. చిత్రం 30 క, చ. (కో. తె. రా).

జల్లెడకట్టు: **1.** పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచి ఒట్టిన రెండుమూడు పేళ్ళ వెడల్పు బద్ద; జల్లెడతట్టు మీద దీన్నిబెట్టి తట్టు చివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 7, 12, 13). **2.** జల్లెడ అంచుకు కట్టుముంగు (చూ.)తో అక్కడక్కడ చుట్టిచేసిన బిగింపు. (తె. 26).

జల్లెడకంటం: (< సం. —కంఠం) పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు పేళ్ళ వెడల్పు బద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిబెట్టి తట్టుచివర్లను దీని చుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద

వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (రా. 7).

జల్లెడకన్నం: పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్య ఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (కో. 21).

జల్లెడకన్ను: ఉ. జల్లిడి—; పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్య ఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (కో. 18; తె. 3, 13, 14).

జల్లెడకర్ర: 1. పర్యా. చూ. కర్ర(4). జల్లెడ అంచు కట్టడానికి లోపలిగుండు, బిఱుకు (వెలుపలిబద్ద)ల మీంచి, ఆ రెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద. (కో. 12; తె. 17, 18, 23). 2. మామూలుజల్లెడ పేడుకన్న వెడల్పు తక్కువగా ఉండేపేడు. (తె. 25).

జల్లెడకొయ్య: పర్యా. చూ. జల్లెడపేడు. జల్లెడతట్టు (చూ.) అల్లడంకోసం మూరగనుపు (రెండు కణుపుల మధ్య మూరెడు ఎడం ఉండే గడ భాగం) గడ నుంచి చీరిన పేడు; కణుపులేకుండా మూరెడు పొడుగుంటుంది; చేటపేడుకన్న వెడల్పు తక్కువగా ఉంటుంది. (తె. 19).

జల్లెడగడి: పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్యఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (కో. 20).

జల్లెడగుండు: 1. పర్యా. చూ. కర్ర (4). జల్లెడ అంచుకట్టడానికి లోపలిగుండు, బిఱుకు (వెలుపలిబద్ద)లమీంచి, ఆ రెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుబద్ద (కో. 6, 7; తె. 25); 2. పర్యా. చూ. గుండు (1). జల్లెడకు అంచుకట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడతట్టుమీద దీన్నిబెట్టి తట్టుచివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 21; తె. 2, 4, 5, 26–28; రా. 3–5).

జల్లెడ జల్లెడగా: (క్రి. విశ.) ఈతచాప అల్లకంలో అకుకూ అకుకూమధ్య సందు ఉండేటట్లు అల్లే తీరు; చిల్లులుచిల్లులుగా (తె. 22).

జల్లెడడుగు: (< జల్లెడ+అడుగు) పర్యా. చూ. తట్టు (2). జల్లెడఅడుగు అల్లకంలో పేడుకూ పేడుకూ మధ్య సన్నగా ఎడం వదులుతూ అల్లినభాగం; జల్లించవలసినవి దీంట్లో పోసుకొంటారు; దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడువేళ్ళ ఎత్తున గోడుగా అంచు ఉంటుంది. చూ. చిత్రం 30 క. 4. (కో. 7, 8, 20).

జల్లెడతట్టు: పర్యా. చూ. తట్టు (2). జల్లెడ అడుగు అల్లకంలో పేడుకూపేడుకూ మధ్య సన్నగా ఎడం వదులుతూ అల్లినభాగం; జల్లించవలసినవి దీంట్లో పోసుకొంటారు; దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడువేళ్ళ ఎత్తున గోడుగా అంచుగా ఉంటుంది. చూ. చిత్రం 30 క. 4. (కో. 10, 12, 13, 15–18; తె 8, 18, 19, 25–28, 30).

జల్లెడదుంక పర్యా. చూ. కంత (1) జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్యఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (రా. 3).

జల్లెడపేడు: ఉ.—పేడు; పర్యా. గనుపుపేడు (1). జల్లెడ కొయ్య, మూరపేడు. జల్లెడతట్టు (చూ.) అల్లడంకోసం మూరగనుపు (రెండు కణుపుల మధ్య మూరెడు ఎడం ఉండే గడభాగం) గడనుంచి చీరినపేడు; కణుపులేకుండా మూరెడు పొడుగుంటుంది; చేటపేడుకన్న వెడల్పుతక్కువగా ఉంటుంది. (కో. 6, 7, 9, 13, 15; తె. 3, 5, 12, 28; రా. 2–5).

జల్లెడబెజ్జం. పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్యఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (కో. 12; తె. 30).

జల్లెడమట్టు: పర్యా. చూ. తట్టు (2). జల్లెడ అడుగు అల్లకంలో పేడుకూ పేడుకూమధ్య సన్నగా ఎడం వదులుతూ అల్లిన భాగం; జల్లించవలసినవి దీంట్లో పోసుకొంటారు; దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడుపేళ్ళ ఎత్తున గోడుగా అంచు ఉంటుంది. చూ. చిత్రం 30 క. 4. (కో. 21).

జల్లెడరౌను: (< ఇం. — Round) పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచుకట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పు

బద్ద; జల్లెడతట్టుమీద దీన్నిబెట్టి తట్టుచివర్లను దీని చుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒక బద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (తె. 30).

జల్లెడవార: పర్యా. చూ. కర్ర (4). జల్లెడ అంచు కట్టడానికి లోపలిగుండు, బిలుకు (వెలుపలిబద్ద)ల మీంచి, ఆ రెంటిమధ్యా కొంతభాగం ఇరికిస్తూవేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పు బద్ద. (కో. 21).

జల్లెడసందు: పర్యా. చూ. కంత (1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళమధ్య సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (తె. 2).

జల్లేయు: (క్రి.) పారెయ్యడం; చల్లెయ్యడం; పనికిరాని వెదురుపేళ్ళు పారేస్తారు. (కో. 24).

జవరవ్వు: (క్రి.) బలంగా కావడం; మొదెంగడ్డి బలంగా పెరిగిన త వాత కోసి చీపుళ్ళు కడతారు. (తె 21).

జవురు: (క్రి.) కత్తితో సన్నగా గీకడం; పేము పొదనుంచి నరికిన కర్రలను కత్తితో గీకుతారు. (కో. 3).

జాజయినకర్ర: రాళ్ళమీదా కొండలమీదా పెరిగే వెదురుకర్ర; ఎరుపురంగులో ఉంటుంది; పేడు, బద్దలు బాగా వస్తాయి. (కో. 27).

జాజుకర్ర: పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూమధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 28).

జాడించు: (క్రి.) ఉతికిన గాజంగిమట్టల్ని నీళ్ళతో దులపరించడం; దీనివల్ల పచ్చటిపదార్థం పోయి గారపోచలు తేటగా అవుతాయి. (తె. 9).

జాజివెదురు: పిల్లనగోవి తయారుచేయడానికీ విస్తరి ఈనెలు చీల్చడానికి పనికొచ్చే ఒకరకం వెదురు గడ. (కో. 15).

జాడుకనుపుకర్ర: పర్యా. చూ. నిడుపు(గనె)బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 23).

జాడుగనుపులకర్ర: పర్యా. చూ. నిడుపు (గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 4).

జామడాగరి: ఉ. జాఁవడాఁగరి; అన్నం ఆరబోసుకొనే దాగర; చూ. దాగర. (కో. 24).

జారీనె: (< జారు + ఈనె) విస్తరాకులు కుట్టుకోడానికి కణుపులు దూరదూరంగా ఉండే గడనుంచి చీరిన సన్నటి పేడు (కో. 22).

జారు: చూ. దారు. (కో. 25).

జారునరుకు: పర్యా. డెక్కనరుకు. వెదురుగడ మొదలుగాని బద్దగాని కత్తితో ఒకే వేటుతో ఏటవాలుగా కొట్టినప్పుడుపడ్డ నరుకు. (కో. 22).

జారువెదురు: ఉ. జారెదురు; పర్యా. చూ. నిడుపు (గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసిన పేడు, జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 22).

జాలకంక: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగాఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (తె. 23).

జాలకట్టె: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగాఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడులావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ, పందిరిపెండె కట్టుకోడానికీ, చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (తె. 17, 24, 28).

జాలరి: ఉ. జాలారి; చేపలుపట్టేవాళ్ళ తెగ. (కో.29).

జింకచాప: ఉ.—సాప; జింకబొమ్మ వచ్చేటట్లు నేసిన (తుంగ)చాప. (కో. 3; రా. 16).

జింగిడి: పర్యా. చూ చిల్ల (1). వెదురుగడ కణుపు దగ్గరపెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండుగజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ, దోమతెర కర్రగానూ, గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకుమిగిలి ఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మల ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది.(కో. 18).

జిట్ట: చెయ్యి చాపినప్పుడు బొటనవేలి చివరినుంచి చూపుడువేలు చివరివరకు గల పొడుగు; ఒకకొలత. (తె. 9, 19).

జిట్టగనె: పర్యా. చూ. కురచగనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జేనెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది (తె. 14).

జిట్టగనెబొంగు: కణుపులమధ్య జిట్టెడు ఎడముండే వెదురుగడ; ఇది మేదరిపనికి ఉపయోగపడదు; ఇంటివాసాలు మొ॥వాటికి వాడతారు. (తె. 19, 23).

జిట్టీతకమ్మ: పర్యా చూ. కురచాకు. పొడుగు తక్కువగా ఉండే ఈతాకు; ఇది సుమారు జిట్టెడు (వేళ్ళు చాపినప్పుడు బొటనవేలి కొననుంచి చూపుడు వేలి కొనవరకు ఉన్న) పొడుగుంటుంది; పొట్టిగా ఉన్న ఈతచెట్టు (జిట్టీత చెట్టు)నుంచి తీసింది; చాపల అల్లకానికి పనికిరాదు. (తె. 26).

జిట్టీతచువ్వ: ఉ. జిట్టీత్సువ్వ; పర్యా. చూ. జిట్టీత (చెట్టు) బరిగె. పొట్టిఈత (జిట్టీత) చెట్టుకమ్మ చీరి తీసిన చువ్వ; పొడుగు తక్కువ. (తె. 7, 9).

జిట్టీతచెట్టు: ఉ. జిట్టీత్సెట్టు; రూ. చిట్టీతచెట్టు. పర్యా. చిన్నబసివి, జిట్టీదు, పూరీతచెట్టు, బుడ్డ-; పొట్టిగా ఉండే ఒకరకం ఈతచెట్టు. (తె. 7, 9, 14).

జిట్టీత(చెట్టు)బరిగె: పర్యా. చిట్టీతపుల్ల, జిట్టీత చువ్వ, పూరీతచువ్వ, బుడ్డబరిగె. పొట్టిఈత (జిట్టీత) చెట్టుకమ్మ చేరితీసిన చువ్వ; పొడుగు తక్కువ. (తె. 14).

జిట్టీతాకు: పర్యా. చూ. కురచాకు. పొడుగు తక్కువగా ఉండే ఈతాకు; ఇది సుమారు జిట్టెడు (వేళ్ళు చాపినప్పుడు బొటనవేలి కొననుంచి చూపుడువేలి కొనవరకు ఉన్న) పొడుగు ఉంటుంది; పొట్టిగా ఉన్న ఈత (జిట్టీత)చెట్టు నుంచి తీసినది; చాపల అల్లకానికి పనికిరాదు. (తె. 19).

జిట్టీదు: పర్యా. చూ. జిట్టీతచెట్టు. పొట్టిగా ఉండే ఒకరకం ఈతచెట్టు. (తె. 26).

జిట్టెడుకమ్మ: పర్యా. కురచాకు. పొడుగు తక్కువగా ఉండే ఈతాకు; ఇది సుమారు జిట్టెడు (వేళ్ళు చాపినప్పుడు బొటనవేలి కొననుంచి చూపుడువేలి కొనవరకు ఉన్న) పొడుగు ఉంటుంది; పొట్టిగాఉన్న ఈతచెట్టు (జిట్టీతచెట్టు) నుంచి తీసింది; చాపల అల్లకానికి పనికిరాదు. (తె. 21).

జిత్తు: జుట్టు; కొబ్బరికాయ ఒలిచేటప్పుడు పై భాగంలో పట్టుకోడానికి పిడిలా మిగిల్చిన పీచు. (కో. 25).

జిన్క్రపలక: ఉ.—పల్క; పర్యా. చూ. అచ్చు. తుంగచాప నేసేటప్పుడు అడ్డానికివేసిన తుంగ పోచను దగ్గరకునెట్టడానికి చేత్తో ఒత్తే కొయ్యపలక; దీర్ఘచతురస్రాకారంగా ఉంటుంది; దీనికి సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులు దూరుస్తారు; తుంగపోచను పోగులమధ్యకు దూర్చిన తరవాత ఆ పోచ అంతకుముందున్న పోచలను ఆనుకొని ఉండేటట్లు ఈ పలకతో నెడతారు; కొన్ని చోట్ల ఇనపచువ్వలపలక వాడతారు. చూ. చిత్రం 105; 120 క. 5. (రా. 10).

జిబురు: (క్రి.) చూ. జివురు (1). (రా. 8).

జిబ్బి: చూ. సిబ్బి (1). (కో. 24, 25, 27, 29–31).

జిబ్బిగుది జిబ్బివారలు తీసే కడ్డీలాంటి సన్నటి వెదురుపేడు; ఒక జిబ్బిగుదిని ఏడెనిమిది జిబ్బి వారలుగా చీల్చవచ్చు. (కో. 27).

జిబ్బీనె: (జిబ్బి+ఈనె) పలచటి ఈనె; సిబ్బివారలా ఉంటుంది. (కో. 27).

జిబ్బివార: ఉ. జిబ్బోర; చూ. సిబ్బివార. (కో. 23, 25, 30, 31).

జిమ్మతొత్తి: పర్యా. చూ. కొమ్ములగూడ. కాలవ కడ్డంగాపెట్టి చేపలుపట్టే సాధనం; నీళ్ళగూడ ఆకారంలో ఉంటుంది; అంచుకువేసిన బద్దలు కొమ్ముల్లాగా బయటికి తేలిఉండడంవల్ల ఈ పేరు వచ్చింది; కాలవకడ్డంగా మధ్యలో గూడ నిలిపి నీళ్ల గూడ లోంచి పోయేటట్లు చేస్తారు; నీళ్ళలోని చేపలు దీంట్లో చిక్కుబడిపోతాయి. చూ. చిత్రం 73 ట. (తె. 22).

జిమ్మలబుట్ట: పర్యా. చూ. చేపలబుట్ట (1). చేపలు వేసుకొనేబుట్ట; కొన్నిచోట్ల కింద వెడల్పుగా ఉండి పోనుపోను మూతిదగ్గర సన్నగా ఉంటుంది; కొన్ని చోట్ల మధ్యన రెండుమూలలు వస్తాయి; చూ. చిత్రం 76.

జిమ్మలసెంగేరి: పర్యా. చూ. చేపలదాగర. చేపలు వేసుకొనే దాగర (చూ.); దీర్ఘచతురస్రాకారం పళ్లెంలా ఉంటుంది. (తె. 27).

జిమ్మలు: (బహు.) చేపలు. (తె. 21, 22).

జిర్తాడు: పర్యా. చూ. మోకు (1). బండిమీద బరువు పేర్చినప్పుడు (గడ్డి, చొప్ప మొ॥) కింద పడకుండా బిగించికట్టే లావాటి కొబ్బరితాడు; నాలుగుపేటలుగా పేంతారు; పన్నెండు బారలనుంచి ముప్పైబారల వరకు పొడుగుంటుంది. (కో. 31).

జిలుగు: పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ, దోమతెర కర్రగానూ, గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దానిమొదలు

కణుపుకు మిగిలి ఉంటుంది. (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో.21).

జిపక: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగాఉండే వెదురుకఱ్ఱ; చిటికెన వేలెడు లావునుంచి బొటన వేలెడు లావువరకు ఉంటుంది; దీనికిలోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గర దగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగఱ్ఱలకూ, పందిరిపెండె కట్టుకోడానికీ, చేతి కఱ్ఱలకూ ఉపయోగిస్తారు. (కో. 28).

జివినిబెట్టు: (క్రి.) బండిజల్ల అల్లకంలో అడ్డంగా అల్లేబద్దలు వెడల్పుగా రావడానికి రెండుబద్దల్ని జతచేసి పెట్టడం; జమిలిగా పెట్టడం. (కో. 28).

జివురు: (క్రి.) ఉ. జెవురు; రూ. జిబురు; పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణు పుల దగ్గరి కొమ్మలనుగాని మొనదేలి ఉన్న ముక్కలనుగాని బొడుపులనుగాని సమానంగా కత్తితో చెక్కుతారు. (రా. 4, 8, 9 11). 2. పర్యా. చూ. పదునుచేయు. వెదురుగడకు గంటి గనుపులు (కొమ్మలు కొట్టేసినచోట మిగిలినవి) లేకుండా కత్తితో నున్నగా చెక్కెయడం. (రా.4). 3. ఉ. జోరు; రూ. జుబురు; పర్యా. అంచు జుబురు. నేత పూర్తయిన తరవాత చాప అంచులను సమంగా కత్తెరలో కత్తిరించడం. (రా. 2, 4).

జివులుక: పర్యా. చూ. సిబ్బి (1). అన్నం కుండ లోంచి గంజి వార్చేటప్పుడు పైనపెట్టే మూత; వెదురుపుల్లలతో అల్లుతారు; గుండ్రంగా ఉంటుంది. (రా. 1).

జివ్వు: (క్రి.) రూ. జీవు, జువ్వు; పర్యా. చూ. గీయు (1). వెదురుబద్దగాని పేడుగాని కఱ్ఱ (=తీగలాంటి సన్నటి వెదురుచువ్వ)గాని కత్తితో నున్నగా గీకడం. (కో. 3).

జీవు: (క్రి.) చూ. జివ్వు. (రా. 1).

జుత్త: బెత్తెడుపొడుగు గుండ్రంగా చుట్టిన నలభై వరసల సన్నటి కొబ్బరితాడు (మలక) చుట్ట. (కో. 25).

జుబిలివరకలవాళ్ళు: ఉ. —యెర్కలోల్లు; ఎరకలి వాళ్ళలో ఒకతెగ. (తె. 20);

జుబురు: (క్రి.) చూ. జివురు (3).

జుల్మాన: జుర్మానా; జరిమానా; తప్పుచేసిన వాడికి కులపెద్దలు విధించే ఒకశిక్ష. (తె. 30).

జువ్వాలతడక: (< జీవాల—) ఉ. జువ్వాల్తడ్క; పర్యా. చూ. గొఱ్ఱెలతడక, గొఱ్ఱెలను తోలేదొడ్డి ఏర్పాటుకు అమర్చే వెదురుబద్దల తడక; గొల్లలు అమర్చుకొంటారు; చూ. చిత్రం 40 ఛ. (తె. 7).

జువ్వు: (క్రి.) చూ. జివ్వు. (కో. 4).

జూక: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకఱ్ఱ; చిటికెనవేలెడు లావునుంచి బొటన వేలెడులావు వరకు ఉంటుంది; దీనికిలోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గర దగ్గరగా ఉంటాయి; దీన్నిముల్లు గఱ్ఱలకూ, పందిరిపెండె కట్టు కోడానికీ, చేతికఱ్ఱలకూ ఉపయోగిస్తారు. (కో. 22).

జూకు: పర్యా. చూ. మొక్కకఱ్ఱ. నాలుగునెలల నుంచి సం॥లోపు వయస్సుగల వెదురుకఱ్ఱ; చీల్చ డానికి పనికిరాదు; మెత్తగా ఉండి ఎటుబడితే అటు వంగిపోతుంది; చెరుకు నాటువేసినప్పుడు ఆనుగా పెట్టడానికి పనికొస్తుంది. (రా. 4).

జూదం: పర్యా. చూ. చట్రం (1). మంచం, బద్దల తడక, చాటుతడక, చెంద్రిక తడక, కళ్యాణ మండపం మొ॥వాటి తయారీకి నాలుగు వెదురు బద్దలతోగాని గడలతోగాని (దీర్ఘచతురస్రాకారంగా గాని చతురస్రాకారంగాగాని) చేసినదొడ్డి. చూ. చిత్రం 82.2 (తె. 6).

జెగ్గ: పర్యా. చూ. ఈతమట్ట(2). ఈతచెట్టు కాండానికి (బోదె) అంటుకొనిఉన్న కమ్మ మొదటిభాగం; రెండుమూడువేళ్ళ వెడల్పా వేలెడు మందమూ ఉంటుంది; మొదట వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; నరికినప్పుడు కొన్నిచోట్ల చెట్టుకే మిగిలిపోతుంది. (తె. 16).

జెడ: ఉ. జెట; 1. మూడు సన్నటితాళ్ళతో (పాయ లతో) ముప్పేటగా పేనిన పెద్ద కొబ్బరితాడు. (కో. 20). 2. తాటిపొరక పిడికి వేలాడే పురి (చూ.)తో అల్లినతాడు; పొరక తీసుకువెళ్ళేటప్పుడు ఈ జెడను పట్టుకొంటారు. (తె. 9).

జెడఅల్లు: (క్రి.) తాటిచీపురు (పొరక) పిడిమీంచి గాజు (చూ.)లు చుట్టగా మిగిలిన పురిని లోపలి నుంచితీసి మొదటపెట్టిన పురిని దానికికలిపి రెండు బెత్తల పొడుగుతాడు జెడమాదిరిగా పేనడం. (తె. 9).

జెడణి: (< జెడ+అణి) రేషంతట్ట చేట అల్లకంలో జెడ అల్లకంమాదిరి డిజైను రావడానికి రెండుపైకీ రెండు కిందికీవేసే వెదురుపేళ్ళ లెక్క. (రా. 1).

జెడవేయు: (క్రి.) ఉ. జెడేయు; మక్కిరి (=బండి

జల్ల) అల్లకంలో మూయికలసి ఉన్నవైపు జేశ అల్లకం మాదిరిగా అల్లడం. (రా. 3).

జెడ్డ: పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుల దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; పుల్లుగ్ర గానూ దోమతెర కర్రగానూ, గాలం బదులుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దానిమొదలు కణుపుకు మిగిలి ఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 30).

జెన్నారంబొంగు: జెన్నారం అడవినుంచి తెచ్చిన వెదురుగడ; గట్టిగానూ సన్నగానూ ఉంటుంది. (తె. 15, 24).

జెమినిచేట: సన్నగ్ర (- సన్నటిపేడు)తో అల్లిన చేట; మధ్యలో పువ్వు వచ్చేటట్లు అల్లుతారు. (తె. 9).

జెరడ: వెదురుపొదలు పెరిగే ఒక కొండప్రాంతం. (కో. 31).

జెలకొట్టు: (క్రి.) కలబందనుంచి, గోగునుంచి నార తీసిన తరవాత, దానికుండే పొట్టు, ఇతరమైన మకిలి పోవడానికి నీళ్ళల్లో జాడించడం. (రా. 4).

జెల్లగనె: వెదురుగడ కొమ్మ నరికేసినప్పుడు జెల్లలా తేలిఉన్న గుర్తుగల కణుపు. (తె. 23).

జెల్లవాగువెదురు: ఖమ్మం అడవుల్లో జెల్లవాగు ప్రాంతంలో పెరిగిన వెదురుగడ; నాణ్యమైంది. (తె. 29).

జేనడు: చేతి బొటనవేలి కొసనుంచి చిటికెనవేలు కొస వరకు చాపి చూసేకొలత. (తె. 9).

జేప: చూ. జేంపు. (తె. 23).

జేపు: చూ. జేంపు. (తె. 20, 24; రా. 8).

జేబిలి: పర్యా. చూ. కోళ్ళగూడు(1). కోళ్ళను కమ్మ డానికి (= మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగాను ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ, కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటి భాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లక ముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తు భాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు; చూ. చిత్రం 65 క, ప. (తె. 8).

జేబు: చూ. జేంపు. (కో. 11, 18, 19-22, 25; తె. 8, 30, 31; రా. 11).

జేబ్రి: పర్యా. చూ. జేలితడక. వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి మేకులుకొట్టి తయారుచేసిన తడక; బద్దలూ బద్దకూమధ్య సందులు చతురస్రంగాగాని డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకుంటారు. (కో. 31).

జేంపు. ఉ. జేంప్; రూ జేప, జేపు, జేబు; పర్యా. చూ. కోళ్ళగూడు (1). కోళ్ళను కమ్మడానికి (= మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగానూ ఉంటుంది; అంచు భాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటి భాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లక ముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తు భాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు; చూ. చిత్రం 65 క, ప. (తె. 11, 27, 28).

జేలి: (హిం. జేలీ). **1.** పర్యా. కన్ను(11), కన్నం (2). కోళ్ళగూడు మొ॥వాటి అల్లకంలో కోళ్ళకు గాలి ఆడడానికి వీలుగా బద్దలమధ్య పెట్టిన సందు. చూ. చిత్రం 65 ట. 1 (తె. 21, 24, 31). **2.** పర్యా. కానా (2), బొర్ర (2). అల్లకంలో విసన గ్ర పేళ్ళ మధ్యసందు. (తె. 1, 25). **3.** జేలి విసనగ్ర అల్లకంలో మధ్యభాగంలో వచ్చిన చిన్న సందు(లు). చూ. చిత్రం 31 త. 1. (తె. 6, 8, 9). **4.** పర్యా. చూ. ఖానా (5). ఉయ్యాల అల్ల కంలో అడుగుభాగంలోనూ పక్కలా బద్దలమధ్య వచ్చిన సందు; గడి. (తె. 8, 21); **5.** పర్యా. చూ. ఖానా (3). పూలబుట్ట, గద్దెబుట్ట మొ॥వాటి అల్లకంలో ఎత్తుగా అల్లిన భాగానికి మధ్యన బయటి నుంచి ఏర్పరిచిన సందు; ఇలాటివి చుట్టూ ఉంటాయి; లోపలఉండే పూలు మొ॥వాటికి గాలి తగలడానికీ అందానికీ సందులు పెడతారు. (తె.24); **6.** పర్యా. చూ. కంత(2). గళ్ళతడక (= బద్దలతో గళ్ళుగళ్ళుగా కట్టిన తడక) తయారీలో బద్దలమధ్య వచ్చే సందు; కొన్నిటికి చతురస్రాకారంలోనూ, కొన్నిటికి డైమన్ ఆకారంలోనూ ఉంటుంది. చూ. చిత్రం 38 చ. 1. (తె. 15). **7.** పర్యా. చూ. కన్నె (3). ఈతబద్దతో అల్లిన ఉయ్యాల, కోళ్ళ గంప మొ॥వాటిలో గాలి ఆడేటందుకు వీలుగా పెట్టిన సందు. (తె. 11). **8.** పర్యా. చూ. జేలి తడక(1). వెదురుబద్దలు ఎడంఎడంగా పెట్టి మేకులు

కొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూమధ్య సందులు చతురస్రంగాగాని, డైమన్ ఆకారంలో గాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకొంటారు. (తె. 4, 10, 12, 14, 15, 19); **9.** చాటు తడకమీది భాగంలో ఒక చివరినుంచి మరొక చివరిదాకా సందులు సందులుగా అల్లిన భాగం. చూ. చిత్రం 36 చ. 1. (తె. 23).

జేలి కమాన్ తడక: పర్యా. గళ్ళతడక, జేలితడక(2). పైఅంచు (కమాన్) పొడుగునా మూరెడుమొదలు గజం వెడల్పువరకు గళ్ళుగా జేలీలున్న తడక; తడకలతో కట్టిన ఇంటి ముందుభాగంలోగాని వరండాకు అడ్డంగాగాని తలుపుతోసహా అమరుస్తారు. చూ. చిత్రం 38 చ. (తె. 9).

జేలిఖానా: పర్యా. చూ. కంత (2). గళ్ళతడక (=బద్దలతో గళ్ళుగళ్ళుగా కట్టిన తడక) తయారీలో బద్దలమధ్య వచ్చేసందు; కొన్నిటికి చతురస్రాకారం లోనూ, కొన్నిటికి డైమన్ ఆకారంలోనూ ఉంటుంది. చూ. చిత్రం 38 చ. 1. (తె. 17).

**జేలితడక**: ఉ. —తడ్క, —తడ్కె, జేల్తడ్క; **1.** పర్యా. కటకటాల తడక, కంతతడక, కంతల తడక, గండ్లతడక (1), జేవ్రి, జేలి (8), బద్ద తడక, బద్దలజేలి, బద్దలదడి; మేకుల తడక, సీల తడక. వెదురుబద్దలు ఎడం ఎడంగా పెట్టి మేకులు కొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూమధ్య సందులు చతురస్రంగాగాని, డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టు కొంటారు. (కో. 23; తె. 6, 8, 13, 21, 26); **2.** పర్యా. చూ. జేలి కమాన్ తడక. పైఅంచు (కమాన్) పొడుగునా మూరెడుమొదలు గజం వెడల్పువరకు గళ్ళుగా జేలీలున్న తడక; తడకలతో కట్టిన ఇంటి ముందుభాగంలోగాని, వరండాకు అడ్డంగాగాని తలుపుతోసహా అమరుస్తారు. చూ. చిత్రం 38 చ. (కో. 31).

జేలిదాలు: పర్యా. పత్తిదాలు. పత్తి మోసుకుపోవడానికి సందులు సందులు (జేలీలు)గా అల్లిన పెద్దగంప. (తె. 22).

జేలినిలుగు: ఉ. —నిల్గు; చాటుతడక పైభాగంలో జేలీ అల్లడానికి వాడే పలచటి వెదురుబద్ద. (తె.17).

జేలిందిరివిసనగర్ర: ఉ. జేలింద్ర ఇసినకర్ర, జేలిందిరిస్నకర్ర; రంగుల డిజైన్లతో పేళ్ళమధ్య సందులు (జేలీలు) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (కో. 6, 7).

జేలిపంకా: ఉ. —పంక; పర్యా. చూ. జేలివిసనగర్ర. పేళ్ళమధ్య సందులు (జేలీలు) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 త. (తె. 9).

జేలిపద్మంపంకా: ఉ. —పంక; పేళ్ళమధ్య సందులు (జేలీలూ) చుట్టూ పద్మం డిజైనూ వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 ప. (తె. 6, 9).

జేలివిసనగర్ర: ఉ. - యసనగర్ర, —ఇసినగర్ర, ఇస్నకర్ర; పర్యా. కంతల విసనగర్ర, గండివిసన గర్ర, గండ్లవిసనగర్ర, జేలిపంకా, జేలివిసర్కాన, నడ్డలకంత లిసనగర్ర. పేళ్ళమధ్య సందులు (జేలీలు) వచ్చేటట్లు, అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 త. (తె. 5, 8, 26; రా. 4, 11).

జేలివిసర్కాన: ఉ. —ఇసరకాన, —ఇసర్కాన; పర్యా. చూ. జేలివిసనగర్ర. పేళ్ళమధ్య సందులు (జేలీలు) వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. చూ. చిత్రం 31 త. (తె. 1, 2).

జేవాకేన్: పర్యా. చూ. జేవాపేము. అడవుల్లో పెరిగే ఒకరకం పేము; ఎక్కువగా అస్సాంలో పెరుగు తుంది; చాలాకాలం పుచ్చిపోకుండా ఉంటుంది; గులాబిరంగులో ఉంటుంది. (కో. 11).

జేవాపేము: పర్యా. జేవాకేన్, జేవాబెత్తం. అడవుల్లో పెరిగే ఒకరకం పేము; ఎక్కువగా అస్సాంలో పెరుగుతుంది; చాలాకాలం పుచ్చిపోకుండా ఉంటుంది; గులాబిరంగులో ఉంటుంది. (కో. 3).

జేవాబెత్తం: పర్యా. చూ. జేవాపేము. అడవుల్లో పెరిగే ఒకరకం పేము; ఎక్కువగా అస్సాంలో పెరుగు తుంది; చాలాకాలం పుచ్చిపోకుండా ఉంటుంది; గులాబిరంగులో ఉంటుంది. (కో. 12).

జేస్తీ: ఎక్కువ. (తె. 1).

జైపూర్బెత్తం: ఒకరకం పేముకర్ర; సన్నటి 'తీగ' తీయడానికి పనికొచ్చేది. (కో. 19).

జొనలంకర్ర: చదును నేలలో పెరిగిన ఒకరకం వెదురుగడ; నలుపురంగులో ఉంటుంది. (కో. 24).

జొన్నలగుమ్మి: జొన్నలు పోసుకోడానికి పనికొచ్చే గుమ్మి; కుటారిగుమ్మి కంటే చిన్నది; పదిబస్తాల జొన్నలు పడతాయి; వెదురుబద్దలో రెండుగా చీల్చిన నలుగు (చూ.)తో అల్లుతారు. (తె. 23).

జొన్నలగుల్ల: జొన్నలు పోసుకొనేవెదురుపేళ్ళ గుల్ల. (తె. 16).

జొల: పర్యా. చూ. లొద్ది. లోయ; గుట్టలనడుమ పల్లపుప్రదేశం. (కో. 28).

జొలకర్ర: పర్యా. చూ. లొద్ది(ల) బొంగు. **లోయలో**

పెరిగిన వెదురుగడ, మెత్తగా, బోలుగా ఉంటుంది; కణుపులు దూరదూరంగా ఉంటాయి; మేదరిపనికి బాగా ఉపయోగం. (కో. 28).

**జోడనిఅల్లకం**: పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినించీ మూడుపేళ్ళ పైనించీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు (రా. 7).

**జోడనిచాప**: (< జోడు + అని -) ఉ. —సాప; పర్యా. చూ. ఖమ్మటిచాప. రెండుపొరలుగా నేసిన (తుంగ) చాప. (రా. 6).

**జోడల్లకం**: (< జోడు + అల్లకం) పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డం పేడు మూడుపేళ్ళ కిందినించీ మూడుపేళ్ళపైనించీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (రా. 6).

**జోడి**: పర్యా. చూ. కాలు (9). ఈతమవ్వతో గంప మొ॥ అల్లడానికి పెట్టే నిలువులజత. (కో. 25).

**జోడినిలుగు**: ఉ. —నిల్గు; పర్యా. చూ. ఎన. పెద్ద గుమ్మి అల్లంలోవచ్చే నిలువుబద్దల జత. (= రెండు నిలువుబద్దల పట్టీ) (తె. 23).

**జోడెం**: **1.** పర్యా. చూ. పసరుగర్ర. వెదురుగడకు పైన పచ్చగా సన్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకర్ర (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగు చుట్టడానికీ గంప ఎత్తుభాగంలో బెండుకర్ర వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్ని వరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53.1. (తె. 19). **2.** పర్యా. చూ. కర్ర (3). గోవ (వార)నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరిన భాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్లబుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (తె. 18); **3.** కర్రల (చూ.) జత; ఒకచివర అంటుకొని ఉండి అక్కణ్ణించి రెండో కొనదాకా విడివడి ఉంటాయి. (తె. 20, 21, 24, 25); **4.** బెండురెప్పలుగా పాయలు అంటుకొని ఉన్న ఈతాకు; చాపలు అల్లడానికి ఈ ఆకు పాయలుగా చీలుస్తారు. (తె. 22).

**జోబ**: నీడ. (కో. 22).

**జోబస్తలంకర్ర**: పర్యా. వాగుజాలుబొంగు. వాగు ఒడ్డునగాని ఏటిఒడ్డునగాని పెరిగిన వెదురుగడ; మెత్తగా ఉంటుంది. (కో. 27).

**జోరి**: పర్యా. చూ. దోనిగుంపు. వెదురుగడ (లోపల) ఒకకణుపునుంచి ఇంకో కణుపువరకు కనిపించీ కనిపించనట్లుగా ఉండే సన్నటి కాలవలాంటి పల్లం; కొన్నిటికి ఒకకణుపునుంచి మధ్యవరకే ఉంటుంది; మొదట కొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. (కో. 27).

## ట

**టక్కు**: పర్యా. చూ. పుడ్తిలి. పచ్చికొబ్బరిదొక్కులు నగ్గొట్టే కొయ్యసుత్తి. (కో. 25).

**టమాటాగంప**: అమ్మకంకోసం టమాటాలు పోసుకోడానికి అల్లినగంప. (కో. 16).

**టమాటాతడక**: ఉ. తమాటతడిక; టమాటా పండ్ల తట్టలను నింపడానికి లారీలో పరిచే వెదురుబద్దల తడక; టమాటా తట్టలు ఒకవరసపెట్టి వాటిమీంచి తడకపరిచి దానిమీద మళ్ళీ తట్టలుపెడతారు. (రా.2).

**టమాటీతట్ట**: అమ్మకంకోసం టమాటాలు పోసుకోడానికి అల్లినతట్ట. (కో. 23).

**టాకు**: పర్యా. చూ. మోదుకట్టు. జల్లెడతట్టుమీద గుండు (గుండ్రంగా కట్టినబద్ద) పెట్టి దాని చుట్టూ తట్టువివర్లునుంచి ఆ గుండుచుట్టూ వెలుపలినుంచి మరోబద్దపెట్టి ఆ మూడింటినీ కలిపిబిగిస్తూ కట్టే ముంగుతో వేసిన చిన్నకట్టు. (తె. 17).

**టాంకి**: గోడిసీమీద "THANK YOU" అనే మాటలున్న డిజైను. (కో. 20).

**టాపుతడక**: పర్యా. గుర్రబ్బండిచాప. గుర్రబ్బండీ మీద నీడకోసం గూడుమాదిరిగా కప్పిన(వెదురు) చాప; దీన్ని ఎప్పటికీ ఊడకుండా బద్దలువేసి బిగిస్తారు. (కో. 9).

**టిఫెన్‌బేస్కెట్**: (ఇం. Tiffin basket) ఫలహారం డబ్బాపెట్టి తీసుకొనివెళ్ళే పేముబుట్ట. (తె. 22).

**టిర్రి**: రూ. తిర్రి(1). పర్యా. చూ. చేపలబుట్ట(1). చేపలు పట్టేటప్పుడు నడుముకు కట్టుకొని చేపలు వేసుకొనే బుట్ట; కొన్నిచోట్ల కింద వెడల్పుగా ఉండి పోనుపోను మూతిదగ్గర సన్నగా ఉంటుంది; కొన్నిచోట్ల మధ్యన రెండుమూలలు వస్తాయి. చూ.

చిత్రం 76. (కో. 28).

టపీ: పెద్దమూసగంప. (కో. 19).

టెంకాయ: పర్యా. కొబ్బరికాయ. కొబ్బరిచెట్టుకు కాసినకాయ; పైన పచ్చగా తాట ఉంటుంది; లోపల దట్టంగా పీచు, పీచుమధ్య గట్టిపెంకు, పెంకులో తియ్యటినీళ్ళు, కొబ్బరి ఉంటాయి. చూ. చిత్రం 126. (కో. 5; రా. 3).

టెంకాయబొళ్ళం: కొబ్బరికాయ (టెంకాయ)కు పెంకుచుట్టూ రెండుమూడుపేళ్ళ మందంతో ఉండే పీచు; దీన్ని చీల్చి చితగ్గొట్టి నానవేసి మళ్ళీ చితగ్గొట్టి పీచు తీస్తారు. (కో. 5).

టెంకు: పీచుతీసిన కొబ్బరికాయ. (కో. 35).

టెంపర్‌తాడు: (ఇం. Temper) ? బిర్రుగా ఉండే తాడు; మగ్గం మొదటిభాగంలో పోగులను బిగించిన పలకను లాగి పట్టేది; ఇలాటివి రెండు పలకకూ పలక కవతలివైపు ఉండే మరోకర్రకూ 'X' ఆకారంలో కట్టి ఉంటాయి. (కో. 21).

టేక: చెరకునిచ్చెన తయారీలో ముందరి రెండు కాళ్ళకూ వెనక నిచ్చెన వెనక్కివాలి నిలబడడానికి ఆధారంగా ఉండే వెదురుగడ. (తె. 16).

టేబుల్: (ఇం. Table) ఎత్తుబల్ల; పేముచట్రంతో చేసినది. (తె. 22).

టేబుల్‌బాస్కెట్: (ఇం. Table Ba ket) పర్యా. పళ్ళబుట్ట. పళ్లు పెట్టుకొనేబుట్ట; దారాల్లాంటి సన్నటి వెదురుపుల్లలతో అల్లుతారు; రెండుబెత్తల ఎత్తూ జేనెడు వెడల్పూ ఉంటుంది; కొన్నిటికి మట్టు (గద్దె) ఉంటుంది. (కో. 27).

టేబుల్‌లేంప్: (ఇం. Table Lamp) బల్లమీద కరెంటుదీపం పెట్టుకోడానికి వెదురుపుల్లలతో చేసిన స్టాండు; దీంట్లో కరెంటుబుగ్గ (బల్బు) పెట్టుకోవచ్చు. (కో. 5, 27, 29).

టొల్లు: పర్యా. చూ. బోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపునుంచి మరొక కణుపువరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; కొన్నిట్లో వెడల్పుగానూ కొన్నిట్లో సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1 (రా. 9).

టొల్లుబొంగు: పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూమధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (రా. 11).

టోపి: తలకు పెట్టుకోడానికి వెదురుపుల్లలతో అల్లిన టోపి. (కో. 27, 29).

## డ

డక్కన్: (< హిం. ఢక్కన్) రూ. డాకన్; పర్యా. చూ. మూత (1). చేతిబుట్ట (మూతబుట్ట, కమాన్‌బుట్ట) మూయడానికి వెదురుపేళ్ళతో అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; కొన్ని బుట్టలకు దీన్ని బోర్లావేసి వేస్తారు; కొన్నిటికి వెల్లకిలా వేస్తారు. చూ. చిత్రం 59.1 (తె. 6, 10, 16, 18).

డక్కా: పర్యా. మూత (6). గ్లేసుబుట్ట (చూ.) మీది మూత; పళ్ళెం బోర్లించినట్లు ఉంటుంది; మూడంగుళాల వృత్తాకారంలో ఉంటుంది. చూ. చిత్రం 87.3 (తె. 6).

డబల్‌కొమ్ము: పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరిభాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కిందినుంచిగాని మీదినుంచిగాని అదనంగా వేసే మరో కొమ్ము; మొదటి దానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము. (తె. 9).

డబుల్‌గంప: పర్యా. జమిలడుగుగుల్ల. అడుగు రెండు పొరలుగా ఉండే వెదురుపేళ్ళ గంప; గట్టిదనం కోసం రెండడుగులమేర ఇలా అల్లుతారు. (తె. 26).

డబ్బ: చూ. బద్ద (1). (తె. 6).

డబ్బాబుట్ట: బియ్యం, పప్పులు మొ॥ పోసుకోడానికి గుండ్రంగానూ ఎత్తుగానూ అల్లినబుట్ట; డబ్బా మాదిరిగా ఉంటుంది. (తె. 8).

డబ్బికర్ర: పర్యా. చూ. పుచ్చిబొంగు. పుచ్చిపోయిన వెదురుగడ; పురుగులు లోపలికిచేరి కండ తినేయడం వల్ల లోపలినుంచి పొడి రాలుతుంది; పొయ్యిలోకి తప్ప దేనికీ పనికిరాదు. (కో. 31).

డాగరి: చూ. దాగర. (కో. 24).

డాకన్‌బుట్ట: పళ్ళెంలాంటి మూత ఉండే చేతిబుట్ట. (రా. 11).

డాగు: పర్యా. చూ. కోళ్ళపార్సెల్‌గంప. వ్యాపారం చేసేవాళ్ళు కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళగంప; జేనెడుఎత్తు గజంవ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికివేయడానికి పైన తెరిపి ఉంటుంది; కొన్ని ఇదే రూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడుసన్నర వెడల్పూ రెండుమూరల ఎత్తూ ఉంటాయి. (తె 27).

డొంబరుబట్ట: రెగ్జిన్‌గుడ్డ (తె. 26).

డొల: పర్యా. చూ. దానాబుట్ట. పశువులకువేత (దాణా, తడిపిన ఉలవపిండి మొ॥) పెట్టడానికివాడే గుల్ల; రెండుపొరలుగా ఉంటుంది; లోపలపొర సన్నటి పేడుతో అల్లుతారు (పశువుల నాసికలకు గుచ్చుకు

పోకుండా); వెలుపలిపొర మందంపేడుతో అల్లుతారు; కొన్నిచోట్ల కింద చతురస్రంగానూ నాలుగు మూలలా దొప్పలాగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకటే పొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (తె. 23).

**డిజిను**:: (< ఇం. Design) డిజైను; పనివరస; (తుంగ) చాపలు నేసేటప్పుడు కొన్నిచోట్ల డిజైన్లు వచ్చేటట్లు నేస్తారు. (రా. 2).

**డిజైన్‌చాప**: ఉ. —సాప; మధ్యలో డిజైన్లు వచ్చేటట్లు చేసిన (తుంగ)చాప (రా. 6).

**డిపో**: పర్యా. చూ. పెంట(2). వెదురుకోపు (వెదురు పొదలుపెరిగే అడవి ప్రదేశం) దగ్గర ప్రభుత్వం ఏర్పాటుచేసిన కొట్టు; కోపునుంచి వెదురుతెచ్చి ఇక్కడ పేర్చి మేదరివాళ్ళకు అమ్ముతారు; మేదరి వాళ్ళు వాటిని ఇక్కడే చీల్చుకుంటారు. (సగానికి చీల్చిన బొంగులే అమ్మాలని ప్రభుత్వ నియమం). (కో. 6, 7).

**డిల్లికుషన్**: (< ఇం. Delhi cushion) సోఫా (కుషన్) మాదిరి ఒకరకం పేముకుర్చీ. (కో. 11).

**డీలక్సు**: (< ఇం. Deluxe) ఒకరకం పేముకుర్చీ. (కో. 12).

**డెక్క**: చూ. డొక్క. (కో. 21).

**డెక్కనరుకు**: ఉ. డిక్—; పర్యా. జారునరుకు. వెదురుగడ మొదలుగాని బద్దగాని కత్తితో ఒకే వేటుతో ఏటవాలుగా కొట్టినప్పుడు పడ్డనరుకు. (కో. 16, 18, 20).

**డెక్కు**: (క్రి.) పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపులదగ్గరి కొమ్మలనుగాని మొనదేలి ఉన్న ముక్కలనుగాని బొడుపులనుగాని సమానంగా కత్తితో చెక్కుతారు. (కో. 28).

**డెక్కుకొను**: పర్యా. చూ. పైదు(2). కత్తితో పేడు తియ్యడం; వార, పలుకు, సర్కు, దాలెం(చూ.)ల నుంచి తీస్తారు. (రా. 6).

**డెక్‌చేర్**: (< Deck chair) ఒకరకం పేముకుర్చీ. (కో. 12).

**డెప్పకర్ర**: పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీద మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 28).

**డెగతగిలినబొంగు**: పర్యా. చూ. పెయిగాలి (పోయి)న బొంగు. అడవిలో మంటలు లేచినప్పుడు సెగ దగిలిగాని, తెగులు సోకిగాని పై పచ్చిపొర పోయి తెల్లగాగాని నల్లగాగాని అయిన వెదురుగడ; తడక బద్దలకు పనికొస్తుంది. (రా. 8).

**డేగర**: 1. చూ. దాగర (3) (రా. 9). 2. చూ. దాగర (4) (తె. 4).

**డైనమ్మచాప**: చూ. డైమన్‌చాప. (రా. 2).

**డైమన్**: (< ఇం. Diamond) పర్యా. కేన్‌డైమన్ నేత. పేముతో డైమన్‌డిజైన్లు వచ్చేటట్లు అల్లే విధానం; కొన్నిచోట్ల చేటనేత లాంటిది. (కో.19).

**డైమన్‌కటింగ్‌తడక**; (< ఇం. Diamond Cutting—) పర్యా. చూ. డైమన్‌తడక (1). డైమను ఆకారంలోగడి (కంత) వచ్చేటట్లు వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి తయారుచేసిన తడక; ఇళ్ళ చుట్టూ ప్రహరీగోడ బదులు కట్టుకోడం మొ॥వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 40 క. (కో. 15).

**డైమన్‌కంత**: పర్యా. చూ. డైమన్‌కన్ను. గళ్ళతడక అల్లకంలో డైమన్ ఆకారంలో వచ్చే కంత. చూ. చిత్రం 40 క. 1. (కో. 8).

**డైమన్‌కన్ను**: పర్యా. డైమన్‌కంత, డైమన్‌గడి. గళ్ళతడక అల్లకంలో డైమన్ ఆకారంలో వచ్చే కంత. చూ. చిత్రం 40 క. 1. (కో. 29).

**డైమన్‌కన్నుతడక**: పర్యా. చూ. డైమన్‌తడక (1). డైమను ఆకారంలో గడి (కంత) వచ్చేటట్లు వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి తయారుచేసిన తడక; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు కట్టుకోడం మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 40 క. (కో. 26).

**డైమన్‌గడి**: పర్యా. చూ. డైమన్‌కన్ను. గళ్ళతడక అల్లకంలో డైమన్ ఆకారంలో వచ్చే కంత. చూ. చిత్రం 40 క. 1. (కో. 8).

**డైమన్‌గడితడక**: పర్యా. చూ. డైమన్‌తడక (1). డైమను ఆకారంలో గడి(కంత) వచ్చేటట్లు వెదురు బద్దలు ఎడం ఎడంగాపెట్టి తయారుచేసిన తడక; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు కట్టుకోడం మొ॥ వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 40 క. (కో. 18).

**డైమన్‌చాప**: ఉ. - సాప; రూ. డైనమ్మచాప; డైమన్ డిజైను వచ్చేటట్లు నేసిన తుంగచాప. (కో. 3).

**డైమన్‌చిక్కు**: డైమన్ ఆకారంలో డిజైన్ వచ్చేటట్లు కట్టిన వెదురుపుల్లలు చిక్కు; చూ. చిక్కు. (తె. 14).

**డైమన్‌జైలి**: పర్యా. చూ. డైమన్‌తడక(1). డైమను

ఆకారంలో గడి (కంత) వచ్చేటట్లు వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి తయారుచేసిన తడక; ఇళ్ళ చుట్టూ ప్రహారీగోడ బదులు కట్టుకోడం మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 40 క. (తె. 31).

డైమన్‌తడక: ఉ. - తడికె; 1. పర్యా. డైమన్‌తడక, డైమన్‌కటింగ్ తడక, డైమన్‌కన్ను తడక, డైమన్‌గడి తడక, డైమన్‌జేలి. డైమను ఆకారంలో గడి (కంత) వచ్చేటట్లు వెదురుబద్దలు ఎడం ఎడంగాపెట్టి తయారుచేసిన తడక; ఇళ్ళచుట్టూ ప్రహారీగోడ బదులు కట్టుకోడం మొ॥వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 40 క. (కో. 1, 3, 9, 19); 2. వినాయకచవితినాడు వినాయకుడి విగ్రహం పెట్టి మోసుకుపోవడానికి వీలుగా డైమన్ ఆకారంలో తయారుచేసే వెదురుబద్దల తడక. (కో. 2).

డైమన్‌మొగ్గచాప: ఉ. - చాప; డైమన్‌మొగ్గల డిజైన్లు వచ్చేలా నేసిన తుంగచాప. (కో. 3).

డొక్క: రూ. డెక్క; కొబ్బరికాయ ఒలిచేటప్పుడు తొక్కతోబాటు పాయగా చీలివచ్చిన పీచు; రెండు మూడు వేళ్ళమందం ఉంటుంది; ఒకకాయకు ఐదారు డొక్కలు రావచ్చు; వీటిని చితగ్గొట్టి నానవేసి, మళ్ళీ చితగ్గొట్టి పీచు తీస్తారు. (కో. 20, 29).

డొప్ప: పర్యా. చూ. దోనిగుంపు. వెదురుగడ (లోపల) ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కనిపించీ కనిపించనట్లుగా ఉండే సన్నటి కాలవలాంటి పల్లం; కొన్నిటికి ఒక కణుపునుంచి మధ్యవరకే ఉంటుంది; మొదట కొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. (కో. 24).

డొలక: ఉ. డొల్క; 1. వెడల్పుగా ఉండే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (తె. 9); 2. కొబ్బరికాయలు కాసిన పొత్తు(చూ.). (కో. 20).

డొల్లయెత్తెదురు: పర్యా. చూ. ఎండుబొంగు(1). ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలం తెగులు సోకిగాని నీళ్ళు అందకగాని పొదమీదే గడఎండిపోతుంది. (తె. 29).

డోంగి: పర్యా. చూ. పేడతట్ట(1). పేడ వేసుకోచ్చే చిన్నతట్ట; అల్లకం చిక్కగా ఉంటుంది; కొన్నిచోట్ల, అడుగు సమతలంగా ఉండి గిన్నె మాదిరిగానూ, కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ, పైన గుండ్రంగానూ ఉంటుంది. (తె. 23).

డోరియం: పర్యా. చూ. దోనిగుంపు. వెదురుగడ (లోపల) ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కనిపించీ కనిపించనట్లుగా ఉండే సన్నటి కాలవలాంటి పల్లం కొన్నిటికి ఒక కణుపునుంచి మధ్యవరకే ఉంటుంది; మొదట కొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. (కో. 28).

డోలుబొంగు: 1. పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; పేదరిపనికి ఉపయోగపడుతుంది. (తె. 10, 14, 15); 2. స్తంభమంత లావుండే వెదురుగడ; లోపల బోలుగా ఉంటుంది; ఇంటి వాసాలకు వాడతారు; ఇళ్ళుకట్టేటప్పుడు ఆనుగ్గరగా కూడా పనికొస్తుంది. (తె. 18, 19).

డ్రెస్సింగ్‌టేబుల్: (ఇం. Dressing Table) అలంకరించుకోడానికి అద్దం బిగించే పేముబల్ల. (తె. 22).

## త

తక్క: పర్యా. గూటం(5). నీళ్ళలో ఊరిన కొబ్బరి డొక్కలను నలగ్గొట్టేకర్ర; లావుపాటి కడ్డీలా ఉంటుంది. సుమారు మూరెడుపొడుగు చెయ్యంత లావు ఉంటుంది; కొన్నిచోట్ల పట్టుకోడానికి ఒకవేపు కాడ, రెండోవేపు దీర్ఘచతురస్రంగాను ఉంటుంది. చూ. చిత్రం 127. (కో. 29).

తక్కె: పర్యా. చూ. తలాపు. వెదురుమంచానికి తల పెట్టుకోడానికి వీలుగా ఎత్తుగా ఏర్పరిచిన భాగం. చూ. చిత్రం 108. 6. (తె. 3).

తక్కెడతాడు: తక్కెడ పళ్ళేన్ని దండెకు వేలాడదీసే తాడు; ఒక్కొక్క పళ్ళేనికి మూడేసి ఉంటాయి. (రా. 4).

తక్కెడసిబ్బి: ఉ. —చిబ్బి, —శిబ్బి; పర్యా. చూ. తరాజుసిబ్బి(1). వెదురుపేడుతో అల్లిన తక్కెడ పళ్ళెం. (కో. 2-4, 21; తె. 6).

తక్కెళ్ళచువ్వ: పొడుగ్గా తెల్లగా ఉండే ఒకరకం మొక్కచువ్వ(బరిగె). (తె. 7).

తగ్గు: 1. పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒకకణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవ మాదిరిగా పల్లంగా ఉండే భాగం. (తె. 1; రా. 7); 2. పుట్టి (= నీళ్ళమీద తేలేది) లోపలి పల్లపుభాగం; ఖాళీగా ఉంటుంది. (రా. 8).

తట్ట: 1. ధాన్యం, మన్ను, పేడ మొ॥వి మోసుకుపోవడానికి వెదురుపేడుతో అల్లిన ఒకరకం గంప మామూలు గంపకన్న చిన్నది. (కో. 19, 25 తె. 31; రా. 4). 2. పర్యా. చూ. జల్లిగంప (1)

అన్నంగంజి వార్చడానికి సన్నటిపేళ్ళతో మధ్య సందులుండేటట్లు అల్లినగంప; అన్న సంతర్పణ వంటలకు వాడతారు. చూ. చిత్రం 52. (రా. 1) **3.** పర్యా. చూ. రేషంతట్ట. పట్టుపురుగులనుగాని, పట్టుకాయ (= పట్టుపురుగుచుట్టూ కాయమాదిరిగా ఏర్పడ్డ దారాలు)నుగాని తీసుకువెళ్ళే తట్ట; రెండు బెత్తలఎత్తూ గజంవెడల్పూ ఉంటుంది. చూ. చిత్రం 31. (తె. 28; రా. 1, 2, 5) **4.** పర్యా. చూ. పేడతట్ట (1). పేడ వేసుకొనే చిన్నతట్ట; అల్లకం చిక్కగా ఉంటుంది, కొన్నిచోట్ల పెంకె ఆకారం లోనూ కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి గిన్నెమాదిరిగానూ కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 9, 30, రా. 3). **5.** పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసిపెట్టుకోడానికి వెదురుపేళ్ళతో గాని ఈతపేళ్ళతోగాని అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66. (కో. 1; రా. 3); **6.** పర్యా. చూ. మంతు (1). ఒకరకం చేట; కట్టు (బద్ద), కర్ర (కడ్డీలాంటి సన్నటి వెదురుబద్ద) వేసి కట్లు కట్టనిది; మూలలు మలిపి అంచు కట్ట కుండా వదిలేసినదాన్ని ఇలా అంటారు (కో. 21); **7.** పర్యా. కుంచతట్ట. ధాన్యం పోసుకొనే ఈత బద్దలగంప; మూతి వెడల్పుగా ఉంటుంది. (తె. 11, 20).

**తట్టకర్ర:** పేడతట్ట అల్లకంలో పైన మిగిలిన నిలువులను లోపలికి దోపడానికి వాడే కర్ర. (రా. 3).

**తట్టగుండు:** రేషంతట్ట (చూ.) చుట్టూ నాలుగుపేళ్ళ ఎత్తు ఉండేలా గుండ్రంగా పెట్టి వంచినబద్ద; ఈ తట్ట ఎత్తు బెత్తెడే ఉంటుంది. (రా. 2).

**తట్టడుగు:** (< తట్ట + అడుగు) రేషంతట్ట (చూ.) అడుగుభాగం. (రా. 2).

**తట్టవార:** ఉ. తట్టోర; తట్ట అల్లకంకోసం ఈనె తియ్యడానికి తయారుచేసిన వార; చూ. వార. (కో. 12).

**తట్టిమానె:** ఉ. – మాని; వెదురుతో అల్లిన ఒకరకం చిన్నగంప; 18 కిలోల ధాన్యంపడుతుంది; చుట్టు కొలత కిందినుంచి పైవరకు ఒకేమాదిరిగా ఉంటుంది. (కో. 9).

**తట్టు:** (క్రి.) ఉ. తెట్టు; **1.** పర్యా. గుద్దు, చప్పరించు కొట్టడం; వెదురుగడ పగలగ్గొట్టడానికి కత్తిమీద మొద్దుతో కొడతారు. (కో. 1; రా. 1); **2.** పర్యా. అడుగు(3). అడుగుతట్టు, జల్లెడడుగు. జల్లెడతట్టు, జల్లెడమట్టు. మట్టు(2). జల్లెడఅడుగు అల్లకంలో పేడుకూ పేడుకూ మధ్య సన్నగా ఎడంవదులుతూ అల్లినభాగం, జల్లించవలసినవి దీంట్లో పోసు కొంటారు, దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడు వేళ్ళ ఎత్తున గోడుగా అంచు ఉంటుంది. చూ. చిత్రం 30 క. 4. (కో. 12–18; తె. 8, 18, 19, 21, 22, 25–28, 30); 3. పర్యా. కడ(2) వైపు. (రా. 5).

**తట్టెరకలి** (తట్ట + ఎరకలి) ఉ. – ఎర్కలి. ఎరకలి వాళ్ళలో ఒకతెగ, ఈతబొట్టతో తట్టలు, గంపలు మొ॥ వాటి అల్లకం చేస్తారు. (తె. 7).

**తడక:** ఉ. తడిక, తడికి, తడికె, తడ్క, తడ్కి. **1.** పర్యా. వెదురుతడక(1). వెదురుపేడుతో చతురస్రంగాగాని దీర్ఘచతురస్రంగాగాని అల్లినది; నిలువుకు పలచటిబద్దా, అడ్డానికి మందంపేడూ పెట్టి అల్లుతారు; ఇళ్ళలోనూ బయటా చాటుకోసంగాని, ఇంటికప్పుకిందా రేకులకిందా పందిరిమీదా కప్పడానికి గాని వాడతారు; చూ. చిత్రం 36 క. (కో. ; తె. ; రా.); **2.** పర్యా. చూ. వాకిలితడక(1). గుమ్మానికి అడ్డంగా తలుపుమాదిరిగా పెట్టే వెదురు తడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (రా. 3); **3.**మరుగుకోసం అడ్డంగా నిలబెట్టడానికిగాని కింద పరవడానికిగాని ఈత చువ్వలతో అల్లినది. (తె. 7, 9, 11, 13, 14, 16, 20; రా. 8, 9).

**తడకగోడీ.** ఉ. తడగ్గోడీ; పర్యా. బెదగు. తడక అల్లకంలో నిలువుగా ఉపయోగించే మందంపేడు; దీనికి ఒకఅంచున పసరు భాగముంటుంది. (కో. 23).

**తడకడుగు:** తడక అడుగుభాగం. (రా. 4).

**తడకతుకు:** ఉ. తడకతుక్కు; పర్యా. చూ. తడకపేడు తడక అల్లడానికి వెదురుబద్ద చీరి తీసిన పేడు; వెడల్పుగానూ (= రెండు వేళ్ళపాటి) మందంగానూ ఉంటుంది. (తె. 25).

**తడకదాపు:** (క్రి.) ఉ. తడిక–; పర్యా. చూ. పన్ను(2). తడక అల్లడానికి (దీర్ఘచతురస్రపు చట్రం అమర్చిగానీ అమర్చకుండాగానీ) నిలువులు వరసగాపేర్చి మొదటిభాగంలో నిలువులకడ్డంగా పేడు ఇమిడ్చి అల్లకానికి సిద్ధం చేయడం. (కో.18).

**తడకనేత:** పర్యా. తడకల్లకం(1). నిలువులచుట్టూ అడ్డపేళ్ళు తిరిగివచ్చేటట్లు అల్లే విధానం; తడక,

గంప, బుట్ట మొ॥ ఇలా అల్లుతారు. (తె. 27).

తడకపన్ను: (క్రి.) ఉ. తడికె—; పర్యా. చూ. పన్ను(2). తడక అల్లడానికి (దీర్ఘచతురస్రపు చట్రం అమర్చిగానీ అమర్చకుండాగానీ) నిలువులు వరసగా పేర్చి మొదటిభాగంలో నిలువులకడ్డంగా పేడు ఇమిడ్చి అల్లకానికి సిద్ధంచేయడం. (కో. 19).

తడకపేడు: ఉ. తడిక—, తడికె—, తడ్క—; పర్యా. ఈనె(5), తడకతుకు, తడకీనె, పేడు(3). తడక అల్లడానికి వెదురుబద్దచీరి తీసినపేడు; వెడల్పుగానూ (= రెండువేళ్ళపాటి) మందంగానూ ఉంటుంది. (కో. 9, 11, 18; తె. 3, 12, 28, 31; రా. 4, 5).

తడకబద్ద: ఉ. తడ్క— ; అలమారు పక్కలకు సందు లేకుండా తడకలా అమర్చినబద్ద; ఇవి రెండుపక్కలా ఉంటాయి. (తె. 8).

తడకల్లకం: (< తడక · అల్లకం) ఉ. తడికల్లకం; 1. పర్యా. తడకనేత. నిలువులచుట్టూ అడ్డపేళ్ళు తిరిగివచ్చేటట్లు అల్లేవిధానం; తడక, గంప, బుట్ట మొ॥ ఇలా అల్లుతారు. (కో. 17; రా. 3, 9); 2 నులకమంచ మల్లకంలో మేదరి తడకలాంటి డిజైను వచ్చేటట్లు నులకతో అల్లడం. (రా. 4).

తడకవార: ఉ. తడికె—; తడక అల్లడానికి వాడేవార (చూ.); వెడల్పుగానూ పొడుగ్గానూ ఉంటుంది. (కో. 10).

తడకీనె: (< తడక + ఈనె) ఉ. తడకానె; పర్యా. చూ. తడకపేడు. తడక అల్లడానికి వెదురుబద్ద చీరి తీసిన పేడు; వెడల్పుగానూ (=రెండువేళ్ళపాటి) మందంగానూ ఉంటుంది. (కో. 26).

తడగ్గోలు: (< తడక + గోలు) పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగావచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్ద నుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. (కో. 28).

తడప: 1. పర్యా. చూ. కట్టుముంగు. చేట, జల్లెడ, విసనగర్ర మొ॥వాటికి కట్టుకట్టడాని కుపయోగించే పలచటిపేడు; దీన్ని వెదుర్నుంచిగాని, ఈతబరిగె నుంచిగాని, తాటిమట్టనుంచిగాని తీస్తారు. (కో. 17-19); 2. పర్యా. చూ. పెడ (2). కొబ్బరి కాయచుట్టూ పైన పచ్చగా, నున్నగాఉండే పలచటి పొర; తాట (కో 5); 3. ఈతమట్ట తాటిమట్టల నుంచి చీల్చిన మందంపాయ; ఈతమట్టది వేలెడు వెడల్పుగానూ అరుకన్న మందంగానూ తాటిమట్టది రెండుమూడు వేళ్ళ వెడల్పుగానూ ఐదారాకుల మందంగానూ ఉంటుంది. (తె. 9).

తడిపీచు: ఉ. తడిపీసు; కొబ్బరిడొక్క నానవేసి చితగ్గొట్టి తీసినపీచు. (కో. 21).

తనిగా: (క్రి. విశ) విడిగా, వేరువేరుగా. (రా. 3).

తపనగాలు: పర్యా. చూ. దొంగనిలుగు (2). ఈత గంప మొ॥వాటి అల్లకంలో అడుగునపెట్టే ఆరు జతల నిలువులుగాక ప్రత్యేకంగా అడుగువరకే ఉండే ఒక నిలువుబద్ద; ఇది లేకపోతే అల్లకం కుదరదు. (తె. 13).

తప్పుడుమెట్టు: పర్యా. చూ. దొంగనిలుగు (2). ఈతగంప మొ॥వాటి అల్లకంలో అడుగునపెట్టే ఆరుజతల నిలువులుగాక ప్రత్యేకంగా అడుగువరకే ఉండే ఒక నిలువుబద్ద; ఇది లేకపోతే అల్లకం కుదరదు. (రా. 9).

తప్పుతీసుకొను: (క్రి) మగడు చనిపోయినప్పుడు ఇంకోమగణ్ణి కట్టుకొన్న స్త్రీ దగ్గరనుంచి కులపెద్దలు రుసుం (మూడురూపాయలు) వసూలుచేయడం. (కో. 24).

తమాటగంప: ఉ. టమాట—; టమాటాలు వేసుకొనే ఈతగంప. (తె. 13).

తమలపాకులజంగిడి: ఇంట్లో తమలపాకులు వేసి పెట్టుకొనే చిన్నదాగర; మూతలేని చిన్నపెట్టెలా దీర్ఘచతురస్రాకారంగా ఉంటుంది. (కో. 26).

తమాష: చూ. తవాచ్చి. (తె. 9).

తమ్మె: ఉట్టె వేలాడదీయడానికి పైన పెట్టినదీ; కొక్కెంలాంటిది. (రా. 4).

తరాజుసిబ్బి: (< హిం. తరాజూ) ఉ. తరాచ్చిబ్బి, తరాజశిబ్బి, తరాజ్చిబ్బి; 1. పర్యా. కాటాజిబ్బిలి, తక్కెడసిబ్బి, తూనకంసిబ్బి, దడింసిబ్బి, సిబ్బి(5). వెదురుపేడుతో అల్లిన తక్కెడపళ్ళెం. (కో. 9-11, 14; తె. 6, 8, 28); 2. ఈతబద్దలతో అల్లిన తక్కెడపళ్ళెం. (తె. 9).

తరుగు: వృథా అయినది; తరిగిపోయినది. (తె. 7).

తర్డు: (< ఇం. Third) పర్యా. చూ. తర్డ్‌క్లాస్‌బొంగు. దాదాపు 9 సెం. మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ; చింతకాయలు రాలగొట్టడానికీ, అలమర్ల తయారీకీ పనికొస్తుంది; పేడుతీయడానికి పనికిరాదు. (తె. 31).

తర్డ్‌క్లాసబొంగు: (< ఇం. Third class—) ఉ. తర్డికిలాస్—; పర్యా. అర్డినరీబొంగు, తర్డు, తడ

క్వాలిటీ, నాసిబొంగు, మూడోక్వాలిటీ, మూడో రకంబొంగు. దాదాపు 9 సెం. మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ; చింతకాయలు రాలగొట్టడానికీ, అలమర్ల తయారీకీ పనికొస్తుంది; పేడు చీరడానికి పనికిరాదు. (తె. 5; రా. 8).

తర్డ్ క్వాలిటీ: (< ఇం. Third quality) పర్యా. చూ. తర్డ్‌క్లాస్‌బొంగు. దాదాపు 9 సెం. మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ; చింతకాయలు రాలగొట్టడానికీ, అలమర్ల తయారీకి పనికొస్తుంది; పేడు చీరడానికి పనికిరాదు. (తె. 10).

తల: 1 పర్యా. అంచు(2), మొదలు(3). ఒకరకం మేదరికత్తికి వెడల్పుభాగం చివర. (కో. 23, 28, 30, 31; తె. 5, 23); 2. పర్యా. చూ. వెన్ను(4). మేదరికత్తికి మందంగాఉన్న పైభాగం; సుమారు వేలెడువెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 ద. 3. (తె. 8, 10, 22); 3. పర్యా. చూ. మూపురం. మేదరికత్తికి వెన్ను (చూ.) పదునంచువైపు వంపుదిరిగిన భాగం. చూ. చిత్రం 12 జ. 4. (తె. 7); 4. పర్యా. దబ్బలం మడం, దవ్వనంగొడుగు. దబ్బనానికి లావుగా ఉన్నవైపు కొననున్న బొడిపె; కొన్నిటికి బొడిపె లేకుండా వంపుదిరిగి ఉంటుంది. చూ. చిత్రం 18 క.2. (కో. 22, 23, 31). 5. పర్యా. నెత్తి(3). ఉలికి ఉండే పిడిపైభాగం. చూ. చిత్రం 20 క. 5. (రా.9); 6. పర్యా. పైతల. వాకిలితడక (= ఇంటిముందు భాగమంతకూ కట్టే తడక; దీనికి ద్వారం, ద్వారం తడకా కలిసే ఉంటాయి)లో గుమ్మానికి పైనఉండే తడకభాగం. (కో. 10, 1[illegible]).

తలకట్టు: 1. గొ. రెపిల్లలపొదికి పైనుండే బొద్దులాంటి భాగం. (తె. 23); 2. పర్యా. చూ. మూతికట్టు(1), గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచుచుట్టు వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం చూ. చిత్రం 47 క. 5. (కో. 18; తె. 21, 22, 28); 3. పర్యా. తలబొద్దు(2), మీదికట్టు(2). ఈత చువ్వలతో అల్లే గంప మొ॥వాటి అంచుచుట్టూ ఉబ్బెత్తుగా అల్లిన భాగం. (కో. 25).

తలకాయ: 1. పర్యా. చూ. మూపురం. మేదరికత్తి వెన్ను(చూ.) పదునంచువైపు వంపుదిరిగిన భాగం. చూ. చిత్రం 12 జ. 4. (కో. 18); 2. కలబంద పట్టలో చెట్టుకు పెరిగినభాగం లేదా చెట్టునుంచి కోసినభాగం; వెడల్పుగా ఉంటుంది. (రా. 5).

తలకొప్పు: గుమ్మిమీది ఇలారంగాలికి లేచి పోకుండా కట్టేసిగ. చూ. చిత్రం 74 ప. 5. (తె. 7).

తలగడ: పర్యా. చూ. తలాపు. వెదురుమంచానికి తల పెట్టుకోడానికి వీలుగా ఎత్తుగా ఏర్పరిచిన భాగం. చూ. చిత్రం 108. 6. (కో. 9).

తలగుండు: కొడమ పైభాగంలో లోపలినుంచి వృత్తాకారంలో అమర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 73 క. 1. (కో. 4).

తలజచ్చినవెదురు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొంగు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (రా. 3).

తలదిండు: పర్యా. చూ. తలాపు. వెదురుమంచానికి తలపెట్టుకోడానికి వీలుగా ఎత్తుగా ఏర్పరిచిన భాగం. చూ. చిత్రం 108.6 (తె. 31).

తలపడగ: ఉ. పడిగె; పర్యా. చూ. పడగ (2). మేదరికత్తి వెన్నుకూ పదునుభాగానికీ మధ్యఉండే చెంప. చూ. చిత్రం 12 ద. 4. (తె. 26).

తలపెండె: ఉ. —పెండీ; పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచు చుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండు వేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం. చూ. చిత్రం 47 క. 5. (కో. 22. 25).

తలపెండెవార: ఉ. పెండోర; గంప మొ॥వాటి అల్లకంలో మూతిదగ్గర వేసేకట్టు (బొద్దు, పెండె)కు చుట్టేకర్ర (చూ.); నడింపెండె వారకన్న లావుగా ఉంటుంది. (కో. 30).

తలబద్ద: 1. ఊకజల్లలో మూలలు వంచినవైపు అమర్చిన వెదురుబద్ద. (కో. 15); 2. తడకతల (చూ.) మీదవేసే బద్ద. (కో. 10).

తలబొద్దు: 1. పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచుచుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం. చూ. చిత్రం 47 క. 5; (కో. 4. 29, 30; రా. 4); 2. పర్యా. చూ. తలకట్టు (3). ఈతచువ్వలతో అల్లేగంప మొ॥వాటి అంచుచుట్టూ ఉబ్బెత్తుగా అల్లినభాగం. (కో. 3).

తలబోడుకర్ర: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒక

రకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (కో. 23, 24).

తలబోదెదురు: (< తలబోడి + వెదురు) పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (కో. 31).

తలం: ఈతచువ్వతో అల్లినగాదె (గుమ్మి) అడుగు భాగం. (రా. 8).

తలమొండికర్ర: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒక రకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (కో. 27).

తలమోటు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 6, 7; రా. 3).

తలమోడుకర్ర: పర్యా. చూ. కొండెంగమెట్టు. ఒక రకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 26).

తలంబ్రాలబుట్ట: పెళ్ళికి తలంబ్రాలు (= పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూ ఒకరి నెత్తిమీద ఒకరు పోసుకొనే బియ్యం) సిద్ధంగా పోసిపెట్టుకొనే బుట్ట. (కో. 23).

తలాపు: పర్యా. తక్కె, తలగడ, తలదిండు, తెంతె. వెదురుమంచానికి తలపెట్టుకోడానికి వీలుగా ఎత్తుగా ఏర్పరిచిన భాగం. చూ. చిత్రం 108. 6. (తె. 1, 2, 5, 10, 19).

తలాపుకేంచి: పర్యా. తలాపుదబ్బ. వెదురుమంచం తయారీలో తలవైపుభాగం ఎత్తుగా ఉండడానికి కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 108. 7. (తె. 1).

తలాపుదబ్బ: పర్యా. తలాపుకేంచి. వెదురుమంచం తయారీలో తలవైపుభాగం ఎత్తుగా ఉండడానికి. కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 108. 7. (తె. 2, 5).

తలుగు: పశువులను కట్టడానికి నారతో పేనినతాడు; దీనికి ఒకచివర రెండుపాయలుగా ఉండి ఒకదానికి కొలికి మరొకపాయకు ముడి ఉంటాయి; కట్టేటప్పుడు పశువు మెడకుచుట్టి కొలికి ముడిభాగాన్ని దూరుస్తారు. (రా. 4, 5).

తలుపుతడక: పర్యా. చూ; వాకిలితడక(1). గుమ్మానికి అడ్డంగా తలుపుమాదిరిగా పెట్టే వెదురు తడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (కో. 23, 24).

తల్లివేరు: ఉ. తల్లేరు; పర్యా. గూటేరు, పెద్దవేరు, మొదలువేరు. వెదురుమొక్క దుంపనుంచి పారిన పెద్దవేరు; లావుగా పొడుగ్గా ఉంటుంది; నేలలోపలికి చాలా దూరం పారుతుంది; దీన్నించి సన్నటిదారాల్లా పిల్లవేళ్ళు పుట్టుకొస్తాయి. (కో. 22).

తల్వాలు (< తలవాలు) తలంబ్రాలు; పెళ్ళివేళ పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ ఒకరినెత్తిమీద ఒకరు దోసిళ్ళతో పోసుకొనే బియ్యం. (తె. 6, 22).

తవక్సిరి: చూ. తవాచ్చి. (తె. 16).

తవాక్షి: చూ. తవాచ్చి. (కో. 14).

తవాచి: ఉ. తవాచ్, చూ. తవాచ్చి. (కో. 13; తె. 8).

తవాచ్చి: రూ. తమాక్షి, తవక్సిరి, తవాక్షి, తవాచి, తవ్వాచ్చి; పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండినగడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలికపగిలినప్పుడు తెల్లతిరుమనిగొర, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది. (తె. 26–28).

తవిడిజల్లెడ: తౌడుకలిసిన నూకలు జల్లించడానికివాడే జల్లెడ. (రా. 3).

తవ్వ: ధాన్యం మొ॥ కొలిచే ఒకపాత్ర; వెదురుగడతో చేస్తారు; అరకిలోధాన్యం పడతాయి. (తె. 19).

తవ్వాచ్చి: చూ. తవాచ్చి. (కో. 12).

తవ్వె: పర్యా. చూ. చెక్క-(1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తేవచ్చే ఒకభాగం. (తె. 21-26, 28).

తవ్వెచార: ఉ. —సార; పర్యా. చూ. దోనె. వెదురు గడను నిలువుగా రెండుపాయలుగా చీల్చినప్పుడు ఒకకణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవ మాదిరిగా పల్లంగా ఉండే భాగం. (తె. 22).

తవ్వెడుగుల్ల తవ్వెడుధాన్యం పట్టే వెదురుపేళ్ళగుల్ల (తె. 21).

తవ్వెడుచిట్టెడుగుల్ల: ఐదుకిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 21).

తాజమాల్‌చాప: తాజమహల్ డిజైన్ వచ్చేటట్లు నేసిన తుంగచాప. (కో. 3).

తాట: పర్యా. బెండు (5) వెదురుగడపైన పసరుపొర తరవాత ఉండే కండ. (కో. 17).

తాటగా: (క్రి. విశ.) పలచగా, సన్నగా. (కో. 19).

తాటికమ్మ: పర్యా. కమ్మ (5), తాటేకు (2). తాటి మట్టకు చివర నొక్కుడురేకుల మాదిరిగా పచ్చగా, పలచగా విస్తరించిన భాగం; ఇళ్ళు, పందిళ్ళు మొ॥ కప్పడానికీ దడి కట్టడానికీ వాడతారు; చూ. చిత్రం 123 (కో. 23).

తాటిచాప: ఉ. —సాప; పర్యా. తాటేకుచాప. తాటేకు రేకులతో అల్లినచాప; మామూలుగా నేలమీద పరుచుకొంటారు; చూ. చిత్రం 125. (కో. 23, 26).

తాటినారపోచ: ఉ. తాట్నారపోస; తాటినారలోని ఒక విడిపోగు; సన్నటి దారంలా ఉంటుంది. (తె. 9).

తాటిపాట: తాటిచెట్టుమీద గెలకు అంటుకొనిఉండి సుమారు మూరెడుపొడుగూ బెత్తెడుగాని రెండు బెత్తెలుగాని వెడల్పూ ఉండే ఆకు; ముడుచుకొని ఉంటుంది; దీన్ని నిలువుగా రెండుగాగాని మూడుగా గాని చీలుస్తారు; చీపుళ్ళు కట్టడానికి పనికొస్తుంది. (తె. 9).

తాటిపొట్టు: తాటిమట్ట నుంచి చీరిననార; కొన్నిచోట్ల పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కలిసివస్తుంది; చేట మొ॥వాటికి కట్లు కట్టడానికి పనికొస్తుంది. (తె. 26-28).

తాటిపొరక: తాటిపాట (చూ.)లను ఉపయోగించి తాటినారపురి కట్టిన చీపురు; వాకిలి, ఇల్లు మొ॥ ఊడ్చుకోడానికీ కళ్ళం అలకడానికీ పనికొస్తుంది. (తె. 9).

తాటిమట్ట: తాటికమ్మ మొదలు; తాటిచెట్టును అంటి పెట్టుకొని ఉన్నచోట మందంగా, వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మట్టనుంచి ఆకు వరకు రెండుపక్కలా అంచులకు రంపంపళ్ళ లాంటి ముళ్ళు ఉంటాయి; మట్టనుంచి తీసిననార చేట, జల్లెడ మొ॥వాటికి కట్లు కట్టడానికి వాడతారు, చూ. చిత్రం 123.1 (కో. 19, 23; తె. 9).

తాటిరేకు: పర్యా. తాటేకు (1), రేకు (6). తాటికమ్మ నుంచి చీల్చితీసిన ఆకు; రెండుమూడువేళ్ళ వెడల్పు గాను పోనుపోను చివర సన్నగానూ గోరు మందంగానూ ఉంటుంది; ఇలాంటి ఆకులు కమ్మకు ఇటుపైముప్పైదాకా ఒకదానొకటి అంటుకొని ఉంటాయి; రేకుకూ రేకుకూమధ్య సన్నటిఈనె ఉంటుంది; చూ. చిత్రం 124. (కో. 26).

తాటేకు: (< తాటి + ఆకు) 1. పర్యా. చూ. తాటిరేకు. తాటికమ్మనుంచి చీల్చితీసిన ఆకు, రెండుమూడు వేళ్ళ వెడల్పుగానూ పోనుపోను చివరసన్నగానూ గోరుమందంగానూ ఉంటుంది; ఇలాంటి ఆకులు కమ్మకు ఇటుపై ముప్పై దాకా ఒకదానొకటి అంటుకొని ఉంటాయి; రేకుకూ రేకుకూ మధ్య సన్నటి ఈనె ఉంటుంది; చూ. చిత్రం 124. (కో. 12, 19); 2. పర్యా. చూ. తాటికమ్మ. తాటి మట్టకుచివర నొక్కుడు రేకులమాదిరిగా పచ్చగా, పలచగా విస్తరించిన భాగం; ఇళ్ళు, పందిళ్ళు మొ॥ కప్పడానికీ దడికట్టడానికీ వాడతారు; చూ. చిత్రం 123. (కో. 23).

తాటేకుచాప: ఉ. —సాప; పర్యా. తాటిచాప. తాటేకు (రేకు)లతో అల్లినచాప; మామూలుగా నేలమీద పరుచుకొంటారు; చూ. చిత్రం 125. (కో. 19).

తాటేకుబుట్ట తాటేకులతో అల్లినబుట్ట. (కో. 12, 19).

తాడు: పురిపెట్టినపోచలు కలిపిపేనితే తయారయేది; నార, పీచు మొ॥వాటి పోచలుగాని ఈతాకులుగాని పురిపెట్టినప్పుడు వచ్చిన పాయలను (రెండుమూడు) కలిపిపేంతారు. (కో; తె; రా).

తాడుజెడ: గోదినీచుట్టూ జెడమాదిరిగా అల్లినది. (కో. 20).

తాడువేయు: (క్రి.) ఉ. తాడేయు; పర్యా. పేనుచు. రెండుగాని అంతకన్న ఎక్కువగాని పురులనుకలిపి వడిపెడుతూ తాడు అల్లడం; పేనడం. (తె. 9; రా. 4, 5).

తాడొంజు: (< తాడు + ఒంజు) పర్యా. గొచ్చు. సుమారు రెండుజేనల పొడుగున గుండ్రంగా చుట్టిన వందవరసల కొబ్బరినులకతాడు చుట్ట. (కో 25,29).

తాపిమానె: ఉ. మాని; పర్యా. చూ. ఉప్పుతట్ట ఇళ్ళకట్టుబడి పనిలో మన్నూ సిమెంటు మొ॥ మోయడానికి వాడేతట్ట; ఇనపబెంకె ఆకారంలో ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమాంతరంగా ఉండి గిన్నెమాదిరిగా ఉంటుంది. (కో. 28).

తారారంసొమ్ము: ఎరకలివాళ్ళ పెళ్ళిళ్ళలో పెళ్ళికూతురు ఇంటికి పెద్దకూతురయితే పెళ్ళి కూతురి అమ్మమ్మకుగాని మేనమామకుగాని మగ పెళ్ళివారు ఇచ్చేడబ్బు; "మూడుపుంజీలు" (12 రూపాయలు) ఇస్తారు. (కో. 25).

తాలాపు: స్టా. (కో. 10).

తాలింపుబుట్ట: కూరగాయలు కడుక్కొనేబుట్ట. (రా.3).

తాల్చు: (క్రి.) నారపోచలతో రెండుచేతులమధ్య సన్నటి తాడుపేనడం; రెండు నారపోచల మొదటి భాగాలను మెలిబెట్టి, మెలిబెట్టిన భాగాన్ని కాలి బొటనవేలికింద అదిమిపట్టి ఆ రెండు పోచల్ని రెండు చేతులమధ్య ఉంచుకొని ఏపోచకాపోచ వడిబెడుతూ రెంటినీ కలిపి పెనవేస్తూ పోచలు అయిపోతుంటే మళ్ళీ పెట్టుకుంటూ తాడు పేంతారు; మంచం నులకలాంటి సన్నటి తాళ్ళు మాత్రమే ఇలా పేంతారు. (తె. 9).

తాళ్ళకట్ట: మంచంలో కాళ్ళుపెట్టుకొనే వైపు అల్లిన నులకకూ కాళ్ళవైపు అడ్డపట్టెకూ కలిపి గుంజికట్టిన తాళ్ళవరస. (తె. 9).

తిక్కడమేదరి: 1. మంచాలు, కావడిబద్దలు, నిచ్చెనలు మొ॥ చేసుకొని బతికే మేదర్లతెగ. (కో. 15); 2. ఉ. తిక్కడ్—; పర్యా. చూ. తూర్పుమేదరి. (తూర్పు) గోదావరిజిల్లా మొదలుకొని ఆపైన తూర్పు ప్రాంతంలో ఉండే మేదరివాళ్లు. (తె. 18).

తిక్కడి: 1. పర్యా. చూ. వంకె. వెదురుపేడు గీకడానికి వాడే ఒకపనిముట్టు; 'X' ఆకారం బద్దల కర్రల మీద ఒక పొడుగాటి కర్రగాని బద్దగాని అమరుస్తారు; దానిమీద పేడు ఆనించి కత్తిని వెనక్కీ ముందుకూ లాగుతూ పేడు గీకుతారు; చూ. చిత్రం 14 చ. (తె. 31). 2. పర్యా. చూ. ఇంగలముట్టి, శ్మశానానికి నిప్పుల (ఇంగలం) కుండ తీసుకువెళ్ళడానికి వెదురుబద్దలతో కట్టిన చట్రం; ఉట్టిమాదిరిగా పట్టుకోడానికి బద్దలకు తాళ్ళు కడతారు (చట్రంమీద కుండ పెడతారు). చూ. చిత్రం 99. (తె. 31).

తిక్కడికర్ర: పర్యా. చూ. వంకెకర్ర. వంకె (చూ.) నిర్మాణంలో 'X' ఆకారం కర్రలకు కట్టిన గజం పొడుగు వెదురుకర్ర. చూ. చిత్రం 14 ఛ. 1. (కో. 31).

తిత్తెం: పర్యా. చూ. అడిపోగు (1). గంప, బుట్ట, సిబ్బి, మొ॥వాటి అల్లకంలో బొడ్డడుగూ అకుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కిందిపేడును రెండు భాగాలుగా నిలువుగా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (కో. 19).

తిన్నటికర్ర: పర్యా. చూ. సైరబొంగు (1). వంకలు లేకుండా నిటారుగా పెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గా ఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 29, 30).

తిన్ననివాసం: పర్యా. చూ. సైరబొంగు(1). వంకలు లేకుండా నిటారుగా పెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గా ఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 14).

తిప్పుకర్ర: పురిపెట్టిన కొబ్బరితాడు చుట్టుకొనేలా తిప్పడానికి + ఆకారంలో పెట్టిఉండే కర్ర(లు). (కో. 30).

తిప్పుండ: (< తిప్పు+ఉండ) తిప్పుకర్ర (చూ.)కు చుట్టిన పురిపెట్టిన తాడుచుట్ట. (కో. 31).

తింపు: 1. తిప్పడం; జల్లెడ అడుగుమీద గుండు (బద్ద), కర్ర (కాస్త మందమైన బద్ద) అమర్చి ఆ మూడింటినీ కలిపి కట్టుముంగు ( =పలచటి పేడు లేదా తీగ)తో గుర్జముడివేసి మిగిలిన కట్టుముంగు కొసలను మెలితిప్పి లోపలికి మడిచి వదిలేస్తారు. (తె. 18, 25); 2. పర్యా. చుట్టు. ఈతగంప మొ॥వాటి అల్లకంలో నిలువుల చుట్టూ ఒకనిలువు వదలి మరొకనిలువు చుట్టూ ఈతబద్ద చుట్టడం. (తె. 13).

తిమ్మె: పలుపుకు ఒకచివర ముడి దూర్చడానికి చేసిన సందు. కాడికిఎద్దును కట్టేటప్పుడు పలుపు రెండో చివరి ముడిని దీంట్లోకి దూరుస్తారు. (తె. 9).

తిరుగోల: 1. చూ. తిరుగోలె. (తె. 21); 2. (క్రి. విశే.). చుట్టూరా; ఈతచాపచుట్టూ అంచు పట్టె కుడతారు. (తె. 21).

తిరుగోలె: (క్రి. విశే.) రూ. తిరుగోల(1). పర్యా. చుట్టూరుగా, చుట్టూరా. (గుండ్రంగా); జల్లెడ చుట్టూరా కట్టు(బద్ద) పెట్టి బిగిస్తారు. (తె. 14, 19, 21).

తిరుపతిబుట్ట: పూలు ఏరడానికీ గుడికి తీసుకువెళ్ళడానికీ ఉపయోగించే పూలబుట్ట; మామూలుగా దీనికి

కమాన్‌బద్దా (పట్టుకొడానికి పీలుగా వంచికట్టిన వెదురుబద్ద) గద్దె ఉంటాయి; చుట్టూ కళ్ళు(కంతలు) పెడతారు; కొన్ని మరచెంబు ఆకారంలోనూ, కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ, కొన్ని ఎత్తుపళ్ళెం ఆకారంలోనూ ఉంటాయి; కొన్నిటికి మూత కూడా ఉంటుంది. (తె. 9).

తిరుమణికాయ: ఉ. తిరుమని –; తిరుమణిపొడి పోసుకోడానికి జిట్టరేకు కట్టిచేసిన కాయలాంటి బుర్ర. (తె. 9).

తిరుమణిపెట్టె: ఉ. తిరుమని—; తిరుమాన్—; పర్యా. తిరుమణిబుట్ట, నామంపెట్టె. పూజాసామగ్రి (తిరుమణిపొడి = కచ్చూరాలు, గంధంకలిపి తయారుచేసిన పొడి) రుద్రాక్షలు, రాగిచెంబా, కుంకుమ, బొట్టుపుల్లలు మొ॥ ఉంచుకొనే చిన్న పెట్టె, కొన్నిచోట్ల రెండుపొరలుగానూ మూడు అరలుగానూ ఉంటుంది; అంచుకు బద్దలతో వేసిన కట్టు ఉంటుం; మూత ఉంటుంది. (కో. 3; తె. 9, 10, 14, 17, 26, 28).

తిరుమణిపొడి: ఉ. తిరుమని—; కచ్చూరాలూ గంధమూ కలిపి తయారుచేసిన పొడి; బొట్టుపెట్టు కొంటారు. (తె. 9).

తిరుమణిబుట్ట: ఉ. తిరుమని—; పర్యా. చూ. తిరుమణిపెట్టె. పూజాసామగ్రి (తిరుమణిపొడి = కచ్చూరాలు, గంధం కలిపి తయారుచేసిన పొడి, రుద్రాక్షలు, రాగిచెంబా, కుంకుమ, బొట్టుపుల్లలు మొ॥వి) ఉంచుకొనే చిన్నపెట్టె; కొన్నిచోట్ల రెండు పొరలుగానూ మూడు అరలుగానూ ఉంటుంది; అంచుకు బద్దలతోవేసిన కట్టు ఉంటుంది; మూత ఉంటుంది. (కో. 9).

తిర్రి: 1. చూ. టిర్రి. (కో. 24); 2. విప్పపూలు పోసుకొనే ఒకరకం చిన్నబుట్ట. (తె. 29).

తిర్రిబుంగ: పర్యా. చూ. చేపలబుట్ట(1). చేపలుపట్టే టప్పుడు నడుముకు కట్టుకొని చేపలు వేసుకొనేబుట్ట' కొన్నిచోట్ల కింద వెడల్పుగాఉండి పోనుపోను మూతిదగ్గర సన్నగా ఉంటుంది; కొన్నిచోట్ల మధ్యన రెండుమూలలు వస్తాయి, చూ. చిత్రం 76. (కో. 24).

తివ్వ: 1. చూ. తీగ(3). (కో. 28); 2. గుర్రం(చూ.) తయారీలో రెండుకాళ్ళను బిగించి కట్టడానికివాడే తీగ. చూ. చిత్రం 14 చ. 4. (కో. 24).

తివ్వకట్టు: గూడఅంచుకు తీగతో వేసినకట్టు. (కొ.29).

తీగ: ఉ. తీగై; 1. పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దడుగూ అడుగూ అల్లడానికివాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (కో. 4); 2 పర్యా చూ. నడి(1). చేట, జల్లెడ, విసనగర్ర మొ॥వాటికి కట్లు కట్టడానికి లేతవెదురుగడనుంచి తీసిన పలచటి మెత్తటి పేడు; ఎటువంచినా విరగదు. (కో. 6, 7); 3. రూ. తివ్వ(1); చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి వాడే ఒకరకం తీగ. (నల్లతీగ మొ॥); పచ్చిగా ఉన్నప్పుడు దీంట్లోంచి పాలుకారతాయి; ఊరబెట్టిన తరవాత తీగ నలుపవుతుంది. (రా. 5); 4. పర్యా. చూ. మొగిలినార. మొగలి ఊడలనుంచి తీసిననార; ఊడలుకోసుకొచ్చి తీగలు తీస్తారు; చేట మొ॥వాటికి కట్టుకట్టడానికి పనికొస్తుంది. (రా. 11); 5. పర్యా. నార(6), పేడు(6). పేముపైపొరనుంచి చీరితీసిన సన్నటిపేడు; బుట్టలూ కుర్చీలూ, టీపాయ్‌లూ, ఉయ్యాలలూ మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 139. 5. (కో. 3, 12).

తీగచీల్చు: (క్రి.) పర్యా. చూ. తీగలాగు(2). పేము కర్రనుంచి సన్నటిపేడు (తీగ) చీరడానికి కత్తుల పెట్టెలో అమర్చిన కత్తులజతల మధ్యనుంచి సన్నటికర్రలాగడం. (కో. 10).

తీగచుట్టు: ఉ. సుట్టు; రెండుపురులను కలిపి తాడు పేనేటప్పుడు రెండుపురులూ ఒకదానిచుట్టూ ఒకటి తగినంతగా పెనవేసుకొని తిరక్కుండా ఒకపురిని ఇంకోపురి చుట్టుకొన్నప్పుడు ఏర్పడ్డచుట్టు; తాడు పేనడం సరిగారాకపోతే ఇలాటి చుట్లువస్తాయి. (తె. 9).

తీగదీయు: (క్రి.) ఉ. –తీయు; 1. పర్యా. తీగలాగు (1). జల్లెడఅల్లకంలో అడుగు (చూ.) మీద ఒకగుండు (=వర్తులాకారంలో వంచినబద్ద) పెట్టి మోదిన తరవాత (= కట్టు మూకులో కట్టు బిగించిన తరవాత) బయటినుంచి మరోగుండు పెట్టి ఆ రెండింటి మీంచి ఇంకో గుండువేసి ఆ మూడింటినీ కలిపి కట్టుముంగుతో బిగించడం; చూ. తీగ. (కో. 13, 16); 2. పర్యా. చూ. తీగలాగు(2) పేముకర్రనుంచి సన్నటిపేడు(తీగ) చీరడానికి కత్తులపెట్టెలో అమర్చిన కత్తుజతల మధ్యనుంచి సన్నటికర్ర లాగడం. (కో. 19).

తీగబద్ద: పర్యా. చూ. నడి(1). చేట, జల్లెడ, సనవి

గర్ర మొ॥వాటికి కట్లుకట్టడానికి లేతవెదురుగడ నుంచి తీసిన పలచటి మెత్తటిపేడు ఎటువంచినా విరగదు. (కో. 11).

తీగలాగు: (క్రి.) 1. పర్యా. తీగదీయు(1). జల్లెడ అల్లికంలో అడుగు(చూ.) మీద ఒకగుండు (=వర్తులాకారంలో వంచినబద్ద) పెట్టిమోదిన తరవాత (=కట్టు మూకుతో కట్టుబిగించిన తరవాత) బయటి నుంచి మరోగుండు పెట్టి ఆ రెండింటిమీంచి ఇంకో గుండువేసి ఆ మూడింటినీ కలిపి కట్టుముంగు బిగించడం; చూ. తీగ. (కో. 15); 2. పర్యా. కోడులాగు తీగచీల్చు, తీగదీయు(2), పేముకర్ర నుంచి సన్నటిపేడు (తీగ) చీరడానికి కత్తులపెట్టెలో అమర్చిన కత్తులజతల మధ్యనుంచి సన్నటికర్ర లాగడం. (కో. 12).

తీగలాగేపెట్టె: పర్యా. చూ. కత్తులపెట్టె. పేముకర్ర తీగగా చీరే పనిముట్టు; ఒక కొయ్యదిమ్మకు మూడుజతల కత్తులు మూడు రకాలుగా అమర్చి ఉంటాయి; ఆ జతల్లోంచి పేముబెత్తంనుంచి చీల్చి తీసిన బద్దను లాగుతారు; మొదటి జతలోంచి లాగితే బద్దకుండే బెరడువంటి పదార్థం రాలిపోతుంది; రెండో జతలోంచి లాగితే పూర్తిగా బెండు రాలిపోయి బద్ద సన్నబడుతుంది; మూడో జతలోంచి లాగితే సన్నగా నున్నగా ఉండే తీగ వస్తుంది. చూ. చిత్రం 137. (కో. 10).

తీడు: (క్రి.) 1 పర్యా. చూ. కీడు. నూరడం; మేదరికత్తి పదునుపోయి మొండిగా అయినప్పుడు దాన్ని సానరాయి మీద నూరుతారు. (కో. 22); 2. ఈతచాప అల్లికం పూర్తయినతరవాత పట్టెల అతుకుమీద కొడవలితో రుద్దడం; అతుకులదగ్గర ఉబ్బెత్తుగా వచ్చిన భాగాలు అణగడానికి ఇలా చేస్తారు. (తె. 22).

త్రీనతీగ: త్రీనమొక్కనుంచి తీసినతీగ; చేట మొ॥ వాటికి కట్లు కట్టడానికి వాడతారు. (రా. 5).

తుక్కు: ఉ. తొక్కు; పర్యా. చెత్త (2), దుగ్గు (2), వెదురుతుక్కు. వెదురుబద్దలూ పేడూ చీల్చేటప్పుడు వచ్చే పుల్లల్లాంటి చిన్నచిన్న ముక్కలు; పొయ్యిలోకి పనికొస్తాయి. (కో. 18, 19, 22, 25, 30, 31; తె. 22, 23).

తుక్కుచెత్త: పర్యా. చూ. పీచు (1). వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడు వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగా ఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు. (తె. 14).

తుక్డ: (< హిం. టుక్డా) 1. పర్యా. చూ. తుంట(3). వెదురుగడగాని బద్దగాని అడ్డంగా నరికితే వచ్చే సుమారు మూరెడుముక్క. (తె. 16); 2. ముక్క; రెండుగజాల పొడుగున్న ఈతాకు పట్టెముక్క. (తె. 19).

తుంగ: చాపలు నేయడానికి పనికొచ్చే ఒకరకం గడ్డిమొక్క; నీటిమడుగుల్లోనూ కాలవలవెంటా వాగుల వెంటా పెరుగుతుంది; దీనిపోచ సన్నటితీగలా సుమారు గజం పొడుగుంటుంది. (కో. 3, 8, 19, 30; రా. 4).

తుంగచాప: పర్యా. సిరిచాప. పడుకోడానికీ కూర్చోడానికీ తుంగ (చూ.)తో నేసినచాప. (కో. 8, 19).

తుంగపోగు: పర్యా. చూ. తుంగపోచ. తుంగగడ్డిమొక్కకు పొడుగ్గా పెరిగిన ఒకపుల్ల (పోచ); సుమారు గజం పొడుగుంటుంది; ఇలాటి పుల్లలతో చాపలు నేస్తారు. (రా. 4).

తుంగపోచ: పర్యా. తుంగపోగు, పుల్ల (7) పోచ. తుంగగడ్డి మొక్కకు పొడుగ్గా పెరిగిన ఒకపుల్ల (పోచ); సుమారు గజం పొడుగుంటుంది; ఇలాటి పుల్లలతో చాపలు నేస్తారు. (రా. 4).

తుంట: 1. పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొంద ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (తె. 26). 2. పర్యా. చూ. కట్టె (1). వెదురుగడ పగలగొట్టేటప్పుడు గడకు కరిపించిన కత్తిమీద దెబ్బలు కొట్టడానికీ చిల్లి చేసేటప్పుడు ఉలిమీదపెట్టి కొట్టడానికీ వాడే కర్ర; మూరెడు పొడుగూ చెయ్యంత లావూ ఉంటుంది. (తె. 3); 3. పర్యా. తుక్డ (1), తునక. వెదురుగడగాని బద్దగాని అడ్డంగా నరికితే వచ్చే సుమారు మూరెడుముక్క. (తె. 2).

తుంటబద్ద: పర్యా. చిన్నబద్ద. పొడుగు తక్కువగా ఉండే వెదురుబద్ద. (తె. 15).

తుంటుబర్ర: పర్యా. చూ. కురచబరిగె. పొట్టిగాఉన్న ఈతబరిగె; జిట్టీత చెట్టునుంచిగాని పెద్దీతచెట్టు నుంచిగాని తీసింది. (రా. 8).

తుండు: పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని, పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకు

తగిలి ముక్కలుగా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగున్న కొయ్యమొద్దు; ఊమూలగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి, గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (కో. 1; రా. 1, 2, 4).

**తునక:** ఉ. తున్క; పర్యా. చూ. తుంట(3). వెదురు గడగాని బద్దగాని అడ్డంగా నరికితే వచ్చే సుమారు మూరెడుముక్క. (తె. 13).

**తుఱ్ఱెయిపోవు:** (క్రి.) (తుఱ్ఱె+అయిపోవు) పర్యా. చూ. కల్లిబోవు. రాళ్ళుతగిలి మేదరికత్తికి పదును వైపు ముక్కవిరిగిపోవడం. (కో. 25).

**తువ్వపేల.** తపుడులా ఉండే మెత్తటి ఇసక నేల.(రా.4).

**తూకు:** పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంత బుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచికట్టిన బద్ద; చేత్తోపట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (రా. 1).

**తూకుదబ్బ:** పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టినబద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించ డానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4.(రా. 3).

**తూకుబుట్ట:** ఉ. తోకుబుట్ట; పర్యా. చూ. చేతిబుట్ట(1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తోపట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒకవెదురు బద్ద వంచికడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగానూ ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరు సెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు. చూ. చిత్రం 139. (రా. 1-3).

**తూంగంప:** (< తూము+గంప) పర్యా. చూ. తూమెడుగంప(1). తూమెడు (=రెండు కుండలు; 30 కిలోలు) ధాన్యంపట్టే ఈతగంప. (తె. 9, 14).

**తూటు:** 1. పర్యా. చూ. కంత(1). జల్లెడఅడుగు అల్లకంలో పేళ్ళమధ్య ఉన్న సన్నని ఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (తె. 21; రా. 2, 7); 2. పర్యా. కన్ను(7). పసువుల కిక్కం (పశువుల మూతికితొడిగే బుట్ట) అల్లకంలో ఏర్పరిచిన కంత; పశువుల ముక్కులకు గాలి ఆగడానికి వీలుగా ఏర్పాటు చేస్తారు. (రా. 1).

**తూటుబుట్ట:** పర్యా. చూ. కంతబుట్ట. బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికీ (గాలి తగలడం కోసం) ఉల్లిగడ్డలు మొ॥ పోసి పెట్టుకోడానికీ వాడే ఒకరకం బుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా పైన వంచికట్టిన వెదురుబద్ద ఉంటుంది; దీని మూతిసిబ్బి మాదిరిగానూ కొన్ని చోట్ల పళ్ళెం మాదిరిగానూ, కొప్పు మాదిరిగానూ ఉంటుంది; దీని ఎత్తుభాగం వెలుపలినుంచి చుట్టూ మధ్యభాగంలో కళ్ళు(కంతలు) వచ్చేటు అల్లతారు; కొన్నిటికి గద్దె ఉంటుంది; చూ. చిత్రం 69 క.(కో.3).

**తూనకంసిబ్బి:** పర్యా. చూ. తరాజుసిబ్బి(1). వెదురు పేడుతో అల్లిన తక్కెడపళ్లెం. (రా. 3).

**తూము:** ఉ. తూం; 1. గైకట్టుకు అమర్చే ఒకరకం కొడవలికాడకు చివర వంపుదిరగ్గా ఏర్పడ్డచుట్టు. చూ. చిత్రం 116. 2. (తె. 21); 2. దబ్బనానికి తాడు ఎక్కించేసందు; దీంట్లోంచి మొగిలితీగలు దూర్చి జల్లెడ అంచుకుడతారు. చూ. చిత్రం 18 చ. 2. (తె. 5); 3. రెండుకుండల ధాన్యం కొలమానం. (తె. 7, 9); 4. పద్దెనిమిది మానికల ధాన్యం కొలమానం. (తె. 11, 14); 5. పర్యా. మడుం(2). ఒక క్వింటాల్ ధాన్యం కొలత; పాత్రలతో కొలుస్తారు. (తె. 21).

**తూముకట్టు:** ఈతగుమ్మి (చూ.) చుట్టూ బయటివేపు తూమెడువడ్లు పట్టేటంత భాగానికొకటి చొ॥న (గుర్తుకోసం) వేసేకట్టు. (తె. 11).

**తూమెడుగంప:** 1. పర్యా. తూంగంప. తూమెడు (=రెండుకుండలు; 30 కిలోలు) ధాన్యంపట్టే ఈత గంప. (తె. 14); 2. 32 మానికల ధాన్యం పట్టే పెద్దగంప. (తె. 24).

**తూమెడుగుల్ల:** 52 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల. (తె. 25).

**తూర్పుగుల్ల:** ధాన్యం తూర్పార బట్టడానికి వాడే ఈతగంప. (తె. 16).

**తూర్పునాటికులం:** పర్యా. చూ. తూర్పుమేదరి. తూర్పుగోదావరి జిల్లా మొదలుకొని అప్పైన తూర్పు ప్రాంతంలో ఉండే మేదరివాళ్ళు. (రా. 8).

**తూర్పుమేదరి:** పర్యా. తిక్కడమేదరి(2), తూర్పు నాటికులం. (తూర్పు) గోదావరిజిల్లా మొదలుకొని అప్పైన తూర్పుప్రాంతంలో ఉండే మేదరివాళ్ళు.

(కో. 15, 18).

తూలిపోవు: (క్రి.) పర్యా. చూ. కల్లిబోవు. రాళ్లతగిలి మేదరికత్తికి పదును వేపు ముక్క విరిగిపోవడం. (కో. 24).

తెండదండి: బావిమోటకు వాడే లావుపాటి వెదురుగడ (కో. 30).

తెత్తుడుతీగ: పేముబెత్తాన్ని నిలువుగా నాలుగు పాయలుగా చీరినప్పుడు వచ్చేతీగ. (కో. 19).

తెత్తుడునేత: పేముకుర్చీల అల్లకంలో ఒకరకం తడక నేతను పోలి ఉంటుంది; తెత్తుడు తీగతో అల్లుతారు. (కో. 19).

తెంతె: పర్యా. చూ. తలాపు. వెదురుమంచానికి తల పెట్టుకోడానికి వీలుగా ఎత్తుగా ఏర్పరిచిన భాగం. చూ. చిత్రం 108. 6. (తె. 3).

తెప్ప(కట్టిన)బొంగు: పర్యా. తెప్పకర్ర. తెప్పలుగా కట్టి నీటిమీద రవాణాచేసిన వెదురుగడ; ? నాని పోయినందువల్ల పేడు తీయడానికి పనికిరాదు.(కో.9)

తెప్పకర్ర: పర్యా. తెప్ప(కట్టిన)బొంగు. తెప్పలుగాకట్టి నీటిమీద రవాణాచేసిన వెదురుగడ; ? నానిపోయి నందువల్ల పేడు తీయడానికి పనికిరాదు. (కో12,15).

తెప్పగడ: ఉ. —గెడ; తెప్పకట్టడానికి వాడే వెదురు కర్ర; ఎండిపోయిన కర్రలు వాడతారు. (కో. 21).

తెంపు: పర్యా. చూ. పదును(1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥వాటి వాడి; మెత్తగా తెగేభాగం; కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు 12 క-డ; 16 క-ప. (రా. 8).

తెలగమేదరి: ఉ. తెలుగ—, తెల్గు—; మేదర్లలో ఒక తెగ; (భాష ఏది మాట్లాడినా) మంచిమేదరి; కొన్ని చోట్ల వర్ణాంతర వివాహం చేసుకొన్న మేదర్లు. (కో. 18; తె. 8, 28).

తెలుపుపేడు: ఉ. తెలుప్పేడు; పర్యా. చూ. తెల్లిపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా సన్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరు పేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 10).

తెలుపువార: పర్యా. చూ. పసరుకింది కర్ర. వెదురు బద్దకు పైన సన్నగా పచ్చగా ఉండే (పసరు) భాగం కిందినుంచి తీసినకర్ర; చూ. కర్ర. (కో. 27).

తెలుబ్బద్దీనె: (< తెలుపు+బద్ద+ఈనె) పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా సన్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 27).

తెల్లకట్టు: పర్యా. చూ. బెండుకట్టు. వెదురుబద్దకు పచ్చగా సన్నగా ఉండే (పసరు) భాగానికి కింది నుంచిగాని పల్లపుభాగంనుంచిగాని చీరినబద్ద(కట్టు); తెల్లగా ఉంట్ంది. దీన్ని చేట వెలుపలి అంచు చుట్టూపెట్టి బిగిస్తారు. (తె. 22).

తెల్లకర్ర: 1. పర్యా. చూ. పసరుకింది కర్ర. వెదురు బద్దకుపైన సన్నగా పచ్చగాఉండే (పసరు) భాగం కిందినుంచి తీసినకర్ర; చూ. కర్ర. (కో. 2); 2. తెల్లరంగులో ఉండే మైసూరు పేము. (కో. 12).

తెల్లకలమందనార: పర్యా. చూ. పచ్చిమట్టనార. పచ్చి కలబందమట్ట నుంచి తీసిననార; తెల్లగా ఉంటుంది. (రా. 5).

తెల్లకాసెగడ్డి: తెలుపురంగులో ఉండే కాసెగడ్డి; గుట్టలమీదా గట్లమీదా మొలుస్తుంది; ఎండాకాలంలో చల్లదనంకోసం దీంతో తడకలుకట్టి గుమ్మాలకూ కిటికీలకూ వేలాడ గడతారు; పందిళ్ళమీద పరిచి నీళ్ళతో తడుపుతారు. (తె. 10).

తెల్లపాసిక: వెదురుబద్ద పల్లపుభాగంనుంచి తీసిన పాసిక; చూ. పాసిక. (కో. 29).

తెల్లపుల్చేరుకట్టె: ఉ. —బుల్చేర్గట్టె; తెల్లరంగులో ఉండే పుల్చేరుచువ్వ. (తె. 9).

తెల్లపేడు: ఉ. —బేడు, —వేడు; 1. పర్యా. అడిపోగు (2), కడుపుపేడు, కండపేడు, కండబెండు, కుడుందబ్బ, గట్టిదబ్బ, గూబంపేడు, తెలుపుపేడు, తెలుబ్బద్దీనె, తెల్లబద్దీనె, తెల్లబెండు, తెల్లబేరె, తెల్లయేన, నడితరంపేడు, పసరుకింది అతుకు, పసరుకింది పేడు, పసరుకింది బేరె, పసరుకిందీనె, పొట్టపేడు (1), పొట్టెఅతుకు, బెండతుకు (2), బెండు (6), బెండుపేడు (2), మామూలీనె. వెదురు బద్ద చీరేటప్పుడు పచ్చగా సన్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండు పేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 2, 5, 10, 13, 15-17; తె. 7, 9, 13, 15, 16, 19, 26, 27, 30, 31; రా. 1, 3); 2. పర్యా. చూ. బెండుపేడు (1). వెదురుగడలో బోలుగా ఉన్న భాగంనుంచిగాని వెదురుబద్ద పల్లపు భాగంనుంచిగాని చీరినపేడు; అంత సన్నగాగాని గట్టిగాగాని ఉండదు. (కో. 18; రా. 8, 9, 11); 3. పచ్చిబొంగునుంచి తీసినపేడు; తెల్లగా ఉంటుంది. (కో. 6).

తెల్లపేడుగూడ: తెల్లపేళ్ళతో అల్లిన నీళ్ళగూడ; చూ.

గూడ. (కో. 10).

తెల్లపేడుతడక: ఉ. తెల్లపేడుతడ్క; వెదురుబద్ద తెల్లపేడు ( బద్ద పసరుకింది భాగం)తో అల్లిన తడక. (తె. 8).

తెల్లపేడు పేడు: వెదురుగడకున్నపైన పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసిన బద్దు. (తె. 5).

తెల్లబద్ద: పర్యా. బెండుబద్ద(2). మందం వెదురుబద్ద మధ్యభాగంనుంచిగాని పసరు భాగం కిందినుంచిగాని తీసినబద్ద. (కో. 21, 28; తె 29).

తెల్లబద్దీనె: (< తెల్లబద్ద + ఈనె) పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 25).

తెల్లబారు: (క్రి.) తెలుపెక్కడం. (కో. 21).

తెల్లబిలుకు: పర్యా. చూ. బెండుకట్టు. వెదురుబద్దకు పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగానికి కింది నుంచిగాని పల్లపుభాగంనుంచిగాని చీరినబద్ద(కట్టు); తెల్లగా ఉంటుంది; దీన్ని చేట వెలుపలి అంచు చుట్టూపెట్టి బిగిస్తారు. (కో. 2).

తెల్లబెండు: పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండు పేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 8).

తెల్లబేడుసవార్బండితడక: ఉ. —తడ్క; తెల్ల పేడుతో అల్లిన కచ్చడంబండి (సవారుబండి) తడక. (తె. 6).

తెల్లబేరె; పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండు పేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె.24)

తెల్లబొంగు: పచ్చి ఆరిపోయి తెల్లగా అయిన వెదురు గడ. (రా. 1).

తెల్లబొందుబడు: (క్రి.) పర్యా. చూ. కవురుబొంగు (1). వెదురుకర్ర పెరిగేటప్పుడు తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోవడం. (రా.6)

తెల్లబోజరకర్ర: చుట్టూ తెల్లటినూగు ఏర్పడిన వెదురుగడ. (కో. 6).

తెల్లయేన: పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండు పేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 22).

తెల్లపేడుపేము: ఉ. —పేము; మెరుపుగంపతో ఉండే సన్నటి పట్టేపేము; ... ఉపయోగిస్తారు. (తె. 16).

తెల్లపేడుసగ్గర: ఉ. —పేడుసగ్గ్ర 1. ... తెల్లని సాదా పేడుతో అల్లిన విసనగర్ర. (రా. 6); 2. తెల్లపేడు (పసరుపేడు లేకుండా)తో అల్లిన విసనగర్ర. (తె. 23)

తెల్లీనె (< తెల్ల + ఈనె) పర్యా. చూ. పసరుకింది కర్ర. వెదురుబద్దకు పైన నున్నగా పచ్చగా ఉండే (పసరు) భాగం కిందినుంచి తీసినకర్ర; చూ. కర్ర. (రా. 4).

తెల్లుకొను: (క్రి.) పొడిగా చేసుకోడం. (రా. 3).

తేజు: (< హిం. తేజ్) పర్యా. చూ. పదును(1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥వాటి వాడి; మొత్తగాతెగే భాగం; కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రం 12 క-క, 16 క-క. (తె. 4).

తొక్క: 1. పర్యా. చూ. పొర. వెదురుగడకుగాని దాని కణుపునుంచి పుట్టిన కొమ్మకుగాని వెదురుమొవ్వ చుట్టూగాని సన్నటిపొరలా కప్పిఉన్న ఆకు; ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు ఉంటుంది; లేతప్పుడు మాత్రమే ఉండి గడముదరగానే ఎండి రాలిపోతుంది; చెరుకుగడకూ చొప్పదంటుకూ ఉన్న మాదిరిది. (కో. 24); 2. (< సం. త్వక్) కొబ్బరికాయకు పైన పచ్చగా ఉండే చర్మం. (కో. 25, 29, 30).

తొక్కుగంప: పర్యా. చూ. దానాబుట్ట పశువులకుమేత (దాణా; తడపిన ఉలవపిండి మొ॥) పెట్టడానికి వాడే గుల్ల; రెండుపొరలుగా ఉంటుంది; లోపలి పొర సన్నటిపేడుతో అల్లుతారు; అంచుకు బద్దలు వేసి కడతారు; కొన్నిచోట్ల కింద చతురస్రంగానూ నాలుగుమూలలా దొప్పలాగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకటే పొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (రా. 8, 9).

తొడుక్కుచెక్క: ఉ. —చెక్క; పర్యా. చెక్క(5). అని పైకీ కిందికీ మారడానికి చాపనేతమగ్గం కింది గుంటలో అమర్చిన చెక్క; వెనకఅచ్చు కిందినుంచి వచ్చేతాడు దీనికి కడతారు; ఇలాటివి రెండు ఉంటాయి. చూ. చిత్రం 120 చ. 1. (రా. 6).

తొక్కుడుదబ్బ: పర్యా. ఒత్తుడుకట్టె, ఒత్తుడుకర్ర, ఒత్తుడుపుల్ల, మెదపెట్ట, చాపనేత మగ్గంలో అని కర్రకూ లోవెదురుగడకూ మధ్య ఉండే గజం పొడుగు గడ లేదా కర్ర; అనులు మార్చినప్పుడు పోగుల్ని అణిచిపట్టడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 120 క. 3. (కో. 3; రా. 2).

తొట్టికర్ర: పర్యా. తొట్టిగడ, తొట్టిబొంగు. బండితొట్టె కోసం పెట్టిన వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (కో. 9).

తొట్టిగడ: పర్యా. చూ. తొట్టికర్ర. బండితొట్టి కోసం పెట్టిన వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి.

తొట్టిబొంగు; పర్యా. చూ. తొట్టికర్ర. బండితొట్టెకోసం పెట్టిన వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (తె. 7).

తొట్టిమీదితడక: పర్యా. చూ. గోలెంమీది తడక. నీళ్ళ(తొట్టి) మీద మూతగా వేసేతడక; తొట్టి ఆకారాన్నిబట్టి దీర్ఘచతురస్రంగానూ, చతురస్రం గానూ, గుండ్రంగానూ ఉంటుంది. (కో. 2).

తొట్టె: ఉ. తొట్టి; రూ. తొట్టెల(1); పర్యా. చూ. ఉయ్యాల. పసిపిల్లల్ని పడుకోబెట్టి ఊపేది; వెదురు పేళ్ళతోగాని, ఈతచువ్వతోగాని, పేముతోగాని అల్లుతారు; చూ. చిత్రం 44. (కో. 3, 11, 15, 19; తె. 4, 7, 27, 30, 31; రా. 3).

తొట్టెతాడు: బండితొట్టె అల్లడంకోసం దుసేరు తీగలతో పేనినతాడు. (తె. 9).

తొట్టెల: ఉ. తొల్లె; 1. చూ. తొట్టె. (తె. 2, 4-10, 14, 21, 26; రా. 1, 2); 2. గోపురాకారంలో ఉండే వెదురుచువ్వల గుమ్మటం; సుమారు 7 అడుగుల ఎత్తు ఉంటుంది; మామూలుగా దీనికి చుట్టూ పలచటి రంగుకాయితాలు అంటిస్తారు; బారనాల పండుగ మొ॥ సందర్భాల్లోగాని మొక్కు తీర్చడానికిగాని ఇలాటివి అమ్మవారి గుడిముందు వేలాడగడతారు. (తె. 14).

తొడిమె: ఉ. తొడిమె; 1. పర్యా. చూ. కాడ(1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగా, కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (తె. 13, 18, 19, 22, 32-25); ఉ. తొడిమె; పర్యా. చూ. మడిమె(3). మేదరికత్తి కాడకొన. (తె. 20); 3. పర్యా. మడిమె(4). ఒకరకం అంబు(చూ.) కుండే కాడకొన; మొనలేకుండా పలకగా ఉంటుంది. (తె. 20); 4. పర్యా. కాడ(2), గామ(2), పిడి(4), బుడుఘు(2). మొనదేలకుండా పలకగా ఉండే అంబు(చూ.) కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ వేలెడుగాని రెండు వేళ్ళుగాని వెడల్పూ ఉంటుంది; ఇలాంటి కాడగల అంబుకుండే పడగ భాగం మొనదేలి ఉంటుంది; చిల్లులు పొడిచేటప్పుడు ఈ కాడ పట్టుకొంటారు. (తె. 13, 18, 21, 22, 23-25), 5. ఈతాకును మట్టనుంచి తీసినప్పుడు ఆకు మొదట పీచులా ఉండే భాగం. చూ. చిత్రం 115. 1. (తె. 19, 21); 6. పేముబెత్తాన్ని చీల్చే కత్తి(పిడి) కొన చూ. చిత్రం 143. 1. (తె. 22).

తొండకూర్పు: ఈతచాప అల్లకంలో రెండుపట్టెలను కలిపికుట్టేటప్పుడు అక్కడక్కడ కట్లుపడని విధంగా కూర్చినతీరు; పొరపాటునగాని అశ్రద్ధవల్లగాని ఇలా జరుగుతుంది. (తె. 22).

తొండనాకుడు. వెదురుగడను తొండ నాకడంవల్ల ఏర్పడ్డగుర్తు. (తె. 28).

తొండంతాడు: బావినుంచి నీళ్ళు తోడడానికి మోట నుంచి తొండంచెవి తాడుకుకట్టే పొడుగాటి తాడు; ఈతనారతోగాని, తాటినారతోగాని పేనింది. (తె.9).

తొంబవెదురు: ఉ. తొంబెదురు; తొంబ (సోంపేట దగ్గర) అనే కొండప్రాంతం నుంచి తెచ్చిన వెదురు గడ; నాణ్యమైంది. (కో. 31).

తొమ్మిదికడవలగాదె: ఉ. —గాజె; 3 క్వింటాళ్ళ (9 కడవల) ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (రా. 9).

తొమ్మిదిపూలచాప: ఉ. —పాప; తొమ్మిదిపూల డిజైను వచ్చేటట్లు నేసిన (తుంగ)చాప. (కో. 3).

తొమ్మిదిపూల విసనగర్ర: ఉ. —పూలిసనకర్ర; మధ్యభాగంలో తొమ్మిదిపూలు పనివరస (=డిజైను)గా వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (కో. 3; రా. 4).

తొమ్మిదిమళ్ళగుమ్మి: ఉ. దొమ్మిది—; తొమ్మిది మణుగుల ధాన్యంపట్టే గుమ్మి (గాదె). (తె. 22).

తొమ్మిదిమూరబొంగు: తొమ్మిదిమూరల పొడుగుండే వెదురుగడ. (రా. 3).

తొర్ర: 1. పర్యా. చూ. బోలు(1). వెదురుగడ లోపల ఒక కణుపునుంచి మరొక కణుపువరకు మధ్యలో నిలువుగాఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1; (కో. 4; తె. 13;

రా. 2, 7, 8); 2. పర్యా. చూ. బొక్క (1). చేట తయారీలో అంచు కట్టేటప్పుడు కట్టుముంగు బిగించడంకోసం అంచుదగ్గర అమ్ముతో పొడిచి చేసిన చిల్లి. (తె. 15).

తొర్రకట్టె: పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకణుపుకు మధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరి పనికి ఉపయోగపడుతుంది. (రా. 4).

తొర్రకర్ర: పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకణుపుకూ మధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 4).

తొర్రదబ్బ: మధ్యలో పల్లంగా ఉండే వెదురుబద్ద. (కో. 4).

తొర్రబొంగు: ఉ. తర్ర—; పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకణుపుకూ మధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 6; తె. 25, 29; రా. 5, 7, 8).

తొర్రవెదురు: ఉ. తొర్రెదురు; పర్యా. చూ. బోలు బొంగు. కణుపుకణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (రా. 2).

తొల: పర్యా. చూ. బోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపునుంచి మరొక కణుపుమధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1; (తె. 1).

తొలబొంగు: పర్యా. చూ. బోలుబొంగు. కణుపుకణుపుకూ మధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (తె. 1).

తొలి: 1. కన్నం; కమ్మకత్తి (చూ.) కాడ దూర్చడానికి వెదురుగడకు చేసిన బెజ్జం. చూ. చిత్రం 4 క. 1. (తె. 13); 2. పర్యా. కన్నం(3). వెదురు మంచం, నిచ్చెన మొ॥వాటి తయారీలో కాళ్ళు అమర్చడానికి వెదురుగడకు ఉలితోచేసిన చిల్లి. (తె. 4, 10, 16-17, 19, 24; రా. 5; 8-10).

తొలికట్టు: పర్యా. చూ. కిందికట్టు. గంప, గుమ్మి, తట్ట మొ॥వాటి అల్లకంలో అడుగు పూర్తిచేసి ఎత్తు భాగం అల్లడానికి నిలుపులు వంచేటప్పుడు వేసేకట్టు. చూ. చిత్రం 47 క. 4. (కో. 24).

తొలిగొట్టు: (క్రి.) పర్యా. బొర్రగొట్టు. నిచ్చెన నిలువు గడకు మెట్లు దిగ్గొట్టడానికి మెట్టు పట్టేటంత మేర (నలుపలకలుగా) చిల్లి(తొలి) చేయడం (తె. 17).

తోక: 1. పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి, మొ॥ పట్టుకొనే కద్దీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ, కొన్నిటికి తొడిమెమాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (కో. 28); 2. నీళ్ళతోదేగూడ (చూ.)కు అడుగున మొనదేలిన భాగం (రా. 4); 3. కలబంద మట్టిలో మొనదేలిన భాగం. (రా. 5).

తోకకర్ర: ఉ. తోక్కర్ర; మొదలు లావుగానూ చివర వేలంత సన్నగానూ ఉండే వెదురుకర్ర; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 23).

తోకచాప: ఉ. —సాప; భోజనం చేసేటప్పుడు ఎక్కువమంది ఒకవరసలో కూర్చోడానికి వీలుగా మూరెడు వెడల్పుగాను నాలుగుమూరల పొడుగ్గాను అల్లిన తాటిచాప. (కో. 26).

తోకతాడు: 1. మాగాణి దున్నేటప్పుడు ఎద్దు తోక ఊపితే దున్నేవాడి కంట్లో బురద పడకుండా తోకను కాడికి కలిపికట్టిన సన్నటితాడు; ఈతనార మొ॥వాటితో పేనినది. (తె. 9; రా. 5); 2. రైతులు నీళ్ళతోడే పెద్దబొక్కెన అడుగున ఉండే తొండానికి కట్టేతాడు; దీంతో తొండాన్ని బయట ఉండే మొత్తలోకి లాగుతారు. (రా. 5).

తోకబొంగు: పర్యా. చూ. బొరగాల కర్ర. మొదలు లావుగానూ చివర సన్నగానూ ఉండే వెదురుకర్ర; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 24).

తోకముల్లు: పర్యా. కమ్మముల్లు. ఈతచాప అల్లిన తరవాత మిగిలిన ఆకుకొస ముల్లు. (రె. 19).

తోకమొండికర్ర: పర్యా. చూ. కొండెంగమెట్టు. ఒక రకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ, కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తలమొండిగా ఉంటుంది. (కో. 27).

తోకవాసం: పర్యా. చూ. కడెంబారు. పొడుగ్గానూ సన్నగానూ, గట్టిగానూ ఉండే ఒకరకం వెదురు గడ; ఏటవాలుగా కప్పువేసేఇళ్ళకు సన్నటి వాసాలుగా ఉపయోగిస్తారు; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 10, 12, 15, 16, 18, 26).

తోటిదబ్బ: బండిజల్ల అంచుకు తొడిగిన వెదురుబద్ద. (రా. 4).

తోడ్క: గోగుకట్టె, జనుముకట్టె మొ॥వాటి మీదచుట్టూ ఉండే పొర; తొక్క; ఇది ఊరి, చీకి నార అవుతుంది. (తె. 9).

తోపిడిగడ: నీళ్ళలో పడవ తోయడాని కుపయోగించే

వెదురుగడ; కాలంతలావు, 14 మూరల పొడుగు ఉంటుంది. (కో. 23).

తోపుడుపట్టు: (క్రి.) కలబందమట్టనుంచి నార తీసే టప్పుడు పట్టకు ఉండే పచ్చటి పదార్థాన్ని తీసెయ్య డానికి ఒకరేకుతో మట్టమీద వెనక్కీ ముందుకూ గీకుతారు. (రా. 2).

తోపుడుపీట: పర్యా. చెక్క(3), పీలిరి పలకమొద్దు గీకడానికి కలబందపట్ట పరిచే పొడుగాటి కొయ్యపీట. (రా. 2).

తోపుడుబద్ద: కలబందనారకు పోగులుగా విడదీయ డానికి వాడేబద్ద. (రా. 2).

తోలుబొమ్మలపెట్టె: తోలుబొమ్మల్ని పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినపెట్టె. (కో. 9).

తోవ: ఉ. తొవ్వ; పర్యా. చూ. గలుమ. కోళ్ళ గూడులోకి కోళ్ళను వేయడానికి పెట్టినకంత. చూ. చిత్రం 65 ప. 3. (తె. 22, 26).

త్రిశూలం: మేదరికత్తి మడమ (=కత్తికి వెడల్పుగా ఉండే భాగం) మీద త్రిశూలం ఆకారంలో గీసిన మూడు గీతలు; మేదరివాళ్ళు శైవులు కావడంవల్ల అలా గీస్తారు. (రా. 8).

## ద

దగ్గరికనుపుకఱ్ఱ: ఉ. —కన్పు—; పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలాతక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 23).

దగ్గరిగనుపుబొంగు: ఉ. —గెన్పు—; పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 2).

దగ్గరిగనె(ల)బొంగు: పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥వాటికి పని కొస్తుంది. (తె. 22, 24).

దగ్గరిగుంపుకఱ్ఱ: పర్యా. చూ. కురచనగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥వాటికి పని కొస్తుంది. (కో. 27, 28).

దగ్గరిగుంపెదురు: పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥వాటికి పని కొస్తుంది. (కో. 30).

దట్టె: పర్యా. కిందడుగు(2). కోళ్ళగూడు (జేంపు) కుండే రెండు అడుగుల్లో (కిందఒకటి పైనఒకటి) కిందిది. (తె. 20).

దడి: 1. మరుగుకోసం ఇంటిగుమ్మానికిగాని దొడ్డికి గాని కట్టిన వెదురుబద్ద తడక. (తె. 29); 2. (< దరి) వాగు మొ॥వాటి ఒడ్డు. (రా. 4).

దడితడక: ఉ. - తడ్కె; పర్యా. చూ. మెడ్డ. నిలువు బద్దలు నేలలో పాతడానికి వీలుగాపెట్టి అడ్డం బద్దలతో అల్లినతడక; దీనిచుట్టూ గోడమాదిరిగా మన్నుమెత్తుతారు, అడవిప్రాంతంలో ఇలా చేస్తారు. (చూ. మెడ్డ; మాం. వృ. కోశం 4; వాస్తుపదజాలం; పుట 345). (తె. 29).

దడింసిబ్బి: (< హిం. ధడా) ఉ. —శిబ్బి; పర్యా. చూ. తరాజుసిబ్బి(1). వెదురుపేడుతో అల్లిన తక్కెడపళ్ళెం. (రా. 8).

దడెబొంగు: పర్యా. శిలాటిబొంగు. అడవిచివర్లో పెరిగిన వెదురుకఱ్ఱ; దీని కణుపులదగ్గర చిన్న చిన్న కొమ్మలు ఎక్కువగా వేస్తాయి; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 22).

దడెలపొంటిబొగు: గుట్టలవెంబడి (పొంటి) పెరిగే వెదురుగడ. (తె. 25).

దంట: పర్యా. దాలెందట. దాలెం (=వెదురుబద్దనుంచి బద్ద వెడల్పునా పలచగా చీరిన రెండుమూడు భాగాల్లో ఒకటి)ల జత; గుమ్మల అల్లకానికీ నల్చదరం కోళ్ళగూడుకు అడుగువెయ్యడానికీ ఉపయోగపడుతుంది. (తె. 21),

దంటదాలెం: (< జంట—) ఒకచివర అంటుకొని ఉన్న రెండు పలచటి వెదురుబద్దలు; చూ. దాలెం. (కో. 22).

దంటబోయు: (క్రి.) పర్యా. కూర్చు. ఈతచాప తయారీకి అల్లిన రెండుపెట్టెలనూ కలిపి కూర్పుకుతో కుట్టడం. (తె. 22).

దండ: పర్యా. చూ. బద్ద(4). విసనగఱ్ఱ పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండ డానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 24).

దండగ: ఉ. దండ్గ; జరిమానా; తప్పుచేసిన వారికి విధించేది. (తె. 7).

దండి: 1. తక్కెడపళ్ళేలు వేలాడదీసిన వెదురుకఱ్ఱ. (తె. 10); 2. పర్యా. కాడ(5). ఎరకలికత్తి (కొడవలి) పిడికీ వెన్నుకూ మధ్యఉండే కాడ. చూ. చిత్రం 13 క. 2. (కో. 25); 3. తాటిచాప అంచు భాగం. చూ. చిత్రం 125. 1. (కో. 26).

దండిగం: చూ. దిండిగం. (తె. 15).

దండె: 1. పర్యా. చూ. గట్టిబొంగు(1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టి వెదురుకఱ్ఱ; సుమారు మూడు నాలుగంగుళాలు లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెన మెట్టు, గుతపకఱ్ఱ, గైకిట్టె,మంచంపట్టె మొ॥వాటికి పనికొస్తుంది. (తె. 24); 2. పర్యా. చూ. అంచు కఱ్ఱ. బండిజల్ల మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకఱ్ఱ. చూ. చిత్రం 32. 1. (కో. 28, 30); 3. పర్యా. చూ. అంచుబద్ద. (తె. 27); 4. చాటు తడకకోసం చట్రం కట్టడానికివాడే వెదురుబద్ద లేదా సన్నటి వెదురుగడ. చూ. చిత్రం. 36 చ. 2. (తె. 21, 24).

దండెంతాడు: నులకమంచం అల్లకంలో కాళ్ళవైపు అడ్డంగా కట్టినతాడు. (రా. 4, 5).

దండెబద్ద: పర్యా. ఫ్రేంబద్ద. తడక, కచ్చడం తడక మొ॥ వాటికి ఫ్రేము అమర్చడానికి వాడేబద్ద; పొడుగుబద్దలు రెండూ అడ్డంబద్దలు రెండూ ఉంటాయి. (తె. 21).

దండెబొంగు: పర్యా. చూ. లోబొంగు. (తుంగ)చాప నేతమగ్గంలో ఒకవరసపోగులఅని లేవడానికి పోగుల నడుమదూర్చిన లావుపాటి వెదురుగడ; గజం పొడుగుంటుంది; తొక్కుడువబ్బకూ దిగ దండుకూ మధ్య ఉంటుంది. చూ. చిత్రం 120 క. 2. (రా. 10).

దండెం: వరసగా నిలబెట్టే వెదురుగడలు ఆనుకోడానికి వీలుగా అడ్డంగా అమర్చినగడ; రెండుగడలు నిలువుగాపాతి వాటి పైచివరలను రెంటినీ కలుపుతూ మరొకగడ అడ్డంగా కడతారు. (తె. 24).

దండెలెగురు: (క్రి.) పెళ్ళికూతురిని పెళ్ళికొడుకును (చాకలివాడు, మంగలివాడు) ఎత్తుకొని ఎగరడం; పెళ్ళిలో ఒకవేడుక; దండెడించడం. (తె. 21).

దంతె: ఇంటికి కప్పువేయడానికి వాడేవాసం. (కో. 8).

దప్మాకు: (దప్మ+ఆకు) పర్యా. చూ. మందంపేడు. గోరుమందంకన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (రా. 1).

దప్మ: మందం. (రా. 1).

దబలం: చూ. దబ్బలం. (కో. 19).

దబాయించు: పర్యా. పీకు. చాపనేతలో పలక. (చూ.)ను దగ్గరికి (నేతగాడు తాను కూర్చున్న వైపుకు) కొట్టడం; చాపనేతలో జమ్ముపుల్లను పోగులమధ్య ఎక్కించిన తరవాత ఆపుల్ల అంతకు ముందున్న పుల్లల వరసలో అమిరేటట్లు నేతగాడు జింకపలకను తనవైపు కొడతాడు. (రా. 10).

దబ్బ: 1. చూ. బద్ద (1). (కో. 1, 3, 4, 7; తె. 1-4, 7, 12; రా. 1-4); 2. రూ. బద్ద (2); పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒకభాగం. (రా. 3, 4); 3. చూ. బద్ద (4). (తె. 2; రా. 2, 5, 8, 9); 4. చూ. బద్ద). (రా. 3, 4, 8); 5. పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందుభాగంలో రెండుమూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెన వేలెడులావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2; (రా. 1, 3, 6); 6. పర్యా. నాలికదబ్బ. వెదురుపేళ్ళతో అల్లిన బండిజల్లకు మూతి (చూ.) వైపున ఎత్తుగా ఉన్నభాగం అంచుకు తొడిగిన వెదురుబద్ద; సుమారు మూరెడుమీద జేనెడుపొడుగు ఉంటుంది. (కో. 1); 7. పర్యా. చూ. అంచుబద్ద. తడక అంచుకు తొడిగిన వెదురు బద్ద. (కో. 2); 8. రేషంతట్టకి నిలువుగా పెట్టిన బద్ద. చూ. చిత్రం 81.1 (రా. 6); 9. ఉ. దెబ్బ; పర్యా. ఒప్ప (2), చెంప (1), పక్క. ఈతకమ్మ నిలువుగా రెండుమూడు పాయలుగా చీరితీసినభాగం (తె. 16); 10. పర్యా. ఒప్ప (3), వక్క (3). తుంగపోచను నిలువుగా మధ్యకు చీరితేవచ్చేభాగం; బద్ద (రా. 4); 11. పర్యా. చూ. లాకదబ్బ. (తుంగ)చాప నేసేటప్పుడు మగ్గంపోగుల మధ్య (తుంగ)పోచను దూర్చేబద్ద; దీనిచివర బెజ్జ ముంటుంది; అందులోకి (తుంగ)పోచ కొనమార్చి లాకదబ్బను పోగులమధ్య దోపుతారు. చూ. చిత్రం 121; 120 క. 6. (రా. 4).

దబ్బకఱ్ఱ: పర్యా. చూ. పెండెవాత. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కఱ్ఱ. (చూ. కఱ్ఱ);

పేడులో సగంవెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండేభాగం నుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (రా. 8).

దబ్బగుండు: పర్యా. చూ. గుండు(1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిపెట్టి తట్టుచివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడఅంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటినుంచి ఒకబద్ద, ఈరెంటి మీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (రా. 2).

దబ్బజమ్ము: ఉ. దబ్బ—; పర్యా. ఎనిగెజమ్ము. పొడుగ్గానూ, లావుగానూ (సుమారు వేలెడులావు) కొంచెం పలకగానూ ఉండే జమ్ము; ఇళ్ళు కప్పు కొంటారు; చాపనేతకు పనికిరాదు. (రా. 2, 6, 10).

దబ్బనం: ఉ. దబ్నం: రూ. దబ్బురం; ఈతచాప అంచుకుట్టే లావుపాటి సూది; మామూలు సూది కన్న లావుగానూ, పొడుగ్గానూ ఉంటుంది. చూ. చిత్రం 18 చ. (తె. 19, 22).

దబ్బం: చూ. దబ్బలం. (తె. 10)

దబ్బముల్లెదురు: పర్యా. చూ. ముల్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 31).

దబ్బంపేడు: 1. పర్యా. చూ. మందంపేడు. గోరు మందంకన్న ఎక్కువ మందంగానూ, కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; జండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (రా. 6). 2. పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చెంద్రిక మొ॥వాటి నిలువులచుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు, లేదా పలచటిబద్ద; మామూలు పేడు కన్న మందంగానూ, వెడల్పుగానూ ఉంటుంది. (రా. 6).

దబ్బ(ల)ఎరకలి: ఉ. దబ్బలెరకలి, దబ్బలెర్కలి, దబ్బెర్కలి; వెదురుబద్దలతో బుట్టలు మొ॥ అల్లి జీవించే ఒకతెగ (ఎరకలి) వాళ్ళు (కో. 4; తె. 1, 2; రా. 5).

దబ్బ(ల)తడక: ఉ. —తడిక; చూ. బద్దతడక. (కో. 2; రా. 2).

దబ్బలం: రూ. దబలం, దబ్బం, దబ్బుడం, దబ్బుడ్కం, దవలం, దవ్వనం, దోనం; పర్యా. దవలంమేకు. సుమారుగా జేనెడు పొడుగుండే లావుపాటి ఇనపసూది; దబ్బనం; తలభాగంలో చిటికెనవేలంత లావుండి పోనుపోను సన్నగా మొనదేలుతుంది; కొన్నిటికి తలభాగంలో బొడిపె లాగా ఉంటుంది; కొన్నిటికి తలభాగం వంపుదిరిగి ఉంటుంది; చేట, జల్లెడ మొ॥వాటికి అంచుకుట్టే టప్పుడు చిల్లులు పొడవడానికి వాడతారు; చూ. చిత్రం 18 క. (కో. 25, 26–28).

దబ్బలంమడం: పర్యా. చూ. తల(4). దబ్బనానికి లావుగా ఉన్నవైపు కొసనున్న బొడిపె, కొన్నిటికి బొడిపెలేకుండా వంపుదిరిగి ఉంటుంది. చూ. చిత్రం 18 క. 2. (కో. 25).

దబ్బలంసూది: ఉ. —సూది; పర్యా. సూది(1). దబ్బనానికి మొనదేలిన భాగం. చూ. చిత్రం 18 చ. 1, (కో. 25, 28).

దబ్బీనె: (< దబ్బ + ఈనె) పర్యా. చూ. లావీనె(1). మామూలుకర్ర (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండేకర్ర; గంప మొ॥వాటి అల్లకంపనిలో ఎత్తుగావచ్చే భాగం అల్లడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (కో. 1).

దబ్బుడం: చూ. దబ్బలం. (తె. 4, 5).

దబ్బుడ్కం: చూ. దబ్బలం. (తె. 28).

దబ్బురం: చూ. దబ్బనం. (రా. 9).

దరవాజచట్టం: ఉ. దరువాజ్చట్టం; పంజరంలోకి కోళ్ళను తోలడానికి పెట్టినగుమ్మం చట్రం. చూ. చిత్రం 65 గ. 1. (తె. 17);

దర్వాజాతడక: (< హిం. దర్వాజా.) ఉ. దరువాజ తడికె; పర్యా. గుమ్మంతడక(2), దువారం తడక(2), వాకిలితడక(2). తడకలతో కట్టిన ఇంటిముందు భాగానికి తలుపుతోసహా అమర్చిన పెద్దతడక; చూ. చిత్రం 38 క. (కో. 28).

దలంతడక: పర్యా. చూ. మోటుతడక. మందంగానూ బద్ద వెడల్పుగానూ ఉన్న పేడుతో (మోటుగా)

అల్లినతడక; నిలువుకూ అడ్డానికి పేదు వాడతారు. (కో. 31).

దళసరికర్ర: పర్యా. చూ. గట్టికర్ర(1). సూదిపట్టెంత ఖాళీమొదలు వేలెడంత ఖాళీవరకు లోపల బోలుగా ఉండే గట్టి వెదురుకర్ర; గుట్టలమీదా, రాళ్ళదగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాలవరకు లావుగా ఉంటుంది. (కో. 19).

దళసరిపేడు: ఉ. దల్సరి—; పర్యా. చూ. మందం పేడు. గోరుమందం కన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండి జల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 24).

దవడముల్లు: ఉ. దౌడ—; పర్యా. గవదముల్లు, గోవ(6), చెమ్కముల్లు. ఈతమట్ట మొదటిభాగంలో ఉండే ముల్లు; దబ్బనంలా ఉంటుంది. చూ. చిత్రం 10. 1. (తె. 13, 16).

దవలం: చూ. దబ్బలం. (కో. 22, 23).

దవలంమేకు: పర్యా. దబ్బలం. సుమారుగా జేనెడు పొడుగుండే లావుపాటి ఇనపసూది; దబ్బనం; తల భాగంలో చిటికెనవేలంత లావుండి పోనుపోను సన్నగా మొనదేలుతుంది; కొన్నిటికి తలభాగంలో బొడిపెలాగా ఉంటుంది; కొన్నిటికి తలభాగం వంపు దిరిగి ఉంటుంది; చేట, జల్లెడ మొ॥వాటికి అంచు కట్టేటప్పుడు చిల్లులుపొడవడానికి వాడతారు; చూ. చిత్రాలు 18 క. (కో. 21).

దవ్వ: వెదురుగడ దానంతట అది విరిగిపోయే పెళుసయిన భాగం. (కో, 30).

దవ్వకర్ర: **1.** పర్యా. చూ. లేతబొంగు (1), ఒక సం॥నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతి ముందుకోతకు వస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చడానికి వీలవుతుంది; లోపల బోలు తక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది; (ఈ బూడిదనుబట్టి మొక్కవయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ. ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (కో. 29); **2.** పర్యా. చూ. కవురుబొంగు (1). తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురు గడ; తెల్లగాగాని, నల్లగాగాని అవుతుంది; సరయిన తీగి ఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడి కక్కాప పంగిపోతుంది; జేరి తడకలకు మాత్రం పనికొస్తుంది. (కో. 27).

దవ్వనం గొడుగు. ఉ. దొవనం ; పర్యా. చూ. తల (4). దబ్బనానికి లావుగా ఉన్నవైపు కొసనున్న బొడిపె; కొన్నిటికి బొడిపె లేకుండా వంపుదిరిగి ఉంటుంది. చూ. చిత్రం 18 క. 2. (కో. 30).

దవ్వనం: ఉ. దొవనం; చూ. దబ్బనం. (కో. 29, 30).

దస్తగిరయ్య: మేదరివాళ్ళు కొలిచే ఒకగురువు; ఈయన్ని కొలవడం ఇటీవల మొదలయింది. (రా. 9).

దాగర: ఉ. దాగెర; **1.** రూ. డాగరి, దేగర; అన్నం ఆరబోసుకోడానికీ (?) వడ్లు దంపుకోడానికీ వాడేది; బెత్తెడునుంచి మూడు బెత్తెలవరకు ఎత్తూ సుమారు గజంపొడుగూ మూరెడు వెడల్పూ ఉంటుంది; దీర్ఘ చతురస్రాకారంలో ఉంటుంది; చూ. చిత్రం 46. (కో. 28, 31), **2.** పర్యా. చూ. మూత(5). సారెపెట్టె, బట్టలపెట్టెలను మూసేకప్పు; దీర్ఘ చతురస్రాకారం పళ్ళెం మాదిరిగా ఉంటుంది; కొన్నిటి అంచులకు బద్దతో కట్టువేస్తారు. చూ. చిత్రం 41. 1. (కో. 2); **3.** రూ. దేగర(1). పర్యా. చూ. సెంగేరి. దుకాణం ముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో గాని ఈతపేళ్ళతో గాని అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 67. (కో. 18; రా. 1, 5); **4.** రూ. దేగర(2); పెళ్ళిలో సారెసామానుగానీ, వడిబియ్యం గానీ, కుడకలు (కొబ్బరి కురిడీలు)గానీ పెట్టి తీసుకు వెళ్ళే పెట్టె; చేట మాదిరిగా పేడుతో అల్లుతారు; అంచుకు బద్దలువేసి కట్టుకట్టడం ఉండదు.(తె. 25).

దానాగంప: ఉ. దాన—; పర్యా. చూ. దానాబుట్ట. పశువులకు మేత (దాణా; తడిపిన మొ॥) పెట్టడానికి వాడేగుల్ల; రెండు పొరలుగా ఉంటుంది; లోపలిపొర సన్నటి పేడుతో అల్లుతారు (పశువుల నాలికలకు గుచ్చుకుపోకుండా); వెలుపలిపొర మందం పేడుతో అల్లుతారు; అంచుకు బద్దలువేసి కడతారు; కొన్నిచోట్ల కింద చతురస్రంగానూ నాలుగుమూలలా డొప్పలాగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకటే పొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (తె. 14; రా. 9).

దానాగుల్ల: ( < హిం. దానా – )పర్యా. చూ. దానాబుట్ట పశువులకు మేత (దాణా; తడిపిన ఉలవపిండి మొ) పెట్టడానికి వాడేగుల్ల; రెండు పొరలుగా ఉంటుంది

లోపలిపొర సన్నటిపేడుతో అల్లుతారు (పశువుల నాలుకలకు గుచ్చుకుపోకుండా); వెలుపలిపొర మందం పేడుతో అల్లుతారు; అంచుకు బద్దలువేసి కడతారు; కొన్నిచోట్ల కింద చతురస్రంగానూ నాలుగుమూలలా డొప్పలాగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకపేపొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (తె. 11, 20).

దానాతట్ట: (< హిం. దానా) పర్యా. చూ. దానాబుట్ట. పశువులకు మేత (దాణా; తడిపిన ఉలవపిండి మొ॥) పెట్టడానికి వాడేగుల్ల; రెండుపొరలుగా ఉంటుంది; లోపలిపొర సన్నటిపేడుతో అల్లుతారు (పశువుల నాలికలకు గుచ్చుకుపోకుండా) వెలుపలిపొర మందం పేడుతో అల్లుతారు, అంచుకు బద్దలువేసి కడతారు; కొన్నిచోట్ల కింద చతుస్రంగామా నాలుగుమూలలా డొప్పలాగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకపేపొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (తె. 14).

దానాబుట్ట: ఉ. దాన—; పర్యా. కుడితిగుల్ల, డాల, తొక్కుగంప, దానాగంప, దానాగుల్ల, దానాతట్ట. పశువులకు మేత (దాణా, తడిపిన ఉలవపిండి మొ॥) పెట్టడానికి వాడేగుల్ల; రెండుపొరలుగా ఉంటుంది; లోపలిపొర సన్నటి పేడుతో అల్లుతారు (పశువుల నాలికలకు గుచ్చుకుపోకుండా); వెలుపలిపొర మందంపేడుతో అల్లుతారు; అంచుకు బద్దలువేసి కడతారు; కొన్నిచోట్ల కింద చతురస్రంగానూ నాలుగుమూలలా డొప్పలాగానూ ఉంటుంది; పైన గుండ్రంగా ఉంటుంది; ఒకపేపొరన అల్లుతారు. చూ. చిత్రం 56. (కో. 10, 12, 16; తె. 9).

దాపు: (క్రి.) రూ. దాయు; పర్యా. చూ. పన్ను (2). తడక అల్లడానికి (దీర్ఘచతురస్రపు చట్రం అమర్చి గానీ, అమర్చకుండా గానీ) నిలువులు వరసగా పేర్చి మొదటిభాగంలో నిలువుల కడ్డంగా పేడు ఇమడ్చి అల్లకానికి సిద్ధం చేయడం. (కో. 14, 18; తె. 24, 25, 28).

దాపుడుబెట్టు: (క్రి.) పర్యా. చూ. పన్ను (2). తడక అల్లడానికి (దీర్ఘచతురస్రపు చట్టం అమర్చిగానీ, అమర్చకుండాగానీ) నిలువులు వరసగాపేర్చి మొదటిభాగంలో నిలువుల కడ్డంగా పేడు ఇమిడ్చి అల్లకానికి సిద్ధంచేయడం. (కో. 10).

దాపుబెట్టు: (క్రి.) పర్యా. చూ. పన్ను (2). తడక అల్లడానికి (దీర్ఘచతురస్రపు చట్రం అమర్చిగానీ, అమర్చకుండాగానీ) నిలువుల వరసగాపేర్చి మొదటిభాగంలో నిలువుల కడ్డంగా పేడు ఇమిడ్చి అల్లకానికి సిద్ధంచేయడం. (కో. 17).

దామ: **1.** పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి, మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ, కొన్నిటికి తొడిమెమాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (తె. 10, 17, 20). **2.** పర్యా. చూ. తొడిమె (4). మొనదేలకుండా పలకగా ఉండే అంబు (చూ.) కాడ, సుమారు రెండుబెత్తెల పొడుగూ వేలెడుగాని రెండువేళ్ళుగాని వెడల్పు ఉంటుంది; ఇలాంటి కాడగల అంబుకుండే పఊగ భాగం మొనదేలి ఉంటుంది; చిల్లులు పొడిచేటప్పుడు ఈకాడ పట్టుకొంటారు. (తె. 17, 19, 20); **3.** పర్యా. చూ. కూలు(2). ఒకరకం అంబు (చూ.)కు మొనదేలి ఉండేకాడ; సుమారు రెండుబెత్తెల పొడుగూ చిటికెనవేలెడు లావూఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥వాటికి కట్టుకట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. 1. (తె. 10); **4.** పర్యా. చూ. కొంది. మేదరికత్తి, చురకత్తి మొ॥వాటి పిడిలోనుంచి బయటికి పొడుచుకువచ్చిన కాడకొస; కిందికి వంగిఉంటుంది. చూ. చిత్రం 16 చ. 1. (తె. 17); **5.** కొడవలికాడ. (తె. 21).

దామరపదం: విసనగర్ర. ఉ. —ఇస్నగ్ర్ర; పర్యా. చూ. పద్మాల విసనగర్ర. తామరపువ్వు (పద్మం) వంటి డిజైను వచ్చేటట్లు అల్లిన (వెదురుపేళ్ళ) విసనగర్ర. (రా. 3).

దామెరపాదం: ? మూడేసి సన్నటిపేళ్ళతో అల్లే తీరు; చూ. మూటాల' (రా. 3).

దామెరబుట్ట: ఉ. —బుట్టి; అన్నం తీసుకువెళ్ళే ఒక రకం ఈతాకుబుట్ట. (తె. 9).

దాయు: (క్రి.) చూ. దాపు. (కో. 13, 15).

దారం: పర్యా. చూ. పోగు (3). (తుంగ) చాపలు నేసే మగ్గానికి గజం వెడల్పున బెత్తెడు ఎడానికొకటి చొ॥న వరసగా ఎగదండు (- నేతగాడు కూర్చునే వైపుండే బొంగు)నుంచి దిగదండు (=మగ్గం చివరిబొంగు)కు కట్టిన పురిపెట్టిన నార పోచ లేదా ప్లాస్టిక్‌దారం; వీటిమధ్యన (తుంగ) పోచను పెట్టుకొంటూ అని మార్చుకొంటూ చాప నేస్తారు. చూ. చిత్రం 120 క. 8. (కా. 21).

దారి: పర్యా. గల్మ (4), కంత (6), దిడ్డి (3). **ఈత బద్దలతో అల్లే కోళ్ళగూడులోకి కోళ్ళను వేయడానికి**

పెట్టినద్వారం. (తె. 20).

దారు: ఉ. దార్; రూ. జారు, దోర, దోరు; పర్యా. చూ. పదును (1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥వాటి వాడి; మెత్తగా తెగేభాగం; కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు 12 క. ద; 16 క. ప. (కో. 23, 24, 27, 28, 30; తె. 16)

దారుపోవు: (క్రి.) పర్యా. చూ. బండవు. కత్తి మొ॥ వాటికి పదునుపోవడం. (కో. 28).

దాల: 16 మానికల (= 128 కిలోల) ధాన్యంపట్టే పెద్ద వెదురుపేళ్ళ గంప. (తె. 21).

దాలకర్ర: దాల (చూ.)కు పెట్టేకర్ర; మామూలు కర్రకన్న వెడల్పుగా ఉంటుంది. (తె. 21).

దాలెంకర్ర: పర్యా. చూ. పసరుగర్ర. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకర్ర (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగు చుట్టడానికీ గంప ఎత్తుభాగంలో బెండుకర్ర వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్ని వరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53.1; (తె. 17).

దాలెందంట: పర్యా. దంట. దాలెం ( వెదురుబద్ద నుంచి బద్ద వెడల్పుగా పలచగా చీరిన రెండు మూడు భాగాల్లో ఒకటి)ల జత; గుమ్మల అల్లకానికీ నల్చదరం కోళ్ళగూడుకు అడుగు వెయ్యడానికీ ఉపయోగపడుతుంది. (తె. 22).

దాలెం: 1. పర్యా. పలుకు (3). సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా రెండుమూడు చీలికలుగా చీల్చగా వచ్చినది; బద్దంత వెడల్పు (రెండుమూడు వేళ్ళపాటి) ఉంటుంది; గాదె, మూసగంప మొ॥వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 15, 19, 22, 23, 25-28, 31; తె. 22). 2. పర్యా. చూ. నిలువు(1). తడక, పిల్లలపొది, కొడమ, మొ॥వాటి అల్లకంలో నిలువుగావచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడా ఉంటాయి. (రా. 2); 3. పర్యా. చూ. వెన్ను(1). వెదురుగడ చుట్టూ నున్నగాఉన్న భాగం; గడ పచ్చిగా ఉన్నప్పుడు ఆకుపచ్చగానూ ఎండిన తరవాత పసుప్పచ్చగాగాని, తెల్లగాగానీ ఉంటుంది. (తె. 17); 4. పర్యా. చూ. సీర్వ. నిలువుగా సగానికి చీల్చిన గోవ (చూ.)లో ఒకభాగం; దీన్ని ఐదారుకర్ర (చూ.)లుగా చీల్చవచ్చు (కో. 30); 5. పర్యా. చూ. సరుము (1). చేట అల్లకానికి కొలతప్రకారం (మూడుమూళ్ళ జేనెడు) నరికి నున్నగాగీకిన సుద్దిబద్ద. (తె. 22); 6. పర్యా. చూ. పలుకు (1). రెండుమూడు పేళ్ళ మందంగల వెదురుబద్ద; చూ. పేడు. (తె. 20, 21).

దాలెంపేడు: పర్యా. చూ. పసరుపేడు; వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (తె. 17).

దిక్సూచి: దిక్కులు తెలిపే కంపాస్ (దిక్సూచి) మాదిరిగా వెదురుపేళ్ళతో అల్లినది; అలంకారానికి ఇళ్ళలో పెట్టుకొంటారు. (కో. 27).

దిగగొట్టు: (క్రి.) ఉ. దిగ్గొట్టు; 1. పర్యా. కుదేయు, దిగివేయు(1). గంప మొ॥వాటి అల్లకం పూర్తయిన తరవాత చుట్టినకర్ర (= తీగలా సన్నటిది)కూ కర్రకూమధ్య సందులు లేకుండా అల్లకం చిక్కబడడానికి అంచుదగ్గర అల్లినభాగం కిందికి దిగేటట్లు అంబు (చూ.) మడిమెతో కొట్టడం (కో. 4; తె. 21); 2. గోదినీ (చూ.) అల్లేటప్పుడు బిగువుగా ఉండటం కోసం కర్రతో కొట్టడం. (కో. 20).

దిగదండు: పర్యా. ఎగువతండు, నూలుమాను, మిందండు, ముందరబొంగు. చాపనేతమగ్గం చివర అమర్చిన వెదురుగడ; నిలువుపోగులను ఎగదండు (= నేతగాడు కూర్చునేవైపు ఉండేది) నుంచి చాపి దీనికి కడతారు. నేతపనివాడికి ఎదురుగా ఉంటుంది; పోగుల్ని లాగి ఉంచుతుంది. చూ. చిత్రం 120. (కో. 3).

దిగవేయు: ఉ. దిగేయు; 1. పర్యా. చూ. దిగగొట్టు(1). గంప మొ॥వాటి అల్లకం పూర్తయిన తరవాత చుట్టినకర్ర (=తీగలా సన్నటిది)కూ కర్రకూ మధ్య సందులు లేకుండా అల్లకం చిక్కబడడానికి అంచుదగ్గర అల్లినభాగం కిందికి దిగేటట్లు అంబు(చూ.) మడిమెతో కొట్టడం. (తె. 17, 25); 2. పర్యా. చూ. మలుచు(2). అల్లకం పూర్తయిన తరవాత (గంప మొ॥వాటికి) మిగిలిన నిలువులను లోపలివైపు వంచి అంచులోపలికి దోపడం. (కో. 25).

దిగువతండు: పర్యా. చూ. ఎగదండు. చాపనేతం మగ్గం మొదటిభాగంలో ( నేతపనివాడు కూర్చునే వైపు) అమర్చిన లావాటి పలక; పోగులను లాగిపట్టి ఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూ పోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులను దూర్చి

దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు దారం కొలుకులుగాని పొడుగాటి ఇనపచువ్వగాని తొడుగుతారు. చూ. చిత్రం 120 చ. 3. (రా. 4).

దిట్టం: గట్టితనం; చేట మొ॥వాటికి గట్టితనానికి కట్లు బిగిస్తారు. (కో. 3).

దిడ్డి: 1. పర్యా చూ. బొక్క(2). గొర్రెపిల్లల గూడులోకి పిల్లల్ని వేయడానికి ఉంచినసందు; అల్లేటప్పుడు ఒక గొర్రెపిల్ల పట్టేంత సందు వదులుతారు. చూ. చిత్రం 77. 4. (తె. 24); 2. ఎరువుపొణక (బండిజల్ల)కు వెనకభాగంలో అల్లకుండా వదిలేసిన భాగం (తె. 23); 3. పర్యా. చూ. దారి. ఈతబద్దలతో అల్లే కోళ్ళగూడులోకి కోళ్ళను వేయడానికి పెట్టిన ద్వారం. (తె. 16).

దిండిగం: ఉ. దిండిగెం; రూ. దండిగం; పర్యా. బంగిపెట్టె. సారెపెట్టెగా పనికొచ్చే గుండ్రటిపెట్టె; దీనిమూత కొప్పు మాదిరిగా ఉంటుంది; దీన్ని రెండు పొరలుగా అల్లుతారు; లోపలిపొర వెదురు పేడుతోనూ బయటిపొర కర్రతోనూ అల్లుతారు; వైశ్యులూ కరణాలూ మొ॥ వాళ్ళు వాడతారు; చూ. చిత్రం 43. (9, 10, 14, 26).

దిండు: ఈతచువ్వల (బరిగెల) మొదళ్ళు కొన్ని, కొనలుకొన్ని ఒకవైపు వచ్చేటట్లు పేర్చిన కట్టల కుప్ప; రెండువైపులా ఇలావస్తాయి. (తె. 7).

దిన్నె: గుట్టలప్రదేశం. (రా. 7).

దిప్ప: కొబ్బరికాయ పైభాగాన్ని మూసి ఉండే ముచిక; అచ్చిప్పంత ఉంటుంది. చూ. చిత్రం. 126. 2. (కో. 25).

దిబ్బ: పర్యా. చూ. మండె(1). వెదురుగడలపోగు; మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్నిచోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని ప్రభుత్వంవారి వెదురుడిపోలోగాని అడితీల్లోగాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తం లేదు. (కో. 1).

దిమ్మ: పర్యా. గుంజ(1). పందిరి, కొట్టం కళ్యాణ మంటపం మొ॥వాటి నిర్మాణంలో నేలలోపాతిన లావుపాటి వెదురుగడ. చూ. చిత్రం 102. 1. (తె 1).

దిమ్మెసగుతప: ఉ. —గుత్ప; మిద్దెలమీద చవుడు పోసి చదునుచేసే కొయ్యదిమ్మకు బిగించిన వెదురు గడ. (తె. 1 ).

దిమి: పర్యా. చూ. ఖానా(1). వెదురుగడలు నిలవచేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండు గడలు (లేదా సరుగుడుకర్రలు) పాతి వాటికి ఎదురుగా గజంఎడంలో మరో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి ఆ నాలిగింటి పైచివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవేపు ఖాళీ ఉంచుతారు; ఖాళీ ఉన్న వేపునుంచి గడలుదూర్చి నిలబెడతారు, ఖాళీవేపును గొలుసుతోగాని గడతోగాని మూసి తాళం గూడా వేసుకోవచ్చును (తె. 21).

దుకాణం: పర్యా. చూ. అడితి(1). వెదురుగడల అమ్మకం జరిగే చోటు; అడవినుంచి తెచ్చి ఇక్కడ అమ్ముతారు. (తె. 17).

దుక్క: 1. పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తినేలకు తగిలి మొక్క పోకుండా బద్ద అడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగున్న కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తి కరిపించి దాని మీద కొట్టడానికి కూడా వాడతారు. (కో. 19, 23, 26–28, 31); 2. కొబ్బరిదొక్కలు నలగ్గొట్టే రుబ్బురాయి (పొత్రం) లాంటి కొయ్య; దీన్ని పట్టుకోడానికి పిడి ఉంటుంది. (కో. 23).

దుక్కిమోకు: ఎలగటినాగలి పణతనుంచి వ్రానెను కలిపికట్టే లావాటితాడు; గోగునారతోగాని జనపనారతోగాని పేంతారు. (తె. 9).

దుగిరందబ్బ: పర్యా. చూ. గంటిదబ్బ(1). గంటి గనుపుగుర్తు (=వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతం వాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (రా. 2).

దుగ్గు: 1. పర్యా. చూ. పీచు(1). వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగా ఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు. (తె. 17); 2. పర్యా. చూ. తుక్కు. వెదురుబద్దలూ పేడూ చీల్చేటప్పుడువచ్చే పుల్లల్లాంటి చిన్నచిన్న ముక్కలు; పొయ్యిలోకి పనికొస్తాయి. (కో. 3).

దుంగ: పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్క పోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగున్న కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మ

మొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది, వెదురుగడ పగలగొట్టడానికీ, గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (కో. 12, 17, 18).

దుబ్బ: పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమి లోపల వేళ్ళతోసహా ఉన్న దుంప; వెదురుగింజ భూమిలో పడినతరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్ని పిల్లవేళ్ళు భూమిలోకి పారతాయి. (కో. 30).

దుబ్బకర్ర: పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టు (బొద్దు)చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చి తీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (రా. 9).

దుబ్బబొంగు: పర్యా. చూ. నిలువుబొంగు (2). నిచ్చెన తయారీలో నిలువుకు వాడే వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (రా. 10).

దుబ్బు: 1. పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమిలోపల వేళ్ళతోసహా ఉన్న దుంప; వెదురుగింజ భూమిలో పడినతరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ, లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ, కొన్ని పిల్లవేళ్ళూ భూమిలోకి పారతాయి. (కో. 31). 2. తుంగగడ్డి మొక్క. (కో. 30).

దుంప: 1. పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమిలోపల వేళ్ళతోసహా ఉన్న దుంప; వెదురుగింజ భూమిలోపడిన తరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ, లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్ని పిల్లవేళ్లూ భూమిలోకి పారతాయి. (కో. 27). 2. పర్యా. చూ. మొద్దు (3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్ద అడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగున్న కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికీ, గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికికూడా వాడతారు. (కో. 2, 3, 6-8; తె. 31).

దుంపకర్ర: పెరగని వెదురుగడ; మొక్క లేతగా ఉన్నప్పుడు చిగురు విరిచేయడంవల్ల కణుపులు దగ్గర దగ్గరగా పుట్టి పెరుగుదల ఆగిపోతుంది; దీన్ని వేళ్ళ దగ్గరినుంచి పీకి సాపుచేసి కర్రగా వాడతారు. (కో. 28).

దుయ్యు: (క్రి.) విడదియ్యడం; కొబ్బరిపీచులో చిక్కులు పోవడానికి ఏపోచ కాపోచ విడదీస్తారు. (కో. 5).

దులిపేయు: (క్రి.) (< దులిపివేయు) విదిలించడం; కొబ్బరిపీచులో ఉన్న పొట్టు రాలిపోవడానికి చేత్తో దులుపుతారు. (కో. 29).

దువారం తడక: (< సం. ద్వారం ) 1. పర్యా. చూ. వాకిలితడక (1). గుమ్మానికి అడ్డంగా తలుపు మాదిరిగాపెట్టే వెదురుతడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (కో. 31). 2. పర్యా. చూ. దర్వాజాతడక. తడకలతో కట్టిన ఇంటిముందు భాగానికి తలుపుతోసహా అమర్చిన పెద్దతడక; చూ. చిత్రం 38 క. (కో. 25).

దువ్వెనవిసనగర్ర: మధ్యలో దువ్వెనలాంటి డిజైను వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (తె. 18).

దుసేరుతీగ ఉ దుశర్తీగె, దుశేర్తీగ, దుసెర్తీగ; పర్యా. సిబ్బితీగ. నేలమీద పాకే ఒకరకం తీగ; ఆకు పచ్చగా దబ్బనమంత లావు ఉంటుంది; సిబ్బి; పశువుల మూతిబుట్ట మొ॥ అల్లడానికీ తాళ్ళు పేనడానికీ పనికొస్తుంది. (తె. 9, 11, 14, 20).

దుస్సిడుచు: (క్రి.) ఉ. దుస్సిడుసు; జారిపోవడం. (రా. 1).

దూగోడుగుంజు: (క్రి.) పర్యా. చూ. గీతబట్టు. వెదురుపేడు నున్నగా గీకడ ; బొద్దుభాగంవైపు పసరుభాగంవైపు రెండువైపులా గీకుతారు; పసరుభాగంవైపు గీకడంవల్ల అల్లేటప్పుడు జారకుండా పొందికగా ఉంటుంది; మొద్దుకూ లేదా వంకెకూ కత్తి పదునుకూ మధ్య పేడుపెట్టి లాగుతూ గీకుతారు. (తె 6)

దూడబుట్ట ఉ. బుట్టి; పర్యా. లేగబుట్ట. లేగదూడలు మట్టి నాకకుండా వాటి మూతికికట్టే చిన్న వెదురుపేళ్ళ బుట్ట; గాలి ఆడడానికి వీలుగా పేళ్ళ మధ్య చిన్నచిన్న సందులు (కళ్ళు) ఉంటాయి (కో 2)

దూరంగనుపుబొంగు ఉ. గెన్పు ; పర్యా. చూ. నిడుపు (గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥వాటి

అల్లకానికి పనికొస్తుంది. (కో. 2).

దూరంగుంపెదురు: పర్యా. చూ. నిడుపు(గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥వాటి అలకానికి పని కొస్తుంది. (కో. 30).

దూరం: ఉ. దూరెం, దోరెం; వెదురుగడకు రెండు గంటిగనుపుల మధ్య ఎడం. (కో. 13-15, 17).

దూలంతడక: పర్యా. పక్కతడక(2). తడకలతో కట్టే ఇంటికి పొడుగుభాగం వైపు దూలం కింది నుంచి పెట్టే దీర్ఘచతురస్రాకారం తడక. (తె.23).

దేవాలయం: ఇళ్ళలో బొమ్మకొలువులో పెట్టడానికి గుడి(గోపురం) ఆకారంలో అల్లినబొమ్మ. (కో.5).

దేగర: చూ. దాగెర. (తె. 4).

దొంగనిలుగు: ఉ. —నిల్లు; **1.** రెండువైపులా కాకుండా ఒకవైపు మాత్రమే ఉండే నిలువు. (తె. 23); **2.** పర్యా. తపనగాలు, తప్పుడుమెట్టు. ఈతగంప మొ॥వాటి అల్లకంలో అడుగునపెట్టే ఆరుజతల నిలువులుగాక ప్రత్యేకంగా అడుగువరకే ఉండే ఒక నిలువుబద్ద; ఇదిలేకపోతే అల్లకం కుదరదు. (తె. 13).

దొడ్డి: **1.** పర్యా. కోట. వెదురు వ్యాపారులు దుకాణానికి వెనక పెద్దమొత్తంలో వెదురుగడలు నిలవ ఉంచే ప్రదేశం. (తె. 17); **2.** పర్యా. చూ. అడితి(1). వెదురుగడల అమ్మకం జరిగేచోటు; అడవినుంచి తెచ్చి ఇక్కడ అమ్ముతారు. (కో. 8); **3.** పర్యా. చూ. గావు. ఎరకలికత్తి (కొడవలి)లో వంపుదిరిగి పదునుగా ఉన్నభాగం. చూ. చిత్రం 118. 3. (కో. 25); **4.** (—అపర్చు) పర్యా. చట్రం(2). తడక అల్లకంకోసం వెదురుబద్దలతో దీర్ఘచతురస్రాకారంలో ఏర్పరిచిన కైవారం. (కో. 15).

దొడ్డితడక: ఉ. - తడ్కె; రైతులు పశువులను తోలే దొడ్డి ఏర్పాటుకోసం పెట్టే వెదురుబద్దల తడక. (తె. 22).

దొడ్డీతకట్టె: పర్యా. చూ. దొడ్డుబరిగె. వేలెడుకన్న ఎక్కువ లావుండే ఈతచువ్వ (బరిగె); గుమ్మలు, బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె.13).

దొడ్డీనేం: (దొడ్డు+ఈనేం) పర్యా. చూ. మందపేడు. గోరుమందంకన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 29).

దొడ్డు: పర్యా. వలం(2). లావు. (తె. 4).

దొడ్డుకర్ర: పర్యా. చూ. లావీనె(1). మామూలు కర్ర (చూ.) కన్న కొంచెం మందగానూ వెడల్పుగానూ ఉండేకర్ర; గంప మొ॥వాటి అల్లకంపనిలో ఎత్తుగావచ్చే భాగం అల్లడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (తె. 26).

దొడ్డుగనె: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపు దగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలు పెరగటం వల్ల గాని, ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడం వల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడంకష్టం. (తె. 22).

దొడ్డుతడక: ఉ. — తడ్క; పర్యా. చూ. మోటుతడక. మందంగానూ, బద్ద వెడల్పుగానూ ఉన్న పేడుతో (మోటుగా) అల్లిన తడక; నిలువుకూ అడ్డానికీ పేడే వాడతారు. (తె. 4).

దొడ్డుపువ్వు: విసనగర్ర అల్లకంలో వచ్చే ఒకరకం డిజైను; లావుపాటి పువ్వు. (రా, 7).

దొడ్డుపేడుతడక: ఉ. దొడ్డుబేడుతడ్క; పర్యా. చూ. మోటుతడక. మందంగానూ, బద్ద వెడల్పుగానూ ఉన్న పేడుతో (మోటుగా) అల్లినతడక; నిలువుకూ అడ్డానికీ పేడే వాడతారు. (తె. 15).

దొడ్డుపేళ్ళచేట: ఉ. దొడ్డువేల్లశాట, దొడ్డువేళ్ళశాట; పర్యా. చూ. పెద్దపేళ్ళచేట. వెడల్పాటి పేళ్ళతో అల్లినచేట; దీన్ని మామూలుగా ఒంటిపేడుమీద గాని రెండుపేళ్ళ (చూ. రెంటాల) మీదగాని అల్లుతారు. (తె. 4, 16, 28).

దొడ్డుబద్దలతడక: ఉ. —తడ్క; పర్యా. చూ. బద్దల తడక. బద్ద బద్ద పళంగా అల్లినతడక; నిలువుకూ అడ్డానికీ బద్దలే వాడతారు. (తె. 21).

దొడ్డుబరిగె; పర్యా. దొడ్డీతకట్టె, దోరమీతకట్టె, లావు కట్టె, లావుజువ్వ, లావుబరిగె. వేలెడుకన్న ఎక్కువ లావుండే ఈతచువ్వ (బరిగె); గుమ్మలు, బండి జల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 14, 20).

దొడ్డుబొంగు: పర్యా. బొడ్డువెదురు, పెద్దవెదురు, బొంగు (2), మోటు (1), లావుకర్ర (1), లావు బొంగు, లావుమేదరి, లావువెదురు, లావుసాధనం. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగం లోనూ మూడంగుళాలు కొసభాగంలోనూ లావుం టుంది; బండిజల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉప యోగపడుతుంది. (తె. 3, 5, 12, 15, 16, 18,

20, 22-26, 28).

దొడ్డువిసనగర్ర: ఉ. —యిసనగర్ర; మందంగా ఉండే పేళ్ళతో అల్లిన విసనగర్ర; పొయ్యి విసురుకొంటారు. (తె. 22).

దొడ్డువెదురు: పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగంలోనూ, మూడంగుళాలు కొసభాగంలోనూ లావుంటుంది; బండిజల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది. (తె. 29).

దొడ్డుపేళ్ళల్లకం: ఉ. —పేళ్ళల్లకం, సుమారు వేలెడు వెడల్పుగల పేళ్ళతో అల్లడం; రెండుపేళ్ళ గచ్చం మీద అల్లుతారు. (తె. 18).

దొప్ప: లూజు. (తె. 12).

దొబ్బుడుబొంగు: పర్యా. చూ. లోబొంగు. (తుంగ) చాపనేతమగ్గంలో ఒకవరస పోగుల నడుమదూర్చిన లావుపాటి వెదురుగడ; గజంపొడు గుంటుంది. చూ. చిత్రం 120 క. 2.

దొల్ల: పర్యా. చూ. బండిజల్ల(1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరచి ఉంటాయి; చూ. చిత్రం 32. (రా. 2, 4).

దోగోటు: ఈతచాప అడ్డంలో కొసలను మూసేస్తూ రెండుపొరలు వచ్చేటట్లు కుట్టిన రెండు అంచు పట్టెలు. (తె. 21).

దోణిమొద్దు: పర్యా. చూ. ఎగదండు. చాపనేతమగ్గం మొదటిభాగంలో (=నేతపనివాడు కూర్చొనేవైపు) అమర్చిన లావాటి పలక; పోగులను లాగిపట్టి ఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూ పోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులను దూర్చి దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు దారంకొలుకులుగాని పొడుగాటి ఇనపచువ్వగాని తొడుగుతారు. చూ. చిత్రం 120 చ. 3. (రా. 6).

దోనం: చూ. దబ్బలం. (కో. 31).

దోనిగుంపు: పర్యా. జోరి, దొప్ప, డోరియం. వెదురుగడ (లోపల) ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కనిపించీ కనిపించనట్లుగా ఉండే సన్నటి కాలవలాంటి పల్లం, కొన్నిటికి ఒక కణుపునుంచి మధ్యవరకే ఉంటుంది; మొదటకొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది. (కో. 25).

దోనిమాను: పర్యా. చూ. ఎగదండు. చాపనేతమగ్గం మొదటిభాగంలో (=నేతపనివాడు కూర్చొనే వైపు) అమర్చిన లావాటి పలక; పోగులను లాగిపట్టి ఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూ పోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులను దూర్చి దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు దారం కొలుకులుగాని పొడుగాటి ఇనపచువ్వగాని తొడుగుతారు. చూ. చిత్రం 120 చ. 3. (రా. 2).

దోనె: పర్యా. గుంత(1), గొన్కపొట్టె, తగ్గు(1), తవ్వెచార, పొక్క(2), పొట్ట(1), బొత్త, బొద్దు(2), బోలు(2), బోలుకాల, లొట్ట(2) వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవ మాదిరిగా పల్లంగా ఉండేభాగం. (కో. 3, 5; తె. 18).

దోపు: 1. పర్యా. చూ. మడుపు(1). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ వస్తువుల అల్లకం పూర్తయిన తరవాత మిగిలిన నిలువుల చివర్లను వెనక్కితిప్పి అంచులోపలికి దోపినప్పుడు వచ్చినవంపు. చూ. చిత్రం 47. క. 1. (తె. 23), 2. ఉ. దాపు; పర్యా. గుచ్చు, చెక్కు(4); దూర్చడం; గంప, తడక మొ॥వాటి అల్లకంలో అంచుదగ్గర మిగిలిన నిలువులను వెనక్కి మడిచి అంచులోపలికి దూరుస్తారు. (కో. 2, 4, 10, 25, 27, 28, 31; తె. 21-25, 30, 31; రా. 10).

దోమతెరకర్ర: దోమతెర కట్టడానికి మంచానికి తొడిగే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావు ఉంటుంది. (కో. 3).

దోయరు: (< హిం. దో- రెండు) (2). ఉ. దోఎరు, దోయర్; 1. రెండుపొరలుగా అల్లి జతచేసిన తక్కెడ (త్రాసు) సిబ్బులు. (తె. 6); 2. రెండు వరసలుగా అల్లే విధానం. (తె. 26).

దోర: చూ. దారు. (కో. 17).

దోరమామిడికర్ర: పర్యా. దోరమామిడిబొంగు. ఆకుపచ్చ, పసుప్పచ్చ కలిసిన రంగులో ఉండే వెదురుగడ; బాగా పొడుగ్గా ఉంటుంది. (కో. 10).

దోరమామిడిబొంగు: పర్యా. దోరమామిడికర్ర. ఆకుపచ్చ, పసుప్పచ్చ కలిసిన రంగులో ఉండే వెదురుగడ; బాగా పొడుగ్గా ఉంటుంది. (కో. 9).

దోరమీతకట్టె: పర్యా. చూ. దొడ్డుబరిగె. వేలెడుకన్న

ఎక్కువ లావుండే ఈతచువ్వ (బరిగె); గుమ్మిలు, బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 16).

ధోరు: చూ. ధారు. (కో. 21).

ధోర్నంతాడు: (< తోరణం) పెళ్ళి మొ॥ శుభసందర్భాల్లో ఇళ్ళకు మామిడాకుల తోరణంకట్టే సన్నటి ఈతనార తాడు; పొడుగ్గా ఉంటుంది. (తె. 9).

ధోర్నాలబొంగు: దోర్నాల ప్రాంతంనుంచి తెచ్చిన బొంగు. (రా. 8).

ద్రాక్షబుట్ట: 1. పర్యా. చూ, అంగూరుబుట్ట. ద్రాక్ష పళ్ళ పార్సెల్ చేయడానికి అల్లినబుట్ట; మోటు వెదురుపేడుతో వదులుగా అల్లుతారు; బొక్కెన ఆకారంలో ఉంటుంది; కొన్నిటికి కమాన్‌బద్ద ఉంటుంది. (రా. 6). 2. పర్యా. అంగూరుగంప, అంగూరంగుల్ల. అంగూరుబుట్ట (1). ద్రాక్షపళ్ళు పెట్టుకొనే బుట్ట; పూర్తిగా ఈతపేడుతో అల్లుతారు, (రా. 9).

ద్రోణాచలెంకట్టె: ఉ. దోర్నాచలం–; ద్రోణాచలం ప్రాంతంనుంచి వచ్చే వెదురుగడ. (తె. 9).

ధాన్యంజల్లెడ: ఉ. –జల్లెడి; ధాన్యం జల్లించే జల్లెడ, (కో. 23, 26).

ధాన్యంపాణక: ధాన్యం పోసుకొని పోవడానికి బండి మీద వేసే వెదురుపేళ్ళ జల్ల. (కో. 18).

ధాన్యంబుట్ట: పర్యా. చూ. గుమ్మి (2). ఒకచోట స్థిరంగా ఉంచి పెద్దమొత్తంలో వడ్లు మొ॥ పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; సుమారు గజంఎత్తూ ముప్పావుగజం నుంచి గజంన్నర వరకు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ, కొన్నిచోట్ల కిందినుంచి మీదికి గుండ్రంగానూ, కొన్నిచోట్ల కింద వెడల్పుగానూ గుండ్రంగానూ, మధ్య కొంచెం వెడల్పుగానూ ఉండి, పోనుపోను మూసుకొచ్చే విధంగానూ, కొన్నిచోట్ల కింద గుండ్రంగానూ పోనుపోను పైన సన్నగానూ ఉంటుంది; కొన్నిచోట్ల దీనికి శిఖరంలాంటి కప్పు ఉంటుంది; రెండు బస్తాలనుంచి 12 బస్తాలవరకు ధాన్యంపట్టే పరిమాణంలో ఉంటాయి; చూ. చిత్రం 74 క, ట (కో. 17).

న

నక్కు: ఉ. నొక్కు 1. నాగలికర్ర (కో. 30); 2. పర్యా. కొమ్ముకట్టు, నక్కుబద్ధకట్టు. చేట ముందుభాగంలో రెండు కొమ్ములను (=కింది కొమ్ము పైకొమ్ము) కలిపి కట్టుముంగు(చూ.)తో చేసిన బిగింపు. (కో. 18).

నక్కుబద్ద: పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరిభాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కింది నుంచిగాని మీదినుంచిగాని అదనంగా వేసే మరో కొమ్ము; మొదటిదానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము. (కో. 21).

నక్కుబద్దకట్టు: పర్యా. చూ. నక్కు(2). చేట ముందరిభాగంలో రెండు కొమ్ములను (=కింది కొమ్ము పైకొమ్ము) కలిపి కట్టుముంగు(చూ.)తో చేసిన బిగింపు. (కో. 21).

నట్టి: పర్యా. గోడ(1). వెదురుపేడుతో అల్లిన కోళ్ళ గూడుకు కొంతమేర ఎత్తుగా చిక్కగా అల్లినభాగం. చూ. చిత్రం 65. క. 1, (కో. 31).

నడ: 1. పర్యా. చూ. నడికర్ర. ఒకనెలనుంచి మూడు నెలలవరకు వయస్సుగల లేత వెదురుకర్ర; దీన్ని చీరి చేట, జల్లెడ మొ॥వాటికి కట్లు కట్టడాని కవసరమయ్యే తీగ (చూ.)లు తియ్యడానికి పనికొస్తుంది. (కో. 3); 2. రూ. నర; పర్యా. చూ. నడి(1). చేట, కల్లెడ, విసనగర్ర మొ॥వాటికి కట్లుకట్టడానికి లేత వెదురుగడ నుంచి తీసిన పలచటి, మెత్తటి పేడు; ఎటువంచినా విరగదు. (కో. 6).

నడతీగ: పర్యా. చూ. నడి(1). చేట, జల్లెడ, విసనగర్ర మొ॥వాటికి కట్లుకట్టడానికి లేతవెదురుగడ నుంచి తీసిన పలచటి, మెత్తటిపేడు; ఎటువంచినా విరగదు. (కో. 5).

నడి: 1. పర్యా. కట్టుబద్ద(3), తీగ(2), తీగబద్ద, నడ(2), నడతీగ, నడిబద్ద, నరిపేడు, నల్లిమెల్లె, బిలుకు(8), వెదురుతీగ. చేట, జల్లెడ, విసనగర్ర మొ॥వాటికి కట్లుకట్టడానికి లేతవెదురుగడ నుంచి తీసిన పలచటి, మెత్తటిపేడు; ఎటువంచినా విరగదు. (కో. 5, 8–10, 12, 13, 15; తె. 31; రా. 5); 2, మానె (చూ.) మొ॥వాటి అల్లకంలో మిగిలిన నిలువులను లోపలివైపుతిప్పి గోడలోకి దోపి పైన ఉగ్గంలా ఉంచినభాగం. (పూర్తయిన తరవాత దీన్ని లోపలికి లాగుతారు). (కో. 28); 3. పొడుగ్గా గట్టిగా ఉండే కొబ్బరిపీచుపోగు; కొబ్బరికాయ లోపలి పొరనుంచి తీస్తారు (కో. 30); 4 చెట్లకు కట్టడానికి పనికొచ్చే పలచటి లేతవెదురు పేడు; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 14).

నడికట్టు: 1. చేట అంచుకు నడి (చూ.)తో వేసిన

కట్టు. (కో. 10). **2.** చూ. నడిమికట్టు. (తె. 29).

నడికనుపు: పర్యా. చూ. గనుపుసందు. వెదురుగడకు రెండుకణుపుల మధ్యభాగం; కొన్నిటికి పొడుగ్గానూ, కొన్నిటికి పొట్టిగానూ ఉంటుంది. (కో. 25).

నడికర్ర: పర్యా. నడ (1), బోదు (1), మోసు (3), లేతవెదురు (1), ఒక నెలనుంచి మూడునెలల వరకు వయస్సుగల లేత వెదురుకర్ర; దీన్నిచీరి చేట, జల్లెడ మొ॥వాటికి కట్లుకట్టడాని కవసరమయ్యే తీగ (చూ.)లు తియ్యడానికి పనికొస్తుంది. (కో.9).

నడింకట్టు: పర్యా. నడిబొద్దు (2), మధ్యకట్టు బుట్ట. ఈతచువ్వలతో అల్లిన గంప మొ॥వాటి మధ్య భాగంలో బయటినుంచి నిలువుభాగంలో వేసేకట్టు. చూ. చిత్రం 48.1; (రా. 9).

నడితరంపేడు: ఉ. నడ్తరం—; పర్యా. చూ. తెల్ల పేడు (1), వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 17).

నడితరంబొంగు: ఉ. నడ్తరం—; పర్యా. చూ. సెకండ్‌క్లాస్ బొంగు. సుమారు 9 సెం॥మీ నుంచి 12 సెం. మీ వరకూ లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది. (తె. 20, 22).

నడిదాల: (క్రి. విణ) పర్యా. మయంగా. మధ్యన (రా. 4).

నడింతబొద్దు: పర్యా. చూ. నడిమికట్టు. గంప, మానె. గుమ్మి మొ॥వాటి ఎత్తుభాగానికి మధ్యలో బయటి నుంచి చుట్టూ వేలెడు మందానగాని రెండువేళ్ళ మందానగాని గట్టిగా అల్లినభాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50. 3. (రా. 3).

నడిపిదాగర: కూరగాయలు వేసుకోడానికీ అన్నం చల్లారబెట్టడానికీ పనికొచ్చే దీర్ఘచతురస్రాకారం వెదురుపేళ్ళ పళ్ళెం; పెద్దగా ఉంటుంది; మూడు మూళ్ళ పొడుగూ మూరన్నర వెడల్పు ఉంటుంది; చూ. దాగర. (కో. 30).

నడిబద్ద: పర్యా. చూ. నడి(1). చేట, జల్లెడ, విసన గర్ర మొ॥వాటికి కట్లుకట్టడానికి లేతవెదురుగడ నుంచి తీసిన పలచటి, మెత్తటిపేడు; ఎటువంచినా విరగదు. (కో. 10, 14, 15).

నడిబొంగు: పర్యా. చూ. లోబొంగు. (తుంగ)చాపనేత మగ్గంలో ఒకవరస పోగులు అని లేపడానికి పోగుల నడుమ దూర్చిన లావుపాటి వెదురుగడ; గడం పొడుగ్గా ఉండి; పొత్తుల్కు పట్టుకూ దిగవదండుకూ మధ్య ఉంటుంది. చూ. చిత్రం 120 క. 2. (కో.8).

నడిబొద్దు: **1.** చూ. నడింబొద్దు. (కో. 4; రా. 4); **2.** పర్యా. చూ. నడింకట్టు, బుట్ట, ఈతచువ్వలతో అల్లినగంప మొ॥వాటి మధ్యభాగంలో బయటనుంచి నిలువు భాగంలోవేసే కట్టు. చూ. చిత్రం 48. 1. (కో. 3).

నడిబోదు: వెదురుమొక్క లేతగా ఉన్నప్పుడు నరికి తీసినగడ. (కో. 14).

నడిమధ్యచిప్ప: ఉ. -చిప్ప; పర్యా. చూ. అడ్డం బద్ద(1). అల్లకం పూర్తయిన తరవాత తడక మీంచి అడ్డంగా గట్టిపడటంకోసం కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 36 క. 2. (కో. 7).

నడిమికట్టు: ఉ. నడిం–, నడ్మి–; రూ. నడికట్టు(2); పర్యా. నడింతబొద్దు, నడింపెండె, నడింబొద్దు, నడ్మదలబొద్దు, మధ్యపెండె, మయంపెండె, మారు కట్టు. గంప, మానె, గుమ్మి మొ॥వాటి ఎత్తుభాగానికి మధ్యలో బయటినుంచి చుట్టూ వేలెడు మందానగాని రెండువేళ్ళ మందానగాని గట్టిగా అల్లినభాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50. 3. (తె. 13, 16–19, 21–26; రా. 9).

నడిమివాయిదార: ఉ. —అయిదర్; కత్తిపదునులో మధ్యభాగం. (తె. 23).

నడిముడి: పలుపుతాడులో మధ్యన వేసిన ముడి. చూ. చిత్రం 145. 4. (రా. 5).

నడింపెండె: పర్యా. చూ. నడిమికట్టు. గంప, మానె, గుమ్మి మొ॥వాటి ఎత్తుభాగానికి మధ్యలో బయటి నుంచి చుట్టూ వేలెడు మందానగాని గట్టినా అల్లిన భాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50. 3. (కో. 30).

నడింపెండెవార: ఉ. —పెండార; గంప మొ॥ మధ్య భాగంలో చుట్టూ వెలుపలినుంచి (మధ్యపెండె) కట్టుగా చుట్టేకర్ర. (కో. 30).

నడింబొద్దు: రూ. నడిబొద్దు; పర్యా. చూ. నడిమికట్టు. గంప, మానె, గుమ్మి మొ॥వాటి ఎత్తుభాగానికి మధ్యలో బయటినుంచి చుట్టూ వేలెడు మందానగాని రెండువేళ్ళ మందానగాని గట్టిగా అల్లినభాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50. 3. (కో. 3, 8, 29; రా. 3, 5).

నడుంకట్టు: చేట మధ్యలో వేసినకట్టు. (కో. 18).

నడుము: **1.** పర్యా. చూ. కాడ(1). మేదరకత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం;

కొన్నిటికి కాద మాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (తె. 21); **2.** కలబంద మట్టలో నడిమిభాగం. (రా. 5).

నడ్డలకంతలిసనగ్రర: ఉ. –ఇసనగ్రర; పర్యా. చూ. జేలివిసనగ్రర. పేళ్ళ మధ్య సందులు (జేలీ)లు వచ్చేటట్లు అల్లినవిసనగ్రర; చూ. చిత్రం 31 త. (రా. 4).

నడ్డిపూస: పర్యా. చూ. వెన్ను (4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 ద. 3. (రా. 4).

నడ్మదలబొద్దు: పర్యా. చూ. నడిమికట్టు. గంప, మానె, గుమ్మి మొ॥వాటి ఎత్తు భాగానికి మధ్యలో బయటినుంచి చుట్టూ వేలెడు మందానగాని రెండు వేళ్ళ మందానగాని గట్టిగా అల్లినభాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. (రా. 6).

నదరు: పర్యా. చూ. మొదలు (1). వెదుగడ మొదటి భాగం; వేళ్ళకుపైది; కొసకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 4.2. (తె. 5).

నందిపండుగ: వెదురుగడలు కొట్టుకు రావడానికి అడవిలో అడుగు పెట్టేముందు చేసుకొనే ఒక పండుగ. (కో. 24).

నంద్యాలవెదురు: ఉ. నంద్యాలెదురు; నంద్యాల అడవులనుంచి తెచ్చిన వెదురుగడ; 15 అడుగుల పొడుగుంటుంది; మెత్తగా ఉంటుంది. (తె. 12; రా. 2, 4).

నయంచాప: ఉ. –సాప; పర్యా. చూ. జమ్మటిచాప, రెండుపొరలుగా నేసిన (తుంగ)చాప. (రా. 10).

నర: చూ. నడ (2). (తె. 1).

నరాలతుంగ: గట్టిగా సన్నగా ఉండే ఒకరకం తుంగ. (కో. 3).

నరికేయు: (క్రి.) పర్యా. చూ. నరుకు (1). వెదురు గడగాని, బద్దగాని ముక్కలయ్యేటట్లు కత్తితో కొట్టడం, కొయ్యడం. (కో. 28).

నరిపేడు: పర్యా. చూ. నడి (1). చేట, జల్లెడ, విసనగ్రర మొ॥వాటికి కట్లుకట్టడానికి లేతవెదురు గడనుంచి తీసిన పలచటి, మెత్తటిపేడు; ఎటు వంచినా విరగదు. (రా. 4).

నరుకు: గాటు; నరికినచోట పడ్డ గుర్తు. (కో. 14).

**నరుకత్తి:** (< నరుకు+కత్తి) పొడవున్న వెదురు గడ నరకడానికీ పగలగొట్టడానికీ పనికొచ్చే పెద్ద కత్తి; చూ. చిత్రం 12 చ. (కో. 27, 28).

నలగ్గొట్టు: (< నలగ + గొట్టు) పర్యా. చితగ్గొట్టు. కొబ్బరిదొక్కలు చీలేటట్లు గూటంతో కొట్టడం. (కో. 5, 20, 21).

నల్కండుమగ: మేదరివాళ్ళలో ఒకతెగ. (రా. 1).

నల్తుంగుమ్మి: నాలుగుతూముల ధాన్యంపట్టే వెదురు పేళ్ళ గుమ్మి (గాదె). (తె. 21).

నల్లకలమందనార: ఎండిపోయిన కలబంద మట్ట నుంచి తీసిననార; నల్లగా ఉంటుంది. (రా 5).

నల్లదీగ: ఉ. నల్లతీగ; నల్లదీగ (మొక్క) నుంచి తీసినతీగ; చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (కో. 2; తె. 30; రా. 4).

నల్లదీగకట్టు: ఉ. నల్దీగకట్టు; పర్యా. నల్లదీగపొట్టె. చేట మొ॥వాటికి నల్లదీగ చుట్టివేసినకట్టు. (రా. 3).

నల్లదీగపొట్టె: పర్యా. నల్లదీగకట్టు. చేట మొ॥ వాటికి నల్లదీగ చుట్టివేసిన కట్టు. (తె. 30).

నల్లపుల్చేరుకట్టె: ఉ.–బుల్చేరగట్టె; నల్లరంగులో ఉండే పుల్చేరుచువ్వ. (తె. 9).

నల్లపేడు: ఎండిపోయిన వెదురుగడను నానబెట్టి చీల్చినపేడు; నల్లగా ఉంటుంది. (కో. 6).

నల్లబారు: (క్రి.) నలుపెక్కడం. (కో. 21).

నల్లబొజరకర్ర: చుట్టూ నల్లటి నూగు ఏర్పడిన వెదురుగడ. (కో. 6).

నల్లమలకర్ర: పర్యా. లంకమలకర్ర. పొడుగ్గా ఎక్కువ బోలుగాఉండే మేలిరకం వెదురుగడ నల్లమల అడవుల్లో పెరుగుతుంది. (కో. 4).

నల్లమాణిక్యాలు: (బ.) పర్యా. కాటుకపూసలు. వెదురుగడను చీల్చినప్పుడు కొన్ని కణుపులదగ్గర అరుదుగా కనిపించే నల్లటి ఉండలు; దేనికీ పనికి రావు (మొదట అవి నల్లవజ్రాలట; మేదరివానికి తెలియక 'అయ్యేమిటి? నల్లగ తగలబడ్డయి' అని అన్నాడట; శంకరుడు, "అట్లానేకానీ", అన్నాడట; అప్పట్నుంచి అవి ఉత్త మసిఉండలయినాయట. (తె. 9).

నల్లిమెల్లె: పర్యా. చూ. నడి (1). చేట, జల్లెడ, విసనగ్రర మొ॥ వాటికి కట్లుకట్టడానికి లేత వెదురు గడనుంచి తీసిన పలచటి మెత్తటిపేడు; ఎటు వంచినా విరగదు. (తె. 6).

నల్లెడకట్టె: పర్యా. నల్లెడబరిగె. నల్లెడచెట్టునుంచి తీసిన చువ్వ (బరిగె); బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 14).

నల్లెడబరిగె: ఉ. నల్లెడ్—, నల్లెడిబ్రరిగ; పర్యా. నల్లెడకట్టె. నల్లెడచెట్టునుంచి తీసిన చువ్వ (బరిగె); భండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె.14).

నవారు: ఉ. నవార; పుల్లలతడక (చూ.) అంచకు వేసిన పట్టీ. (కో. 3).

నస్యం: ఉ, నశ్యం; పుచ్చిన వెదురుగడనుంచి రాలే మెత్తటి పొడి. (తె. 19).

నాటాల: ఉ. నాటాలి; పర్యా. నాటాలల్లకం, నాలుగనులల్లకం; నాలుగేసిపేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడును నాలుగుపేళ్ళ కిందినించీ నాలుగుపేళ్ళ పైనించీ తిప్పుతూ అల్లుతారు; దీనికి సన్నటిపేళ్ళు వాడతారు. చూ. చిత్రం 25. (కో. 3, 5, 9; తె. 23-25; రా. 3, 9-11).

నాటాలచేట: ఉ. — శాట; నాలుగుపేళ్ళమీద అల్లే చేట; సన్నటిపేళ్ళతో అల్లుతారు. (తె. 2-5).

నాటాలల్లకం: పర్యా. చూ. నాటాల. నాలుగేసిపేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడును నాలుగుపేళ్ళ కిందినించీ నాలుగుపేళ్ళ పైనించీ తిప్పుతూ అల్లుతారు; దీనికి సన్నటిపేళ్ళు వాడతారు. చూ. చిత్రం 25. (కో. 3, 9; రా. 11).

నాటు: (క్రి.) పర్యా. చూ. కరిపించు (1). వెదురుగడకు దిగువ గాటుపెట్టి కత్తి దూర్చడం; గడ రెండుబద్దలుగా చీరడానికి కత్తిదూర్చి చేత్తోగాని కొయ్య మొద్దుతోగాని కొడతారు. (కో. 18; తె. 13, 15).

నాటుకేన్: పర్యా. చూ. నాటుపేము. సన్నగా పెళుసుగా ఉండే నాసిరకం పేముకర్ర; త్వరగా పుచ్చిపోవడంవల్ల ఎక్కువకాలం మన్నదు; లేత పసుప్పచ్చ, తెలుపు కలిపిన వన్నెలో ఉంటుంది; ఎక్కువగా (నెల్లూరు మొ॥) సముద్ర తీరప్రాంతాల్లో పెరుగుతుంది. (కో. 11).

నాటుపేము: పర్యా. నాటుకేన్, నాటుబెత్తం. సన్నగ పెళుసుగా ఉండే నాసిరకం పేముకర్ర; త్వరగా పుచ్చిపోవడంవల్ల ఎక్కువకాలం మన్నదు; లేత పసుప్పచ్చ, తెలుపు కలిపిన వన్నెలో ఉంటుంది; ఎక్కువగా (నెల్లూరు మొ॥) సముద్ర తీరప్రాంతాల్లో పెరుగుతుంది. (కో. 3).

నాటుబెత్తం: పర్యా. చూ. నాటుపేము. సన్నగా పెళుసుగా ఉండే నాసిరకం పేముకర్ర; త్వరగా పుచ్చిపోవడంవల్ల ఎక్కువకాలం మన్నదు; లేత పసుప్పచ్చ, తెలుపు కలిపిన వన్నెలో ఉంటుంది; ఎక్కువగా (నెల్లూరు మొ॥) సముద్రతీర ప్రాంతాల్లో పెరుగుతుంది. (కో. 12).

నాటువేయు: (క్రి.) ఉ. నాటేయు; పర్యా. చూ. కరిపించు(1). వెదురుగడకు దిగువ గాటుపెట్టి కత్తి దూర్చడం; గడరెండు బద్దలుగా చీరడానికి కత్తి దూర్చి చేత్తోగాని కొయ్యమొద్దుతోగాని కొడతారు. (కో. 23)

నానబెట్టు: (క్రి.) ఉ. నానబెట్టు; పర్యా. ఊరేయు, నానుపు, నానేయు. నీళ్ళలోవేసి ఉంచడం; ఎండిన వెదురుగడలు, బద్దలు, కొబ్బరిడొక్కలు, గోగుకట్టె, కలబందమట్టలు, ఈతబరిగెలు మొ॥ మెత్తబడడానికి నీళ్ళలోవేసి కొంతకాలం ఉంచుతారు. (కో. 1, 2; తె. 1-7, 9, 10, 12-14, 21, 23, 26; రా. 5).

నానుపు. (క్రి.) ఉ. నాన్పు; పర్యా. చూ. నానబెట్టు. నీళ్ళలోవేసి ఉంచడం; ఎండిన వెదురుగడలు, బద్దలు, కొబ్బరిడొక్కలు, గోగుకట్టె, కలబంద మట్టలు. ఈతబరిగెలు మొ॥ మెత్తబడడానికి నీళ్ళలో వేసి కొంతకాలం ఉంచుతారు. (తె. 10, 14, 17; రా. 8, 10).

నానేయు: (క్రి.) పర్యా. చూ. నానబెట్టు. నీళ్ళలోవేసి ఉంచడం; ఎండిన వెదురుగడలు, బద్దలు, కొబ్బరిడొక్కలు, గోగుకట్టె, కలబందమట్టలు, ఈత బరిగెలు మొ॥ మెత్తబడడానికి నీళ్ళలోవేసి కొంత కాలం ఉంచుతారు. (తె. 1, 7, 8, 15, 19, 20, 24).

నామంపెట్టె: ఉ. నాంపెట్టె; పర్యా. చూ. తిరుమణి పెట్టె పూజాసామగ్రి ([illegible] గంధం కలిపి తయారుచేసిన పొడి, రుద్రాక్షలు, రాగిచెంబు, కుంకుమ, బొట్టుపుల్లలు మొ॥) ఉంచుకొనే చిన్నపెట్టె; కొన్నిచోట్ల రెండు పొరలుగానూ మూడు అరలుగానూ ఉంటుంది; అంచుకు బద్దలతో వేసిన కట్టు ఉంటుంది; మూత ఉంటుంది. (రా. 8).

నార: 1. పర్యా. చూ. పీచు(1). వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ, బద్ద, పేడుకర్ర, మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగాఉండే పీచును కోళ్ళను పొదిగెయ్యడానికి ఉపయోగిస్తారు (తె. 13, 23); 2. ఈతచువ్వను చీల్చేటప్పుడు వచ్చే పనికిరాని పోగులు (తె. 13); 3. పర్యా. చూ. మొగిలినార. మొగిలి ఊడలనుంచి తీసిన నార; ఊడలు కోసుకొచ్చి తీగలుతీస్తారు; చేట మొ॥ వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది (కో. 17,

20, 22, 23, 26); **4.** కలబంద, జనుము, గోగు వంటి మొక్కల కాడలనుంచితీసిన సన్నటిపోగులు; కలబందమట్టలు నానబెట్టి బండకువేసి ఉతికితే నార వస్తుంది; జనుము, గోగువంటి మొక్కలుమాత్రం నానబెట్టిన తరవాత పైపొరతీసి నీళ్ళలో జాడిస్తే నారవస్తుంది; తాళ్ళు పేనడానికి ఉపయోగపడుతుంది (కో. 3; రా. 4–6); **5.** పర్యా. పీచు (2). కొబ్బరి కాయతాట (చర్మం)కూ లోపలిపెంకుకూ మధ్య దట్టంగాపెరిగిన దారాల్లాటి పోచలు; కాయఒలిచి డొక్కలు చితగ్గొట్టి నానవేసి పీచుతీస్తారు; తాళ్ళూ, పగ్గాలూ మొ॥ పేనడానికి గోదినీలు మొ॥ అల్లడానికీ, దిండ్లు తయారుచెయ్యడానికీ పనికొస్తుంది (కో. 23); **6.** పర్యా. చూ. తీగ (5). పేము పైపొరనుంచి చీరితీసిన సన్నటిపేడు; బుట్టలూ కుర్చీలూ టీపాయ్‌లూ ఉయ్యాలలూ మొ॥వి అల్లడానికి పని కొస్తుంది. చూ. చిత్రం 139. 5. (కో. 22).

**నారకవురుకర్ర:** పేడు తీసేటప్పుడు సరిగా రాక నారసాగే వెదురుగడ; నీళ్ళు సరిగా అందక ఇలా అవుతుంది. (కో. 25).

**నారకుంటకట్టె:** నారకుంట అనే ప్రదేశంనుంచి తెచ్చిన ఈతకట్టె. (తె. 13).

**నారజీరు:** (క్రి.) జనపకట్టె, గోగుకట్టె మొ॥ వాటి నుంచి నారతియ్యడం. (తె. 9).

**నారతడప:** ఉ. — తడ్ప; రెండుమూడు ఈతనార పోచలు. (తె. 9).

**నారపట్ట:** నారతియ్యడానికి పనికొచ్చే కలబందమట్ట. (రా. 5).

**నారపోచ:** ఉ.—పోస; ఈత, తాటి, గోగు మొ॥వాటి నుంచి చీరిన నారలో ఒక విడిపోగు; సన్నటి దారంలా ఉంటుంది. (తె. 9).

**నారుబేడెరకలి:** ఉ.—ఎర్కలి; ఎరకలివాళ్ళలో ఒక తెగ; తాళ్ళుపేని బతుకుతారు. (రా. 8).

**నారుమగ్గం:** పర్యా. చేలమగ్గం. నేలమీద పరిచినట్లుండే చాపల నేతమగ్గం; డిజైన్లు లేని సాదాచాపలు నెయ్యడానికి పనికొస్తుంది; చూ. మగ్గం. (రా. 2).

**నారెరకలివాళ్ళు:** ఉ. నారెర్కలోల్లు; నులకనేసే ఎరకలివాళ్ళు. (తె. 1).

**నాలిక:** **1.** పర్యా. పడిగె(1). కచ్చడంబండిమీద గుడిసెలా కప్పే తడకకు రెండువైపులా చూరులా కొంతభాగం బయటికి చొచ్చుకొని వచ్చేలా అల్లిన భాగం. చూ. చిత్రం 34 చ. 1. (తె. 23); **2.** పర్యా. నోరు(4), మూతి(5). చేటముందరి (వెడల్పుగా ఉండే) అడ్డం; రెండు కొమ్ములకూ (కొసలకు) మధ్యభాగం చూ. చిత్రం 29. 6. (కో. 18, 23); **3.** పర్యా. చూ. కొమ్ము(2). చేట ముందుభాగంలో రెండుమూతులను(కొసలను) కలుపుతూ అడ్డంగా వేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదటదీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29. 2. (కో. 28).

**నాలికదబ్బ:** పర్యా. దబ్బ(6). వెదురుపేళ్ళతో అల్లిన బండిజల్లకు మూతి (చూ.) వైపున ఎత్తుగా ఉన్న భాగం అంచుకు తొడిగిన వెదురుబద్ద; సుమారు మూరెడు మీద జేనెడుపొడుగు ఉంటుంది. (కో. 3).

**నాలికబద్ద:** పర్యా. చూ. కొమ్ము(2). చేటముందు భాగంలో రెండు మూతులను(కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెన వేలెడులావు వెదురుబద్ద; మొదటదీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29. 2. (కో. 24).

**నాలిక్కట్టు:** (< నాలిక + కట్టు)పర్యా. మూతికట్టు(2). చేట ముందరి మూలభాగంలో కొమ్ముకట్టు, కర్ర (చూ.)లను కలిపి కట్టుముంగు (= పలచటి వెదురు పేడు మొ॥) చుట్టిచేసిన బిగింపు; చూ. కొమ్ముకట్టు. చూ. చిత్రం 29. 1. (కో. 28).

**నాలిగడ్డలగుల్ల:** ఉ. నాల్గి—, ? 24 కిలోలధాన్యం పట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 22).

**నాలుగనులల్లకం:** ఉ. నాల్గనల్లకం; పర్యా. చూ. నాటాల. నాలుగేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డం పేడును నాలుగుపేళ్ళు కిందినించీ నాలుగుపేళ్ళ పైనించీ తిప్పుతూ అల్లుతారు; దీనికి సన్నటిపేళ్ళు వాడతారు. చూ. చిత్రం 25. (కో. 5).

**నాలుగుకడవలగాదె:** ఉ. నాల్గుకడవలగాజె; ఒకటిన్నర క్వింటాళ్ళధాన్యం పట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (రా. 9).

**నాలుగుపక్కలు:** (బ.) ఉ. నాల్గక్కలు; నాలుగు వైపులు. బద్దలతడక మొ॥వాటికి నాలుగు పక్షాలు (పక్కలు) ఉంటాయి. (తె. 21, 22).

**నాలుగుపచ్చాలుగా:** (< —పక్షాలుగా) పర్యా. చూ. చౌకంగా. చతురస్రంగా; జల్లెడఅడుగు, దాగరఅడుగు మొ॥వాటిని చతురస్రంగా అల్లుతారు. (రా. 3).

**నాలుగుపలకల టీపాయ్:** (< ఇం.—Teapoy) పేముతో చేసిన ఒకరకం టీపాయ్; నాలుగుపక్షా లున్నది. (కో. 11).

నాలుగుపేట్లతాడు: నాలుగుపాయల్ని (పేటలు) పెనవేసి పేనిన కొబ్బరితాడు. (కో. 20).

నాలుగుపేళ్ళవిసనగర్ర: ఉ. వేల్లిసనగర్ర; నాలుగు పేళ్ళమీద అల్లినవిసనగర్ర. (రా. 4).

నాలుగుమళ్ళగుమ్మి: నాలుగుమణుగుల ధాన్యంపట్టే వెదురుగుమ్మి (గాదె). (తె. 22).

నాలుగుమానికలగుల్ల: ఉ. నాల్గుమాన్కల –; 32 కిలోలధాన్యం పట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 21).

నాలుగువంకలు: (బ.) ఉ. నాల్గొంకలు; నాలుగు వైపులు. (తె. 13).

నాలుగ్గుంచాలగుల్ల: (< నాలుగు కుంచాల ) నాలుగుకుంచాలు (26 కిలోలు) ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 25).

నాలుగ్గుండలగుమ్మి: (< నాలుగు కుండల–) 96 శేర్ల (120 కిలోల) ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (తె. 14).

నాలుగ్గొచ్చేవెదురు: (< నాలుగు + గా + వచ్చే –) నాలుగుబద్దలుగా చీల్చడానికి వీలయిన లావుపాటి వెదురుగడ. (రా. 3).

నాసిబొంగు: ఉ. నాశి –; పర్యా. చూ. తర్డ్‌క్లాస్ బొంగు. దాదాపు 9 సెం.మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ; చింతకాయలు రాలగొట్టడానికీ అలమార్ల తయారీకి పనికొస్తుంది; పేడు చీరడానికి పనికిరాదు. (కో. 16; తె. 18).

నిచ్చెన: రూ. మిచ్చెన; పర్యా. చిడీ (2). అటక, మిద్దె, గోడ మొ॥ ఎక్కడానికి వెదురుగడలతో తయారుచేసినది; రెండు నిలువుగడలకు అడ్డంగా వెదురుకర్రముక్కలు మెట్లుగా అమరుస్తారు. (కో. 5, 9, 29; తె. 2, 4, 8, 10, 12, 16, 17, 19, 24, 26, 31; రా. 5, 8–10).

నిడిగనుపుకర్ర: ఉ.–గన్ను–; పర్యా. చూ. నిడుపు (గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నుంచి తీసినపేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 29).

నీడివి: పర్యా. చూ. జంపు. పొడుగు(భాగం) (కో.8).

నిడుపత్తిచాప: నాలుగుజేనల వెడల్పుండే (తుంగ) చాప (అత్తి=కొలత). (రా. 6).

నిడుపు: 1. వెదురుగడకు రెండు కణుపులమధ్య ఎడం; బొంగురకాన్నిబట్టి 6 అంగుళాలనుంచి 22 అంగుళాలవరకు ఉంటుంది (తె. 22, 28); 2. పర్యా. చూ. జంపు. పొడుగు(భాగం). (తె. 26)

నిడుపు(గనె) బొంగు: బొంగు ఉ. నిడ్పుగనె –; నిడుబ్బొంగు; పర్యా. ఎడపబ్బెదురు, గణబారుగడ, గనుపుకర్ర, గనుబ్బారుకర్ర, జల్లిగనుపుకర్ర; జాడుకనుపుకర్ర, జాడుగనుపులకర్ర, జారువెదురు, దూరంగనుపు బొంగు, దూరంగుంపెదురు, నిడిగనుపుకర్ర, నిలుపు(గనె) బొంగు, పెద్దగనకర్ర, పొడుగ్గనుపుకర్ర. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నుంచి తీసినపేడు జల్లెడ, చేట మొ॥ వాటి అల్లకానికి పనికొస్తుంది. (తె. 20–22, 24–26).

నిడువుబద్ద: 1. పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥ వాటి అల్లకంలో నిలువుగావచ్చేబద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి (కో. 28); 2. పర్యా. చూ. నిలువుబద్ద (2). అల్లకం పూర్తయిన తరవాత గట్టిదనం కోసం తడకమీంచి మధ్యభాగంలో నిలువుగాకొట్టే వెదురుబద్ద. చూ. చిత్రం 36 క. 3. (కో. 29).

నిద్దకర్ర: ఉ. నెద్దకర్ర; పర్యా. చూ. గట్టిబొంగు(1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండపట్టిఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడునాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్లు. గుతపకర్ర, గైకట్టె; మంచంపట్టె మొ॥వాటికి పనికొస్తుంది. (కో. 24, 27, 28, 30).

నింబావళి: నిమ్మపండు మాదిరి పసుప్పచ్చ రంగు; చాపలనేతకు వాడే నారకు వేస్తారు. (రా. 6).

నిలపట: చాపల నేతమగ్గం మధ్యభాగంలో అంచుపక్కకు పాతిన పొడుగాటి గుంజ. ఇలాటివి రెండంచులకూ పక్కన పాతారు. (రా. 2).

నిలవరంకర్ర: పర్యా. చూ. ఎండుబొంగు(1). ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలంతెగులు సోకిగాని నీళ్ళు అందకగాని పొదమీదే గడ ఎండిపోతుంది. (కో. 27).

నిలుగు: ఉ. నిల్గు; 1. చూ. నిలువు (1). (కో. 2, 10, 13, 15, 23). 2. రూ. నిలువు (5); పర్యా. అడుగుపాసికం నిలుగునిమ్ము, నిలువని(1), నిలువుపాసికం, పలుకు (8), పాసికం, బిలుకు (10), బెండు (3), వంచుడుబద్ద, గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లకంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగావేసిన మందంపేడు; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (కో. 2–4, 6, 10, 11, 17,

18; తె. 1, 2, 5, 8, 10, 12-22, 24, 25; రా. 11); 3. చూ. నిలువు (7). (తె. 18). 4. చూ. నిలువు (6). (తె. 11. 20).

నిలుగునిమ్మ: పర్యా. చూ. నిలుగు(2). గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లకంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగావేసిన మందంపేడు; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (కో. 15).

నిలుగుపేడు: చూ. నిలువుపేడు. (తె. 1, 27).

నిలుగుబద్ద: ఉ. నిల్గు—; 1. చూ. నిలువుబద్ద (3). (తె. 28). 2. కప్పుపందిరి తడకకు నిలువుగా పెట్టినబద్ద; పొడుగ్గా ఉంటుంది. (తె. 8).

నిలువు(గనె)బొంగు: పర్యా. చూ. నిడుపు(గనె) బొంగు. కనిష్ఠలమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నించి తీసినపేడు జల్లెడ, చేట మొ॥వాటి అల్లకానికి పని కొస్తుంది. (తె. 18, 19, 22, 23).

నిలువంచు: తుంగచాపకు పొడుగుభాగం కొన. (కో. 30).

నిలువని: ఉ. నిల్వని; 1. పర్యా. చూ. నిలుగు (2). గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లకంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగావేసిన మందం పేడు; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (రా. 10). 2. (< నిలువు + అని) పర్యా. చూ. కాలు (9). ఈతచువ్వతో గంప మొ॥ అల్లకానికిపెట్టే నిలువుల జత. (తె. 7).

నిలువు: ఉ. నిల్వు. 1. రూ. నిలుగు (1). పర్యా. అడుగుదబ్బ (1), గోదు (3), తడగ్గోలు, దాలెం (2). నిడువుబద్ద (1), నిలువుగోవ, నిలువుపేడు, నిలువుబద్ద (3), నిలువుబెండు, పన్నిగపాసిక, బిలుకు (11), వార (7). తడక, పిల్లలపొది, కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగా వచ్చేబద్ద లేదా పేడు; మందంగానూ, వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్ని చోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడా ఉంటాయి. (కో. 5, 7, 9; తె. 6, 7, 9, 10, 22, 26; రా. 3, 8, 9). 2. పర్యా. చూ. సీర్వె. నిలువుగా సగానికి చీల్చినగోవ (చూ.)లో ఒక భాగం; దీన్ని ఐదారుకఱ్ఱ (చూ.)లుగా చీల్చవచ్చు (కో. 26). 3. పర్యా. చూ. నిలువుబొంగు (2), నిచ్చెన తయారీలో నిలువుకువాడే వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (రా. 8). 4. పర్యా. చూ. అంచుకఱ్ఱ, బండిజల్ల, మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకఱ్ఱ. చూ. చిత్రం 32.1. (రా. 1). 5. చూ. నిలుగు(2). (కో. 20). 6. రూ. నిలుగు (4); గంప మొ॥వాటి అల్లకంలో నిలువుగావచ్చే ఈతపేడు; ఈతకమ్మ పొట్టభాగంనుంచి (చూ. పొట్టబద్ద) తీస్తారు. (తె. 16; రా. 8). 7. రూ. నిలుగు (3); పర్యా. అడికాలు (1). ఈతగంప మొ॥వాటి అల్లకంలో నిలువుకుపెట్టే బద్ద. (కో. 25; తె. 9, 11, 14; రా. 8, 9); 8. పేముబుట్ట అల్లకంలో నిలువుగాపెట్టిన పేముపుల్ల. చూ. చిత్రం 139.2; (కో. 3).

నిలువుకత్తి: కత్తులపెట్టె (చూ.)లో బిగించిన మూడు జతల కత్తుల్లో ప్రతి జతలోనూ నిలువుగా పెట్టిన చిన్నకత్తి. చూ. చిత్రం 137.1; (కో. 10, 12).

నిలువుకొయ్య: ఉ. నిల్వు—; పర్యా. చూ. నిలువు బద్ద (2). అల్లకం పూర్తయిన తరవాత గట్టిదనం కోసం తడకమీంచి మధ్యభాగంలో నిలువుగాకొట్టే వెదురుబద్ద. చూ. చిత్రం 36 క. 3. (కో. 5).

నిలువుగచ్చం: పర్యా. ఎదురుగచ్చం. చేట అల్ల కంలో నిలువుగావచ్చే పేళ్ళకూర్పు; చూ. గచ్చం. చూ. చిత్రం 23. (కో. 3).

నిలువుగడ: ఉ. నిల్వుగడె; పర్యా. చూ. నిలువుపట్టె (2). మంచం తయారీలో పొడుగుభాగంవేపు వేసే ఆరడుగుల వెదురుగడ. చూ. చిత్రం 108.4; (తె. 6).

నిలువుగఱ్ఱ: ఉ. నిల్వు—; అలమాదు తయారీలో నిలువుకుపెట్టిన వెదురుగడ. (తె. 8).

నిలువుగుమ్మి: 1. బాగా పొడుగ్గాఉన్న గుమ్మి (గాదె); ధాన్యంనిలవ చేసుకోడానికి వాడతారు. (తె. 4). 2. ఎత్తుగా వెడల్పు తక్కువగా ఉండే ఈతగుమ్మి. చూ. గుమ్మి. (తె. 9).

నిలువుగోవ: పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లల పొది, కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగా వచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ, వెడల్పు గానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ, వెడల్పులోనూ తేడా ఉంటాయి. (కో. 21).

నిలువుటాసం: (<నిలువువాసం) పర్యా. మొద్వాస. చెంద్రిక (చూ.) తడక నిలువంచులకు తొడిగిన వెదురుకఱ్ఱ; కొన్నిచోట్ల సన్నటిది తొడుగుతారు. (రా. 1).

నిలువుడబ్బ: ఉ. నిల్వు—; చూ. నిలువుబద్ద(2). (తె. 6).

నిలువుడబ్బ: 1. అలమారు తయారీలో నిలువుగా పెట్టిన వెదురుబద్ద. (తె. 4); 2. ఉయ్యాల అల్లకంలో నిలువుగా పెట్టినబద్ద. (రా. 11).

నిలువుపట్టె: 1. పర్యా. చూ. నిలువుబొంగు(2). నిచ్చెన తయారీలో నిలువుకువాడే వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (రా. 11); 2. పర్యా. నిలువుగడ, నిలువుబొంగు(3). మంచంతయారీలో పొడుగుభాగం వైపు వేసే ఆరడుగుల వెదురుగడ చూ. చిత్రం 108. 4. (కో. 9; రా. 11).

నిలువుపాసికం: పర్యా. చూ. నిలుగు(2). గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లకంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగా వేసిన మందంపేడు; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (కో. 27).

నిలువుపేడు; ఉ. నిల్వు—; రూ. నిలుగుపేడు; పర్యా. చూ. నిలువు(1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥ వాటి అల్లకంలో నిలువుగావచ్చేబద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. (కో. 1, 12).

నిలువుబద్ద 1. పర్యా. చూ. బెండుడబ్బ(). వెదురు గడ చీల్చినప్పుడు బోలుగాఉన్న భాగంనుంచి తీసిన బద్ద. (రా. 8); 2. ఉ. నిల్వు—; రూ. నిలువుడబ్బ; పర్యా. నిలువుబద్ద(2), నిలువుకొయ్య, పన్నిగబద్ద, పొడుగుబద్ద. అల్లకంపూర్తయిన తరవాత గట్టిదనం కోసం తడకనుంచి మధ్యభాగంలో నిలువుగా కొట్టే వెదురుబద్ద చూ. చిత్రం 36 క. 3. (కో. 20, 28)' 3. రూ. నిలుగుబద్ద(1). పర్యా. చూ. నిలువు(1) తడక, పిల్లలపొది, కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగా వచ్చేబద్ద లేదాపేడు; మందగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. (కో. 8, 12); 4. పర్యా. చూ. పరుపుబద్ద. వెదురుమంచం తయారీలో అడ్డంగా కొట్టిన గడల బిగింపుకోసం నిలువుగా కొట్టిన వెదురు బద్ద. చూ. చిత్రం 108. 3. (తె. 16); 5. ధాన్యపు గాదె అల్లకంలో నిలువుగా వేసినబద్ద. (కో. 8).

నిలువుబెండు: పర్యా. చూ. నిలువు(1). తడక, పిల్లలపొది కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగా వచ్చేబద్ద లేదా పేడు; మందగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్ని చోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. (రా. 8).

నిలువుపెత్తాలకుర్చీ: ఒకరకం పేముకుర్చీ. (కో. 12).

నిలువుబొంగు: ఉ. నిల్వు -; 1. పర్యా. చూ. పొడుగుబొంగు. పదిమూరలనుంచి పదిహేను మూరలవరకు పొడుగున్న వెదురుగడ. (తె. 26); 2. పర్యా. దుబ్బబొంగు, నిలువు(3), నిలువుపట్టె(1), పారుకిఱ్ఱ(2), పైపుకట్టె. నిచ్చెన తయారీలో నిలువుకువాడే వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (తె. 16, 17); 3. పర్యా. చూ. నిలువుపట్టె(2). మంచంతయారీలో పొడుగుభాగం వైపువేసే ఆరడుగుల వెదురుగడ. చూ. చిత్రం 108. 4. (తె. 16, 17).

నిలువుబొంగులు: (బ) కమాను ( = వీధికడ్డంగా తోరణాలు కట్టేది)తయారీలో నిలువుగాపాతే వెదురు గడలు; ఒక్కొక్కవైపు రెండేసి ఉంటాయి. (తె. 16).

నిలువుమాను: ఉ. —మాని; ధాన్యం మోసుకువెళ్ళ డానికి అల్లిన ఒకరకం పెద్ద వెదురుగంప; ఎత్తు ఎక్కువగానూ వెడల్పు తక్కువగానూ ఉంటుంది. (కో. 28).

నిలువువెదురు: శవాన్ని తీసుకువెళ్ళే రథానికి నిలువుగా పెట్టిన సన్నటి వెదురుగడ. చూ. చిత్రం 97. 1. (కో. 2).

నిలువెండుబొంగు: పర్యా. చూ. ఎండుబొంగు(1). ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలంతెగులు సోకిగాని నీళ్ళు అందకగాని పొదమీదే గడ ఎండిపోతుంది. (తె. 28).

నిలేయు: వెదురుగడలను వరసగా నిలబెట్టడం. (తె. 6).

నీటిగూడ: పర్యా. చూ. గూడ(1) కాలవలోంచిగాని వాగులోంచిగాని గుంటలోంచిగాని చేతికందేటంత లోతునుంచి పొలంలోకి నీళ్ళు ఎత్తిపోసేబుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడూ పెట్టకుండా మొత్తంపేడు తోనే చేటలా అల్లుతారు; కొన్నిటికి చేటఅంచు మాదిరిగా బద్దలువేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టిన తాళ్ళను ఇద్దరుమనుషులు చెరోవైపూ నిలబడి పట్టుకొని దీంతో నీళ్ళుతోడి గట్టుకవతల ఉండే పొలంలోకి పోస్తారు; చూ. చిత్రం 35 క, చ. (కో. 10).

నీటితివ్వ: నీటిమీద పాకే ఒకరకం మొక్కతీగ; చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (కో. 31).

నీడపందిరి: పర్యా. పందిరి. నీడకోసం వెదురు తడకలతో కప్పిన పందిరి. (తె. 6).

నీరలొద్దిబొంగు: అసిఫాబాద్ అడవిలో నీరలొద్ది అనే లోయప్రాంతంలో పెరిగిన వెదురుగడ; మెత్తగా ఉంటుంది; పేడుసాపుగా వస్తుంది. (తె. 23).

నీరుగాయ: లోపల బాగానీళ్ళు ఏర్పడిన కొబ్బరికాయ. (కో. 20).

నీరుగాయపీచు: ఉ. —పీసు; నీరుబట్టిన కొబ్బరికాయ (నీరుగాయ) నుంచి తీసినపీచు. (కో. 20).

నీరుముక్కుతాడు: మోటబావి బొక్కెన కొక్కేనికి మోటమోకు కొసను కలిపికట్టిన సన్నటితాడు; చీకి పోకుండా తాటిపీచుతో పేంతారు. (తె. 9).

నీళ్ళగూడ: పర్యా. చూ. గూడ(1). కాలవలోంచిగాని వాగులోంచిగాని గుంటలోంచిగాని చేతికందేటంత లోతునుంచి పొలంలోకి నీళ్ళు ఎత్తిపోసే బుట్ట; దీన్ని నిలువులూ అడ్డంపేడూ పెట్టకుండా మొత్తం పేడుతోనే చేటలా అల్లుతారు; కొన్నిటికి చేట అంచు మాదిరిగా బద్దలువేసి కడతారు; దీనికి రెండువైపులా కట్టిన తాళ్ళను ఇద్దరుమనుషులు చెరోవైపు నిలబడి పట్టుకొని దీంతో నీళ్లతోడి గట్టు కవతలఉండే పొలంలోకి పోస్తారు; చూ. చిత్రం 35 క, చ. (కో. 11, 12, 16, 18, 20).

నీసు: మాంసం. (కో. 19; తె. 19).

నుచ్చుగుంపు: పర్యా. చూ. గంటిగనుపు(1), వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1. (కో. 28).

నుంజీపురు: (< నును + చీపురు) ఇల్లు ఊడ్చుకోడానికి నునుగడ్డితో కట్టిన చీపురు; సుమారు గజం పొడుగు ఉంటుంది. (తె. 21).

నుడుగు: పర్యా. పదం. పాట; పనివాళ్ళు తీరికవేళల్లోగాని పనిచేసుకుంటూగాని పాటలు పాడుకుంటారు (తె. 4).

నునుగడ్డి: ఒకరకం గడ్డిమొక్క; సుమారు గజం పొడుగు పెరుగుతుంది. (తె. 21).

నురగపీచు: పర్యా. చూ. పీచు(1). వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగాఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు. (కో. 21).

నులక: కలబంద నారతోగాని గోగు నారతోగాని కొబ్బరి పీచుతోగాని పేనిన సన్నటితాడు; దీంతో మంచం అల్లుతారు. (కో. 19, 25; రా. 5).

నులకపెడ: అమ్మకానికి ఒక పరిమాణంలో చుట్టిన నులకతాడుచుట్ట. (రా. 5).

నులకుండ: (< నులక + ఉండ) ఉ. నుల్కుండ; మూరెడు పొడుగుకట్టె చుట్టూచుట్టిన నులకఉండ. (కో. 23).

నులకెరికలి: (< నులక + ఎరకలి) నులకపనిచేసే ఎరకలివాడు. (రా. 5).

నువుపప్పుజల్లెడ: ఉ. —జల్లెడి; రూ. నూపప్పు జల్లెడ; నూపప్పు కడుక్కొనే జల్లెడ; ఎత్తుగా ఉంటుంది; పేళ్ళమధ్య సన్నటి సందులుపెట్టి అల్లుతారు. (కో. 23).

నువ్వులగంప: రూ. నూలగంప; పర్యా. నువ్వులదొక్కే గంప. గజంపొడుగూ గజంవెడల్పూ మూరెడు ఎత్తూ ఉండేలా అల్లిన వెదురుపేళ్ళగంప; కింద నాలుగు మూలలుగానూ, గుండ్రంగానూ ఉంటుంది; దంపిన నువ్వులు కడగడానికి వాడతారు; కొన్నిచోట్ల నువ్వులుపోసి దంపడానికి వాడతారు. (కో. 19, 29).

నువ్వులగూడ: నూపప్పు కడుక్కొనే వెదురుపేళ్ళ గూడ. (కో. 21).

నువ్వులజల్లెడ: ఉ. —జల్లెడు; నువ్వులు జల్లించుకొనే జల్లెడ; పేళ్ళమధ్య సన్నటి సందులుపెట్టి అల్లుతారు. (కో. 19, 23, 26).

నువ్వులుదొక్కేగంప: ఉ. నూల్దొక్కే గంప; పర్యా. నువ్వులగంప. గజంపొడుగూ గజంవెడల్పూ మూరెడుఎత్తూ ఉండేలా అల్లిన వెదురుపేళ్ళ గంప; కింద నాలుగుమూలలుగానూ, పైన గుండ్రంగానూ ఉంటుంది; దంపిననువ్వులు కడగడానికి వాడతారు; కొన్నిచోట్ల నువ్వులుపోసి దంపడానికి వాడతారు. (కో. 30).

నుసి: పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (కో. 3; తె. 7).

నూకలజల్లెడ: 1. బియ్యంలోంచి నూకలు దిగేటంత సన్నటి సందులుపెట్టి అల్లిన జల్లెడ. (రా. 11). 2. నూకల్లో ఉన్న తవుడు మొ॥ దిగేటంత సన్నటి సందులుపెట్టి అల్లిన జల్లెడ; కారంజల్లెడకన్న పెద్దగానూ, బియ్యం జల్లెడకన్న చిన్నగానూ ఉంటుంది. (తె. 7, 14, 17).

నూగు: పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒకసంవత్సరానికి ఏర్పడుతుంది. (కో. 3).

నూపప్పుజల్లెడ: చూ. నువుపప్పుజల్లెడ. (కో. 19).

నూరుగుంటరాయి: **1.** పర్యా. చూ. నూ[రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుం[డంగానూ, పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (తె. 6, 9, 26; రా. 9, 11); **2.** ఎరకలికత్తి నూరే ఒకరకం రాయి. (తె. 13, 16; రా. 9).

నూరుగుంట రౌతు: పర్యా. చూ. నూ[రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుం[డంగానూ, పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (తె. 17, 18).

నూ[రాయి: (< నూరు + రాయి) పర్యా. చూ. నూ[రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుం[డంగానూ, పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (కో. 9; తె. 23, 25).

నూ[రౌతు: (< నూరు + రౌతు) పర్యా. కత్తి నూ[రాయి, కనికెరాయి, కీడురాయి, నూరుగుంట రాయి (1), నూరుగుంటరౌతు, నూ[రాయి, పదును రాయి, పిండిరాయి, రాయి, సానపీట, సానరాయి, సానరౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుం[డంగానూ, పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (తె. 10, 19-24).

నూలగంప: చూ. నువ్వులగంప. (కో. 28).

నూలు: దారం; చాపలనేతలో నిలువుకు వాడతారు. (రా. 4).

నూలుగూడగుండు: ఉ. నూలుగోడ—; నూలుగూడ అల్లడానికి వాడే కొలతగుండు; సరైన కొలత [పకారం ఒకబద్ద బిగిస్తారు. (కో. 21).

నూలుపోగు: పర్యా. చూ. పోగు(3). (తుంగ) చాపలు నేసే మగ్గానికి గజంవెడల్పున బెత్తెడు ఎడానికొకటి చొ॥న వరసగా ఎగదండు (= నేతగాడు కూర్చునే పైపుండే బొంగు)నుంచి దిగదండు (= మగ్గం చివరిబొంగు)కు కట్టిన పురిపెట్టిన నారపోచ లేదా ప్లాస్టిక్‌దారం; వీటిమధ్యన (తుంగ) పోచను పెట్టు కుంటూ అని మార్చుకుంటూ చాప నేస్తారు. చూ. చి[తం 120 క. 8. (రా. 4).

నూలుమాను: పర్యా. చూ. దిగదండు. చాపనేత మగ్గం చివర అమర్చిన వెదురుగడ; నిలువు పోగులను ఎగదండు (= నేతగాడు కూర్చునే వైపు ఉండేది) నుంచి చాపి దీనికి కడతారు; నేత పనివాడికి ఎదురుగా ఉంటుంది; పోగుల్ని లాగి ఉంచుతుంది. చూ. చి[తం 120. (రా. 2).

నెట్టు: **1.** పర్యా. చూ. మండె(1). వెదురుగడలపోగు; మామూలగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్నిచోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని [పభుత్వంవారి వెదురుడిపోలోగాని అడితీల్లోగాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తంలేదు. (కో. 27, 28); **2.** ఆను, సపోర్ట్. (కో. 25).

నెత్తి: **1.** పర్యా. చూ. వెన్ను(4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారువేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చి[తం 12 ద. 3. (తె. 21); **2.** పర్యా. చూ. తల(1). ఒకరకం మేదరికత్తికి వెడల్పు భాగం చివర. (తె. 13); **3.** పర్యా. తల(5). ఉలికి ఉండే పిడిపైభాగం. చూ. చి[తం 20 క. 5. (తె. 30).

నెత్తిగంప: నెత్తిమీద పెట్టుకొని వెళ్ళేగంప. (కో. 12).

నెద్దెదురు: పర్యా. చూ; గట్టికర్[ర(1). సూదిపట్టేటంత ఖాళీమొదలు వేలెడంత ఖాళీవరకు లోపల బోలుగా ఉండే గట్టివెదురుకర్[ర; గుట్టలమీదా రాళ్ళదగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాలవరకు లావుగా ఉంటుంది. (కో. 31).

నెమలి: వెదురుపేళ్ళతో చేసిన నెమలిబొమ్మ; ఇళ్ళలో అలంకారానికి పెట్టుకొంటారు. (కో. 27).

నెమలికండ్లపెట్టె: వెదురుపేళ్ళతో అల్లిన ఒకరకం సారెపెట్టె; నెమలిపింఛంలాగ డిజైన్లు వచ్చేటట్లు పైపొర కర్[రబడుముతో నాలుగురంగులతో అల్లుతారు; ఇది అన్నివైపులా రెండడుగుల వెడల్పవ చతుర[స్రాకారంలో ఉంటుంది; లోపలి పొర వెడల్పు పేడుతోను బయటిపొర కర్[రబడుముతోను అల్లుతారు; ఛాస్వాములు వాడతారు; చూ. చి[తం 42. (తె. 9).

నెమలిచాప: ఉ. —సాప; నెమలిబొమ్మ వచ్చేటట్లు నేసిన తుంగచాప. (కో. 9).

నెంబు: పర్యా. బండిజల్లనిలువుబెండు. బండిజల్లి అల్లకంలో నిలువుగావచ్చే మందంపేడు లేదా పలచటిబద్ద; సుమారు రెండు రూపాయలబిళ్ళంత మందముంటుంది. (కో. 13).

నెమ్ము: పర్యా. చూ. పచ్చి. తడిఆరని; అటువంటి స్థితి. (కో. 19; రా. 4).

నెమ్ముకొను: (క్రి.) చెమ్మతగిలి పచ్చిగా కావడం; చెమర్చడం. (కో. 19).

నెరువు: పర్యా. చూ. జంపు. పొడుగు (భాగం). (తె. 22).

నెలతక్కువకఱ్ఱ: పర్యా. చూ. మొక్కకఱ్ఱ. నాలుగు నెలలనుంచి సం॥లోపు వయస్సుగల వెదురుకఱ్ఱ; చీల్చడానికి పనికిరాదు; మెత్తగాఉండి ఎటువంచితే అటువంగిపోతుంది; చెరుకు నాటువేసి నప్పుడు ఆనుగాపెట్టడానికి పనికొస్తుంది. (కో. 22).

నేత: పర్యా. చూ. అల్లకం. వెదురుపేళ్ళు పడుగు పేకలుగా కూర్చి బిగించడం; ఒకపేడు కిందినుంచి, తరవాత మరో పేడుపైనుంచి, ఆ తరవాత మళ్ళీ కిందినుంచి వచ్చేటట్లు అల్లుతారు; తట్ట, బుట్ట, గంప, చేట మొ॥వి ఇలా అల్లుతారు. (కో. 11).

నేతకట్టె: పర్యా. చూ. లేతబొంగు(1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పని కొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతిముందు కోతకు వస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చ డానికి వీలవుతుంది; లోపలబోలు తక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది; (ఈ బూడిదను బట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్ని గడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (రా. 4, 6).

నేతకఱ్ఱ: పర్యా. చూ. లేతబొంగు(1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పని కొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతిముందు కోతకువస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు చీల్చడానికి సులువవుతుంది; లోపల బోలుతక్కువ; గడచుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది. (ఈ బూడిదను బట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు), కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చల్లో ఉంటాయి; గడ మూడునాలు గంగుళాల మందముంటుంది. (రా. 5).

నేతచువ్వ: ఉ. —సువ్వ; బట్టలు నేసేవాళ్ళు నేత పడుగులో దూర్చే సన్నటి వెదురుబెత్తం; లాక. (కో. 9).

నేతబద్ద: మగ్గంమీద బట్టలు నేనేటప్పుడు పడుగులోకి దూర్చే వెదురుబద్ద; లాక. (కో. 9).

నేతబొంగు: పర్యా. చూ. లేతబొంగు(1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ, మొ॥ అల్లడానికి పని కొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతిముందు కోతకువస్తుంది; మెత్తగా, పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు చీల్చడానికి సులువవుతుంది; లోపల బోలు తక్కువ; గడచుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది; (ఈ బూడిదను బట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (తె. 4; రా. 7, 8).

నేతవెదురు: ఉ. నేతెదురు; పర్యా. చూ. లేత బొంగు(1). ఒక సం॥నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేతవెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతిముందు కోతకువస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు చీల్చడానికి సులువవుతుంది; లోపల బోలుతక్కువ; గడచుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది. (ఈ బూడిదను బట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (రా. 9, 11).

నేమం: నియమం. (తె. 21).

నేయు: పర్యా. అల్లు(1). (వెదురుపేళ్ళు) ఒకటిపైకీ ఒకటి కిందికీ వచ్చేటట్లు కూర్చడం; కొన్నిచోట్ల రెండేసి పేళ్ళనుంచి నాలుగేసి పేళ్ళవరకు పెట్టి కూరుస్తారు; కొన్నిచోట్లకూర్పు ఐ మూలగా వస్తుంది; గంప, తట్ట, చేట, విసనకఱ్ఱ మొ॥ ఇలా తయారుచేస్తారు. (కో. 11; తె. 27, 30).

నేలగొయ్యి: గుమ్మి (చూ.) అడుగు అల్లినతరవాత నిలువులను పైకి లేపేటప్పుడు అడుగు కదలకుండా అడుగుమీద కొట్టిన వెదురుమేకు; నాలుగుమూలలా కొడతారు; దీనికి ఒకపక్కన బొడ్డె ఉంటుంది. (తె. 28).

నేలబొంగు: పర్యా. మెట్టబొంగు. సమతల ప్రదేశంలో పెరిగిన వెదురుగడ; కొంచెంమెత్తగా ఉంటుంది;

బోలు ఎక్కువగానూ కండ తక్కువగానూ ఉంటుంది. (తె. 8, 26, 28).

నేలమగ్గం: పర్యా. నారుమగ్గం. నేలమీద పరిచి నట్లుండే చాపలనేతమగ్గం; డిజైన్లులేని సాదాచాపలు నెయ్యడానికి పనికొస్తుంది; చూ. మగ్గం. (రా. 2).

నేలవేయు: (క్రి.) ఉ. నేలేయు; పర్యా. చూ. పండబెట్టు వెదురుగడలను వరసగా నేలమీద పడుకో బెట్టడం. (కో. 28).

నైసివుదబ్బ: (< ఇం. Nice—) మేలయిన వెదురు బద్ద. (రా. 3).

నొగవెదురు: ఉ. నొగెదురు; పర్యా. బండిదండి. బండినిర్మాణంలో చక్రాన్నీ కాడినీ కలిపే లావు పాటి వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (కో. 23).

నోము(ల)చేట: ఉ. - శాట; నోము, పండుగలు మొ॥ సందర్భాల్లో (వాయనాలు మొ॥వాటికి) వాడే చేట; దీనికి ఎనిమిదికట్లు (చేటఅంచుకు కట్టు ముంగుతో చుట్టిన చుట్లు) ఉంటాయి. (కో. 5, 12, 17,1 9).

నోరు: 1. పర్యా. మూతి(3). గంప, గుల్ల మొ॥వాటిపై అంచుకు మధ్యభాగం; తెరుచుకొని ఉన్నది. చూ. చిత్రం 58. 3. (తె. 14); 2. పర్యా. మూతి(4). గూడ; దూడబుట్ట, ఎద్దుబుట్ట, చేపలబుట్ట, గుల్ల మొ॥వాటిని ముయ్యకుండా తెరిచిఉంచిన భాగం. చూ. చిత్రం 76. 2. (తె. 8); 3. దండె(=తడక అంచువెంట ఉండే నిలువుగడ లేదా బద్ద)ను ఒక చివర రెండంగుళాల మేరకు చీరి చేసినసందు. (తె. 24); 4. పర్యా. చూ. నాలిక(2). చేట ముందరి (వెడల్పుగా ఉండే) అడ్డం; రెండు కొమ్ములకూ (కొసలకు) మధ్యభాగం. చూ. చిత్రం 29. 6. (రా. 6).

న్యూసిలోన్: (< ఇం. New ceylon) ఒకరకం పేముకుర్చీ. (కో. 12).

## ప

పక్క: 1. పర్యా. చూ. చెక్క(1), వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తేవచ్చే ఒకభాగం. (తె. 17); 2. పర్యా. రెక్క(1). వాకిలితడక (=ఇంటి ముందు భాగంలో కట్టడానికి తలుపుతో ఉన్న పెద్దతడక)లో తలుపుకు పక్కన ఉన్న తడకభాగం; ఇటూ అటూ ఉంటాయి. చూ. చిత్రం 98 క. 1. (కో. 16).

పక్కకట్టు: చీపురుకట్ట పిడికింద (బాగాచిన్నది) వెడల్పుగా కుంచెలాగ ఉండే భాగాన్ని రెండు పాయలుగా విడదీసి ఒక్కొక్కపాయ చుట్టు రెండు మూడు పేళ్ళ వెడల్పున తాడుతోగాని పురితోగాని బిగించి వేసినకట్టు. (తె. 21).

పక్కకట్టె. పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల, తడక మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర. చూ. చిత్రం 32. 1. (రా. 4).

పక్కకానా: (< హిం. –ఖానా) ఉయ్యాలలో పిల్లలకు గాలి రావడానికి పక్కలను ఏర్పాటు చేసిన రంధ్రం; రెండు మూడంగుళాల కొకటి చొ॥న ఉంటాయి. చూ. చిత్రం. 41. 1. (తె. 27).

పక్కచాప: ఉ. —సాప; ఇళ్ళలో పక్కలు వేసుకో డానికి (ఈతచాప మాదిరిగా పరుచుకొనే) వెదురు పేళ్ళతో అల్లినచాప. (తె. 4, 19).

పక్కతడక: ఉ. - తడ్క; 1. పర్యా. బండిపక్క తడక. బండిచక్రం నిలువుభాగం పక్కలకూ గడికొయ్యలకూ అనుకొనేటట్లు వేసినతడక; బండి మీద ఇలాటి తడకలు రెండుపక్కలా రెండు, అడుగున ఒక దతడకా, ముందుభాగాన ఒక్కటీ ఉంటాయి; బండిజల్లకు బదులుగా వాడతారు; ఎరువుతోలుకు రావడానికి ఈ తడకల్ని బండిజల్ల మాదిరిగా వాడతారు; చూ. చిత్రం 33. (తె. 8); 2. పర్యా. దూలంతడక. తడకలతో కట్టే ఇంటికి పొడుగుభాగంవైపు దూలంకిందినుంచి పెట్టే దీర్ఘ చతురస్రాకారం తడక. (తె. 1, 23; రా. 8); 3. అలమారు కుండే తడక; రెండు పక్కలా రెండుంటాయి. (తె. 5).

పక్కదబ్బ: పర్యా. చూ. అంచుబద్ద. తడకఅంచుకు తొడిగిన వెదురుబద్ద. (రా. 4).

పక్కబొంగు: పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల, మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర. చూ. చిత్రం 32. 1. (తె. 26).

పక్కముల్లు: కలబందమట్టకు అంచువెంబడి ఉండే చిన్నముల్లు; ఇలాటివి రెండంచులకూ ఉంటాయి. (రా. 6).

పక్కమూల: పర్యా. మద్దెమూల. చేపలబుట్ట మొ॥ వాటికి మధ్యభాగాన బయటినుంచి కనిపించేమూల; రెండుంటాయి; ఈరకం బుట్టకు కిందకూడా మూల లుంటాయి. (కో. 23).

పక్షం: పర్యా. చూ. బద్ద(1). వెదురుగడ నిలువుగా నాలుగు భాగాలుగా చీలిస్తేవచ్చే భాగం; గడంత

పొడుగునా సుమారు రెండువేళ్ళ వెడల్పు ఉంటుంది. (కో. 9).

పగడపురువ్వ: పగడపు మొక్క చువ్వ (బరిగె), దీనికి ముల్లుండదు, ఆకు వేలెడు పొడుగుకంటె ఎక్కువ ఉండదు; ఈ చువ్వతో ఉప్పరితట్టలు అల్లుతారు. (కో. 25).

పగలగొట్టు: (క్రి.) రూ. పలగ్గొట్టు; పర్యా. పగలేయు. వెదురుగడ నిలువుగా రెండు బద్దలయ్యేటట్లు కత్తితో కొట్టడం. (కో. 3, 4, 6, 7, 9, 11–13, 15, 17–19, 28; తె. 8, 10, 16, 21; రా. 3, 6, 10); 2; పర్యా. చూ. పేర్చు. విడదీయడం; గంప మొ॥వాటి అడుగు అల్లేటప్పుడు జతగాపెట్టిన నిలువులను సగం అడుగుఅల్లిన తరవాత విడదీస్తారు. (రా. 9).

పగలేయు. (క్రి.) (< పగలవేయు) పర్యా. పగలగొట్టు (1). వెదురుగడ నిలువుగా రెండుబద్దలయ్యేటట్లు కత్తితో కొట్టడం. (కో. 8, 15, 16).

పగులు: (క్రి.) ఉ. పెగులు; రూ. పలుగు; పర్యా. వ్రెటారు. కత్తితో పగలగొట్టేటప్పుడు వెదురుగడ పొడుగూతా విచ్చుకోడం. (తె. 6, 7, 13).

పగ్గం: 1. ఎద్దుకొమ్ములకు పెట్టి గుంజకుకట్టే తాడు; దున్నేటప్పుడూ, బండి తోలేటప్పుడూ ఎద్దు కొమ్ములకు తగిలించి కొసను చేత బట్టుకొంటారు (రా. 5); 2. పశువులను గుంజకు కట్టడానికీ పొలం దున్నేటప్పుడు ఎద్దుకొమ్ములకూ నాగలిమేడి తోకకూ కలిపి ఎద్దును మలపడానికి వాడే పొడుగాటి తాడు; గాజంగినార తప్ప ఏనారతోనైనా పేనవచ్చు; దీనికి ఒకచివర శిల్వర ఉంటుంది. (తె. 9).

పంకా: (< హిం. పంఖా) ఉ. పంక, పక్క; పర్యా. చూ. విసనగర్ర. గాలికోసం విసరడానికి వెదురు పేళ్ళలో అల్లినది; చదరంగా ఉంటుంది; పట్టుకోడానికి ఒకచుకు కాడ (సన్నటిబద్ద) ఉంటుంది; కొన్నిచోట్ల కాడకు వెదురుగొట్టం తొడుగుతారు; మామూలుగా పొయ్యి విసురుకోడానికి వాడతారు; చూ. చిత్రం 31 క. (తె. 3, 10, 13–16, 19, 27; రా. 7).

పంకాదబ్బ: ఉ. పంక–; పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతోడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (కో. 7).

పంగ: పర్యా. చూ. చిల్ల (1), వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లు గర్రగానూ దోమతెర కర్రగానూ గాలం బరుగు గానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది (చూ. గంటి గనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (తె. 7, 15).

పంగ(లు): (బ.) వంకె నిర్మాణంలో 'X' ఆకారంలో కట్టిన రెండు వెదురుబద్దలు. (తె. 18).

పచ్చ: చూ. పసరు (1). (రా. 3, 5).

పచ్చకర్ర: పర్యా. చూ. పసరుగర్ర. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకర్ర (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగుచుట్టడానికీ, గంప ఎత్తుభాగంలో బెండుకర్ర వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53.1. (కో. 2).

పచ్చగనుపు: పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉండేహద్దు; గడచుట్టూ ఉబ్బెత్తుగా ఉంటుంది; అంతమేరకు లోపలిఖాళీని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మ వేస్తుంది. చూ. చిత్రం 4.3. (కో. 18).

పచ్చచాప: మొత్తం పచ్చపేళ్ళతో అల్లిన వెదురు చాప. (తె. 14).

పచ్చంచేయు: (క్రి.) (< పక్షం –) నలుపలకలుగా చెక్కడం; నిచ్చెనమెట్టుగా అమర్చే వెదురుగడ ముక్కకు రెండువైపులా ఇలా చెక్కుతారు. (రా. 8).

పచ్చతడక: పర్యా. చూ. పసరుతడక. కేవలం పచ్చపేడు (=పైభాగం పచ్చగా నున్నగాఉన్న వెదురు పేడు)తో అల్లినతడక; దీనిధర ఎక్కువ. (తె. 1).

పచ్చదబ్బ: చూ. పచ్చబద్ద (1). (కో. 4, 21, 26, 28; రా. 8).

పచ్చపేడీనె: ఉ. –బేడీనె; పర్యా. చూ. పసరుగర్ర. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకర్ర (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగుచుట్టడానికీ గంప ఎత్తు భాగంలో బెండుకర్ర వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53.1. (కో. 1).

పచ్చపేడు: ఉ. పచ్చపేడు; పర్యా. చూ. పసరుపేడు

వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (కో. 2, 6, 8, 16-18; తె. 1, 8, 9, 18, 27, 30; రా. 3-5, 11).

పచ్చపేడుజల్లి: పచ్చటి వెదురుపేడు (చూ. పసరు పేడు)తో అల్లినజల్లి. (కో. 14).

పచ్చబడుము: పర్యా. చూ. పసరుగఱ్ఱ. వెదురు గడకుపైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకఱ్ఱ (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగుచుట్టడానికి గంప ఎత్తుభాగంలో బెండుకఱ్ఱ వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికి వాడతారు. చూ. చిత్రం 53.1. (తె. 5).

పచ్చబద్ద: 1. రూ. పచ్చదబ్బ; పర్యా. చూ. పసరు దబ్బ (1), పసరువన్నెలో నున్నగా ఉండే పైభాగంతో వచ్చిన వెదురుబద్ద. (తె. 29). 2 పర్యా. చూ. అంచుకట్టుబద్ద. గూడ, ఉయ్యాల, పెళ్ళిపెట్టె, బుట్ట మొ॥ అల్లకంలో వాటి అంచు చుట్టూ గట్టిదనంకోసం కట్టిన పలచటి వెదురుబద్ద చూ. చిత్రం 35 క. 2. (కో. 11).

పచ్చబద్దలచాప: ఉ. —సాప; పర్యా. పచ్చబేడు చాప. పచ్చగా నున్నగా ఉండే బద్దనుంచి చీరిన పేళ్ళతో అల్లిన చాప, (కో. 12, 23, 28).

పచ్చబద్దలచేట: ఉ. —శాట; పర్యా. పచ్చబేళ్ళచేట. పసరు (=పచ్చగా ఉండే) పేళ్ళతో అల్లినచేట (కో. 26).

పచ్చబద్దీనె: (< పచ్చబద్ద + ఈనె) పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (కో. 25, 27).

పచ్చబిలుకు: ఉ. —బిల్కు; పర్యా. చూ. పసరుకట్టు. వెదురుబద్దకు పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంనుంచి చీరిన బద్ద(కట్టు); దీన్ని చేటకు లోపలా బయటా అంచుచుట్టూ పెట్టి బిగిస్తారు. (కో. 2).

పచ్చబేడుచాప: ఉ. పచ్చపేడు సాప; పర్యా. పచ్చబద్దలచాప. పచ్చగా నున్నగా ఉండే బద్దనుంచి చీరిన పేళ్ళతో అల్లినచాప. (కో. 15).

పచ్చబేడు: సవార్బండితడక పచ్చపోడుతో అల్లిన కచ్చడంబండి (సవారుబండి) తడక. (తె. 6).

పచ్చబేళ్ళచేట: ఉ. పచ్చపేల్లశాట; పర్యా. పచ్చ బద్దలచేట. పసరు (=పచ్చగా ఉండే) పేళ్ళతో అల్లిన చేట. (కో. 2; తె. 28).

పచ్చబొంగు: పర్యా. చూ. ఆకుపచ్చబొంగు. ఆకు పచ్చరంగులో ఉండే వెదురుగడ; లేతగా ఉంటుంది. (కో. 7, 10; తె. 15).

పచ్చవాసం: పర్యా. చూ. ఆకుపచ్చబొంగు. ఆకుపచ్చ రంగులో ఉండే వెదురుగడ; లేతగా ఉంటుంది. (కో. 8).

పచ్చవేడుజల్లి: పర్యా. పసరుదబ్బజల్లి. వెదురుబద్దకు పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంనుంచి తీసిన పలచటిపేడుతో అల్లిన బండిజల్లి. (కో. 15).

పచ్చి: పర్యా. నెమ్ము, పసిమి. తడిఆరని ఆటువంటి స్థితి. (తె. 7-10, 13, 15, 21; రా. 8).

పచ్చికట్టె: పర్యా. పచ్చిబరిగె. పచ్చిఆరిపోని ఈత కమ్మ. (తె. 20).

పచ్చికఱ్ఱ: పర్యా. చూ. పచ్చిబొంగు. పచ్చిఆరిపోని వెదురుగడ. (కో. 12, 15, 17).

పచ్చిగడ: ఉ. – గెడ; పర్యా. చూ. పచ్చిబొంగు, పచ్చి ఆరిపోని వెదురుగడ. (కో. 16, 21; తె. 9).

పచ్చితడక: పచ్చిగోగుకట్టెనుంచి తీసిన తొక్క. (తె. 9).

పచ్చిబద్ద: పచ్చివెదురుగడ నుంచి తీసినబద్ద. (కో. 12).

పచ్చిబరిగె: పర్యా. పచ్చికట్టె. పచ్చిపోని ఈతకమ్మ. (తె. 11).

పచ్చిబొంగు: పర్యా. పచ్చికఱ్ఱ. పచ్చిగడ, పచ్చి వెదురు. పచ్చి ఆరిపోని వెదురుగడ. (కో. 9; తె. 2, 4, 17, 26, 28).

పచ్చిమట్టనార: పర్యా. తెల్లకలమందనార. పచ్చి కలబంద మట్టనుంచి తీసిననార; తెల్లగా ఉంటుంది. (రా. 4).

పచ్చివెదురు: ఉ. పచ్చెదురు; పర్యా. చూ. పచ్చి బొంగు. పచ్చి ఆరిపోని వెదురుగడ. (తె. 29; రా. 2-4).

పచ్చీనె: (< పచ్చి + ఈనె) ఉ. పచ్చీన; 1. పర్యా. చూ. పసరుగఱ్ఱ. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చిన కఱ్ఱ (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగు చుట్టడానికి గంప ఎత్తుభాగంలో బెండుకఱ్ఱ వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికి వాడతారు. చూ. చిత్రం 53. 1. (కో. 16; రా. 4); 2. పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంలో కూడిఉన్న పేడు. (కో. 28)

పచ్చీసు(చాప): ఉ. —సాప; పచ్చీసు (=గళ్ళలో పావులుపెట్టి ఆడే ఒకరకం ఆట) గళ్ళమాదిరిగా గళ్ళు వచ్చేటట్లు నేసిన తుంగచాప. (కో. 3, 8; రా. 4).

పచ్చె: (<సం. పక్షం) ఉ. పచ్చె; 1. పర్యా. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒకభాగం. (తె. 3, 13, 15, 17, 19, 20; రా. 3); 2. పర్యా. చూ. బద్ద (1). వెదురుగడ నిలువుగా నాలుగు భాగాలుగా చీలిస్తే వచ్చేభాగం; గడంత పొడుగునా సుమారు రెండువేళ్ళ వెడల్పు ఉంటుంది తె. 7, 8, 16, 17); 3. పర్యా. బద్ద (8). తాటి పాట (చూ.) పొడుగ్గాచీరి తీసినపాయ; రెండు మూడు భాగాలుగా చీరతారు; చీల్చినదాన్ని చీల్చని దాన్నీ 'పాట' అనే అంటారు. (తె. 9); 4. ఈత మట్ట చీరితేవచ్చే పాయ; రెండుపాయలుగా చీరతారు. (తె. 9).

పంచితం: పర్యా. గంజరం. అవుమూత్రం. (రా. 3).

పంజెరం: పర్యా. చూ. కోళ్ళగూడు (1). కోళ్ళను కమ్మడానికి (=మూయడానికి) వాడేగంప; వెడల్పు అడుగున తక్కువగానూ పోనుపోను ఎక్కువగాను ఉంటుంది; అంచుభాగంవేపు కమ్ముతారు; అడుగు కొన్నిటికి సమతలంగానూ కొన్నిటికి కొంచెం కోసుగానూ ఉంటుంది; కొన్నిటికి మధ్యనుంచి సన్నటి భాగంవేపు మొత్తం గళ్ళుగళ్ళుగా అల్లక ముంటుంది; కొన్నిటికి వెడల్పు భాగంవేపు మూసి ఎత్తు భాగంవేపు కోళ్ళను వేయడానికి ద్వారం ఉంచుతారు; చూ. చిత్రాలు 65 క, ప. (తె. 28).

పటాక్‌పుల్ల: పర్యా. ఆకాశపుల్ల. తారాజువ్వపుల్ల; దీపావళికి వేసే తారాజువ్వలకు కొన్నిచోట్ల వెదురుపుల్ల కడతారు. (తె. 10).

పట్ట: నులక మంచానికి బిగించిన కర్ర; పొడుగువి రెండూ అడ్డానివి రెండూ ఉంటాయి. (రా. 4).

పట్టు: (క్రి.) పర్యా. చూ. పాపు. భాగాలుగా విడదీయడం; వెదురుగడనుగాని బద్దనుగాని ఒకచివర కత్తితో చీల్చిన తరవాత ఒకపాయ కాలికింద తొక్కిపట్టి రెండోపాయ చేత్తోపట్టి లాగుతూగాని రెండుబద్దల్నీ రెండు చేతులతో విడదీస్తూగాని వేరు చేస్తారు. (కో. 22).

పట్టుకర్ర: పర్యా. చూ. చేతికర్ర (1). చేతికి ఊతగా పట్టుకొనేవెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళ లావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసామొదలూ ఒకే లావుంటాయి; సాముచేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (కో. 3).

పట్టుగట్టె: చూ. పట్టుడుగట్టె. (తె. 1).

పట్టుగోల: పర్యా. చూ. చేతికర్ర(1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళలావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసామొదలూ ఒకేలావుంటాయి; సాముచేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (తె. 5).

పట్టుచెంద్రిక: ఉ. —సెంద్రిక; పర్యా. చూ. చెంద్రిక పట్టుపురుగుల గుడ్లుపొదగడానికీ పురుగుల్ని పెంచడానికీ గుండ్రంగా అరలరలుగా ఉన్న ఒకరకం తడక; చూ. చిత్రం 82. (తె. 31).

పట్టుడుగట్టె: రూ. పట్టుగట్టె; పర్యా. చూ. చేతికర్ర(1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళలావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలులేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసామొదలూ ఒకేలావుంటాయి: సాము చేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (రా. 10).

పట్టుతడక: ఉ. —తడిక; పర్యా. చెంద్రికతడక. చెంద్రిక(చూ.) పువ్వు అమర్చడానికి కింద వేసిన తడక. చూ. చిత్రం 82. 3. (కో. 9).

పట్టె: 1. చాపఅల్లకానికి ఈతాకుతో బెత్తెడు వెడల్పున రెండుగజాల పొడుగు అల్లినది, విడివిడిగా ఇలాటి పట్టెలు అల్లి ఒకదానిపక్క ఒకటి చేర్చి కుడతారు; ఒక్కొక్క చాపకు 10-20 పట్టెలు పడతాయి. (తె. 19, 21, 22, 26; రా. 8, 9); 2. పర్యా. అని(8), కాలు(10), పుంజీ(2). ఈతచువ్వతో అల్లే గుమ్మి, తడక మొ॥వాటిలో నిలువుగా వచ్చే నాలుగుబద్దల కూర్పు. (తె. 9, 20; రా. 9).

పట్టెకమ్మ: ఈతచాప పట్టె అల్లకంలో మధ్యభాగంలో వచ్చే ఆకు. (తె. 26).

పట్టెదబ్బ: ఉ. —దెబ్బ; 1. పర్యా. చూ. వెన్నుదబ్బ. ఈతకమ్మ వెన్ను (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. (తె. 16); 2. పర్యా. చూ. కందదబ్బ(4). ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥వి అల్లేటప్పుడు అడుగుగభాగంలో చుట్టడానికీ ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పనికొస్తుంది. చూ. చిత్రం 11. 3. (తె. 13).

పట్టెబరిగె: పలచగా చదునుగా ఉండే ఈతబరిగె; తడకలూ, పేడతట్టలూ అల్లడానికి పనికొస్తుంది. (తె. 13).

పడకత్తి: కత్తులపెట్టె (చూ.)లో బిగించిన మూడు జతల కత్తుల్లో ప్రతిజతలోనూ ఏటవాలుగా బిగించిన కత్తి. చూ. చిత్రం 137. 2. (కో. 12).

పడగ: ఉ. పడిగ, పడిగె; **1.** పర్యా. అంబుపడగ, పిడి(3), బరిసె, బరిసెవంపు, బిళ్ళ(3), మొదలు(5), అంబు(చూ.)కు వెడల్పుగా ఉన్న భాగం; పాముపడగ, బరిసె, మొ॥వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండే బిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; పేడు తెంపడానికీ చిల్లులు పొడవడానికీ పనికొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి; కొన్ని మొండిగా ఉంటాయి; కాడకొనతో చిల్లులు పొడవడానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు. చూ. చిత్రం 15 ట. (కో. 10, 17, 18). **2.** పర్యా. కుడక(2), తలపడగ, బిళ్ళ (1), బుగ్గ – మేదరి కత్తి వెన్నుకూ పదునుభాగానికీ మధ్యఉండే చెంప. చూ. చిత్రం 12 ద. 4. (కో. 17; తె. 3, 6, 22, 24–26, 30).

పడవ: పర్యా. ఫిష్‌బోటు. చేపలుపట్టే పడవ ఆకారంలో చేసిన వెదురుపేళ్ళ బొమ్మ; రకరకాలుగా ఉంటాయి; ఇళ్ళలో షోకేసుల్లో పెట్టుకొంటారు. (కో. 27; తె. 8).

పడసాలతడక: ఉ. పడ్సాల్ ; పర్యా. చూ. చాటు తడక (1). ఇంట్లో గదులుగా విభజించడానికిగాని వరండాలో చాటుకోసంగాని అడ్డంగాకట్టే వెదురు వేళ్ళ తడక. చూ. చిత్రం 36 చ. (రా. 1).

పడికట్లు: (బ.) ఒక వృత్తి పనికిగాని ఒక రంగానికి గాని సంబంధించిన వాడుకమాటలు; పారిభాషిక పదాలు. (కో. 19).

పడిగిబుట్ట: ఉ. —బుట్టి; కింద నాలుగుమూలలు ఉండి పైన గుండ్రంగా ఉండేటట్లు అల్లినబుట్ట; ఇది బియ్యం కొలుచుకోడానికి పనికొస్తుంది; ఆకుబుట్ట కన్న చిన్నగా ఉంటుంది. (కో. 24).

పడిగె: **1.** పర్యా. నాలిక(1). కచ్చడంబండి మీద గుడిసెలుకప్పే తడకకు రెండువైపులా చూరులా కొంతభాగం బయటికి చొచ్చుకొని వచ్చేలా అల్లిన భాగం. చూ. చిత్రం 34 చ. 1. (తె. 19, 25); **2.** బాపింగంలో పడగలాంటి భాగం. చూ. చిత్రం 103. 3. (తె. 10); **3.** పేముకర్ర చీల్చే కత్తికి వెడల్పుగా ఉండే భాగం; పడగ చూ. చిత్రం 143. 4. (తె. 22).

పడిగెకట్టె: పర్యా. చూ. వంకకర్ర(1). పాముపడగ మాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; నేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (తె. 22).

పడిగెనకర్ర: నూలుపడుగులో చివర దూర్చే వెదురు కర్ర; పడుగేరేటప్పుడు దూరుస్తారు. (చూ. మాం. వృ. కోశం–2, చేనేతపదాలు). (కో. 9).

పడుకర్ర: పర్యా. వాలిపోయిన కర్ర. మొదలు కాలిపోయిగాని పుచ్చిపోయిగాని గాలివల్లగాని విరిగి పడిన వెదురుగడ. (కో. 27).

పడుగుబెట్టు: (క్రి.) పర్యా. చూ. పోగుబిగించు. (తుంగ) చాపమగ్గం ముందు నేతగాడు కూర్చొనే వైపు ఉండే ముందరి బొంగు (చూ.) నుంచి మగ్గంచివరి వెనకబొంగు (చూ.) వరకు అడ్డంగా (గజంవెడల్పున) బెత్తెడు ఎడానికి ఒక నారపోగు చొ॥న పెట్టికట్టడం. (కో. 3).

పడుగువేయు: (క్రి.) ఉ. పడుగేయు; పర్యా. చూ. పన్ను(2). తడక అల్లడానికి (దీర్ఘచతురస్రపు చట్టం అమర్చిగానీ అమర్చకుండాగానీ) నిలువులు వరసగా పేర్చి మొదటిభాగంలో నిలువుల కడ్డంగా పేడు ఇమిడ్చి అల్లకానికి సిద్ధంచేయడం. (కో. 18).

పడుపు: (క్రి.) వినసగర్ర అల్లకంలో పేళ్ళను రెండు పక్కలనుంచి మడవడం. (రా. 4).

పంటకర్ర: **1.** పర్యా. పంటలకర్ర. పండుకర్ర(3), పండువెదురు(2), పాతకర్ర(2), బియ్యంకర్ర. వెదురుధాన్యం కాసినగడ; మొక్క మొలిచిన తరవాత సుమారు 20 సం॥లకు కాపుకాస్తుంది; ఇంటి వాసాలకూ గోవలకూ పనికొస్తుంది. (కో. 21, 25); **2.** పర్యా. చూ. పండుబొంగు(1). రెండు సం॥ల నుంచి 4 సం॥ వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపురంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (కో. 28).

పంటలకర్ర: పర్యా. చూ. పంటకర్ర(1). వెదురు ధాన్యం కాసినగడ; మొక్క మొలిచిన తరవాత సుమారు 20 సం॥లకు కాపుకాస్తుంది; ఇంటివాసాలకూ గోవలకూ పనికొస్తుంది. (కో. 27).

పంౘె: పర్యా. పంౘెపుల్ల. బట్టల నేతదారం (నూలుగాని పట్టుగాని) చుట్టే పనిముట్టు; వెదురుబద్దతో తయారుచేస్తారు (చూ. పంౘె; మాం. వృ. కోశం _2;) చేనేతపదాలు). (రా. 7).

పంౘెపుల్ల: ఉ. పంటి—; పర్యా. పంౘె. బట్టలనేత దారం (నూలుగాని పట్టుగాని) చుట్టే పనిముట్టు; వెదురుబద్దలతో తయారుచేస్తారు (చూ. పంౘె; మాం. వృ. కోశం_2, చేనేతపదాలు. (కో. 2; రా. 7).

పండబెట్టు: (క్రి.) పర్యా. నేలవేయు, పండేయు. వెదురుగడలను వరసగా నేలమీద పడుకోబెట్టడం. (తె. 6).

పండు: పర్యా. చూ. పండుబొంగు(1). రెండు సం॥ల నుంచి 4 సం॥వరకు వయస్సుగల ముదురు వెదురు గడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపురంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (తె. 30).

పండుకమ్మ: పర్యా. ముసలికమ్మ. ముదిరిన ఈతాకు; ఎరుపురంగులో ఉంటుంది. (తె. 19).

పండుకఱ్ఱ: ఉ. పొండు—; 1. పర్యా. చూ. పండుబొంగు(1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది, ఎండిన తరవాత తెలుపురంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (కో. 4, 10, 12, 13, 15_18, 26; 30; (తె. 30). 2. పర్యా. చూ. ముదురుబొంగు (2). బాగా ముదిరిన వెదురుగడ; బండిజల్ల, గుమ్మి, తడక మొ॥వి అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీల్చడం కష్టం (అందువల్ల ఇది చేట, గుల్ల, గంప మొ॥వాటికి పనికిరాదు) ఎరుపు మొ॥ రంగుల్లో ఉంటుంది. (కో. 3). 3. పర్యా. చూ. పంటకఱ్ఱ (1). వెదురుధాన్యం కాసినగడ; మొక్క మొలిచిన తరవాత సుమారు 20 సం॥లకు కాపు కాస్తుంది; ఇంటివాసాలకూ గోవలకు పనికొస్తుంది. (కో. 23).

పండుగట్టె: ఉ. పొండు–; పర్యా. చూ. పండుబొంగు(1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (రా. 6).

పండుగడ: ఉ. —గెడ; పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (కో. 15).

పండుగాయ: లోపల నీళ్లూ కొబ్బరీ ఏర్పడి పక్వానికి వచ్చిన కొబ్బరికాయ. (కో. 20).

పండుబొంగు: ఉ. పొండు—; 1. పర్యా. పంటకఱ్ఱ (2), పండు, పండుకఱ్ఱ (1), పండుగట్టె, పండు గడ, పండువెదురు (1), పాతకఱ్ఱ (1), ముది కఱ్ఱ, ముదిసాధనం, ముదిగట్టె, ముదురుకఱ్ఱ, ముదురుగోలు, ముదురుబొంగు (1), ముదురు వెదురు. రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (కో. 6_9; తె. 4, 7, 13, 14, 16_25, 27, 31; రా. 8_11); 2. పర్యా. చూ. ముదురుబొంగు (2). బాగా ముదిరిన వెదురు గడ; బండిజల్ల, గుమ్మి, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీల్చడం కష్టం (అందువల్ల ఇది చేట, గుల్ల, గంప మొ॥వాటికి పనికిరాదు) ఎరుపు మొ॥ రంగుల్లో ఉంటుంది. (తె. 12, 26, 28).

పండువెదురు: ఉ. పండెదురు, పుండెదురు, పొండె దురు; 1. పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు , చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపురంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి

పనికొస్తుంది. (కో. 14, 31; రా. 2-4). 2. పర్యా. చూ. పంటకర్ర (1). వెదురుధాన్యం కాసిన గడ; మొక్క మొలిచిన తరవాత సుమారు 20 సం॥లకు కాపుకాస్తుంది; ఇంటి వాసాలకూ గోవలకూ పనికొస్తు ది. (కో. 1).

పండేయు: (క్రి.) (< పండవేయు) పర్యా. చూ. పండబెట్టు వెదురుగడలను వరసగా నేలమీద పడుకో బెట్టడం. (తె. 7).

పండ్లసిబ్బుడం: ఉ. —సిబ్బం; పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసిపెట్టుకోడానికి వెదురుపేళ్ళతో గాని ఈతపేళ్ళతోగాని అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66. (తె. 26).

పతలబొంగు: (< హిం. పత్లా—) ఉ. పత్ల—; పర్యా. చూ. పలచ(ని)బొంగు. బోలు ఎక్కువ గానూ కండ తక్కువగానూ ఉండే వెదురుగడ; తేలికగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడే పేళ్ళు దీన్నించి తక్కువగా వస్తాయి. (తె. 12, 22, 23).

పత్తిదాల: పర్యా. జేలిదాల. పత్తి మోసుకుపోవడానికి సందులుసందులు (జేలీలు)గా అల్లిన పెద్దగంప. (తె. 22).

పదకొండుమానికలగుల్ల: 55 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల. (తె. 24).

పదడ్లగుల్ల: 60 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల; మామూలు గుల్లకన్న పెద్దగా ఉంటుంది; వెడల్పు మూరమీద మూడుబెత్తలూ, ఎత్తు మూరెడూ, అడుగు జేనమీద రెండుబెత్తలూ ఉంటుంది. (తె. 22).

పదం: పర్యా. నుడుగు. పాట; పనివాళ్ళు తీరికవేళల్లో కాని పనిచేసుకొంటూకాని పాటలు పాడుకొంటారు. (తె. 4).

పదారుకడవలగాదె: ఉ. —గాజె; 5 క్వింటాళ్ళు (పదహారుకడవల) ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (రా. 9).

పదారుబట్టెలచాప: పదహారు పట్టె (చూ.) లను పక్కపక్కగా చేర్చికుట్టిన ఈతచాప. (తె. 19, 21).

పదికట్లచేట: అంచుచుట్టూ పదికట్లు వేసినచేట. (కో. 10).

పదికడవలగాదె: ఉ. —గాజె; మూడు క్వింటాళ్ళ ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (రా. 9).

పదిగుంచాలగుల్ల: పదికుంచాల (65 కిలోలు) ధాన్యం పట్టే గుల్ల. (తె. 25).

పదిబట్టెలచాప: ఉ. —సాప; పదిపట్టె (చూ.) లను పక్కపక్కగా చేర్చికుట్టిన ఈతచాప. (తె. 19).

పదిమళ్ళగుమ్మి: పర్యా. పుట్టెడుగుమ్మి(1). పది మణుగుల ధాన్యంపట్టే గుమ్మి. (తె. 22).

పదిమానికలగుల్ల: ఉ. పదిమాన్కల—; 80 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల (తె. 21)

పదిసంచులగుమ్మి: పదిబస్తాలధాన్యం పట్టే ఈత గుమ్మి. (తె. 20).

పదును: ఉ. పదను, పొదును; 1. పర్యా. అరవాయి, అలుగు(1), తెంపు, తేజు, దారు, మెదువు, వాడి, వాయి, వాయిదం, వాయిదార. కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥వాటి వాడి, మెత్తగాతెగే భాగం. కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు 12 క-డ; 16 క-వ; 20 క. 4. (కో. 1, 2, 3, 5, 8-14, 19, 21, 22, 26, 29; తె. 2, 12, 21, 26; రా. 2-11); 2. పర్యా. చూ. మొన(2). ఒకరకం అంబు (చూ.) కాడ, కొన; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 15 చ. 3. (తె. 2).

పదునుబట్టించు: (క్రి.) పర్యా. చూ. చరిపించు. పదునుపోయి మొండిగా అయిన కత్తి మొ॥వాటిని కొలిమిలో కాల్చి సుత్తితో కొట్టి వాడిగాచేయించడం; మేదరికత్తికి పదునుపోయినప్పుడు కమ్మరిచేత ఇలా చేయిస్తారు; కొన్నిచోట్ల మేదరివాళ్ళే చేసుకొంటారు. (కో. 2).

పదునుబెట్టించు: (క్రి.) పర్యా. చూ. చరిపించు. పదునుపోయి మొండిగా అయిన కత్తి మొ॥వాటిని కొలిమిలోకాల్చి సుత్తితోకొట్టి వాడిగా చేయించడం; మేదరికత్తికి పదును పోయినప్పుడు కమ్మరిచేత ఇలా చేయిస్తారు; కొన్నిచోట్ల మేదరివాళ్ళే చేసు కొంటారు. (కో. 22, 25).

పదునురాయి; ఉ. పొదున్—; పర్యా. చూ. నూరాతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకో డానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (కో. 2).

పదునువేయించు: (క్రి.) పర్యా. చూ. చరిపించు. పదునుపోయి మొండిగా అయినకత్తి మొ॥వాటిని కొలిమిలోకాల్చి సుత్తితోకొట్టి వాడిగా చేయించడం; మేదరికత్తికి పదును పోయినప్పుడు కమ్మరిచేత

ఇలా చేయిస్తారు; కొన్నిచోట్ల మేదరివాళ్ళే చేసు కొంటారు. (కో. 24).

పద్దెనిమిదిబద్దెలచాప: పద్దెనిమిది పట్టెలను పక్క-పక్క-గా చేర్చికుట్టిన ఈతచాప. (తె. 19).

పద్మాలపంకా: ఉ. —పంక; పర్యా. చూ. పద్మాల విసనగర్ర. తామరపువ్వు (పద్మం)వంటి డిజైను వచ్చేటట్లు అల్లిన వెదురుపేళ్ళ విసనగర్ర. (తె. 6, 9).

పద్మాలవిసనగర్ర: ఉ. పద్మాలిసనగర్ర, పద్మాలిస్న కర్ర; పర్యా. కమలపు విసనగర్ర, కమలాలపంకా. దామరపదం విసనగర్ర, పద్మాలపంకా, పద్మిసన గర్ర. తామరపువ్వు (పద్మ)వంటి డిజైను వచ్చే టట్లు అల్లిన (వెదురుపేళ్ళ) విసనగర్ర. (కో. 6, 8, 11; తె. 4, 5, 8, 31).

పద్మిసనగర్ర: పర్యా. చూ. పద్మాల విసనగర్ర. తామరపువ్వు (పద్మం)వంటి డిజైను వచ్చేటట్లు అల్లిన (వెదురుపేళ్ళ) విసనగర్ర; పద్మం విసన గర్ర. (కో. 7; రా. 8).

పనకం: కొడమ (చూ.) లోని పెద్దగుండు మధ్య అల్లిన జేలీ. (కో. 2).

పనక్ర: పర్యా. చూ. దబ్బ (9). ఈతకమ్మ నిలువుగా రెండుమూడు పాయలుగాచీరి తీసిన భాగం. (తె. 14).

పందిరి: పర్యా. నీడపందిరి. నీడకోసం వెదురు తడక లతో కప్పిన పందిరి. (తె. 4, 26).

పందిళ్ళచాప: పందిళ్ళమీద పరవడానికి అల్లిన వెదురుచాప. (తె. 26).

పందుంగాదె: ఉ. పందంగాజె; 12 క్వింటాళ్ళ (40 కడవల) ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (రా. 9).

పందుంగుమ్మి: దాదాపు 3 క్వింటాళ్ళ (పదితూముల) ధాన్యంపట్టే ఈతగుమ్మి (తూము = 28 కిలోలు) చూ. చిత్రం 74 త. (తె. 9, 14).

పందుం: పదితూముల (దాదాపు మూడుక్వింటాళ్ళ) ధాన్యం కొలమానం. (తె. 7, 9, 14).

పన్నికచాప: ఉ. —సాప; చేట అల్లిక మాదిరిగా కాకుండా ముందు ఫ్రేములాగా అమర్చి నిలువు పేళ్ళుపెట్టి అడ్డంపేళ్ళతో అల్లుకుంటూ వచ్చేచాప; దీని అంచు వంచరు; బోడిగా ఉంటుంది. (కో. 22).

పన్నిగపానిక: పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగా వచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పు గానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు కొన్నిచోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడ ఉంటాయి. (కో. 30).

పన్నిగబద్ద: పర్యా. చూ. నిలువుబద్ద(2). అల్లక పూర్తయిన తరవాత గట్టిదనంకోసం తడకమీం మధ్యభాగంలో నిలువుగా కొట్టే వెదురుబద్ద. చూ చిత్రం 36 క. 3. (కో. 30).

పన్ను: (క్రి.) 1. పనికి అనువుగా అమర్చడం జల్లెడఅడుగు అల్లడానికి నిలువుల్ని వరసగా పెడతారు (పన్నుతారు). (కో. 28); 2. పర్యా. తడకదాపు, తడకపన్ను, దాపు, దాపుడుబెట్టు, దాప బెట్టు, పడుగువేయు. తడక అల్లడానికి (దీర్ఘ చతురస్రపు చట్రం అమర్చిగానీ అమర్చకుండా గానీ) నిలువులు వరసగాపేర్చి మొదటిభాగంలో నిలువులకడ్డంగా పేడు ఇమిడ్చి అల్లకానికి సిద్ధం చేయడం. (కో. 19, 22, 23, 28, 30, 31).

పన్నె: దువ్వెనపండ్ల మాదిరిగా వెదురుచువ్వల (సన్నగా పొట్టిగా ఉండేవి) బిగించిన ఒక పనిముట్టు; చూ. పన్నె; మాం.వృ. కోశం_2, చేనేతపదాలు. (కో. 9).

పన్నెండుకడవలగాదె: ఉ. —గాజె; మూడున్నర క్వింటాళ్ళు ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (రా. 9).

పన్నెండుమానికలగుల్ల: ఉ. పన్నెడుమాన్కలు—; 1. 96 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 21); 2. 60 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గంప. (తె. 24).

పరంజి: పర్యా. చూ. గోవ(3). ఇళ్ళుకట్టేటప్పుడు తాపీమేస్త్రీలు నిలబడడానికి ఎత్తున కట్టేది; (చూ. గోవ; మాం.వృ. కోశం—4, వాస్తుపదజాలం); చూ. చిత్రం 107. (తె. 31).

పరికెముక్కలవాళ్ళు: ఉ. పరికెముక్కలొల్లు; ఎరకలివాళ్ళలో ఒకతెగ; సవరాలు అల్లడం, సోది చెప్పడం, పాములుపట్టడం మొ॥ పనులు చేస్తారు. (తె. 7).

పరిమిటు: (< ఇం. Permit) అనుమతిపత్రం. (కో. 15).

పరుపు: (క్రి.) పరవడం; చీరవలసిన ఈతకట్టెలను ఒబ్బిడిగా ఒకచోట పేరుస్తారు. (తె. 16).

పరుపుబద్ద: పర్యా. నిలువుబద్ద (4), పాన్పుడబ్బం. వెదురుమంచం తయారీలో అడ్డంగాకొట్టిన గడల బిగింపుకోసం నిలువుగా కొటిన వెదురుబద్ద చూ

చిత్రం 108. 3. (తె. 12).

పర్తానిపోగు: పర్యా. చూ. రాణిపట్టె(1). నులకమంచం అల్లకంలో రెండుమూలల్ని కలుపుతూ— మిగతా రెండుమూలల్ని కలుపుతూ వచ్చే నులకపట్టెకు కిందుగా - వచ్చే నాలుగు (లేదా అంతకన్న ఎక్కువ) తాళ్ళవరస. (రా. 5).

పర్మా: పర్యా. మాంజకట్టె. ఇటికల తయారీకోసం తడిమన్ను మోసుకురావడానికి, ఒక చెక్కకు రెండు వైపులా బొంగులు బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం; మాంజ; ఇద్దరుమనుషులు చెరో వైపునా బొంగులు పట్టుకొని మోస్తారు. చూ. చిత్రం 114. (తె. 10).

పర్రెబారు: (క్రి.) పర్యా. పగులు. కత్తితో పగల గొట్టేటప్పుడు వెదురుగడ పొడుగంతా విచ్చుకోడం

పర్వతంబొంగు: పర్యా. చూ. గుట్ట(ల)బొంగు. కొండలమీదా గుట్టలమీదా గట్లమీదా పెరిగే వెదురు కర్ర; పెళుసుగా ఉంటుంది; పేడుతీయడం కష్టం; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 9, 15; రా. 11).

పర్స: జాతర; మేదరివాళ్ళంతా కలిపి జాతరచేసుకొని దేవుణ్ణి పూజిస్తారు. (రా. 1).

పలక: ఉ. పల్క-; 1. ఉయ్యాల, సారెపెట్టె మొ॥ వాటికి ఒకపక్క; ఎత్తు; ఇలాటివి నాలుగువైపులా ఉంటాయి. (తె. 27, 30); 2. పర్యా. చూ. అచ్చు. (తుంగ) చాపనేసేటప్పుడు అడ్డానికివేసిన (తుంగ) పోచను దగ్గరకు నెట్టడానికి చేత్తోఒత్తే కొయ్యపలక; దీర్ఘచతురస్రాకారంగా ఉంటుంది; దీనికి సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులు దూరుస్తారు; తుంగపోచను పోగుల మధ్యకు మార్చిన తరవాత ఆ పోచ అంతకుముందున్న పోచలను ఆనుకొని ఉండేటట్లు ఈ పలకలతో నెడతారు; కొన్నిచోట్ల ఇనపచువ్వల పలకవాడతారు. చూ. చిత్రం 105, 120 క. 5. (కో. 8; రా. 6).

పలకలవిసనగర్ర: నలుపలకలుగా ఉండే విసనగర్ర. (కో. 10).

పలగజీరు: (క్రి.) ఉ. పల్గ -; వెదురుగడనుగాని ఈతమట్టనుగాని చీరడం; వెదురుగడ మొదలు మట్టగించి నిలువుగా కొంతవరకు రెండుభాగా లయ్యేటట్లు కత్తితోకొట్టిన తరవాత ఒకభాగాన్ని కాలితో తొక్కిపట్టి రెండోభాగాన్ని చేత్తో లేపుతూ రెంటినీ విడదీస్తారు. (తె. 9. 28).

పలగదీయు: (క్రి.) ఉ. పల్గ -; ఈతకమ్మను రెండు పాయలుగా విడదీయడం. (తె. 20).

పలగ్గొట్టు: (క్రి.) ఉ. పలిగొట్టు; చూ. పల్గగొట్టు పగలగొట్టు. (కో. 5; తె. 1, 12-15, 17, 19, 27, 31; రా. 4, 5).

పలంగిమంచం: మామూలు మంచంకన్న పెద్ద మంచం; వెదురుగడంతోనూ బద్దంతోనూ చేస్తారు. (తె. 26).

పలచనిగోరు: ఉ. పల్సని, పల్సనిగోరు; పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో పొడ్డుముగా అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కిందిపేడును రెండుభాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్ల డానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (కో. 23).

పలచనితడక: ఉ. పల్సానితడక; పర్యా. సల్పాని తడక. పలచటి వెదురుపేడుతో అల్లిన తడక. (కో. 31).

పలచనిపేడు: ఉ. పల్సాని—; మందంలేని వెదురు పేడు. (కో. 24).

పలచనిబొంగు: ఉ. పల్స(ని) బొంగు; పర్యా. పతల బొంగు, బోరుకర్ర. బోలు ఎక్కువగానూ కండ తక్కువగానూ ఉండే వెదురుగడ; తేలికగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడే పేళ్ళు దీన్నుంచి తక్కువగా వస్తాయి. (కో. 19; తె. 8).

పలిక: బియ్యం పోసుకోడానికి అల్లిన ఒకరకం వెదురుబుట్ట; కూర్కబుట్టకన్న ఎత్తు తక్కువగా ఉంటుంది; దీనికి మూతిదగ్గర వెదురుకర్ర (తీగ)తో చుట్టిన కట్టుండదు; నిలువులు పెట్టకుండా కేవలం పేడుతోనే అల్లుతారు; అడుగున చతురస్రంగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 24).

పలికెబుట్ట: ఉ. పల్కె—; పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ పోసి పెట్టుకోవడానికి వెదురుపేళ్ళతోగాని, ఈతపేళ్ళతోగాని అల్లిన పళ్లెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66. (తె. 7).

పలుకు: ఉ. పల్కు-; 1. పర్యా. దాలెం(6), బడుము (4), మూడీనెల దాలెం. రెండుమూడు పేళ్ళ మందంగల వెదురుబద్ద; చూ. పేడు. (తె. 22, 24); 2. పర్యా. అంచు (2), ఓడ్క (3), చీరిక, బిల్క, వార(2), సరుము (2), సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా బద్ద వెడల్పులో సగానికి చీల్చినభాగం (గడలో ఎనిమిదో భాగం); దీన్నుంచి పేడుతీస్తారు;

వేలెడు వెడల్పు ఉంటుంది. (కో. 13; తె. 6, 7, 17, 20, 25); **3.** పర్యా. దాలెం (1), సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా రెండుమూడు చీలికలుగా చీల్చగా వచ్చినది; బద్దంత వెడల్పు (రెండుమూడు వేళ్ళపాటి) ఉంటుంది; గావె, మూసగంప మొ॥వాటి అల్లకానికి పనికొస్తుంది. (తె. 30, 31). **4.** ఈనె (చూ.)లు తియ్యడానికి సరిపోయిన మందంలో వెదురుబద్దనుంచి చీల్చితీసిన భాగం. (కో. 16); **5.** సరుములోగాని, వారలోగాని నిలువుగా చీరిన సగం భాగం. (తె. 21). **6.** పర్యా. చూ. సీర్వ. నిలువుగా సగానికి చీల్చిన గోవ (చూ.)లో ఒకభాగం; దీన్ని ఐదారుకఱ్ఱ (చూ.) లుగా చీల్చవచ్చు. (తె. 24). **7.** పర్యా. చూ. మందంపేడు. గోరు మందంకన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 12). **8.** పర్యా. చూ. నిలుగు (2). గంప, తట్ట, బుట్ట, సజ్జ బుట్ట మొ॥వాటి అల్లకంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగా వేసిన మందంపేడు; దీన్ని గంటిబద్ద నుంచి తీస్తారు. (కో. 8). **9.** పర్యా. చూ. బిలుకు (1). జల్లెడ అంచుకట్టడానికి వెలుపలనుంచి లోపలి గుండు చుట్టూవేసే రెండుమూడు వేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలిగుండుకూ బిలుకుకూ మధ్యన కల్లెడతట్టు చివర్లు (కర్సద) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండు బద్దలపైనా మరో మందంబద్ద (కఱ్ఱ) ఉంటుంది. చూ. చిత్రం 30. క. 3. (తె. 18); **10.** ఈతాకును ఈనెదగ్గర చీల్చగా వచ్చినపాయ; ఇలాటివి రెండుంటాయి. (తె. 21); **11.** పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దడుగూ అడుగూ అల్లడానికివాడే సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండుభాగాలుగా నిలువుగా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (కో. 17).

పలుకుపేడు: పర్యా. చూ. మందంపేడు. గోరు మందంకన్న ఎక్కువ మందగానూ కొంచెంవెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 14).

పలుకుబట్టు: (క్రి.) పర్యా. చూ. కరిపించు(2). పేడు చీరేటప్పుడు వార (=వేలెడు వెడల్పుబద్ద) లేదా పలుకు మొదటిభాగంలో ఒక అంగుళం పొడుగువరకు వరసగా పేళ్ళు చీరిఉంచడం; కొత్తగా పని నేర్చుకొనేవాళ్ళకు ఇలా చీలి ఇస్తారు; ఆ తరవాత బద్దచీరడం సులువవుతుంది. (కో. 3).

పలుకు(ల)తడక: ఉ. –తడిక; పర్యా. చూ. మోటుతడక. మందంగానూ బద్దవెడల్పుగానూ ఉన్న పేడుతో (మోటుగా) అల్లినతడక; నిలువుకూ అడ్డానికీ పేడే వాడతారు. (కో. 12, 17).

పలుగు: (క్రి.) చూ. పగులు. (తె. 18).

పలుపు: **1.** పర్యా. కన్నె(4). పశువులమెడకు వేసి గుంజకు కట్టేసేతాడు; సుమారుగా గజంపొడుగూ మూడువేళ్ళ లావూ ఉంటుంది; తాడురెండు చివర్లా రెండు పాయలుగా ఉంటుంది; ఒకపాయకు చివర ముడి మరొక పాయకుచివర కొలికి ఉంటుంది; తాడును పశువుమెడకు తగిలించి ఒకపాయ చివర ముడిని రెండోపాయ చివరికొలికిలోకి దూరుస్తారు; తాడుకు రెండోవైపుండే భాగాన్ని గుంజకుకడతారు; కొన్నిరకాల కన్నెలకు పొడుగుతాడు మధ్య ముడి వేసిన అతుకు ఉంటుంది; చూ. చిత్రం 145. (కో. 5. 19, 29, 30; రా. 5); **2.** ఎద్దుమెడకు కాడికలిపి కట్టడానికుపయోగించే తాడు; దీనికి ఒక చివర ముడీ మరొకచివర తిమ్మి (చూ. తిమ్మి) ఉంటాయి; ఈతనార, తాటినారలతో పేంతారు. (తె. 9).

పల్లిక: ఒకరకం తట్ట; చూ. ఉప్పరపల్లిక. (కో. 12).

పల్లీలు: (బ.) చేపలుపట్టేవాళ్ళలో ఒకతెగ; వీళ్ళకూ జాలర్లకూ కంచంపొత్తేగాని మంచంపొత్తు లేదట. (కో. 29).

పళ్ళబుట్ట: పర్యా. టేబుల్‌బాస్కెట్. పళ్ళుపెట్టుకొనే బుట్ట; దారాల్లాంటి సన్నటి వెదురుపుల్లలతో అల్లుతారు; రెండుబెత్తల ఎత్తు జేనెడు వెడల్పూ ఉంటుంది; కొన్నిటికి మట్టు(గద్దె) ఉంటుంది. (కో. 5).

పళ్ళెంకప్పు: ఉ. పల్లెం–; పర్యా. చూ. మూత(1). చేతిబుట్ట (మూతబుట్ట, కమాన్‌బుట్ట) మూయడానికి వెదురుపేళ్ళతో అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; కొన్నిబుట్టలకు దీన్నిబోర్లావేసి పేస్తారు. కొన్నిటికి వెల్లకిలా వేస్తారు. చిత్రం 59.1. (కో. 28).

పళ్ళెంకొయ్య: ఉ. పల్లెం–; సజ్జబుట్ట మూతకు నిలువుగా దోపిన వెదురుబద్ద. (కో. 28).

పవిడికాయ: పచ్చికొబ్బరికాయ. (కో. 30).

పసక: ఉ. పస్క; చూ. పసరుగఱ్ఱ(1). (తె. 16).

పసకకఱ్ఱ: ఉ. పస్క–; చూ. పసరుగఱ్ఱ. (తె. 15, 16).

పసకపేడు: ఉ. పస్క-; చూ. పసరుపేడు. (తె. 15, 16).

పసకరాజులకు వెళ్ళు: (క్రి.) ఉ. పస్క-; వనభోజనానికి వెళ్ళడం. (తె. 20).

పసర: చూ. పసరు(1). (కో. 11, 16-18).

పసరతుకు: ఉ. పసరత్కు-; పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (తె. 20, 21, 25).

పసరాకు: ఉ. పొసురాకు; పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (రా. 1).

పసరానె: ఉ. పసురానె; చూ. పసరీనె(2). (కో. 26).

పసరీనె: ఉ. పసిరీనె, పసురీనె; **1.** పర్యా. చూ. పసరుగఱ్ఱ. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చిన కఱ్ఱ (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగుచుట్టడానికి గంప ఎత్తుభాగంలో బెండుకఱ్ఱవరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికి వాడతారు. చూ. చిత్రం 53.1. (కో. 5; రా. 4); **2.** రూ. పసరానె, పసరేన; పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (కో. 23, 28-31).

పసరు: ఉ. పసురు, పొసురు; **1.** రూ. పచ్చ, పసక, పసర; పర్యా. పైపసరు, పొర, వెదురుపచ్చబద్ద నురగ. వెదురుగడ పచ్చిగా ఉన్నప్పుడు చుట్టూ ఉండే ఆకుపచ్చనిపొర; నున్నగా మెత్తగా ఉంటుంది; పసిపిల్లల అజీర్ణవ్యాధికి మందుగా వాడతారు. (కో. 6-8, 10, 15, 19-21, 25, 29; తె. 19, 21, 22, 23, 26, 27; రా. 1, 3); **2.** పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (రా. 3).

పసరుకట్టు: ఉ. పసురు-; పర్యా. పచ్చబిలుకు, పసరుబిలుకు. వెదురుబద్దకు పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంనుంచి చీరినబద్ద (కట్టు); దీన్ని చేటకు లోపలా బయటా అంచుచుట్టూ పెట్టి బిగిస్తారు. (తె. 18, 19, 21-23; రా. 10).

పసరుకంటం: (< సం. -కంఠం) పర్యా. పసరుగుండు(2). జల్లెడ అంచుకట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండు చుట్టూవేసే రెండుమూడు వేళ్ళ వెడల్పు పసరుబద్ద (చూ.); ఈ లోపలిగుండుకూ బిలుకుకూ మధ్య జల్లెడతట్టు (చూ.) చివర్లు(కర్నెడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండుబద్దలపైనా మరో మందం బద్ద (కఱ్ఱ) ఉంటుంది. (రా. 7).

పసరుకిందానె: చూ. పసరుకిందీనె. (కో. 26).

పసరుకిందిఅతుకు: ఉ. -కిందత్కు-; పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 25).

పసరుకిందికఱ్ఱ: పర్యా. కంపపబ్బ(2), కంపపేడీనె, తెలుపువార, తెల్లకఱ్ఱ(1), తెల్లీనె, పసరుకింది జోడెం, పొట్టీనె(2). బెండీనె(2), బెండుకఱ్ఱ (3). వెదురుబద్దకు పైన నున్నగా పచ్చగా ఉండే(పసరు) భాగం కిందినుంచి తీసినకఱ్ఱ; చూ. కఱ్ఱ. (తె. 23; రా. 8).

పసరుకిందిజోడెం. పర్యా. చూ. పసరుకిందికఱ్ఱ. వెదురుబద్దకు పైన నున్నగా పచ్చగా ఉండే(పసరు) భాగం కిందినుంచి తీసిన కఱ్ఱ; చూ. కఱ్ఱ. (తె.18).

పసరుకిందిపేడు. ఉ. పసర్కింది , పసురు-; పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండేభాగానికి కింది నుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 3, 18; తె. 18, 30; రా. 8).

పసరుకిందిబెరె ఉ. పసరు-; పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 22, 23).

పసరుకిందీనె: (< పసరుకింది + ఈనె) రూ. పసరుకిందానె; పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (కో. 28, 30).

పసరుగఱ్ఱ: ఉ. పసరు ; రూ. పసకకఱ్ఱ.; పర్యా. జోడెం(1). దాలెంకఱ్ఱ, పచ్చకఱ్ఱ, పచ్చపేడీనె, పచ్చబడుము, పచ్చీనె(1), పసరీనె(1), పసరుజోడెం, పసరువార, పీపుకఱ్ఱ, వెన్నుగఱ్ఱ(1). వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్న బద్దచీల్చగా వచ్చినకఱ్ఱ (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగు చుట్టడానికి గంప ఎత్తుభాగంలో బెండుకఱ్ఱ వరస తరవాత అందం కోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికి

వాడతారు. చూ. చిత్రం 53. 1. (తె. 17, 20-23, 25; రా. 8, 10).

పసరుగీరు: (క్రి.) వెదురుగడచుట్టూ ఉండే పసరు (= ఆకు పచ్చపొర)ను కత్తితో గీకడం. (కో. 16).

పసరుగుండు: 1. పచ్చగా నున్నగా ఉన్న పెండు (చూ.); జల్లెడఅంచు కట్టడానికి లోపలిభాగంలో తట్టు (చూ.) మీద ఉంచేది; దీన్ని బద్దకు పసరు భాగం వైపునుంచి తీస్తారు; దీనికి వెలుపలినుంచి ఒకబద్దా, ఈ రెంటిమీంచి ఇంకో బద్దావేసి అంచు పూర్తిచేస్తారు. (తె. 21, 22); 2. పర్యా. పసరు కంటం. జల్లెడఅంచు కట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండు చుట్టూవేసే రెండుమూడు వేళ్ళ వెడల్పు పసరుబద్ద (చూ.); ఈ లోపలిగుండుకూ బిలుకుకూ మధ్య జల్లెడతట్టు (చూ.) చివర్లు(కర్పెడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండు బద్దలపైనా మరో మందంబద్ద (కఱ్ఱ) ఉంటుంది. (తె. 25).

పసరుగూడ: పసరుపేడుతో అల్లినగూడ; చూ. గూడ. (కో. 10).

పసరుగోవ: ఉ. పసురు –; వెదురుబద్దకు పైన పచ్చగా నున్నగాఉండే భాగంతో కలిపి తీసినగోవ; చూ. గోవ. (కో. 22).

పసరుజోడెం: ఉ. పసరు–; 1. పర్యా. చూ. పసరు గఱ్ఱ, వెదురుగడకు పైన పచ్చగా నున్నగాఉండే భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకఱ్ఱ (చూ.); గంప మొ॥వాటి అల్లకంలో అడుగు చుట్టడానికీ గంప ఎత్తుభాగంలో బెండుకఱ్ఱ వరసతరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53.1. (తె. 18); 2. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంవైపు వచ్చే కఱ్ఱ (చూ.) ల జత. (తె. 24).

పసరుతడక: ఉ. పసర్తడికె, పసురుతడ్క–; పర్యా. పచ్చతడక, వీపుతడక(1), వెన్నుపేడుతడక. కేవలం పచ్చపేడు (= పైభాగం పచ్చగా నున్నగా ఉన్న వెదురుపేడు)తో అల్లిన తడక; దీని ధర ఎక్కువ. (కో. 7, 10; తె. 31).

పసరుదబ్బ: ఉ. పసరు–; 1. పచ్చబద్ద(1), పసరు పెండె, పైబద్ద(1), వీపుదబ్బ(1). పసరువన్నెలో నున్నగా ఉండే పైభాగంతో వచ్చిన వెదురుబద్ద. (కో. 1, 3, 5, 30; తె. 26; రా. 9-11); 2. పర్యా. చూ. వెన్నుదబ్బ. ఈతకమ్మ వెన్ను (చూ.) చీరి తీసినబద్ద; గంప మొ॥వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. చూ. చిత్రం 11. 4. (రా. 8).

పసరుదబ్బజల్లు: పర్యా. పచ్చపేడుజల్లు. వెదురుబద్దకు పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంనుంచి తీసిన పలచటిపేడుతో అల్లిన బండిజల్లు. (రా. 8).

పసరుదాలెం: ఉ. పసరు–; పర్యా. వెన్నుపలుకు. వెదురుబద్ద పసరుభాగం (పచ్చగా నున్నగా ఉండేది) తో బద్ద వెడల్పుగా తీసిన దాలెం; చూ. దాలెం (కో. 22, 23, 25, 27, 31).

పసరుపాసిక: బద్దలో పసరుభాగంనుంచి తీసిన పాసిక; చూ. పాసిక. (కో. 29).

పసరుపెండె: ఉ. పసురు -; పర్యా. చూ. పసరు దబ్బ(1). పసరువన్నెలో నున్నగాఉండే పైభాగంతో వచ్చిన వెదురుబద్ద. (రా. 2).

పసరుపేడు: ఉ. పసర్–, పసరుబేడు, పసుర్ , పొసురు; రూ. పసకపేడు; పర్యా. దాలెంపేడు; పచ్చపేడు, పచ్చబద్దీగె, పచ్చీనె(2), పసరతుకు, పసరాకు, పసరీనె (2), పసరు (2), పసరుబెండు, పసరుబేరె, పైపేడు (1), వీపుపేడు, వెన్నుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (కో. 1, 3, 5, 7, 9, 10, 13, 15; తె. 4, 6, 13, 14, 17, 26, 31; రా. 1, 2, 6, 7-10).

పసరుపొట్టె: తాటిమట్ట మీద పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంతో కలిసిఉన్న నార; చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (తె. 27).

పసరుబిలుకు: పర్యా. చూ. పసరుకట్టు. వెదురుబద్దకు పచ్చగా నున్నగా ఉండే (పసరు) భాగంనుంచి చీరిన బద్ద(కట్టు); దీన్ని చేటకు లోపలా బయటా అంచుచుట్టూ పెట్టి బిగిస్తారు. (తె. 24).

పసరుబెండు ఉ. పసురు –; పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగానున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (రా. 3).

పసరుబేరె: పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగానున్నగా ఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (తె. 22-24).

పసరుబొంగు: ఉ. పొసురు–; పర్యా. కాకివెదురు(2) పసరుదనం ఉండే వెదురుగడ; లేతగా ఉంటుంది. (తె. 27; రా. 1).

పసరువరస: ఉ. పొసురు–; వెదురుపేళ్ళగంప అల్లకంలో పచ్చపేడుతో అల్లిన ఒకవరస. (రా. 3).

పసరువొర: ఉ. పసురు –; పర్యా. చూ. పసరుగఱ్ఱ. వెదురుగడకు పైన పచ్చగానున్నగా ఉండే

భాగమున్న బద్ద చీల్చగా వచ్చినకఱ్ఱ (చూ.) గంప మొ॥వాటి అల్లకంలో అడుగుచుట్టడానికీ గంప ఎత్తుభాగంలో బెండుకఱ్ఱ వరస తరవాత అందంకోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53.1. (కో. 23, 27, 31).

పసరుసలుగు: ఉ. పసుర్సల్గు; వెదురుగడమీద పచ్చగా నున్నగాఉండే భాగంతోకలిపి తీసిన సలుగు; చూ. సలుగు. (తె. 28).

పసరేన: చూ. పసరీనె. (కో. 22).

పసాదంగంప: (< సం. ప్రసాదం—) పర్యా. పసావుతట్ట. అన్నం ఆరబోయడానికి వాడే గంప; ఈతపేళ్ళతో అల్లినది. (తె. 14).

పసావుతట్ట: రూ. పసువుతట్ట; పర్యా. పసాదంగంప. అన్నం ఆరబోయడానికి వాడే గంప; ఈతపేళ్ళతో అల్లినది. (తె. 14).

పసిమి: 1. పర్యా. చూ. పచ్చి. తడి ఆరని; అటువంటిస్థితి. (రా. 2). 2. పసుపురంగు; చాపల నేతకు వాడే నారకువేస్తారు (కో. 3).

పసునుచేయు: (క్రి.) పర్యా. చదరంజేయు. జవురు (2), వెదురుగడకు గంటిగనుపులు ( కొమ్మలు కొట్టేసినచోట మిగిలినవి) లేకుండా కత్తితో నున్నగా చెక్కేయడం. (రా. 9).

పసుపురకంపేము: ఉ. పస్పు ; బరువుగా ఉండే మేలిరకంపేము; పసుప్పచ్చగా ఉంటుంది.(కో.12).

పసుప్పచ్చబొంగు: (< పసుపు + పచ్చ —) పసుప్పచ్చరంగులో ఉండే వెదురుగడ. (తె. 8).

పసుప్పెట్టె: (< పసుపు + పెట్టె) ఉ. పసుప్పెట్టీ; పర్యా. చిట్టిపెట్టె, బల్లపసుప్పెట్టె. పెళ్ళి ఆయిన కొత్తలో అమ్మాయిలు అత్తగారింటికి పసుపుకుంకుమలు తీసుకుపోవడానికి పెట్టుకొనే చిన్న పెట్టె. (కో. 25, 29).

పసువుతట్ట: చూ. పసావుతట్ట. (తె. 14).

పాకం: కాగేనీళ్ళలో రంగూ తుంగా వేసినతరవాత తుంగకు రంగుపట్టేటంతగా ఉడికినస్థితి. (కో. 8).

పాకూర్: పర్యా. చూ. కంకమసి (2). వర్షానికితడిసి ఎండిన ముదురు వెదురుగడమీద ఏర్పడే నల్లటి పొడి. (తె. 16).

పాచిపోవు: (క్రి.) ఉ. పాసి—; నీళ్ళలో ఊరేసిన కొబ్బరిదొక్క మురిగిపోవడం; పాచిపట్టడం. (కో. 5).

పాటపాడు: (క్రి.) లెక్కగట్టడం. (తె. 1).

పాటల్లకం: (< పాటు + అల్లకం) పేముకుర్చీలకు పేడుతో అల్లే ఒక విధానం. (కో. 12).

పాడె: పర్యా. ఇమాలం, చాపుకట్టె, పాడెకట్టె (1). శవాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళడానికి వెదురుగడలతో కట్టినది; చూ. చిత్రం 100. (కో. 2; తె. 24).

పాడెకట్టె: 1. పర్యా. చూ. పాడె. శవాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళడానికి వెదురుగడలతో కట్టినది; చూ. చిత్రం 100. (తె. 10, 15, 26; రా. 2); 2. శవాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళే పాడెకట్టడానికి వాడే వెదురుగడ. (కో. 9; తె. 24, 31).

పాతకఱ్ఱ: 1. పర్యా. చూ. పంటబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥రంగుల్లో ఉంటుంది; ఎండినతరవాత తెలుపురంగులోఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (కో. 20); 2. పర్యా. చూ. పంటకఱ్ఱ (1). వెదురుధాన్యం కాసినగడ; మొక్కమొలిచినతరవాత సుమారు 20 సం॥లకు కాపుకొస్తుంది; ఇంటి వాసాలకూ గోడలకూ పనికొస్తుంది; (కో; 27).

పాదం: 1. మచ్చిక, మానె మొ॥ వాటి బొడ్డుడుగు; ఉబ్బెత్తుగా ఉంటుంది. (కో. 28, 30); 2. పర్యా. చూ. గద్దె (2). కాయితాలబుట్ట, చేతిబుట్ట, పూలబుట్ట, కంతబుట్ట మొ॥వి నేలమీద నిలబడడానికి వీలుగా అల్లిన అడుగుభాగం; కొంచెం ఎత్తుగా సమతలంగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 1. (కో. 1, 3), 3. వెదురుచాప అల్లకంలో నిలువుగా ఒకపేడూ అడ్డంగా పన్నెండువేళ్ళూ వేసి అల్లిన మొదలు. (కో. 28).

పాదంమట్టు: (క్రి.) చేట అల్లకంలో కొమ్ము (చూ.) పెట్టకముందు ఈనెలతో కొంతమేరకు అల్లడం; కాలితో తొక్కిపట్టి అల్లుతారు. (కో. 31).

పాన్పుడబ్బ: పర్యా. చూ. పరుపుబద్ద. వెదురుమంచం తయారీలో అడ్డంగాకొట్టిన గడల బిగింపుకోసం నిలువుగా కొట్టిన వెదురుబద్ద. చూ. చిత్రం 108.3

పాన్పువేయు: (క్రి) ఉ. పాన్పేయు; కలబంద నార పట్టల్ని వరసగా పక్క (పాన్పు)లా పరవడం. (రా. 10).

పాపు: (క్రి.) పర్యా. ఒత్తు(1), పట్టు, లాగేయు, లేపు, భాగాలుగా విడదీయడం; వెదురుగడనుగాని బద్దనుగాని ఒకచివర కత్తితోచీల్చినతరవాత ఒకపాయకాలికింద తొక్కిపట్టి రెండోపాయ చేత్తోపట్టి లాగుతూ

గాని రెండుబద్దల్నీ రెండుచేతులతో విడదీస్తూగాని వేరుచేస్తారు. (తె. 6, 17, 20–22, 24, 25, 30; రా. 9–11).

పాము: (క్రి.) చూ. బాము (1). (తె. 17, 18).

పాములపెట్టె: పర్యా. పాంబుట్ట, పాముల నాడించే వాళ్ళు పామునుపెట్టే గుండ్రటిపెట్టె; చూ. చిత్రం 63. (కో. 29).

పాముపంకబొంగు: ఉ. పాముంక–; పర్యా. చూ. పంకకర్ర(2). ప్రతి కణుపుదగ్గరా వంపుతిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 19).

పాములవాళ్ళు: ఉ. పాములోల్లు; పాముల్ని ఆడించు కొని బతికే ఎరకలివాళ్ళు; ఒకతెగ. (కో. 4).

పాంబుట్ట: పర్యా. పాములపెట్టె. పాములనాడించే వాళ్ళు పామునుపెట్టే గుండ్రటిపెట్టె; చూ. చిత్రం 63. (కో. 9).

పాయ: 1. తాటికమ్మ నిలువుగా చీరినప్పుడు సగభాగం. (కో. 23, 26); 2. తాటిచీపురు (పొరక) వెడల్పు భాగంలోని ఒకపాయ; వెడల్పుభాగం వైపు కట్టు కట్టడానికి మూడు పాయలుగా పాపిపురితో కట్టు గడతారు. (తె. 9).

పాయల్‌గుల్ల: పర్యా. మూడెట్లాలగుల్ల. ఆరుకిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గంప. (తె. 22).

పారకాము: పారకు తొడిగిన వెదురుకర్రముక్క. (తె. 10).

పారతి: (< పార్వతి) మేదరివాళ్ళ కులదేవత. (తె. 21, 24).

పార్టిజన్‌జేలీలు: (< ఇం. Partition–) పేము తడక; మరుగుకోసం గదులమధ్య అడ్డంగా నిలబెడతారు. (తె. 22).

పార్సెలుగంప: పర్యా. చూ. కోళ్ళపార్సెల్ గంప. వ్యాపారం చేసేవాళ్ళ కోళ్ళను తీసుకుపోవడానికి వాడే వెదురు లేదా ఈతపేళ్ళగంప; జేనెడు ఎత్తూ గజం వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది; కోళ్ళను లోపలికి వేయడానికి పైన తెరిచి ఉంటుంది; కొన్ని ఇదే రూపంలో ఇంకా ఎత్తుగా ఉంటాయి; మరికొన్ని జేనెడున్నర వెడల్పూ రెండుమూరల ఎత్తూ ఉంటాయి. (కో. 9).

పాలగడ్డ: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడలోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్ట వ్యాధినివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్ల తిరుమనిగార, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలుకగాని పగిలినప్పుడు దీన్ని తేనెలో కలిపిరాస్తే తగ్గుతుంది. (తె. 10).

పాలగంప: 1. పర్యా. పాలగుల్ల, పాలబుట్ట. గొల్లవాళ్ళు పాలముంతలు పెట్టుకొని తీసుకువెళ్ళే తట్ట; తలమీద ఆనడానికి వీలుగా అడుగు సమతలంగా ఉంటుంది. (తె. 9, 12. 31); 2. పర్యా. చూ. పెళ్ళికూతురు గంప. పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టడానికి అల్లే వెదురుగంప; కింద నాలుగుమూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది; కొన్నిచోట్ల దీని అంచు చుట్టూ చేటకట్టు (= వెదురుబద్దలతో బిగింపు)లాంటి కట్టు ఉంటుంది; కొన్నిచోట్ల ఏమీ ఉండదు; పెళ్ళికి ముందు గౌరీపూజ చేసేచోట పెళ్ళికూతుర్ని అందులో కూర్చోబెడతారు; పూజఅయి ప్రవరలు చెప్పిన తరవాత పెళ్ళికూతురు కూర్చున్న గంపను పెళ్ళిమండపంలోకి ఎత్తుకువస్తారు; పెళ్ళి (ముహూర్తంవేళ జరిగే తతంగం) అయ్యేవరకు పెళ్ళికూతురు ఆ గంపలోనే ఉంటుంది. (కో. 10, 14, 15; తె. 9); 3. తలంబ్రాలు కిందపడకుండా పెళ్ళికూతురికీ పెళ్ళికుమారుడికీ మధ్య ఉంచే గంప; వెలమలు, రెడ్లు మొ॥వారు వాడతారట. (తె. 6).

పాలగుల్ల: పర్యా. చూ. పాలగంప(1). గొల్లవాళ్ళు పాలముంతలు పెట్టుకొని తీసుకువెళ్ళేతట్ట; తలమీద ఆనడానికి వీలుగా అడుగు సమతలంగా ఉంటుంది. (తె. 26).

పాలగొట్టం: లోపల బోలుగా ఉన్న వెదురుగడముక్క; అరగజం పొడుగుంటుంది; పెళ్ళికి సారెపెట్టేటప్పుడు ఇది కూడా ఇస్తారు. (తె. 9).

పాలబుట్ట: పర్యా. చూ. పాలగంప(1). గొల్లవాళ్ళు పాలముంతలు పెట్టుకొని తీసుకువెళ్ళే తట్ట; తలమీద ఆనడానికి వీలుగా అడుగు సమతలంగా ఉంటుంది. (తె. 7, 12).

పాలవెల్లి: పర్యా. పాలపెల్లితడక, పాలి, పూదడక. వినాయకచవితి మొ॥ పండుగలప్పుడూ వ్రతా

లప్పుడూ పూజాపీఠానికి ఒకటి రెండడుగుల ఎత్తున కట్టే బద్దల తడక; సుమారు మూరెడు చదర ముంటుంది; దీనికి పూలూ పళ్ళూ మొ॥ వేలాడ గడతారు; చూ. చిత్రం 92. (కో. 10, 14, 19, తె. 8, 26-28).

పాలవెల్లితడక: పర్యా. చూ. పాలవెల్లి. వినాయకచవితి మొ॥ పండుగలప్పుడూ వ్రతాలప్పుడూ పూజా పీఠానికి ఒకటి రెండడుగుల ఎత్తునకట్టే బద్దలతడక; సుమారు మూరెడు చదరముంటుంది; దీనికి పూలూ పళ్ళూ మొ॥ వేలాడగడతారు; చూ. చిత్రం 92. (తె. 26-28).

పాలి: పర్యా. చూ. పాలవెల్లి. వినాయకచవితి మొ॥ పండుగలప్పుడూ వ్రతాలప్పుడూ పూజా పీఠానికి ఒకటి రెండడుగుల ఎత్తున కట్టేబద్దల తడక; సుమారు మూరెడు చదరముంటుంది; దీనికి పూలూ పళ్ళూ మొ॥ వేలాడగడతారు; చూ. చిత్రం 92. (కో. 25).

పాలు: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడలోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహ రోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలుకపగిలినప్పుడు తెల్ల తిరుమనిగౌర, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (కో. 23).

పావురాళ్ళగూడు: పావురాయి ఉండడానికి తయారు చేసిన వెదురుగూడు. (కో. 9).

పాసిక: 1. పర్యా. నిలుకు(12) మామూలు వెదురుపేడు కన్న మందంగా ఉండేపేడు; గంపమానె మొ॥ వాటికి నిలువులుగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 50.2. (కో. 30); 2. చూ. పాసికం (కో. 25, 28, 29, 31).

పాసికం: ఉ. పాశికం; రూ. పాసిక(2); పర్యా. చూ. నిలుగు(2). గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లికంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగా వేసిన మందంపేడు; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (కో. 19, 20, 22. 27).

పిచ్చె: ఉ. పిచ్చి; పర్యా. చూ. గనుపసందు. వెదురు గడకు రెండు కణుపులమధ్య భాగం; కొన్నిటికి పొడుగ్గానూ కొన్నిటికి పొట్టిగానూ ఉంటుంది. (రా. 1-3).

పింజరంమూత: కోళ్ళపంజరం ద్వారాన్ని మూసేది, చతురస్రాకారంలో సుమారు జేనెడేసి పొడుగూ వెడల్పూ ఉంటుంది. (తె. 17).

పిటింగ్: (<ఇం. Fitting) పేముకర్రల్ని చేయ వలసిన వస్తువు ఆకారంలో బిగించడం. (కో. 11).

పిట్టకనుపు: పర్యా. చూ. గంటిగనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరుపునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1. (కో. 21).

పిట్టకనుపువెదురు: పర్యా. చూ. పూసగనుపుకర్ర. కొమ్మనరికేసినప్పుడు కణుపుదగ్గర చిన్న గుర్తుపడే వెదురుగడ; కణుపుదగ్గర పెరిగే కొమ్మ సన్నగా ఉండడంవల్ల దాన్ని నరికినప్పుడు సన్నటిగుర్తు పడుతుంది; దీన్ని చీల్చడం సులువు. (కో. 22).

పిట్టకర్ర: పర్యా. చూ. వంకకర్ర(1). పాముపడగ మాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసినట్లు మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (కో. 30).

పిట్టగుంపు: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలావుగా ఉండడంవల్లగాని ఒకే చోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్ల గాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాంటి కణుపు ఉన్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 24).

పిట్టగుంపుకర్ర: పర్యా. చూ. చిప్పగనుపుకర్ర. వెదురుకొమ్మ నరికేసినప్పుడు కణుపుదగ్గర పెద్ద గుర్తు వెడల్పుగా ఉన్న వెదురుగడ; కణుపుదగ్గర పెరిగిన కొమ్మలావుగా ఉన్నప్పుడుగాని కణుపు దగ్గర చుట్టూరెండుమూడు కొమ్మలు పెరిగినప్పుడు గాని వాటిని నరికేస్తే వెడల్పుగా గుర్తుపడుతుంది; ఈ బొంగును చీల్చడం కష్టం; కణుపుదగ్గర పేడు విరిగిపోతూంటుంది. (కో. 24).

పిట్టగూడు: పిట్టల్నిపట్టి వేసుకొనే చిన్నబుట్ట,

(కో. 23. 24).

పిట్టపోటు: పక్షులు (పిట్టలు) పొడవటంవల్ల వెదురు గడకు పడ్డ చిల్లి. (కో. 13).

పిట్టపోటుకఱ్ఱ: పర్యా. పిట్టపోటుబొంగు. పిట్టలు మొ॥ కొట్టడంవల్ల రంధ్రాలుపడిన వెదురుగడ; లేతప్పుడు వెదురు తియ్యగా ఉండడంవల్ల పిట్టలు మొ॥ కొరుక్కు తింటాయి; మేదరిపనికి ఉపయోగ పడదు. (కో. 3, 4).

పిట్టపోటుబొంగు: పర్యా. పిట్టపోటుకఱ్ఱ. పిట్టలు మొ॥ కొట్టడంవల్ల రంధ్రాలుపడిన వెదురుగడ; లేతప్పుడు వెదురు తియ్యగా ఉండడంవల్ల పిట్టలు మొ॥ కొరుక్కుతింటాయి; మేదరిపనికి ఉపయోగ పడదు. (కో. 7; రా. 7, 9, 11).

పిట్న: పర్యా. చూ. ఉండ(1). కొబ్బరితాడుచుట్ట; బంతిలా గుండ్రంగాగాని మూరెడు పొడుగున చెక్రంలాగాని చుట్టినది. (కో. 30).

పిడి: **1.** మేదరికత్తి, ఎరకలికత్తి (కొడవలి), చుర కత్తి మొ॥వాటి కాడకు తొడిగిన కఱ్ఱతొడుగు. చూ. చిత్రం 16 చ. 2, 118.1; (కో. 1, 3, 4, 25, 28; తె. 7, 9, 11, 13, 14, 16, 17, 20, 29; రా. 3, 4, 6, 8-10); **2.** పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కఱ్ఱలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్ని టికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క. 1. (కో. 1, 2, 12, 28; తె. 1, 4, 15, 16; రా. 2-5, 7-11); **3.** పర్యా. చూ. పడగ (1). అంబు (చూ.)కు వెడల్పుగా ఉన్నభాగం; పాముపడగ, బరిసె, మొ॥వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండేబిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; పేడు తెంపడానికీ చిల్లులు పొడవడానికీ పని కొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి; కొన్ని మొండిగా ఉంటాయి; కాడకొనతో చిల్లులు పొడవ డానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు. (కో. 2, 3, 5, 8-12; రా. 4, 5, 8); **4.** పర్యా. చూ. తొడిమె (4). మొనదేలకుండా పలకగా ఉండే అంబు (చూ.) కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ వేలెడుగాని రెండువేళ్ళుగాని వెడల్పూ ఉంటుంది; ఇలాంటి కొడగల అంబుకుండే పడగ భాగం మొనదేలి ఉంటుంది; చిల్లులు పొడిచేటప్పుడు ఈకాడ పట్టుకొంటారు. (తె. 5, 16, 28; రా. 2, 5); **5.** ఉలి పట్టుకోడానికి పైన బిగించిన కొయ్య తొడుగు. చూ. చిత్రం 20 క. 1. (తె. 15, 19); **6.** చెరకునిచ్చెన తయారీలో పైభాగం మూడు కాళ్ళను కలిపే అడ్డపట్టె; ఒక అడుగు పొడు గుంటుంది. (తె. 16); **7.** సుమారుగా పిడికిట్లో పట్టేంత ఈత, తాటి మొ॥వాటి నారకట్ట. (తె. 9); **8.** లెక్కప్రకారం కట్టకట్టిన కొంతజమ్ము "ఒక మోపులో నాలుగు పిళ్ళుంటాయి'. (రా. 2); **9.** పర్యా. పిడికిలి, ముట్టి (2). చేత్తో పట్టుకొనే చీపురు పైభాగం: మామూలుగా గుండ్రంగా ఉంటుంది; కొన్నిరకాల చీపుళ్ళకు కొంచెం పలకగా ఉంటుంది. చూ. చిత్రం 142.1 (తె. 21; రా. 8, 9); **10.** గొరసకత్తి (- పేము పనివాళ్ళు ఉపయోగించేది) పట్టుకోడానికి అమర్చినది; సుమారు మూరెడు పొడుగుంటుంది. చూ. చిత్రం 135.1 (కో. 3).

పిడికట్టు: **1.** గైకఱ్ఱకు అమర్చడానికి కొడవలి కాడ భాగాన్ని కఱ్ఱ చివరిభాగంతో కలిపి తాడుతో వేసిన కట్టు. చూ. చిత్రం 116.4 (తె. 21); **2.** పర్యా. కట్టు (13), పిడికిలికట్టు. చీపురుపిడిచుట్టూ నాలుగు వేళ్ళ వెడల్పున సన్నటి తాడుతోగాని పురితోగాని చుట్టి బిగించినది; చీపురు గట్టిగా ఉండడానికి చుడతారు (తె. 21; రా. 8, 9).

పిడికత్తి: పర్యా. చూ. మచ్చుకత్తి. కఱ్ఱపిడిఉన్న మేదరికత్తి; చూ. చిత్రం 12 ట. (తె. 17).

పిడికిలి: పర్యా. చూ. పిడి (9). చేత్తో పట్టుకొనే చీపురు పైభాగం; మామూలుగా గుండ్రంగా ఉంటుంది; కొన్నిరకాల చీపుళ్ళకు కొంచెం పలకగా ఉంటుంది. చూ. చిత్రం 142.1 (తె. 21).

పిడికిలికట్టు: పర్యా. చూ. పిడికట్టు (2). చీపురుపిడి చుట్టూ నాలుగువేళ్ళ వెడల్పున సన్నటి తాడుతో గాని పురితోగాని చుట్టి బిగించినది; చీపురు గట్టిగా ఉండడానికి చుడతారు. (తె. 21).

పిడిచివర: ఉ. – శివర; పర్యా. చూ. కొండి. మేదరి కత్తి, చురకత్తి మొ॥వాటి పిడిలోనుంచి బయటికి పొడుచుకువచ్చిన కాడకొన; కిందికివంగి ఉంటుంది. చూ. చిత్రం 16 చ. 1. (కో. 22).

పిడిదబ్బ: పర్యా. చూ. బద్ద (4). విసనగఱ్ఱ పట్టుకో డానికి అల్లకంలో ఒకఅంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపే ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 2).

పిడిమొన: పర్యా. చూ. ముక్కు (2). అంబు (చూ.)

పడగ చివరికోసు. చూ. చి(త్రం 15 క. 2. (రా. 5).

పిడివెలితి: ఉ. పిడెల్తి; పిడికిలి మందం తక్కువ. (తె. 9).

పిడెఅమ్ము: (< పిడి + అమ్ము) కాతభాగం మొనదేలి ఉండని అమ్ము (చూ.); పేడు తెంపడానికి మాత్రమే పనికొస్తుంది; చిల్లులు పొడవడానికి పనికి రాదు; చూ. చి(త్రం 15 ట. (తె. 28).

పిడెంచు: (< పిడి + అంచు) పర్యా. చూ. అంచు(6). ఎరకలికత్తి (కొడవలి) కట్టెపిడిచుట్టూ వేసిన ఇనప పట్టీ. చూ. చి(త్రం 118.2 (తె. 14).

పిడెం: రూ. పెడెం; పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురుగడలు పెరిగినపొద; ఒక చదరపుగజం నుంచి మూడునాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి, 200 గడల వరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాతగాని పొదలో ఒక వెదురుగడ కొట్టకుండా వదిలేసిన తరవాతగాని పొద కావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చి(త్రం 1. (కో. 22; తె. 26).

పిండి: **1.** పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (కో. 28); **2.** పర్యా. చూ. పేట పాయ; కొబ్బరి తాడు పేనేటప్పుడు రెండుగాని మూడుగాని నాలుగు గాని పాయలు పెనవేసి పేంతారు. (కో. 25)

పిండిగంప. పర్యా. పిండిగుల్ల, పిండిబుట్ట, జొన్నపిండి, బియ్యపిండి మొ॥ పోసుకొనేగంప; చిక్కగా అల్లుతారు. (రా. 10, 11).

పిండిగుల్ల: పర్యా. చూ. పిండిగంప, జొన్నపిండి, బియ్యప్పిండి మొ॥ పోసుకొనేగంప చిక్కగా అల్లుతారు. (తె. 13, 14, 16).

పిండిజల్లెడ; బియ్యప్పిండి మొ॥ జల్లించుకొనే జల్లెడ. (కో. 19; తె. 14).

పిండిపాలు: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లోమాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్ల తిరుమనిగొర, పైడిసత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలుకగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (తె. 27).

పిండిబుట్ట: పర్యా. చూ. పిండగంప. జొన్నపిండి, బియ్యప్పిండి మొ॥ పోసుకొనేగంప; చిక్కగా అల్లుతారు. (కో. 19).

పిండిరాయి: పర్యా. చూ. నూర్రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుం(డంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (కో. 24).

పిరాయించు: (< హిం. పిరానా) పర్యా. చూ. పీర్చు విడదీయడం; గంప మొ॥వాటి అడుగు అల్లేటప్పుడు జతగాపెట్టిన నిలువులను సగంఅకుగు అల్లిన తరవాత విడదీస్తారు. (తె. 16).

పిరికి: రూ. పిరికిలి; పర్యా. చూ. గొట్టం(1). విసనగ(ర కాడకు తొడిగిన వెదురుగడముక్క; లోపల గుల్లగా ఉన్నది; విసురుకొనేటప్పుడు సులువుగా ఉండడానికి ఇది తొడుగుతారు. చూ. చి(త్రం 31 ట. 1. (తె. 18, 31).

పిరికిలి: చూ. పిరికి. (తె. 27).

పిరికివిసనగ(ర: ఉ. పిరికిసనగ(ర; పర్యా. చూ. గొట్టక విసనగ(ర, సులువుగా తిప్పకోడానికి వీలుగా వెదురుగొట్టం తొడిగిన విసనగ(ర; చూ. చి(త్రం 31 ట. (తె. 18).

పిరిచిట్టెడుగుల్ల: ఉ. పిర్చిట్టెడు—; పావుకిలో ధాన్యం పట్టేగుల్ల. (తె. 22).

పి(రగుండు: పర్యా. అనుగుండు. కొడమ (చూ.) అడుభాగంలో వృత్తాకారంలో అమర్చిన వెదురుబద్ద. చూ. చి(త్రం 73 క. 5. (కో. 4).

పి(రతడక: ఉ. —తడికె; కొడమ దిగువభాగంలో అడుగును మూసేస్తూ కట్టిన వెదురుపుల్లల తడక; దీంట్లో కొంతభాగం తెరుచుకోడానికీ మూసుకోడానికీ వీలుగా ఉంటుంది. చూ. చి(త్రం 73 క. 6.(కో. 4).

పి(రబొద్దు: పర్యా. చూ. కిందికట్టు. గంప, గుమ్మి, తట్ట మొ॥వాటి అల్లికంలో అడుగు పూర్తిచేసి ఎత్తు భాగం అల్లడానికి నిలువులు వంచేటప్పుడు వేసే కట్టు చూ. చి(త్రం 47 క. 4. (రా. 3)

పిర్రమట్ట: తాటిమట్ట చెట్టుకు అంటుకొని ఉండేచోట వెనకవైపు ఉబ్బెత్తుగా (పిర్రలా) ఉండేభాగం. (తె. 9).

పిలిక: పర్యా. చూ. చిల్ల(1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ. దాదాపు వేలెడు లావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెరకర్రగానూ గాలంబరుగుగానూ వాడతారు; కొమ్మనరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది. (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కొ. 23).

పిల్ల: పర్యా. చూ. చిల్ల. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటి రెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెరకర్రగానూ గాలం బరుగుగానూ వాడతారు; కొమ్మనరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (కో. 24).

పిల్లకట్టు: చేట వెనకభాగంలో రెండుచిన్న కట్లతో మొదటచేసిన బిగింపు. (కో. 3).

పిల్లనగొయ్య: బోలుగా ఉండే సన్నటి వెదురుగొట్టం; పిల్లనగోవి; వేణువు. (తె. 10).

పిల్లపంగ: దుసేరుతీగకు పక్కన ఉండే చిన్నతీగ. (తె. 9).

పిల్లపాసికం: మూసగంప అల్లికంలో అడుగున కొలత తప్పిపోకుండా ఉండానికి పెట్టే దళసరిబద్ద; పొంగనిలుపు. (కో. 19).

పిల్లబరిగె: పర్యా. జంపుబర్ర. పొడుగ్గా ఉండే ఈతచువ్వ (బరిగె).

పిల్లలగూడి: పర్యా. కోడిపిల్లలగూడి. కోడిపిల్లల్ని కమ్మడానికుపయోగించే బుట్ట. (కో. 21).

పిల్లలగూడు: పర్యా. కొల్లం, గొర్రెపిల్లలగూడు, గొర్రెపిల్లలజల్ల, గొల్లగూడు, మేకలకొల్లం. తల్లులవెంట మేతకుపోలేని చిన్నచిన్న గొర్రెపిల్లలనూ మేకపిల్లలనూ కమ్మడానికి మందపాటి వెదురు బద్దలతో అల్లినది; బోర్లించిన గంట ఆకారంలో ఉంటుంది; పిల్లల్ని వేయడానికి ద్వారం ఏర్పాటు చేస్తారు; పిల్లలు ఇందులో నిలబడి మంద అందిస్తే తింటాయి; చూ. చిత్రం 77. (కో. 6; తె. 1; రా. 4, 9).

పిల్లలపొది: గొర్రెపిల్లల్ని వేయడానికి ఉపయోగించే జల్ల; గోపురంలాగా ఉంటుంది; ఒకకంత (గల్మ) లోంచి గొర్రెపిల్లల్ని లోపలికి వేస్తారు. (తె. 9).

పీకు: పర్యా. దబాయించు. చాపనేతలో పలక(చూ.)ను దగ్గరికి (నేతగాడు కూచున్న వైపుకు) కొట్టడం; చాపనేతలో జమ్మిపుల్లను పోగులమధ్య ఎక్కించిన తరవాత ఆ పుల్ల అంతకుముందున్న పుల్లలవరుసలో అమిరేటట్లు నేతగాడు జింకపలకను తలవైపు కొడతాడు. (రా. 6).

పీచు: ఉ. పీసు; 1. పర్యా. గురికిపీచు, చెత్త (1), తుక్కుచెత్త, దుగ్గు(1), నార(1), నుంగపీచు, పొట్టెలు, బొద్దు (5). వెదురుబద్ద, పేము చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగా ఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు. (కో. 2, 3, 5, 19, 21, 25, 30; తె. 12, 22; రా. 1, 3, 9, 11); 2. పర్యా. నార(5). కొబ్బరికాయతాట (చర్మం)కూ లోపలి పెంకుకూ మధ్య దట్టంగా పెరిగిన దారాల్లాటి పోచలు; కాయ ఒలిచి డొక్కలు చితగ్గొట్టి నానవేసి పీచుతీస్తారు; తాళ్ళు పగ్గాలూ మొ॥ పేనడానికీ గోదినీలు మొ॥ అల్లడానికీ దిండ్లు తయారు చెయ్యడానికి పనికొస్తుంది. (కో. 20, 21, 25, 29); 3. పర్యా. నార(2). ఈతచువ్వను చీల్చేటప్పుడు వచ్చే పనికిరాని పోగులు. (తె. 7).

పీచుపోగు: ఉ. పీసు—; పర్యా. ఏసు. కొబ్బరిపీచులో ఒక విడిపోచ; సన్నగా దారంలా ఉంటుంది; సుమారు జేనెడు పొడుగుంటుంది (కో. 5, 25, 29).

పీట: ఉ. పీఠ; 1. మేదరిపని చేసేటప్పుడు మేదరివాడు కూర్చోడానికి వేసుకొనే మామూలు చెక్కపీట. (కో. 12, 18); 2. పర్యా. చూ. మొద్దు(3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిల మొక్కపోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగున్న కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంత లావు ఉంటుంది, వెదురుగడ పగలగొట్టడానికి గడకుకత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (తె. 17, 29); 3. నేతపనివాడు కూర్చోడానికి వేసుకొనే కొయ్యచెక్క. చూ. చిత్రం 120 క. 7. (రా. 4); 4. కొబ్బరిపీచు ఒత్తులు తాల్చడానికి పెట్టుకొనే కొయ్యచెక్క; కింద చిన్నచిన్న కాళ్ళుంటాయి. (కో. 25).

పీటచాప: ఉ. —సాప; అన్నంతినేటప్పుడు కూర్చోడానికి పరుచుకొనే తుంగచాప; రెండడుగుల చదరంగా ఉంటుంది. (రా. 2, 6).
పీతిరిపలకమొద్దు: పర్యా. చూ. తోపుడుపీట. గీకడానికి కలబండపట్టి పరిచే పొడుగాటి కొయ్యపీట. (రా. 6).
పినిగచేట: పర్యా. చూ. బావుచేట. శవాన్ని తీసుకువెళ్ళేటప్పుడు చల్లేపేలాలూ నవధాన్యాలూ చిల్లర పైసలూ మొ॥ పోసుకొనే చేట; అల్లికంలో దీనికి అంచుకట్టరు. (కో. 2).
పినిగబుట్ట: శ్మశానికి తీసుకువెళ్ళేబుట్ట. (కో. 2).
పీర్చు: (క్రి.) ఉ. పీర్సు; పర్యా. పగలగొట్టు(2) పిరాయించు. విడదీయడం; గంప మొ॥వాటి అడుగు అల్లేటప్పుడు బిగాపెట్టిన నిలువుబద్దలను సగం అడుగు అల్లిన తరవాత విడదీస్తారు (కో. 8; తె. 11).
పీర్లపెట్టె: పీరుకు సంబంధించిన బట్టలు, ఆభరణాలు మొ॥ భద్రపరుచుకోడానికి అల్లినపెట్టె. (కో. 9; రా. 11).
పుక్కిగొట్టం: (< హిం. పుక్నీ–) పర్యా. చూ. ఊదుడుగొట్టం. పొయ్యి ఊదుకోడానికి లోపల బోలుగా ఉన్న వెదురుగొట్టం. (తె. 26).
పుచ్చువెదురు: ఉ. పుచ్చెదురు; పర్యా. చూ. పుప్పి బొంగు. పుచ్చిపోయిన వెదురుగడ; పురుగులు లోపలికిచేరి కండ తినేయడంవల్ల లోపలినుంచి పొడిరాలుతుంది; పొయ్యిలోకి తప్ప దేనికీ పనికిరాదు. (కో. 31).
పుచ్చె: ఉ. పుచ్చ, పర్యా. చూ. కొబ్బరిపుచ్చె. కొబ్బరి గెలకు వేసిన పిందె; పిందెలు క్రమంగా పెరిగి కాయలవుతాయి. (కో. 19, 20).
పుంజీ: 1. నాలుగు; రూపాయలు మొ॥వాటి లెక్క (కో. 25); 2. పర్యా. చూ. పట్టె(2). ఈత చువ్వతో అల్లేగుమ్మి, తడక మొ॥వాటిలో నిలువుగావచ్చే నాలుగుబద్దల కూర్పు. (కో. 25)
పుటికె: ఉ. పుటిక, పుట్క, పుట్కె; 1. పర్యా. చూ. గుల్ల(4). ధాన్యం పోసుకోడానికీ మోసుకువెళ్ళడానికీ వెదురుతో అల్లిన ఒకరకం చిన్నగంప; మామూలు గంపకన్న చిన్నది; కొన్ని కిందినుంచి మీదికి ఒకే తీరుగానూ కొన్ని గుండ్రంగానూ మూతి విశాలంగానూ ఉంటాయి. (తె. 4, 13, 22, 29; రా. 1); 2. పర్యా. చూ. బియ్యంగడుగు బుట్ట. బియ్యం కడిగి గాలించిన తరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసిఉంచే బుట్ట; కొంచెం పలచగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందసన్నగా ఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి ఒకేతీరుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందనాలుగు మూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది (దీన్ని చేట మాదిరిగా అల్లుతారు); సంతర్పణవంటలకు వాడతారు; చూ. చిత్రం 48. (రా. 6).
పుట్టి: నలభై కుండల (8 బస్తాలు) ధాన్యం కొలమానం. (తె. 7, 9, 14).
పుట్టుదల: పుట్టడం; పుట్టుక. (కో. 27).
పుట్టి: పర్యా. గంప(6), బోటు. చేపలు పట్టడానికి చెరువులోకి వెళ్ళే చిన్నపడవ; దీనిదొడ్డి (ఫ్రేమ్) వెదురుతో తయారుచేసి బయటినుంచి చుట్టు తోలువేసి కుడతారు. (కో. 9).
పుట్టెడుగుమ్మి: ఉ. పుట్టెడి ; 1. పర్యా. పదిమళ్ళ గుమ్మి పదిమణుగుల ధాన్యంపట్టే గుమ్మి. (తె. 21, 22); 2. ఆరుక్వింటాళ్ళ (పుట్టి) ధాన్యంపట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి. (తె. 9).
పుట్నంగనె: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (తె. 22).
పుడక: ఉ. పుడ్క; విడి(గడ్డి)పోచ; సుమారు గజం పొడుగు ఉంటుంది. (తె. 21).
పుడ్గ: పెళ్ళిసంబంధం కుదిరిన తరవాత ఆడపెళ్ళివారికి మగపెళ్ళివారు ఇచ్చేకానుక పుడిగ; రెండుగంట కుడకలు, బెల్లం, ఒకచీర, ఒక రవికగుడ్డ ఇస్తారు. (తె. 21).
పునిస్త్రీచేట: (< సం. పుణ్యస్త్రీ–) ఉ. పునిస్తరపు–; పర్యా. చూ. మూసి వాయనంచేట. ముత్తైదువ చనిపోయినప్పుడు ఆమె పేరుమీద మూసివాయనం (సాంగం; పసుపు, కుంకుమ మొ॥) పెట్టి ఇచ్చే చేట; వాయనమిచ్చేటప్పుడు పైన మరోచేట బోర్లిస్తారు. (కో. 16).
పుప్పిబొంగు: పర్యా. జబ్బుకర్ర, డబ్బికర్ర, పుచ్చువెదురు, పుప్పివెదురు, పుచ్చిపోయిన వెదురుగడ, పురుగులు లోపలికిచేరి కండ తినేయడంవల్ల లోపలినుంచి పొడిరాలుతుంది; పొయ్యిలోకి తప్ప దేనికీ పనికిరాదు. (తె. 24).
పుప్పివెదురు: ఉ. పుప్పెదురు; పర్యా. చూ. పుప్పి బొంగు. పుచ్చిపోయిన వెదురుగడ; పురుగులు లోపలికిచేరి కండతినేయడంవల్ల లోపలినుంచి

పొడిరాలుతుంది; పొయ్యిలోకి తప్ప దేనికీ పనికి రాదు. (కో. 30).

**పురి:** 1. గడ్డి, నార, దారం మొ॥ గట్టిదనంకోసం మెలి దిప్పగావచ్చిన వడి; కొన్నిచోట్ల చీపురు పిడికట్టడానికి ఈతాకులు వడిపెడతారు; కొన్నిచోట్ల తాడుగా పేని చుడతారు. (తె. 9; రా. 8); 2. వడిపెట్టిన గడ్డి, నార, దారం మొ॥; 3. నార వడిపెట్టి తయారుచేసిన పాయ; తాడు పేనడానికి పనికొస్తుంది. (రా. 4, 5); 4. రూ. మురి; వడి దిప్పిన కొబ్బరిపీచు. (కో. 23); 5. పర్యా. చూ; పోగు(3). (తుంగ) చాపలు నేసే మగ్గానికి గజం వెడల్పున బెత్తెడు ఎడానికొకటి చొ॥న వరసగా ఎగదండు (= నేతగాడు కూర్చొనే వైపుండే బొంగు) నుంచి దిగదండు (= మగ్గం చివరి బొంగు)కు కట్టిన పురిపెట్టిన నారపోచ లేదా ప్లాస్టిక్ దారం; వీటిమధ్యన (తుంగ) పోచను పెట్టుకొంటూ అని మార్చుకొంటూ చాపనేస్తారు. చూ. చిత్రం 120 క. 8; 6. కలబంద పోచలువడి బెట్టగా వచ్చినదారం; అడ్డంగా మగ్గం ఎగదండు నుంచి దిగదండువరకు కడతారు. (రా. 6).

**పురికోస:** ఉ. పురుకోస; పర్యా. చూ. సుతిలి. గోగు, జనప మొ॥ నారలతో మిషన్‌లో తయారైన సన్నటి పురితాడు; పుల్లలతడక (చిక్కతడక) కాసెగడ్డి చిల్మాన్లు మొ॥ తయారుచేయడానికి వాడతారు. చూ. చిత్రం 93. 3. (కో. 8)

**పురికోసపోయు:** (క్రి.) పర్యా. చూ. పోగుబిగించు. (తుంగ)చాప మగ్గంముందు నేతగాడు కూర్చొనే వైపుండే ముందరిబొంగు (చూ.) నుంచి మగ్గం చివరి వెనకబొంగు (చూ.) వరకు అడ్డంగా (గజం వెడల్పున) బెత్తెడు ఎడానికి ఒకనారపోగు చొ॥న పెట్టి కట్టడం. (కో. 8).

**పురిగనుపుబొంగు:** ఉ. —గెన్పు—; పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥వాటికి పనికొస్తుంది. (కో. 5).

**పురిగనుపులకఱ్ఱ:** ఉ. —గెనుపుల—; పర్యా. చూ. కురచగనెబొంగు. కణుపులమధ్య మూరెడుకన్న చాలాతక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 4).

**పురిచక్కిరి:** పర్యా. చూ. కదురు. నారపోచల్ని సన్నటి తాడుగా వడికే పనిముట్టు; సన్నటి వెదురుపుల్లను గాని ఇనపచువ్వనుగాని చెక్కబిళ్ళ లేదా ఇనప ఇనపబిళ్ళ తొడిగి ఉంటుంది; చూ. చిత్రం 119. (రా. 2).

**పురిదిప్పు:** (క్రి.) అల్లకం పూర్తయిన తరవాత (గంప మొ॥వాటి) నిలువును లోపలికి మలిచే టప్పుడు మెలిపెట్టడం. (రా. 9).

**పురిబిళ్ళ:** ఉ. —బిల్ల; పర్యా. చూ. కదురు. నార పోచల్ని సన్నటి తాడుగావడికే పనిముట్టు; సన్నటి వెదురుపుల్లనుగాని ఇనపచువ్వనుగాని చెక్కబిళ్ళ లేదా ఇనపబిళ్ళ తొడిగి ఉంటుంది; చూ. చిత్రం 119. (రా. 6).

**పురిబెట్టు:** (క్రి.) ఐదారు నారపోచల్ని ఎడంకాలు బొటనవేలికి మెలిబెట్టి వడితిప్పడం; పోచలు అయిపోతుంటే మళ్ళీపోచలు పెట్టుకొంటూ కావలసి నంతపొడుగ్గా వడితిప్పుతారు; మామూలుగా ఈత నార, తాటినారలతో మాత్రమే ఇలా పురిబెట్టి పేంతారు; గోగునార మొ॥వాటిని సన్నటి తాళ్ళుగా తాల్చి, తాల్చిన తాళ్ళనుకలిపి లావుతాళ్ళు పేంతారు. (తె. 9).

**పురివేయు:** (క్రి.) పర్యా. ముడిదిప్పు. తడక అల్లకంలో ఒకవైపునుంచి అల్లుకుంటూ వచ్చిన బద్దను రెండోవైపు అల్లడంకోసం మెలిపెట్టడం. (రా. 8).

**పురెక్కు:** (క్రి.) (< పురి + ఎక్కు) నాలుగైదు నార పోచలుకలిపి తిప్పేటప్పుడు అవి ఒకదానికొకటి మెలివేసుకొని వడిదిరగడం. (రా. 10).

**పుర్రెకు:** (< పురి + ఆకు) చీపురుపిడి కట్టడానికివీలుగా వడితిప్పడానికి పనికొచ్చే ఈతాకు; ఆకు సన్నగా పొడుగ్గా ఉంటుంది. (రా. 9).

**పులిజండీ:** పులివేషం వెయ్యడానికి పులి ఆకారంలో అల్లినది. (కో. 26)

**పుల్చేరుకట్టె:** ఉ. పుల్చేరిగట్టె, పుల్చేర్గట్టె; పర్యా. చూ. పుల్చేరుబరిగె, వేలెడులావుండే పుల్చేరుచెట్టు చువ్వ; పొడుగ్గా నల్లగా ఉంటుంది. (తె. 9, 14).

**పుల్చేరుచువ్వ:** ఉ. పుల్చేర్చువ్వ; పర్యా. చూ. పుల్చేరుబరిగె. వేలెడులావుండే పుల్చేరుచెట్టు చువ్వ; పొడుగ్గా నల్లగా ఉంటుంది. (తె. 7).

**పుల్చేరుబరిగె:** ఉ. పులిచేరు బర్రిగ, పుల్చేరిబరిగె, పుల్చేరుబర్రిగ, పుల్చేర్బరిగె; పర్యా. పుల్చేరుకట్టె; పుల్చేరుచువ్వ. వేలెడులావుండే పుల్చేరుచెట్టుచువ్వ; పొడుగ్గా నల్లగా ఉంటుంది. (తె. 14, 19, 20).

పుల్పచ్చి: కొద్దిపాటి పచ్చి; పూర్తిగా పచ్చిగాగాని పూర్తిగా ఎండిపోయిగాని లేకుండా మధ్యరకంగా ఉండడం. (తె. 13).

పుల్ల: **1.** పర్యా. చూ. కర్ర (3). గోవ(వార) నుంచి పొడుగ్గా తీగలావచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో విలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47. చ. 1; (రా. 1,2). **2.** పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 8); **3.** పుల్లలతడక తయారీలో ఉపయోగించే కడ్డీలాంటి వెదురు (కో. 3); **4.** పర్యా. గోల్పుల్లచిల్కాను (=పుల్లల పరదా) తయారీలో వాడే వెదురుపుల్ల; గట్టిగానూ కొంచెం గుండ్రంగానూ ఉంటుంది; ఇలాటివి వరసగా బిగిస్తారు. చూ. చిత్రం 93.4, (తె. 8, 10); **5.** పర్యా. చూ. కొడంపుల్ల. కొడమ తయారీలో కొడమచుట్టూ మూసే తడకా ప్రిరతడకా తయారుచేయడానికి వాడే సన్నటి వెదురుపుల్ల; ఐస్‌ఫ్రూట్ పుల్లంత లావు ఉంటుంది. చూ. చిత్రం 73 క.2. (కో. 2); **6.** పర్యా. చూ. బరిగె (1). సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి పొడుగాటి పుల్ల; ఈత, పుల్చేరు మొ॥ చెట్లనుంచి ఊడుగు మొ॥ పొదల నుంచి దీన్ని తీస్తారు; ఈతకమ్మ మధ్యకర్ర (రెండుపక్కలా ఆకులువేసేది) బండిజల్ల, పిల్లల పొది, తట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 3); **7.** పర్యా. చూ. తుంగపోచ. తుంగగడ్డి మొక్కకు పొడుగ్గా పెరిగిన ఒక పుల్ల(పోచ); సుమారు గజం పొడుగుంటుంది; ఇలాంటిపుల్లలతో చాపలునేస్తారు. (రా. 10); **8.** పేడు బెత్తంముక్క. (కో. 3).

పుల్లచాప: ఉ. — చాప; పర్యా. చూ. పుల్లలతడక. వెదురుపుల్లలూ పురికోసలూపెట్టి అల్లిన తడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (కో. 19).

పుల్లలతడక: ఉ.—తడికె,—తడ్క; పర్యా. చిక్కు (1), చిక్కుచాప, చిక్కుతడక, చిల్కాను, చూపుచాప. పుల్లిచాప, వెదురుచిల్కాను, షూదిచాప. వెదురుపుల్లలూ పురికోసలూపెట్టి అల్లిన తడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (కో. 8; రా. 6, 8).

పుల్లిరుసు: పెద్దగిలక; చాపనేత మగ్గానికిఉండే రెండు ఉళ్ళుకట్టలు, కిందికీమీదికీ రావడానికి వీటి తాళ్ళు దీనిమీద వేస్తారు. చూ. చిత్రం 120 చ. 5. (రా. 2).

పువులబుట్ట: ఉ. — బుట్టి; పూలు అమ్మేవాళ్ళు తీసుకువెళ్ళడానికి అల్లినగంప (బుట్ట). (రా. 1).

పువ్వాకుజల్ల: పొగాకు (పువ్వాకు) వ్యాపారం చేసే వాళ్ళు పొగాకును తీసుకుపోవడానికి బండిమీద పరిచే జల్ల. (కో. 18).

పువ్విసనగర్ర: పర్యా. చూ. పూలవిసనగర్ర. రకరకాల పూలవంటి డిజైన్లు వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (కో. 15).

పువ్వు: ఉ. పువ్వు; **1.** పర్యా. చెంద్రికపువ్వు. చెంద్రిక (= పట్టుపురుగుల గుడ్లు పొదగడానికి అల్లినది) తయారీలో తడక్మీద గుండ్రంగా పువ్వు ఆకారంలో కొన్ని వరసలుగాచుట్టి అమర్చిన పట్టీ; వెదురుపేడుతో అల్లుతారు; బెత్తెడు ఎత్తు ఉంటుంది; వరసకూ, వరసకూ మధ్య బెత్తెడు ఎడముంటుంది; పట్టుపురుగులు వీటిలో పెరుగుతాయి. చూ. చిత్రం 82.1 (కో. 15, 23; తె. 28; రా. 1. 2, 5, 6); **2.** విసనగర్ర అల్లకంలో నడుమవచ్చే పువ్వులాంటి డిజైను. చూ. చిత్రం 31 ప. 2; **3.** చేట అల్లకంలో మధ్యభాగాన వచ్చే ఒకరకం పువ్వువంటి డిజైను. చూ. చిత్రం 24.1, 25.1 (రా. 2); **4.** పర్యా. చూ. ఒగుడు. ఈతమట్టకు మధ్య ఆకులసందున ఉండే ఎర్రటిపొట్టు. (కో. 25).

పువ్వగనె: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (తె. 19, 25).

పువ్వుతుంగ: పైన పువ్వుపూసిన తుంగ; పూలు తెంపేసి చాపల అల్లకానికి వాడతారు. (కో. 21).

పువ్వులదాగర: ఉ. పువ్వుల్దాగెర; అమ్మేవాళ్ళు పువ్వులు పెట్టుకొనే గుండ్రటి దాగర (చూ.); పళ్ళెంలా ఉంటుంది. (కో. 28).

పూగచ్ఛం: చేట అల్లకంలో పువ్వులాంటి డిజైను వచ్చేటట్లు వేసినగచ్ఛం; చూ. గోడుగచ్ఛం. చూ.

చిత్రం 24. (తె. 16).

పూజు: పర్యా. సిగమోర. అల్లంకారం కోసం ఎడ్ల మూతికి తొడిగే ఒకరకం అల్లకం కాదు; దీని చివర్లు కొయ్యలదగ్గర కడతారు. (కో. 26).

పూత: పర్యా. చూ. బూదివ. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సం॥కి ఏర్పడుతుంది. (తె. 18).

పూదడక: ఉ. పూదక్క; పర్యా. చూ. పాలవెల్లి వినాయకచవితి మొ॥ పండుగలప్పుడూ వ్రతాలప్పుడూ పూజాపీఠానికి ఒకటిరెండడుగుల ఎత్తున కట్టే బద్దలతడక; సుమారు మూరెడు చదరముంటుంది; దీనికి పూలూ పళ్ళూ మొ॥ వేలాడగడతారు; చూ. చిత్రం 92. (తె. 21, 24).

పూదు: 1. పర్యా. కోణకం. కొన్నిరకాల కన్నె (చూ.) లకు రెండుపాయలమధ్య ఉండే పొడుగాటి కాడు. (కో. 30). 2. నాగలికాడి. (కో. 30).

పూదుతొల: నాగలికాడికుండే బెజ్జం; దీంట్లో పలుపు దూరుస్తారు. (కో. 30).

పూను: చూ. పొన్ను (1). (కో. 1).

పూబద్ద: రూ. బూదబ్బ; పర్యా. చూ. కండదబ్బ (4). ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగంనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 11-3. తె. 20).

పూబెండుగ్ర: పర్యా. చూ. బెండుక్ర (1). వెదురు బద్ద పల్లపుభాగంనుంచి తీసిన క్ర (చూ.); గంపలు మొ॥ అల్లడానికి కట్టు(బొద్దు) చుట్టడానికీ ఉపయోగం. (తె. 22).

పూరీతచువ్వ: ఉ. పూరీత్సువ్వ; పర్యా. చూ. బిట్టీత (చెట్టు) బరిగె. పొట్టి ఈత (బిట్టీత) చెట్టుకమ్మ చీరితీసిన చువ్వ; పొడుగు తక్కువ. (తె. 7).

పూరీతచెట్టు: ఉ. పూరీత్చెట్టు; పర్యా. చూ. బిట్టీత చెట్టు. పొట్టిగాఉండే ఒకరకం ఈతచెట్టు. (తె. 7).

పూలకట్టె: పర్యా. సీనకమ్మరికట్టె; గుండ్రంగాను నల్లగానుఉండే ఒకరకంమొక్క చువ్వ(బరిగె); ఇది చేలగట్లవెంట పెరుగుతుంది; దీని పూలు ఎరుపు రంగులో ఉంటాయి. (తె. 16).

పూలగుల్ల: పర్యా. చూ. పూలబుట్టలు. పూలు ఏరడానికీ గుడికి తీసుకెళ్ళడానికీ ఉపయోగించే చిన్నబుట్ట; మామూలుగా దీనికి కమాన్‌బద్దా (=పట్టుకోడానికి పిలుగా వంచికట్టిన వెదురుబద్ద) గద్దె ఉంటాయి; చుట్టూ కళ్ళు (కంతలు) పెడతారు; కొన్ని మరచెంబు ఆకారంలోనూ కొన్ని చిన్న బొక్కెన ఆకారంలోనూ కొన్ని ఎత్తుపళ్ళెం ఆకారంలోనూ ఉంటాయి; కొన్నిటికి మూతికూడా ఉంటుంది. (తె. 23).

పూలచాప: ఉ.—సాప; పర్యా. డిజైన్‌చాప. రంగుల పూలవంటి డిజైన్లువచ్చేట్లు నేసిన చాప. (కో. 3).

పూలపంకా: ఉ. —పంక; పర్యా. చూ. పూలవిసనగ్ర. రకరకాల పూలవంటి డిజైన్లు వచ్చేటట్లు అల్లిన విసనగ్ర. (తె. 9).

పూలబుట్ట: 1. పర్యా. గండ్లబుట్ట, గద్దెగుల్ల, గద్దెబుట్ట, పూలగుల్ల. పూలు ఏరడానికీ గుడికి తీసుకెళ్ళడానికీ ఉపయోగించే చిన్నబుట్ట; మామూలుగా దీనికి కమాన్‌బద్దా (=పట్టుకోడానికి పిలుగా వంచి కట్టిన వెదురుబద్ద) గద్దె ఉంటాయి; చుట్టూ కళ్ళు (కంతలు) పెడతారు; కొన్ని మరచెంబు ఆకారంలోనూ కొన్ని చిన్నబొక్కెన ఆకారంలోనూ కొన్ని ఎత్తుపళ్ళెం ఆకారంలోనూ ఉంటాయి; కొన్నింటికి మూతికూడా ఉంటుంది. (కో. 5; తె. 8, 10, 14, 17-19; రా. 9); 2. గుడికి వెళ్ళేటప్పుడు పూజాసామగ్రి పెట్టుకోడానికి అల్లిన ఒకరకం వెదురు పేళ్ళబుట్ట; దీనికి కంతలు, వంచికట్టిన కాడ ఉంటాయి. (కో. 5); 3. పూలు వేసుకొనే ఒక రకం వెదురుపేళ్ళ బుట్ట; కింద చతురస్రాకారంలో ఉండి పైన గుండ్రంగా ఉంటుంది; చేట అల్లకంలో అల్లుతారు. (కో. 3).

పూలల్లకం: పర్యా. గారల్లకం. చేట మధ్యభాగంలో ఒకరకం పువ్వులాంటి డిజైను వచ్చేటట్లు అల్లే విధానం; చూ. గారు. (కో. 3).

పూలవిసనగ్ర: ఉ. పూలిసనగ్ర, పూలిస్నక్ర; పర్యా. పువ్విసనగ్ర, పూలపంకా, రకరకాల పూలవంటి డిజైన్లు వచ్చేటట్లు అల్లిన విసనగ్ర. (కో. 5-7, 14; తె. 8, 26; 31).

పూలసజ్జ: గుడికి పూలు పట్టుకువెళ్ళడానికి తాటి ఈనెతో అల్లినబుట్ట; పట్టుకోడానికి పిలుగా దీనికి వెదురుబద్ద ఒకటి వంచి కడతారు; ఈనెలతాడు ఉంటుంది. (కో. 12).

పూల్ల: 1. వెదురుగడ లోపల ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు నిలువుగా ఉండే సన్నని ఖాళీ. (తె. 19); 2. పర్యా. చూ. క్ర(3). గోవ(వార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువ గాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం

ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలుపులుగానూ పట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 న. 1. (వ. 6-9).

పూసగనుపు: ఉ. —గెన్ను; పర్యా. ఒంటికన్ను, కొడారు చిమ్మెబుడుపు, గోరుబల్ల, చిట్టిగనుపు(2), చిన్నకన్ను, చిన్నకన్నుగుంపు, చిన్నగంటు గుంపు, చిన్నగుంపు, చిన్నపెట్టెగుంపు, చిన్నబల్ల, చిల్లగనె, చెనిగిత్తుచిల్ల, పుట్నాలగనె, పుస్వగనె, మొగ్గగనె, విత్తనంగుంపు; వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (= కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 8, 5; రా. 11).

పూసగనుపుకర్ర: ఉ. - గెన్ను—: పర్యా. ఆకుచిల్ల బొంగు, గోరుచిల్లకర్ర, చెణిగిత్తు చిల్లబొంగు, పిట్టకనుపువెదురు, సుల్కాంబొంగు (2). కొమ్మ నరికేసినప్పుడు కణుపుదగ్గర చిన్నగుర్తుపడే వెదురు గడ; కణుపుదగ్గర పెరిగేకొమ్మ సన్నగా ఉండడం వల్ల దాన్ని నరికినప్పుడు సన్నటిగుర్తు పడుతుంది; దీన్ని చీల్చడం సులువు. (కో. 8).

పూసలగంప: ఉ. పూసల్—; పర్యా. పూసలతట్ట. పూసలవాళ్ళు అద్దాలు, దువ్వెనలు, పౌడర్లు మొ॥ పెట్టుకొని తిరుగుతూ అమ్మడానికి ఉపయోగపడే తట్ట; అడుగు సమతలంగానూ కిందినుంచి మీదికి సమాంతరంగానూ జేనెడు బెత్తెడు ఎత్తూ ఉంటుంది; వెలుపలినుంచి చుట్టూ డిజైనుబద్దలు తొడుగుతారు; చూ. చిత్రం 57. (తె. 8, 15).

పూసలతట్ట; ఉ. పూసల్—; పర్యా. పూసలగంప. పూసలవాళ్ళు అద్దాలు, దువ్వెనలు, పౌడర్లు మొ॥ పెట్టుకొని తిరుగుతూ అమ్మడానికి ఉపయోగపడే తట్ట; అడుగు సమతలంగానూ కిందినుంచి మీదికి సమాంతరంగానూ జేనెడు బెత్తెడు ఎత్తూ ఉంటుంది; వెలుపలినుంచి చుట్టూ డిజైనుబద్దలు తొడుగుతారు; చూ. చిత్రం 57. (తె. 6).

పూసలపెట్టె: పూసలవాళ్ళు (ఒకకులం) తాము అమ్మే వస్తువులు (అద్దం, దువ్వెన మొ॥) పెట్టుకొని అమ్మేపెట్టె; మూత ఉంటుంది; దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది. (తె. 15).

పూసలిగంప: పూసలవాళ్ళు (= ఒకతెగ) అద్దాలు, దువ్వెనలు అమ్మడానికి పెట్టుకొనే గంప. (తె. 9).

పూసిపోవు: (క్రి.) వెదురుగడ పాలిపోవడం. (కో. 31).

పెకిలించు: (క్రి.) పర్యా. చూ. పెండించు. వెదురుగడ చీల్చేటప్పుడు కణుపు సులువుగా తెగడానికి కత్తిని అడ్డంగా మెలిదిప్పడం. (తె. 22).

పెంక: 1. చూ. పెనక (1). (తె. 10); 2. చేట వెనకభాగంలోని బయటిఅంచు. (తె. 8).

పెంకు: 1. కొబ్బరికాయపై గుల్ల; గట్టిగా ఉంటుంది. (కో. 26); 2. పర్యా. చూ. అంచు (13). కట్టు (—బద్ద), కర్ర (= కడ్డీలాంటిది) పెట్టి చేటచుట్టూ కట్టుకట్టిన భాగం. చూ. చిత్రం 29.5 (తె. 5).

పెచ్చుసె: (< పెచ్చు + ఈనె) పర్యా. చూ. కోతపేడు. పేగ, గూడ, బుంగ మొ॥ అల్లినతరవాత వాటి మూలలదగ్గర మిగిలిన పేడు(లు); వీటిని కోసేస్తారు; దేనికీ పనికిరావు. (కో. 31).

పెచ్చు: పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తేవచ్చే ఒకభాగం. (కో. 18).

పెజ్జల్లెడ: (< పెద్ద + జల్లెడ) ఉరువు పెద్దగా ఉండే జల్లెడ; బియ్యం జల్లించుకుంటారు. (తె. 13).

పెంటరమచ్చలకర్ర: చుట్టూ నలుపు, ఎరుపు మచ్చ ఉన్న వెదురుగడ. (తె. 8).

పెంజరమచ్చలబొంగు: చుట్టూ ముదురాకుపచ్చ, లేత పసుప్పచ్చ మచ్చలున్న వెదురుగడ. (తె. 23).

పెట్టగుంపు: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలినకొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1 (కో. 19, 28-30).

పెట్టగుంపుబద్ద: పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (= వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 19, 28).

పెట్టుడుకమ్మ: ఈతచాప అల్లేటప్పుడు పెట్టే ఆకు (కమ్మ); ప్రతిపందకూ ఒకఆకు పెడతారు. (తె. 26).

పెట్టె: ఉ. పెట్టి. 1. పర్యా. కోకలపెట్టె; గుడ్డల పెట్టె, బట్ట(ల) పెట్టె, సందుకపెట్టె. చీరలూ పంచెలూ మొ॥ బట్టలు పెట్టుకొనే వెదురుబద్దల పెట్టె; చతురస్రాకారంలోనూ, దీర్ఘచతురస్రాకారంలోనూ ఉంటుంది; చూ. చిత్రం 41. (కో. 4, 22-24, 26; తె. 7, 10, 24); 2. ఇస్త్రీగుడ్డలు

వెడల్పుగా ఉన్న వెదురుగడ; కణుపుదగ్గర పెరిగిన కొమ్మ లావుగా ఉన్నప్పుడుగాని కణుపుదగ్గర చుట్టూ రెండుమూడు కొమ్మలు పెరిగినప్పుడుగాని వాటిని నరికేస్తే వెడల్పుగా గుర్తుపడుతుంది; ఈ బొంగును చీల్చడం కష్టం; కణుపుదగ్గర పేడు విరిగిపోతూంటుంది. (కో. 22).

పెద్దకన్నుగుంపు: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలావుగా ఉండడం వల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడం వల్లగాని వాటిని నరికినప్పుడు పెద్ద గుర్తుపడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 27).

పెద్దకర్ర: పర్యా. చూ. పొడుగుబొంగు. పదిమూరల నుంచి పదిహేను మూరలవరకు పొడుగున్న వెదురు గడ. (తె. 31).

పెద్దగంటుగుంపు: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలావుగా ఉండడం వల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడం వల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 31).

పెద్దగదబ: వ్యవసాయం చేసే ఒకతెగ గదబవాళ్ళు. (కో. 24).

పెద్దగనకర్ర: పర్యా. చూ. నిడుపు(గనె) బొంగు. కణుపులమధ్య మూరెడుగాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురుగడ; దీన్నుంచి తీసినపేడు జల్లెడ, చేట మొ॥వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 27).

పెద్దగంప: 1. గంపల్లో పెద్దరకం; గడ్డి మొ॥ మోసుకురావడానికి వెదురుపేళ్ళతో పెద్దగా అల్లుతారు. (రా. 5); 2. ధాన్యం పోసిపెట్టుకోడానికి అల్లిన ఒకరకం వెదురుగంప; పెద్దది; మామూలు గంపకన్న పెద్దగా ఉంటుంది; నిలువులు పెట్టకుండా కేవలం పేడుతో చేట అల్లకం మాదిరిగా అల్లుతారు; అడుగున చతురస్రంగానూ మూతిదగ్గర గుండ్రంగానూ ఉంటుంది. (కో. 24); 3. పర్యా. చూ. కంకిజల్ల (1). సజ్జకంకి, జొన్నకంకి మొ॥వాటిని పొలాలనుంచి మోసుకురావడానికి వాడే ఒకరకం పెద్దగంప; గజంఎత్తూ మూరన్నర వెడల్పూ ఉంటుంది. (రా. 8); 4. ఉల్లిపాయలు రవాణా చేయడానికి మందమైన వెదురుపేళ్ళతో అల్లిన ఒక రకం గంప; మూతి విశాలంగా ఉంటుంది. (రా. 11).

పెద్దగుండు: కొనను మూతిభాగం కిందికి వృత్తాకారంలో అమర్చిన వెదురుబద్ద. (కో. 2).

పెద్దగుంపు: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మ లావుగా ఉండడం వల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం (కో. 24, 28, 30).

పెద్దచాప: ఉ. —సాప; 1. పర్యా. బజేనచాప. ఐదు జేనల వెడల్పూ ఐదడుగుల పొడుగూ ఉండేటట్లు నేసిన (తుంగ)చాప. (రా. 6); 2. ఉ. —సాప; దిత్తిదేసి ఎవంలో మెప్పైనలభై కట్లు వచ్చేటట్లు నేసిన (తుంగ)చాప; ఇది ఐదుమూళ్ళ పొడుగూ నాలుగుమూళ్ళ వెడల్పూ ఉంటుంది. (కో. 30); 3. ఐదుమూరల పొడుగూ ఐదుమూరల వెడల్పూ ఉండే తాటిచాప. (కో. 20).

పెద్దచేట: ఉ. —శాట, పెద్సాట, ఉరువు పెద్దగా ఉండే వెదురుపేళ్ళ చేట. (కో. 5, 16, 25).

పెద్దతట్ట: సుమారు మూరెడు జేనెడు వెడల్పూ, జేనెడు ఎత్తూ ఉండే వెడల్పాటి తట్ట; స్టీలుసామాను అమ్ముకొనేవాళ్ళు దీంట్లో పెట్టుకొని తిరుగుతారు. (కో. 2).

పెద్దదాగర: ఉ. పెద్దాగర; ఉరువు పెద్దగాఉన్న దాగర; చూ. దాగర. (కో. 3).

పెద్దపొదెం: విస్తీర్ణంలో వెడల్పుగానూ లావుగా ముదిరిన వెదురుగడలతోనూ ఉండే వెదురుపొద. (కో. 22).

పెద్దపెట్టగుంపు: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మ లావుగా ఉండడం వల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 29).

పెద్దపెండె: మానె (చూ.) అంచుమట్టూ బయటినుంచి లావుపాటి కర్రతో చుట్టినకట్టు; కిందికట్టు, మధ్య కట్టు సన్నకర్రతో చుడతారు. (కో. 31).

పెద్దపేము: పర్యా. గొడిబొంగు. దూలమంత లావుండే

వెదురుగడ. (కో. 22).

పెద్దపేళ్ళచేట: ఉ. —దేళ్ళ -, —వేళ్లరాట; పర్యా. ఎల్పుపేళ్ళచేట, దొడ్డుపేళ్ళచేట. వెడల్పాటి పేళ్ళతో అల్లినచేట; దీన్ని మామూలుగా ఒంటిపేడుమీద గాని రెండుపేళ్ళ (చూ. రెంటాలు) మీదగాని అల్లుతారు. (కో. 2, 3; రా. 2).

పెద్దపేళ్ళబుట్ట: ఎరువు మోసుకెళ్ళడానికి వేటినైనా పార్సెల్ చేయడానికి పనికొచ్చే పెద్దబుట్ట; దీన్ని వెడల్పూ మందమూ ఎక్కువగా ఉన్న పేళ్ళతో అల్లుతారు. (కో. 3).

పెద్దబద్ద: పర్యా. అకందండబ్బ. మధ్యలో నరుకు లేకుండా ఉన్న పొడుగాటి వెదురుబద్ద. (కో. 28).

పెద్దబల్ల: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికి నప్పుడు పెద్ద గుర్తు పడుతుంది; ఇలాటి కణుపు ఉన్న వెదురు గడను చీల్చడం కష్టం. (కో. 23).

పెద్దబసివి: ఉ. —బశ్వి; పర్యా. పెద్దీతచెట్టు. లావుగా పొడుగ్గా పెరిగే ఈతచెట్టు. (రా. 9).

పెద్దబొంబు: (< ఇం. Bamboo) పర్యా. చూ. ముల్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావు నుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపు చుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది, ఎక్కువ కాలం పొదకు ఉండదంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టి పడుతుంది. కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడంఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (రా. 1).

పెద్దమ్మ: (< పెద్ద అమ్మ) ఉరువు పెద్దగా ఉన్న అమ్మ. చూ. అమ్మ. (తె. 23).

పెద్దరామాపాటను (< ఇం. - Pattern) పర్యా. పెద్దరామాబెత్తాలు, బూరిరామాపాటను. ఒకరకం పేముకుర్చీ; రామాపాటన్ కుర్చీల్లో పెద్దది. (కో. 12, 19).

పెద్దరామాబెత్తాలు: పర్యా. చూ. పెద్దరామాపాటను ఒకరకం పేముకుర్చీ; రామాపాటను కుర్చీల్లో పెద్దది. (కో. 11).

పెద్దవెదురు. ఉ. పెద్దెదురు; పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగం లోనూ మూడంగుళాలు కొనభాగంలోనూ లావుంటుంది; బండిబల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది. (రా. 1).

పెద్దవేరు: ఉ. పెద్దేరు; పర్యా. చూ. తల్లివేరు. వెదురు మొక్కదుంపనుంచి పాకిన పెద్దవేరు; లావుగా పొడుగ్గా ఉంటుంది; నేలలోపలికి చాలాదూరం పాకుతుంది; దీన్నించి సన్నటిదారాల్లా పిల్లవేళ్ళు పుట్టుకొస్తాయి. (కో. 22; తె. 17).

పెద్దసిబ్బి: అన్నంకుండలోంచి గంజి వార్చడానికి పైనపెట్టే పెద్దమూత; సైజులో పెద్దది; మధ్యన పల్లంగా ఉంటుంది. (రా. 7).

పెద్దాకు: పర్యా. చూ. బర్రేకు. వెడల్పు ఎక్కువగా ఉండే ఈతాకు; సుమారు వేలెడు వెడల్పు ఉంటుంది. (రా. 8).

పెద్దీతచువ్వ: ఉ. పెద్దీత్సువ్వ; పర్యా. చూ. పెద్దీత చెట్టుబరిగె. పెద్దీతచెట్టునుంచి తీసినచువ్వ; పొడుగ్గా లావుగా మెత్తగా ఉంటుంది. (తె. 7, 9).

పెద్దీతచెట్టు: (< పెద్ద + ఈత—) ఉ. పెద్దీతశెట్టు, పెద్దీత్సెట్టు; పర్యా. ఈతమాను, జన్నీతచెట్టు, పెద్ద బసివి. లావుగా, పొడుగ్గా పెరిగే ఈతచెట్టు. (కో. 3; తె. 7, 9, 14).

పెద్దీతచెట్టుబరిగె: పర్యా. జన్నీదుబరిగె, పెద్దీత చువ్వ, పెద్దీతపుల్ల. పెద్దీతచెట్టునుంచి తీసినచువ్వ; పొడుగ్గా లావుగా మెత్తగా ఉంటుంది. (తె. 14).

పెద్దీతపుల్ల పర్యా. చూ. పెద్దీతచెట్టుబరిగె. పెద్దీత చెట్టునుంచి తీసినచువ్వ; పొడుగ్గా లావుగా మెత్తగా ఉంటుంది. (కో. 3).

పెద్దులి: (< పెద్ద+ఉలి) పెద్దగాఉన్న ఉలి; నిచ్చెన గడలకు చిల్లులు చెయ్యడానికి పనికొస్తుంది; చూ. ఉలి. (రా. 7).

పెనక: ఉ. పెన్క, పెన్కి, పెన్కె; 1. రూ. పెంక (1). ఒక మూలనుంచి కొమ్ముకు ఒక చివరివరకు గల చేట పక్కభాగం; పెణక; ఇలాటివి చేటకు రెండుంటాయి. (కో. 15, 16); 2. పర్యా. చూ. గూడ (6). చేటకు రెండుమూలల మధ్య ఎత్తుగా ఉండే భాగం. (కో. 2); 3. పర్యా. చూ. అడుగు (1). చేట సమతలభాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపకముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట; చూ. మంతు. (తె. 23); 4. కట్టు (బద్ద), కట్ర

(=కద్దీలాంటి వెదురుబద్ద)[illegible] వేయనిచేట. (కో. 3).

పెనక్కట్టు: (పెన + కట్టు, [illegible]) అల్లేటప్పుడు [illegible]. (కో. 16).

పెనికె: పర్యా. చూ. పేన్న (4). [illegible] మందంగా ఉన్న పైభాగం; సుమారు [illegible] వెడల్పున పలచగా ఉంటుంది; [illegible] పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. [illegible] చిత్రం 12 వ. 3. (కో. 4).

పెనుగుండు: పర్యా. గుండు (3). కొయ్యసుత్తి మధ్యభాగంలో [illegible] అమర్చిన వెదురుబద్ద; కొన్నిటికి [illegible] రెండుంటాయి. (కో. 2).

పెనుచు: (క్రి.) పర్యా. తాడుపేయు. రెండుగాని అంతకన్న ఎక్కువగాని పురులనుకలిపి పడిపెడుతూ తాడు అల్లడం; పేనడం. (రా. 4).

పెనుపెట్టు: (క్రి.) (< పెనుచు +) పడిపెట్టడం; తట్టు అల్లకం పూర్తయినతరవాత అల్లే బద్దలనూ నిలువుబద్దనూ కలిపి పడిపెట్టడం; అలా పడిపెట్టిన తరవాత దాంతో తట్టఅంచు [illegible]. (కో. 25)

పెనెదురు: (< పెన + వెదురు) పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావునుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలం బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకుఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడు తుంది కాబట్టి దీన్ని చీల్చడ కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది. (కో. 1; 2; రా. 1-3).

పెనెదురుబొంగు: పర్యా. చూ. ముళ్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ) ఇంటి వాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది. (కో. 2; రా. 2, 3).

[illegible] పెనెం. (ప. 23).

పెనెస్టాండు: (< ఇం. [illegible]) బల్లమీద [illegible] పెట్టడానికి వెదురు బద్దలతో చేసిన స్టాండు. (కో. 5).

పెరిక: పెం. పర్యా. చూ. పెన్న (4). మేపరికత్తికి [illegible] ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలచగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 వ. 3. (తె. 29).

పెరటు: వెదురుగంపమీది పసరు వన్నెపొర. (కో. 4).

పెరుగుగుట్ల: ఉ. పెరుగు —; పెరుగుముంతలు పెట్టుకొని తీసుకువెళ్ళే గుల్ల (తె. 17).

పెళుసు పేము: ఉ. పెళుసు —; తీగ చీరుతున్నప్పుడు విరిగిపోయేరకం పేముకర్ర. (కో. 3).

పెళ్ళికూతురుగంప: పర్యా. కన్యాదానం గంప, గౌరీతపను బుట్ట, పాలగంప (2), పెళ్ళిగంప. పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టడానికి అల్లే వెదురుగంప; కింద నాలుగుమూలలుగాఉండి పైన గుండ్రంగా ఉంటుంది; కొన్నిచోట్ల దీని అంచుచుట్టూ చేటకట్టు (=వెదురుబద్దలతో బిగింపు)లాంటి కట్టుఉంటుంది; కొన్నిచోట్ల ఏమీ ఉండదు; పెళ్ళికిముందు గౌరీ పూజ చేసేచోట పెళ్ళికూతుర్ని అందులో కూర్చో బెడతారు; పూజ అయి ప్రవరలుచెప్పిన తరవాత పెళ్ళికూతురు కూర్చున్న గంపను పెళ్ళిమండపం లోకి ఎత్తుకువస్తారు; పెళ్ళి (ముహూర్తంవేళ జరిగే తతంగం) అయ్యేవరకు పెళ్ళికూతురు ఆ గంప లోనే ఉంటుంది. (కో. 12, 17).

పెళ్ళిగంప: పర్యా. చూ. పెళ్ళికూతురు గంప. పెళ్ళి కూతుర్ని కూర్చోబెట్టడానికి అల్లే వెదురుగంప; కింద నాలుగుమూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది; కొన్నిచోట్ల దీని అంచుచుట్టూ చేటకట్టు (=వెదురుబద్దలతో బిగింపు)లాంటి కట్టు ఉంటుంది; కొన్నిచోట్ల ఏమీఉండదు; పెళ్ళికిముందు గౌరీపూజ చేసేచోట పెళ్ళికూతుర్ని అందులో కూర్చోబెడ తారు; పూజ అయి ప్రవరలుచెప్పిన తరవాత పెళ్ళి కూతురు కూర్చున్న గంపను పెళ్ళిమండపంలోకి ఎత్తుకువస్తారు; పెళ్ళి (ముహూర్తంవేళ జరిగే తతంగం) అయ్యేవరకు పెళ్ళికూతురు ఆ గంపలోనే

ఉంటుంది. (కో. 10, 19).

పెళ్ళిపెట్టె: ఉ. పెల్లి —; చూ. పెండ్లిపెట్టె; పర్యా. చూ. సారెపెట్టె. పెళ్ళిసందర్భంగా పెళ్ళికూతురుకిచ్చే సారెసామాను (చలిమిడి, పసుపు, సున్నిపిండి, పెనగపప్పు, కుడుములు, అరిసెలు, కోవాలు, ఖర్జూరపండ్లు, కుంకుమభరిణెలు, గోరుముద్ద, అద్దం, ఈర్పెన, దువ్వెన, లక్క బుడ్డి, సన్నపూసలు, పగడాలు మొ॥వి) పెట్టిఇచ్చే పెట్టె; దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; అల్లకం చేటమాదిరిగా అంతటా బద్దలువేసి కట్టుకవరాలు; మూలగూడా ఉంటాయి ఉంటుంది; ఆర్థికస్తోమతుల అంతగా లేనివాళ్ళు ఇస్తారు; కొంచెం ఉన్నవాళ్ళు బంగిపెట్టె (గుండ్రటి మూతలుగా గుండ్రంగా ఉండేది) ఇస్తారు. (కో. 28, 29, 31).

పెళ్ళిబుట్ట: పర్యా. చూ. బియ్యం గడపబుట్ట. బియ్యం కడిగి గాలించినతరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసి ఉంచే బుట్ట; కొంచెం పలచగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద సన్నగాఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి పైవరకి ఒకే తీరుగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగుమూలలుగాఉండి పైన గుండ్రంగా ఉంటుంది (చిన్న చేటమాదిరిగా అల్లుతారు), సంతర్పణ సందర్భంలో వాడతారు; చూ. చిత్రం 48 (కో. 30).

పెషల్: ఉ. పెశల్; పర్యా. చూ. స్పెషల్‌బొంగు. నాణ్యమైన లావుపాటి వెదురుగడ; 15 నుంచి 18 సెంటిమీటర్లవరకు లావుంటుంది; లోయల్లో పుట్టి పెరగడంవల్ల నిటారుగా, లావుగా ఉంటుంది; ముళ్ళులేకుండా సాపుగాఉండి మేదరిపనికీ పచ్చే న్లకూ ఉపయోగపడుతుంది; వ్యాపారంలోనుంగా వాడుకలోకి వచ్చినపేరు. (కో. 8; రా. 11).

పెన్షల్‌బొంగు ఉ. పెషల్ , పెషు , పెసల్ —, పెనలు , పెనులు , పేశల్ , పేషల్ ; చూ. స్పెషల్‌బొంగు. (కో. 7, 8; తె. 1, 2, 6, 17-19, 21, 22, 24; రా. 6).

పేంగుమ్మి. (< పేము —) పేముపొద; అడవి ప్రాంతంలో పెరుగుతుంది. (కో. 3).

పేంచు: (క్రి). పర్యా. అల్లు (2). ఈతబద్దతో గంప, బండిజల్ల మొ॥ తయారుచేయడం. (తె. 11).

పేట: పర్యా. పిండి (2), పోగు (2). పాయ; కొబ్బరితాడు పేనేటప్పుడు రెండుగాని మూడుగాని, నాలుగుగాని పాయలు పెనవేసి పేనుతారు. (కో. 20, 23).

పేటి: ఉ. పేటి, 1. బండిజల్లకు అడుగునా చక్కగా [illegible] బిగించబడ్డ (కో. 18); 2. [illegible] అందంకోసం [illegible] (కో. 10).

పేడుత్తు [illegible]: (< [illegible] ఎత్తు [illegible]) (క్రి.) చాప [illegible] అనులు మార్చడం; [illegible] అ [illegible] ఉపయోగం సుకోసం అనులు [illegible]. (కో. 8).

పే[illegible]: చూ. పె[illegible]గంప; పర్యా. చూ. పేడతట్ట (2) పేడవేసుకొనే చిన్న ఈత తట్ట; పళ్ళెం మాదిరిగా ఉంటుంది. (రా. 8).

పేడగుల్ల: పర్యా. చూ. పేడతట్ట (2). పేడవేసుకొనే చిన్న ఈత తట్ట; పళ్ళెంమాదిరిగా ఉంటుంది. (తె. 9).

పేడతట్ట: 1. చూ. పెంటతట్ట; పర్యా. డోంగి, తట్ట (1), పేడమాని. పేడవేసుకొచ్చే చిన్న తట్ట; అల్లకం చిక్కగా ఉంటుంది; కొన్నిచోట్ల పెంకె ఆకారంలోనూ కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి గిన్నెమాదిరిగానూ కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 9; రా. 3); 2. చూ. పెంటతట్ట (2); పర్యా. పేడగంప, పేడగుల్ల. పేడవేసుకొనే చిన్న ఈత తట్ట; పళ్ళెంమాదిరిగా ఉంటుంది. (కో. 3; తె. 7).

పేడమాని: ఉ. మాని; పర్యా. చూ. పేడతట్ట (1). పేడవేసుకొచ్చే చిన్నతట్ట; అల్లకం చిక్కగా ఉంటుంది; కొన్నిచోట్ల పెంకె ఆకారంలోనూ కొన్నిచోట్ల అడుగు సమతలంగాఉండి గిన్నెమాదిరిగానూ కొన్నిచోట్ల కింద నాలుగుమూలలుగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. (కో. 29).

పేడల్లకం. (పేడు + అల్లకం) పర్యా. చూ. చేటల్లకం (1). నిలువుబద్దలేకుండా కేవలం పేడుతోనే ఎదురుబదురుగా గచ్చంవచ్చేటట్లు (చూ. గచ్చం) అల్లడం; చేట, జల్లెడ, విసనగర్ర, చాప మొ॥వి ఇలా అల్లుతారు. (తె. 3, 9, 12, 30, 31).

పేడు: 1. పర్యా. అకుడు (1), ఆకు (2), ఈనె (1), బద్ద (3) పచె (1), రేవు (1), సన్నీనె (1). వెదురుబద్ద సన్నగాచీలిస్తే వచ్చే పాయ; సుమారు చిటికెనవేలెడు వెడల్పు గోరంతమందమూ గజం న్నరపొడుగూ ఉంటుంది; చేట, జల్లెడ, మొ॥ అల్లడానికి వాడతారు; అల్లేవస్తువునుబట్టి దీని పొడుగు, వెడల్పులు నిర్ణయించుకొంటారు. (కో. 3, 8, 9, 12, 13, 15-18, 20, 24; తె. 1, 2, 4, 6-10, 12-17, 19, 26-28, 30, 31; రా. 2-6).

2. పర్యా. చూ. అడ్డం, తడిక, బండిజల్ల, పిల్లల పొది, ఉయ్యాల, చెండ్రిక మొ॥ వాటి నిలువుల చుట్టూ అడ్డంగాఅల్లే మందంపేడు లేదా పలచటిబద్ద; మామూలుపేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (కో. 2); 3. పర్యా. చూ. తడకపేడు. తడక అల్లడానికి వెదురుబద్ద చీరితీసిన పేడు; వెడల్పుగానూ (= రెండువేళ్ళపాటి) మందంగానూ ఉంటుంది. (తె. 27); 4. ఈతమట్ట కోసినతరవాత చెట్టుకు మిగిలిన మట్ట మొదలు; ఇలాటివి చెట్టుచుట్టూ ఉంటాయి. (తె. 26); 5. ఈతదబ్బను నిలువుగా సగానికి చీరితీసినభాగం. (తె. 11); 6. పర్యా. చూ. తీగ (5). పేము పైపొరనుంచి చీరితీసిన సన్నటి పేడు; బుట్టలూ కుర్చీలూ టీపాయ్‌లూ ఉయ్యాలలూ మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 139.5. (కో. 12); 7. పర్యా. చూ. పెడ (2). కొబ్బరికాయచుట్టూ పైన పచ్చగా నున్నగా ఉండే పలచటి పొర; బాట (కో. 20). 8. (క్రి.) పర్యా. వడివేయు. నారకు పురిబెట్టడం; మెలిదిప్పుతారు. (రా. 5).

పేడుగీత: వెదురుపేడును కత్తితో నున్నగా గీకడం. (కో. 17; తె. 31).

పేడుగీయు: (క్రి.) పర్యా. చూ. గీతబట్టు. వెదురు పేడు నున్నగా గీకడం; బొద్దుభాగంవైపు పసరు భాగంవైపు - రెండువైపులా గీకుతారు; పసరుభాగం వైపు గీకడంవల్ల అల్లేటప్పుడు జారకుండా పొందికగా ఉంటుంది; మొద్దుకూ లేదా వంకెకూ కత్తి పదునుకూ మధ్య పేడుపెట్టిలాగుతూ గీకుతారు. (కో. 17; తె. 31).

పేడుచీరు: (క్రి.) రూ. పేడుజీలు; పర్యా. చూ. పైదు (2). కత్తితో పేడుతియ్యడం; వార, పలుకు, సర్కు, దాలెం (చూ.)లనుంచి తీస్తారు. (కో. 12; తె. 5).

పేడుచీల్చు: (క్రి.) ఉ.—సీల్చు; పర్యా. చూ. పైదు (2). కత్తితో పేడుతియ్యడం; వార, పలుకు, సర్కు, దాలెం (చూ.)లనుంచి తీస్తారు. (కో. 13).

పేడుచెక్కు: (క్రి.) 1. పర్యా. చూ. గీతబట్టు. వెదురుపేడు సన్నగా గీకడం; బొద్దుభాగంవైపు పసరుభాగంవైపు - రెండువైపులా గీకుతారు; పసరు భాగంవైపు గీకడంవల్ల అల్లేటప్పుడు జారకుండా పొందికగా ఉంటుంది; మొద్దుకూ లేదా వంకెకూ కత్తిపదునుకూ మధ్య పేడుపెట్టిలాగుతూ గీకుతారు. (కో. 13); 2. పర్యా. చూ. పైదు (2). కత్తితో పేడుతియ్యడం; వార, పలుకు, సర్కు, దాలెం (చూ.)ల నుంచి తీస్తారు. (కో. 12, 16).

పేడుజీలు: (క్రి.) రూ. పేడుచీరు. (కో. 8).

పేడుతీయు: (క్రి.) పర్యా. చూ. పైదు (2). కత్తితో పేడుతియ్యడం; వార,పలుకు, సర్కు,దాలెం (చూ.)ల నుంచి తీస్తారు. (కో. 10; తె. 30).

పేండ్రించు: (క్రి.) పర్యా. చూ. మెండించు. వెదురు గడ చీల్చేటప్పుడు కణుపు సులువుగా తెగడానికి కత్తిని అడ్డంగా మెలిదిప్పడం. (తె. 21).

పేడవాకఇల్లు: పేడలు వెదురుబద్దలతో కట్టుకొనే ఇల్లు; మొత్తం పుల్లెంటొంగుతో కడతారు. (తె. 20).

పేను: (క్రి.) రూ. పేము[3], రెండు పీచుకట్టల (= కొబ్బరిపీచు తాల్చి చేసినవి) నుంచి పోగులు లాగి విడివిడిగా వడిదిప్పుతూ రెంటినీకలిపి పేన వేయడం. (కో. 5, 19, 23, 30).

పేన్‌బెత్తం: చూ. పేముబెత్తం. (కో. 19).

పేపరుకొట్టు: (క్రి.) తయారైన కుర్చీకి రంగువేయ డానికి గరుక్కాయితం (గరుకుగాఉండే ఉప్పు కాయితం)తో రుద్దడం; పేముకర్రల్ని స్టౌమీద కాల్చి వంచేటప్పుడు అంటిన మసిని ఇలా గీకే స్తారు. (కో. 12).

పేము[1]: పర్యా. కేన్‌బెత్తం, పేముబెత్తం. నిటారుగా పొదలాపెరిగే ఒకరకం గడ్డిమొక్క; కర్రకు మధ్య మధ్య కణుపులుంటాయి; సన్నరకంపేము చీరితీసిన తీగతో బుట్టలు మొ॥ అల్లుతారు; లావుపాటి కర్ర కుర్చీలు, సోఫాలు మొ॥ చేయడానికి పనికొస్తుంది (Calamus Fasciculatus, Br. C. rotang Man) చూ. చిత్రం 133. (కో. 3).

పేము:[2] చూ. ఫ్రేం. (కో. 25).

పేము:[3] (క్రి.) చూ. పేను. (కో. 26, 29, 30).

పేముకర్ర: ఉ. పేంకర్ర; పేముకట్టె; లావుగా ఉండేది. (కో. 10–12).

పేముగంప: పేముతో అల్లినగంప; పొలానికి అన్నం తీసుకువెళ్ళడం పిండివంటలు పెట్టుకోడం మొ॥ వాటికి వాడతారు. చూ. చిత్రం 140. (కో. 3).

పేముతీగ: పేముకట్టె చీల్చితీసిన పలచటి తీగ; ఇలాటితీగ రావడానికి పేముకట్టెను కత్తులపెట్టె (చూ.)లో పెట్టి కత్తులమధ్య నుంచి లాగుతారు. (కో. 10).

పేముబెత్తం: ఉ. పేంబెత్తం; రూ. పేన్‌బెత్తం; పర్యా. చూ. పేము[1]. నిటారుగా పొదలాపెరిగే ఒకరకం గడ్డిమొక్క; కర్రకు మధ్యమధ్య కణుపు

ఉంటాయి; సన్నరకం పేము చీరితీసిన తీగతో బుట్టలు మొ॥ అల్లుతారు; లావుపాటి కుర్చీలు, సోఫాలు మొ॥ చేయడానికి పనికొస్తుంది. (Calamus Fasciculatus Br. C, rotang, Man.) చూ. చిత్రం 133. (కో. 12; తె. 22).

పేలు: (క్రి.) ధ్వనిచేస్తూ పగలడం; కత్తితో వెదురు గడ చీరేటప్పుడు గంటిగనుపు ఇలా పగులుతుంది. (కో. 30).

పేళ్ళతడక: ఉ. —తడిక; నిలువులువేసి అడ్డంగా పేళ్ళతో అల్లేతడక. (కో. 10, 17).

పైకింగ్‌తాడు: (ఇం. Packing—) చిన్న అట్ట పెట్టెల్ని పైక్‌చేయడానికి పనికొచ్చే సన్నటితాడు. (కో. 29).

పైకింగ్‌బద్ద: దూదిబేళ్ళు మొ॥ కట్టడానికిపెట్టే వెదురు బద్ద; ఇలాటివి చుట్టూ పెడతారు. (తె. 10).

పైటగంప: పట్నానికి (= పేటకు) కూరగాయలు, పిడకలు మొ॥ తీసుకుపోవడానికి పనికొచ్చే రూత గంప. (తె. 14).

పైకట్టు: ఉ. పెయి—; పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచు చుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండు వేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం. చూ. చిత్రం 47 క. 5 (రా. 9).

పైకొమ్ము: పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరి భాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కిందినుంచి గాని, మీదినుంచిగాని అదనంగా వేసే మరో కొమ్ము; మొదటిదానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము. (కో. 16).

పైకొమ్ముబద్ద: ఉ. పైకొంబద్ద; పర్యా. చూ. బదులు కొమ్ము. చేట ముందరిభాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కిందినుంచిగాని, మీదినుంచిగాని అదనంగావేసే మరోకొమ్ము; మొదటిదానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము. (కో. 10, 17).

పైగట్టు: పర్యా. చూ. వెనకకట్టు (1). చేట వెలుపలి అంచుచుట్టూపెట్టి బిగించేబద్ద (కట్టు) చూ. చిత్రం 29.7 (తె. 28).

పైగుండు: 1. పర్యా. చూ. బిలుకు (1). జల్లెడఅంచు కట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండు చుట్టూవేసే రెండుమూడువేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలి గుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు చివర్లు (కర్పడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండుబద్దల పైనా మరో మందంబద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3. (తె. 19, 28); 2. పర్యా. చూ. కర్ర (4). జల్లెడఅంచు కట్టడానికి లోపలి గుండుబిలుకు (వెలుపలిబద్ద)ల మీంచి, ఆ రెంటి మధ్య కొంతభాగం ఇరికిస్తూవేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద. (తె. 26, 27).

పైతల: పర్యా. తల (6). వాకిలితడక (= ఇంటి ముందుభాగమంతకూ కట్టెతడక; దీనికి ద్వారం, ద్వారంతడకా కలిసే ఉంటాయి) లోగుమ్మానికి పైనఉండే తడకభాగం. (కో. 12).

పైదబ్బ: 1. పర్యా. చూ. బిలుకు (1). జల్లెడ అంచు కట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండు చుట్టూవేసే రెండు మూడువేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలి గుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు చివర్లు (కర్పడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండుబద్దల పైనా మరో మందం బద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3. (రా. 3); 2. పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట, మొ॥వాటికి వంచికట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (రా. 9); 3. వెదురుపేళ్ళ తడకకు ఎత్తున పై అంచుకు వేసిన బద్ద. (కో. 3).

పైదు: (క్రి.) 1. పర్యా. చూ. గీయు(1). వెదురుబద్ద గాని పేడుగాని కర్ర (= తీగలాంటి సన్నటి వెదురుచువ్వ) గాని కత్తితోనున్నగా గీకడం; "ఈనె సాఫుగా పైదరా అంతాం" (కో. 35); 2. పర్యా. దెక్కుకొను, పేడుచీరు, పేడుచీల్చు, పేడుదెక్కు(2), పేడుతీయు. కత్తితో పేడు తియ్యడం; వార, పలుకు, గర్మ, డాలెం (చూ.)ల నుంచి తీస్తారు. (కో. 21-23, 28, 31).

పైదేకత్తి: పర్యా. లిక్కత్తి. చిన్నసైజు మేదరికత్తి; వెదురుబద్దలూ పేళ్ళూ చీరడానికి వాడేది; గడలు నరకడానికి పనికిరాదు; బరువు తక్కువగా ఉండడం వల్ల పిల్లలూ ఆడవాళ్ళూ దీంతో సులువుగా పని చెయ్యగలరు; ఒడ్డుకత్తి కన్న పదునుగా ఉంటుంది. (కో. 27, 28).

పైనకడ్డీ: పర్యా. చూ. బదులుకొమ్ము. చేట ముందరి భాగంలో మొదటవేసిన కొమ్ముదగ్గర కిందినుంచి గాని మీదినుంచిగాని అదనంగా వేసే మరోకొమ్ము మొదటిదానికిది తోడుగా ఉంటుంది. చూ. కొమ్ము (రా. 7).

పైపసుపు: పర్యా. చూ. పసుపు. వెదురుగడ పచ్చిగా ఉన్నప్పుడు చుట్టూఉండే ఆకుపచ్చని పొర; సన్నగా మెత్తగా ఉంటుంది; పసిపిల్లల అతిసార వ్యాధికి మందుగా వాడతారు. (కో. 20).

పైపేడు: 1. పర్యా. చూ. పసపుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా సన్నగాఉండే పైభాగంతో కూడిఉన్న పేడు. (రా. 2); 2. పర్యా. చూ. కోతపేడు. చేట, గూన, బుంగ మొ॥ అల్లిన తరవాత వాటి మూలలవగ్గర మిగిలిన పేడు(లు); వీటిని కోసేస్తారు; దేనికీ పనికిరావు. (కో. 12).

పైబద్ద: 1. పర్యా. చూ. పసరుదబ్బ (1). పసరు వన్నెలో సన్నగాఉండే పైభాగంలో వచ్చిన వెదురుబద్ద. (తె. 26); 2. పర్యా. చూ. అంచు కట్టుబద్ద. గూడ, ఉయ్యాల, పెళ్ళిపెట్టె, బుట్ట మొ॥వాటి అల్లకంలో వాటి అంచుచుట్టూ గట్టిదనం కోసం కట్టిన పలచటి వెదురుబద్ద. చూ. చిత్రం 35 క. 2. (కో. 11).

పైబొద్దు: పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచుచుట్టూ వెలుపలి నుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం. చూ. చిత్రం 47 క. 5. (కో. 1, 3; రా. 3, 5, 6).

పైయని: (< పై + అని) ఉ. పయాన, పయ్యన; బండిజల్ల అల్లకంలో పైన మిగిలిపోయే పసరు దబ్బ (= ఒకవైపు పచ్చగా సన్నగాఉన్న బద్ద); బుట్టగంప మొ॥వాటి అల్లకంలో రెండో అడుగుకు పైనుంచి వచ్చే నిలువుపేడు. (కో. 7).

పైలాయించు: బండిజల్ల మొ॥వాటి అల్లకం మొదలు పెట్టడం. (తె. 20).

పైవడుకు: ఉ. —వొడ్కు; పర్యా. చూ. వెనకకట్టు (1). చేట వెలుపలి అంచుచుట్టూపెట్టి బిగించేబద్ద (కట్టు). చూ. చిత్రం 29.7 (రా. 11).

పొక్క: 1. రూ. బొక్క (5); పర్యా. చూ. బోలు (1). వెదురుగడలోపల ఒక కణుపునుంచి మరొక కణుపు వరకు మధ్యలో నిలువుగాఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికిసన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1. తె. 12, 24); 2. పర్యా. చూ. దోనె (2). వెదురు గడను నిలువుగా రెండుపాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగాఉండే భాగం. (తె. 12); 3. బెజ్జం; పేము తిత్తాన్నిపంచి మొద్దుకుచేసిన చిల్లి; సాగచూపిన పేమును ఈ చిల్లిలోపెట్టి మెందిస్తారు చూ. చిత్రం 131.1. (తె. 22).

పొటుక్క: పర్యా. చూ. పొట్టు (3). కొబ్బరిపీచు నలిపి నప్పుడుగాని దులిపినప్పుడుగాని, రాలే (ఎర్రటి) పొడి. (కో. 5)

పొటొంజి: నాగలిని కాడికికట్టే మోకు ఒక చివర ఉండే చిరత (చిన్న కర్రముక్క)కూ నాగలిమేడికీ తగిలించే జేనెడు పొడుగుతాడు; దీనికి రెండు కొలు కులు 8 అంకె ఆకారంలో ఉంటాయి; చూ. చిత్రం 120. (కో. 30).

పొటొంజిమోకు: పర్యా. చూ. మోకు (2). దున్నే టప్పుడు నాగలికి కాడిని కలపికట్టే కొబ్బరితాడు; ఇది మామూలుగా ఉంటుంది; కొన్ని ప్రాంతాల్లో ఈ తాడు రెండుచివర్లా చిరత (=చిన్న కర్ర ముక్క)లు తొడిగి ఒక చిరతకు పొటొంజి (= వల ఆకారంగా పేనిన తాడు)ని తగిలిస్తారు; పొటొంజి రెండోచివరను నాగలిమేడికి తగిస్తారు. ఇలాంటి మోకును ఆ ప్రాంతంలో పొటొంజిమోకు, మొగ మోకు అని, చిరతలులేని మోకును ఆడమోకు అని వ్యవహరిస్తారు. చూ. చిత్రం 120. (కో. 30).

పొట్ట: 1. పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగాఉండే భాగం (తె. 8); 2. చూ. పొట్టె (2) (కో. 12, 3. ఈతకమ్మకు ఆకులుపెరిగిన రెండంచులకూ మధ్య పల్లంగాఉండే భాగం చూ. చిత్రం 11.6 (కో. 9, 25; తె. 11); 4. చెట్టునఉన్నప్పుడు తాటి కమ్మ పైభాగం. చూ. చిత్రం 123.3. (కో. 23).

పొట్టచువ్వ: ఉ. — సువ్వ. పర్యా. చూ. పొట్టదబ్బ ఈతకమ్మపొట్ట (చూ.) చీరితీసిన బద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11.2. (తె. 7).

పొట్టదబ్బ: పర్యా. ఒందబ్బ, ఒరదబ్బ, గుండుదబ్బ (2), పొట్టచువ్వ, పొట్టపుల్ల, పొట్టబరిగె, మెట్టు (2), వడిదబ్బ. ఈతకమ్మపొట్ట (చూ.) చీరితీసిన బద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడ తారు. చూ. చిత్రం 11.2. (కో. 8).

పొట్టపుల్ల: పర్యా. చూ. పొట్టదబ్బ. ఈతకమ్మపొట్ట (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11.2, (కో. 8).

పొట్టపేడు: ఉ. — బేడు, — వేడు; 1. పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా

సన్నగా ఉండే భాగం [illegible]; పసుపచ్చగా [illegible] తెల్లగా ఉంటుంది. (తె. 3, 1[illegible]); 2. పర్యా. చూ. బెండుపేడు (1). వెదురుగడలో బోలుగా ఉన్న భాగంనుంచిగాని వెదురుబద్ద పల్లపుభాగంనుంచిగాని చీరినపేడు; అంత సన్నగాగాని గట్టిగాగాని ఉండదు. (కో. 5).

పొట్టబొంగు: పర్యా. చూ. [illegible] విరిచేసినబద్ద. గంప మొ॥ అల్లేవాళ్లు [illegible] వాడతారు. చూ. చిత్రం 11.2. (తె. 11).

పొట్టమీదగనుపు: పర్యా. చూ. బొద్దె (1) వెదురు బద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెరిగేస్తారు. (కో. 18).

పొట్టయేను: పర్యా. కాయితంపొర, పొట్టు (2), పొర (2), పోర్వ, బొద్దు (4). వెదురుగడ చీరినప్పుడు లోపలి పల్లపుభాగంలో కనిపించే పలచటి ఉల్లిపొర కాయితంలాంటి పొర. (కో. 5).

పొట్టికట్టె: పర్యా. చూ. కురచబొంగు. పదిమూరల కన్న తక్కువపొడుగున్న వెదురుగడ. (రా. 1)

పొట్టికర్ర: పర్యా. చూ. కురచబొంగు. పదిమూరల కన్న తక్కువపొడుగున్న వెదురుగడ. (కో. 12).

పొట్టిగనుపుకర్ర: ఉ. -గెన్ను-; పర్యా. చూ. కంచ (గనె) బొంగు. కణుపులమధ్య దూరంచాలా తక్కువ ఎడముండే వెదురుగడ; మేదరిపనికి ఎక్కువగా ఉపయోగపడదు; తడిక, నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 3).

పొట్టినె: (పొట్ట+ఈనె) 1. పర్యా. చూ. పసరుకింది కర్ర. వెదురుబద్దపక్కైన సన్నగా పచ్చగాఉండే (పసరు)భాగం కిందినుంచి తీసినకర్ర; చూ. కర్ర. (కో. 5); 2. పర్యా. చూ. బెండుపేడు (1). వెదురు గడలో బోలుగాఉన్న భాగంనుంచిగాని వెదురుబద్ద పల్లపుభాగంనుంచిగాని చీరినపేడు; అంత సన్నగా గాని గట్టిగాగాని ఉండదు. (కో. 27-31).

పొట్టు: 1. పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (తె. 13); 2. పర్యా. చూ. పొట్టయేను. వెదురు గడ చీరినప్పుడు లోపలి పల్లపుభాగంలో కనిపించే పలచటి ఉల్లిపొర కాయితంలాంటి పొర. (కో. 29; తె. 15); 3. పర్యా. కొబ్బరిపొట్టు, పొక్కు, బొత్తు. కొబ్బరిపీచు నలిపినప్పుడుగాని దులిపినప్పుడు గాని రాలే (ఎర్రటి) పొడి. (కో. 21, 25); 4. [illegible] పొట్టు [illegible] ఉండే పలచటి [illegible]; [illegible] ఉన్నప్పుడు [illegible] ఉంటుంది. (ఖా. 10); 5 [illegible] కొట్టి [illegible]; పంటి సముపెక్కిన [illegible]. ([illegible]. 4, 5)

పొట్టుగంప 1 పర్యా. చూ. ఊకగంప. వరిపొట్టు (ఊక) మోసుకుపోవడానికి [illegible] చేతగా [illegible] పొట్టూ వెనగపొట్టూ మొ॥ మోసుకు పోవడానికి వాడే పెద్దగంప. (కో. 3); 2. వేరు సెనక్కాయలపొట్టు మోసుకొచ్చే ఈతగంప. (రా. 8).

పొట్టుజల్లి: 1. పర్యా. ఊకజల్లి. పొట్టు (ఊక) చెరిగేసే బండిమీద పరవడానికి అల్లినజల్లి. (కో. 9; తె. 4, 31); 2. పర్యా. చూ. ఊకగంప. వరిపొట్టు (ఊక) మోసుకుపోవడానికీ పశువులకు మేతగాపెట్టే ఉలవలపొట్టూ, సెనగపొట్టూ మొ॥ మోసుకుపోవడానికి వాడే పెద్దగంప. (రా. 6 8).

పొట్టుదాలెం: చూ. పొట్టుదాలెం. (కో. 25, 27, 31).

పొట్టుపీచు: ఉ. పీచు; కొబ్బరికాయ పెంకును అంటుకొని ఉండే పీచుపొర; దీన్ని నలిపితే పొట్టు ఎక్కువగా రాలుతుంది. (కో. 20).

పొట్టుపేడు: పర్యా. చూ. బెండుపేడు (1). వెదురు గడలో బోలుగాఉన్న భాగంనుంచిగాని వెదురుబద్ద పల్లపు భాగంనుంచిగాని చీరినపేడు; అంత సన్నగా గాని, గట్టిగాగాని ఉండదు. (కో. 24).

పొట్టుబద్ద: పర్యా. చూ. బెండుబద్ద (1). వెదురు గడ చీల్చినప్పుడు బోలుగాఉన్న భాగంనుంచి తీసిన బద్ద. (కో. 28, 30).

పొట్టుబద్దలతడక: ఉ. తడక; పర్యా. చూ. బద్దల తడక. బద్ద బద్దలవరసగా అల్లినతడక; నిలువుకూ అడ్డానికీ బద్దలేవాడతారు. (కో. 24).

పొట్టువారు: పర్యా. చూ. బెండుకర్ర (1). వెదురుబద్ద పల్లపుభాగంనుంచి తీసినకర్ర (చూ.); గంపలు మొ॥ అల్లడానికీ కట్టు (బొద్దు) చుట్టడానికీ ఉప యోగం. (కో. 27).

పొట్టె: 1. పర్యా. చూ. బెండు (1). వెదురుగడ లోపల గుల్లగాఉన్నభాగం గోడ; పొడుగ్గా పల్లంగా ఉంటుంది. (తె. 22). 2. చూ. పొట్ట (2), బొక్కెంచి; పర్యా. బెండు (7). వెదురుబద్ద పల్లపుభాగంలో ఉండే కండ. (తె. 27); 3. పర్యా. చూ. కట్టె

ముంగు. చేట, జల్లెడ, విసనగర్ర, మొ॥ వాటికి కట్టుకట్టడాని కుపయోగించే పలచటిపేడు; దీన్ని వెదురునుంచిగాని ఈతబరిగెనుంచిగాని తాటిమట్ట నుంచిగాని తీస్తారు. (తె. 6-10, 31).

పొట్టెఅతుకు: ఉ.—అతుకు; పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగాఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 21).

పొట్టెకర్ర: ఉ.—గర్ర; పర్యా. చూ. బెండుకర్ర (1). వెదురుబద్ద పల్లపుభాగంనుంచి తీసినకర్ర (చూ.); గంపలు మొ॥ అల్లడానికీ కట్టు(బొద్దు) చుట్టడానికీ ఉపయోగం. (తె. 21, 22).

పొట్టెంగోవ: వెదురుబద్ద పల్లపుభాగంనుంచి తీసిన గోవ. (కో. 22).

పొట్టెదబ్బ: పర్యా. చూ. కండదబ్బ (4). ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగంనుంచి నిడుపుగా చీరినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్టడానికీ ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పనికొస్తుంది. చూ. చిత్రం 11.3. (తె. 16).

పొట్టెందాలెం: రూ. పొట్టుదాలెం; పర్యా. బెండు పలుకు. బద్ద పల్లపుభాగంనుంచి బద్ద వెడల్పుగా తీసిన దాలెం; చూ. దాలెం. (కో. 22. 23).

పొట్టెపీనె: (< పొట్టెపు + ఈనె) ఉ. పొట్టుపీనె; రూ. పొట్టెంయీనె, పొట్టెంయేన; పర్యా. చూ. బెండుపేడు (1). వెదురుగడలో బోలుగాఉన్న భాగంనుంచిగాని వెదురుబద్ద పల్లపుభాగంనుంచిగాని చీరినపేడు; అంత సన్నగాగాని, గట్టిగాగాని ఉండదు. (కో. 23, 25, 28).

పొట్టెబేరి: పర్యా. చూ. బెండుపేడు(1). వెదురుగడలో బోలుగాఉన్న భాగంనుంచి వెదురుబద్ద పల్లపుభాగంనుంచిగాని చీరినపేడు; అంత సన్నగాగాని, గట్టిగాగాని ఉండదు. (తె. 22).

పొట్టెం: ఎందుకూ పనికిరాకుండా మిగిలిపోయిన వెదురుపేడు. (కో. 21).

పొట్టెం(పు)వార: ఉ. పొట్టెపోర, పొట్టెమూర; పర్యా. చూ. బెండుకర్ర (1). వెదురుబద్ద పల్లపు భాగంనుంచి తీసినకర్ర (చూ.); గంపలు మొ॥ అల్లడానికీ కట్టు (బొద్దు) చుట్టడానికీ ఉపయోగం. (కో. 23, 31).

పొట్టెంయీనె: చూ. పొట్టెపీనె. (కో. 26).

పొట్టెంయేన: చూ. పొట్టెపీనె. (కో. 22).

పొట్టెంవేయు: (క్రి.) కట్టుగర్రను కట్టుముంగుతో బిగించడం. (తె. 14).

పొట్టెలు: (బ.) పర్యా. చూ. పీచు (1). వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరిపడితే జలుబు తగ్గుతుందట; మెత్తగాఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు. (కో. 22).

పొడ: పర్యా. చూ. పసరు. వెదురుగడ పచ్చిగా ఉన్నప్పుడు చుట్టూఉండే ఆకుపచ్చనిపొర; సన్నగా మెత్తగా ఉంటుంది; పసిపిల్లల అజీర్ణవ్యాధికి మందుగా వాడతారు. (రా. 2).

పొడక: చూ. పొనక(1). (కో. 29).

పొడవంచు: తాటిచాప అల్లకంలో పొడుగాటి భాగానికి చివర. (కో. 28).

పొడవుచాప. ఉ. —సాప; ఐదుమూరల పొడుగూ మూడుమూరల వెడల్పూపెట్టి అల్లిన తాటిచాప. (కో. 23).

పొడవుదండె: ఉ. —దండి; పర్యా. చూ. అంచుకర్ర, బండిజల్ల మొ॥వాటి అంచులకు తొడిగే వెదురు కర్ర. చూ. చిత్రం 32.1 (కో. 31).

పొడవుబద్ద: 1. తడకఫ్రేముకు పొడుగువైపు పెట్టిన బద్ద. (కో. 23); 2. చూ. పొడుగుబద్ద. (కో. 22).

పొడిపీచు: ఉ. —పీసు; కొబ్బరిదొక్కను నీళ్ళల్లో నానవేయకుండా (పొడిగా) తీసినపీచు. (కో. 21).

పొడిమట్ట: నీళ్ళలో ఊరెయ్యని కొబ్బరిమట్ట; పొడిగా ఉండేది; చూ. డొక్క. (కో. 25).

పొడుగంచు: ఈతచాప నిలువులో కొసలను మూస్తూ అంచుపట్టెతో కట్టగా ఏర్పడిన ఉబ్బెత్తుభాగం, (తె. 22).

పొడుగాకు: పొడుగ్గాఉండే ఈతాకు. (తె. 22).

పొడుగుకర్ర: పర్యా. చూ. పొడుగుబొంగు. పది మూరలనుంచి పదిహేను మూరలవరకు పొడుగున్న వెదురుగడ. (కో. 10).

పొడుగునిలుగు: ఉ. —నిల్లు; కోళ్ళగూడుకు పెట్టిన పొడుగాటి నిలుగు. (తె. 23).

పొడుగుబద్ద: రూ. పొడవుబద్ద (2); పర్యా. చూ. నిలువుబద్ద(2). అల్లకం పూర్తయిన తరవాత గట్టిదనంకోసం తడకమీంచి మధ్యభాగంలో నిలువుగా కొట్టే వెదురుబద్ద. చూ. చిత్రం 36 క. 3. (తె. 25).

పొడుగుబొంగు: ఉ. పొడుబొంగు, పొడుంబొంగు,

పొడూబొంగు; పర్యా. నిలువుబొంగు (1). పెద్దకర్ర, పొడుగుకర్ర, పొడుగువాసం, పొడుగువెదురు, బారుకర్ర (1), బారుగడ, బారుబొంగు (1), బారువాసం, బారువెదురు. పది మూరలనుంచి పదిహేనుమూరల వరకు పొడుగున్న వెదురుగడ. (తె. 2, 21, 27, 28; రా. 1, 4, 5).

పొడుగువాసం: పర్యా. చూ. పొడుగుబొంగు. పది మూరలనుంచి పదిహేను మూరలవరకు పొడుగున్న వెదురుగడ. (కో. 11).

పొడుగువెదురు: రూ. పొడుగెదురు; పర్యా. చూ. పొడుగుబొంగు. పదిమూరల నుంచి పదిహేను మూరలవరకు పొడుగున్న వెదురుగడ. (తె. 29).

పొడుగ్గనుపుకర్ర: ఉ. పొడుగ్గెన్పు ; పర్యా. చూ. నిడుపు(గనె) బొంగు. కణుపులమధ్య మూరెడు గాని అంతకన్న ఎక్కువగాని ఎడమున్న వెదురు గడ; దీన్నించి తీసిన పేడుజల్లెడ, చేట మొ॥వాటి అల్లకానికి పనికొస్తుంది. (కో. 5).

పొడుపిచ్చె: పర్యా. చూ. గనసాగుడు, వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్న భాగం. (రా. 1).

పొడుము: పర్యా. చూ. జంపు. పొడుగు (భాగం) (రా. 1).

పొడువెదురు: చూ. పొడుగువెదురు. (రా. 2).

పొణక: పర్యా. ధాన్యం పొణక. ధాన్యం పోసుకొని పోవడానికి బండిమీద వేసే వెదురుపేళ్ళ జల్ల. (కో. 18).

పొతంజేయు: (క్రి.) ఈతాకును చాపల్లకానికి అను వుగా సిద్ధంచేయడం; ఆకును రెండుపాయలుగా విడదీసి ఒక్కొక్కపాయ అంచునుండే ఈనె తీసేసి పైన నీళ్ళు చిలకరించి ఎండలో వేస్తారు. (తె. 26).

పొత్తిగించు: (క్రి.) వారను లేదా పలుకును పేళ్ళుగా చీల్చడానికి మొదటిభాగంలో సమంగా ఒకేవేటుతో నరకడం; ఇట్లా నరకడంవల్ల వార మొదటిభాగం సమంగా అయి పేళ్ళు చీల్చుకోడం సులువవుతుంది. (కో. 8, 15).

పొత్తు: కొబ్బరికాయలు కాసేభాగం. (కో. 20).

పొద: 1. పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురుగడల పెరిగినపొద; ఒక చదరపుగజం నుంచి మూడు నాలుగు చదరపుగజాల వరకు వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాతగాని పొదలో ఒక వెదురుగడ కొట్టకుండా వదిలేసిన తరవాతగాని పొద కావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడు తుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (కో. 27, 28); 2. పర్యా. చూ. ఖానా (1). వెదురుగడలు నిలవచేయడానికి చేసిన కట్టుబడి; రెండుగజాల ఎడంలో రెండుగడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి, వాటికి ఎదురుగా గజం ఎడంలో మరో రెండుగడలు (లేదా సరు గుడు కర్రలు) పాతి, ఆ నాలిగింటిపై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడుగడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవైపు ఖాళీ ఉంచుతారు; ఖాళీఉన్న వైపునుంచి గడలుదూర్చి నిలబెడతారు; ఖాళీవైపును గొలుసుతోగాని గడతోగాని మూసి తాళంగూడా వేసుకోవచ్చు. (రా. 9); 3. గుండ్రంగా ఉండే ఒకరకం పెట్టె; బట్టలు పెట్టుకొంటారు. (తె. 14).

పొదిగించు: (క్రి.) ఒకదాంట్లో మరొకటి పెట్టడం; తొక్కుగంప అల్లకంలో మొదట బిలుకు (చూ.) లతో బయటిపొర గంప అల్లి దాంట్లో సన్న పేళ్ళతో అల్లిన రెండో పొరగంప కూర్చో బెడతారు. (రా. 8).

పొదిపెట్టె: చుట్టూ రెండు పొరలుగానూ అడుగు మాత్రం ఒకే పొరగానూ అల్లిన వెదురుపేళ్ళ పెట్టె. (తె. 23).

పొనక: ఉ. పొన్క; 1. రూ. పొదక, పొనికె, పొనుక; పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురు తడక; అడుగూ పక్కలో ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (కో. 27, 30; తె. 1, 26, 28; రా. 9); 2. పర్యా. చూ. గుమ్మి (3). వడ్లు మొ॥ ధాన్యం నిలవచేసుకోడానికి ఈతచువ్వతో అల్లినది; గజంనుంచి రెండుగజాల వరకు చుట్టుకొలతా ఐదడుగుల వరకు ఎత్తూ ఉంటుంది; రెండుబస్తాల నుంచి ఇరవైబస్తాల వరకు ధాన్యం పడతాయి. (కో. 25).

పొనికె: ఉ. పొన్కె; చూ. పొనక(1). (తె. 14, 17); 2. పర్యా. చూ. బండిజల్ల(2). ఎరువు మొ॥ చేర వేయడానికి బండిమీద పరిచే తడక; ఈతపేళ్ళతో అల్లుతారు. (తె. 20).

పొనుక: చూ. పొనక(1). (తె. 1).

(తుంగ) చాపలునేసే మగ్గానికి గజం వెడల్పున్న బెత్తెడు ఎడానికొకటి చొ॥న వరసగా ఎగదండు (= నేతగాడు కూర్చునే వైపుండే బొంగు) నుంచి దిగదండు (మగ్గం చివరిబొంగు)కు కట్టిన పురి పెట్టిన నారపోచ లేదా ప్లాస్టిక్‌దారం; వీటిమధ్యన (తుంగ) పోచను పెట్టుకుంటూ అని కూర్చుకుంటూ చాపనేస్తారు. చూ. చిత్రం 120 క. 8. (కో. 3; రా. 2, 4, 6, 10).

పోగుదబ్బ: పర్యా. చూ. లాకదబ్బ. (తుంగ)చాప నేసేటప్పుడు మగ్గంపోగుల మధ్య (తుంగ)పోచను దూర్చేబద్ద; దీనిచివర బెజ్జముంటుంది; అందులోకి (తుంగ)పోచకొన దూర్చి లాకదబ్బను పోగుల మధ్య దోపుతారు; చూ. చిత్రం 120 క. 6, 127. (రా. 2).

పోగుబిగించు: (క్రి.) పర్యా. పడుగుబెట్టు, పురికొన పోయు, మగ్గంపోయు. (తుంగ)చాప మగ్గంనుండు నేతగాడు కూర్చునేవైపు ఉండే ముందరిబొంగు (చూ.) నుంచి మగ్గంచివరి వెనకబొంగు (చూ.) వరకు అడ్డంగా (గజం వెడల్పున్న) బెత్తెడు ఎడానికొక నారపోగు చొ॥న పెట్టికట్టడం. (రా. 10).

పోగువేయు: (క్రి.) ఉ. పోగేయు; మగ్గంమీద చాప నేసేటప్పుడు పోగుదబ్బ (చూ.) సహాయంతో పురులమధ్య నుంచి (జమ్ము, తుంగ) పోగు దూర్చడం. (రా. 2).

పోచ: ఉ. పోస; పర్యా. చూ. తుంగపోచ, తుంగగడ్డి మొక్కకు పొడుగ్గా పెరిగిన ఒకపుల్ల (పోచ); సుమారు గజం పొడుగుంటుంది; ఇలాటి పుల్లలతో చాపలు నేస్తారు. (కో. 8; రా. 4); 2. పట్టి వేళ్ళలో విడిగా ఒకవేరు. (తె. 6).

పోతుబద్ద: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరి నప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేసిన చోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగా రాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 11).

పోర్వ: పర్యా. చూ. పొట్టయేను. వెదురుగడ చీరి నప్పుడు లోపలి పల్లపుభాగంలో కనిపించే పలచటి ఉల్లిపొర కాయితంలాంటి పొర. (రా. 9).

పోసుడుకమ్మ: ఈతచాప అల్లకంలో మొదటపెట్టిన ఆకు. (తె. 25).

ప్రధానం: ఉ. పథానం, పదానం; పెళ్ళికి నిశ్చితార్థం చేసుకొనేటప్పుడు తాంబూలాలు ఇచ్చుకోడం; అప్పుడు పళ్ళు తాంబూలాలు పెడతారు. (తె. 8, 16).

ప్రధానంపెట్టె: ఉ. పథానం -; పెళ్ళికి నిశ్చితార్థం (ప్రధానం) చేసేటప్పుడు బట్టలు మొ॥ పెట్టి ఇచ్చే పెట్టె. (కో. 3).

ప్రేం. ఉ. పిరిం, పరెం, ప్రేము; చూ. ఫ్రేం. (కో. 8; తె. 2, 4, 16; రా. 6).

ప్లాటల్లకం: పేముకుర్చీ కాళ్ళదగ్గర లీగ అల్లకం. (కో. 19).

ప్లాటూరం: పేముకుర్చీలో పీట అయ్యే భాగం విశాలంగా ఉండేటట్లు అల్లేవిధానం. (కో. 12).

ఫ

ఫస్టుబొంగు: ఉ. పస్టు—; పర్యా. చూ. ఫస్ట్‌క్లాస్ బొంగు. 12 నుంచి 15 సెం. మీ. వరకు లావుండే మేలిరకం వెదురుగడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుక లోకి వచ్చినపేరు. (తె. 30, 31).

ఫస్ట్‌క్లాస్‌బొంగు: ఉ. పట్లాసు -; పస్ట్లాసు—; పర్యా. ఒకటోరకం, ఫస్టుబొంగు, ఫస్ట్‌క్వాలిటీ, ఫస్టాలాస్‌కర్ర, మొదటిక్వాలిటీ, మొదటిరకం బొంగు. 12 నుంచి 25 సెం మీ. వరకు లావుండే మేలిరకం వెదురుగడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుక లోకి వచ్చిన పేరు. (కో. 6-8; రా. 5, 8, 10, 11).

ఫస్ట్‌క్వాలిటీ. పర్యా. చూ. ఫస్ట్‌క్లాస్‌బొంగు. 12 నుంచి 15 సెం.మీ. వరకులావుండే మేలిరకం వెదురుగడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుకలోకి వచ్చినపేరు.(తె. 10).

ఫస్టాలాస్‌కర్ర. పర్యా. చూ. ఫస్ట్‌క్లాస్‌బొంగు. 12 నుంచి 15 సెం. మీ. వరకు లావుండే మేలిరకం వెదురు గడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుకలోకి వచ్చిన పేరు. (కో. 3).

ఫిష్‌బోటు: (< ఇం. fish boat) పర్యా. కడవ. చేపలు పట్టేపడవ ఆకారంలో చేసిన పెద్దపేళ్ళ బొమ్మ; రకరకాలుగా ఉంటాయి; ఇళ్ళలో షోకేసుల్లో పెట్టుకుంటారు. (కో. 27, 29).

ఫ్రేం: రూ. పేము(2), పేం, ప్రేం; పర్యా. చూ. చట్రం (1). మంచం, బద్దలతడక, చాటుతడక, చెంద్రికతడక, కళ్యాణమంటపం మొ॥వాటి తయారీలో నాలుగు వెదురుబద్దలతోగాని గడలతో

గాని (దీర్ఘచతురస్రాకారంగాగాని చతురస్రాకారంగాగాని) చేసిన దొడ్డి చూ. చిత్రం 82. 2. (ఖ. 8; రా. 8).

ఫ్రేంబద్ద: ఉ. ప్రేం—; పర్యా. దండెబద్ద; తడక, కచ్చడంతడక మొ॥వాటికి ఫ్రేము అమర్చడానికి వాడేబద్ద; పొడుగుబద్దలు రెండూ అడ్డంబద్దలు రెండూ ఉంటాయి. (తె. 31).

ఫ్లవర్‌వాజ్: (< ఇం. flower vase) బల్లమీద పూలగుత్తులు పెట్టుకోడానికి వెదురుపుల్లలతో అల్లినది. (కో. 5, 29).

బ

బక్క: పొడుగ్గా ఉండే ఈతచెట్టు; దీని మట్టలుకొట్టి చువ్వ (బరిగె)లు తీస్తారు. (తె. 13).

బక్కలు: (బ.) ఆవులు; పశువులు. (కో. 29).

బగ్గితడక: పర్యా. చూ. కచ్చడంతతడక. కచ్చడంబండిమీద నీడకోసం గుడిసెమాదిరిగా కప్పేతడక లేదా చాప; కొన్నిటికి ముందువేపూ కొన్నిటికి ముందు వెనకలా పడగమాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండు పొరలుగా అల్లి జతకూరుస్తారు; దీని అంచుచుట్టూ చేటమాదిరిగా కట్టు(బద్ద) వేసి అంచుకడతారు; పలచటి పేడుతో అల్లినదాన్ని చాప అనీ నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లినదాన్నిగానీ చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డంబద్దలూ వేసినదాన్నిగానీ బద్దల పళంగా అల్లినదాన్నిగాని పలచటిబద్దలతో అల్లినదాన్నిగాని తడక అనీ అనడం మామూలు; చూ. చిత్రాలు 34 క. చ. (తె. 23).

బంకజానెక్టై: గచ్చకాయరంగులో ఉండి బుడిపెలు బుడిపెలుగా ఉండే ఒకరకం ఈతచువ్వ (బరిగె); బండిజల్ల, గొర్రెపిల్లలపోది మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 9).

బంగాలకొస: పర్యా. చూ. సుతిలి. గోగు, జనప మొ॥ నారలతో మిషన్‌లో తయారైన సన్నటి పురితాడు; పుల్లలతడక (చిక్కుతడక) కాసెగడ్డి చిల్మాన్లు మొ॥ తయారుచేయడానికి వాడతారు. చూ. చిత్రం 93. 3. (కో. 8).

బంగిపెట్టె: పర్యా. దిండిగం. సారెపెట్టెగా పనికొచ్చే గుండ్రటిపెట్టె; దీనిమూత కొప్పుమాదిరిగా ఉంటుంది; దీన్ని రెండుపొరలుగా అల్లుతారు లోపలిపొర వెదురుపేడుతోనూ బయటిపొర కర్రతోనూ అల్లుతారు; పైభాగంలో బొమ్మలూ, తలుపులూ ... [see note] వాళ్ళు వాడుతారు; చూ. చిత్రం 43. (తె. 17).

బంగూసు: పర్యా. చూ. పోగు(3). (తుంగ) చాపలు నేసే మగ్గానికి గుంజంవేపల్నున బెత్తెడు ఎడానికొకటి చొ॥న వరసగా ఎగదండు (= నేతగాడు కూర్చునే వైపుండే బొంగు) నుంచి దిగదండు (= మగ్గం చివరిబొంగు)కు కట్టిన పురిపెట్టిన నారపోచ లేదా ప్లాస్టిక్ దారం; వీటి మధ్యన (తుంగ) పోచను పెట్టుకొంటూ అని మార్చుకొంటూ చాపపేస్తారు. చూ. చిత్రం 120 క. 8. (రా. 2).

బజారుబుట్ట: 1. పర్యా. చూ. చేతిబుట్ట(1). బజారు నుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోవడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోవడానికి చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచికడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట్ల పళ్ళెంమాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు; చూ. చిత్రం 139 (కో. 20, 22, 23, 25, 31; తె. 9); 2. పర్యా. చూ. కంతబుట్ట. బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికీ (గాలి తగలడంకోసం) ఉల్లిగడ్డలు మొ॥ పోసి పెట్టుకోడానికీ వాడే ఒకరకం బుట్ట; చేత్తోపట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా పైన వంచికట్టిన వెదురుబద్ద ఉంటుంది; దీనిమూత సిబ్బిమాదిరిగానూ కొన్నిచోట్ల పళ్ళెంమాదిరిగానూ కొప్పుమాదిరిగానూ ఉంటుంది; దీని ఎత్తుభాగం వెలుపలినుంచి చుట్టూ మధ్యభాగంలో కళ్ళు (కంతలు) వచ్చేట్లు అల్లుతారు; కొన్నిటికి గద్దె ఉంటుంది; చూ. చిత్రం 69 క. (కో. 3).

బటాణీలబుట్ట: ఉ. బఠానీలబుట్టి; పర్యా. చూ. చేతిబుట్ట(1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బి మాదిరిగాను కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈబుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు; చూ. చిత్రం 139. (తె. 16, 24).

బట్ట(ల)పెట్టె: ఉ. —పెట్టి; పర్యా. చూ. పెట్టె (1). చీరలూ పంచెలూ మొ॥ బట్టలు పెట్టుకొనే వెదురు బద్దలపెట్టె; చతురస్రాకారంలోనూ, దీర్ఘచతురస్రాకారంలోనూ ఉంటుంది. చూ. చిత్రం 41. (కో. 22, 28).

బట్టలబుట్ట: పర్యా. మైలబుట్ట. మాసినబట్టలు వేసుకొనే (ఈత)బుట్ట. దీనికి మూత ఉంటుంది. చూ. చిత్రం 71. (తె. 20; రా. 9).

బతాణీబొంగు: పర్యా. చూ. ముల్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ) ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (కో. 25).

బడితె: ఉ. బద్దె; దడితడక అల్లకంలో నిలువుకుపెట్టే కొయ్య (వెదురుకాదు) బద్ద; తడకకు కావలసినన్ని బద్దలు పెట్టుకొంటారు. (తె. 29).

బడుగు: ఉ. బద్దు, బొడుగు; 1. చూ. బడుము(1). (కో. 16, 17; తె. 1, 27); 2. పర్యా. చూ. సిబ్బివార. సిబ్బి అల్లడాని కుపయోగించే కర్ర (చూ.); దారం మాదిరిగా సన్నగా గుండ్రంగా ఉంటుంది. (రా. 11); 3. పర్యా. గోలు(1). ఈక గంప అల్లకంకోసం తీసినపేడు; మందంగానూ, వెడల్పుగానూ ఉంటుంది. చూ. చిత్రం 47 చ. 2. (కో. 18).

బడుగుచేట: నీళ్ళలో బంగారం దేవే ఒకరకం చేట. (కో. 19).

బడుగుపేడు: పర్యా. చూ. మందంపేడు. గోరు మందంకన్న ఎక్కువ మందంగానూ, కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (రా. 10).

బడుంకట్టు: కంకిజల్లకు బడుము (= మందం కర్ర)తో కిందిభాగంలోను, మధ్యన మూతిదగ్గర మందంగా ఉబ్బెత్తుగా అల్లినభాగం. (తె. 6).

బడుంకర్ర: రూ. కర్రబడుం; పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దుగా అడుగూ అల్లడానికి వాడే వలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (తె. 13).

బడుము: ఉ. బడుం, బడువు; 1. రూ. బడుగు(1) పర్యా. చూ. అడిపోగు(1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దుగా అడుగూ అల్లడానికివాడే వలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరు కిందిపేడును రెండుభాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (తె. 2, 4, 5, 9); 2. పర్యా. చూ. లావీనె(1). మామూలు కర్ర (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండే కర్ర; గంప మొ॥వాటి అల్లకంపనిలో ఎత్తుగా వచ్చే భాగం అల్లడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (తె. 28); 3. పర్యా. చూ. కర్ర (3) గోవ(వార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువుల చుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (తె. 8); 4. పర్యా చూ. పలుకు(1). రెండుమూడు పేళ్ళమందంగల వెదురు బద్ద; చూ. పేడు. (తె. 20).

బడ్డి: పల్లంనుంచి ఎత్తుకు నీళ్ళు పారించే ఏతాలకు కట్టే కొబ్బరితాడు. (కో. 25).

బడ్డీ: ఉ. బడ్డి; పర్యా. చూ. మండె(1) వెదురుగడల పోగు మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్నిచోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని ప్రభుత్వం వెదురు డిపోలోగాని అడితీల్లోగాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తంలేదు. (కో. 14, 29, 30).

బంటు: గడ్డిబుట్ట తయారీలో అడుగునుంచి పైదాకా పెట్టే నిలువుబద్ద. చూ. చిత్రం 81. 1. (కో. 23).

బండ: పర్యా. మోపు(5). జమ్ముపోచలకట్ట. (రా. 4).

బండకత్తి: నూరినా పదునెక్కనంత మొండిగా అయిన కత్తి; దీన్ని కొలిమిలో కాలిపించి సాగగొట్టించాలి. (కో. 22).

బండలెత్తు: (క్రి.) కలబందనారపట్టల మీద బరువుకు రాళ్ళు పెట్టడం. (రా. 10).

బండవు: (క్రి.) (< బండ + అవు) పర్యా. దారుపోవు, మొద్దుబారు పడిపోవు, వాదరపోవు. కత్తి మొ॥వాటి పదును పోవడం. (కో. 24, 25).

బండిగూడుచాప: ఉ. సాప; పర్యా. చూ. బండి చాప(1). పెద్దబండిమీద నీడకోసం (గూడు మాదిరిగా) కట్టిన వెదురుపేళ్ళ చాప. (కో. 21).

బండిచాప: ఉ. —సాప; 1. పర్యా. బండిగూడు చాప, బండితడక (3). పెద్ద బండిమీద నీడకోసం (గూడు మాదిరిగా) కట్టిన వెదురుపేళ్ళచాప. (కో. 10, 28; తె. 27); 2. బండిమీద కప్పే తుంగచాప; చలికాలం కప్పుకోడానికీ పక్కపరుచుకోడానికీ పనికొస్తుంది; దీనిమీద వడ్లెడు ధాన్యం ఎండబోసుకోవచ్చు. (కో. 30).

బండిజల్ల: ఉ. —జొల్ల; 1. పర్యా. ఎరువుపొనక, గరిసె(1), జల్ల(1), దొల్ల, పొనక(1), బండి తడక(1), బండిదొల్ల, బండిపొనక, బండిమకెరి, బండిసవారి, మక్కిరిదొల్ల, మాసు, వెదురు తడక(2). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసిఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (కో. 1, 6–10, 14; తె. 9, 31; రా. 3, 5, 8, 10); 2. పర్యా. కుంచెతడక, గరిసె(2), గోత్తడక(2), పొనికె, బండితట్ట, బండితడక(4), బండిపొనికె. ఎరువు మొ॥ చేరవేయడానికి బండి మీద పరిచే తడక; ఈతపేళ్ళతో అల్లుతారు. (తె. 9, 14; రా. 8).

బండిజల్లనిలువుబెండు: పర్యా. నెంబు. బండిజల్ల అల్లికంలో నిలువుగావచ్చే మందంపేడు లేదా పలచటిబద్ద; సుమారు రెండురూపాయల బిళ్ళంత మంద ముంటుంది. (రా. 3).

బండిజల్లబెండు: పర్యా. చూ. జల్లదబ్బ. బండిజల్ల అల్లికంకోసం చీరిన పలచటి వెదురుబద్ద; వెడల్పు మామూలు బద్దంత ఉంటుంది; మందంబద్ద మందంలో సగం ఉంటుంది. (రా, 3).

బండితట్ట: పర్యా. చూ. బండిజల్ల (2). ఎరువు మొ॥ చేరవేయడానికి బండిమీద పరిచే తడక; ఈత పేళ్ళతో అల్లుతారు. (తె. 14).

బండితట్టు: బండిజల్ల అల్లడానికి మొదట ఐదు మూళ్ళ పొడుగు నాలుగుమూళ్ళ మీద జానెడు వెడల్పుతో అల్లిన పలచటి వెదురుతడక. (కో. 8).

బండితడక: 1. పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురు తడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచిఉంటాయి; చూ. చిత్రం 32. (కో. 10, 13, 17; తె. 9, 14; రా. 2); 2. పర్యా. అడుగుతడక. బండిచట్రం మీద (అడుగున) పరిచేతడక. (తె. 27; రా. 8, 10); 3. పర్యా. చూ. బండిచాప (1). పెద్ద బండిమీద నీడకోసం (గూడు మాదిరిగా) కట్టిన వెదురుపేళ్ళ చాప. (తె. 26); 4. పర్యా. చూ. బండిజల్ల (2). ఎరువు మొ॥ చేరవేయడానికి బండి మీద పరిచే తడక; ఈత పేళ్ళతో అల్లుతారు. (తె. 11).

బండిదండి: పర్యా. నొగవెదురు. బండి నిర్మాణంలో చట్రాన్నీ కాడినీ కలిపే లావుపాటి వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (కో. 30, 31).

బండిదొల్ల: పర్యా. చూ. బండిజల్ల(1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచిఉంటాయి; చూ. చిత్రం 32. (రా. 2).

బండిపక్కతడక: ఉ. —తడ్క; పర్యా. పక్కతడక (1). బండిచట్రం నిలువుభాగం పక్కలకూ గడి కొయ్యలకూ ఆనుకొనేటట్లు వేసినతడక; బండిమీద ఇలాంటి తడకలు రెండు రెండుపక్కలా రెండూ అడుగున ఒకతడకా ముందుభాగాన ఒక్కటీ ఉంటాయి; బండిజల్లకు బదులుగా వాడతారు; ఎరువు తోలుకురావడానికి ఈ తడకల్ని బండిజల్ల మాదిరిగా వాడతారు; చూ. చిత్రం 33. (తె. 9, 26).

బండిపగ్గం: పర్యా. చూ. మోకు (1). బండి మీద (గడ్డి, చొప్ప మొ॥) పేర్చినప్పుడు కింద పడకుండా బిగించికట్టే లావాటి కొబ్బరితాడు; నాలుగుపేటలుగా పేంతారు; పన్నెండు బారలనుంచి ముప్పై బారల వరకు పొడుగుంటుంది. (కో. 20).

బండిపలుపు: బండికాడికి ఎడ్లను కలిపి కట్టే తాడు. (తె. 9).

బండిపలుపులు: ఎడ్లను బండికాడికి కట్టేయడానికి నారతో పేనిన తాడు; దీనికి రెండు చివర్లా రింగు లుంటాయి; ఒక రింగుకు కాడి కొసకూ ఇంకో రింగును కాడికి అమర్చిన చిర్రకూ తగిలిస్తారు.

(రా. 5).

బండిపొనక: పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురు తడక; అడుగూ పక్కలూ ముందు భాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పై భాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (రా. 9).

బండిపొనికె: ఉ. —పొన్కె; పర్యా. చూ. బండిజల్ల (2). ఎరువు మొ॥ చేరవేయడానికి బండిమీద పరిచే తడక; ఈతపేళ్ళతో అల్లుతారు. (తె. 14).

బండిమకెరి: పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురు తడక; అడుగూ పక్కలూ ముందు భాగమూ మూసి ఉంటాయి; చూ. చిత్రం 32. (రా. 1).

బండిమోకు: బండి మీద గడ్డి, చొప్ప మొ॥ వేసి బిగించే లావుపాటి తాడు; సుమారు 10 గజాల పొడుగుంటుంది; గడ్డపారంత లావుంటుంది; గోగు నారతో పేంతారు. (తె. 9).

బండిలు: (< ఇం. Bundle) పర్యా. చూ. కట్ట (2). కొన్ని ఈత చువ్వ (బరిగెలు) కలిపి కట్టినది (తె. 20).

బండి శిర్క: వడ్లు మొ॥ పోసుకు రావడానికి బండి మీద వేసే విడి తడక; అడుగున ఒకటి రెండు పక్కలా రెండు ఉంటాయి (తె 19).

బండి సవారి: పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురు తడక; అడుగూ పక్కలూ ముందు భాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పై భాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (రా. 9).

బండొడ్డెర జల్లు: (< బండి+ఒడ్డెర—) వడ్డెరవాళ్ళు బండికి వేసే జల్ల (తె. 7).

బతకమ్మ బుట్ట: ఉ. బత్కమ్మ—; బతకమ్మ. (గౌరీదేవి)ను పేర్చడానికి అల్లిన బుట్ట; దీని చుట్టూ పూలకు బదులు రంగు కాయితాలు అంటిస్తారు; చూ. చిత్రం 85 (తె. 18).

బతకమ్మ సిబ్బి: ఉ. బత్కమ్మ చిబ్బి; బతకమ్మ (< =దసరాల్లో పునిస్త్రీలూ కన్నెపిల్లలూ కొలిచే గౌరీదేవి; పూలశిఖరంలా పేర్చినది)ను పేర్చే వెదురుపళ్ళెం (తె. 26, 28).

బదులు కొమ్ము: పర్యా. అడికొమ్ము (2), కింది కొమ్ము, క్రైకొమ్ము, చేట సక్కు, డబల్ కొమ్ము, నక్కు బద్ద, పైకొమ్ము, పైకొమ్ము బద్ద, పైన కడ్డి, చేటముందరి భాగంలో మొదట వేసిన కొమ్ము దగ్గర [illegible] గాని, [illegible] గాని అవసరంగా వేసే [illegible]; మొదటి దానికిది తోడుగా ఉంటుంది. చూ. [illegible] (చె. 8).

[illegible]: ఉ. [illegible]; పేము గంప అల్ల [illegible] అవసరంగా దాని దగ్గర [illegible] (కో. 3);

బద్ద: 1. రూ. [illegible], బర్ర(1); పర్యా. ఒప్పు(2), [illegible](1), [illegible](2), చెక్క(2), పక్షం, [illegible](2), [illegible](1), పక్క(2), సవకలం(1). వెదురుగడ నిలువుగా నాలుగు భాగాలుగా చీలిస్తే వచ్చే భాగం; గడంతపొడుగున సుమారు రెండు వేళ్ళ వెడల్పు ఉంటుంది. (కో. 5, 6, 8, 9, 10–21, 24–26, 28–31; తె. 7–10, 13–17, 19–28, 30, 31; రా. 5); 2. చూ. దబ్బ(2). (కో. 6). 3. పర్యా. చూ. పేము(1). వెదురుబద్ద సన్నగా చీలిస్తేవచ్చే పొడవు; సుమారు చిటికెన వేలెడు వెడల్పూ గోరంతమందమూ గజంన్నర పొడుగూ ఉంటుంది; చేట, బుట్టల మొ॥ అల్లడానికి వాడతారు; అల్లేవస్తువునుబట్టి దీని పొడుగు వెడల్పులు నిర్ణయించుకొంటారు. (తె. 29); 4. రూ. దబ్బ(3), పర్యా. ఊచ(1), కట్టె(2), కర్ర(8), కాడ(6), కొమ్ము(3), గడ్డి, గొట్టం కర్ర, చిట్టె(5), చువ్వ(4), జబ్బ(1), దండ, పంతాదబ్బ, పిడిపుల్ల, పుల్ల (2), బుడుపు దబ్బ, బెండు(2), [illegible](1), విసనగర్రకాడ, విసన గర్రబద్ద, వెన్నుగర్ర(2), విసనగర్ర పట్టుకోడానికి అల్లికంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టంతొడుగుతారు; గొట్టం పొడిగేట్టుకు చివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 91 ట.2. (కో. 8, 18–20, 21, 25, 29; తె. 27); 5. రూ. దబ్బ(4); పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికి మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (తె. 22); 6. పేముకర్రచీలిక; రెండునుంచి ఐదారు చీలికలవరకు చీలుస్తారు. (కో. 12, 19); 7. పేముకుర్చీలో పీపు అనుకొనే భాగంలో నిలువుగా అమర్చిన బద్ద (తె. 22); 8. పర్యా. పచ్చె(3). తాటిపాట (చూ.) పొడుగ్గా చీరి తీసిన పాయ; రెండుమూడు భాగాలుగా చీరతారు; చీల్చిన

దాన్ని 'పోట' అనే అంటారు. (తె. 9).

బద్దకఱ్ర: పర్యా. చూ. లావీనె(1). మామూలుకఱ్ర (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండేకఱ్ర; గంప మొ॥వాటి అల్లకంపనిలో ఎత్తుగా వచ్చేభాగం అల్లడానికి ఉపయోగ పడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (తె. 28).

బద్దతడక: ఉ. – తడికె; రూ. దబ్బతడక; పర్యా. చూ. జేలితడక(1). వెదురుబద్దలు ఎడం ఎడంగా పెట్టి మేకులుకొట్టి తయారుచేసిన తడక; బద్దకూ బద్దకూ మధ్య సందులు చతురస్రంగాగాని డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళ చుట్టూ ప్రహరీ గోడ బదులు పెట్టుకొంటారు. (కో. 8).

బద్దతీయు: (క్రి.) వెదురుగడ బద్దలుగా పగలగొట్టడం (తె. 29).

బద్దపక్కనిలుగు: ఉ. –నిల్గు; వెదురుబద్దకుసన్నగా ఉండే పక్కనైపు నుంచి చీరిన నిలువు; బతకమ్మ బుట్ట అల్లడానికి పనికొస్తుంది. (తె. 18).

బద్దపగలగొట్టు: (క్రి.) బద్దలుగా చీల్చడం; పేంబెత్తాన్ని రేకత్తితో చీలుస్తారు. (కో. 12).

బద్దబొంగు: బద్దలు చీల్చడానికి అనువైన వెదురుగడ. (కో. 8).

బద్ద(ల)కట్టు: పర్యా. అరకట్ట(1). 25 వెదురుగడల్ని బద్దలుగా చీల్చి కట్టినకట్ట; ఇందులో 100 బద్ద లుంటాయి. (కో. 9; తె. 28, 31).

బద్ద(ల)గుమ్మి: మొత్తం మందం వెదురుబద్దలతో అల్లినగుమ్మి (గాదె); (తె. 26, 31).

బద్దలజేబు: వెదురుబద్దలతో చేసిన జేబు; చూ. జేంబు. (కో. 10).

బద్దలజేలి: పర్యా. చూ. జేలి తడక (1). వెదురు బద్దలు ఎడం ఎడంగా పెట్టి మేకులుకొట్టి తయారు చేసిన తడక; బద్దకూ బద్దకూ మధ్య సందులు చతురస్రంగా గాని డైమన్ ఆకారంలో గాని ఉంటాయి; ఇళ్ళ చుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టు కొంటారు (తె. 16, 17).

బద్దలతడక: ఉ. –తడిక; పర్యా. దొడ్డు బద్దల తడక, పొట్టు బద్దల తడక. బద్ద బదల పళంగా అల్లిన తడక; నిలువుకూ అడ్డానికీ బద్దలే వాడతారు (కో. 10, 12, 17, 19).

బద్దల దడి: పర్యా. చూ. జేలి తడక (1). వెదురు బద్దలు ఎడం ఎడంగా పెట్టి మేకులు కొట్టి తయారు చేసిన తడక; బద్దకూ బద్దకూ మధ్య సందులు చతురస్రంగా గాని డైమన్ ఆకారంలో గాని ఉంటాయి. ఇళ్ళ చుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టు కొంటారు (కో. 29).

బద్దలుగొట్టియు: (క్రి.) వెదురుగడ నిలువుగా రెండు గాని నాలుగు గాని బద్దలుగా కత్తితో చీల్చడం (కో. 24(.

బద్దసందు: పర్యా. చూ. ఖానా (5) ఉయ్యాల అల్లకంలో అడుగు భాగంలోనూ పక్కలా బద్దలమధ్య వచ్చిన సందు; గది (కో. 8).

బంతిచాప: ఉ. సాప; బొంతిసాప; భోజనానికి బంతులు (పంక్తులు) వేసేటప్పుడు ఎక్కువ మంది కూరోచ్చడానికి పరిచే పొడుగాటి చాప; మూరెడు వెడల్పున మూడు, నాలుగు గజాల పొడుగున నేస్తారు (కో. 8; రా. 6, 10).

బందిని: పర్యా. చూ. కిట్టు ముంగు. చేట, జల్లెడ, విసనగఱ్ర మొ॥ వాటికి కట్టు కట్టడాని కుపయోగించే పలచటి పేడు, దీన్ని వెదుర్నుంచి గాని ఈతబరిగె నుంచి గాని తాటిమట్ట నుంచి గాని తీస్తారు (రా. 3).

బందు: ఒకపక్క (తె. 11).

బబ్బు: (క్రి.) తట్ట, బుట్ట, గంప, చేట మొ॥ వస్తువులు అల్లడం (తె. 1).

బయట కట్టు: పర్యా చూ. వెనక కట్టు. చేట వెలుపలి అంచుచుట్టూ పెట్టి బిగించే బద్ద (కట్టు) చూ. చిత్రం 29. 7. (కో. 9).

బయటెరకలి వాళ్ళు: ఉ. బయటెర్కలోల్లు; ఎరకలి వాళ్ళలో ఒక తెగ; గాడిదలను కాస్తారు; దేశ సంచారం చేస్తారు (తె. 13).

బరిగు: ఉ. బర్గె, బఱిగె; **1.** రూ. బఱ; పర్యా. కట్టె (3), దువ్వ (5), పుల్ల (6), రువ్వ; సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి పొడుగాటి పుల్ల; ఈత, పుల్చేరు మొ॥ చెట్లనుంచి ఈదుగు మొ॥ పొదలనుంచి దీన్ని తీస్తారు; ఈతకమ్మ మధ్యకఱ్ర (రెండు పక్కలా ఆకులు వేసేది). బండిజల్ల, పిల్లల పొది, తట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది (తె. 11, 13, 14); **2.** పర్యా. గైకట్టె (1). ఈతమట్టలు కొయ్యడానికి కొడవలి కట్టే పొడుగాటి వెదురుకఱ్ర; చూ. గైకొడవలి చూ. చిత్రం 116.1 (తె. 21).

బరిసె: పర్యా. చూ. పడగలు. అంబు (చూ.)కు వెడల్పుగా ఉన్న భాగం; పాము పడగ, బరిసె మొ॥ వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండే బిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; పేడు తెంప

డానికీ చిల్లులు పొడవడానికీ పనికొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి; కాడ కొనతో చిల్లులు పొడవడానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు (కో. 9).

బరిసెవంపు: ఉ. బరిసొంపు, పర్యా. చూ. పడగ (1). అంబు (చూ.)కు వెడల్పుగా ఉన్న భాగం; పాము పడగ, బరిసె మొ॥ వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండే బిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; పేడు చెంపడానికీ చిల్లులు పొడవడానికీ పనికొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి. కొన్ని కొన్ని మొండిగా ఉంటాయి; కాడ కొనతో చిల్లులు పొడవడానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు (కో. 11).

బరిసోలునొప్పి: పక్కటెముకల్లో వచ్చే ఒకరకం నొప్పి. (కో. 6).

బర్మటిబుట్ట: ఉ. -బుట్టి; పర్యా. చూ. ఊద్దాని. తలవెంట్రుకలకు సాంబ్రాణి (ఊదు) పొగవేసుకోడానికి వాడే బుట్ట; అడుగుభాగంలో పేళ్ళమధ్య సందు ఉండేలాగా అల్లుతారు; సాంబ్రాణివల్లిన కుంపటి మీద దీన్ని బోర్లించి దీనిమీద తలవెంట్రుకలు పరిచి పడుకొంటారు; ముస్లింస్త్రీలు ఎక్కువగా వాడతారు; చూ. చిత్రం 79. (రా. 11).

బర్ర: చూ. బరిగె (1). (రా. 8, 9).

బర్రగూడకొండకర్ర: బర్రగూడ అనే కొండ ప్రాంతంనుంచి తెచ్చిన వెదురుకర్ర. (కో. 27).

బర్రిగుంపు: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మ లావుగాఉండడంగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్ద గుర్తుపడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం. (కో. 28).

బర్రె: పర్యా. చూ. వెడల్పు పేడు. వేలున్నర వెడల్పు ఉండే వెదురుపేడు; చాప మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 1).

బర్రెకమ్మ: పర్యా. చూ. బర్రైకు. వెడల్పు ఎక్కువగాఉండే ఈతాకు; సుమారు వేలెడు వెడల్పు ఉంటుంది. (తె. 22).

బర్రెగనె: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపులదగ్గరపెరిగిన కొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మ లావుగాఉండడంవల్లగాని ఒకేచోట రెండుమూడుకొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్ద గుర్తుపడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం. (తె. 22).

బర్రెమాడబుట్ట: ఉ. బర్మాడబుట్టి; బర్రెమాడ మన్ను నారకుండా ఊరితీకిద్దే బుట్ట; ఉసేరులిగలతో అల్లుతారు. (తె. 9).

బర్రైకు: (< బర్రె + ఆకు) పర్యా. పెద్దాకు, బర్రెకమ్మ, బుర్రాకు. వెడల్పు ఎక్కువగాఉండే ఈతాకు; సుమారు వేలెడువెడల్పు ఉంటుంది. (తె. 21).

బల: పర్యా. చూ. అంచు (6). ఎరకలికత్తి (కొడవలి) కి చెపిటిమట్టూవేసిన ఇనప పట్టి. చూ. చిత్రం 118,2 (రా. 9).

బలిచ్చు: (క్రి.) నిచ్చెనకుగాని మంచానికిగాని తడకకుగాని మేకులుకొట్టి బిగించడం. (తె. 26).

బలుపుబద్ద. పర్యా. చూ. బిరుసబ్బ. వెదురుతడక వంగిపోకుండా గట్టిపడంకోసం అడ్డంగాగాని నిలువుగాగాని వేసిన బద్ద. (తె. 17).

బల్ల: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొద్దులాఉంటుంది. చూ. చిత్రం 9.1. (కో. 23).

బల్ల: పర్యా. చూ. అచ్చు. (తుంగ)చాప నేసేటప్పుడు అడ్డానికివేసిన తుంగపోచను దగ్గరకు నెట్టడానికి చేత్తో ఒత్తే కొయ్యపలక; దీర్ఘచతురస్రాకారంగా ఉంటుంది; దీనికి సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులు దూరుస్తారు; (తుంగ)పోచను పోగులమధ్యకు దూర్చినతరవాత ఆ పోచ అంతకుముందున్న పోచలను అనుకొని ఉండేటట్లు ఈ పలకతో నెడతారు; కొన్నిచోట్ల ఇనపముక్కల పలక వాడతారు. చూ. చిత్రాలు 100; 120 క,6. (కో. 21).

బల్లపసుప్పెట్టె: పర్యా. చూ. పసుప్పెట్టె. పెళ్ళి అయినకొత్తలో అమ్మాయిలు అత్తగారింటికి పసుపు కుంకుమలు తీసుకుపోవడానికి పెట్టుకొనే చిన్నపెట్టె (కో. 29).

బల్లిగకమ్మరి: ఇనపవస్తువులుచేసే కమ్మరివాళ్ళలో ఒక తెగ. (తె. 16).

బళ్ళారిగంప: ఉ. బల్లారి -; పదహారు నిలువులతో అల్లే గంప; దీనికి అడుగున బొడిపెలుంటాయి చూ. చిత్రం 51. (తె. 4).

బాకు: కలబందపట్టను నిలువుగా రెండుభాగాలుగా

చీల్చే బాకు; బాకులా ఉంటుంది; ... ఉంటుంది. (రా. 6).

బాగోతంపెట్టె: (< సం. భాగవతం —) ఊళ్ళల్లో వీధి భాగవతులు (... ఆడేవాళ్ళు) ... వెదురుపేళ్ళపెట్టె; దీన్ని ... ఆకారంలో ఉంటుంది. (తె. 15).

బాణం: పర్యా. బాణం పుల్ల. వెదురుబద్దతో చేసి అమ్మే; వేటాడేవాళ్ళు ... నారిమీద మోపేది; ... ఉంటుంది (తె. 6).

బాణం పుల్ల: పర్యా. బాణం, వెదురుబద్దతో చేసి అమ్మే; వేటాడేవాళ్ళు ... నారిమీద మోపేది; ... ఉంటుంది (తె. 6).

బాణా కర్ర: పర్యా. ... (1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; ... వేళ్ళ లావూ సుమారు రెండు గజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసా మొదలూ ఒకే లావుంటాయి; సాము చేయ డానికి కూడా ఉపయోగ పడుతుంది (కో. 2, 9, 25, 30).

బాతుబుట్ట: బాతులను మోసుకుపోవడానికి పనికొచ్చే గంప; మొత్తం మూసి ఉండి ఒకచోట కోడి పట్టే టంత సందు ఉంటుంది; దీంట్లో ఇరవై కోళ్ళూ ముప్పై బాతులూ పడతాయి; చూ. చిత్రం 64 (కో. 1, 10).

బాదంకాయ మాడల్ ఉయ్యాల: బాదంకాయ డిజైను వచ్చేటట్లు అల్లిన ఉయ్యాల (తె. 31).

బాము: (క్రి.) 1 చూ. పాము; అల్లకం పూర్తయిన తరువాత చివర మిగిలిన పేళ్ళను లోపలికి దోపడం; విసనకర్రలూ బుట్టలూ చాపలూ మొ॥ అల్లేటప్పుడు మిగిలిన పేళ్ళను ఇలా దోపుతారు; వెదురు చాపల అల్లకంలో ఒకవైపు నుంచి అల్లుకొచ్చిన పేడు రెండోవైపు అల్లడానికి తిప్పుతారు (కో. 14; తె. 1, 9, 30; రా. 10); 2. జల్లెడ తడకకు కట్టు కట్టడానికి అల్లి పైకి లేపడం (తె. 26).

బాముడు బుట్ట: (< బ్రాహ్మణ —) ఉ. బాముడి బుట్ట, — బుట్టి; చేట అల్లకంలో అల్లి అంచు కట్టకుండా పేళ్ళను మలిపిన బుట్ట; మిరపకాయలు, బియ్యం మొ॥ కొలిచి ఇవ్వడానికి పనికొస్తుంది (తె. 30).

బాంబే కటింగ్: (ఇం. (Bombay Cutting) పర్యా. చూ. బొంబాయి కట్. ఒక రకం పేము

కుర్చీ (కో. 12).

బాయుగాడు: పేపవాడు (తె. 4).

బార: రెండు గజాల పొడుగుండే కొలత; రెండు చేతులూ పక్కలకు చాపినప్పుడు (ఎడమచేతి వేళ్ళ కొనల నుంచి కుడిచేతి వేళ్ళ కొనల వరకు) గల పొడవు (తె. 8).

బారిబారి జేగాలు: (బ) ఉ. — జేగల్లు; పెద్దపెద్ద పట్నాలూ నగరాలూ మొ॥ ప్రాంతాలు; భారీభారీ జేగాలు (తె. 4).

బారు: పర్యా. జంపు. పొడుగు(భాగం). (తె. 28).

బారుకర్ర: 1. పర్యా. చూ. పొడుగుబొంగు. పది మూరలనుంచి పదిహేనుమూరలవరకు పొడుగున్న వెదురుగడ. (కో. 9 10, 17, 23); 2. పర్యా. చూ. నిలువుబొంగు (2). నిచ్చెన తయారీలో నిలువుగువాడే వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (తె. 31).

బారుగడ: ఉ.—గెడ; పర్యా. చూ. పొడుగుబొంగు. పదిమూరలనుంచి పదిహేనుమూరలవరకు పొడు గున్న వెదురుగడ. (కో. 15, 16).

బారుగణుపు: రూ. బారుగన, బారుగనుపు; పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్నభాగం. (కో. 15).

బారుగన: చూ. బారుగణుపు. (తె. 31).

బారుగనుపు: చూ. బారుగణుపు. (కో. 8).

బారుచిల్ల: వెదురుగడ కణుపులదగ్గర లావుగానూ పొడుగ్గానూ పెరిగిన కొమ్మ; ముల్లుగర్ర ఉరుపులో ఉంటుంది. (తె. 28).

బారుదూరం: ఉ.— దూరెం; పర్యా చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్నభాగం. (కో. 14).

బారుబద్ద: 1. పర్యా. చూ. జల్లదబ్బ. బండిజల్ల అల్లకంకోసం చీరిన పలచటి వెదురుబద్ద; వెడల్పు మామూలుబద్దంత ఉంటుంది; మందంబద్ద మందంలో సగం ఉంటుంది. (కో. 13); 2. గుమ్మంతడకకు గడపగాబిగించిన పొడుగుబద్ద. (కో. 8).

బారుబొంగు: 1. పర్యా. చూ. పొడుగుబొంగు. పది మూరలనుంచి పదిహేనుమూరలవరకు పొడుగున్న వెదురుగడ. (కో. 7, 8; తె. 30, 31); 2. కోపులో (చూ. కోపు) పెరిగిన వెదురుగడ. (తె. 31).

బారువాసం: పర్యా. చూ. పొడుగుబొంగు. పదిమూరల నుంచి పదిహేనుమూరలవరకు పొడుగున్న వెదురు గడ. (కో. 8, 13, 21).

బారువెదురు: ఉ. బారెదురు; పర్యా. చూ. పొడుగు బొంగు. పదిమూరలనుంచి పదిహేనుమూరలవరకు పొడుగున్న వెదురుగడ. (కో. 8, 11, 14).

బాలన్న: మేదరవాళ్ళు ప్రాంతీయంగా కొలిచేదేవుడు; ఈయన్ని కొలవడం ఇటీవలే మొదలయిందట. (రా. 9).

బాలసంతులు: (బ.) బిచ్చమెత్తుకొనే ఒక తెగ; వీళ్ళు ఒకచేత్తో గంటా మరోచేత్తో శంఖమూ పట్టుకొని తెల్లవారుజామున ఇంటింటికి తిరిగి అడుక్కుంటారు (తె. 21).

బావిబుట్ట: ఉ. బాయి—; బావిలో పూడిక తీసినప్పుడు మన్ను మోయడానికి ఉపయోగించే పట్టితట్ట (కో. 9).

బాష్కం: చూ. బాసింగం (1) (తె. 8).

బాసికం: చూ. బాసింగం (1) (కో. 8).

బాసికాలచాప: ఉ. —సాప; వంకెలుగా డిజైనుపడేటట్లు నేసిన తుంగచాప (కో. 8).

బాసింగంచేట: పర్యా. గారుచేట. మధ్యభాగంలో వదరంగా డిజైను వచ్చేటట్లు అల్లినచేట (తె. 15).

బాసింగం: ఉ. బాషింగం; 1. రూ. బాష్కం, బాసికం; తట్ట మొ॥ వాటి అల్లకం పూర్తయిన తరవాత 'X' ఆకారంలో బిగించిన బద్దలు; తట్ట చుట్టు అక్కడక్కడ ఇలా దూరుస్తారు. చూ. చిత్రం 67.1 (తె. 6, 18); 2. పెళ్ళికూతురికీ పెళ్ళికొడుక్కూ నుదుట కట్టే అలంకార వస్తువు; వెదురుపేళ్ళతో చేసి రంగు కాయితాలు అంటిస్తారు; చూ. చిత్రం 108 (తె. 6, 10).

బాస్కెట్: (ఇం. basket) పేముతో చేసినబుట్ట; కూరగాయలు మొ॥ వేసుకొంటారు (తె. 22).

బిగింపుకమ్మి: చాప నేసినంతమట్టుకు దోనిమానుకు చుట్టడానికి మాను తిప్పే ఇనప ఊచ (రా. 2).

బిగింపు కర్ర: నీళ్ళగూడలో మూతికి రెండువైపులా పొడుగ్గా కట్టిన వెదురుకర్ర (కో. 8).

బిగింపు తాడు: పర్యా. చూ. మగ్గంతాడు. చాపనేసే మగ్గంలో పోగుల్ని లాగి పట్టి ఉంచే దిగదండుకు కట్టిన తాడు; దీని రెంటోకొన వెనక ఉండే గుంజకు కడతారు; దిగదండను వదులు చేయడానికిగాని బిగువుగా పట్టి ఉంచడానికిగాని పనికొస్తుంది (రా. 4).

బిగింపు బొక్క: చాపనేత మగ్గం దోనిమాను (చూ.) బిగించడానికి కమ్మి దూర్చేటందుకు చేసిన బెజ్జం (రా. 2)

బిగుతాడు: పర్యా. చూ. మగ్గంతాడు. చాప నేసే మగ్గంలో పోగుల్ని లాగిపట్టి ఉంచే దిగదండుకు కట్టినతాడు; దీని రెంటోకొన వెనక ఉండే గుంజకు కడతారు; దిగదండును వదులు చేయడానికి గాని బిగువుగా పట్టి ఉంచడానికి గాని పనికొస్తుంది (రా. 2, 4).

బిడారెరకలి: ఉ. బిడారెర్కలి; ఎరకలి వాళ్ళలో ఒక తెగ; తిరగళ్ళు (విసుర్రాళ్ళు) కొట్టడం, ఉప్పు పండించి అమ్మడం మొ॥ వీళ్ళ వృత్తి (కో. 4; రా. 5).

బిడెరకలి: ఉ. —ఎర్కలి, ఎరకలి వాళ్ళలో ఒక తెగ; తాళ్ళుపేని బతుకుతారు (రా. 9).

బింత: పర్యా. చూ. ఉంత (1). కొబ్బరితాడు చుట్ట; బంతిలా గుండ్రంగాగాని మూరెడు పొడుగున చెక్రంలాగాని చుట్టినది. (కో. 23).

బిత్తం: ఉ. బిత్తిం; పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒక భాగం (రా. 2, 4).

బియ్యంకర్ర: పర్యా. చూ. పంటకర్ర (1). వెదురు ధాన్యం కాసినగడ; మొక్క మొలిచిన తరవాత సుమారు 20 సం॥ లకు కాపుకొస్తుంది; ఇంటి వాసాలకూ గోపలకూ పనికొస్తుంది (కో. 28).

బియ్యంగడుగు బుట్ట: పర్యా. గంప (3), పుటికె (2), పెళ్ళిబుట్ట, వడగంప, వడబుట్ట (1), సూరీగ బుట్ట. బియ్యం కడిగి గాలించిన తరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసి ఉంచే బుట్ట; కొంచెం పలచగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద సన్నగా ఉండి పోను పోను వెడల్పుగా ఉంటుంది, కొన్నిచోట్ల కింది నుంచి మీదికి ఒకే తీరుగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది (దీన్ని చేట మాదిరిగా అల్లుతారు); సంతర్పణ వంటలకు వాడతారు; చూ. చిత్రం 48 (కో. 19).

బియ్యం జల్లెడ: బియ్యం జల్లించుకొనే జల్లెడ; దీనికీ కన్నాలు సన్నగా ఉంటాయి (కో. 19, 26; తె. 8-9; రా. 23).

బియ్యం బుట్ట: ఉ. — బుట్టి; బియ్యం పోసుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినబుట్ట (కో. 11; తె. 1).

బిరుసుపేము: ఉ. బిర్సు—; పేముకట్టెలో ఒక ఒకరకం; దీన్ని చీరినప్పుడు తీగ సులువుగా సాపుగా వస్తుంది; కుర్చీల అల్లకానికి వాడతారు (కో. 8).

బిరుసుబొంగు: ఉ. బిర్సు—; పర్యా. చూ. గడసు బొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది (తె. 22, 23; రా. 10).

బిరుసువెదురు: ఉ. బిర్సెదురు; పర్యా. చూ. గడసు బొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీదా మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది (కో. 1).

బిర్రుగుంజ: పర్యా చూ. గూటం (3). చాపనేత మగ్గాన్ని బిగబట్టడానికి మూలగాపాతిన గుంజ; ఇలాటివి మగ్గం నాలుగుమూలలా ఉంటాయి. (రా. 10).

బిర్రుడబ్బ: చూ. బిర్రుబద్ద (తె. 6).

బిర్రుదబ్బ: పర్యా. కవటిబద్ద, బలుపుబద్ద, మయం బద్ద, మీదిబద్ద. వెదురుతడక వంగిపోకుండా గట్టిదనంకోసం అడ్డంగాగాని నిలువుగాగాని వేసినబద్ద (రా. 8).

బిర్రుపుల్ల: కొడమ (చూ.) అడుగు భాగంలో ద్వారాన్ని మూసి ఉంచడానికి దానికి గుచ్చేపుల్ల చూ. చిత్రం 73 క. 8 (కో. 4).

బిర్రు బద్ద: రూ బిర్రు డబ్బ; పర్యా. చూ. క్రాసు బద్ద. వెదురుమంచం తయారీలో వెడల్పు భాగాన ఉన్న రెండు కాళ్ళను (కోళ్ళను) కలుపుతూ గాని కాలనీ నిలువుగడ (నిలుపపట్టె)నూ కలుపుతూగాని ఐమూలగా కొట్టిన వెదురుబద్ద చూ. చిత్రం 108.1 (తె. 17, 19).

బిలుకు: ఉ. బిల్కు—; చేట, జల్లెడ, విసనకర్ర, గూడ, ఉయ్యాల, బుట్ట మొ॥ వాటికి అంచులు కట్టేటప్పుడు గట్టిదనం కోసం అంచు లోపలివైపు నుంచి గాని బయటివైపు నుంచిగాని వేసే రెండు మూడు వేళ్ళ వెడల్పు ఉండే పలచటి వెదురుబద్ద; 1. పర్యా. కట్టు (5), పలుకు (9), పైగుండు (1), పైదబ్బ (1), బెండుగుండు (1), వెంటబెండు (1), వెనక కట్టు (2). వెనకబిలుకు, వెన్నుబిలుకు, జల్లెడ అంచుకట్టడానికి వెలుపలినుంచి లోపలిచుండు చుట్టు వేసే రెండు మూడు వేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలి గుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడ తట్టు చివర్లు (కర్సడ) ఇమిడ్చి ఉంటాయి, ఈ రెండు బద్దలపైనా మరో మందం బద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3 (తె. 2. 5. 6. 8. 20. 27). 2. పరా. చూ. కట్టు (6). చేట. విసనగర్ర పెట్టె తిరుమాన్ పెట్టె మొ॥ వాటి అల్లికంలో అంచుకు లోపలినుంచి బయటినుంచి చుట్టూవేసే వెదురుబద్ద; వేలెడు గాని రెండువేళ్ళ వెడల్పు గాని ఉంటుంది (కో. 2); 3. పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచి కట్టిన రెండు మూడు వేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడ తట్టుమీద దీన్నిబెట్టి తట్టు చివర్లను దీనిచుట్టూ వంచు తారు; ఇది జల్లెడ అంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒకబద్ద, ఈ రెంటి మీంచి ఇంకో మందం బద్ద వేస్తారు చూ. చిత్రం 30 క. 1 (కో. 2); 4. పర్యా. చూ. కట్టు (7). విసనగర్ర అంచు కట్టడానికి ఒక పక్క బిగించిన వెదురుబద్ద. చూ. చిత్రం 31 క. 1 (కో. 3; తె. 3. 9; రా. 4); 5. చూ. అంచుకట్టు బద్ద. గూడ, ఉయ్యాల, పెళ్ళిపెట్టె, బుట్ట మొ॥ వాటి అల్లికంలో వాటి అంచు చుట్టూ గట్టిదనం కోసం కట్టిన పలచటి వెదురుబద్ద. చూ. చిత్రం 35 క. 2 (కో. 21); 6. పొడుగాటి వెదురుపేడు; పాలవెల్లి తడక అల్లికంలో అడ్డంగా పెట్టేందుకు ఉపయోగిస్తారు (తె. 27); 7. పర్యా. చూ. అడ్డం. తడకబండి జల్ల, పిల్లల పొది, ఉయ్యాల, చంద్రిక మొ॥ వాటి నిలువుల చుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు లేదా పలచటి బద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది (రా. 8). 8. పర్యా. చూ. నడి (1). చేట, జల్లెడ, విసనగర్ర మొ॥ వాటికి కట్లు కట్టడానికి లేతవెదురుగడ నుంచి తీసిన పలచటి మెత్తటి పేడు; ఎటు వంచినా విరగదు (తె. 27); 9. జల్లెడ మొ॥ అంచు కట్టేటప్పుడు కట్టుముంగు (=పలచటి పేడు లేదా తీగ)తో మూడు వరసలు రింగులా చుట్టగా మిగిలిన కట్టుముంగును తెంపి మొదటవేసిన కట్టుపక్కనే చుట్టిన ఒక వరసకట్టు ముంగు (తె. 24); 10. పర్యా. చూ. నిలుగు (2). గంప, తట్ట, బుట్ట, సజ్జ బుట్ట మొ॥ వాటి అల్లికంలో అడుగు నుంచి అంచుదాకా నిలువుగా వేసిన మందం పేడు; దీన్ని గంటిబద్ద నుంచి తీస్తారు (తె. 7, 31); 11. పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥ వాటి అల్లికంలో నిలువుగా వచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్ద నుంచి తీస్తారు; కొన్ని చోట్ల మందంలోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. కో. 2; తె. 31); 12. పరా. పొదిక (1)

మామూలు వెదురుపేడు కన్న మందంగా ఉండే పేడు; గంప, మానె మొ॥వాటికి నిలువుగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 50.2 (కో 5; తె. 30).

బిలుకువేడు తడక: ఉ. వేకుతడికి; బిలుకు (= రెండుమూడు వేళ్ళ వెడల్పు వెదురుబద)తో అల్లిన తడక (కో. 14).

బిలుకువేయు: (క్రి.) ఉ. బిళ్కేయు; జల్లెడ అల్లకంలో అంచు కట్టేటప్పుడు కట్టుముంగుతో గుర్జ ముడి వేసిన తరవాత దానిపక్కనే ఇంకో కట్టు ముంగుతో ఒక చుట్టుచుట్టి మిగిలినదాన్ని గుండు మధ్యకు దోపడం (తె. 22).

బిల్క: పర్యా. చూ. పలుకు (2). సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా బద్ద వెడల్పులో సగానికి చీల్చిన భాగం (గడలో ఎనిమిదో భాగం); దీన్నుంచి పేడు తీస్తారు; వేలెడు వెడల్పు ఉంటుంది (రా. 9).

బిల్లుడుమొద్దు: వెదురుబద్ద గాని పేడుగాని నరికేటప్పుడు కత్తి నేలకు తగిలి మొక్కపోకుండా బద్ద కిందవేసే మొద్దు; బిల్లుచెట్టు కొయ్య, కాలిపిక్కంత లావూ మూరెడు పొడుగూ ఉంటుంది (తె. 5)

బిళ్ళ: ఉ. బిల్ల; 1. పర్యా. చూ. పడగ (2). మేదరి కత్తి వెన్నుకూ పదును భాగానికీ మధ్య ఉండే చెంప చూ. చిత్రం 12 డ. 4 (కో. 13; తె. 18-21); 2. పర్యా. చూ. మూపురం. మేదరికత్తి వెన్ను (చూ.) పదునందు వైపు వంపుదిరిగిన భాగం చూ. చిత్రం 12 జ. 4 (తె. 10); 3. పర్యా. చూ. పడగ (1). అంబు (చూ.)కు వెడల్పుగా ఉన్న భాగం; పాముపడగ, బరిసె మొ॥ వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండే బిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; పేడు తెంపడానికీ చిల్లులు పొడవడానికీ పనికొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి; కొన్ని మొండిగా ఉంటాయి; కాడ కొసతో చిల్లులు పొడవడానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు (కో. 13, తె. 10); 4. పర్యా. చూ. కదురు=నారపోచల్ని సన్నటి తాడుగా వడికే పనిముట్టు; సన్నటి వెదురు పుల్లకు గాని ఇనపచువ్వకు గాని చెక్కబిళ్ళ లేదా ఇనపబిళ్ళ తొడిగి ఉంటుంది; చూ. చిత్రం 119 (రా. 10); 5. గోడిసీ (కాళ్ళు తుడుచుకోడానికి కొబ్బరిపీచుతో అల్లింది) ఇనపబిళ్ళ (కో. 20).

బిళ్ళకత్తి: ఉ. బిల్ల—; కట్టెపిడి లేని మేదరికత్తి (తె. 17).

బీడి గంప: బీడీ కట్టలు మోసుకు వెళ్ళే పెద్ద గంప (తె. 24).

బీడిగుల్ల: పర్యా. బీడీల గంప. బీడీలు వేసుకొనే చిన్నగంప; వెలుపలనుంచి దీని చుట్టూ 'X' అకారంలో డిజైను కోసం బద్దలు తొడుగుతారు (తె. 24).

బీడీలగంప: పర్యా. బీడీగుల్ల. బీడీలు వేసుకొనే చిన్న గంప; వెలుపలినుంచి దీని చుట్టూ 'X' ఆకారంలో డిజైను కోసం బద్దలు తొడుగుతారు (తె. 18).

బీడీల సెంగేరి: ఉ. —సెంగర; బీడీలు చేసేటప్పుడు పొగాకూ తునికాకూ పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; పెద్ద పళ్ళెంలా ఉంటుంది (తె. 21).

బీమన గొంది బొంగు: అసిఫాబాద్ అడవిలో బీమనగొంది అనే లోయలో పెరిగిన వెదురుగడ; లావుగా ఉంటుంది (తె. 23).

బీమన్న పండుగ: (< భీమన్న—) మేదరివాళ్ళు అడివిలో చేసే ఒక రకం పండుగ (తె. 21).

బీరు: పర్యా. చూ. బెండు (1) వెదురుగడ లోపల గుల్లగా ఉన్న భాగం గోడ; పొడుగ్గా పల్లంగా ఉంటుంది (తె. 20).

బీరుపేడు: ఉ. బీర్పేడు; పర్యా. చూ. బెండుపేడు(1). వెదురుగడలో బోలుగా ఉన్న భాగం నుంచి గాని వెదురుబద్ద పల్లపు భాగం నుంచి గాని చీరినపేడు; అంత సన్నగా గాని గట్టిగా గాని ఉండదు (తె. 26).

బీరువా: పేముతో చేసిన అలమారు; బట్టలు మొ॥ పెట్టుకొంటారు (తె. 22).

బుగ్గ: పర్యా. చూ. పడగ (2) మేదరికత్తి వెన్నుకూ పదును భాగానికీ మధ్య ఉండే చెంప చూ. చిత్రం 12 డ. 4. (కో. 31).

బుగ్గదీయు: (క్రి.) తాటిపాయ అంచును కత్తితో గీకడం (కో. 26).

బుగ్గి. ఉ. బుగి; పర్యా. చూ. బూడిద. లేత వెదురు గడచుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది (కో. 22, 27).

బుగ్గిబోయు: (క్రి.) లేత వెదురుగడ చుట్టూ తెల్లటి పొడి (చూ. బుగ్గి) ఏర్పడడం, గడ పుట్టిన సంవత్సరానికి ఇలా ఏర్పడుతుంది (కో. 22).

బుంగ: 1. పర్యా. బుట్ట (3). బియ్యం కడగడానికీ ధాన్యం పోసుకోడానికీ అల్లిన ఒక రకం చిన్న వెదురు పాత్ర; నిలువులు పెట్టకుండా కేవలం పేడుతో చాప అల్లకం మాదిరిగా అల్లుతారు; కింద చతురస్రంగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది

(కో. 31); 2. అడుగుకన్న అంచులు దగ్గరగా ఉండే ఒక రకం గంప (తె. 9).

బుజం: పుచ్చుకత్తికి పిడిదగ్గర నుంచి ఒదును మొదలయ్యే చోట మొనదేలిన భాగం చూ. చిత్రం 12 ట. 4. (రా. 8).

బుజం మోపు: మనిషి భుజంమీద పెట్టుకొని మోయ గలిగినన్ని వెదురుగడల కట్ట (కో. 27, 31).

బుట్ట: ఉ. బుట్టి; 1 ధాన్యం, ఎరువు, పేడ మొ॥ మోసుకు వెళ్ళడానికి వెదురుపేడుతో అల్లినది; మామూలుగంపకన్న చిన్నది; ఉరువులోనూ ఆకారంలోనూ రకరకాలుగా ఉంటుంది; నిలువులు పెట్టి పేడుతో అల్లుతారు. చూ. చిత్రం 48 (కో; తె; రా); 2. పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురు బుట్ట; చేత్తో పట్టుకోడానికి చిలక్కొయ్యకు తగిలించడానికి వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కాళ్ళు ఉండవు; చూ. చిత్రం 139 (తె. 19, 21, రా-2); 3. పర్యా. బుంగ (1). బియ్యం కడగడానికి ధాన్యం పోసుకోడానికి అల్లిన ఒకరకం చిన్న వెదురుపాత్ర; నిలువులు పెట్టకుండా కేవలం పేడుతో చాప అల్లకం మాదిరిగా అల్లుతారు; కింద చతురస్రంగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది (కో. 13, 20, 22, 28).

బుట్టగుల్ల: ఉ. బుట్టి—; 1. పర్యా. చిక్కం (2) పావుకిలో నుంచి అరకిలో వరకు గింజలు మొ॥ పోసిపెట్టుకోడానికి వీలయిన ఒకరకం చిన్న వెదురు బుట్ట; గుల్లమాదిరిగా గుండ్రంగా ఉంటుంది (తె. 24); 2. చిన్న ఈతబుట్ట; మట్టు, ఎత్తు అరడుగు చొ॥న పెట్టి అల్లుతారు; పెసరకాయలు, వేరుసెనక్కాలు మొ॥ దీంట్లోకి ఏరుకొంటారు (తె. 10).

బుట్టడుగు: బుట్ట అడుగుభాగం (కో. 12).

బుట్టపలుకు: వెదురుపేళ్ళ బుట్ట అల్లకానికి వాడే పలుకు. చూ. పలుకు (11) (కో. 17).

బుట్టబొమ్మ: వెదురుబద్దలతో మనిషి ఆకారంలో చేసిన బొమ్మ (కో. 8).

బుట్టవార: ఉ. బుట్టోర; బుట్ట అల్లకంపేడు చీల్చడానికి తయారుచేసిన వార; చూ. వార (కో. 12).

బుటీనె: (< బుట్ట + ఈనె) బుట్ట అల్లకానికి వాడే పేడు; వెడల్పు తక్కువ (కో. 26).

బుడం: 1. రూ. బుడుము (4); పర్యా. చూ. మొదలు (1). వెదురుగడ మొదటి భాగం; వేళ్ళకు పైది; కొసకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 4.2 (తె. 3, 4, 12; రా. 11); 2. పర్యా. మొదలు (7) ఈతబరిగె మొదటి భాగం; కొసకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం. 11.1 (తె. 14; రా. 9).

బుడిపె: చూ. బుడుపు (4) రా-4).

బుడుపు: 1. పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి బొడ్డులా ఉంటుంది (చూ. చిత్రం 9 1. (కో. 4, 12); 2. రూ. బొడుపు, పర్యా. చూ. బొడ్డె (1). వెదురుబద్దకు పల్లపు భాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (కో. 3, 5, 13); 3. పర్యా. వెన్ను (6). అంబు (చూ.) పడగకు మధ్య ఉబ్బెత్తుగా ఉండే భాగం (రా. 2); 4. ఉ. బుడ్పు; రూ. బుడిపె, బొడుసు (5); పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం (= కాడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబెత్తుగా విడిచిపెడతారు చూ. చిత్రం 31, త. 8 (కో-3, 7, 12, 13).

బుడుపుదబ్బ: పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టం తొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2 (రా. 3).

బుడుము: ఉ. బుడుం; 1. పర్యా. చూ. కాడ (1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తొడిమి మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 185. 1 (రా. 6); 2. పర్యా. చూ. తొడిమె (4). మొనదేలకుండా పలకగా ఉండే అంబు (చూ.) కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ వేలెడుగాని రెండువేళ్ళుగాని వెడల్పూ ఉంటుంది; ఇలాంటి కాడగల అంబుకుండే పడగ భాగం మొనదేలి ఉంటుంది; చిల్లులు పొడిచేటప్పుడు ఈ కాడ పట్టుకొంటారు. (రా. 6); 3. కలబంద పట్టలో మొదటి భాగం. (రా-6); 4. చూ. బుడం (రా. 6-9).

బుడుసు: పర్యా. మొదలు (8). ఈతాకు మొదటి భాగం; కొనకన్న వెడల్పు ఎక్కువగానూ మధ్య భాగంకన్న వెడల్పు తక్కువగానూ ఉంటుంది; ఇది వేలెడు వెడల్పుకన్న తక్కువ ఉంటుంది. చూ. చిత్రం 116.2 (రా. 9).

బుడ్డ: పర్యా. చూ. జిట్టీతచెట్టు. పొట్టిగా ఉండే ఒక రకం ఈతచెట్టు. (తె. 13).

బుడ్డకవురుబొంగు: 1. సీకు ఎక్కువగా పీల్చు కొన్న వెదురుగడ; పేడు సాఫుగా రాదు. (తె. 22); 2. పర్యా. ఎల్లికవురు బొంగు. సీకు కొంతవరకు అందకా సగం పచ్చగానూ సగం పాలిపోయీ ఉండే వెదురుగడ. (తె. 23).

బుడ్డబరిగె: పర్యా. చూ. జిట్టీత(చెట్టు) బరిగె. పొట్టి ఈత (జిట్టీత)చెట్టుకమ్మ చీరితీసిన చువ్వ; పొడుగు తక్కువ. (తె. 13).

బుడ్డబర్ర: పర్యా. చూ. కుచబరిగె. పొట్టిగా ఉన్న ఈతబరిగె; జిట్టీతచెట్టు నుంచిగాని పెద్దీత చెట్టు నుంచిగాని తీసింది. (రా. 9).

బుడ్డి: 1. పన్నెండుశేర్ల ధాన్యంకొలత (తె. 14); 2. పదిశేర్ల ధాన్యంకొలత (తె. 18).

బుడ్డెడుగుల్ల: 1. బుడ్డెడు (12 శేర్లు = 15 కిలోలు) ధాన్యంపట్టే గుల్ల (తె. 14); 2. బుడ్డెడు (బుడ్డి = 10 శేర్లు, 12½ కిలోలు) వడ్లుపోసి పెట్టుకోడానికి పనికొచ్చే వెదురుపేళ్ళ గుల్ల చూ. చిత్రం 58 (తె. 18).

బురక: (హిం. బుర్ఖా) ఉ. బుర్కా; మూసి ఉంచేది. (తె. 4).

బురక తడక: (< హిం. బుర్ఖా) ఉ. బుర్కా తడ్కా; పర్యా. చూ. కచ్చడం తడక. కచ్చడం బండిమీద నీడకోసం గుడిసె మాదిరిగా కప్పే తడక లేదా చాప; కొన్నిటికి ముందువేపూ కొన్నిటికి ముందు వెనకలా పడగమాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండు పొరలుగా అల్లి జత కూరుస్తారు; దీని అంచుచుట్టూ చేట మధ్యగా కట్టు (బద్ద)వేసి అంచు కడతారు; పలచటిపేడుతో అల్లినదాన్ని చాపఅనీ నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లినదాన్నిగాని చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డంబద్దలూ వేసినదాన్నిగాని బద్దలు పళంగా అల్లినదాన్నిగాని పలచటిబద్దలతో అల్లిన దాన్నిగాని తడకెఅనీ అనడం మామూలు; చూ. చిత్రాలు 34 క, చ. (తె. 4).

బురక బొంగు: ఉ. బుర్కా—; పర్యా. చూ. బోలు బొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (తె. 29).

బురక విసనకర్ర: ఉ. బుర్కా-యిసనగర్ర; రూ. బుర్ర విసనగర్ర; పర్యా. చూ. గొట్టం విసనగర్ర. సులువుగా తిప్పుకోడానికి పిడిగా వెదురుగొట్టం తొడిగిన విసనగర్ర; చూ. చిత్రం 31 ట. (కో. 2).

బురద పగ్గం: బురద నాగలి (మాగాణి పొలం దున్నేది)తో దున్నేటప్పుడు ఎద్దుకొమ్ముకూ మేడి తోకకూ కలిపికట్టి ఎద్దును మలిపే తాడు; ఈత నారదిగాని, తాటి నారదిగాని. (తె. 9).

బురికెపెట్టె: పర్యా. గొలుసుపెట్టె. పసుపు పోసుకో డానికి వాడే చిన్న వెదురుపేళ్ళ పెట్టె; బొట్టుపెట్టె కన్న చిన్నగా ఉంటుంది; దీని కప్పు అంచుకు గొలుసుకట్టు (= (గొలుసు మాదిరిగా వంకు లొంకులుగా వేసేకట్టు) వేస్తారు (కో. 20).

బుర్ర: 1. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమి లోపల వేళ్ళతోసహా ఉన్న దుంప; వెదురుగింజ భూమిలో పడిన తరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్ని పిల్లవేళ్ళూ భూమిలోకి పాక తాయి (కో. 22); 2. రూ. బొర్ర (3) బొర్రె; పర్యా. చూ. బోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపు నుంచి మరొక కణుపు వరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ, ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు చూ. చిత్రం 4.1 (తె. 13, 25, 27; రా. 1); 3. పర్యా. చూ. గొట్టం (1). విసనగర్ర కాడకు తొడిన వెదురుగడ ముక్క; లోపల గుల్లగా ఉన్నది; విసురుకొనేటప్పుడు సులువుగా ఉండడానికి ఇది తొడుగుతారు చూ. చిత్రం 31 ట. 1 (కో 2; తె. 4, 8; రా. 2, 3, 8).

బుర్రకర్ర: పర్యా. చూ. వంక కర్ర (1); పాము పడగ మాదిరిగా మొదలు వంపు దిరిగిన వెదురు కర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలి గేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయో గిస్తారు చూ. చిత్రం 8. చ (కో. 22).

బుర్రకాయ సొప్పు: నీళ్ళు పోసుకోడానికి ఆనపే కాయ చుట్టూ వెదురుపేడుతో అల్లినది (తె. 22).

బుర్రజమ్ము: ఉ. బొర్ర ; మధ్యలో నిలువునా బోలుగా ఉన్న జమ్ము; చూ. జమ్ము (రా. ?

6, 10).

బుర్ర తుంగ: మధ్యలో నిలువునా బోలుగా ఉన్న తుంగ; చూ. తుంగ (రా. 4).

బుర్రపెట్టె: పర్యా. చూ. సారెపెట్టె. పెళ్ళి సందర్భంగా పెళ్ళికూతురికిచ్చే సారెసామాను (కుంకుమ, పసుపు, పచ్చ, ఘుగ్గుపిండి, సెనగపప్పు, కుడకలు, ఆకులు, పోకలు, కర్జూర పండ్లు, కుంకుమ కాయ, బొమ్మ, అద్దం, దువ్వెన, ఈప్పెన, లక్కాకులు, నల్లపూసలు, పగడాలు మొ॥వి) పెట్టి ఇచ్చే పెట్టె; దీర్ఘ చతురస్రాకారంలో ఉంటుంది; అల్లికం చేట మాదిరిగా అంచకు బద్దలువేసి కట్టుకడతారు; మూత కూడా దీనిలాగే ఉంటుంది; ఆర్థికస్తోమత అంతగా లేనివాళ్ళు ఇస్తారు; కొంచెం ఉన్నవాళ్ళు బంగిపెట్టె (= రెండు పొరలుగా గుండ్రంగా ఉండేది) ఇస్తారు' (తె. 23, 25).

బుర్ర బొంగు: ఉ. బుర్రె–; పర్యా. చూ. బోలు బొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ, మేదరిపనికి ఉపయోగపడుతుంది. (రా. 1).

బుర్ర బొంబు: పర్యా. చూ. బోలు బొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది (రా. 1).

బుర్ర మెచ్చు: 1. పర్యా. చూ. మేదరికత్తి. వెదురుగడ నరకడానికీ బద్దలూ పేళ్ళూ చీల్చడానికీ మేదరివాళ్ళు వాడే కత్తి; కొన్నిటికి కట్టెపిడి ఉంటుంది; చూ. చిత్రం 12 జ, డ. (రా. 1); 2 మేదరికత్తి పట్టుకోడానికి పిడి ఆకారంలో వంచిన భాగంలో ఉన్న బోలు. (రా. 1).

బుర్రవిసనగర్ర: చూ. బురక విసనగర్ర (రా. 8).

బుర్రాకు: (< బుర్ర + ఆకు) పర్యా. చూ. బర్రేకు. వెడల్పు ఎక్కువగా ఉండే ఈతాకు; సుమారు వేలెడు వెడల్పు ఉంటుంది. (తె. 19).

బులుగు: (< ఇం blue) నీలంరంగు; చాపల నేతకు వాడే నారకు వేస్తారు (కో. 3).

బుషి: పర్యా. చూ. బూడిద. లేతవెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది (తె. 17).

బూఋ: చేపలు పట్టడానికి వెదురుపుల్లలతో అల్లిన ఒక రకం సాధనం; దారంతో అల్లుతారు; పైపైపు మూసి ఉంది దానికి మధ్యలో చెయ్యి పట్టేటంత తెరిపి ఉంటుంది (కో. 29)

బూజు: 1. పర్యా. చూ. బూడిద లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్ని చోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది (కో. 4; తె. 10; 14, 15); 2. చీమలు మొ॥ రంధ్రాలు; చేసినప్పుడు వెదురుగడ కణుపులో ఏర్పడిన నల్లటి పదార్థం (కో. 3); 3. వెదురుగడ లోపల ఉండే పొట్టువంటి పదార్థం (కో. 6).

బూటు: పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం (కాడరు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు చూ. చిత్రం 31 త. 3 (తె. 30).

బూడాలగంప: బెత్తెడుఎత్తు మూరెడు వెడల్పుపెట్టి; బూడాలు (ఒకరకం తీపి తినుబండారం) పెట్టుకొని అమ్ముతారు; (తె. 9).

బూడాలు: (బ.) ఒకరకం తీపి తినుబండారం. (తె.9).

బూడిగకర్ర: పర్యా. ఏగ్గాడ. కణుపుల దగ్గర కొమ్మలు వేయని వెదురుగడ; దీనికి గంటికనుపు ఉండదు; గడసాపుగా ఉంటుంది. (కో. 22).

బూడిద: ఉ. బూడిది, బూడిదె, బూడ్ద, బూడ్ది; పర్యా. ఊదివి, కంకమసి(1), కూకు, నుసి, నూగు, పిండి(1), పూత, పొట్టు(1), బుగ్గి, బుషి, బూజు(1), బొంగుమసి, బోజెర, మసి(2), మైలబూడిద, మైలు, విబూది, వెదురుమసి, సుంకు(1). లేతవెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటి పొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది (కో. 2, 13, 22, 23, 28, 30, 31; తె. 6, 8, 26–28, 30, 31; రా. 3, 8).

బూదబ్బ: చూ. పూ బద్ద. (తె. 16).

బూరకర్ర: పర్యా. చూ. బోరగాలకర్ర. మొదలు లావుగానూ చివరసన్నగానూ ఉండే వెదురుకర్ర; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 24).

బూరిరామాపాటను: (< ఇం. – Pattern) పర్యా. చూ. పెద్దరామాపాటను. ఒకరకం పేముకుర్చీ; రామాపాటను కుర్చీల్లో పెద్దది. (కో. 19).

బూషి: పర్యా. సుంకు(2). ఈతకమ్మ మీద బూడిదలా ఉండే తెల్లటిపొడి. (రా. 9).

బెంగోటిబెత్తం: సీరుకోట (మద్రాసు ప్రాంతం)లో దొరికే ఒకరకం పేము. (కో. 12).

బెచ్చు: ఒకతెగ; కొందరు చేపలు పడతారు; కొందరు చాపలు నేస్తారు. (రా. 10).

బెజ్జం: పర్యా. చూ. కంత(1). జల్లెడ అడుగు

అల్లికంలో పేళ్ళమధ్య ఉన్న సన్ననిఎడం; అల్లించు కొనేటప్పుడు నూకలు మొ॥ వంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (కో. 9, 12, 13, 15, 23; తె. 30, 31).

బెంచి: (< ఇం. bench). నలుగురైదుగురు కూర్చోడానికి వెదురుగడలతోనూ బద్దలతోనూ కట్టిన పొడుగాటి బల్ల. చూ. చిత్రం 100. (తె. 10).

బెట్టువాసం: పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకఱ్ఱ; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీద మొలుస్తుంది; తడకబద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (కో. 8).

బెడగు: పర్యా. తడకగోడీ. తడక అల్లికంలో నిలువుగా ఉపయోగించే మందంపేడు; దీనికి ఒక అంచున పసరు భాగముంటుంది. (కో. 23).

బెడికించు: (క్రి.) పర్యా. చూ. మెంగించు. వెదురుగడ చీల్చేటప్పుడు కణుపు సులువుగా తెగడానికి కత్తిని అడ్డంగా మెలిదిప్పడం. (కో. 22).

బెండతుకు: ఉ. బెండతుక్కు; 1. పర్యా. చూ. బెండుపేడు(1). వెదురుగడలో బోలుగా ఉన్నభాగం నుంచిగాని, వెదురుబద్ద పల్లపుభాగం నుంచిగాని చీరినపేడు; అంత సన్నగాగాని గట్టిగాగాని ఉండదు. (తె. 20. 21, 25); 2. పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా సన్నగా ఉండేభాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 20).

బెండాకు: (< బెండు + ఆకు) పర్యా. చూ. బెండుపేడు(1). వెదురుగడలో బోలుగాఉన్న భాగం నుంచిగాని వెదురుబద్ద పల్లపుభాగం నుంచిగాని చీరినపేడు; అంత సన్నగాగాని, గట్టిగాగాని ఉండదు. (రా. 1).

బెండింగ్: (ఇం. bending) వంచడం; పేము కఱ్ఱల్ని చేయవలసిన వస్తువుకు అవసరమైనట్లు కిరసనాయిలు స్టౌమీద కాల్చి వంచుతారు. (కో. 12, 19).

బెండీనె: (< బెండు + ఈనె). 1. పర్యా. చూ. బెండుకఱ్ఱ. వెదురుబద్ద పల్లపుభాగం నుంచితీసిన కఱ్ఱ (చూ.); గంపలు మొ॥ అల్లడానికీ కట్టు (బొద్దు) చుట్టడానికీ ఉపయోగం (కో. 5); 2. పర్యా. చూ. పసరుకింది కఱ్ఱ. వెదురుబద్దకు పైన సన్నగా పచ్చగా ఉండే (పసరు) భాగంకింది నుంచి తీసినకఱ్ఱ; చూ. కఱ్ఱ. (రా. 4).

బెండు: 1. పర్యా. గేదె, పొట్టె(1), బీరు. వెదురుగడ లోపల గుల్లగాఉన్న భాగంగోడ; పొడుగ్గా పల్లంగా ఉంటుంది. (రా. 1, 5); 2 పర్యా. చూ. బద్ద(4). విసనగఱ్ఱ పట్టుకోడానికి అల్లికంలో ఒకఅంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (రా. 4); 3. పర్యా. చూ. నిలుగు(2). గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లికంలో అడుగునుంచి అంచుదాకా నిలువుగావేసిన మందంపేడు; దీన్ని గుంటబద్దనుంచి తీస్తారు. (రా. 3); 4. పర్యా. చూ. బెండుపేడు(1). వెదురుగడలో బోలుగాఉన్న భాగం నుంచిగాని వెదురుబద్ద పల్లపుభాగం నుంచిగాని చీరిన పేడు; అంతసన్నగాగాని గట్టిగాగాని ఉండదు. (తె. 27, 30; రా. 5); 5. పర్యా. తాట. వెదురుగడపైన పసరుపొర తరవాత ఉండేకండ. (కో. 15); 6. పర్యా. చూ. తెల్లపేడు(1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా సన్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగంలోది; తెల్లగా ఉంటుంది. (తె. 28); 7. పర్యా. పొట్టె(1) వెదురుబద్ద పల్లపు భాగంలో ఉండే కండ. (కో. 7, 8-11, 17, 18; తె. 22, 23, 27); 8. పర్యా. చూ. అడ్డం. తడక, బండిజల్ల, పిల్లలపొది, ఉయ్యాల, చెండ్రిక మొ॥ వాటి నిలువుల చుట్టూ అడ్డంగా అల్లేమందం పేడు లేదా పలచటిబద్ద; మామూలు పేడుకన్న మందం గానూ వెడల్పుగానూ ఉంటుంది. (రా. 8); 9. కోళ్ళ పంజరం తయారీలో పైన వెన్నుగఱ్ఱగా పెట్టే వెదురుగడ చూ. చిత్రం 65 గ. 2 (తె. 17); 10. కొడమ అడుగున ఉండే పిఱ్ఱతడక మీంచి కొట్టిన వెదురుబద్ద (కో. 4); 11. వెదురుమంచం మీద తడకపరిచి బిగించడానికి తడక మీదుగా అంచువెంబడి కొట్టిన వెదురుబద్ద. (తె. 17); 21. పర్యా. చూ. కండదబ్బ (4). ఈతకమ్మ వెన్నుకూ పొట్టకూ మధ్యభాగంనుంచి నిలువుగా చీరినబద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు అడుగుభాగంలో చుట్టడానికీ ఎత్తుభాగంలో సగందాకా చుట్టడానికీ పనికొస్తుంది. చూ. చిత్రం 11. 3. (తె. 7; రా. 8).

బెండుకట్టు: పర్యా. తెల్లకట్టు, తెల్లబిలుకు, బెండు బిలుకు. వెదురుబద్దకు పచ్చగా సన్నగా ఉండే

(పసరు) భాగానికి కిందినుంచి గాని పల్లపుభాగం నుంచిగానిచీరినబద్ద(కట్టు); తెల్లగా ఉంటుంది; దీన్ని చేట వెలుపలి అంచుచుట్టూ పెట్టి బిగిస్తారు. (తె, 18, 19).

**బెండుకంటం:** (< సం. –కంఠం) పర్యా. బెండు గుండు(2). జల్లెడ అంచుకట్టేటప్పుడు లోపలి భాగంలో తట్టు (చూ.) మీద ఉంచే గుండ్రటిబద్ద (చూ. గుండు); దీన్ని బద్ద బెండుభాగంవైపు తీస్తారు; దీనికి వెలుపలినుంచి ఒకబద్దా, ఈ రెంటి మీంచి ఇంకో బద్దా వేసి అంచు పూర్తిచేస్తారు. (రా. 7).

**బెండుకర్ర:** ఉ. –గర్ర; 1. పర్యా. పూబెండుగర్ర, పొట్టువార; పొట్టెకర్ర, పొట్టెం(పు)వార, బెండీనె (1), బెండుజోడెం(1), బొద్దుగర్ర. వెదురుబద్ద పల్లపు భాగంనుంచి తీసిన కర్ర (చూ.); గంపలు మొ॥ అల్లడానికీ కట్టు (బొద్దు) చుట్టడానికీ ఉపయోగం (తె. 22, 23, 25; రా. 8–10); 2. పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీద మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది.(కో.28); 3. పర్యా. చూ. పసరుకింది కర్ర. వెదురుబద్దలకు పైన సున్నగా పచ్చగా ఉండే (పసరు) భాగం నుంచి తీసిన కర్ర; చూ. కర్ర. (తె. 21, 22).

**బెండుగట్టు:** పర్యా. తెల్లకట్టు. వెదురుబద్దకు పచ్చగా సున్నగా ఉండే (పసరు) భాగానికి కిందినుంచిగాని పల్లపు భాగంనుంచి గాని చీరినబద్ద (కట్టు); చేట అల్లకంలో దీన్నిలోపలి అంచుచుట్టూ పెట్టి బిగిస్తారు. (తె. 21, 23; రా. 16).

**బెండుగుండు:** 1. పర్యా. చూ. బిలుకు(1). జల్లెడ అంచుకట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండు చుట్టూ వేసే రెండు మూడువేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలిగుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు చివర్లు (కర్పడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండు బద్దలపైనా మరోమందం బద్ద (కర్ర) ఉంటుంది; చూ. చిత్రం 30 క. 3. (తె. 21, 22); 2. పర్యా. బెండుకంటం. జల్లెడఅంచు కట్టేటప్పుడు లోపలి భాగంలో తట్టు (చూ.) మీద ఉంచే గుండ్రటిబద్ద (చూ. గుండు); దీన్ని బద్ద బెండుభాగంవైపు తీస్తారు; దీనికి వెలుపలినుంచి ఒకబద్దా, ఈ రెంటిమీంచి ఇంకో బద్దావేసి అంచుపూర్తి చేస్తారు (తె. 25).

**బెండుచాప:** ఉ. –సాప. బెండుపేడు (చూ.)తో అల్లిన వెదురుచాప. (రా. 6).

**బెండుజోడెం:** 1. పర్యా. చూ. బెండుకర్ర(1). వెదురుబద్ద పల్లపుభాగంనుంచి తీసినకర్ర (చూ.); గంపలు మొ॥ అల్లడానికీ కట్టు(బొద్దు) చుట్టడానికీ ఉపయోగం. (తె. 18); 2. ఉ. –జోడెం; వెదురు గడ లోపల పల్లపుభాగంవైపు వచ్చేకర్ర (చూ.)ల జత (జోడెం). (తె. 24).

**బెండుతడక:** ఉ. –తడికె, –తడ్క; 1. బెండు పేళ్ళ (= వెదురుబద్ద పసరుభాగానికి కిందినుంచిగాని లోపలి పల్లపుభాగం నుంచిగాని గాని తీసినపేడు) తో అల్లిన తడక; గదులమధ్య అడ్డంగా కట్టు కోడానికి పనికొస్తుంది. (కో. 7; తె. 1; రా. 5, 9); 2. ఈతకమ్మ వెన్నునుంచిగాని వెన్నుకూ పొట్టకూ మధ్యభాగం (బెండు) నుంచిగాని తీసిన బద్దలతో అల్లినతడక. (రా. 9).

**బెండుదబ్బ:** 1. రూ. బెండుబద్ద; పర్యా. కండదబ్బ(1) నిలువుబద్ద(1), పెదదబ్బ, పొట్టుబద్ద. వెదురుగడ చీల్చినప్పుడు బోలుగా ఉన్న భాగంనుంచి తీసినబద్ద. (కో. 3, 4; రా. 9–11); 2. పర్యా. తెల్లబెద్ద. మందం వెదురుబద్ద మధ్యభాగం నుంచిగాని పసరు భాగం కిందినుంచి గాని తీసిన బద్ద. (కో. 1; రా. 8).

**బెండుదబ్బజల్ల:** బెండుబద్ద (చూ.) లతో అల్లిన బండిజల్ల. (రా. 8).

**బెండుదొక్కు:** (క్రి.) గంప మొ॥వాటి అల్లకంలో అడుగుకు సరిపోయే విధంగా బెండు నిలువులను చక్రం ఆకారంలో గుండ్రగా పెట్టి కాలికిందతొక్కి పట్టడం. (కో. 7).

**బెండుపలుకు:** ఉ. –పల్క; పర్యా. చూ. పొట్టెందాలెం. బద్ద పల్లపుభాగంనుంచి బద్ద వెడల్పునా తీసినదాలెం; చూ. దాలెం. (తె. 6).

**బెండుపేడు:** ఉ. పేడు; 1. పర్యా. తెల్లపేడు(2), పొట్టెపేడు(2), పొట్టీనె(2), పొట్టుపేడు, పొట్టెపీనె, పొట్టెబేరె, బీరుపేడు, బెండతుకు(1), బెండాకు, బెండు (4), బెండు బేరె, బొద్దుపేడు, బొద్దుపేడు, మోటీనె. వెదురుగడలో బోలుగా ఉన్న భాగంనుంచి గాని వెదురుబద్ద పల్లపుభాగం నుంచి గాని చీరిన పేడు; అంతసున్నగా గాని గట్టిగా గాని ఉండదు (కో. 2, 3. 10, 13, 15, 16, 18; తె. 18, రా. 3, 6–10); 2. పర్యా. చూ. తెల్లపేడు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా సున్నగా ఉండే భాగానికి కిందినుంచి తీసినపేడు; పసరుపేడుకూ

బెండుషేడుకూ మధ్యభాగంలోనిది; తెల్లగా ఉంటుంది (కో. 1, 8, 8, 9, 12; తె. 1, 6, 7, 28, 31; రా. 24).

బెండుబద్ద: బెండుదబ్బ(1). (కో.-5).

బెండు బిలుకు: పర్యా. చూ. బెండుకట్టు. వెదురు బద్దకు సన్నగా ఉండే (పసరు) భాగానికి కింది నుంచి గాని పల్లపుభాగం నుంచి గాని చీరిన బద్ద (కట్టు); తెల్లగా ఉంటుంది; దీన్ని చేట వెలుపలి అంచుచుట్టూ పెట్టి బిగిస్తారు (తె. 24).

బెండుబేరె: పర్యా. చూ. బెండుపేడు (1). వెదురు వెదురుగడలో బోలుగా ఉన్న భాగం నుంచి గాని వెదురుబద్ద పల్లపుభాగం నుంచి గాని చీరినపేడు; అంతసన్నగా గాని గట్టిగా గాని ఉండదు. (తె. 22-24).

బెండు సలుగు: ఉ. -సల్గు; వెదురుగడలో బెండు భాగం నుంచి తీసిన సలుగు; చూ. సలుగు (తె. 28).

బెత్త: చేత నాలుగువేళ్ళ వెడల్పు; రెండంగుళాల కొలత (తె. 7, 9).

బెత్తం: సన్నటి (పేము) కర్ర (కో. 19).

బెత్తంబరిగె: చేతిబెత్తంగా ఉపయోగపడే వెదురు కర్ర; వేలెడు లావుంటుంది (తె. 19).

బెలుగు: గుడిసె కట్టుబడిలో అడ్డంగావేసే వెదురుగడ (తె. 26).

బెల్లంగుల్ల: బెల్లం అచ్చులు పెట్టుకొనేగుల్ల (తె. 22).

బెల్లెంతకట్టె: బెల్లెంత చెట్టునుంచి తీసిన చువ్వ. (బరిగె); పేడతట్టలు, బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది (తె. 14).

బేంద: ఒకరకం కోళ్ళ గూడు; చూ. కోళ్ళ బేంద (తె. 22).

బేరడతాడు: ఎలగటి నాగలి దున్నేటప్పుడు ఎడ్లను కాడికి కట్టడానికి ఉపయోగించే బేరడ (= తోలు పట్టీ) చివరకట్టిన సన్నటితాడు; ఈ తాడును కాడి తొలినుంచి తీసి బిగిస్తారు; గోగునారతో గాని జనప నారతో గాని పేంతారు (తె. 9).

బేరె: 1. పర్యా. చూ. పేడు (1). వెదురుబద్ద సన్నగా చీలిస్తే వచ్చే పాయ; సుమారు చిటికెన వేలెడు వెడల్పు గోరంత మందమూ గజంన్నర పొడుగూ ఉంటుంది; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి వాడతారు; అల్లేవస్తువును బట్టి దీని పొడుగు వెడల్పులు నిర్ణయించుకొంటారు (తె. 22-24); 2. పర్యా. చూ. మందంషేడు, గోధుమంథంకన్ను ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుషేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది (తె. 21).

బేరెగుమ్మి: బేరె (= పలచటిబద్ద లేదా మందంపేడు) తో అల్లినగుమ్మి; దీనికి నడిమి కట్టుండదు; మూతి కట్టుంటుంది; ఇందులో బస్తా ధాన్యం పడతాయి (తె. 28, 25).

బేలు: చతురస్రంగా అణగ్గొట్టిన కొబ్బరి పీచుకట్ట; దీనికి నాలుగు పక్కలా నాలుగు పలకలు పెట్టి కడతారు (కో. 30).

బేల్చిక్కు: (< బేలు చిక్కు) కొసెగడ్డితో కట్టే చిక్కు; చూ. చిక్కు (తె. 14).

బేసిన్: కొంచెం పెద్దసైజులో ఉండే ఒకరకం మూస గంప (కో. 10).

బేక్‌దండ: (< ఇం (back—) పేముకుర్చీలో వీపు అనుకొనే భాగానికి పైన అమర్చిన పేముకర్ర (తె. 22).

బేగ్: (< ఇం. bag) కూరగాయలు, బట్టలు మొద॥ పెట్టుకోడానికి తాటి ఈనెలతో అల్లిన ఒక రకం బుట్ట; దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది (కో.12)

బైరూపులు: బిచ్చమెత్తుకొనే ఒక తెగ; యజమానులకు నవ్వు పుట్టేలా చేసి అడుక్కొంటారు (తె. 21).

బొక్క: ఉ. బక్క; 1. పర్యా. తొర్ర (2), బొర్ర(1); చేట తయారీలో అంచు కట్టేటప్పుడు కట్టు ముంగు బిగించడం కోసం అంచునగ్గర అమ్ముతో పొడిచి చేసిన చిల్లి (తె 6; రా. 3); 2. పర్యా. కన్ను (10), గల్మ (1), దిడ్డి (1), గొర్రెపిల్లల గూడులోకి పిల్లల్ని వేయడానికి ఉంచిన సందు; అల్లేటప్పుడు ఒక్క గొర్రెపిల్ల పట్టేంత సందు వదులుతారు. చూ. చిత్రం 77.4 (రా.9); 3. పర్యా. చూ. చిద్రం (2). ఈతచాప అల్లకంలో ఒక అకుకూ మరొక ఆకుకూ మధ్య ఏర్పడ్డ సందు; సూది దూరేటంత ఉంటుంది (రా. 9); 4. పర్యా. కంత (7), కన్ను (15), చాపల తమగ్గం అచ్చు (= తుంగ పోచ నేతలో కలవడానికి దగ్గరగా జరిపే పలక) కుండే బెజ్జం; ఇలానివి సుమారు ముప్పై ఉంటాయి; ఈ బెజ్జాలగుండా పోగులు దూరుస్తారు చూ. చిత్రం 105.1 (రా. 6, 10); 5. చూ. బొక్క (1). (తె. 9; రా. 6, 10).

బొక్కల జల్లెడ: పర్యా. గండ్లజల్లెడ. పేళ్ళమధ్య సందులు (కండ్లు) పెద్దగా ఉండేటట్లు అల్లిన జల్లెడ; బియ్యంలో నూకలు తియ్యడానికి వాడతారు

(రా. 5).

భోగానిసిబ్బి: ఉ. – సిబ్బి. బోగాని (= ఒకరకం గిన్నె; బగోణి) మీద మూతపెట్టే సిబ్బి (తె. 16).

బొగ్గుతట్ట బొగ్గు (తవ్వి తీసే) బావులదగ్గర బొగ్గు మోసే తట్ట (తె. 23).

బొగ్గులపొయ్యి విసనగర్ర: కుంపటి విసురుకొనే విసనగర్ర (రా. 11).

బొంగు: **1.** పర్యా. చూ. వెదురుబొంగు. వెదురు పొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ళ మందం నుంచి దూలమంత మందం వరకు లావూ ఉంటుంది; మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చని గడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4 (కో. 5; తె. 26); **2.** పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాల మొదటి భాగంలోనూ మూడంగుళాలు కొన భాగంలోనూ లావుంటుంది; బండి జల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది (రా. 4); **3.** ఎక్కువ లావుగానూ కణుపుకు కణుపుకూ మధ్యలోపల బోలు ఎక్కువగానూ ఉండే వెదుదురుగడ; ఇది మేదరిపనికి ఉపయోగపడదు; 'బండి దండీ'లకు పనికొస్తుంది (కో. 2, 6, 19, 24, 28, 29); **4.** పర్యా. చూ. బోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపు నుంచి మరొక కణుపు వరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1. (తె. 17, 19, 20); **5.** పర్యా. చూ. లో బొంగు. (తుంగ) చాప నేతమగ్గంలో ఒక వరస పోగుల అని లేవడానికి పోగుల నడుమ దూర్చిన లావుపాటి వెదురుగడ; గజం పొడుగుంటుంది; తొక్కుడు దబ్బకూ దిబ్బదండుకూ మధ్య ఉంటుంది. చూ. చిత్రం 120 క.2 (రా. 4).

బొంగుకర్ర: పర్యా. చూ. మొదలు పోటుకర్ర (1). వెదురుగడలో మొదలున్న భాగం; లావుగా రెండు బారల పొడుగుంటుంది (కో. 18).

బొంగుగోవ: పర్యా. చూ. ఖానా (1). వెదురుగడలు నిలవ చేయడానికి చేసిన కట్టుబడి. రెండు గజాల ఎడంలో రెండు గడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి వాటికి ఎదురుగా గజం ఎడంలో మరో రెండు గడలు (లేదా సరుగుడు కర్రలు) పాతి ఆ నాల్గింటి పై చివర్లను కలుపుతూ అడ్డంగా మూడు గడలు (లేదా సరుగుడు కర్రలు) కట్టి ఒకవేపు ఖాళీ ఉంచుతారు); ఖాళీ ఉన్న వైపునుంచి గడలు దూర్చి నిలబెడతారు; ఖాళీ వేపును గొలుసుతో గాని గడతో గాని మూసి తాళం గూడా వేసుకోవచ్చు (తె. 17).

బొంగుటం: పర్యా. చూ. వెదురుప్పు, వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డ కట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్ల తిరుమనిగౌర, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపి రాస్తే తగ్గుతుంది (తె. 17).

బొంగుతవాచి: ఉ. –తవాచ్; పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్ని చోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డ కట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్లతిరుమని గౌర, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది (తె. 7, 13).

బొంగుతవాశిర్: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డ కట్టడంవల్ల తయారవుతుంటారు, పండిన గడలకూ ముదురు

గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహ రోగాలకూ, కడుపునొప్పికీ విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్ల తిరుమనిగారె, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులు గాని నాలిక గాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (తె. 15).

బొంగుతాడు: పర్యా. చూ. మగ్గంతాడు. ధావనేసే మగ్గంలో పోగుల్ని లాగిపట్టి ఉంచే దిగదండుకు కట్టినతాడు; దీని రెండోకొన వెనక ఉండే గుంజకు కడతారు; దిగదండును వదులు చేయడానికి గాని బిగువుగా పట్టి ఉంచడానికి గాని పనికొస్తుంది. (కో. 8).

బొంగుతాసు: పర్యా చూ. వెదురుప్పు. వెదురుగడ లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్లతిరుమనిగారె, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది; పెదవులుగాని, నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపి రాస్తే తగ్గుతుంది (తె. 18).

బొంగుతుంట: పర్యా. చూ. కురచబొంగు. పది మూరలకన్న తక్కువ పొడుగున్న వెదురుగడ (తె. )6).

బొంగుమసి: పర్యా. చూ. బూడిద. లేతవెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది (తె. 9).

బొంగువంక: ఉ. —వొంక; పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒక భాగం (తె. 14).

బొటారించు: (క్రి.) గంప మొ॥ వాటికి అంచుచుట్టూ కట్టు (జెడలాగ గట్టిగా కర్రతో అల్లడం) వేసిన తరవాత కట్టు కుదురుపడడానికి అంచు మడిమె (చూ.) తో కట్టుమీద కొట్టడం (తె. 18)

బొటిమ: నల్లెడ బరిగెమీద మధ్యమధ్య ఉండే బొడిపె (—) (తె. 14).

బొటించు. (క్రి.) వెదురుగడ మొదలు మట్టంగా నరకడం (రా. 1).

బొట్ట: 1. పర్యా. చూ. గుమ్మి (2). ఒకచోట స్థిరంగా ఉంచి పెద్ద మొత్తంలో వడ్లు మొ॥ ధాన్యం పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; సుమారు గజం ఎత్తూ ముప్పావు గజం నుంచి గజంన్నర వరకు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ కొన్ని చోట్ల క్రింద వెడల్పుగా గుండ్రంగానూ మధ్యన కొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను మూసుకొచ్చే విధంగానూ కొన్ని కొన్నిచోట్ల కింద గుండ్రంగానూ పోనుపోను పైన సన్నగానూ ఉంటుంది; కొన్నిచోట్ల దీనికి శిఖరంలాంటి తప్ప ఉంటుంది; రెండు బస్తాలనుంచి 12 బస్తాల వరకు ధాన్యం పట్టే పరిమాణంలో ఉంటాయి; (చూ. చిత్రం 74 క, ట. కో. 1, 31; రా. 3); 2. పర్యా. చూ. గుమ్మి (3). వడ్లు మొ॥ ధాన్యం నిలవ చేసుకోడానికి ఈత చువ్వతో అల్లినది; గజంనుంచి రెండు గజాల వరకు చుట్టుకొలతా, ఐదడుగుల ఎత్తూ ఉంటుంది; రెండు బస్తాలనుంచి ఇరవై బస్తాలవరకు ధాన్యం పడతాయి (కో. 25).

బొట్టు: పర్యా. పుస్తె. పెళ్ళికొడుకు పెళ్ళికూతురిమెళ్లో కట్టే గుండ్రటి బిళ్ళ; బంగారంతో చేస్తారు; మామూలుగా రెండుంటాయి; తాళి (రా. 3).

బొట్టుపెట్టె: పర్యా. కుంకుమపెట్టె; కుంకుమభరిణె. ఆడవాళ్ళు కుంకుమ, అద్దం, దువ్వెన, బొట్టుపుల్ల, కాటిక మొ॥ అలంకరణ సామగ్రి ఉంచుకొనే చిన్న పెట్టె (కో. 10, 14, 18, తె. 6, 8, 9, 18, 26, 30, 31; రా. 4).

బొట్టె[1]: చూ. బొడ్డె (3) (తె. 13).

బొట్టె[2]: ఆడపిల్ల; కన్నెపిల్ల (కో. 24).

బొట్టెం: చూ. పొట్టె (2) (కో. 19).

బొడిగె: ఒకరకం భిక్షపాత్ర; 'కాటిపాపలు' అనే తెగవాళ్ళు బిచ్చమెత్తుకొనేది (తె. 21).

బొడిబద్ద: పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (=వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేస్తే మిగిలేకొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవిప్రాంతం వాళ్ళు దీన్ని వాడే స్తారు చూ. చిత్రం. 9. (తె. 29).

బొడిసె: ఒకరకం గంప (బళ్ళారి గంప)కు అడుగున

నేలమీద అనుకోడానికి అమర్చిన చిన్నకోడు; ఇలాంటివి మూడుంటాయి చూ. చిత్రం 51.1 (తె. 4).

బొడుప్పు: ఉ. బొడ్పు; 1. చూ. బుడుపు(2) (తె. 7,); 2. రూ. బొడుసు (6); గరి (5), బొబ్బురు, సట్టు. ఈతకమ్మకున్న ఆకు తెంపిన తరవాత ఆకు తెగిన చోట పడే గుర్తు (తె. 9).

బొడుసు: ఉ. బొడ్సు; 1. పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపు దగ్గర కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది చూ. చిత్రం 9.1. (తె. 27); 2. పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (=వెదురు గడకు పెరిగినకొమ్మ నరికేస్తే మిగిలేకొమ్మ గుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవి ప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు చూ. చిత్రం 9. (తె. 28); 3. పర్యా. చూ. బొడ్డె (1). వెదురు బద్దకు పల్లపు భాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (తె. 28, 25); 4 కావడి బద్దకు చివర ఉబ్బెత్తుగా ఉన్న బొడిపె, బద్దకు రెండు చివరలా ఉంటుంది; కాడు జారి పోకుండా ఆపుతుంది (తె. 6); 5. చూ. బుడుపు (4) (తె. 27); 6. చూ. బొడుపు (2) (తె. 18).

బొడ్డడుగు: (<బొడ్డు + అడుగు) ఉ. బొడ్డగు; 1. పర్యా. బొడ్డు (4). ఈతచువ్వతో అల్లిన పేడతట్ట, గుల్ల మొ॥ వాటి అడుగు భాగానికి మధ్యలో ఉబ్బెత్తుగా ఉండేది (తె. 7, 13); 2. మధ్యలో ఉబ్బెత్తుగా వచ్చిన పేముబుట్ట అడుగు (చూ.) భాగం (కో. 3).

బొడ్డారం: పేముకుర్చీల్లో ఒకరం (కో. 11).

బొడ్డు: 1. రూ. బొడ్డె (2); పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది చూ. చిత్రం 9.1. (తె. 2.); 2. పర్యా. చూ. బొడ్డె (1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (తె. 7, 8; రా. 4, 9, 10); 3. చూ. బొడ్డె (3) (తె. 31); 4. పర్యా. బొడ్డడుగు (1). ఈతచువ్వతో అల్లిన పేడతట్ట, గుల్ల మొ॥ వాటి అడుగు భాగానికి మధ్యలో ఉబ్బెత్తుగా ఉండేది (కో. 23; తె. 9); 5. కొబ్బరికాయ పైభాగంతో జుట్టుదగ్గరి మెత్తటి పీచు (కో. 25); 6. వెలగతట్ట అడుగులోని మధ్య భాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది (కో. 23).

బొడ్డు గన: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1. (తె. 29).

బొడ్డు గనుపు: ఉ. –గెన్పు; 1. పర్యా. కన్ను(2), గుడ్డిగనుపు, గుంటగనుపు, గుడ్డుగుంపు, లోగనుపు, లోతుగనె. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు లోతుగా పడే బొడ్డు లాంటి గుర్తు చూ. చిత్రం 9.1. (రా. 11); 2. పర్యా. చూ. బొడ్డె(1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (కో. 17).

బొడ్డు గుంపు: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటులది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది చూ. చిత్రం 9.1. (కో. 26).

బొడ్డుజివురు: (క్రి.) వెదురుగడ కణుపు (బొడ్డు)కు మొనదేలిన భాగాన్ని కత్తితో చెక్కడం (రా. 4).

బొడ్డుతుంగ: ఉ. బొడ్డు –; 1. పర్యా. లావుతుంగ. వెన్ను లావుగా ఉండే తుంగ; నాసిరకం (కో. 8); 2. పూత పూసిన ఒకరకం తుంగ; పెళుసుగానూ ముదురుగానూ ఉంటుంది; చాపల అల్లకానికి పనికి రాదు (కో. 3).

బొడ్డు పేడు: పర్యా. చూ. బెండుపేడు (1). వెదురు గడలో బోలుగా ఉన్న భాగంనుంచి గాని వెదురు బద్ద పల్లపుభాగం నుంచి గాని చీరినపేడు; అంత సన్నగా గాని గట్టిగా గాని ఉండదు (కో. 5).

బొడ్డు మొలెం: పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం (= కాడకు తొడిగింది) జారిపోకుండా కాడ చివర ఉబ్బెత్తుగా ఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు చూ. చిత్రం 31. త. 3 (తె. 31).

బొడ్డుసోలు నొప్పి: బొడ్డులోపల వచ్చే ఒకరకం

నొప్పి (కో. 5).

బొడ్డె: 1 పర్యా. గంటి (2), గనుపు (2), గనుపు బొద్దు, గుంపు (3), పొట్టమీద గనుపు, బుడుపు (2), బొడుసు (3), బొద్దు (2), బొద్దుగనుపు (2), బొండుగనుపు, బొద్దు (3), ముడి (2), లోపలి గనుపు. వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కనుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (తె. 13, 16, 17, 18, 20- 22); 2. చూ. బొద్దు (1) (తె. 20); 3. రూ. బొట్టె[1], బొద్దు (3); పర్యా. ఊచతల, గడ్డ (4), గడ్డం (4), గన (3), గనుపు (7), గుడుప, బుడుపు (4), బూట, బొద్దుమొలెం, మిట్ట(2), ముడి(4), మెట్టె(3), మొట్టె(1). విసనగర్రగొట్టం (కాడకు తొడిగింది) జారిపోకుండా కాడ చివర ఉబ్బెత్తుగా ఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3 (తె. 15, 17, 19, 21, 26, 26, 28).

బొణుగు: ఉ. బొనుగు; పర్యా. చూ. అడిపోగు (1). గంప, బుట్ట, సిబ్బి మొ॥ వాటి అల్లకంలో బొద్దడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటిపేడు (కొన్నిచోట్ల లావుది); పసరకింది పేడును రెండు భాగాలుగా నిలువునా చీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3 (కో. 15).

బొండంకాయ: పర్యా. చూ. కొబ్బరిబొండం. నీళ్ళు ఎక్కువగానూ కొబ్బరి పలచగానూ ఉండే పెద్ద కొబ్బరికాయ; లేతది; వేసంగుల్లో బొండంనీళ్ళు తాగుతారు (కో. 20).

బొండం: పర్యా. చూ. కొబ్బరిబొండం. నీళ్ళు ఎక్కువగానూ కొబ్బరి పలచగానూ ఉండే పెద్ద కొబ్బరికాయ; లేతది; వేసంగుల్లో బొండంనీళ్ళు తాగుతారు (కో. 19, 21).

బొండు గనుపు: పర్యా. చూ. బొడ్డె (1). వెదురుబద్దకు పల్లపు భాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (కో. 17).

బొత్త: పర్యా. చూ. దోనెం వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకోకణుపువరకు కొలతమాదిరిగా పల్లంగా ఉంచే భాగం(తె. 24).

బొత్తు: పర్యా. చూ. పొట్టు (3). కొబ్బరిపీచు నలిపినప్పుడు గాని దులిపినప్పుడుగాని రాలే (ఎర్రటి) పొడి (కో. 23, 29).

బొద్దీనె: (< బొద్దు + ఈనె); పర్యా. చూ. పెండెవార, బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర) పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చి తీస్తారు. చూ. చిత్రం 47 క. 6 (కో. 1, 3-5, 10; రా. 4).

బొద్దు: 1. పర్యా. చూ. కట్ట (1). ఒకచోటికి చేర్చి కట్టిన వెదురుగడలు లేదా వెదురుబద్దలు; ఒకమనిషి మోయడానికి వీలయినవి (కో. 10, 14, 28); 2. పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపు వరకు కొలతమాదిరిగా పల్లంగా ఉండేభాగం (తె. 16; 17, 20); 3. పర్యా. చూ. బొడ్డె (1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు (తె. 24, 28); 4. పర్యా. చూ. పొట్టయేను వెదురుగడ చీరినప్పుడు లోపలి పల్లపుభాగంలో కనిపించే పలచటి ఉల్లిపొర కాయితంలాంటి పొర (తె. 14); 5. పర్యా. చూ. పీచు. వెదురుబద్ద, పేడు చీల్చేటప్పుడూ బద్ద, పేడు, కర్ర మొ॥ గీకేటప్పుడూ వచ్చే సన్నటి దారాల్లాంటి పోచలు; వీటిని మరగబెట్టి ఆవిరి పడితే జలుబు తగ్గుతుందట; మెత్తగా ఉండే పీచును కోళ్ళను పొదగెయ్యడానికి ఉపయోగిస్తారు (తె. 18); 6. పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప, మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగం నుంచి చీల్చి తీస్తారు చూ. చిత్రం 47 క. 6 (కో. 6, 7, 10); 7. పర్యా. చూ. కట్టు (1). గంప, తట్ట, గుమ్మి మొ॥ వాటి అల్లకంలో గట్టిదనం కోసం వెలుపలినుంచి మూతిదగ్గరగా మధ్య భాగంలోనూ అడుగు అంచుదగ్గరా కర్ర (= తీగలాటిది)లో గట్టిగానూ ఉబ్బెత్తుగానూ అల్లినభాగం; రెండు వేళ్ళ వెడల్పు మొదలు జెత్తెడు వెడల్పు వరకు ఉంటుంది చూ. చిత్రం 47 త. 1 (కో. 2, 5-15, 17, 26, 27, 30, 31; తె. 7; రా. 3-6, 10). 8. పర్యా. చూ. కట్టు (10). ఈతబద్దలతో అల్లే గంప, గుమ్మి మొ॥ వాటికి అంచు చుట్టూ గాని మధ్యన గాని అడుగున గాని ఉబ్బెత్తుగా అల్లినభాగం; వేలెడు

రెండువేళ్ళ మందం ఉంటుంది (కో. 3; రా. 8); 9. పేముగంప చుట్టూ ఎత్తుగా అల్లే భాగానికి మధ్యలో వేలెడు వెడల్పున ఉబ్బెత్తుగా చుట్టినది. చూ. చిత్రం 140.1 (కో. 3).

బొద్దుకర్ర: పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది, బద్దకు పల్లంగా ఉండే భాగం నుంచి చీల్చి తీస్తారు చూ. చిత్రం 47 క. 6 (కో. 2, 8; రా. 10).

బొద్దుగర్ర: ఉ. —కర్ర; పర్యా. చూ. బెండుకర్ర(1). వెదురుబద్ద పల్లపుభాగం నుంచి తీసిన కర్ర (చూ); గంపలు మొ॥ అల్లడానికి కట్టు (బొద్దు) చుట్టడానికీ ఉపయోగం (తె. 16, 17, 20).

బొద్దు తీగ: ఉ. —తీగె; పర్యా. చూ. లావీనె (1). మామూలు కర్ర (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండే కర్ర; గంప మొ॥వాటి అల్లకం పనిలో ఎత్తుగా వచ్చే భాగం అల్లడానికి ఉపయోగపడుతుంది చూ. చిత్రం 47 క. 2 (కో. 4).

బొద్దుదిండు: ఉ. బొద్దిండు; పర్యా. చూ. పెండెవార, బుట్ట, తట్ట, గంప మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగం నుంచి చీల్చి తీస్తారు చూ. చిత్రం 47 క. 6 (రా. 6).

బొద్దుపేడు: 1. పర్యా. చూ. బెండుపేడు (1). వెదురుగడలో బోలుగా ఉన్న భాగం నుంచి గాని వెదురుబద్ద పల్లపుభాగం నుంచి గాని చీరినపేడు; అంత సన్నగా గాని గట్టిగా గాని ఉండదు (తె. 16_17); 2. పర్యా. చూ. పెండెవార, బుట్ట, తట్ట, గంప॥ మొ॥ వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి నుంచి చీల్చి తీస్తారు చూ. చిత్రం 47 క. 6, (కో. 6, 7, 12, 14).

బొద్దుబట్టు: (క్రి.) వెదురుబద్ద పల్లపుభాగం వైపు కత్తితో సన్నగా గీకడం. (తె. 20).

బొద్దుసువ్వ: పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥ వాటి అల్లకంపనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగం నుంచి చీల్చి తీస్తారు (చూ. చిత్రం 47క. 6, (కో. 8, 11).

బొందు: కొండముచ్చులు తల కొరికేయడం వల్ల వెదురుగడలో (చూ. కొండెంగమొట్టు) సన్నటి తాడులా ఏర్పడ్డ పదార్థం. (తె. 22, 23, 27, 31).

బొందుకర్ర: పర్యా. చూ. కపురుబొంగు (1). తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురుగడ; తెల్లగా గాని నల్లగా గాని అవుతుంది; సరయిన జిగి ఉండక పెళపెళ్ళాడి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; జేలి తలకు మాత్రం పనికొస్తుంది. (కో. 3).

బొబ్బరు: పేముకర్ర మీద ఉండే పలచటి పొర; కాయితంలా ఉంటుంది. (కో. 3).

బొబ్బురు: పర్యా. బొడుపు (2) ఈతకమ్మకున్న ఆకు తెంపిన తరవాత ఆకు తెగినచోట పడే గుర్తు. (తె. 8).

బొబ్బొంపు: (< బొబ్బ + వంపు) అడుగు గుండ్రంగాను, మూతి విశాలంగాను కొబ్బరి చిప్పకున్నట్లుగా ఉన్న వంపు. (కో. 17).

బొంబాయి-ఎస్ పాటు: (< ఇం. Bombay-S-Pattern) ఒకరకం పేముకుర్చీ. (కో. 11).

బొంబాయికట్: (< Bombay cut) పర్యా. బొంబే కటింగ్. ఒకరకం పేముకుర్చీ. (కో. 11).

బొంబు: పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందం నుంచి దూలమంత మందం వరకు లావూ ఉంటుంది; మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చని గడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. (రా. 1).

బొమ్మ: పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉండే హద్దు; గడచుట్టు ఉబ్బెత్తుగా ఉంటుంది; అంత మేరకు లోపలి ఖాళీని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మ వేస్తుంది చూ. చిత్రం 4.3. (కో. 31).

బొమ్మచేట: చూ. బొమ్మిచేట. (కో. 16).

బొమ్మిచేట: రూ. బొమ్మచేట; పర్యా. చూ. మొంటె. ఒక రకం చిన్నచేట; చిన్నవాళ్ళు అల్లకం పని నేర్చుకోడానికి ఇలాంటివి అల్లుతారు; కొన్నిచోట్ల పేడుకు రంగులు వేసి అల్లుతారు; దీంతో పిల్లలు ఆడుకొంటారు. (కో. 16, 19).

బొరికెం బొంగు: పర్యా. చూ. గుట్ట(ల)బొంగు. కొండలమీదా గుట్టలమీదా గట్లమీదా పెరిగే వెదురు కఱ్ఱ; పెళుసుగా ఉంటుంది; పేడు తీయడం కష్టం; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 22).

బొరిగె పర్యా. చూ గడ్డం (1) మేదరికత్తి కాడ వేపు నుంచి పదును మొదలయ్యే చోట కొంచెం మొనదేలిన భాగం. చూ. చిత్రం 12 జ.6. (తె. 22).

బొరుసు చాప: ఉ. బొర్సుసాప; గొగ్గులు గొగ్గులు (బొరుసు)గా ఉండే తుంగతో నేసినచాప. (కో. 30).

బొరుసు తుంగ: ఉ. బొర్సు—; సాపుగా లేకుండా గరుకు (బొరుసు)గా ఉండే ఒక రకమైన తుంగ. (కో. 30).

బొఱ్ఱ: 1. పర్యా. చూ. బొక్క (1). చేట తయారీలో అంచుకట్టు కట్టేటప్పుడు కట్టుముందు బిగించడం కోసం అంచుదగ్గర అమ్ముతో పొడిచి చేసిన చిల్లి (తె. 4); 2. పర్యా. చూ. జెలి (2). అల్లకంలో విసనగఱ్ఱ పేళ్ళమధ్య సందు (తె. 1); 3. చూ. బుఱ్ఱ (2). (రా. 11).

బొఱ్ఱ గొట్టు: (క్రి.) పర్యా. తొలిగొట్టు. నిచ్చెన నిలువు గడకు మెట్లు దిగగొట్టడానికి మెట్టు పట్టేటంతమేర (నలుపలకలుగా) ఉలితో చిల్లి (తొలి) చేయడం. (రా. 11).

బొఱ్ఱులు బల్ల: పర్యా. చూ. ఎగదండు. చాపనేత మగ్గం మొదటిభాగంలో (నేతవాడు కూర్చొనేవైపు) అమర్చిన లావాటిపలక; పోగులను లాగిపట్టి ఉంచుతుంది; చాప నేస్తూ దీనికి చుట్టుకుంటూపోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులను దూర్చి దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు దారం కొలుకులుగాని పొడుగాటి ఇనపమువ్వగాని తొడుగుతారు. చూ. చిత్రం 120 చ. 3. (కో. 21).

బొఱ్ఱె: చూ. బుఱ్ఱ (2). (తె. 6).

బొఱ్ఱెకట్టె: పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (తె. 3).

బొఱ్ఱె బొంగు: పర్యా. బోలు బొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; ఉపయోగపడుతుంది. (రా. 11).

బొలుగు: చూ. బోలు (1). (తె. 15).

బోజెర: పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడచుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (కో. 6).

బోటు: పర్యా. చూ. పుట్టె. చేపలు పట్టడానికి చెరువులోకి వెళ్ళే చిన్న పడవ; దీన్ని దొడ్డి (ఫ్రేమ్) వెదురుతో తయారుచేసి బయటినుంచి చుట్టూ తోలు వేసి కుడతారు. (రా. 8).

బోటు వేయు: (క్రి.) పర్యా. చూ. మట్టగించు (1). వెదురుగడ మొదలును సమంగా నరకడం; బద్ద చీరేటప్పుడు కత్తి మోపడానికి వీలుగా కింద బెత్తెడు విడిచి నరుకుతారు. (రా. 1).

బోడంచు గంప: అంచుదగ్గర కట్టు (=పెండెగాని బొద్దుగాని) లేని గంప. (కో. 31).

బోడిరామాపాటన్: (<ఇం. —Pattern) చేతులు లేని ఒకరకం పేముకుర్చీ. (కో. 19).

బోడుగడ: మెత్తనిభూమి. (కో. 6).

బోండా: పెద్దపెద్ద బద్దలతో అల్లిన ఒక రకం గంప. (కో. 19).

బోదు: 1. పర్యా. చూ. నడికఱ్ఱ. ఒకనెల నుంచి మూడునెలల వరకు వయస్సుగల లేత వెదురుకఱ్ఱ; దీన్ని చీరి చేట, జల్లెడ మొ॥వాటికి కట్లు కట్టడానికి అవసరమయ్యే 'తీగ' (చూ.)లు తియ్యడానికి పనికొస్తుంది (కో. 14, 16); 2. చూ. మోదు (1). (తె. 8, 23, 28).

బోరగాల కఱ్ఱ: ఉ. బోరగాల్ల—; పర్యా. తోకబొంగు, బుఱ్ఱ కఱ్ఱ. మొదలు లావుగానూ చివర సన్నగానూ ఉండే వెదురుకఱ్ఱ; మేదరిపనికి ఉపయోగపడదు. (కో. 26, 28).

బోరగాలు: పర్యా. చూ. కురచ గనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జానెడు బెత్తెడుకన్న తక్కువ ఉంటుంది. (కో. 19).

బోరుకఱ్ఱ: పర్యా. చూ. పలచని బొంగు. బోలు ఎక్కువగానూ కండ తక్కువగానూ ఉండే వెదురుగడ; తేలికగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడే పేళ్ళు దీన్నుంచి తక్కువగా వస్తాయి. (కో. 27).

బోలు: 1. రూ. బొలుగు; పర్యా. ఊలు, గుల్ల (1), డొల్లు, తొఱ్ఱ (1), తొల, పొక్క (1), బుఱ్ఱ (2),

బొంగు (4), లొట్ట (1), సందు (1). వెదురుగడ లోపల ఒక కణుపు నుంచి మరొక కణుపు వరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4.1. (కో. 1-3, 5, 12, 15, 16; తె. 21-23, 26; రా. 3, 4); 2. పర్యా. చూ. వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగా ఉండే భాగం. (తె. 5).

**బోలుకంక:** పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (తె. 23).

**బోలుకర్ర:** పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 8-12, 17, 27).

**బోలుకాల:** ఉ. బోల్కాల; పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండు పాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగా ఉండే భాగం. (తె. 21).

**బోలుబొంగు:** ఉ. బోల్—; పర్యా. ఆడికట్టె, గుల్లబొంగు, గుల్లవెదురు, జాజుకర్ర, టొల్లుబొంగు, డోలుబొంగు (1), తొర్రకట్టె, తొర్రకర్ర, తొర్రబొంగు, తొర్రవెదురు, తొలబొంగు, బురకబొంగు, బుర్రబొంగు, బుర్రబొంబు, బొర్రెకట్టె, బొర్రెబొంగు, బోలుకంక, బోలుకర్ర, బోలువాసం, బోలువెదురు, మేదరిబొంగు, లొట్టబొంగు (2), కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదుదుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 2, 5, 8-10; తె. 5, 18, 18-22).

**బోలువాసం:** పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 8).

**బోలువెదురు:** ఉ. బోలెదురు; పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూ మధ్య లోపల గుల్లగా ఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 1, 11, రా. 3).

**బోలోటు:** (< ఇం. bolt) ఇనప బోల్టు (తె. 26).

**బ్రష్షు:** (< ఇం. brush) ఉ. బ్రస్సు; 1. ఇనప ఊచల కుంచె; గోదిని (=గుమ్మం ముందు వేసుకొనే పీచుపట్టా) సాపు చేసే ఒక కొయ్య చెక్కకు ఇనప ఊచలు బిగించి (మేకులు కొట్టి) ఉంటాయి; చూ. చిత్రం 128 (కో. 20); 2. కుంచె; పేము కుర్చీలకు దీంతో రంగువేస్తారు. (కో. 12).

**బ్లూలాంప్:** (< ఇం. blue lamp) నీలిసెగవచ్చే కిరసనాయిలు దీపం; పేముబెత్తం వంచవలసినచోట దీంతో సెగ చూపిస్తారు. (తె. 22).

**బ్లేడ్:** (ఇం. blade) పేముకర్ర ఆకులూ ముళ్ళూ నున్నగా గీకే రేకు. (కో. 8).

## మ

**మక్కిరిడోల్ల:** పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురు తడక. అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (రా. 3).

**మకెర్ర:** పర్యా. చూ. కంకిజల్ల (1). సజ్జకంకి, జొన్నకంకి మొ॥వాటిని పొలాలనుంచి మోసుకు రావడానికివాడే ఒకరకం పెద్దగంప; గజంఎత్తు మూరన్నర వెడల్పూ ఉంటుంది. (రా. 1).

**మగకట్టె:** పర్యా. చూ. చేతికర్ర (1). చేతికి ఊతగా పట్టుకునే వెదురుకర్ర; మూడు నాలుగు వేళ్ళలావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీనికొనా మొదలూ ఒకే లావుంటాయి. సాము చేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (తె. 18).

**మగ్గంకర్ర:** చాపలునేసే చేతిమగ్గం వెదురుగడ; నాలుగు మూరల పొడుగుండి బెత్తెడేసి ఎడంలో చుట్టూ గాట్లుంటాయి; రాళ్ళు కట్టినతాళ్ళు వేలాడదీస్తారు. (కో. 30).

**మగ్గంతాడు:** పర్యా. బిగింపుతాడు, బిగుతాడు, బొంగుతాడు. చాపనేసేమగ్గంలో పోగుల్ని లాగిపట్టి ఉంచే దిగదండుకు కట్టినతాడు; దీని రెండోకొస వెనక ఉండే గుంజకుకడతారు; దిగదండును వదులు చేయడానికిగాని బిగువుగాపట్టి ఉంచడానికిగాని పనికొస్తుంది. (కో. 3).

**మగ్గం:** 1. తుంగ; జమ్ము చాపలు నేయడానికి అమర్చిన (సుత్తిబిరి, అచ్చు, అనికర్ర, ఉట్టికర్ర, దిగదండు, లోబొంగు మొ॥) పరికరాల సముదాయం; బట్టలునేసే మగ్గంలా ఉంటుంది; కొన్నిచోట్ల నేలమీద పరిచినట్లుంటుంది; కొన్నిచోట్ల మంచంలా కోళ్ళమీద అమరి ఉంటుంది;

కొన్నిచోట్ల పందిరికి వేలాడదీసి ఉంటుంది; చూ. చిత్రాలు 120 క-ట. (కో. 3, 8, 21; రా. 2, 4, 10); 2. పర్యా. చూ. అచ్చు. (తుంగ) చాపనేసేటప్పుడు అడ్డానికివేసిన తుంగపోచను దగ్గరకు నెట్టడానికి చేత్తోఒత్తే కొయ్యపలక; దీర్ఘచతురస్రాకారంగా ఉంటుంది; దీనికి సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులు దూరుస్తారు; (తుంగ) పోచను పోగులమధ్యకు దూర్చిన తరవాత ఆపోచ అంతకు ముందున్న పోచలను అనుకొని ఉండేటట్లు ఈ పలకతో నెడతారు; కొన్నిచోట్ల ఇనపచువ్వల పలక వాడతారు చూ. చిత్రాలు 105 120 క. 5. (రా. 2).

మగ్గంపోయు: (క్రి.) పర్యా. చూ. పోగుబిగించు. (తుంగ) చాపమగ్గం ముందునేతగాడు కూర్చొనే వైపు ఉండే ముందరి బొంగు (చూ.) నుంచి మగ్గంచివరి వెనకబొంగు (చూ.) వరకు అడ్డంగా (గజంవెడల్పున) బెత్తెడు ఎడానికి ఒక నారపోగు చొ॥న పెట్టికట్టడం. (కో. 8).

మచ్చికి: ధాన్యం, అపరాలు మొ॥ పోసుకొనే ఒకరకం వెదురుగంప; చిన్నగా ఉంటుంది; నిలువులు పెట్టకుండా కేవలం పేడుతో చాప అల్లకంలో అల్లుతారు; కింద చతురస్రంగానూ మూతిదగ్గర గుండ్రంగానూ ఉంటుంది. (కో. 28).

మచ్చు: 1. పర్యా. చూ. చాటుతడక(1). ఇంట్లో గదులుగా విభజించడానికిగాని వరండాలో చాటుకోసంగాని అడ్డంగా కట్టే వెదురుపేళ్ళతడక; చూ. చిత్రం 36 చ. (రా. 3); 2. పర్యా. చూ. అచ్చు. తుంగచాపనేసేటప్పుడు అడ్డానికివేసిన తుంగపోచను దగ్గరకు నెట్టడానికి చేత్తో ఒత్తే కొయ్యపలక; దీర్ఘ చతురస్రాకారంగా ఉంటుంది; దీనికి సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులు దూరుస్తారు; తుంగపోచను పోగుల మధ్యకుదూర్చిన తరవాత ఆ పోచ అంతకు ముందున్న పోచలను అనుకొని ఉండేటట్లు ఈ పలకతో నెడతారు; కొన్నిచోట్ల ఇనపచువ్వల పలక వాడతారు. చూ. చిత్రాలు 105, 120 క. 5. (రా. 4).

మచ్చుకత్తి: పర్యా. కత్తి(2), పిడికత్తి. కట్టెపిడి ఉన్న మేదరికత్తి; చూ. చిత్రం 12 ట (రా. 3).

మచ్చుతడక: ఉ. —తడికె; పర్యా. చూ. చాటు తడక(1). ఇంట్లో గదులుగా విభజించడానికిగాని వరండాలో చాటుకోసం గాని అడ్డంగా కట్టేవెదురు పేళ్ళ తడక; చూ చిత్రం 36 చ. (కో. 4)

మంచంనులక: మంచానికి కల్లడంకోసం ఈత, గోగు మొ॥వాటి నారతో పేనిన సన్నటితాడు; గాజంగి నారతప్ప ఏనారతో అయినా పేంతారు. (కో. 5, 23, 25; తె. 9).

మంచం: 1. పర్యా. వెదురుమంచం. పడుకోడానికి వెదురుగడలతోనూ బద్దలతోనూ చేసిన మంచం; కొన్నిటికి తలాపుదిక్కున ఎత్తుగా ఉంటుంది; చూ. చిత్రం *108*. (తె. *2-6, 10, 12, 16, 17, 19*; *26, 31*; రా. 2, 5, 11); 2. చాపనేత మగ్గం మీద పందిరిలా వేసినది. (రా. 6).

మంచమల్లకం: మంచానికి నులక అల్లడం. (రా. 4).

మంచమీద్దితడక: మంచంమీద పరిచి అంచుపెంట బద్దలు కొట్టిన వెదురుచాప. (తె. 17).

మంచికర్ర: పర్యా. చూ. మేదరికర్ర(2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండమందంగా ఉంటుంది; పచ్చగా పొడుగ్గా ఉంటుంది; కణుపుల మధ్య ఎడంఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడుసాఫుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలుగుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (తె. 31).

మంచిగుంపుబద్ద: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాఫుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటి గనుపు) చీలిస్తే బద్ద సరిగా రాదు; ప్రతిగడకు రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 19, 28).

మంచిదబ్బ: చూ. మంచిబద్ద. (రా. 1, 3).

మంచిబద్ద: రూ. మంచిదబ్బ; పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాఫుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకు రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 20-31; తె. 29).

మంచిబొంగు: పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది;

పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపుల మధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాపుగావస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మనరికేసినప్పుడు చిన్నగుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 9).

మంచి బొంబు: (< ఇం. bamboo) పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపుల దగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (రా. 1).

మంచి వెదురు: పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కాడ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (తె. 4.)

మంచీత చెట్టు: (< మంచి + ఈత—) మేలైన ఈత చెట్టు; కమ్మలు పొడుగు; చాపల అల్లకానికి పనికొస్తుంది. (తె. 11).

మంచీత బరిగె: పర్యా. చూ. మెత్తటి బరిగె. నాణ్యమైన ఈత బరిగె; మెదువుగా ఉండి ఎటు వంచినా విరగదు; చీల్చేటప్పుడు విరగకుండా పేడు మంచిగా వస్తుంది. (తె. 20).

మంచెరకలి: ఉ. — ఎర్కలి; ఎరకలి వాళ్ళలో ఒక తెగ; ఈతకట్టెతో గంపలు, తట్టలు మొ॥ అల్లుతారు. (తె. 9, 11).

మటాయించు: (క్రి.) పరా. చూ. మట్టగించు (1). వెదురుగడ మొదలును సమంగా నరకడం; బద్ద చీరేటప్పుడు కత్తి మోపడానికి వీలుగా కింద బెత్తెడు విడిచి నరుకుతారు. (తె. 23, 24, 28).

మటగించు: క్రి. 1. పర్యా. తోటువేయు, మటాయించు, వెదురుగడ మొదలును సమంగా నరకడం; బద్ద చీరేటప్పుడు కత్తి మోపడానికి వీలుగా కింద బెత్తెడు విడిచి నరుకుతారు (కో. 2-5; తె. 8, 13, 15-17, 19, 21, 22, 25; రా. 2, 11); 2. పైకి లేపడం; పెల్లగించడం. (తె. 23).

మట్టం: 1. పర్యా. చూ. వెన్ను (4) మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పుగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి చూ. చిత్రం 12 ఢ. 3. (కో. 2); 2. పర్యా. చూ. అంచు (7). అకులా ఉండే అంబు (చూ.)కు పదునున్న భాగం; ఇలాటివి రెండుంటాయి; కొన్నిటికి పదునుండదు (కో. 2); 3. చిన్న. (రా. 1).

మట్టం పిచ్చ: పర్యా. చూ. కురచగనుపు. వెదురుగడ కణుపులమధ్య తక్కువ ఎడమున్న భాగం; జానెడుబెత్తెడు కన్న తక్కువ ఉంటుంది (రా. 1).

మట్టి జల్లెడ: పర్యా. కుమ్మరిజల్లెడ. కుమ్మరివాళ్ళు కుండలు చేయడానికి కావలసిన మెత్తటి మట్టిని జల్లించుకొనే జల్లెడ; కారం జల్లెడ మాదిరిగా పేళ్ళ మధ్య సన్నటి సందులు వచ్చేటట్లు అల్లుతారు. (తె. 7).

మట్టితట్ట: 1. రూ. మట్టి తట్ట; పర్యా. ఒడ్డె గంప, ఒడ్డెర తట్ట, మన్నుగంప, శీతం తట్ట. బావులనుంచి గాని బయట గాని ఒడ్డెవాళ్ళు మన్ను మోసే తట్ట, మూతి విశాలంగా పళ్ళెం మాదిరిగా ఉంటుంది (కో. 25; తె. 14, 25); 2. పర్యా చూ. ఉప్పర తట్ట. ఇళ్ళ కట్టుబడి పనిలో మన్నూ సిమెంటు మొ॥ మోయడానికి వాడే తట్ట; ఇనపరేకుతో ఆకారంలో ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి గిన్నె మాదిరిగా ఉంటుంది (కో. 16, 26; తె. 23).

మట్టు: 1. పర్యా. అడుగు (4). గంప, తట్ట, బుట్ట, కోళ్ళగూడు, గుమ్మి, సిబ్బి మొ॥ వాటి కిందిభాగం; వాటిలో పోసేవి నిలవడానికి ఆధారం, చూ. చిత్రాలు 47 ట. 1, 65 చ. 1. (కో. 17, 21, 22, 24-26, 28, 29); 2. పర్యా. చూ. తట్టు(2). జల్లెడఅడుగు అల్లకంలో పేడుకూ పేడుకూ మధ్య సన్నగా ఎడం వదులుతూ అల్లినభాగం; జల్లించవలసినవి దీంట్లో పోసుకొంటారు; దీనిచుట్టూ గుండ్రంగా సుమారు మూడు వేళ్ళఎత్తున గోడుగా అంచు ఉంటుంది, చూ. చిత్రం 30 క. 4. (కో. 21, 26,); 3. పర్యా. చూ. గద్దె (2). కాయాకోళ బుట్ట, చేతి బుట్ట, పూల

బుట్ట, కంత బుట్ట, మొ॥నవి నేలమీద నిలబడడానికి వీలుగా అల్లిన అడుగు భాగం; కొంచెం ఎత్తుగా సమతలంగా ఉంటుంది. చూ. చిత్రం 69 క-1 (కో. 26); 4. పర్యా. చూ. మూల (6). సిబ్బ గూడకు అడుగున ఏర్పడ్డ కోసు (దొప్పలాంటిది) చూ. చిత్రం 35 క. 1 (కో. 29); 5. పర్యా. చూ. అడుగు (5). ఈతగంప మొ॥ వాటి అడుగు భాగం (కో. 25); 6. తాటి ఈనెలతో చుట్టిన కుదురు; కుండలు మొ॥ దొర్లకుండా దీనిమీద పెడతారు (కో. 26); 7. తాటి ఈనెలతో అల్లిన పూలసజ్జ గద్దె (కో. 12); 8. ఉట్టి అడుగున చెక్రంలా అల్లిన తాడు; కావడి ఉట్టికి పెద్దగా ఉంటుంది, చూ. చిత్రం 130.1 (కో. 20, 30). 9. (క్రి). పర్యా. చూ. అడుగుదొక్కు. వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం మొదలు పెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చెక్రం అకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్ల కాని కనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కి పట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతో గాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు (కో. 23, 28); 10. పర్యా. చూ. మడుచు (1). వంచడం; గంప, తడక మొ॥ వాటి అల్లకంలో అంచులదగ్గర మిగిలిన నిలువులను అంచులోపలికి దోపడానికి వెనక్కి మడుస్తారు (కో. 21); 11. కోడిపొడుగు (కో. 21).

మట్టుదొక్కు: (క్రి). పర్యా. చూ. అడుగు దొక్కు. వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం పెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చెక్రం ఆకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకాని కనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు. (కో. 17, 19).

మట్టుపొంగ్రడ తీయు: పర్యా. చూ. చీరు (1). కత్తితోనూ చేత్తోనూ విడదియ్యడం; వెదురుగడనుంచి నిలువుగా 2 నుంచి 6 వరకు బద్దలుగాని బద్దనుంచి వారలు, పలుకులు, నరుములు, దాలెం (చూ.) గాని వార మొ॥ వాటినుంచి పేడుగాని కర్ర (ఈనె)గాని కత్తితో విడదీయడం (తె. 29).

మట్టు పొండ్ర: పర్యా. చూ. సన్న (౦) పేడు. వెడల్పు చాలా తక్కువగా ఉన్న వెదురుపేడు; కొన్నిచోట్ల చాలా పలచగా ఉన్నది (తె. 29).

మట్టు బద్ద: పర్యా. చూ. అడుగుపేడు. గంప మొ॥ అడుగున అమర్చిన మందంపేడు; ఎత్తు భాగం అల్లకం కోసం వంచిన తరవాత ఇదే నిలువవుతుంది; దీన్ని గంటిబద్ద (చూ.) నుంచి తీస్తారు చూ. చిత్రం 47 చ. 3 (తె. 29).

మట్టు బెట్టు: (క్రి.) పర్యా. చూ. అడుగుదొక్కు వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం మొదలు పెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చెక్రం ఆకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకాని కనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కి పట్టిన తరువాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు. (కో. 29).

మట్టుబొద్దు: పర్యా. గుద్దకింది కట్టు. గుల్ల, మూనె మొ॥వాటి అల్లకంలో అడుగుఅల్లి ఎత్తుభాగం అల్లడానికినిలువుల్ని పైకి వంచేముందు వేసిన కట్టు చూ. చిత్రం 50. 1. (కో. 29).

మట్టువేయు: (క్రి.) ఉ. మట్టేయు; పర్యా. చూ. అడుగుదొక్కు. వెదురుగంప, తడక మొ॥ (అడుగు) అల్లకం మొదలుపెట్టేటప్పుడు నిలువుల్ని (గంపకు చెక్రం అకారంలోనూ తడకకు నిలువుగానూ) అల్లకానికనువుగా పేర్చి కాలికింద (బొటనవేలితో) తొక్కిపట్టడం; తొక్కిపట్టిన తరవాత పేడుతోగాని కర్రతోగాని అల్లుకుంటూ వస్తారు, (కో. 17).

మట్రుగించు: (క్రి.) ఉ. మట్రగిచ్చు; పర్యా. చూ. చెలుగు. కత్తితో కొట్టడం; వెదురుగడ కణుపుల దగ్గరి కొమ్మలనుగాని మొనదేలి ఉన్న ముక్కలనుగాని బొడుపులనుగాని సమానంగా కత్తితో చెక్కుతారు. (తె. 26).

మడకబెట్టు: (క్రి.) ఉ. మడ్క—; వరసగా కూర్చడం; చీపురు కట్టడానికి కావలసినన్ని వెంపలి మొక్కల్ని వరసగా కూరుస్తారు. (తె. 21).

మడతచాప: ఉ. మడ్తసాప; ప్రయాణంలో తీసుకు వెళ్ళడానికి వీలుగా మడతలుగా కుట్టినచాప, (కో. 3).

మడతతొట్టెలు: ఉ. మడ్త—; రెండుపొరలుగా అల్లిన ఉయ్యాల. (తె. 7).

మడతపంకా: ఉ. మడ్తపంక; పర్యా. మడత విసనగర్ర, పట్టుకొనేవైపు వంగి విరక్కుండా బెత్తెడు వెడల్పున రెండు పొరలుగా అల్లిన విసనగర్ర; బొయ్యి విసరడానికి పనికొస్తుంది; కాడ ఉండదు. (రా. 11).

మడతవిసనగర్ర: ఉ. మడ్తయిసనగర్ర; పర్యా. మడతపంకా, పట్టుకొనేవైపు వంగి విరక్కుండా

బెత్తెడు వెడల్పున రెండు పొరలుగా అల్లిన విసన గర్ర; పొయ్యి విసరడానికి పనికొస్తుంది; కాడ ఉండదు. (తె. 8).

మడబొంగు: 1. పర్యా. చూ. లొద్ది(ల)బొంగు. లోయలో పెరిగిన వెదురుగడ; మెత్తగా బోలుగా ఉంటుంది; కణుపులు దూరదూరంగా ఉంటాయి; మేదరిపనికి బాగా ఉపయోగం (తె. 22, 23); 2. వంకరగా పెరిగిన వెదురుకర్ర; గాలివల్ల వంకర పెరుగుతుంది; సమతల ప్రదేశంలో పెరుగుతుంది. (తె. 6).

మడం: ఉ. మెడెం; 1. రూ. మడమ, మడిమె(1); పర్యా. చూ. వెన్ను(4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 ద. 3. (కో. 5, 21. 25, 29; తె. 30); 2. రూ. మడిమె(2); పర్యా. చూ. మూపురం. మేదరికత్తికి వెన్ను (చూ.) పదునంచువైపు వంపుదిరిగిన భాగం. చూ. చిత్రం 12 జ. 4. (కో. 17); 3. పర్యా. చూ. కాడ(1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కడ్డీలాంటి భాగం; కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది చూ. చిత్రం 16 చ. 4. (కో. 25).

మడమ: ఉ. మడఁవు; చూ. మడం(1). (కో.23, 26).

మడితాడు: చాపనేసేటప్పుడు కాళ్ళు పెట్టుకోడానికి వడికట్లకు వేలాడదీసిన తాడుకొలికి. (రా. 2).

మడిమె: ఉ. మడిమె, మడివెఁ; 1. చూ. మడం(1). (తె. 27, 28); 2. చూ. మడం(2); 3. పర్యా. కొన(2), తొడిమె(2), మొదలు(4). మేదరికత్తి కాడకొన. (తె. 6-9, 21-23); 4. పర్యా. తొడిమె(3). ఒకరకం అంబు (చూ.) ఉండే కాడకొన; మొనలేకుండా పలకగా ఉంటుంది. (తె. 18, 21-23).

మడుచు: ఉ. మరుసు; మొడుసు; 1. రూ. మడుపు(4); 2. పర్యా. మట్టు(10), మలుచు(3). వంచడం; గంప, తడక మొ॥వాటి అల్లకంలో అంచులదగ్గర మిగిలిన నిలువులను అంచులోపలికి దోపడానికి వెనక్కి మడుస్తారు. (కో. 1-5, 22, 23, 25-27, 30; రా. 1, 2, 4, 11); 2. పర్యా. చూ. మలుచు(2). అల్లకం పూర్తయిన తరవాత (గంప మొ॥వాటికి) మిగిలిన నిలువులను లోపలివైపువంచి అంచులోపలికి దోపడం. (కో. 25; తె. 16).

మడుపు: ఉ. మడ్పు; 1. పర్యా. కుప్పె(2), దోపు(1), మలుపు(2), వంపు(3). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ వస్తువుల అల్లకం పూర్తయిన తరవాత మిగిలిన నిలువుల చివర్లను వెనక్కితిప్పి అంచు లోపలికి దోపినప్పుడు వచ్చిన వంపు. చూ. చిత్రం 47 క. 1. (కో. 1, 2, 6, 28; రా. 3-5); 2. తడక అల్లకంలో ఒకచివరి వరకూ అల్లుకొచ్చి చివరకు అల్లడానికి మడిచినపేడు. (కో. 13); 3. చేట మొ॥వాటి అల్లకంలో పేడు ఒకవైపునుంచి మరోవైపుగాని కిందికీ మీదికీగాని తిప్పడం. (కో. 25, 28, 31); 4. చూ. మడుచు(1). (కో. 7, 24; రా. 6); 5. సిబ్బి, బుట్ట మొ॥వాటి అల్లకంలో పైన మిగిలిన నిలువులను లోపలికిగాని బయటికిగాని ముడివేయడం. (కో. 11)

మడుపుదండి: పర్యా. మూసినదండి. వాటిచాపలో అల్లుకుంటూ మలిపిన రెండో అడ్డంచు. (కో. 26).

మడుం: (బహు. మళ్ళు); 1. ఒకకొలత; మణుగు. (తె. 21, 22); 2. పర్యా. తూము(5). ఒక క్వింటాల్ ధాన్యంకొలత; పాత్రలలో కొలుస్తారు. (తె. 22).

మడ్డి: ఒకతెగ; కూలిపని చేసుకోడం, చింతకాయలు కొట్టుకొచ్చి అమ్మడం, సున్నంకాల్చడం మొ॥ పనులు చేస్తారు. (రా. 10).

మత్తిలి: పర్యా. గూటం(4), టక్కు. పచ్చికొబ్బరి డొక్కులు నలగ్గొట్టే కొయ్యసుత్తి. (కో. 29).

మంటితట్ట: ఉ. మంటిదట్ట; చూ. మట్టితట్ట(1). (తె. 11, 14).

మండ: పర్యా. చూ. చిల్ల(1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాలపొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెర కర్రగానూ గాలంబరుగుగానూ వాడతారు; కొమ్మనరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది. (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరవునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (తె. 13).

మండె: ఉ. మండీ; 1. పర్యా. అడ్డ (1), కుప్ప(1), గుట్ట, దిబ్బ, నెట్టు (1), బడ్డీ, వెదురుగుట్ట. వెదురుగడల పోగు; మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్నిచోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని ప్రభుత్వం వారి వెదురు డిపోలోగాని అడితిల్లోగాని

వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తం లేదు (కో. 5, 6, 8, 11); తె. 6, 13, 15, 17-24, 26, 28; రా. 2, 4, 6, 7, 9-11); 2. పర్యా. కుప్ప (2). ఈతచువ్వ (బరిగె)లనుగాని పేర్చిన గుట్ట; కొన్నిచోట్ల చిందరవందరగా పోగు పెడతారు (తె. 7, 9, 19, 20; రా. 8).

మద్దెమూల: పర్యా. పక్కమూల. చేపలబుర్రి, చేపల బుట్ట మొ॥ వాటికి మధ్యభాగాన బయటినుంచి కని పించే మూల; రెండుంటాయి; ఈ రకం బుట్టకు కిందకూడా మూలలుంటాయి. (కో. 28).

మధ్యకట్టు: పర్యా. చూ. నడింకట్టు. బుట్ట, ఈత చువ్వలతో అల్లిన గంప మొ॥ వాటి మధ్యభాగంలో బయటినుంచి నిలువుభాగంలో వేసే కట్టు. చూ. చిత్రం 48.1 (కో. 25).

మధ్యగన: ఉ. మద్దె-; వెదురుగడ మూడు ముక్క లుగా నరికితే వచ్చే మధ్యభాగం; మూడు నాలుగు గజాలు పొడుగుంటుంది; మేదరిపనికి ఉపయోగపడు తుంది (కో. 27).

మధ్యపెండె: పర్యా. చూ. నడిమికట్టు. గంప, మానె, గుమ్మి మొ॥ వాటి ఎత్తుభాగానికి మధ్యలో బయటి చుట్టూ వేలెడు మందానగాని రెండువేళ్ళ మందాన గాని గట్టిగా అల్లినభాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50.3 (కో. 27).

మధ్యరకం బొంగు: పర్యా. చూ. సెకెండ్‌క్లాస్ బొంగు. సుమారు 8 సెం॥మీ॥ నుంచి 12 సెం॥ మీ॥ వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గర దగ్గరగానూ ఉండేది (తె. 18).

మధ్యాకు: (మధ్య+ఆకు). ఈతమట్ట (మండ) మధ్య భాగంనుంచి తీసిన ఈతాకు (కో. 25).

మన: చూ. మొన (7). (రా. 9).

మనుగు: (క్రి.) కత్తిమొన మొ॥ మొక్కపోవడం. (కో. 10).

మంతు: 1. రూ. మెంతు పర్యా. కట్టనిచేట, గోటిన చేట, తట్ట (6), ఒకరకం చేట; కట్టు (బద్ద), కర్ర (కడ్డీలాంటి సన్నటి వెదురుబద్ద) వేసి కట్లు కట్టనిది; మూలలు మలిపి అంచు బట్టకుండా వదిలేసినదాన్ని ఇలా అంటారు (కో. 5, 10-13, 15-18; రా. 3, 5, 10). 2. పర్యా. చూ. అడుగు (1). చేట సమతలభాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపకముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట (తె. 31).

మందగొల్లలు: యాదవులదగ్గర మాత్రమే అడుక్కొనే ఒక తెగ. (తె. 21).

మందంకర్ర: పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏ మాత్రం బోలు లేకుండా పూర్తిగా కండపట్టి ఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలు గంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్టు, గుతపకర్ర, గైకట్టె; మంచంపట్టె మొ॥ వాటికి పనికొస్తుంది (కో. 16).

మందంకేను: (ఇం. —cane) పర్యా. చూ. లావుపేము. లావుగా ఉండే పేముకట్టె; అరంగుళం నుంచి మూడంగుళాల వరకు లావుంటుంది; మంచాలూ కుర్చీలూ మొ॥ తయారీకి పనికొస్తుంది. (తె. 22).

మందమాకు: (మందం+ఆకు) దళసరిగా ఉండే ఈతాకు (రా. 9).

మందంపేడు: పర్యా. దప్పాకు, దబ్బంపేడు (1), దళసరిపేడు, దొడ్డీనేం, పలుకు (7). పలుకుపేడు, బదుగుపేడు, బేరె (2) ముద్దిపేడు, మొద్దుపేడు, లావాకు, లావుపేడు. గోరుమందంకన్న ఎక్కువ మందంగానూ కొంచెంవెడల్పుగానూ ఉండే వెదురు పేడు బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (రా. 2, 7, 11).

మందవాసికట్టె: పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏ మాత్రం బోలు లేకుండా పూర్తిగా కండ పట్టి ఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది; అల్లకానికి పనికి రాదు; నిచ్చెనమెట్టు, గుతపకర్ర, గైకట్టె, మంచం పట్టె మొ॥ వాటికి పనికొస్తుంది (రా. 4).

మందుగొట్టం: పర్యా. గొట్టం (3), వెదురుగొట్టం (1. పశువులకు మందుపోసే వెదురుగొట్టం; మొత్తం బోలుగా ఉండి ఒక చివర మూసి ఉంటుంది; రెండో చివర పశువునోట్లో దూర్చడానికి వీలుగా ఏటవాలుగా చెక్కి ఉంటుంది. చూ. చిత్రం 113. (తె. 10).

మన్నుగంప: పర్యా. చూ. మట్టితట్ట(1). బావుల నుంచిగాని బయటగాని మన్ను మోసేతట్ట; మూతి విశాలంగా పళ్ళెం మాదిరిగా ఉంటుంది. (తె. 14; రా. 8).

మన్నెంచేట: ఉ. —కోట; మన్యం (అడవి) ప్రాంతంవాళ్ళు అల్లినచేట; ఎత్తుఎక్కువ ఉంటుంది. (కో. 23).

మమ్మకర్ర: వెదురుగడ నరికినతరవాత నరుకు కింది కణుపునుంచి పుట్టినకర్ర; దుంపలోంచి పుట్టినే

దానిలా ఎక్కువ లావుగాగాని పొడుగ్గాగాని పెరగదు. (కో. 27).

మయంగా: ఉ. మయింగ; పర్యా. నడిదాల. మధ్యన. (కో. 22).

మయంపెండె: ఉ. మయింపెండి; పర్యా. చూ. నడిమికట్టు. గంప, మానె, గుమ్మి మొ॥వాటి ఎత్తు భాగానికి మధ్యలో బయటినుంచి చుట్టూ వేలెడు మందానగాని రెండువేళ్ళ మందానగాని గట్టిగా అల్లినభాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50. 3. (కో. 23)

మయ్యంబద్ధ: ఉ. మయిం—; పర్యా. చూ. బిర్రుదబ్బ. వెదురుతడక వంగిపోకుండా గట్టిదనంకోసం అడ్డంగాగాని నిలువుగాగాని వేసినబద్ద. (కో. 23).

మయానబద్ధ: పర్యా. చూ. గనగనబద్ద; రెండు కణుపుల మధ్యభాగం. (చూ. గన) నుంచి చీరిన బద్ద. (కో. 17).

మలలమ్మ: ఉ. మల్లలమ్మ; పార్వతీదేవి; మేదరి వాళ్ళ కులదేవత; మల(కొండ)ల్లో పుట్టడాన్నిబట్టి వచ్చినపేరు. (కో. 2; తె. 6, 7; రా. 4, 5, 8–11).

మలలమ్మపండుగ: ఉ. -పండగ, – పండ్గ; రూ. మల్లమ్మపండుగ; మేదరివాళ్ళ కులదేవత, మలలమ్మ (పార్వతీదేవి) పేర చేసుకొనే పండుగ. (తె. 1–5).

మలలు: కొండ(మల)లూ గుట్టలూ ఉన్న ప్రాంతం. (తె. 8.)

మలుచు: ఉ. మలుసు, మల్సు, 1. పర్యా. చూ. వంచు (1). గంప, తట్ట, గుల్ల, మానె॥ మొ॥ అల్లేటప్పుడు అడుగు (చూ.) అల్లకం పూర్తయిన తరవాత ఎత్తుభాగం అల్లడానికి నేలబారున ఉన్న నిలువుల్ని పైకి లేపడం. (తె. 15; 2. రూ. మలుపు (4). పర్యా. ఎదురెక్కించు, ఎెక్కు (3), దిగవేయు (2), అల్లకం పూర్తయిన తరవాత (గంప మొ॥ వాటికి) మిగిలిన నిలువులకు లోపలి వైపు వంచి అంచులోపలికి దోపడం. (తె. 9, 13, 14; రా. 8, 9); రూ. మలుపు (5); పర్యా. చూ. మడుచు (1), వంచడం; గంప, తడక మొ॥ వాటి అల్లకంలో అంచుల దగ్గర మిగిలిన నిలువులను అంచు లోపలికి దోపడానికి వెనక్కి మడుస్తారు. (కో. 8; తె. 6, 8, 13, 16), 31).

మలుపు: ఉ. మల్పు; 1. పర్యా. చూ. కుప్పె(1). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ అల్లగా మిగిలిన నిలువుకొన(లు); వీటిని వెనక్కిమలిపి అంచు లోపలికి దోపుతారు. (తె. 22); 2. పర్యా. చూ. మడుపు(1), గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ వస్తువుల అల్లకంపూర్తయిన తరవాత మిగిలిన నిలువుల చివర్లను వెనక్కితిప్పి అంచులోపలికి దోపినప్పుడు వచ్చినవంపు చూ. చిత్రం 47 క. 1. (తె. 6, 26–28, 30); 3. (క్రి.) పర్యా. మడుపు(3), వంచు(2). చేట మొ॥వాటి అల్లకంలో పేడు ఒకవైపునుంచి మరోవైపుగాని కిందికి మీదికి గాని తిప్పడం. (తె. 15, 21); 4. చూ. మలుచు(2). (తె. 14); 5. చూ. మలుచు(3). (తె. 6, 16, 18, 19, 24, 25); 6. (క్రి.) తిప్పడం; ఈతచాపతయారీకి పట్టె అల్లేటప్పుడు ఆకును కిందినుంచి మీదికి మీదినుంచి కిందికి తిప్పుతారు. (తె. 19).

మలుపుడుకట్టు: ఉ. మల్పుడు—; గంప మొ॥వాటికి నిలువును లోపలికి దోపినప్పుడు చుట్టూ ఏర్పడే అంచు (తె. 9).

మల్కాపురంకట్టె: మల్కాపురం అనే ప్రాంతం తెచ్చిన ఈతకట్టె. (తె. 13).

మల్లమ్మపండుగు: ఉ. – పండ్గ; చూ. మలలమ్మ పండుగ.

మల్లుగర్ర: పేముకుర్చీలో కాళ్ళకు బలంకోసం అడ్డంగా అమర్చినకర్ర; రెండు కాళ్ళనుగాని నాలుగు కాళ్ళనుగాని కలుపుతూ ఇలాటికర్రలు బిగిస్తారు. చూ. చిత్రం 138. 3 .(కో. 3, 12,19).

మళ్ళవేయు: ఉ. మర్రేయు. మళ్లేయు; చేట అల్లేటప్పుడు కొమ్ముభాగం పూర్తిగా అల్లిన తరవాత రెండోవైపు అల్లడానికి అల్లినదాన్ని తిరగవేయడం. (తె. 6, 21).

మసవ: పర్యా. చూ. కొండెంగ, కొండముచ్చు; వెదురుమొక్క లేతగా, తియ్యగా ఉన్నప్పుడు కొండముచ్చులు దానితల కొరుక్కు తింటాయి; "మసవకొరికిన బొంగు" అని వాడుక (రా. 8).

మసి: ఉ. మశి. 1. పర్యా. చూ. కంకముసి(2). వర్షానికి తడిసి ఎండిన ముదురు వెదురుగడమీద ఏర్పడే నల్లటిపొడి. (కో. 24; తె. 5, 15, 19; రా. 5); 2. పర్యా. చూ. బూడిద. లేతవెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (తె. 24, 25; రా. 6).

మాంజకట్టె: పర్యా. పర్యా. ఇటికల తయారీకోసం

తడిమన్ను మోసుకురావడానికి ఒకచెక్కకు రెండు వైపులా వెదురుబొంగులు బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం; మూంజ; ఇద్దరు మనుషులు చెరోవైపునా బొంగులుపట్టుకొని మోస్తారు. చూ. చిత్రం 114. (తె. 17).

మూడ: పర్యా. చూ. ముందరిముత్త. బండిజల్ల ముందరిభాగంలో రెండుపక్కలను కలుపుతూ వంపుదిరిగిన గూడు చూ. చిత్రం 32. 2. (తె. 7).

మూడు: 1. పర్యా. చూ. వెన్ను(4). మేదరికత్తికి మందంగా ఉన్నపైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 ద. 3. (కో. 5); 2. పర్యా. చూ మూపురం. మేదరికత్తి వెన్ను (చూ.) పదునంచు వైపు దిరిగినభాగం చూ. చిత్రం 12 జ. 4. (కో. 3, 8, 9, 11); 3. పర్యా. చూ. వెన్ను (3). చురకత్తి వీపు; ఒకవైపు పదునూ రెండోవైపు వీపూ ఉంటాయి. చూ. చిత్రం 16. చ. 4. (కో. 5).

మూనిక. ఉ. మూన్క; 1. రెండుశేర్ల ధాన్యంకొలిచే పాత్ర. (తె. 8); 2. ఐదుకిలోల ధాన్యంకొలత, (తె. 24); 3. ఎనిమిదికిలోల ధాన్యంకొలత.

మూనీనె: (మూని + ఈనె) పర్యా. మూనెవారి, మూనె (ఒకరకంగంప) అల్లకానికి వాడే పేడు. మామూలు పేడు వెడల్పులో సగముంటుంది. (కో. 29).

మాను: కొబ్బరిచెట్టు కాండం; వేళ్ళ పైభాగం (మొదలు) నుంచి మట్టకిందిగాకా ఉండేది; లావుగా ఉంటుంది. (కో. 25).

మూనె: ఉ. మూని; ధాన్యం పోసి పెట్టుకోడానికి మోసుకు వెళ్ళడానికీ వెదురుపేడుతో అల్లిన ఒక రకం గంప; ఆకారంలోనూ సైజులోనూ దీనిలో చాలా రకాలున్నాయి; కొన్ని స్తూపాకారంలో పైనా కిందా ఒకే మాదిరిగా ఉంటాయి; కొన్ని కిందివైపు కంటే మీదివైపు వెడల్పుగా ఉంటాయి; కొన్ని చోట్ల మామూలుగా గంపకన్న చిన్నగా ఉంటుంది; నిలువుల్ని పెట్టకుండా కేవలం పేడుతో చాప అల్లకంలో అల్లుతారు; కింద చతురస్రంగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది; చూ. చిత్రం 50. (కో. 27, 29, 30).

మూనెగుది: మూనెవార (చూ.)లు చీల్చడానికి వాడే పలచటి వెదురుబద్ద; మూనెకు ఎత్తుభాగంతో అల్లడానికి ఒక తెల్లఈనె ఒక పచ్చిఈనె చీల్చి ఒకకొన అంటుకొని ఉండేటట్లు ఉంచుతారు; అల్లేటప్పుడు విడదీసి ఒక పసరు ఈనె ఒక తెల్ల ఈనె వరసగా పెట్టి అల్లుతారు; ఇది ఒక అంగుళం వెడల్పు ఉంటుంది. (కో. 27).

మూనెడు గుల్ల: మూనెడు (3 కిలోల) ధాన్యం పట్టే వెదురుపేళ్ళ గుల్ల. (తె. 21).

మూనెవార: పర్యా. మూనీనె. మూనె (= ఒక రకం అల్లకానికి వాడే పేడు; మామూలు పేడు వెడల్పులో సగముంటుంది. (కో. 27, 30).

మూపగా: (క్రి. విశే). సమానంగా; హెచ్చు తగ్గులు లేకుండా. (తె. 22).

మూఫ బొంగు: పర్యా. చూ. మేదరికర్ర(2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం నల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది, మొదలు గుండ్రంగా సరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (తె. 10).

మామిడికాయ గుల్ల: ఉ. మాడికాయ—; మామిడి కాయలు పోసిపెట్టుకొనే గంప. (తె. 14).

మామిడికాయ బుట్ట: ఉ. మాడికాయ—; మామిడి కాయలు పార్సెల్ చేయడానికి వాడే బుట్ట; బకెట్ ఆకారంలో ఉంటుంది; మోటుపేడుతో పలచగా అల్లుతారు. (కో. 25, 26, 28; 29).

మామూలీనె: (< మామూలు + ఈనె) పర్యా. చూ. తెల్లపేడులు (1). వెదురుబద్ద చీరేటప్పుడు పచ్చగా నున్నగా ఉండే కింది భాగానికి కింది నుంచి తీసిన పేడు; పసరుపేడుకూ బెండుపేడుకూ మధ్యభాగం లోది; తెల్లగా ఉంటుంది. (కో. 23).

మామూలు విసనగర్ర: ఉ. మామూలిసనగర్ర; పర్యా. చూ. సాదా విసనగర్ర. పట్టుకొనే కాడకు గొట్టంగానీ లోపల పువ్వుల డిజైన్లుగానీ లేకుండా మామూలుగా అల్లిన విసనగర్ర. (కో. 15).

మూరుకట్టు: ఉ. మూర్కట్టు; పర్యా. చూ. నడిమి కట్టు. గంప,మూనె, గుమ్మి మొ॥వాటి ఎత్తుభాగానికి మధ్యలో బయటినుంచి చుట్టూ వేలెడుమందానగాని రెండువేళ్ళ మందానగాని గట్టిగా అల్లిన భాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది. చూ. చిత్రం 50.3. (కో. 24).

మూరుమనువు: ఉ. —మనువు; భర్తను వదిలేసినప్పుడు గాని, భర్త చనిపోయినప్పుడు గాని స్త్రీ

చేసుకొనే మరో పెళ్ళి; పుస్తె కట్టడం వంటి మామూలు పెళ్ళి తంతులన్నీ ఉండవు; ఒకే రాత్రి పూర్తవుతుంది. (కో. 2, 26).

మూల్: కొలత; పేము అల్లికానికి కావలసిన తీగలు మొ॥ ముందుగా కొలుచుకొంటారు. (కో. 3)

మూలమేదరి: తిరుపతికి అవతల ప్రాంతంలో ఉండే మేదర్ల తెగ; చేట మొ॥ వాటికి దుసేసు తీగతో కట్లు కట్టడం వీళ్ళకు అలవాటు. (రా. 8)

మావు: పర్యా. కొడమ. కాలవకడ్డంగా పెట్టి చేపలు పట్టే సాధనం; బాల్చి ఆకారంలో ఉంటుంది; దీన్ని ప్రవాహంలోగాని నిలవనీటిలోగాని పెడతారు; దీంట్లోకి పోయిన చేప తిరిగిబయటకు రాకుండా పుల్లలు అడ్డుకుంటాయి. చూ. చిత్రం 78 క. (కో. 9, 10; తె. 31).

మావుపుల్ల: పర్యా. చూ. కొడంపుల్ల. కొడమ తయారీలో కొడమచుట్టూ మూసే తడకా పిర్రతడకా తయారుచేయడానికి వాడే సన్నటి వెదురుపుల్ల; ఐస్‌ఫ్రూట్ పుల్లంత లావు ఉంటుంది. చూ. చిత్రం 78 క. 2. (తె. 31).

మాసిబొంగు: ఉ. మాసు-; పర్యా. చూ. ముల్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీనికణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (రా. 6, 8).

మాసు: పర్యా. చూ. బండిజల్ల(1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పైభాగమూ తెరిచి ఉంటాయి; చూ. చిత్రం 32. (తె. 21).

మాసుగొట్టు: పర్యా. చూ. కొండెంగ మొట్టు. ఒక రకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీని లోపల బొంగు ఏర్పడుతుంది: తల మొండిగా ఉంటుంది. (తె. 28).

మిచ్చెన: చూ. నిచ్చెన. (రా. 11).

మిట్ట: 1. చూ. మిట్టె; పర్యా. చూ. బద్ద(4) విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 28); 2. పర్యా. బొడ్డె(3). విసనగర్ర గొట్టం (=కాడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగా ఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (తె. 28).

మిట్టె: చూ. మిట్ట(1). (తె. 28).

మిడ్త. చూ. మెడ్డ. (తె. 28).

మిద్దెతడక: ఉ. తడికె; చవుడుమద్దెలు కప్పేటప్పుడు వాసాలమీద వేయడానికి అల్లినతడక; బద్దలతో అల్లుతారు. (కో. 8, 9).

మిద్దెలనిచ్చెన: మిద్దెలు ఎక్కడానికి వేసుకొనే నిచ్చెన. (రా. 8).

మిందండు: పర్యా. చూ. దిగదండు. చాపనేతమగ్గం చివర అమర్చిన వెదురుగడ; నిలువుపోగులను ఎగదండు (= నేతగాడు కూర్చునే వైపు ఉండేది) నుంచి చాపి దీనికి కడతారు; నేతపనివాడికి ఎదురుగా ఉంటుంది; పోగుల్ని లాగి ఉంచుతుంది. చూ. చిత్రం 120 చ. 3. (కో. 3).

మీదడుగు: ఉ. మీదడ్డు; కోళ్ళగూడు (జంపు) కుండే రెండు అడుగుల్లో (కిందఒకటి పైనఒకటి) పైది. (తె. 7).

మీదికట్టు: 1; పర్యా. చూ. మూతికట్టు(1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥వాటి అంచుచుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లినభాగం. చూ. చిత్రం 47 క. 5. (తె. 17, 26); 2. పర్యా. చూ. తలకట్టు(3). ఈత చువ్వలతో అల్లే గంప మొ॥వాటి అంచుచుట్టూ ఉబ్బెత్తుగా అల్లినభాగం. (తె. 20).

మీదిబద్ద: పర్యా. చూ. బిర్రుదబ్బ. వెదురుతడక వంగిపోకుండా గట్టిదనంకోసం అడ్డంగాగాని, నిలువుగాగాని వేసినబద్ద.

మీసాలకర్ర: మొదటి కణుపుచుట్టు మీసాల మాదిరిగా వేళ్ళుపారిన వెదురుగడ; వేళ్ళుపారిన కణుపుకిందికి గడ నరుకుతారు. చూ. చిత్రం 5. (కో. 24).

ముక్కాలు: పేముకుర్చీ వెనకకాలు. (కో. 12).

ముక్కట్టు: (< ముక్కు + కట్టు). చూ. మూతికట్టు

(2). (తె. 24).

ముక్కునాలకట్టెలు: పర్యా. చూ. ముక్కునాల కర్రలు. (తుంగ) చాపనేసే మగ్గం మధ్యభాగంలో గుడిసెమాదిరిగా అమర్చి నిలబెట్టిన మూడుకర్రలు; వీటిలో సమాంతరంగా నిలబడి ఉండే రెండు కర్రలకు అనికర్ర (= అని మార్చడానికి)ను వేలాడదీస్తారు; కొన్ని ప్రాంతాల్లో దీనికి అచ్చు (= తుంగపోచలను దగ్గరికి జరపడానికి పోగులు దూర్చిన చెక్క)ను వేలాడదీస్తారు. చూ. చిత్రం 120 క. 1. (రా. 4).

ముక్కునాలకర్రలు: చూ. ముంగనాల కర్రలు; పర్యా. గుడిసెకట్టెలు, ముక్కునాల కట్టెలు, వడి కట్టెలు. (తుంగ)చాప నేసే మగ్గం మధ్యభాగంలో గుడిసె మాదిరిగా అమర్చి నిలబెట్టిన మూడు కర్రలు; వీటిలో సమాంతరంగా నిలబడి ఉండే రెండుకర్రలకు అనికర్ర (=అని మార్చడానికి)ను వేలాడదీస్తారు; కొన్ని ప్రాంతాల్లో దీనికి అచ్చు (= తుంగపోచలను దగ్గరికి జరపడానికి పోగులు దూర్చిన చెక్క)ను వేలాడదీస్తారు. చూ. చిత్రం 120 క. 1. (కో. 8).

ముక్కు: 1. పర్యా. అంచు (3), కొన (4), కొన ముక్కు(1), కొస (3), కొసముక్కు (1), చిగురు (2), మూతి (1), మొన (1), మొనం. కత్తికి (మేదరికత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 12 జ. 3; 16 చ. 5. (కో. 4-6, 8-11, 13, 15, 16, 18, 21, 24; తె. 6-9, 18, 20-22, 24, 26, 28, 31; రా. 3, 4, 6); 2. పర్యా. అంచు (8), అమ్ము (2), అలుగు (3), కొనముక్కు (3), కొస (5), కొసముక్కు (2), చివర (6), చూపు, పిడిమొన, మొన (4). అంబు (చూ.) పడగ చివరికోసు. చూ. చిత్రం 15 క. 2 (తె. 17-22, 24); 3. పర్యా. కొసముక్కు (3), మొన(7). ఎరకలికత్తి (కొడవలి) పదునుభాగం కొన; కోసుగా ఉంటుంది. (కో. 25; తె. 9, 13, 20, 21); 4. పర్యా. చూ. కుప్పె (1). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ అల్లగా మిగిలిన నిలువు కొస(లు); వీటిని వెనక్కిమలిపి అంచులోపలికి దోపుతారు. (తె. 24).

ముగ్గుగుల్ల: ఉ. ముగ్గుల్ల; పర్యా. ముగ్గుబుట్ట. ముగ్గు పోసుకొనే చిన్నబుట్ట. (తె. 9, 11, 18, 25, 26).

ముగ్గుబుట్ట: ఉ. – బుట్టి; పర్యా. ముగ్గుగుల్ల. ముగ్గు పోసుకొనే చిన్నబుట్ట.

ముంగటిత్తనాలచేట: (< ముంగటి విత్తనాల–) పర్యా. చూ. దావుచేట. శవాన్ని తీసుకువెళ్ళే టప్పుడు చల్లే పేలాలూ, నవధాన్యాలూ, చిల్లర పైసలూ మొ॥ పోసుకొనే చేట; అల్లకంలో దీనికి అంచుకట్టరు. (కో. 23).

ముంగనాలకర్రలు: చూ. ముక్కునాల కర్రలు. (కో. 8).

ముంగోడు: పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందు భాగంలో రెండుమూలలను (కొసలను) కలుపుతూ అడ్డంగా వేసిన చిటికెన వేలెడులావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2 (రా. 2, 3).

ముచుకు: కొబ్బరికాయ పైభాగంలో ఉండే మూచిక చూ. చిత్రం. 126.3. (కో. 21).

ముచ్చు[1]: పర్యా. చూ. గంట గనుపు (1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేటప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1. (కో. 23).

ముచ్చు[2]: ఉ. ముచ్చు; పర్యా. చూ. కొండెంగ. కొండముచ్చు; వెదురుమొక్క లేతగా తియ్యగా ఉన్నప్పుడు కొండముచ్చులు దాని తల కొరుక్కు తింటాయి. (కో. 22, 23).

ముచ్చుగొట్టుకర్ర: పర్యా. చూ. కొండెంగ మొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొంద ఏర్పడు తుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 23).

ముచ్చుమోడుకర్ర: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 22).

ముచ్చెరికలి: ఎరుక చెప్పడం వృత్తిగాగల ఎరకలి వాళ్ళు; ఒక తెగ. (కో. 4.)

ముజ్జు: పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమి లోపల వేళ్ళతో సహా ఉన్న దుంప; వెదురుగింజ

భూమిలో పడిన తరవాత దుంప ఏర్పడుతుంది. ఇది కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్ని పిల్ల వేళ్లూ భూమిలోకి పాక తాయి. (కో. 27).

ముట్టి: 1. కత్తిపిడి. చూ. చిత్రం. 148.2 (తె. 22); 2. పర్యా. చూ. పిడి (9). చేత్తో పట్టుకొనే చీపురు పైభాగం; మామూలుగా గుండ్రంగా ఉంటుంది; కొన్నిరకాల చీపుళ్ళకు కొంచెం పలకగా ఉంటుంది. చూ. చిత్రం 143.1. (తె 21)

ముట్టు: పేముకుర్చీ కాళ్ళకూ సీటుకర్రకూ ఆధారంగా వంకరగా అమర్చిపెట్టిన కర్ర; ఒకరకాలుగా అమరుస్తారు. చూ. చిత్రం 138. 4. (కో. 10, 12, 19).

ముడి: 1. పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉండే హద్దు; గడచుట్టూ ఉబ్బెత్తుగా ఉంటుంది; అంతమేరకు లోపలిభాగాన్ని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మ వేస్తుంది. చూ. బొద్దె(1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు. (తె. 1, 16); 3. పర్యా. చూ. గంటిగనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలినకొమ్మ మొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి పెద్దగానూ కొన్నిటికి చిన్నగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9. 1. (కో. 8, 10, 14; రా. 4); 4. పర్యా. చూ. బొద్దె(3). విసనగర్ర గొట్టం (= కాడకు తొడిగింది) జారిపోకుండా కాడ చివర ఉబ్బెత్తుగా ఉండేభాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (కో. 9; తె. 16, 24; రా. 8); 5. పలుపుతాడు; పాయల్లో ఒకదానికి చివరవేసిన మెలిక; దీన్ని మరో పాయకుండే కొలికిలోకి దూరుస్తారు. చూ. చిత్రం 145.3. (రా. 5).

ముడికర్ర: పర్యా. చూ. పండుబొంగు(1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (తె. 31).

ముడిగంటు. పర్యా. చూ. గంటిగనుపు (1. వెదురు గడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువును బట్టి కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1. (తె 4; రా. 11).

ముడిగనుపు: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురు గడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు, కొమ్మఉరువును బట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది. చూ. చిత్రం 9.1. (కో. 14; రా. 8).

ముడిచువ్వ: ఉ. ముడ్చువ్వ; ముడి ఈతబరిగె; ఆకులు తియ్యకుండా, చీల్చకుండా ఉన్నది. చూ. చిత్రం 74 వ. 2 (తె. 7).

ముడిదిప్పు: (క్రి.) పర్యా. పురివేయు. తడక అల్లకంలో ఒకవైపునుంచి అల్లుకుంటూవచ్చిన బద్దను రెండోవైపు అల్లడంకోసం మెలిపెట్టడం. (రా. 9).

ముడిపీచు: ఉ. —పీసు; నలగ్గొట్టని కొబ్బరిపీచు. (కో. 20).

ముడిబద్ద: పర్యా. చూ. గంటిబద్ద (1). గంటిగనుపు గుర్తు (= వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలే కొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండు వస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అడవి ప్రాంతంవాళ్ళు దీన్ని పారేస్తారు. చూ. చిత్రం 9. (కో. 8, 9; తె. 27, 31).

ముడిబొంగు: పర్యా. చూ. గడుసుబొంగు. పెళుసైన వెదురుకర్ర; పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; గుట్టలు, కొండలు, గట్లమీద మొలుస్తుంది; తడక బద్దలకూ గుడిసెల కట్టుబడికీ పనికొస్తుంది. (రా. 8).

ముడిసాధనం: పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తర్వాత తెలుపు రంగులో ఉంటుంది. మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (తె. 31).

ముడుసు: ఉ. ముడ్సు; 1. పర్యా. మొఖం. వంక కర్ర (= వేళ్ళతోసహా పీకి సాపుచేసిన వెదురుకర్ర)

వంపు చివరిభాగం; వెదురుదుంపలోంచి పుట్టిన తల్లివేరు నరికేయగా మిగిలిన మొదలు (తె. 6); 2. కొబ్బరిపీచులో మొనదేలిన భాగం. చూ. చిత్రం 6. (కో. 20).

ముడుసుకట్టె: ఉ. ముడ్సు—; పర్యా. చూ. వంకకఱ్ఱ; పాముపడగ మాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకఱ్ఱ; సుమారు గజం పొడుగుంటుంది; పేళ్ళు చెలిగేసినచోట్ల మచ్చలుంటాయి; చేతికఱ్ఱగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (తె. 6).

ముడుసుబొంగు: ఉ. ముడ్సు—; పర్యా. చూ. చిప్పగనుపుకఱ్ఱ, వెదురుకొమ్మ నరికేసినప్పుడు కణుపు దగ్గర పడ్డ గుర్తు వెడల్పుగా ఉన్న వెదురుగడ; పెరిగినకొమ్మ లావుగా ఉన్నప్పుడుగాని కణుపు దగ్గర చుట్టూ రెండుమూడు కొమ్మలు పెరిగినప్పుడు గాని వాటిని నరికేస్తే వెడల్పుగా గుర్తుపడుతుంది; ఈ బొంగును చీల్చడం కష్టం; కణుపుదగ్గర స్టేడు విరిగిపోతూంటుంది (తె. 23).

ముడ్డాకు: (< ముడి + ఆకు) చాపల అల్లకానికి కోసిన ముడి ఈతాకు. (రా. 9).

ముడ్లుజెక్కు: (క్రి.) బొగ్గుతట్ట అల్లకంలో అంచు దగ్గర మిగిలిన నిలువుకొనలను లోపలివైపు వంచి ఎత్తుభాగం మధ్యనుంచి బయటికి లాగి మళ్ళీ వాటిని బొడ్డుగునుంచి లోపలికి దోపడం. (తె. 23).

ముతకగోడు: ఉ. ముతగ్గోడు; పర్యా. చూ. లావీనె(1) మామూలుకఱ్ఱ (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండే కఱ్ఱ; గంప మొ॥వాటి అల్లకం పనిలో ఎత్తుగా వచ్చే భాగం అల్లడానికి ఉపయోగ పడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (కో. 28).

ముతకతాడు: ముతక కొబ్బరిపీచుతో పేనిన తాడు. (కో. 21).

ముతకనులక: పర్యా. పలుం నులక. చేంతాళ్ళు పేనడానికి వాడే లావుపాటి నులకతాడు. (కో. 25).

ముతుకు: మందం; వెదురుబద్ద మందంగా ఉంటే ముతుకుబద్ద అంటారు. (కో. 28).

ముతుకుబద్ద: వెడల్పూ లావూ ఎక్కువగా ఉన్న వెదురు బద్ద; మందం బద్ద. (కో. 28).

ముత్తుంగుమ్మి: మూడు తూముల ధాన్యం పట్టే వెదురుపేళ్ళ గుమ్మి. (గాదె). (తె. 21)

ముత్తైదువచేట: పర్యా. చూ. మూసి వాయనంచేట. ముత్తయిదువ చనిపోయినప్పుడు ఆమె పేరుమీద మూసి వాయనమిచ్చేటప్పుడు పైన మరోచేట బోర్లి స్తారు. (కో. 5).

ముదరకఱ్ఱ: ఉ. —గఱ్ర; చూ. ముదురుకఱ్ర. (కో. 18–28).

ముదరసేద. ఆకులతో ఉన్న ముదురు వెదురురెమ్మ; దీన్ని ఆవులు తినవు. (కో. 22).

ముదిగట్టె: పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ల వరకు వయస్సుగల ముదురుగడ; ముదురాకుపచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది. (రా. 4).

ముదిగఱ్ర: పర్యా. చూ. ముదురుబొంగు (2). బాగా ముదిరిన వెదురుగడ; బండిజల్ల, గుమ్మి, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీల్చడం కష్టం (అందువల్ల ఇది చేట, గుల్ల, గంప మొ॥ వాటికి పనికిరాదు) ఎరుపు మొ॥ రంగుల్లో ఉంటుంది. (తె. 27).

ముదినార: ముదిరిపోయిన కలబందమట్ట నుంచి తీసిననార. (రా. 4).

ముదివెదురు: ఉ. ముదెదురు; పర్యా. చూ. ముదురు బొంగు(2). బాగా ముదిరిన వెదురుగడ; బండిజల్ల, గుమ్మి, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీల్చడం కష్టం (అందువల్ల ఇది చేట, గుల్ల, గంప మొ॥వాటికి పనికిరాదు) ఎరుపు మొ॥ రంగుల్లో ఉంటుంది (తె. 1, 29).

ముదుము: అంబు చివర బిళ్ళమాదిరిగా ఉన్న పదునైన భాగం; చూ. పడగ (తె. 9)

ముదురుకట్టె: ఉ. ముదురి—; పర్యా. చూ. ముదురు బొంగు (2). బాగా ముదిరిన వెదురుగడ; బండి జల్ల, గుమ్మి, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీల్చటం కష్టం (అందువల్ల ఇది చేట, గుల్ల, గంప మొ॥ వాటికి పనికిరాదు) ఎరుపు మొ॥ రంగుల్లో ఉంటుంది (రా. 6).

ముదురుకఱ్ర: రూ. ముదరకఱ్ర; పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలులా వుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥

అల్లడానికి పనికొస్తుంది (కో. 3, 29; రా. 5).

ముదురుగోలు: ఉ. —గోల్; పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలులా వుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥ అల్లడానికి పనికొస్తుంది (కో. 4).

ముదురుజుట్టు: (క్రి.) ? జమ్మును గుండ్రంగా చాపలా చుట్టడం (రా. 6).

ముదురుడొక్క: కొబ్బరికాయ బాగా ముదిరి దట్టంగా పీచుపట్టిన డొక్క (కో. 29).

ముదురుబొంగు: 1. పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలులా వుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥నవి అల్లడానికి పనికొస్తుంది (కో. 3; తె. 5, 6, 10, 16, 31); 2. పర్యా. పండుకర్ర (2), పండుబొంగు (2), ముది గర్ర, ముది వెదురు, ముదురు కట్టె. బాగా ముదిరిన వెదురుగడ; బందిజల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీల్చడం కష్టం (అందువల్ల ఇది చేట, గుల్ల, గంప మొ॥ వాటికి పనికిరాదు) ఎరుపు మొ॥ రంగుల్లో ఉంటుంది (కో. 2, 5; రా. 8).

ముదురురువ్వ: ఉ. ముద్రువ్వ; ముదిరిన ఈత చువ్వ (బరిగె( (కో. 25).

ముదురువెదురు: ఉ. ముదురెదురు; పర్యా. చూ. పండుబొంగు (1). రెండు సం॥ల నుంచి 4 సం॥ వరకు వయస్సుగల ముదురు వెదురుగడ; ముదురాకు పచ్చ, పసుపు, ఎరుపు, చిలకపచ్చ, నలుపు మొ॥ రంగుల్లో ఉంటుంది; ఎండిన తరవాత తెలుపు రంగులో ఉంటుంది; మామూలు లావుండి బోలుగా ఉంటుంది; పెద్దచేట, గుల్ల, బుట్ట, గంప మొ॥వి అల్లడానికి పనికొస్తుంది (కో 1, 2, 26).

ముద్దిపేడు: పర్యా. చూ. మందంపేడు. గోరుమందం కన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బందిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది (తె. 30).

మునకాలకర్ర: రూ. ములకాలకర్ర; పర్యా. చూ. ముల్లుగర్ర (2). సుమారుగా రెండువేళ్ళ లావుండే వెదురుకట్టె; ఇది గజం నుంచి రెండు గజాల వరకు పొడుగుంటుంది; దీనికి ఒక వైపున ఇనపముల్లు అమర్చి పశువులను అదిలించడాని కుపయోగిస్తారు; దీనికి ముల్లు ఉండడంవల్ల ముల్లుగర్ర అనే పేరు వ్యవహారంలో ఉంది (కో. 29, 30).

మునక్కర్ర: పర్యా. చూ. ముల్లుగర్ర (2). సుమారుగా రెండువేళ్ళలా వుండే వెదురుకట్టె; ఇది గజం నుంచి రెండు గజాలవరకు పొడుగుంటుంది; దీనికి ఒకవైపున ఇనపముల్లు అమర్చి పశువులను అదిలించడాని కుపయోగిస్తారు; దీనికి ముల్లు ఉండడంవల్ల ముల్లుగర్ర అనే పేరు వ్యవహారంలో ఉంది (తె. 29).

మునిబొంగు: పర్యా. చూ. ముల్లెం (పు) బొంగు. వెదురుగడల్లో ఒక రకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బందిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువ కాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది; కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కనుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది (తె. 19; రా. 7–10).

మునుపలక: పర్యా. కవాచిబల్ల. మగ్గం ముందు భాగంలో నేసేవాడు కూర్చునే పొడుగాటి చెక్క. చూ. చిత్రం 120 ట. 1. (కో. 8).

మునుముగంప: కోళ్ళను ముయ్యడానికి గాని వేరుసెనక్కాయలు ఏెత్తుకోడానికి గాని వాడే ఒకరకం ఈతగంప (రా. 9).

మునెదురు: ఉ. మున్నెదురు; పర్యా. చూ. ముల్లెం (పు) బొంగువెదురు గడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావు నుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బందిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడు

తుంది; కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥గు వాటిమీద మొలుస్తుంది (తె. 7; రా. 7).

ముందచ్చు: (< ముందు + అచ్చు) మగ్గంలో పలక తరవాత ఉండే అచ్చు; ఒక వరస అనిపోగులు దీంట్లోంచి దూరుస్తారు; తొక్కుడుచెక్క తొక్కినప్పుడు ఈ అచ్చుతోపాటు ఒక వరస అనిపోగులు కిందికి వచ్చి సందు ఏర్పడుతుంది; ఆ సందులో తుంగపోచ దూరుస్తారు. చూ. చిత్రం 120 చ. 6. (రా. 6).

ముందరబొంగు: పర్యా. చూ. దిగదండు. చాపనేత మగ్గం చివర అమర్చిన వెదురుగడ; నిలువుపోగులను ఎగదండు (= నేతగాడు కూర్చునేవైపు ఉండేది) నుంచి చాపి దీనికి కడతారు; నేత పని వాడికి ఎదురుగా ఉంటుంది; పోగుల్ని లాగి ఉంచుతుంది. చూ. చిత్రం 120 చ. 8. (రా. 10).

ముందరిమొత్త: ఉ. ముందలి =; పర్యా. కుంచె(1), మూడబండిజల్ల ముందరి భాగంలో రెండు పక్కలను కలుపుతూ వంపుదిరిగిన గూడ. చూ. చిత్రం 32.2. (తె. 7).

ముందలిమట్టు: పేముకుర్చీకి ముందరి రెండు కాళ్ళకూ మధ్యపెట్టిన కర్ర; చూ. మల్లుగర్ర చూ. చిత్రం 138.2 (కో. 3).

ముందుకమాన్: పేముకుర్చీ ముందుభాగంలో విలువంపుగా (కమానులు) వంచిన పేముబెత్తం చూ. చిత్రం 138.5. (తె. 22).

ముప్పందుం గుమ్మి: 9 క్వింటాళ్ళు (ముప్పై తూములు) ధాన్యం పట్టే వెదురుపేళ్ళ గుమ్మి; చూ. చిత్రం 74 వ. (తె. 7, 9).

ముప్పందుం: ముప్పై తూముల ధాన్యం కొలమానం (తె. 7, 9).

ముప్పిడి: పర్యా. ముప్పురి (1). లావుతాడు పేనేటప్పుడు వచ్చే మూడుపాయలపురి (కో. 23, 30).

ముప్పురి: **1.** పర్యా. ముప్పిడి. లావుతాడు పేనేటప్పుడువచ్చే మూడుపాయలపురి. (తె. 9); **2.** లావుతాడు పేనడంకోసం మూడుపాయలు తాల్చినతాడు; గోగునార, జనపనార, గాజంగి నారలతోముందు సన్నటితాడు తాలుస్తారు; తరవాత వాటిని లావుతాడుగా పేంతారు (తె. 9).

ముప్పురి తాడు: మూడు పురలతో పేనినతాడు (రా. 4).

ముప్పేటకాయ: ఉ. ముప్పోట—; ? ఎండిపోయిన కొబ్బరికాయ (కో. 21).

ముప్పేటతాడు: పర్యా. మూడుపిండ్ల తాడు. మూడు కాయల్ని పెనవేసి పేనిన కొబ్బరితాడు (కో. 20).

ముప్పైకుండల గుమ్మి: ఉ. ముప్పైగుంతల—; నాలుగున్నర క్వింటాళ్ళు పట్టే ఈతగుమ్మి; చూ. గుమ్మి; చూ. గుమ్మి (తె. 9).

మురగేయు: (< మురగవేయు) పర్యా. నానబెట్టు, నీళ్ళలో వేసి ఉంచడం; ఎండిన వెదురుగడలు, బద్దలు, కొబ్బరిదొక్కలు, గోగుకట్టె, కలబంద మట్టలు, ఈత బరిగెలు మొ॥ మెత్తబడదానికి నీళ్ళలో వేసి కొంతకాలం ఉంచుతారు (రా. 4).

మురి: చూ. పురి (4) (కో. 30).

మురుకు: ఉ. మురుక్కు; గుమ్మి (గాదె), అల్లకం పూర్తయిన తరవాత మూతికట్టు అల్లుతూ మిగిలిన నిలువుకన్న కట్టుతో కలిపి లోపలికి దోపడం; చెక్కడం (తె. 16).

ములకాళ్ళ కర్ర: చూ. మునకాళ్ళకర్ర (కో. 15, 27).

ములికి: పర్యా. చూ. కూలు (2). ఒకరకం అంబు (చూ.)కు మొనదేలి ఉండే కాడ; సుమారు రెండు బెత్తల పొడుగూ చిటికెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥ వాటికి కట్టు కట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు చూ. చిత్రం 15 క. 1 (కో. 5).

ములుపు కర్ర: పర్యా. చూ. ముల్లెం (పు) బొంగు వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావు నుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువ కాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు; గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది (కో. 20).

ములుపు వెదురు: ఉ. ములువెదురు; పర్యా. చూ. ముల్లెం (పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావు నుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపు చుట్టూ ముండ్లుంటాయి; లోపలబోలుగా ఉంటుంది;

మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగేకొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడు తుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (కో. 28, 31).

**ములుసాదనం:** పర్యా. చూ. మేదరికర్ర(2). పూర్తి లేతగానూ పూర్తిముదురుగానూ కాకుండా మధ్య రకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగాఉండి కండమందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళులేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒక్కటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్నగుర్తు పడుతుంది; మొదలుగుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 31).

**ముళ్ళెదురు:** పర్యా. చూ. ముల్లెం(పు)బొంగు వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గరపెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడంకష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (తె. 13).

**ముళ్ళెంబొంగు:** పర్యా. చూ. ముల్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి. లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గరపెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (తె. 22)

**ముల్లంగి:** పర్యా. చూ. ముల్లెం(పు)బొంగ. వెదురు గడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావునుంచిస్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి(తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగేకొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడంకష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (రా. 5).

**ముల్లు:** 1. వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేసి నప్పుడు మిగిలిన పొడుగాటి కొమ్మభాగం. (తె. 16); 2. వెదురుగడ కొమ్మలకు పెరిగే చిన్నరెమ్మ; దబ్బనంలా వాదిగా ఉంటుంది. (తె 17); 3. వెదురాకులకు ఉండే వెంట్రుకల్లాంటి సన్నటిముల్లు. (తె. 19); 4. పర్యా. చూ. ఈతాకుముల్లు. ఈతాకు చివరి సూదిలాటి మొన. చూ. చిత్రం 115. 4. (కో. 3; తె. 9. 16, 19, 20, 22; రా. 8); 5. పర్యా. చూ. కూలు(2). ఒకరకం అంబు (చూ.)కు మొనదేలి ఉండే కాడ; సుమారు రెండు బెత్తల పొడుగూ చిటికెనవేలెడు లావూఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥వాటికి కట్టు కట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. (కో. 2).

**ముల్లుగట్టె:** ఉ. ములుగట్టె; పర్యా. చూ. ముల్లు గర్ర(2) సుమారుగా రెండువేళ్ళ లావుండే వెదురు కట్టె; ఇది గజంనుంచి రెండు గజాలవరకు పొడుగుంటుంది; దీనికి ఒకవైపున ఇనపముల్లు అమర్చి పశువులను అదిలించడాని కుపయోగిస్తారు; దీనికి ముల్లు ఉండడంవల్ల ముల్లుగర్ర అనేపేరు వ్యవహారంలో ఉంది. (తె. 13, 14, 19, 21, 26; రా. 4).

**ముల్లుగర్ర:** ఉ. ములకర్ర, ములుగర్ర. 1. రూ. ముల్లుంకర్ర; పర్యా. చూ. ముల్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి

వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడంఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (తె. 16); **2.** పర్యా. మునకర్ర, మునికోలకర్ర, ముల్లుగట్టె సుమారుగా రెండువేళ్ళ లావుండే వెదురుకట్టె; ఇది గజంనుంచి రెండుగజాలవరకు పొడుగుంటుంది; దీనికి ఒకవైపున ఇనపముల్లు అమర్చి పశువులను అదిలించడానికి ఉపయోగిస్తారు; దీనికి ముల్లుండడం వల్ల ముల్లుగర్ర అనే పేరు వ్యవహారంలో ఉంది. (కో. 9, 11, 16, 26; తె. 6, 10, 21; గా. 4).

ముల్లుంకర్ర. చూ. ముల్లుగర్ర(1). (కో. 21).

ముల్లుబొంగు: పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడంఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (తె. 5, 12, 17, 24, 26).

ముల్లువాసం: పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడంఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (కో. 19).

ముళ్లెదురు: ఉ. ముళెదురు; పర్యా. చూ. ముళ్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది. ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడు పడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది. (కో. 3, 6, 22, 23; తె. 3, 4, 7; రా. 1, 4).

ముళ్లెపుకంప: ముళ్ళలాంటి చిన్నచిన్న కొమ్మలున్న వెదురుకొమ్మ; ముళ్లెం(పు) బొంగుకు పుట్టింది; వేలెడులావు ఉంటుంది. (కో. 28).

ముళ్లెపువెదురు: పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 23, 24).

ముళ్లెం: పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు. వెదురు గడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 8, 9, 13, 14, 17; తె. 8, 23, 31).

ముళ్లెం(పు)కర్ర: పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు

వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 19, 27, 28).

ముళ్లెం(పు)బొంగు: ఉ. ముళ్లెబ్బొంగు; పర్యా. కచ్చుబొంగు, కణాదిబొంగు, గిన్నెదురు, దబ్బ ముళ్లెదురు, పెద్దబొంబు, పెనెదురు, పెనెదురు బొంగు, బలాణీబొంగు, మాసిబొంగు, మునిబొంగు, మునెదురు, ములుపుకఱ్ఱ, ములుపువెదురు, ముల్చె దురు, ముల్చెంబొంగు, ముల్లంగి, ముల్లుగఱ్ఱ (1), ముల్లుబొంగు, ముల్లువాసం, ముళ్లెదురు, ముళ్లెపువెదురు, ముళ్లెం, ముళ్లెం(పు)కఱ్ఱ, ముల్స పిడెం వెదురు, ముల్సబొంగు, మూసిబొంగు, మోటుగనెబొంగు, వాసూరుబొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 7-10; 12, 14, 18; తె. 2, 17, 26-28; రా. 11).

ముల్స: పర్యా. చూ. వంకకఱ్ఱ(2). ప్రతి కణుపు దగ్గరా వంపుతిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరి పనికి ఉపయోగపడదు. (కో. 15).

ముల్సం వెదురు: పర్యా. చూ. ముళ్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గరపెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టి పడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (కో. 18).

ముల్సబొంగు: పర్యా. చూ. ముళ్లెం(పు)బొంగు వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభం లావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపలబోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపులమధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటి మీద మొలుస్తుంది. (కో. 11; తె. 6, 28; తె. 6, 28; రా. 5).

ముష్టి: పర్యా. చూ. గొట్టం(1). విసనగఱ్ఱ కాడకు తొడిగిన వెదురుగడ ముక్క; లోపలగుల్లగా ఉన్నది, విసురు కొనేటప్పుడు సులువుగా ఉండ డానికి ఇది తొడుగుతారు. చూ. చిత్రం 31 ట. 1. (తె. 16).

ముసలికమ్మ: పర్యా. పండుకమ్మ. ముదిరిన ఈతాకు; ఎరుపురంగులో ఉంటుంది. (తె. 26,).

మూకుడు: ఉ. మూకుడ; 1. పర్యా. చూ. మూత(5). సారెపెట్టె, బట్టలపెట్టెలను మూసే కప్పు; దీర్ఘ చతురస్రాకారం పళ్ళెం మాదిరిగా ఉంటుంది; కొన్నిటి అంచుకు బద్దతో కట్టువేస్తారు చూ. చిత్రం 41. 1. (తె. 5, 15, 30); 2. పర్యా. చూ. మూత (1). చేతిబుట్ట, (మూతబుట్ట, కమాన్‌బుట్ట) మూయడానికి వెదురుపేళ్ళతో అల్లిన పళ్ళెం; గుండ్రంగా ఉంటుంది, కొన్ని బుట్టలకు దీన్ని బొర్లావేసి వేస్తారు; కొన్నిటికి వెల్లకిలా వేస్తారు. చూ. చిత్రం 69. 1. (తె. 13, 15); 3. పర్యా. సిబ్బ(2). చేతిబుట్ట (మూతిబుట్ట), పూలబుట్ట, అకులగంప మొ॥వాటి మూతిభాగాన్ని మూసేకప్పు; అన్నం వార్చుకొనే సిబ్బిమాదిరిగా ఉంటుంది; చూ. చిత్రం 72. (తె. 4).

మూచిక్కం: ఉ. —శిక్కం; ఎద్దమూతికి అలంకరణ కోసం కట్టిన ఒకరకం చిక్కెసుతాడు. (తె. 9).

మూటగచ్చం: ఉ. —గెచ్చం; పర్యా. చూ. మూటాళి,

మూడేసి పేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడు మూడు పేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 2).

మూటని: పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటిపేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (రా. 6).

మూటాల: ఉ. మూటాలి మూటోల; పర్యా. జోడని అల్లకం, జోడల్లకం, మూటగచ్చం, మూటని, మూటాలగచ్చం, మూటాలల్లకం, మూడను అల్లకం, మూడిల్లు, మూడుకిల్లీల అల్లకం, మూడు గచ్చాలల్లకం, మూడుబద్దల అల్లకం, మూడుపేళ్ళల్లకం. మూడేసిపేళ్ళతో అల్లే విధానం; అడ్డం పేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళపై నుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 3, 5, 9, 12, 14-17; తె. 6, 7, 13, 15, 17-21, 23-25; రా. 3, 9-11).

మూటాలగచ్చం: పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 3; తె. 17).

మూటాలచేట: ఉ. —శాట; పర్యా. సాదాచేట. మూడు పేళ్ళమీద (చూ. మూటల) అల్లే చేట. (తె. 2-5).

మూటాలల్లకం: ఉ. మూటాల—; పర్యా. చూ. మూటాల. మూడేసిపేళ్ళతో అల్లే విధానం; అడ్డం పేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పై నుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడు పేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 3. 9, 14, 17; తె. 6, 7, 13, 16, 18-20).

మూడడ్డలగుల్ల: 1. 18 కిలోల ధాన్యం పట్టే వెదురుపేళ్ళ గుల్ల. (తె. 22); 2. 30 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల. (తె. 24).

మూడనుల్లకం: ఉ. మూడన్నల్లకం; పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డం పేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పై నుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 5).

మూడరవైలబుట్ట: శాంపిలు (చూ.) కంటె పెద్ద సైజులో ఉండే ఒకరకం మూసగంప (చూ.). (కో. 19).

మూడిల్లు: పర్యా. చూ. మూటాల. మూడేసిపేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూవస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళగచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటిపేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 12).

మూడీనెలదాలెం: ఉ. మూడీన్ల—; పర్యా. చూ. పలుకు (1). రెండు, మూడుపేళ్ళ మందంగల వెదురుబద్ద; చూ. పేడు. (కో. 23).

మూడుకాళ్ళు: ఉ. —కాల్లు; చెరుకునిచ్చెన పడకుండా నిలబడడానికి నిలువుగా పెట్టిన మూడు వెదురు గడలు; సుమారు నాలుగుమూళ్ళ పొడుగుంటాయి. (తె. 16).

మూడుకిల్లీలఅల్లకం: పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 2).

మూడుగచ్చాలల్లకం: ఉ. మూడుగచ్చమల్లకం; రూ. మూడుగచ్చాలల్లిక; పర్యా చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లేవిధానం; అడ్డంపేడు మూడు పేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటిపేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (కో. 23, 25, 27, 28, 31).

మూడుగచ్చాలల్లిక: చూ. మూడుగచ్చాలల్లకం.

(కో. 27).

మూడుగుంచాలగంప: మూడుకుంచాల ధాన్యం పట్టే గంప. (తె. 18).

మూడుగుంచాలగుల్ల: మూడుకుంచాల (=19½ కిలోలు) ధాన్యంపట్టే గుల్ల. (తె. 25).

మూడుగుండలగంప: 72 శేర్ల (=90 కిలోల) ధాన్యంపట్టే (కుండ = 24 శేర్లు) ఈతగంప. (తె. 14).

మూడుచిట్టాలగుల్ల: మూడుకిలోల ధాన్యంపట్టే గుల్ల (తె. 21).

మూడుజేనలచాప: ఉ. —జేన్లసాప; మూడుజేనల వెడల్పుఉండే తుంగచాప; ఒకమనిషి పడుకోడానికి సరిపోతుంది. (కో. 3; రా. 10).

మూడుతవ్వలగుల్ల: ఉ. మూడ్దవ్వల—; మూడు తవ్వల (12 కిలోల) ధాన్యంపట్టే గుల్ల. (తె. 21).

మూడుపిండ్లతాడు: పర్యా. ముప్పేటతాడు. మూడు పాయల్ని పెనవేసి పేనిన కొబ్బరితాడు. (కో. 25).

మూడుపేళ్ళవిసనగర్ర: ఉ. మూడువేల్లిసనగర్ర, మూడు పేళ్ళమీద అల్లినవిసగర్ర. (రా. 4).

మూడుబద్దలల్లకం: పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది; ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు (కో. 24).

మూడుబుడ్లగంప: మూడుబుడ్ల (బుడ్డి = 12 శేర్లు; 15 కిలోలు) ధాన్యంపట్టే ఈతగంప. (తె. 14).

మూడుబేళ్ళల్లకం: పర్యా. చూ. మూటాల. మూడేసి పేళ్ళతో అల్లే విధానం; అడ్డంపేడు మూడుపేళ్ళ కిందినుంచీ మూడుపేళ్ళ పైనుంచీ తిరుగుతూ వస్తుంది: ఈ అల్లకంలో మూడుపేళ్ళ గచ్చం ఏర్పడుతుంది; మామూలుగా సన్నటి పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ ఇలా అల్లుతారు. (రా. 8).

మూడుబొద్దులగంప: మూడు బిగువుకట్లు వేసిన వెదురుపేళ్ళ గంప; చిన్నగా ఉంటుంది; జామ కాయలూ మామిడికాయలూ తీసుకువెళ్ళేది. (రా. 3).

మూడుమళ్ళగుమ్మి: మూడుమణుగుల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుమ్మి. (తె. 22).

మూడు మానికలగుల్ల: ఉ. – మూన్కల ; 1. మూడు మానికల(= 15 కిలోల) ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుమ్మి. (తె. 24); 2. 24 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 21); 3. 56 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 21);

మూడుమూళ్ళచాప: ఉ. —సాప; మూడుమూళ్ళ వెడల్పున నేసిన తుంగచాప. (కో. 3).

మూడెట్టాలగుల్లగుల్ల: (మూడు + ఎట్టాలు) పర్యా. ఫాయిల్‌గుల్ల. ఆరుకిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల. (తె. 21).

మూడోక్వాలిటీ: పర్యా. చూ. తర్డ్‌క్లాస్‌బొంగు. దాదాపు 9 సెం. మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ; చింతకాయలు రాలగొట్టడానికీ; అలమార్ల తయారీకీ పనికొస్తుంది; పేడు చీరడానికి పనికిరాదు. (తె. 9).

మూడోరకంబొంగు: పర్యా. చూ. తర్డ్‌క్లాస్‌బొంగు. దాదాపు 9. సెం.మీ. వరకు లావుండే తక్కువరకం వెదురుగడ;చింతకాయలు రాలగొట్టడానికీ, అలమార్ల తయారీకి పనికొస్తుంది; పేడు చీరడానికి పనికిరాదు (తె. 7, 8; రా. 9).

మూత: 1. పర్యా. కప్పు(1), డక్కన్, పళ్ళెంకప్పు, మూకుడు(2). చేతిబుట్ట (మూతబుట్ట, కమాన్‌బుట్ట) మూయడానికి వెదురుపేళ్ళతో అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; కొన్నిబుట్టలకు దీన్ని బోర్లావేసి వేస్తారు; కొన్నిటికి వెల్లకిలా వేస్తారు. చూ. చిత్రం 59. 1. (కో. 25, 29; తె. 7–70, 19, 21); 2. పర్యా. చూ. సిబ్బి(2). చేతిబుట్ట (మూతబుట్ట), పూలబుట్ట, ఆకులగంప మొ॥వాటి మూతిభాగాన్ని మూసేకప్పు; అన్నంవార్చుకొనే సిబ్బి మాదిరిగా ఉంటుంది; చూ. చిత్రం 72. (కో. 3; తె. 17, 27; రా. 1, 3, 9); 3. పర్యా. చూ. గూడ(4). వెదురుపేళ్ళతో అల్లిన బండిజల్లకు ముందువైపు మూసిఉన్న భాగం చూ. చిత్రం 32. 3. (కో. 1, 2; తె. 31); 4. పర్యా. చూ. గలుమ తడక. కోళ్ళగూడు కంతను మూసే చిన్నవెదురు తడక; సుమారు జేనేడేసి పొడుగూ వెడల్పూ ఉంటుంది. చూ. చిత్రం 65 వ. 4. (తె. 22); 5. పర్యా. కప్పు(2), దాగర(2), మూకుడు(1), సారెపెట్టె, బట్టలపెట్టెలను మూసేకప్పు; దీర్ఘ చతురస్రాకారం పళ్ళెం మాదిరిగా ఉంటుంది; కొన్నిటి అంచులకు బద్దతో కట్టువేస్తారు, చూ. చిత్రం 41. 1. (కో. 25; తె. 4; రా. 8); 6. పర్యా. దక్నా. గ్లేసుబుట్ట (చూ.) మీదిమూత; పళ్ళెం బోర్లించినట్లు ఉంటుంది. చూ. చిత్రం 87.3.

(తె. 8).

మూతగంప: మూతిదగ్గర లోపలికి మూసుకొచ్చే విధంగా అల్లిన ఈతపేళ్ళగంప; చూ. చిత్రం 68. (తె. 9).

మూతతడక: ఉ. మూత్తడికె; 1. పర్యా. చూ. గలుమతడక. కోళ్ళగూడు కంతను మూసే చిన్న వెదురుతడక; సుమారు జేనెడేసి పొడుగూ వెడల్పూ ఉంటుంది. చూ. చిత్రం 65 ప. 4. 2. గాదెమీద కప్పడానికి అల్లిన వెదురుతడక; దీనికి నాలుగు మూలలుంటాయి. (కో. 8); 3. ఉ. —తడ్క; పర్యా. చూ. వాకిలితడక(1). గుమ్మానికి అడ్డంగా తలుపు మాదిరిగా పెట్టే వెదురుతడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (తె. 17).

మూతబుట్ట: 1. పర్యా. చూ. కంతబుట్ట. బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికీ (గాలి తగలడం కోసం ఉల్లిగడ్డలు మొ॥ పోసిపెట్టుకోడానికీ వాడే ఒకరకం బుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా పైన వంచికట్టిన వెదురుబద్ద ఉంటుంది; దీని మూత సిబ్బి మాదిరిగానూ కొన్ని చోట్ల పళ్ళెం మాదిరిగానూ కొప్పు మాదిరిగానూ ఉంటుంది; దీని ఎత్తుభాగం వెలుపలినుంచి చుట్టూ మధ్యభాగంలో కళ్ళు (కంతలు) వచ్చేట్లు అల్లుతారు; కొన్నిటికి గద్దె ఉంటుంది; చూ. చిత్రం 89 క. (కో. 1); 2. పర్యా. చూ. చేతిబుట్ట(1). బజారు నుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలకొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురు బద్ద వంచికడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్ని చోట్ల పళ్ళెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు. దీనికి కళ్ళు ఉండవు; చూ. చిత్రం 139. (కో. 1, 3, 4); 3. మూత ఉన్న ఈతపేళ్ళ బుట్ట; చింతపండు మొ॥ వేసి పెట్టు కొంటారు; చూ. చిత్రం 68, 68. (కో. 3).

మూతి: 1. పర్యా. చూ. ముక్కు(1). కత్తికి (మేదరి కత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచుచివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రాలు 12 జ. 3; 18 చ. 5 (కో. 27); 2. పర్యా. చూ. గలుమ. కోళ్ళగూడులోకి కోళ్ళను వేయ డానికి పెట్టినకంతం చూ. చిత్రం 65 ప. 3. (తె. 24); 3. పర్యా. నోరు(1). గంప, గుల్ల మొ॥ వాటిపై అంచుకు మధ్యభాగం; తెరుచుకొని ఉన్నది. చూ. చిత్రం 58. 3. (తె. 7); 4 పర్యా. నోరు(2). గూడ, మూడబుట్ట, ఎద్దుబుట్ట, చేపలబుట్ట, గుల్ల మొ॥వాటిని ముయ్యకుండా తెరిచి ఉంచిన భాగం. చూ. చిత్రం 76. 2. (కో. 2, 8, 23, 28; తె. 21, 26); 5. పర్యా. చూ. నాలిక(2). చేట ముందరి (వెడల్పుగా ఉండే) అడ్డ; రెండు కొమ్ములకు (కొసలకు) మధ్యభాగం చూ. చిత్రం 29. 6. (తె. 15); 6 రోటిమీద పెట్టే పైపు కుదురు (చూ.)కు తెరుచుకొని ఉన్న భాగం. చూ. చిత్రం (తె. 9); 7. పర్యా. వంకెతల. వంకె (= పేడు గీయడానికి వాడేది)కు X ఆకారం దగ్గరుండే పొడుగాటి కర్రచివరిభాగం చూ. చిత్రం 14 చ. 5; 8. కొబ్బరిమట్టలో చెట్టుకు అంటుకొని ఉన్నభాగం. (కో. 23); 9. కొబ్బరి కాయ పైభాగం; ముచిక ఉండేది. చూ. చిత్రం 126. 1, (కో. 25); 10. కర్రసుత్తికి కొబ్బరిదొక్కలు చితగ్గొట్టే చదునుగాఉండే భాగం; సుత్తికిపైనా కిందా ఉంటాయి. చూ. చిత్రం 127. 1. (కో. 25).

మూతికట్టు: 1. పర్యా. అంచుకట్టు (1), అంచు బొద్దు, కడబొద్దు, తలకట్టు (2), తంపెండె, తల బొద్దు (1) పైకట్టు, పైబొద్దు, మీదికట్టు (1), మూతిపెండె, గంప, తట్ట, మానె, గుమ్మి, మొ॥ వాటి అంచుచుట్టూ వెలుపలనుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళమందం ఉబ్బెత్తుగా అల్లినభాగం చూ. చిత్రం 47 క. 5. (కో. 24; తె. 13, 19, 21, 23); 2. రూ. ముక్కట్టు; పర్యా. నాలిక్కట్టు. చేట ముందరి మూలభాగంలో కొమ్ముకట్టు, కర్ర (చూ.)లను కలిపికట్టుముంగు (= పలచటి వెదురు పేడు మొ॥) చుట్టి చేసిన బిగింపు; చూ. కొమ్ము కట్టు. చూ. చిత్రం 29.1. (కో. 24; తె. 7–10, 17, 22, 23, 26).

మూతిపెండె ఉ.– పెండి; పర్యా. చూ. మూతికట్టు (1). గంప, తట్ట, మానె, గుమ్మి మొ॥ వాటి అంచుచుట్టూ వెలుపలినుంచి కర్రతో వేలెడు లేదా రెండువేళ్ళ మందం ఉబ్బెత్తుగా అల్లిన భాగం. చూ. చిత్రం 47 క. 5 (కో. 28).

మూదాడు: ఎద్దు ముక్కునుంచితీసి కొమ్ములవరకు కట్టిన సన్నటి గోగునారతాడు; పగ్గాల్ని తెంపుకొని పారిపోయే కోడెలకు ఇలా కడతారు; ఈ తాడుకు

పగ్గాల్నిగడితే ఎద్దు పగ్గాన్ని లాగి తెంపలేదు; లాగితే ముక్కు నొప్పుతుంది (తె 9).

మూపురం: ఉ. మూపురం, మోపురం; రూ. ఊపురం (2); పర్యా. కత్తిబుర్ర, గడ్డ (3), తలకాయ (1), బిళ్ళ (2), మడం (2), మాడు (2), వెన్ను (5). మేదరికత్తివెన్ను (చూ.) పదునంచువైపు వంపు దిరిగిన భాగం. చూ. చిత్రం 12 జ. 4. (కో. 10, 12, 15, 1); తె, 31).

మూర: అర్ధగజం పొడుగుకొలత; మోచేతినుంచి మధ్యవేలి కొసవరకుగల పొడుగు. (తె 6,7,9,14).

మూరగంటు: వెదురుగడకు రెండుకణుపుల మధ్య ఉన్న మూరెడు ఎడం. (తె. 3).

మూరగనుపు: పర్యా. గనపిచ్చె, మూరపిచ్చె. వెదురు గడ కణుపులమధ్య మూరెడు ఎడమున్న భాగం. (కో. 9).

మూరగనుపుబొంగు: ఉ. మూరగెన్పు — ; పర్యా. మూర గనుపువెదురు. కణుపులమధ్య మూరెడు ఎడముండే వెదురుగడ; జల్లెడ అల్లకం పేడుతీయ డానికి పనికొస్తుంది. (రా. 10, 11).

మూరగనుపువెదురు: ఉ. మూరగెన్పు యెదురు; పర్యా. మూరగనుపు బొంగు. కణుపులమధ్య మూరెడు ఎడముండే వెదురుగడ; జల్లెడ అల్లకం పేడు తీయడానికి పనికొస్తుంది. (కో. 1).

మూరపిచ్చె: ఉ. — పిచ్చి; పర్యా. చూ. మూరగనుపు. వెదురుగడ కణుపులమధ్య మూరెడు ఎడమున్న భాగం. (రా. 2).

మూరపేడు: పర్యా. చూ. జల్లెడపేడు. జల్లెడతట్ట (చూ.) అల్లడంకోసం మూరగనుపు (రెండు కణుపులమధ్య మూరెడు ఎడంఉండే గడభాగం) గడనుంచి చీరిన పేడు; కణుపు లేకుండా మూరెడు పొడుగుంటుంది; చేట పేడుకన్న వెడల్పు తక్కువగా ఉంటుంది. (కో. 9).

ముహూర్తగాడు: ముహూర్తం పెట్టేవాడు; సిద్ధాంతి. కో. 24).

మూల: 1. పర్యా. చేటమూల. చేటకు వెనకాల అడ్డమూ, పొడుగూ కలిసినచోటు; దొప్పలా ఉంటుంది; ఇలాటివి రెండుంటాయి. చూ. చిత్రం 29.3 (కో. 2, 3, 5, 6, 9, 10, 16, 17, 19, 24, 25, 28, 31; తె. 1, 2, 4, 5, 7-10, 12-14, 15-22, 26-28, 31; రా. 1-3, 5, 6, 8, 9, 11); 2 పర్యా. కోను. జంగిడి, మచ్చిక, కార్కుబుట్ట మొ॥వాటికి అడుగున రెండుపక్కలు కలిసిన (దొప్పలాంటి) భాగం; ఇలాటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 49.2 (కో. 28-31); 3. పర్యా. చూ. గూడ (4). వెదురుపేళ్ళతో అల్లిన బండిజల్లకు ముందువైపు మూసిఉన్న భాగం. చూ. చిత్రం 32.3 (కో. 3, 8); 4. బండిజల్ల వెనక భాగం. చూ. చిత్రం 32.4 (రా. 8); 5 గుమ్మి అడుగుభాగంలో రెండుపక్కలు కలిసిన (దొప్ప లాంటి) భాగం; ఇలాటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 74 క. 1. (తె. 21); 6. పర్యా. కింది మూల (1), గూడమూల, మట్టు (4). నీళ్ళగూడకు అడుగున ఏర్పడ్డకోసు (దొప్పలాంటిది). చూ. చిత్రం 35 క. 1. (కో. 2, 3, 7, 8). 7. చేపలు పట్టే చించగూడ (చూ.)కు కిందిభాగంలో ఉన్న కోసు (దొప్పలా ఉండేది). చూ. చిత్రం 73 చ. 1. (కో. 31); 8. తాటిచాపలో రెండంచులు (పొడు గంచు అడ్డంచు) కలిసేచోట కోసుగావచ్చే భాగం; ఇలాంటివి చాపకు నాలుగుంటాయి. చూ. చిత్రం 125.2 (కో. 23, 26).

మూలకొయ్య: పర్యా. కొయ్య (5). నీళ్ళతోడే గూడకు రెండుపక్కలా మూలదగ్గర్నుంచి అంచు దాకా వేసిన వెదురుబద్ద; ఇలాటివి నాలుగుంటాయి. (కో. 18).

మూలగచ్చం: చేట అల్లకంలో మూలదగ్గర మిగిలే ఒకేఒక పేడు; చేటలోగానీ వినసగ్రలోగానీ అల్లుతూపోగా రెండుచివర్లకు ఒకేఒకపేడు మిగులుతుంది; చేటలో ఇది ముఖ్యమైన భాగం; ఇది రాకుండా మూలలు మలపడం వీలుకాదు; వినసగ్రలో అయితే ఈ మూలభాగాన్ని మలిపి చెక్కుతారు. చూ. చిత్రం 21. 1. (తె. 3-5).

మూలగొయ్య: వెదురుపేళ్ళగుమ్మి మూలలు మలిపే టప్పుడు నిలు(వు)గులు సరిగా నిలబడడానికి నేల లోకి దింపిన వెదురుగడ ముక్క; నాలుగుమూలలా దింపుతారు; వీటిమీద అడ్డగొయ్యలు వేస్తారు. (తె. 28).

మూలగోటు: 1. (క్రి.) పర్యా. చూ. మూలపట్టు. చేట అల్లకంలో అడుగు అల్లిన తరవాత వెనక భాగం రెండుమూలలా దొప్పలాగా వచ్చేటట్లు అల్లే విధానం. (తె. 14, 27, 28, 31); 2. పెండ్లిబుట్ట అల్లకంలో మూల మలిపి అల్లడం. (కో. 30); 3. పర్యా. చూ. కొమ్ము (6) ఈతచాప మూల భాగంలో ఉండే అంచుపట్టె చివరిభాగం; నాలుగు మూలలా ఇలా తోకలా కనిపిస్తుంది. చూ.

చిత్రం 122.2. (తె. 21).

మూలజల్లి: పర్యా. చూ. కంకిజల్ల(1). సజ్జకంకి జొన్నకంకి మొ॥వాటిని పొలాలనుంచి మోసుకు రావడానికి వాడే ఒకరకం పెద్దగంప; గజం ఎత్తూ మూరన్నర వెడల్పూ ఉంటుంది. (తె. 4).

మూలదబ్బ: 1. బండిజల్ల మూసుకొనిఉండే భాగంపై అంచువెంబడివేసిన బద్ద. (కో. 3); 2. చూ. మూల బద్ద (3) (కో. 3).

మూలనేత: చేట అల్లకంలో పేళ్ళు అయి మూల వరసల్లో (మూలలు మూలలుగా) వచ్చేటట్లు అల్లే విధానం. (కో. 15).

మూలపట్టు: (క్రి.) ఉ. మూలబట్టు, మూలవట్టు; పర్యా. అడుగు గోటు, గోటు (3), మూలగోటు (1), మూలమడుచు (1). మూలవేయు. చేట అల్లకంలో అడుగు అల్లినతరవాత వెనకభాగం రెండు మూలలా దొప్పలాగా వచ్చేటట్లు అల్లే విధానం. (కో. 2, 3, 6, 8-13, 15, 17, 18; రా. 5, 10, 11).

మూలపేడు: పర్యా. చూ. కోతపేడు. చేట, గూడ, బుంగ మొ॥ అల్లినతరవాత వాటి మూలలదగ్గర మిగిలిన పేడు(లు); వీటిని కోసేస్తారు; దేనికీ పనికిరావు. (కో. 18).

మూలబద్ద: 1. కోళ్ళగూడు తలుపుగా అమర్చిన తడకకుగాని కోళ్ళగూడు అడుగుకుగాని 'X' ఆకారంలో బిగించినబద్ద; పొట్టిగా పలచగాఉంటుంది. చూ. చిత్రం 65 గ. 4. (తె. 22, 23); 2. నీళ్ళ గూడ మూల(ల)కు అమర్చిన బద్ద(లు) (కో. 16); 3 రూ. మూలదబ్బ (2); పర్యా. బమూలబద్ద, కత్తెరవాసం, చివ, మూలవాసం. తడక, చెంద్రిక తడక మొ॥ వాటికి గట్టిదనంకోసం X ఆకారంలో బిగించిన బద్దల్లో ఒకటి. చూ. చిత్రం 38 క. 1. (కో. 12, 22).

మూలమడుచు: (క్రి.) ఉ. - మడుపు, -మడుసు; 1. పర్యా. చూ. మూలపట్టు. చేట అల్లక లో అడుగుఅల్లిన తరవాత వెనకభాగం రెండుమూలలా దొప్పలాగా వచ్చేటట్లు అల్లేవిధానం (కో. 5, 19); 2. తాటిచాప అల్లుకుంటూ వచ్చి నాలుగో మూల దగ్గర మూసివేయడం. (కో. 26).

మూలవాసం: ఉ. మూలాసం; పర్యా. చూ. మూల బద్ద(3). తడక, చెంద్రికతడక మొ॥వాటికి గట్టిదనం కోసం X ఆకారంలో బిగించిన బద్దల్లో ఒకటి చూ. చిత్రం 38 క. 1. (రా. 2).

మూలవిరుచు: (క్రి.) ఉ. -ఇరుచు; తాటిచాప అల్లకంలో ఒకమూల దగ్గరికి వచ్చినప్పుడు ఆ మూల అల్లిన తరవాత రెండో మూలవైపు తిప్పి అల్లుకుంటూపోవడం. (కో. 23, 26).

మూలవేయు: (క్రి.) ఉ. మూలేయు; పర్యా. చూ. మూలపట్టు. చేట అల్లకంలో అడుగు అల్లిన తరవాత వెనకభాగం రెండు మూలలా దొప్పలాగా వచ్చేటట్లు అల్లే విధానం. (కో. 7).

మూసగంప: గ్రాఫైట్ మూసలు తీసుకువెళ్ళడానికి ఉపయోగించే గంప. (కో. 19).

మూసినదండి: పర్యా. మడుపుదండి. తాటి చాపలో అల్లుకుంటూ మలిపిన రెండో అడ్డంచు. (కో. 26).

మూపిబొంగు: పర్యా. చూ. ముల్లెం(పు) బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటివాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (రా. 11).

మూసివాయనంచేట: ఉ. ముశానంచేట, ముసివానం శాట, మూషివాయనంశాట; పర్యా. పునిస్త్రీచేట, ముత్తైదువచేట, వాయనంచేట (1). సాంగంచేట. ముత్తైదువ చనిపోయినప్పుడు ఆమె పేరుమీద మూసివాయనం (సాంగం; పసుపు, కుంకుమ మొ॥) పెట్టిఇచ్చేచేట; వాయన మిచ్చేటప్పుడు పైన మరో చేట బోర్లిస్తారు. (కో. 12, 19, 20, 26).

మూసుకవచ్చు: (క్రి.) చేట అల్లకం పూర్తికావడం. (తె. 15).

మెట్టగించు: (క్రి.) ఉ. మెట్టిగించు; చూ. మెండించు. (కో. 23, 25)

మెట్టబొంగు: పర్యా. నేలబొంగు. సమతలప్రదేశంలో పెరిగిన వెదురుగడ; కొంచెం మెత్తగా ఉంటుంది; బోలు ఎక్కువగానూ కండతక్కువగానూ ఉంటుంది; (తె. 9).

మెట్టు: 1. రూ. మెట్టె, మొట్టు (2); పర్యా. అర్ధ శక్ర, అర్ధుకట్టె, కాలు (8) కాళ్ళతుంట, కొడుపు. నిచ్చెన తయారీలో వెదురుగడలకు అడ్డంగా సుమారు

మూరెడుపొడుగున బిగించిన వెదురుగడముక్క; నిచ్చెనకు సుమారు మూరెడేసిఎడంలో నిలువు గడలకు చిల్లులుచేసి వాటిలో బిగిస్తారు. (కో. 5, 14, 19, 29; తె. 3, 4, 8, 10, 12, 16; రా. 4, 9, 10); 2. పర్యా. చూ. పొట్టదబ్బ. ఈతకమ్మ పొట్ట (చూ.) చీరితీసిన బద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11. 2. (రా. 9).

మెట్టె: 1. చూ. మెట్టు (1) (రా. 8); 2. విసనగర్ర కాడకూ అల్లినభాగానికీ కలిపివేసిన కట్టు. చూ. చిత్రం 31 క. 2. (తె. 3); 3. పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం (=కాడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచి పెడతారు. చూ. చిత్రం 31 త. 3. (తె. 9).

మెడపలుపు: పశువుల మెడకు తగిలించడానికి కన్నె (చూ.)కు ఒకచివర ఉండేతాడు (పలుపు); గుంజ పలుపుకన్న పొడుగు. (కో. 5).

మెడ్డిగించు: చూ. మెండించు. (కో. 30).

మెడ్డించు: చూ. మెండించు. (కో. 27).

మెడ్డు: రూ. మిడ్డె; పర్యా. దడితడక, పెడతడక. నిలువుబద్దలు నేలలో పాతడానికి వీలుగా పెట్టి అడ్డం బద్దలలో అల్లిన తడక; దీనిచుట్టూ గోడమాదిరిగా మన్ను మెత్తుతారు; అడవి ప్రాంతంలో ఇలా చేస్తారు; (చూ. మెడ్డ; మాం. వృ. కోశం-4, వాస్తుపదజాలం; పుట 345). (తె. 8).

మెండించు: రూ. మెట్టగించు, మెడ్డిగించు, మెడ్డించు; పర్యా. గేడికిదిప్పు, పెకిలించు, పెంౘ్రడించు, బెడికించు, మెలిబెట్టు. వెదురుగడ చీల్చేటప్పుడు కణుపు సులువుగా తెగడానికి కత్తిని అడ్డంగా మెలి దిప్పడం. (కో. 1; తె. 6, 23, 25; రా. 11).

మెతకబొంగు: చూ. మెదుగుబొంగు. (కో. 9).

మెతకవిసనకర్ర: పర్యా. చూ. సన్నవిసనగర్ర మెత్తగా ఉండే సన్నటిపేళ్ళతో అల్లిన విసనగర్ర. (కో. 12).

మెతకవెదురు: రూ. మెదువువెదురు; పర్యా. చూ. మెదుగుబొంగు. నాణ్యమైన మెత్తటి వెదురుకర్ర; మెత్తటిపేడు వస్తుంది; మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది; నీళ్ళు బాగా అందే లోయల్లోనూ సమతల భూముల్లోనూ మెత్తటి నేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపుల మధ్య ఎడంఎక్కువ. (కో. 18).

మెతక్కర్ర: (< మెతక + కర్ర) రూ. మెదురుకర్ర; పర్యా. చూ. మెదుగుబొంగు. నాణ్యమైన మెత్తటి వెదురుకర్ర; మెత్తటిపేడు వస్తుంది; మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది; నీళ్ళుబాగా అందే లోయల్లోనూ సమతల భూముల్లోనూ మెత్తటి నేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపుల మధ్య ఎడంఎక్కువ. (కో. 15).

మెతువుబర్ర: చూ. మెదుగుబర్ర. (రా. 9).

మెతువుబొంగు: చూ. మెదురుబొంగు. (రా. 11).

మెత్తకర్ర: పర్యా. ఎలాంకర్ర, ఎల్పుకర్ర. వెడల్పుగానూ పలకగానూ ఉండే వెదురుకర్ర; చూ. కర్ర. (తె. 15).

మెత్తకవురుబొంగు: ఉ. — కొరు —; పర్యా. చూ. కవురుబొంగు (1). తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురుగడ; తెల్లగాగాని నల్లగాగాని అవుతుంది; సరయిన జిగి ఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; జైలి తడకలకుమాత్రం పనికొస్తుంది. (తె. 19).

మెత్తటినార: సన్నటి నారపోచలు. (తె. 9).

మెత్తటబరిగె: పర్యా. మంచీతబరిగె, మెరుగుదువ్వ, మెదుగుబర్ర, మెదుమీతకట్టె, మెదువుకట్టె, నాణ్యమైన ఈతబరిగె; మెదువుగాఉండి ఎటువంచినా విరగదు; చీల్చేటప్పుడు విరగకుండా పేడు మంచిగా వస్తుంది. (తె. 14).

మెత్త(టి)బొంగు: రూ. మెత్తనిబొంగు; పర్యా. చూ. మెరుగుబొంగు. నాణ్యమైన మెత్తటి వెదురుకర్ర; మెత్తటిపేడు వస్తుంది, మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది; నీళ్ళు బాగా అందే లోయల్లోనూ సమతలభూముల్లోనూ మెత్తటినేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపులమధ్య ఎడం ఎక్కువ. (కో. 7; తె. 17, 19, 25).

మెత్తనికర్ర: పర్యా. చూ. మెదుగుబొంగు. నాణ్యమైన మెత్తటి వెదురుకర్ర; మెత్తటిపేడు వస్తుంది; మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది; నీళ్ళుబాగా అందే లోయల్లోనూ సమతల భూముల్లోనూ మెత్తటి నేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపుల మధ్య ఎడంఎక్కువ. (కో. 31).

మెత్తనిబొంగు: చూ. మెత్త(టి)బొంగు. (రా. 10).

మెపపెట్టు: పర్యా. చూ. తొక్కుడుదబ్బ. చాపనేత మగ్గంలో అనికర్రకూ లోవెదురుగడకూ మధ్య ఉండే గజంపొడుగు గడ లేదా కర్ర; అనులు

మార్చినప్పుడు పోగుల్ని అణిచిపట్టడానికి ఉపయోగ పడుతుంది. చూ. చిత్రం 120 క. 3. (కో. 3).
మెదుగు: (విణ) మెత్తని; మెతక; ఎటువంచినా విరగని. (తె. 17, 18).
మెదుగుచువ్వ: పర్యా. చూ. మెత్తటిబరిగె. నాణ్యమైన ఈతబరిగె; మెదువుగా ఉంది ఎటు వంచినా విరగదు; చీల్చేటప్పుడు విరగకుండా పేడు మంచిగా వస్తుంది. (తె. 7).
మెదుగుబద్ర: రూ. మెతువుబద్ర; పర్యా. చూ. మెత్తటిబరిగె. నాణ్యమైన ఈతబరిగె; మెదువుగా ఉండి ఎటువంచినా విరగదు; చీల్చేటప్పుడు విరగ కుండా పేడు మంచిగా వస్తుంది. (రా. 8).
మెదుగుబొంగు: రూ. మెతకబొంగు, మెతువుబొంగు, మెదుంబొంగు; పర్యా. చదరంవెదురు, మెతక్కఱ్ర, మెత్త(టి)బొంగు, మెత్తనికఱ్ర, మెదువుగట్టె; నాణ్యమైన మెత్తటి వెదురుకఱ్ర; మెత్తటిపేడు వస్తుంది; మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది, నీళ్ళు బాగా అందే లోయల్లోనూ సమతల భూము ల్లోనూ మెత్తటి నేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపులమధ్య ఎడం ఎక్కువ. (తె. 17, 18; రా. 7).
మెదుమీతకట్టె: (< మెదుము + ఈతకట్టె) పర్యా. చూ. మెత్తటిబరిగె. నాణ్యమైన ఈతబరిగె; మెదు వుగాఉండి ఎటువంచినా విరగదు; చీల్చేటప్పుడు విరగకుండా పేడు మంచిగావస్తుంది. (తె. 9).
మెదుంబొంగు: చూ. మెదుంబొంగు. (తె. 23).
మెదువు: పర్యా. చూ. పదును (1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి, మొ॥ వాటి వాడి, మెత్తగానెగే భాగం; కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు 12 క-ఛ, 16 క-వ. (తె. 3).
మెదువుకట్టె: పర్యా. చూ. మెత్తటిబరిగె. నాణ్య మైన ఈతబరిగె; మెదువుగాఉండి ఎటువంచినా విరగదు; చీల్చేటప్పుడు విరగకుండా పేడు మంచిగా వస్తుంది. (తె. 16).
మెదువుకఱ్ర: చూ. మెతక్కఱ్ర. (కో. 3).
మెదువుగట్టె: పర్యా. చూ. మెదుగుబొంగు. నాణ్యమైన మెత్తటి వెదురుకఱ్ర; మెత్తటిపేడు వస్తుంది; మేదరిపనిలో దేనికయినా పనికొస్తుంది; నీళ్ళుబాగా అందే లోయల్లోనూ సమతల భూము ల్లోనూ మెత్తటి నేలల్లోనూ పెరుగుతుంది; దీనికి కణుపుల మధ్య ఎడంఎక్కువ. (కో. 4).
మెదువువెదురు; ఉ. మెదువెదురు; చూ. మెతక వెదురు. (కో. 1).
మెంతు. చూ. పంతు(1). (కో. 2, 3; రా. 11).
మెరకమూల: చేటకు వెడల్పు భాగంలో కొమ్ము చివర అడ్డమూ పొడుగూ కలిసేచోటు. (కో. 17).
మెరక్కఱ్ర: (< మెరక కఱ్ర) మెరకనేలలో పుట్టిన వెదురుగడ; గట్టిగా ఉంటుంది. (కో. 27).
మెరమిరుగు: (క్రి.) పర్యా. చూ. మొక్కవోవు. రాళ్ళుగాని గట్టివస్తువుగాని తగిలినప్పుడు మేదరి కత్తికి పదునుపోయి మొండిగా కావడం; లేదా పదునున్న అంచు వెనక్కి-వంగి పోవడం. (కో. 18).
మెలిబెట్టు: (క్రి.) పర్యా. చూ. మెండించు. వెదురు గడ చీల్చేటప్పుడు కణుపు సులువుగా తెగడానికి కత్తిని అడ్డంగా మెలిదిప్పడం. (కో. 2).
మేకబుట్ట: ఉ. —బుట్టి; చేలోపడి తినకుండా మేక మూతికి కట్టే దుసేరు తీగలబుట్ట. (తె. 9).
మేకలకొల్లం: పర్యా. చూ. పిల్లలగూడు. తల్లులవెంట మేతకుపోలేని చిన్నచిన్న గొర్రెపిల్లలనూ మేకపిల్ల లనూ కమ్మడానికి మందపాటి వెదురుబద్దలతో అల్లి నది; బోర్లించిన గంట ఆకారంలో ఉంటుంది; పిల్లల్ని వేయడానికి ద్వారం ఏర్పాటు చేస్తారు; పిల్లలు ఇందులో నిలబడి మంద అందిస్తే తింటాయి; చూ. చిత్రం 77. (కో. 25).
మేకు: 1. పర్యా. చూ. కాలు(3). వెదురుతో అల్లిన ఉయ్యాల, సారెపెట్టె, కాయితాలబుట్ట, మైలబుట్ట మొ॥వి నేలమీద నిలబడానికి ఏర్పరిచిన ఆధారం; సుమారు జేనెడుపొడుగు వెదురుబద్దముక్క; ఇటు వంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిటికి గుండ్రంగా ఉంటాయి. చూ. చిత్రం 71. 1. (కో. 11); 2. పర్యా. గూటం (1). గాదె, బంది జల్ల మొ॥ వాటి అల్లకంలో అడుగు అల్లకం పూర్తయిన తరవాత నిలువులను పైకి నిలబెట్టే టప్పుడు అడుగుభాగం కదలకుండా నిలువులు వంగి ఉండేటందుకు నేలకు పాతిన వెదురుకఱ్ర లేదా ఇనపమేకు (కో. 15; తె. 31; రా. 10).
మేకులతడక: పర్యా. చూ. జల్లితడక (1) వెదురు బద్దలు ఎడం ఎడంగాపెట్టి మేకులుకొట్టి తయారు చేసిన తడక; బద్దకూ బద్దకూమధ్య సందులు చతు రస్రంగాగాని డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళదట్టూ ప్రహరీగోడ బదులుపెట్టుకొంటారు. (రా. 8).
మేజు: (< హిం. మేజ్) వెదురుకఱ్రలతో చేసిన

నాలుగుకాళ్ళ ఎత్తుటల్ల. (తె. 5).

మేదపరుపుచేట: ఉ. – శేట; మధ్యభాగంలో పువ్వు లాంటి డిజైను పడేటట్లు అల్లినచేట. (కో. 23, 26).

మేడి: నాగలి వెనకభాగంలో పైకిఉండే కర్ర; మేడి తోక; దున్నేటప్పుడు ఇది పట్టుకొంటారు. (కో. 30).

మేడితొల: నాగలికి మేడితొడిగే రంధ్రం. (కో. 30).

మేడిమొలక: ఉ. –మల్క; ఒకరకం మడి(పులక); బాడు పేనడం పూర్తయిన తరవాత చివర వేస్తారు. (తె. 9).

మేతజల్ల: పర్యా. చూ. గడ్డిబుట్ట. పశువులకు గడ్డి వేయడానికి వాడే పెద్దగంప; అడుగున వెడల్పు తక్కువుండి పోనుపోను మూతి విశాలమవుతుంది; గడ్డికింద వేస్తే పశువులు తొక్కుతాయని దీంట్లో వేస్తారు. చూ. చిత్రం 91. (రా. 9).

మేదరనరుకు: పర్యా. చూ. గిద్దనరుకు. వెదురుగడ మొదలు కత్తితో కొట్టడంవల్ల గుండ్రంగా పడ్డ నరుకు. (కో. 16).

మేదరి: (బ. మేదర్లు) ఉ. మేదర; వెదురుగడలు చీల్చి తట్టలు, బుట్టలు, చేటలు మొ॥ అల్లి జీవించే ఒకతెగ; మహేంద్రులు; ఆ పనిచేసే వ్యక్తి. (కో; తె; రా.).

మేదరికత్తి: ఉ. మేదర్–, మేదర –; పర్యా. కత్తి (1), బుర్రమొచ్చు (1) మేదరిమొచ్చు. వెదురుగడ నరకడానికి పగలగొట్టడానికి బద్దలూ పేళ్ళు చీల్చడానికి మేదరివాళ్ళు వాడేకత్తి; కొన్నిటికి కక్కుపిడి ఉంటుంది; చూ. చిత్రాలు 12 ఙ, ద. (కో. 6, 9, 11, 13, 15–21, 26, 31; తె. 6, 13; రా. 2–4).

మేదరికర్ర: **1.** పర్యా. చూ. వెదురుబొంగు. వెదురు పొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి మూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతి కర్ర మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4 (కో. 21); **2.** ఉ. మేదర ; పర్యా. మంచికర్ర, మంచి బొంగు, మంచిబొంబు, మంచివెదురు, మాఘబొంగు, ములుసాధనం. మేదరిగడ, మేదరివాసం, మేదరి వెదురు, సాధనంకర్ర, సాధనం (1), సాధనం బొంగు, సాధనంవెదురు, సాపుకర్ర (1), సాపు బొంగు, సాధనంబొంగు, సాసానంవెదురు, సైర బొంగు (2). పూర్తిలేతగానూ పూర్తిముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురు గడ; లోపల కొంచెం గుల్లగాఉండి కండ మందంగా ఉంటుంది, కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపుల దగ్గర ముళ్ళులేకుండాఉండి పేడు సాపుగావస్తుంది; కణుపుదగ్గర ఒకటేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తుపడుతుంది; మొదలు గుండ్రంగా నరికిఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 12, 14, 19, 20, 23–26, 29; తె. 31).

మేదరిగడ: ఉ. - గెడ; పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగాఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగాఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గాఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళులేకుండా ఉండి పేడు సాపుగావస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తుపడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 15).

మేదరిచేట: ఉ. మేదర్చాట; మేదరివాళ్ళు అల్లే మామూలు చేట. (కో. 28).

మేదరిపని: పర్యా. వెదురుపని. వెదురుగడలు చీల్చి చేట, జల్లెడ మొ॥ వస్తువులల్లే పని. (కో. 8).

మేదరిబొంగు: పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూమధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 10; తె. 7).

మేదరిమొచ్చు: పర్యా. చూ. మేదరికత్తి. వెదురుగడ నరకడానికి పగలగొట్టడానికి బద్దలూ పేళ్ళు చీల్చడానికి మేదరివాళ్ళువాడే కత్తి; కొన్నిటికి కక్కుపిడి ఉంటుంది; చూ. చిత్రాలు 12 ఙ, ద. (రా. 1).

మేదరివాసం: పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగాఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగాఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గాఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళులేకుండా ఉండి

పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒక ఛేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తుపడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది, మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 13).

మేదరివెదురు: ఉ. మేదరెదురు; పర్యా. చూ. మేదరి కఱ్ఱ (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురు గడ; లోపల కొంచెం గుల్లగా ఉండీ కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపుల మధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండాఉండి పేడు సాపుగావస్తుంది; కణుపుదగ్గర ఒకఛేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తుపడుతుంది; మొదట గుండ్రంగా నరికిఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 16-18).

మేఠ: చూ. మేరవ. (తె. 6, 9).

మేఠచేట: ఉ.—సాటు; చూ. మేరవచేట. (తె. 6, 9).

మేరవ: చూ. మేర; పొలంలో పనిచేసినందుకు పనివాడు పంటలోంచి తీసుకోడానికి నిర్ణయమయిన వడ్ల లెక్క; కట్టడి; దానికిసంబంధించి యజమానితో చేసుకొనే ఒప్పందం; దీనిప్రకారం వడ్లు కొలుచుకొనే చేటను మేరవచేట అంటారు. (కో. 5).

మేరవచేట: ఉ. శాట; చూ. మేరచేట, పెద్దచేట; తుప్పనూర్చేటప్పుడు పనివాళ్ళ కట్టడి (మేరవ) ప్రకారం తమకు కావలసినవడ్లు తీసుకునే చేట. (కో. 5).

మేలుతుంగ: మధ్యలో బోలుగాలేని గట్టితుంగ; నాణ్యమైనది. (కో. 3).

మైల: పర్యా. చూ. కంకమసి (2). వర్షానికి తడిసి ఎండిన ముదురు వెదురుగడమీద ఏర్పడే నల్లటి పొడి. (తె. 18).

మైలబుట్ట: ఉ.—బుట్టి; పర్యా. బట్టలబుట్ట. మాసిన బట్టలువేసుకొనే (ఈత)బుట్ట; దీనికి మూతఉంటుంది; చూ. చిత్రం 71. (కో. 3; తె. 14; 17, 30; రా. 8).

మైలబూడిద: ఉ.—బూడ్ది; పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడచుట్టూ ఏర్పడే తెల్లటి పొడి; కొన్ని చోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (తె. 27).

మైలు: పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడచుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (రా. 2).

మైసూరుకఱ్ర: పర్యా. మైసూర్‌కేన్. మైసూరు (కర్నాటక)ప్రాంతం అడవులనుంచివచ్చే పేము కఱ్ర; లావుగా ఉంటుంది; (కో. 10).

మైసూరుకుర్చీ: ఒకరకం పేముకుర్చీ. (కో. 10).

మైసూరుకేన్: (ఇం.—Cane) పర్యా. మైసూరు కఱ్ర. మైసూరు (కర్నాటక) ప్రాంతం అడవుల నుంచివచ్చే పేముకఱ్ర; లావుగాఉంటుంది. (కో. 3).

మొకం: (< సం. ముఖం) చించెగూడలోకి చేపలు దూరే కంత; వెడల్పుభాగంవైపు ఉంటుంది. చూ. చిత్రం 73 చ. 3. (కో. 31).

మొకరకట్టుతాడు: ఎద్దు లాగేటప్పుడు బండికాడి ముందుకుపోకుండా కాడినీ బండి ఇరుసునూ కలిపి కట్టేతాడు; తాడుకు ఒకచివర పలుపుంటుంది; ఈ పలుపును కాడిదగ్గర బోలుకు తగిలిస్తారు. (కో. 30).

మొక్కకఱ్ర: పర్యా. చొప్పకఱ్ర, బాకు, నెలతక్కువ కఱ్ర, మొక్కసీద. నాలుగునెలలనుంచి సం॥లోపు వయస్సుగల వెదురుకఱ్ర; చీల్చడానికి పనికిరాదు; మెత్తగాఉండి ఎటుబడితే అటువంగిపోతుంది; చెరుకు నాటువేసినప్పుడు ఆనుగాపెట్టడానికి పనికొస్తుంది, (కో. 22).

మొక్కదబ్బ: వెదురుగడ లోపలి పల్లపుభాగంనుంచి వచ్చేబద్ద; పనరుదబ్బకంటె పొడుగు తక్కువ; గంప మొ॥వాటి నిలువులకు పనికొస్తుంది. (కో. 1).

మొక్కపిడెం: వెడల్పు తక్కువగానూ లేత గడల తోనూఉండే వెదురుపొద. (కో. 22).

మొక్కపోవు: (క్రి.) ఉ. మొక్కపోవు; పర్యా. మొరమిరుగు, మొండిపోవు. రాళ్ళుగాని, గట్టివస్తువు గాని తగిలినప్పుడు మేదరికత్తికి పదునుపోయి మొండిగాకావడం, లేదా పదునున్న అంచు వెనక్కి వంగిపోవడం. (తె. 26).

మొక్కసీద: పర్యా. చూ. మొక్కకఱ్ర. నాలుగు నెలలనుంచి సం॥లోపు వయస్సుగల వెదురుకఱ్ర; చీల్చడానికి పనికిరాదు; మెత్తగాఉండి ఎటుబడితే అటు వంగిపోతుంది; చెరుకు నాటువేసినప్పుడు ఆనుగాపెట్టడానికి పనికొస్తుంది. (కో. 22).

మొఖం: పర్యా. ముడుసు (1) వంకకఱ్ర ( వేళ్ళతో సహా పీకి సాపుచేసిన వెదురుకఱ్ర) వంపు చివరి భాగం; వెదురుదుంపలోంచి పుట్టిన తల్లివేరు నరికేయగా మిగిలిన మొదలు. చూ. చిత్రం 6. (తె. 18).

మొగనాలిరూపాయలు: (< మగనాలి-) మగణ్ణి

విడిచి ఇంకొకడితో కాపురం పెట్టే స్త్రీ పాతమొగడికి చెల్లించవలసిన రొక్కం. (కో. 24).

మొగమోకు: పర్యా. చూ. మోకు (2). దున్నేటప్పుడు నాగలికి కాడిని కలిపికట్టే కొబ్బరితాడు; ఇది మామూలుగావుంటుంది; కొన్ని ప్రాంతాల్లో ఈ తాడు రెండుచివర్లా చిరత (=చిన్న కర్ర ముక్క)లు తొడిగి ఒక చిరతకు పొటొంజి (=వలయాకారంగా పేనినతాడు)ని తగిలిస్తారు; పొటొంజి రెండోచివరను నాగలిమీడికి తగిలిస్తారు; ఇలాంటి మోకును ఆ ప్రాంతంలో పొటొంజిమోకు, మొగమోకు అని చిరతలులేని మోకుకు అడమోకు అని వ్యవహరిస్తారు. చూ. చిత్రం 129. (కో. 30).

మొగి: 1. పర్యా. చూ. వెదురుకొమ్ము. వెదురు మొలక; జేనెడు పొడుగునుంచి మూరెడుపొడుగు దాకా నిటారుగా కోసుగా పెరిగింది; ముట్టుకుంటే విరిగిపోయేటట్లు మెత్తగాఉంటుంది; దీనికి ఆకులూ రెమ్మలూ ఉండవు; మామూలుగా వెదురు దుంపలోంచిగానీ నరకగా మిగిలినగడ కణుపులోంచిగానీ పుడుతుంది; (మూడునాలుగు రోజుల వయుస్సులో) లేతగా ఉన్నప్పుడు దీని పైపొర తీసేసి లోపలిభాగాన్ని కూర వండుకుంటారు; చూ. చిత్రం 3. (తె. 22, 23, 26); 2 ఈతచెట్టుకు పెరిగే నడిమిచిగురు; లేతగా ఉంటుంది. (తె. 26).

మొగిలిఊడ పర్యా. చూ. మొగిలినార. మొగిలి ఊడలనుంచి తీసిన నార; ఊడలు కోసుకొచ్చి తీగలుతీస్తారు; చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (తె. 4; రా. 9).

మొగిలితడప: పర్యా. చూ. మొగిలినార. మొగిలి ఊడలనుంచి తీసిన నార; ఊడలు కోసుకొచ్చి తీగలుతీస్తారు; చేట మొ॥ వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (కో. 21, 25).

మొగిలితీగ: ఉ. మొగిల్తీగ; పర్యా. చూ. మొగిలినార. మొగిలి ఊడలనుంచి తీసిన నార; ఊడలు కోసుకొచ్చి తీగలుతీస్తారు; చేట మొ॥ వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (తె. 4; రా. 8).

మొగిలినార: ఉ. మొగిల్నార; పర్యా. తీగ (4), నార (3) మొగిలిఊడ; మొగిలితడప, మొగిలితీగ, మొగిలిపట్టా మొగిలిఊడలనుంచి తీసిన నార; ఊడలు కోసుకొచ్చి తీగలుతీస్తారు; చేట మొ॥వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (కో. 17, 20, 22, 23).

మొగిలిపట్టా: పర్యా. చూ. మొగిలినార. మొగిలి ఊడలనుంచి తీసిన నార; ఊడలు కోసుకొచ్చి తీగలుతీస్తారు; చేట మొ॥ వాటికి కట్లుకట్టడానికి పనికొస్తుంది. (కో. 2).

మొగ్గగనె: పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్న చిల్ల(కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (తె. 20).

మొచ్చుపిడి: పర్యా. చూ. కాడ (1). పేవరికత్తి, దునకత్తి మొ॥ పట్టుకొనే కిడ్డీలాంటిభాగం, కొన్నిటికి కాడమాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16 క, 1. (రా. 1).

మొజ్జు: చూ. మొద్దు (1). (కో. 27).

మొజ్జుకర్ర: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒక రకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీనిలోపల బొంద ఏర్పడుతుంది; తల మొండిగాఉంటుంది. (కో. 29).

మొట్టు: 1. పర్యా. చూ. మొద్దు (3). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకు తగిలి మొక్కపోకుండా బద్దఅడుగున ఎత్తుపెట్టే మూరెడుపొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలిపిక్కంతలావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తికరిపించి దానిమీద కొట్టడానికికూడా వాడతారు. (తె. 28); 2. చూ. మెట్టు (1). (తె. 31).

మొట్టై: 1. పర్యా. చూ. బొడ్డె (3). విసనగర్ర గొట్టం (=కాడకు తొడిగింది) జారిపోకుండా కాడచివర ఉబ్బెత్తుగాఉండే భాగం; వెదురుబద్ద కణుపును చెక్కకుండా ఉబ్బెత్తుగా విడిచిపెడతారు. చూ. చిత్రం 31 త. 3. (తె. 8); 2. పర్యా. చూ. ఈతమట్ట(2). ఈతచెట్టు కాండానికి (బోదె) అంటుకొని ఉన్న కమ్మ మొదటిభాగం; రెండు మూడు వేళ్ళవెడల్పూ వేలెడు మందమూ ఉంటుంది; మొదట వెడల్పుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; నరికినప్పుడు కొన్నిచోట్ల చెట్టుకే మిగిలిపోతుంది. (తె. 13).

మొదుపు: చూ. మదుపు. (రా. 1).

మొద్దోస: పర్యా. చిలువుటాసం; చెంద్రిక (చూ.) తడక నిలువంచులకు తొడిగిన వెదురుకర్ర; కొన్నిచోట్ల సన్నటిది తొడుగుతారు. (రా. 6).

మొంచె: ఉ. నుంచె; రూ. ముంచె, మొరిచె;

పర్యా. బొమ్మచేట, మొంటెచేట. ఒకరకం చిన్న చేట; చిన్నవాళ్ళు అల్లికంపని నేర్చుకోడానికి ఇలాటివి అల్లుతారు; దీంతో పిల్లలు ఆడుకొంటూరు. (తె. 3, 4, 6, 9, 10, 13-16, 19, 21-24, 26, 30, 31; రా. 10).

మొంటెచేట: ఉ. —శాట; పర్యా. చూ. మొంటె. ఒకరకం చిన్నచేట; చిన్నవాళ్ళు అల్లికంపని నేర్చుకోడానికి ఇలాటివి అల్లుతారు; కొన్నిచోట్ల పేడుకు రంగులువేసి అల్లుతారు; దీంతో పిల్లలు ఆడుకొంటూరు. (తె. 31).

మొండకఱ్ఱ: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేత మొక్కగా ఉన్నప్పుడు కొండ ముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; దీనిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (కో. 30).

మొండికత్తి: 1. అరగడంవల్ల పదునుపోయిన కత్తి; దీన్ని సానరాయిమీద నూరుతారు. (కో. 22, 25); 2. రాయి తగలడంవల్ల మొక్కపోయిన కత్తి. (కో. 11).

మొండికఱ్ఱ: పర్యా. మోడు(1). వెదురుగడ నరికేసినప్పుడు పొదకు మిగిలిన మొదలు; సుమారు నాలుగు మూరలుంటుంది; పెరుగుదల ఉండదు; కణుపుల చుట్టూ విరివిగాకొమ్మలు వేస్తుంది. (కో. 22, 24).

మొండిపోవు: (క్రి.) ఉ. మొండివోవు; పర్యా. చూ. మొక్కపోవు. రాళ్ళుగాని గట్టివస్తువుగాని తగిలినప్పుడు మేదరికత్తికి పదునుపోయి మొండిగా కావడం లేదా పదునున్న అంచువెనక్కి వంగిపోవడం. (కో. 11).

మొండిబొంగు: పర్యా. చూ. కొండెంగమొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండముచ్చులూ కోతులూ తలకొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడుగజాల పొడుగుంటుంది; దీని లోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది. (తె. 26).

మొండె: పర్యా. చూ. వెన్ను(4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 ద. 3. (రా. 7).

మొండెం: పర్యా. చూ. కాడ(1). మేదరికత్తి, చురకత్తి మొ॥ పట్టుకొనే కర్రలాంటి భాగం; కొన్నిటికి కాడ మాదిరిగానూ కొన్నిటికి తొడిమె మాదిరిగానూ ఉంటుంది; కొన్నిటికి లావుగా ఉంటుంది. చూ. చిత్రం 16. క. 1. (కో. 31).

మొత్త: 1. కణుపు కిందికి నరికిన వెదురుగడలో కణుపు కింద ఉన్న వేలెడు వెడల్పుభాగం (కో. 22); 2. గుడిసె, పూరిల్లు మొ॥ వాటి గుమ్మానికి పక్కన ఉండే గుంజ పొడుగు గోడ; గుమ్మానికి రెండు పక్కలా ఉంటాయి (తె. 8); 3. బండిజల్ల, ఊక జల్ల మొ॥ వాటికి వెనకవైపు తెరిచి ఉన్న భాగం (తె. 31); 4. పర్యా. చూ. గలుమ. కోళ్ళ గూడు లోకి కోళ్ళను వేయడానికి పెట్టినకంత. చూ. చిత్రం 65 ప. 3. (తె. 30(.

మొత్తతడక: ఉ.—తడికె, - తడ్క, 1. పర్యా. చూ. వాకిలితడక(1). గుమ్మానికిఅడ్డంగా తలుపుమాదిరిగా పెట్టే వెదురుతడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ వేస్తారు (తె. 8, 14); 2. పర్యా. చూ. గలుసుతడక. కోళ్ళగూడు కంతను మూసే చిన్న వెదురుతడక; సుమారు జేనెడేసి పొడుగూ వెడల్పూ ఉంటుంది. చూ. చిత్రం 65 ప. 4 (తె. 30).

మొదటి ఆకు: ఈతమట్ట (మండ) మొదటిభాగం నుంచి తీసిన ఆకు; చాప అల్లకానికి పనికొస్తుంది (తె. 26).

మొదటి క్వాలిటీ: పర్యా. చూ. ఫస్ట్‌క్లాస్ బొంగు. 12 నుంచి 15 సెం. మీ. వరకు లావుండే మేలిరకం వెదురుగడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుకలోకి వచ్చిన పేరు (తె. 9).

మొదటిరకం బొంగు: పర్యా. చూ. ఫస్ట్‌క్లాస్ బొంగు. 12 నుంచి 15 సెం. మీ. వరకు లావుండే మేలిరకం వెదురుగడ; గాదె, జల్ల, తడక మొ॥ అల్లడానికి పనికొస్తుంది; వ్యాపార పరంగా వాడుకలోకి వచ్చిన పేరు (తె. 7, 8).

మొదలు: ఉ. మొదల్, మొదల, మొదాలు, మొదులు. 1. పర్యా. సదరు, బుడం (1), మొదలుపిచ్చ; మోదె, వలం (1). వెదురుగడ మొదటి భాగం; వేళ్ళకు పైది; కొసకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 4.2. (కో. 1-31; తె. 1, 2-10; 13-17, 19-31; రా. 2-6, 8-10); 2. వెదురుగడ మూడు ముక్కలుగా నరికితే వచ్చే మొదటి భాగం; లావుగా మూడు నాలుగు గజాల పొడుగుంటుంది; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (కో. 27); 3.

పర్యా. చూ. తల (1). ఒకరకం మేదరి కత్తికి వెడల్పు భాగం చివర (కో. 25): 4. పర్యా. చూ. మడిమె (3). మేదరికత్తి కొడకొన (తె. 13, 15); 5. పర్యా. చూ. పడగ (1). అంబు (చూ.)కు వెడల్పుగా ఉన్న భాగం; పాము పడిగె, బరిసె మొ॥ వాటి మాదిరిగా త్రిభుజాకారంలో ఉండే బిళ్ళ; కొన్నిటి అంచులకు పదునుంటుంది; పేడు తెంపడానికీ చిల్లులు పొడవడానికీ పనికొస్తుంది; కొన్ని మొనదేలి ఉంటాయి; కొన్ని మొండిగా ఉంటాయి; కాడ కొనతో చిల్లులు పొడవడానికి దీన్ని పిడిలా పట్టుకొంటారు (కో. 7); **6.** ఉలికి పిడి కిందిభాగం; లావుగా ఉంటుంది. చూ. చిత్రం 20 క. 3 (తె. 15); **7.** పర్యా. బుడం (2). ఈత బరిగె మొదటిభాగం; కొస కన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 11.1 (కో. 3, 25; తె. 9, 13, 16); **8.** పర్యా. బుడుసు. ఈతాకు మొదటిభాగం; కొసకన్న వెడల్పు ఎక్కువగానూ మధ్యభాగం కన్న వెడల్పు తక్కువగానూ ఉంటుంది; ఇది వేలెడు వెడల్పు కన్న తక్కువగానూ ఉంటుంది. చూ. చిత్రం 115.2 (తె. 19, 21,22); **9.** కొబ్బరి దొక్కలు చితగ్గొట్టే దుక్క (చూ.)కు లావుగా ఉండే భాగం (కో. 23); **10.** తాటేకు (రేకు) మొదటి భాగం; చివరి భాగం కన్న కొంచెం వెడల్పుగా ఉంటుంది. చూ. చిత్రం 124.2 (కో. 23, 26); **11.** తాటి ఈనె మొదటి భాగం (కో. 12); **12.** పేముకర్ర దిగువ భాగం; పొద నుంచి నరికినది; లావుగా ఉంటుంది. (కో. 3); **13.** తుంగపోచకు లావుగా ఉండే కింది (మొదటి) భాగం. (కో. 8, 30; రా. 10).

మొదలుపిచ్చ: పర్యా. చూ. మొదలు (1). వెదురుగడ మొదటిభాగం; పేళ్ళకుపైది; కొసకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 4. 2. (రా. 1).

మొదలుపోటుకర్ర: **1.** పర్యా. బొంగుకర్ర, మొదలుపోటు కొయ్య, సారిగొయ్య. వెదురుగడలో మొదలున్నభాగం; లావుగా రెండుబారల పొడుగుంటుంది. (కో. 10, 21); **2.** పర్యా. చూ. గట్టిబొంగు (1). లోపల ఏమాత్రం బోలులేకుండా పూర్తిగా కండ పట్టిఉన్న గట్టి వెదురుకర్ర; సుమారు మూడు నాలుగంగుళాల లావు ఉంటుంది: అల్లకానికి పనికిరాదు; నిచ్చెనమెట్టు; గుతిపకర్ర, గైకట్టె; మంచం పట్టె మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 21).

మొదలుపోటుకొయ్య: పర్యా. చూ. మొదలుపోటుకర్ర(1). వెదురుగడలో మొదలున్నభాగం; లావుగా రెండుబారల పొడుగుంటుంది. (కో. 23).

మొదలుబద్దమేదరి: వెదురుగడని మొదలున్న వైపు నుంచి చీరే అచారమున్న మేదరి. (తె. 30).

మొదలుబొంగు: ఉ. మొదలు—; పర్యా. చూ. ఎగదండు. చాపనేతపగ్గం మొదటిభాగంలో (_నేత పనివాడు కూర్చొనేవైపు) అమర్చిన లావాటిపలక; పోగులను లాగిపట్టిఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూపోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులను దూర్చి దిగదండుకు కడతారు;రంధ్రాలుండని పలకకు దారం కొలకులుగాని పొడుగాటి ఇనపచువ్వగాని తొడుగుతారు. చూ. చిత్రం 120 చ. 2. (కో. 8).

మొదలుమెట్టబొంగు: మొగలు గట్టిగానూ బోలు తక్కువగానూ ఉండి పోనుపోను బోలు ఎక్కువగా ఉండే లావుపాటి వెదురుగడ; నిచ్చెన, మంచం మొ॥ వాటికి ఉపయోగం. (తె. 17).

మొదలువేయు: (క్రి.) ఉ. మొదలేయు; పర్యా. చూ. అనివేయు (1). చేట, విసనకర్ర అల్లకం ఆరంభంలో కొమ్ము (చూ.)కు రెండుగాని మూడుగాని నాలుగుగాని (అల్లకం విధానాన్నిబట్టి) పేళ్ళు ఎక్కించి అల్లకం మొదలుపెట్టడం. (కో. 7).

మొదలువేరు: ఉ. మొదలేరు; పర్యా. చూ. తల్లివేరు. వెదురుమొక్క దుంపనుంచి పారిన పెద్ద వేరు; లావుగా పొడుగ్గా ఉంటుంది; నేల లోపలికి చాలాదూరం పారుతుంది; దీన్నుంచి సన్నటిదారాల్లా పిల్లవేళ్ళు పుట్టుకొస్తాయి. (కో. 27).

మొదెంగడ్డి: ఒకరకం గడ్డిమొక్క; దీనికి ప్రతి కణుపుదగ్గరా ఒక గడ్డిపోచ, ఆ పోచ కణుపుదగ్గర ఇంకోపోచ చొ॥న మొలుస్తాయి; కొయ్యకముందు పచ్చగాను ఎండినతరవాత గోధుమరంగులోను ఉంటుంది; దీంతో చీపుళ్ళు కడతారు. (తె. 21).

మొదెంచీపురు: ఉ.—శీపురు; ఇల్లు ఊడ్చుకోడానికి మొదెంగడ్డితో కట్టిన చీపురు. (తె. 21).

మొద్దీనె: (< మొద్దు + ఈనె) **1.** పర్యా. చూ. లావీనె (1). మామూలుకర్ర (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండేకర్ర; గంప మొ॥ వాటి అల్లకంపనిలో ఎత్తుగావచ్చే భాగం అల్లడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (తె. 31); **2.** పర్యా. చూ. పెండెవార బుట్ట, తట్ట, గంప మొ॥ వాటి అల్లకంపనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ.)కర్ర;

సీమలో సగం వెడల్పూ కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (తె. 31).

మొద్దు: 1. రూ. మొజ్జు; పర్యా. కొయ్య (1). వెదురుగడ నరికేసినప్పుడు పోవకు మిగిలిన మూరెడు జేనెడు పొడుగుముక్క; ఇది ఎండి పోతుంది లేదా దీని కణుపులోంచి ఇంకోకొమ్మ పుడుతుంది. (కో. 22); 2. పర్యా. చూ. వెన్ను (4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 ఢ. 3. (తె. 2); 3. పర్యా. కాటుదుంప, కాటుమొద్దు, కాలికింద దుక్క, కాలికింది మొద్దు, కొరడు, కొరడుమొట్టు, కొరడు మొద్దు, తుండు, దుక్క (1), దుంగ, దుంప (2), పీట(2), మొట్టు(1). వెదురుబద్దగాని పేడుగాని నరికేటప్పుడూ చీరేటప్పుడూ కత్తి నేలకుతగిలి మొక్కపోకుండా బద్ద అడుగున ఎత్తుపెట్టే మూరెడు పొడుగు కొయ్యమొద్దు; మామూలుగా తుమ్మమొద్దు; కాలి పిక్కంత లావు ఉంటుంది; వెదురుగడ పగలగొట్టడానికి గడకు కత్తి కరిపించి దానిమీద కొట్టడానికి కూడా వాడతారు. (కో. 8; తె. 1-5, 8, 10, 12-14, 16; రా. 5, 6, 9); 4. అవసరానికి తగినట్లు పేముకర్రను వంచుకోడానికి కర్ర పట్టేటంత బెజ్జమున్న కొయ్యమొద్దు. చూ. చిత్రం 184. (తె. 22).

మొద్దుకత్తి: పేముకర్ర కణుపులు చెక్కేకత్తి. (కో. 3).

మొద్దుగనె: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మ లావుగా ఉండడం వల్లగాని ఒకేచోట రెండుమూడుకొమ్మలు పెరగడం వల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపున్న వెదురుగడను చీల్చడం కష్టం. (తె. 23-25).

మొద్దుగనెబొంగు: పర్యా. చూ. చిన్న గనుపుకర్ర. వెదురుకొమ్మ నరికేసినప్పుడు కణుపుదగ్గర పద్ద గుర్తు వెడల్పుగా ఉన్న వెదురుగడ; కణుపుదగ్గర పెరిగిన కొమ్మ లావుగా ఉన్నప్పుడుగాని కణుపు దగ్గర చుట్టూ రెండుమూడు కొమ్మలు పెరిగినప్పుడు గాని వాటిని నరికేస్తే వెడల్పుగా గుర్తుపడుతుంది; ఈ బొంగును చీల్చడం కష్టం; కణుపుదగ్గర పేడు విరిగిపోతూంటుంది (తె. 23).

మొద్దుబారుపడిపోవు: (క్రి.) ఉ. మొద్దారడిపోవు; పర్యా. చూ. బండవు. కత్తి మొ॥వాటి పదును పోవడం.

మొద్దుపేడు: పర్యా. చూ. మందంపేడు. గోరు మందంకన్న ఎక్కువ మందంగానూ, కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 31).

మొద్దువిసనగర్ర: ఉ. మొద్దిసినకర్ర; పర్యా. చూ. సాదా విసనగర్ర. పట్టుకొనే కాడకు గొట్టంగానీ లోపల పువ్వుల డిజైన్లుగానీ లేకుండా మామూలుగా అల్లిన విసనగర్ర. (కో. 6, 7, 10).

మొన: 1. పర్యా. చూ. ముక్కు(1). కత్తికి (మేదరి కత్తి, పెద్దకత్తి, చిన్నకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచు చివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రాలు 12 జ. 3, 16 చ. 5. (కో. 3, 5, 6, 10, 12, 13, 19, 25, 28, 30; తె. 17; రా. 5, 10, 11); 2. పర్యా. కొన(4), పదును(2), సూది(2). ఒకరకం అంబు (చూ.) కాడకొన; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 15 చ. 3. (కో. 3, 8, 10, 12, 13; తె. 31; రా. 5, 11); 3. పర్యా. చూ. కూలు(2). ఒకరకం అంబు(చూ.) మొనదేలి ఉండే కాడ; సుమారు రెండుబెత్తల పొడుగూ చిటకెనవేలెడు లావూ ఉండి గుండ్రంగా ఉంటుంది; చేటలు మొ॥వాటికి కట్టు కట్టేటప్పుడు దీంతో చిల్లులు పొడుస్తారు. చూ. చిత్రం 15 క. 1. (కో. 6); 4. పర్యా. చూ. ముక్కు(2). అంబు (చూ.) పడగచివరి కోసు. చూ. చిత్రం 15 క. 2. (తె. 15; రా. 7, 10); 5. పర్యా. కొన(6). కొడవలికి కోసుగా ఉన్నభాగం. చూ. చిత్రం 13 చ. 5. (రా. 10); 6. జమ్ముకత్తి చివరకోసుగా ఉన్న భాగం. (రా. 10.); 7. రూ. మన; పర్యా. చూ. ముక్కు(3). ఎరకలికత్తి (కొడవలి) పదునుభాగం కొన; కోసుగా ఉంటుంది. (తె. 7; రా. 8).

మొరిటె: ఉ; మొరిట; చూ. మొంటె. (కో. 5; రా. 10).

మొల: పర్యా. సీల. చిన్న ఆనపమేకు. (తె. 14).

మొలకత్తి: ఈతచెట్టునుంచి మొగినుంచి మట్టలు కోసే కత్తి; మామూలుగా దీన్ని పొడుగాటి కట్టెకు అమరుస్తారు; చూ. గైకొడవలి. (తె. 9).

మొవ్వ: ఈతచెట్టు తలభాగం; మొవ్వు. (కో. 25).

మొవ్వ: పర్యా. చూ. వెదురుకొమ్మ. వెదురుమొలక; జేనెడు పొడుగునుంచి మూరెడు పొడుగుదాకా నిటారుగా కోసుగా పెరిగింది; ముట్టుకుంటే విరిగి పోయేటట్లు మెత్తగా ఉంటుంది; దీనికి ఆకులూ రెమ్మలూ ఉండవు; మామూలుగా వెదురుదుంప లోంచిగాని నరకగా మిగిలిన గడ కణుపులోంచి గాని పుడుతుంది; (? మూడునాలుగు రోజుల వయస్సులో) లేతగా ఉన్నప్పుడు దీని పైపొర తీసేసి లోపలిభాగాన్ని కూర వండుకుంటారు; చూ. చిత్రం 3. (కో. 22).

మొనం: పర్యా. చూ. ముక్కు(1). కత్తికి (మేదరి కత్తి, పెద్దకత్తి, చురకత్తి మొ॥) పదునుగా ఉన్న అంచుచివరిభాగం; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రాలు 12 ఇ. 3, 16 చ. 5. (కో. 19, 23, 31).

మోకు: 1. పర్యా. కందాడు, జిర్తాడు, బండిపగ్గం, బండిమీద బరువు (గడ్డిదొప్ప మొ॥) పేర్చినప్పుడు కిందపడకుండా బిగించి కట్టేలాంటి కొబ్బరితాడు; నాలుగుపేటలుగా పేంతారు; పన్నెండు బారలనుంచి ముప్పై బారలవరకు పొడుగుంటుంది. (కో. 5, 20); 2. పర్యా. పోటొంటిమోకు, మొగమోకు. దున్నే టప్పుడు నాగలికి కాడిని కలిపికట్టే కొబ్బరితాడు; ఇది మామూలు లావుంటుంది; కొన్ని ప్రాంతాల్లో ఈతాడు రెండుచివర్లా చిరత (=చిన్నకర్ర ముక్క)లు తొడిగి ఒక చిరతకు పోటొంటి (=వలయాకారంగా పేనిన తాడు)ని తగిలిస్తారు; పోటొంటి రెండోచివరను నాగలి మేడికి తగిలిస్తారు. ఇలాంటి మోకును ఆప్రాంతంలో పోటొంటిమోకు, మొగమోకు అని, చిరతలు లేని మోకును ఆడ మోకు అనీ వ్యవహరిస్తారు. చూ. చిత్రం 128.

మోంచ్చువ్వ: ఉ. మోన్చుసువ్వ; అడవిలో పెరిగే ఒకరకం చెట్టుచువ్వ (బరిగె); నాలుగు పలకలుగా ఎర్రరంగులో ఉంటుంది. (తె. 7).

మోటబద్ద: మామూలు వెదురుబద్దంత వెడల్పు బద్దమందంలో సగమూ ఉండే పేడు; గాదెల అల్లకానికి ఉపయోగం. (కో. 30).

మోటమోకు: బావిలోంచి పొలానికి నీళ్ళుతోడే పెద్ద బొక్కెనకు కట్టేతాడు; లావుగా ఉంటుంది; ఐదు లావాటి తాళ్ళతో దీన్ని పేనతారు. (తె. 9).

మోటతాడు: (హిం. మోటా —) కొంచెం లావుగా పేనిన కొబ్బరితాడు. (కో. 29).

మోటీనె: పర్యా. చూ. బెండుపేడు(1). వెదురుగడలో బోలుగా ఉన్న భాగంనుంచిగాని వెదురుబద్ద పల్లపు భాగంనుంచిగాని తీసిన పేడు; అంత సున్నితంగాగాని గట్టిగాగాని ఉండదు. (కో. 28).

మోటు: (<హిం. మోటా) 1. పర్యా. చూ. దొడ్డు బొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటి భాగంలోనూ మూడంగుళాలు కొన భాగం లోనూ లావుంటుంది; బండి జల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది (కో. 10, 16); 2. పర్యా. చూ. అదితి(1). వెదురుగడల అమ్మకం జరిగే చోటు; అడవినుంచి తెచ్చి ఇక్కడ అమ్ము తారు (తె. 30); 3. అతుకు (తె. 1).

మోటుకర్ర: పర్యా. చూ. కొండెగ మొట్టు. ఒకరకం వెదురుగడ; లేతమొక్కగా ఉన్నప్పుడు కొండ ముచ్చులూ కోతులూ తల కొరికేయగా పెరుగుదల ఆగిపోయినది; పొట్టిగా సుమారు మూడు గజాల పొడుగుంటుంది; గీసిలోపల బొందు ఏర్పడుతుంది; తల మొండిగా ఉంటుంది (కో. 4, 10).

మోటుగనె: పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు కని పించే వెడల్పు గుర్తు; కొమ్మ లావుగా ఉండడం వల్ల గాని ఒకేచోట రెండు మూడు కొమ్మలు పెర గడం వల్ల గాని వాటిని నరికినప్పుడు పెద్ద గుర్తు పడుతుంది; ఇలాంటి కణుపు ఉన్న వెదురుగడను చీల్చడం కష్టం (తె. 21).

మోటుగనె బొంగు: పర్యా. చూ. ముల్లెం (పు) బొంగు. వెదురు గడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంతలావు నుంచి స్తంభం లావువరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగపడదు; నిచ్చెన బండిదండి (తొట్టిగడ, ఇంటివాసం మొ॥ వాటికి పనికొస్తుంది; ఎక్కువ కాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపుల దగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టి పడు తుంది కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కు వగా కొండలు, గట్లు మొ॥ వాటిమీద మొలుస్తుంది (తె. 21).

మోటు చాప: ఒకే పొరగా మందంగా నేసిన జమ్ము చాప (రా. 10).

మోటు తడక: పర్యా. దలం తడక, దొడ్డు తడక, దొడ్డుపేడు తడక, పలుకు (ల) తడక. మందం గానూ బద్ద వెడల్పుగానూ ఉన్న పేడుతో (మోటుగా) అల్లిన తడక; నిలువుకూ అడ్డానికీ పేడే వాడతారు

(కో. 12; తె. 3).

మోటు విసనగర్ర: ఉ. —విసినకర్ర; పెద్ద (మోటు) పేళ్ళతో అల్లిన విసనగర్ర. (కో. 12)

మోట్టుగోటు: పర్యా. గోటు (1). చేట మొ॥ వాటి అల్లకంలో మూలపులిపి అల్లినతరువాత మిగిలిన పేళ్ళను కత్తితో కోసెయ్యటం లేదా లోపలికి దోపడం. (రా. 11).

మోడా: (హిం.) ఉ. మోడ; పర్యా. కోండె. వీధుల్లో తిరుగుతూ బుడబుక్కలవాళ్ళు అమ్మేవాళ్ళు పళ్ళెం పెట్టుకొనే స్టాండు; కడ్డీలాంటి వెదురుబద్దలు కూర్చి కడతారు; తిరిగేటప్పుడు దీన్ని చంకలో పెట్టుకొంటారు; చూ. చిత్రం 11. (కో. 5).

మోడు. 1 పర్యా మొండ్రు. వెదురుగడ నరికేసినప్పుడు పోయిన మిగిలిన మొదలు; సుమారు నాలుగు మూరలుంటుంది; పెరుగుదల ఉండదు; కణుపుల చుట్టూ విరివిగా కొమ్మలువేస్తుంది. (కో. 22); 2. వెదురుమొక్కకు భూమిలో అడుగున ఉన్న దుంప; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; వెదురుగడ నరికినతరువాత ఈ కణుపుల్లోంచి పిలకలువేసి వెదురుపొద అవుతుంది; చుట్టూ వేళ్ళుకూడా ఉంటాయి. (కో. 24).

మోడె: పర్యా. అండ. వెదురుగడల మొదళ్ళు మట్టగించి ఒకచోటచేసిన నూరుగడలకుప్ప. (తె. 23).

మోతికర్ర: పర్యా. చూ. వంకకర్ర (1). పాము పడగమాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8. చ. (తె. 9).

మోదు: (క్రి.) 1. చూ. బోదు (2); పర్యా. ఓడించు. జల్లెడ అల్లకంలో అడుగు (చూ.) మీద లోపలిగుండు, బయటిగుండు ( చక్రంలా గుండ్రంగా చేసిన బద్దలపెట్టె) పెట్టి అడుగుచివర్లను ఆ రెండు గుండ్లమధ్య ఇరికిస్తూ, ఆ మూడింటినీ కలిపి కట్టుమంగు (=పలచటిపేడు లేదా తీగ)తో చిన్నకట్లువేయడం. (కో. 8, 13, 15-18); తె. 6); 2. పర్యా కుంచు మంతు ( - అంచుకట్టని చేట)కు చేటరూపం రావడానికి అంచు కట్టేటప్పుడు చేతులతో దగ్గరికివంచడం (కో. 13); 3. చేట వెనకపక్క అంచుకు లోపలి ట్టూ బయటినట్టూ (=బద్దలు), కర్రా (చూ.) వేసి ఆ మూడింటికీ కలిపి కట్టుమూదు ( పలచటిపేడు లేదా తీగ)తో చిన్న కట్టుకట్టడం. (కో. 10, 15).

మోదుగట్టు: పర్యా. చిన్నకట్టు, టూకు. జల్లెడలట్టు మీద గుండు (= గుండ్రంగా కట్టిన బద్ద)పెట్టి దాని చుట్టూ ఫట్టుపెట్టు వంచి ఆ గుండుచుట్టూ వెలుపలినుంచి మరో బద్దపెట్టి ఆ మూడింటినీ కలిపి బిగిస్తూ కట్టుమంగుతో వేసిన చిన్నకట్టు. (కో. 13, 15-18).

మోదుగచువ్వ: మోదుగచెట్టు నుంచి తీసినచువ్వ (బరిగె); తెలుపురంగులో ఉంటుంది; ఎర్రటిపూలు పూస్తుంది. (తె. 7).

మోపె: పర్యా. చూ. మొవలు (1). వెదురుగడ మొవటిభాగం; వేళ్ళకు పైది; కొనకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 4.2 (తె. 18).

మోపు: 1. పర్యా. చూ. కట్ట (1). ఒకచోటికి చేర్చి కట్టిన వెదురుగడలు లేదా వెదురుబద్దలు; ఒకమనిషి మోయడానికి వీలయినవి. (కో. 2, 24, 28; రా. 2); 2. పర్యా. చూ. కట్ట(2). కొన్ని ఈత చువ్వ (బరిగె)లు కలిపికట్టినది. (తె. 7, 13, 14; రా. 8); 3. మోసుకుపోడానికి వీలుగా కట్టినకట్ట; గడ్డి, వెంపలిమొక్కలు కట్టెలు మొ॥వి ఇలా కడతారు. (తె. 21); 4. చిన్నచిన్న జమ్ము కట్టలను కలిపికట్టిన పెద్దకట్ట. (రా. 6); 5. పర్యా. బండ. జమ్ముపోచల కట్ట. (రా. 2); 6. కొన్ని నారపీళ్ళ (చూ. పీడి) కట్ట. (తె. 9); 7. (క్రి.) పర్యా. మోపుచేయు. వెదురుగడ రెండుబద్దలుగా చీరడానికి దిగువ గాటుపెట్టి దాంట్లో కత్తిదూర్చి నిలపడం. (కో. 27).

మోపుచేయు (క్రి.) పర్యా. మోపు (7). వెదురుగడ రెండుబద్దలుగా చీరడానికి దిగువ గాటుపెట్టి దాంట్లో కత్తిదూర్చి నిలపడం. (కో. 20).

మోర: కొబ్బరికాయ పైభాగం. (కో. 29).

మోరతాడు: బండిచోలుపునుంచి వోలుగర్ర కిందుగా కాడివరకు వచ్చిన తాడును కాడికి కలిపికట్టే చిన్న తాడు; ఏ నారతో అయినా పేనవచ్చు. (తె. 9).

మోర్కట్టె: పర్యా. చూ. వంకకర్ర (1). పాముపడగ మాదిరిగా మొదలు వంపుదిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ. (తె. 7).

మోలు: పర్యా. ఓలి. పిల్లనిచ్చినందుకు పెళ్ళికూతురి (కన్య) తండ్రికి ముట్టజెప్పే రొక్కం; కన్యాశుల్కం; ఈ ఆచారం మేదరివాళ్ళలో పూర్వం ఉండేది. (రా. 8).

మోపుకమ్మ: లేత తాటికమ్మ; మామూలుగా ముదర విడనిది; కొన్నిచోట్ల గజం వెడల్పు మువ్వాతిక గజం పొడుగూ ఉంటుంది. (కో. 12).

మోసరగా: (క్రి. విణ.) మోస్తరుగా, మాదిరిగా (కో. 8).

మోసు: 1. పర్యా. చూ. వెదురుగడ్డ. వెదురుగడకు భూమిలోపల వేళ్ళతోసహా ఉన్న దుంప; వెదురు గింజ భూమిలో పడినతరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ, లావుగానూ ఉంటుంది; దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లివేరూ కొన్ని పిల్లవేళ్ళూ భూమిలోకి పారతాయి. (కో. 1); 2. పర్యా. చూ. వెదురుకొమ్ము. వెదురుమొలక; జేనెడుపొడుగు నుంచి మూరెడు పొడుగుదాకా నిటారుగా కోసుగా పెరిగింది; ముట్టుకుంటే విరిగిపోయేటట్లు మెత్తగా ఉంటుంది; దీనికి ఆకులూ రెమ్మలూ ఉండవు; మామూలుగా వెదురుదుంపలోంచిగాని నరకగా మిగిలిన గడ కణుపులోంచిగాని పుడుతుంది; (మూడు నాలుగురోజుల వయస్సులో) లేతగా ఉన్నప్పుడు దీని పైపొర తీసేసి లోపలి భాగాన్ని కూర వండుకుంటారు; చూ. చిత్రం 3. (రా. 2, 4); 3. పర్యా. చూ. నడికర్ర. ఒకనెల నుంచి మూడునెలల వరకు వయస్సుగల లేత వెదురుకర్ర; దీన్ని చీరి చేట, జల్లెడ మొ॥వాటికి కట్లు కట్టడాని కవసరమయ్యే తీగ (చూ.) లు తియ్యడానికి పనికొస్తుంది. (కో. 11).

## య

యాటు: మాంసాహారుల కుపయోగపడే జంతువు; గొర్రెగాని మేకగాని; కొన్ని సందర్భాల్లో దీన్ని బలి ఇస్తారు. (తె. 1, 4, 7).

యూనె: చూ. ఈనె (1). (కో. 26, 28).

యూర్నాలపెట్టె: పెళ్ళిబట్టలు మొ॥వి పెట్టే వెదురు పేళ్ళ పెట్టె. (కో. 10).

యూర్నాలబుట్ట: పెళ్ళిలోవాడే బొట్టు, పసుపు మొ॥ ఉంచేందుకు ప్రత్యేకంగా అల్లిన వెదురుపేళ్ళ గంప. (కో. 8).

యేన: చూ. ఈనె (1). (కో. 22).

## ర

రంగంగాటు: (< Rangoon- ) ఒకరకం కోళ్ళ గూడు; కోళ్ళను కమ్మడానికి వాడేది; దీనికి డిజైన్లు ఉంటాయి; బర్మాలోని రంగూన్ (రంగం)నుంచి వచ్చిన నమూనా కావచ్చు. (కో. 15).

రంగు అద్దు: (క్రి.) తుంగపోచలకు రంగువేయడం; రంగునీళ్ళలో ఉడకబెడతారు. (కో. 8).

రంగుచాప: ఉ.- సాప; పర్యా. కలర్‌చాప. (తుంగ) పోచలకు రంగులద్ది డిజైన్లువచ్చేటట్లు నేసిన చాప. (రా. 10).

రంగుతడక: ఒకరకం పుల్లలతడక (చూ.); పుల్లలకు రంగువేసింది. (కో. 12).

రంగుపట్టు: (క్రి.) రంగు అంటడం; రంగునీళ్ళు పాకానికి వచ్చినతరవాత తుంగపోచలకు రంగు అంటుతుంది. (కో. 8).

రంగులపంకా: ఉ.—పంక; పర్యా. రంగువిసనగర్ర; రంగురంగుల డిజైన్లువచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (తె. 14, 17).

రంగువండు: ఉ. –వొండు; జమ్ముకు రంగు అద్దడానికి జమ్ముపోచలు వేసిన నీళ్ళల్లో రంగుకలిపి ఉడకబెట్టడం. (రా. 2).

రంగువిసనగర్ర: ఉ. రంగిసనకర్ర, రంగిస్నగర్ర; పర్యా. రంగులపంకా. రంగురంగుల డిజైన్లు వచ్చేటట్లు అల్లిన విసనగర్ర. (కో. 12; తె. 26, 31, రా. 6).

రథం: శవాన్ని కూర్చోబెట్టి తీసుకువెళ్ళడానికి కట్టిన వాహనం. చూ. చిత్రం 97. (కో. 2)

రద్దుకాయితాలబుట్ట: పర్యా. చూ. కాయితాలబుట్ట. చిత్తుకాగితాలు వేసుకోడానికి వాడేబుట్ట; కొన్ని చిన్నబొక్కెన ఆకారంలోనూ కొన్ని మైలబుట్ట ఆకారంలోనూ (దీనికి కాళ్ళుంటాయి) కొన్ని పళ్ళబుట్ట ఆకారంలోనూ (దీన్ని దారంలాంటి వెదురు పుల్లలతో నాజూగ్గా అల్లుతారు) ఉంటాయి; చూ. చిత్రాలు 78 క, చ. (కో. 27).

రద్దుపేడు: పర్యా. చూ. కోతపేడు. చేట, గూడ, బుంగ మొ॥ అల్లిన తరవాత వాటి మూలలదగ్గర మిగిలిన పేడు(లు); వీటిని కోసేస్తారు; దేనికీ పనికిరావు. (కో. 15).

రంధ్రం: పర్యా. చూ. గలుమ. కోళ్ళ గూడులోకి కోళ్ళను వేయడానికి పెట్టినకంత చూ. చిత్రం 65 ప. 3. (తె. 8).

రంపం: పేముకర్రకోసే ఇనపపనిముట్టు; దీనికి చిన్న చిన్న పండ్లుంటాయి. (కో. 19).

రవిది: 1. వంకకర్ర (చూ.)కు వంపుదగ్గిర కన్నుమీద ఉండే బొట్టు లేదా పొర (రా. 6); 2. పర్యా. చూ.

బగుడు. రాతపట్టడు మధ్య అనుసంధానం ఉంటే ఎర్రటిపొట్టు. (రా. 9).

రసి: బలం; జవ; వెదురుగడకు భూమినుంచి వచ్చే బలాన్ని అంటారు. (కో. 4).

రాచపుండు: ఉ. రాస—; పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉండే పొట్టు; గడ చుట్టూ ఉబ్బెత్తుగా ఉంటుంది; అంతమేరకు లోపలి ఖాళీని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మ వేస్తుంది. చూ. చిత్రం 4. 3. (తె. 1).

రాజమండ్రివెదురు: రాజమండ్రి ప్రాంతంనుంచి తెచ్చిన వెదురుగడ; 25 అడుగుల పొడుగుంటుంది; గట్టిగా ఉంటుంది; మేదరిపనికి నాణ్యమైనది. (రా. 2).

రాజుపట్టె: 1. పర్యా. రాజుపోగు. నులకమంచం అల్లకంలో రెండుమూలల్ని కలుపుతూ వేసిన నాలుగు (లేదా అంతకన్న ఎక్కువ) పరసలతాడు (రా. 4); 2. మంచం అల్లకంలో పైనుంచి వచ్చే నులకపట్టె; ఐదారు నులకపోగులు కలిసిఉన్నది. (తె. 9).

రాజుపోగు: పర్యా. రాజుపట్టె. నులకమంచం అల్లకంలో రెండుమూలల్ని కలుపుతూ వేసిన నాలుగు (లేదా అంతకన్న ఎక్కువ) పరసలతాడు

రాజులు: (బ.) ఎరకలివాళ్ళలో ఒకతెగ; చినబట్టలు వేసుకొని గొడుగుపట్టుకొని ధనవంతుల దగ్గరికివెళ్ళి అడుక్కొని బతుకుతారు. (తె. 7).

రాట: 1. పర్యా. చూ. పంతకర్ర(2). ప్రతికణుపు దగ్గరా వంపుతిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరి పనికి ఉపయోగపడదు. (కో. 21); 2. చాపలునేసే (ఒకరకం) మగ్గం అమర్చడానికి ఆధారంగా నిలబెట్టే కర్రముక్క; మంచంకోడులా ఉంటుంది; ఇలాటివి నాలుగుంటాయి. (కో. 21).

రాటకోల: మోపు లెత్తుకొచ్చేటప్పుడు అనుగర్రగా పనికొచ్చే వెదురుకట్టె (తె. 22).

రాడ్డు (< ఇం. rod) పర్యా. కమ్మి. పేముకర్రల్ని అల్లిన మోర విరుగా వంచుకోడానికి నేలలో పాతిన ఇనుపకడ్డీ ఇలాటివి రెండుంటాయి (కో. 19).

రాణిపట్టె 1. పర్యా. రాణిపోగు. నులకమంచం అల్లకంలో రెండుమూలల్ని కలుపుతూ – మిగతా రెండుమూలల్ని కలుపుతూ వచ్చే నులకపట్టెకు కిందుగా వచ్చే నాలుగు (లేదా అంతకన్న ఎక్కువ) తాళ్ళవరస. (రా. 4); 2 మంచం అల్లకంలో కిందనుంచి వచ్చే నులకపట్టె; ఐదారు నులకపోగులు కలిసినది. (తె. 9).

రామాపాటను: (కుర్చీ) (< ఇం. —Pattern) ఉ. —పాటర్న్; ఒకరకం పేముకుర్చీ; కొన్నిచోట్ల బెత్తాలు పెట్టకుండా మొత్తం తీగతో అల్లుతారు. (కో. 10-12, 19).

రాయి: పర్యా. చూ. సూర్రౌతు. మేదరికత్తిగాని, అంచుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ, పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (కో. 1).

రాళ్ళబొంగు: పర్యా. ఎండగొప్పకర్ర. రాళ్ళదగ్గర పెరిగిన వెదురుకర్ర; బరువుగా కొంచెం వంచిపోయి ఉంటుంది; పేదు సరిగా రాదు. (తె. 21).

రికెక్కయు: (క్రి.) చిన్న మొక్కలనుంచిగాని, గడ్డి మొక్కలనుంచిగాని సన్నటి కొమ్మలను లేదా గడ్డి పోచలను చేత్తో తెంపెయ్యడం. (తె. 21).

రిక్షాబద్దలు: రిక్షా కట్టుబడిలో గుండ్రంగా వంచి అమర్చిన వెదురుబద్దలు. (తె. 31).

రింగారంకుర్చీ: అల్లకంపని ఉన్న పేముకుర్చీ. (కో. 12).

రింగితడక: (< ఇం. ring—) ఉ. —తడక; పర్యా. చూ. కచ్చడం తడక. కచ్చడం బండిమీద నీడకోసం గుడిసె మాదిరిగా కప్పే తడక లేదా చాప; కొన్నిటికి ముందువేపూ కొన్నింటికి ముందు వెనకలా పడగ మాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండు పొరలుగా అల్లి జత కూరుస్తారు; దీని అంచుచుట్టూ చేట మాదిరిగా కట్టు (బద్ద) వేసి అంచు కడతారు; పలచటి పేడుతో అల్లినదాన్ని చాప అనీ, నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లినదాన్నిగాని చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ, అడ్డంబద్దలూ వేసినదాన్నిగాని బద్దల పరంగా అల్లినదాన్నిగాని పలచటి బద్దలతో అల్లిన దాన్నిగాని తడక అనీ అనడం మామూలు; చూ. చిత్రం 34 క, చ. (తె. 28).

రిల్ల: పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన కొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మ మొదలు; కొమ్మ ఉరువునుబట్టి కొన్నిటికి బొద్దులా ఉంటుంది. చూ. చిత్రం 31. (తె. 4).

ల్లు: (క్రి.) అల్లకం పూర్తయిన తరవాత అక్క డక్కడ వేలాడే దారాల్లాంటి పీచు తెంపెయ్యడం. (కో. 15).

రివ్వ: పర్యా. కాకివాసం (3), చిటుకర్ర, చిట్టె(1),

చువ్వ (1), జాలకంక, జాలకట్టె, జీవక, జూక, రొవ్వవెదురు, సన్నచిట్టె, సన్నపెండె, సోటు కొయ్య. సన్నగా, గట్టిగా ఉండే వెదురుకఱ్ఱ; చిటికెన వేలెడు లావునుంచి బొటనవేలెడు లావు వరకు ఉంటుంది; దీనికిలోపల ఖాళీ ఉండదు; కణుపులుదగ్గర దగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లు గఱ్ఱలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతికఱ్ఱలకూ ఉపయోగిస్తారు. (కో. 24-30).

రీపరు: (< ఇం. Reaper) పలచగా పొడుగ్గాఉండే చెక్క; రెండుమూడువేళ్ళ వెడల్పూ వెదురుబద్దంత మందమూ రెండుమూడుగజాల పొడుగూ ఉంటుంది; ఇళ్ళు కట్టేటప్పుడు బెంగుళూరు పెంకును సరపడానికి కప్పుమీద ఇలాటివెక్కలు బిగిస్తారు. (తె. 3, 4;12).

రుక్మత: (< సం. రుగ్మత) జబ్బు; వ్యాధి. (తె. 17).

రువ్వ: పర్యా. చూ. బరిగె (1). సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి పొడుగాటిపుల్ల; ఈత, పుల్చేరు మొ॥ చెట్లనుంచి ఊడుగు మొ॥ పొదలనుంచి దీన్ని తీస్తారు; ఈతకమ్మ మధ్యకఱ్ఱ (రెండుపక్కలా ఆకులువేసేది); బండిజల్ల, పిల్లలపోది, తట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 25).

రెక్క: 1. పర్యా. పక్క (2). వాకిలితడక (= ఇంటి ముందుభాగంలో కట్టడానికి తలుపుతోఉన్న పెద్ద తడక)లో తలుపుకు పక్కనఉన్న తడకభాగం; ఇటూ అటూ ఉంటాయి. చూ. చిత్రం 38 క. 1. (కో. 19); 2. పర్యా. చూ. వాకిలితడక (1). గుమ్మానికి అడ్డంగా తలుపుమాదిరిగాపెట్టే వెదురు తడక; మామూలుగా పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (తె. 9); 3. జమ్మపోచకు నిలువునా ఉండే అంచు. (రా. 10).

రెంటగచ్చం: ఉ. రొంటగచ్చం; చూ. రెంటాల గచ్చం (2). (కో. 2).

రెంటని: (< రెంట + అని) పర్యా. చూ. రెంటాల. రెండేసిపేళ్ళతో అల్లే విధానం; రెండుపేళ్ళకు కింది నించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డంపేడునుతిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (రా. 5).

రెంటాల: ఉ. రొంటాల, రొంటాలి, రొంటోల; పర్యా. జములల్లకం, జములుపేళ్ళల్లకం, రెంటని, రెంటాలగచ్చం (1), రెంటాలల్లకం, రెండసు అల్లకం, రెండు కిల్లీలల్లకం, రెండు గవ్వాలల్లకం, రెండుపేళ్ళల్లకం, రెండుబద్దలల్లకం, రొండిల్లు. రెండేసిపేళ్ళతో అల్లే విధానం; రెండుపేళ్ళకు కింది నించీ రెండుపేళ్ళకు పైనించీఅడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పుపేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (కో. 3, 5, 10-17; తె. 6, 7, 13, 15, 17-25, 27; రా. 3, 9-11).

రెంటాలగచ్చం: ఉ. రొంటాల—; 1. పర్యా. చూ. రెంటాల. రెండేసిపేళ్ళతో అల్లేవిధానం; రెండు పేళ్ళకు కిందినించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండు పేళ్ళగచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (తె. 17, 18, 22); 2. రూ. రెంటగచ్చం; పర్యా. సాదా గచ్చం. రెంటాల అల్లకం (చూ.)లో అడ్డంపేడుకు పైకీ కిందికీవచ్చే రెండుపేళ్ళ కూర్పు; చేట, విసన గఱ్ఱ మొ॥ రెంటాలగచ్చంవేసి అల్లుతారు. (తె. 17, 18, 22).

రెంటాలచేట: ఉ. రొంటాల ; రెండుపేళ్ళమీద (చూ. రెంటాల) అల్లేచేట; దీన్ని మామూలుగా వెడల్పు పేడుతో అల్లుతారు. (తె. 3-5).

రెంటాలల్లకం: (< రెంటాల + అల్లకం) ఉ. రొంటాల—; పర్యా. చూ. రెంటాల. రెండేసి పేళ్ళతో అల్లేవిధానం; రెండుపేళ్ళకు కిందినించీ నించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డంపేడునుతిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళగచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (కో. 3, 14, 17; తె. 6, 7, 13, 15, 19, 20; రా. 11).

రెండంచులు: (బ) ఉ. రొండంచులు; పర్యా. దోగోటు. ఈతచాప అడ్డంలో కొసలను మూసేస్తూ రెండు పొరలు వచ్చేటట్లు కుట్టిన అంచుపట్టెలు (తె. 19).

రెండడుగులబుట్ట: రెండడుగుల వెడల్పుగల మూన గంప (చూ.) (కో. 19).

రెండడుగు(లు): (బ.) ఉ. రొండడ్గులు; పర్యా. చూ. జమిలడుగు వెదురుపేళ్ళ గంప మొ॥ వాటికి రెండు పొరలుగా అల్లిన కింది భాగం (అడుగు); గట్టిదనంకోసం ఒక అడుగు కఱ్ఱతోనూ ఒక

అడుగు పేడుతోనూ అల్లుతారు; రెండడుగులు వేరు వేరుగా అల్లి అతుకుతారు (తె. 19).

రెండడ్డల గుల్ల: ఉ. రొండడ్డల—; రెండు అడ్డల ధాన్యం పట్టే వెదురుపేళ్ళ గుల్ల (తె. 22).

రెండను ల్లల్లకం: ఉ. రొండన్లల్లకం; పర్యా. చూ. రెంటాల. రెండేసి పేళ్ళతో అల్లే విధానం; రెండుపేళ్ళకు కిందినించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈ మాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28 (కో. 5).

రెండాగ వెదురు: రెండు బద్దలుగా చీరడానికి వీలయినంత లావుగల వెదురుగడ (రా. 3).

రెండు కిల్లీ ల్లల్లకం: ఉ. రొండు ; పర్యా. చూ. రెంటాల రెండేసి పేళ్ళతో అల్లే విధానం; రెండు పేళ్ళకు కిందినించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండు పేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈ మాదిరిగా అల్లుతారు. (చూ. చిత్రం 28 (కో. 2).

రెండుగచ్చాలల్లకం: ఉ. రెండు -; రూ. రెండు గచ్చాలల్లిక; పర్యా. చూ. రెంటాల. రెండేసి పేళ్ళతో అల్లే విధానం; రెండుపేళ్ళకు కిందినించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈ మాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28 (కో. 18, 22, 23, 25, 27, 28, 31).

రెండు గచ్చాలల్లిక ఉ. రొండు -; చూ. రెండు గచ్చాలల్లకం (కో. 27).

రెండు చిట్టాలగుల్ల: ఉ. రొండు చిట్టాల ; రెండు కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళ గుల్ల (తె. 21).

రెండు పేళ్ళల్లకం: పర్యా. చూ. రెంటాల. రెండేసి పేళ్ళతో అల్లే విధానం; రెండుపేళ్ళకు కిందినించీ రెండుపేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28 (రా. 8).

రెండు బద్దలల్లకం: పర్యా. చూ. రెంటాల. రెండేసి పేళ్ళతో అల్లే విధానం; రెండు పేళ్ళకు కిందినించీ రెండు పేళ్ళకు పైనించీ అడ్డం పేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళ గచ్చం (చూ.) ఏర్పడుతుంది; వెడల్పు పేళ్ళతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈ మాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28 (కో. 21).

రెండుమళ్ళగుమ్మి: ఉ. రొండు—; రెండుమణుగుల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుమ్మి (గాదె). (తె. 22);

రెండు మానికలగుల్ల: ఉ. రెండుమాన్కాల -, 16 కిలోల ధాన్యంపట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె.21).

రెండుశేర్లగుల్ల: ఉ. రొండు—; రెండుశేర్ల ధాన్యం పట్టే వెదురుపేళ్ళగుల్ల. (తె. 22).

రెండుసంచులబుట్ట: ఉ. రొండు -; రెండుబస్తాల ధాన్యంపట్టే చిన్న ఈతగుమ్మి. (తె. 20).

రెండెడ్లపగ్గం: ఉ. రొండెడ్ల -; రెండెడ్లను కట్టెయ్యడానికి నాగలియన్నే టప్పుడు రెండు ఎడ్ల కొమ్ములకూ మేడితోకకూ కలిపికట్టి కావలసినచోట రెండు వైపులా ఎడ్లనుములపడానికి కట్టేపగ్గం; దీని రెండు చివరలకూ ఉల్వర ఉంటుంది; సుమారు ఐదుగజాల పొడుగుంటుంది; గోగునార, జనపనారలతో పేంతారు. (తె. 9).

రెండోక్వాలిటీ: పర్యా. చూ. సెకండ్‌క్లాస్‌బొంగు. సుమారు 9 సెం.మీ. నుంచి 12 సెం.మీ. వరకు లావుండే వెదురుగడ, మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది. (తె. 9).

రెండోరకంపేము: మెత్తగా తేలిగ్గా ఉండేపేము. (కో. 12).

రెండోరకంబొంగు: పర్యా. చూ. సెకండ్‌క్లాస్‌బొంగు. సుమారు 9 సెం. మీ. నుంచి 12 సెం. మీ. వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది. (తె. 7, 8 30; రా. 9).

రెప్ప: పర్యా. ఈక, ఈనె (11) ఈతవాపకు వెనక వైపు కనిపించే ఆకు మొదటిభాగం. చూ. చిత్రం 122. 3. (తె. 19, 26).

రెబ్బ: ఉ. రిబ్బ; రూ. రెమక, రేంబ, రేమ్మ(2); పర్యా. చూ. చిల్ల(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటి రెండు గజాలపొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెర కర్రగానూ గాలంబరుగుగానూ వాడతారు;

కొమ్మనరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (తె. 3, 12, 17).

రెబ్బు: (క్రి.) 1. పర్యా. ఒలుచు(2). ఈతమట్ట నుంచి ఆకులను చేత్తో తెంపడం. (తె. 21, 22); 2. అంటుకొని ఉన్న ఈతాకును రెండుపాయలుగా విడదీయడం (తె. 19).

రెమక: ఉ. రెమ్క; చూ. రెబ్బ. (కో. 2; రా. 5).

రెంబ: చూ. రెబ్బ. (రా. 8).

రెమ్మ: 1. పర్యా. చూ. సోరు. వెదురుగడకుగాని దాని కణుపునుంచి పుట్టిన కొమ్మకుగాని వెదురుమొవ్వు చుట్టూగాని సన్నటిపొరలా కప్పిఉన్న ఆకు; ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు ఉంటుంది; లేతప్పుడు మాత్రమే ఉండి గడ ముదరగానే ఎండి రాలిపోతుంది; చెరుకుగడకూ చొప్పదంటుకూ ఉన్న మాదిరిది. (కో. 28); 2. చూ. రెబ్బ. (రా. 8).

రేక: నీళ్ళతోడుకొనే తాటాకుదొన్నె; పైన తాడు కడతారు; బొక్కెన (చేద) మాదిరిగా ఉపయోగ పడుతుంది. (కో. 25).

రేకతాడు: పర్యా. చేంతాడు. నీళ్ళతోడుకొనే ఇనప బొక్కెన (చేద)కు కట్టేతాడు; నాలుగుపురులతో పేంతారు; సుమారు పదిగజాల పొడుగుంటుంది; కొన్నిచోట్ల రేక (= నీళ్ళతోడుకొనే తాటాకు దొన్నె)కు కడతారు; మామూలుగా కొబ్బరిపీచుతో అల్లినది. (కో. 23, 25).

రేకత్తి: (< రేకుకత్తి) పేముకర్రను నిలువుగా చీల్చి బద్దలుతీసే పదునుకత్తి; చూ. చిత్రం 136. (కో. 12).

రేకు: 1. పర్యా. చూ. పేడు(1). వెదురుబద్ద సన్నగా చీలిస్తే వచ్చేపాయ; సుమారు చిటికెన వేలెడు వెడల్పూ గోరంత మందమూ గజంన్నర పొడుగూ ఉంటుంది; చేట, బుట్టెడ మొ॥ అల్లడానికి వాడతారు; అల్లే వస్తువునుబట్టి దీని పొడుగు వెడల్పులు నిర్ణయించుకొంటారు. (కో. 25, 26; రా. 1); 2. బుట్టల అల్లకంలో నిలువుగాను, అడ్డంగాను పెట్టడానికి వాడే పేడు; పాసిక (చూ.) కన్న పలచగా ఉంటుంది. (కో. 29); 3. కొయ్యడానికి పనికొచ్చే వెడల్పాటి ఇనపరేకు. (కో. 4); 4. పర్యా. ఆకు (5). కొబ్బరికమ్మ పక్కంచులో సన్నగా పొడుగ్గా పెరిగే ఆకుపచ్చ భాగం; రెండు పాయలుగా ఉండి, మధ్యలో ఈనె ఉంటుంది; చెట్టుకు ఆకు వెనక్కి వాలిఉన్నప్పుడు దోర్లించి నట్లుండి ఈనెపైకి ఉంటుంది. (కో. 25); 5. పర్యా. చూ. ఈతాకు. ఈతచెట్టు మట్టనుంచి తీసిన ఆకు; ¼ అంగుళం వెడల్పూ గోరుమందమూ ఉంటుంది; దీని మొదటిభాగం మధ్యభాగంకన్న వెడల్పు తక్కువగా ఉండి, కొన సన్నగా మొన దేలి ఉంటుంది; తెల్లగాను లేత పసుప్పచ్చగానూ ఉంటుంది; మామూలుగా అంటుకొనిఉన్న రెండు పాయల్నీ విడదీసిన తరవాత ఒక పాయనుకూడా ఈతాకు అనే అంటారు. చూ. చిత్రం 2.2, 115. (కో. 25); 6. పర్యా. చూ. తాటిరేకు. తాటికమ్మ నుంచి చీల్చితీసిన ఆకు; రెండుమూడు వేళ్ళ వెడల్పుగాను పోనుపోను చివర సన్నగానూ గోరుమందంగానూ ఉంటుంది; ఇలాంటి ఆకులు కమ్మకు ఇరవైముప్పైదాకా ఒకదాన్నొకటి అంటుకొని ఉంటాయి; రేకుకూ రేకుకూ మధ్య సన్నటిఈనె ఉంటుంది; చూ. చిత్రం 124. (కో. 23).

రేవ: వెదురుగడ లోపల నల్లబడిన బెండు (= లోపలి కండ). (తె. 27).

రేవబోయినబొంగు: పురుగు తొలిచిన రంధ్రంద్వారా కణుపులోకి నీళ్ళుపోయి లోపల నల్లగా అయిన వెదురుగడ; చూ. రేవబోవు. (తె. 28).

రేవబోవు: (క్రి.) పురుగు దొలిచిన వెదురుగడలోకి నీళ్ళుపోయి లోపలిబెండు నల్లగా కావడం. (తె. 28).

రేషంతట్ట: పర్యా. చెంద్రంగితట్ట, తట్ట (3), రేషం పూవుతట్ట, రేషంసిబ్బి. పట్టుపురుగులనుగాని, పట్టు కాయ (= పట్టుపురుగుచుట్టూ కాయమాదిరిగా ఏర్పడ్డ దారాలు)లనుగాని తీసుకువెళ్ళే తట్ట; రెండుబెత్తల ఎత్తూ గజంవెడల్పూ ఉంటుంది; చూ. చిత్రం 81. (రా. 1, 2, 5).

రేషంపూవుతట్ట. పర్యా. చూ. రేషంతట్ట. పట్టుపురుగు లనుగాని పట్టుకాయ (= పట్టుపురుగుచుట్టూ కాయ మాదిరిగా ఏర్పడ్డ దారాలు)లనుగాని తీసుకువెళ్ళే తట్ట; రెండుబెత్తుల ఎత్తూ, గజం వెడల్పూ ఉంటుంది; చూ. చిత్రం 81. (రా. 1).

రేషంవంకె: ఉ. —వొంకె; పర్యా. చూ. చెంద్రిక. పట్టుపురుగుల గుడ్లు, పొదగడానికీ పురుగుల్ని పెంచడానికీ గుండ్రంగా అరలరలుగాఉన్న ఒక రకం తడక; చూ. చిత్రం 82; (రా. 5).

రేషంసిబ్బి: ఉ. —సిబ్బి; పర్యా. చూ. రేషంతట్ట.

పట్టుపురుగులనుగాని, పట్టుకాయ ( - పట్టుపురుగు చుట్టూ కాయమాదిరిగా ఏర్పడ్డ దారాలు)లనుగాని తీసుకువెళ్ళే తట్ట; రెండుబెత్తలఎత్తూ గజం వెడల్పూ ఉంటుంది; చూ. చిత్రం 81. (రా. 6).

రేసు. కొబ్బరికాయను అంటుకొనిఉండే గట్టి పీచు పోగు; ఇలాటివి కాయచుట్టూ అక్కడక్కడ ఉంటాయి; మామూలుపీచుకన్న గట్టిగా ఉంటాయి (కో. 25).

రైలెబొంగు: చీమలు కొట్టినందువల్ల నలుపురంగు వచ్చిన వెదురుగడ. (తె. 25).

రొట్టె(ల)గుల్ల: 1. పర్యా. అంచె (1), రొట్టెల పుటికె. రొట్టెలుపెట్టుకొనే వెదురుపేళ్ళ గుల్ల; రక రకాలుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి సమాంతరంగా రెండుబెత్తల ఎత్తూ జేనెడు బెత్తెడు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమ తలంగాఉండి కింద వెడల్పు తక్కువగానూ పోను పోను వెడల్పు ఎక్కువగానూ ఉంటుంది; కొన్ని చోట్ల అర్ధచంద్రాకృతిలో ఉంటుంది. (తె. 16, 18, 19); 2. రొట్టెలువేసుకొనే ఈతబుట్ట. (తె. 13).

రొట్టెలపుటికె: ఉ.—పుట్క; పర్యా. చూ. రొట్టె(ల) గల్ల (1). రొట్టెలుపెట్టుకొనే వెదురుపేళ్ళ గుల్ల; రకరకాలుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి సమాంతరంగా రెండుబెత్తల ఎత్తూ జేనెడు బెత్తెడువెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల అడుగు సమతలంగా ఉండి కింద వెడల్పు తక్కువగా పోనుపోను వెడల్పుగానూ ఉంటుంది; కొన్నిచోట్ల అర్ధచంద్రాకృతిలో ఉంటుంది. (తె. 4, 16, 18).

రొట్టెలసిబ్బి: ఉ.—శిబ్బి; పర్యా. సిబ్బి (4). రొట్టెలు పెట్టుకొనే వెదురుపళ్ళెం. (రా. 11).

రొంటుచెక్కలు: ఉ.—శెక్కలు; వెదురుగడను నిలు వుగా సగానికిచీలిస్తే వచ్చే బద్దలజంట. (తె. 6).

రొండిల్లు: పర్యా. చూ రెంటాల. రెండేసిపేళ్ళతో అల్లేవిధానం; రెండుపేళ్ళకు పైనించీ రెండుపేళ్ళకు కిందినించీ అడ్డంపేడును తిప్పుతూ అల్లుతారు; ఈ అల్లకంలో రెండుపేళ్ళగచ్చం (చూ.) ఏర్పడు తుంది; వెడల్పు పేడుతో అల్లుతారు; చేట, జల్లెడ మొ॥ వాటిని ఈమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 28. (కో. 12).

రొంత: కొంచెం; రోంత, రవ్వంత. (రా. 4, 6).

రొవ్వవెదురు: ఉ రొవ్వెదురు; పర్యా. చూ. రివ్వ; సన్నగా గట్టిగాఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి. దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (కో. 31).

రోక: (< రూక) పెళ్ళికి నిశ్చితార్థం చేసుకొనేటప్పుడు తాంబూలంతోపెట్టి ఇచ్చే రూపాయినాణెం; ఇలా ఇవ్వడం మేదరివాళ్ళ ఆచారం. (కో. 1; రా. 3).

రోకటికుదురు: పర్యా. చూ. కుదురు (3). వడ్లు మొ॥ ధాన్యం దంపేటప్పుడు గింజలు చిందిపోకుండా రోటిమీదపెట్టే కుందిమాదిరిది; పైనాకిందా తెరిచి ఉంటుంది; కింద సన్నగానూ పోనుపోను పైన వెడల్పుగానూ ఉంటుంది; చూ. చిత్రం 80. (కో. 8).

రోకు: దిక్కు, వైపు. (తె. 14).

రోటికుదురు: పర్యా. చూ. కుదురు (3). వడ్లు మొ॥ ధాన్యం దంపేటప్పుడు గింజలు చిందిపోకుండా రోటిమీద పెట్టే కుంది మాదిరిది; పైనా కిందా తెరిచి ఉంటుంది; కింద సన్నగానూ పోనుపోను పైన వెడల్పుగానూ ఉంటుంది; చూ. చిత్రం 80 (కో. 9).

రౌండిసనగర్ర: (< ఇం. round—) + విసనగర్ర పర్యా. గుండ్రటి విసనగర్ర. అంచులు గుండ్రంగా వచ్చేటట్లు అల్లిన విసనగర్ర; కొన్నిచోట్ల దీనికి కాడ, గోట్టం ఉంటాయి (కో. 15)

రౌండుకట్టు: (round—) పర్యా. చూ. కర్ర (4). జల్లెడ అంచు కట్టడానికి లోపలి గుండు బిలుకు (వెలుపలి బద్ద)ల మీంచి, ఆ రెంటిమధ్యా కొంత భాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా వంచి కట్టిన రెండు మూడు వేళ్ళ వెడల్పుబద్ద (కో. 9).

రౌన్ కట్టు: (< round - ); పర్యా. చూ. గుండు (1) జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండు మూడు వేళ్ళ వెడల్పు బద్ద; జల్లెడ తట్టుమీద దీన్ని పెట్టి తట్టు చివర్లను దీని చుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలి భాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒక బద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందం బద్ద వేస్తారు. చూ. చిత్రం 80 క. 1 (తె. 14).

రౌన్ టీపాయ్. (< ఇం. round tea-poy) పైన గుండ్రంగా ఉండే పేము టీపాయ్. చూ. చిత్రం 144. (కో. 11, 14).

ల

లగ్గం పందిరి: (< సం. లగ్నం-) పర్యా. షో

కళ్యాణ మంటపం, వెదురుతోగాని, కొబ్బరి మట్టలతోగాని అల్లిన పెళ్ళి మంటపం; పెళ్ళివేళ పెళ్ళికొడుకునూ పెళ్ళికూతుర్నీ ఇందులో కూర్చోబెడతారు. చూ. చిత్రం 102 (తె. 6, 10).

లంక బొంగు: లంక (=అడవి)లో పుట్టిన వెదురు గడ; మెత్తగా ఉంటుంది (తె. 30).

లంకమల కఱ్ఱ: పర్యా. నల్లమల కఱ్ఱ. పొడుగ్గా, ఎక్కువ బోలుగా ఉండే మేలిరకం వెదురుగడ; నల్లమల అడవుల్లో పెరుగుతుంది (కో. 4).

లంకలో కఱ్ఱ: పల్లపు నేలలో పెరిగిన వెదురుగడ; బరువుగా ఉంటుంది (కో. 22).

లంగర్ బోటు (హిం. లంగర్ – ఇం. boat) లంగరుబోటు నమూనాలో చేసిన బొమ్మ; వెదురు పేళ్ళతో చేస్తారు (కో. 27).

లట్టు: పర్యా. చూ. వంక కఱ్ఱ (1). పాముపడగ మాదిరిగా మొదలు వంపు తిరిగిన వెదురుకఱ్ఱ; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు తెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికఱ్ఱగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8. చ. (తె. 17).

లప్పగన: చూ. లప్పగనుపు. (తె. 18).

లప్పగనుపు: రూ. లప్పగన, లప్పగనె; పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మ లావుగా ఉండడంవల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపుఉన్న వెదురు గడను చీల్చడం కష్టం. (రా. 11).

లప్పగనె: చూ. లప్పగనుపు. (తె. 8).

లంబాడికొన: పర్యా. చూ. సుతిలి, గోగు, జనప మొ॥ నారలతో మిషన్‌లో తయారైన సన్నటి పురితాడు; పుల్లలతడక (చిక్కటతడక), కావెగడ్డి చిల్మాన్లు మొ॥ తయారుచేయడానికి వాడతారు; చూ. చిత్రం 98. 3. (కో. 8).

లాక: 1. పర్యా. చూ. గంటిగనుపు (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగినకొమ్మ నరికేసినప్పుడు గుర్తుగా మిగిలిన కొమ్మమొదలు; కొమ్మఉరువునుబట్టి కొన్నిటికి చిన్నగానూ కొన్నిటికి పెద్దగానూ ఉంటుంది; కొన్నిటికి బొడ్డులా ఉంటుంది; చూ చిత్రం 9. 1. (తె. 1); 2. పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్దసరిగా రాదు; ప్రతిగనుపుకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రలకూ పేడలకూ పనికొస్తాయి. (కో. 23); 3. పర్యా. చూ. సన్నంపేడు. వెడల్పు చాలాతక్కువగా ఉన్న వెదురుపేడు; కొన్నిచోట్ల చాలాసన్నగా ఉన్నది. (రా. 3). 4. పర్యా. చూ. లాకదబ్బ. (తుంగ)చాప నేసేటప్పుడు మగ్గంపోగుల మధ్య (తుంగ)పోచను దూర్చేబద్ద; దీనిచివర బెజ్జముంటుంది; అందులోకి (తుంగ)పోచకొన దూర్చి లాకబద్దను పోగులమధ్య దోపుతారు; చూ. చిత్రాలు 120 క. 6; 121. (రా. 6).

లాకదబ్బ: పర్యా. కుచ్చెలగఱ్ఱ, రాపడబ్బ, దబ్బ(11), పోగుదబ్బ, లాక(4). (తుంగ)చాప నేసేటప్పుడు మగ్గంపోగుల మధ్య (తుంగ)పోచను దూర్చేబద్ద; దీనిచివర బెజ్జముంటుంది; అందులోకి (తుంగ)పోచ కొన దూర్చి లాకదబ్బను పోగులమధ్య దోపుతారు; చూ. చిత్రాలు 120 క. 6; 121. (కో. 3, 8).

లాకబద్ద: బట్టలునేసేవాళ్ళు దారాలు సరిచేయడానికి నిలువుదారాల (పడుగు) మధ్య అనులున్నచోట దూర్చే వెదురుబద్ద; గజంన్నర పొడుగుంటుంది. (తె. 6, 10, 31).

లాగేయు: (క్రి.) పర్యా. చూ. పాపు. భాగాలుగా విడదీయడం; వెదురుగడనుగాని బద్దనుగాని ఒక చివర కత్తితో చీల్చినతరవాత ఒకపాయ కాలికింద తొక్కిపట్టి రెండోపాయ చేత్తోపట్టి లాగుతూగాని రెండుబద్దల్నీ రెండు చేతులతో విడదీస్తూగాని వేరు చేస్తారు. (కో. 1).

లాటింగ్: (< ఇం. lotting) వెదురుగడలు వరసగా ఇంట్లో పేర్చుకోడం. (తె. 31).

లాటు: (< ఇం. lot) పర్యా. లాటుబొంగు, వెదుర్లాటు. అడ్డంగాపేర్చిన వెదురుగడలు; ప్రభుత్వం వెదురుడిపోలోగాని అడితిల్లోగాని, అడవిలోగాని నేలమీద పేరుస్తారు; మామూలుగా వెయ్యిగడనుంచి ఆరువేల గడవరకు పేరుస్తారు; కొన్నిచోట్ల, ఒకలారీలో పట్టేటన్ని గడలు (కో. 3, 5, 6, 9, 13, 16, 17; తె. 4, 6-9, 15, 17, 20, 23, 24, 30, 31; రా. 8, 11).

లాటుపేర్చు: (క్రి.) వెదురుగడలను నేల మీద పడుకోబెట్టి పేర్చడం (కో. 15).

లాటుబొంగు: పర్యా. చూ. లాటు. అడ్డంగా పేర్చిన వెదురుగడలు; ప్రభుత్వం వెదురు డిపోలోగాని అడితిల్లోగాని అడవిలోగాని నేలమీద పేరుస్తారు; మామూలుగా వెయ్యి గడనుంచి ఆరు వేల గడవరకు

పేమస్తారు; కొన్నిచోట్ల ఒక లారీపై పట్టేటన్ని గడలు (తె. 4).

లాఠీ: (హిం.) పర్యా. చూ. చేతికర్ర (1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడు నాలుగు వేళ్ళ లావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసా మొదలూ ఒకే లావుంటాయి, సాము చేయడానికి కూడా ఉపయోగపడుతుంది (తె. 10).

లాఠీకట్టె: ఉ. లాఠ్‌కట్టె; పర్యా. చూ. చేతికర్ర (1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడు నాలుగు వేళ్ళ లావూ సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; బోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీని కొసా మొదలూ ఒకే లావుంటాయి; సాము చేయడానికి కూడా ఉపయోగపడుతుంది (తె. 13, 19, 21).

లాంతరు: (< ఇం. lantern) ఉ. లాందర్; పర్యా. హరికేన్‌లాంపు. దారాల్లాంటి సన్నటి వెదురుపుల్లలతో హరికేన్‌లాంతరు ఆకారంలో చేసిన నమూనా (కో. 5, 19)

లావాకు: (< లావు + ఆకు) పర్యా. చూ. మందంపేడు. గోరు మందం కన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది (రా. 1).

లావీనె: (< లావు + ఈనె) ఉ. లావీన; పర్యా. దబ్బీనె, దొడ్డుకర్ర, బడుము (2), బద్దకర్ర, బొద్దుతీగ, ముతకగోడు, మొద్దీనె (1), వలుంవార. మామూలుకర్ర (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండే కర్ర; గంప మొ॥వాటి అల్లకం పనిలో ఎత్తుగా వచ్చే భాగం అల్లడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 47 క. 2 (కో. 3, 5); 2. పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు)చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగం నుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (రా. 3).

లావుకట్టె: పర్యా. చూ. దొడ్డుబరిగె. వేలెడుకన్న ఎక్కువ లావుండే ఊతచువ్వ (బరిగె); గుమ్మాలు బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 9).

లావుకర్ర: 1. పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటి భాగంలోనూ మూడంగుళాలు కొసభాగంలోనూ లావుంటుంది; బండిజల్లలకూ, గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది. (కో. 10, 25); 2. పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకం పనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులో సగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ, లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క. 6. (రా. 11).

లావుకేను: (< ఇం. —cane) పర్యా. చూ. లావుపేము. లావుగా ఉండే పేముకట్టె; అరంగుళం నుంచి మూడంగుళాల వరకు లావుంటుంది; మంచాలూ కుర్చీలు మొ॥వాటి తయారీకి పనికొస్తుంది (తె. 22).

లావుజువ్వ: పర్యా. చూ. దొడ్డుబరిగె. వేలెడుకన్న ఎక్కువ లావుండే ఊతచువ్వ (బరిగె); గుమ్మాలు, బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 7).

లావుతుంగ: పర్యా. దొడ్డుతుంగ(1). వెన్ను లావుగా ఉండే తుంగ; నాసిరకం. (కో. 3, 8; రా. 4).

లావుపురి: పదిదిప్పిన లావుపాటి పురి; చూ. పురి. (రా. 4).

లావుపెండె: ఉ. లావుంపెండె, లావుగా ఉండే వెదురుబద్ద. (రా. 3).

లావుపెశల్: (< ఇం. —special) పర్యా. చూ. స్పెషల్‌బొంగు. నాణ్యమైన లావుపాటి వెదురుగడ; 15 నుంచి 18 సెం.మీ. వరకు లావుంటుంది; లోయల్లోపుట్టి పెరగడంవల్ల నిటారుగా లావుగా ఉంటుంది; ముళ్ళు లేకుండా సాపుగాఉండి మేదరి పనికీ నిచ్చెనలకూ ఉపయోగపడుతుంది; వ్యాపార పరంగా వాడుకలోకి వచ్చినపేరు. (తె 1).

లావుపేడు: పర్యా. చూ. మందంపేడు; గోరుమందం కన్న ఎక్కువ మందంగానూ కొంచెం వెడల్పుగానూ ఉండే వెదురుపేడు; బండిజల్ల మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 2).

లావుపేము: పర్యా. మందంకేను, లావుకేను; లావుగా ఉండే పేముకట్టె; అరంగుళంనుంచి మూడంగుళాల వరకు లావుంటుంది; మంచాలూ, కుర్చీలూ మొ॥ వాటి తయారీకి పనికొస్తుంది. (కో. 3).

లావుబరిగె: చూ. లావుకర్ర; పర్యా. చూ. దొడ్డుబరిగె. వేలెడుకన్న ఎక్కువ లావుండే ఊతచువ్వ

(బరిగె); గుమ్మాలు, బండిజల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (తె. 14).

లావుబఱ్ర: చూ. లావుబరిగె. (రా. 9).

లావుబొంగు: పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగంలోనూ మూడంగుళాలు కొస భాగంలోనూ లావుంటుంది; బండిజల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగ పడుతుంది. (తె. 1, 2, 6, 8, 27, 30, 31).

లావుమేదర: పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగంలోనూ మూడంగుళాలు కొసభాగంలోను లావుంటుంది; బండి జల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది. (కో. 14).

లావువెదురు: ఉ. లావెదురు; పర్యా. చూ. దొడ్డు బొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగంలోనూ మూడంగుళాలు కొసభాగం లోనూ లావుంటుంది; బండిజల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగపడుతుంది. (కో. 11, 12; రా. 2).

లావుసాదనం: పర్యా. చూ. దొడ్డుబొంగు. లావుపాటి వెదురుగడ; ఐదంగుళాలు మొదటిభాగంలోనూ మూడంగుళాలు కొసభాగంలోనూ లావుంటుంది; బండిజల్లలకూ గాదెలకూ ఎక్కువ ఉపయోగ పడుతుంది. (కో. 13).

లిక్కత్తి: (< లిక్కి + కత్తి) పర్యా. పైదె కత్తి చిన్నసైజు మేదరికత్తి; వెదురుబద్దలూ పేళ్ళూ చీరడానికి వాడేది; గడలు నరకడానికి పనికిరాదు; బరువు తక్కువగా ఉండడంవల్ల పిల్లలూ ఆడవాళ్ళూ దీంతో సులువుగా పనిచెయ్యగలరు; ఒడ్డుకత్తి కన్న పదునుగా ఉంటుంది. (కో. 12; తె. 23, 26, 28).

లిక్కరిమేదరికత్తి: ఒకరకం మేదరికత్తి. (కో. 10).

లింగాలబొంగు: లింగాలు అనే ప్రాంతంలో పెరిగిన వెదురుగడ. (తె. 12).

లేగబుట్ట: ఉ. - బుట్టి; పర్యా. దూడబుట్ట. లేగదూడలు మట్టినాకకుండా వాటిమూతికి కట్టే చిన్న వెదురు పేళ్ళబుట్ట; గాలి ఆడడానికి వీలుగా పేళ్ళమధ్య చిన్న చిన్న సందులు(కళ్ళు) ఉంటాయి. (తె. 22).

లేతకట్టె: పర్యా. చూ. లేతబొంగు(1). ఒక సం॥నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేతవెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతిముందు కోతకువస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చడానికి వీలవుతుంది; లోపల బోలు తక్కువ; గడచుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది; (ఈ బూడిదనుబట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడునాలుగంగుళాల మంద ముంటుంది. (కో. 4).

లేతకఱ్ఱ: పర్యా. చూ. లేతబొంగు (1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతి ముందు కోతకు వస్తుంది. మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి, పేడు సులువుగా చీల్చ డానికి వీలవుతుంది; లోపల బోలు తక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడిఉంటుంది. (ఈ బూడిదనుబట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడునాలుగంగుళాల మందముంటుంది. (కో. 3, 10, 15-18, 22, 23, 28, 30; తె. 27).

లేతకోలు: ఉ. - కోల్; పర్యా. చూ. లేతబొంగు(1). ఒక సం॥నుంచి రెండు సం॥ల వరకు వయస్సు గల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్ల డానికి పనికొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతి ముందుకోతకు వస్తుంది; మెత్తగా పచ్చిగా నాణ్యంగా ఉండి, పేడు సులువుగా చీల్చ డానికి వీలవుతుంది; లోపల బోలు తక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది. (ఈ బూడిదనుబట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్నిగడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకు పచ్చ; ముదురాకుపచ్చరంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (కో. 4).

లేతచెట్టు: ఉ. నేత—; పర్యా. ఈతపిల్ల. పెరుగు తున్న లేత ఈతచెట్టు. (రా. 9).

లేతడొక్క: ఉ. నేత—; లేత కొబ్బరికాయ(బొండం) ఒలిచి తీసిన డొక్క; దీనిపీచు దళసరిగా ఉంటుంది (కో. 29).

లేతనార పర్యా. సుద్దనార. పచ్చిగా లేతగాఉండే కలబందమట్టనుంచి తీసిన నార; తెల్లగాఉంటుంది. (రా. 4, 5).

లేతపండుబొంగు: పర్యా. కై ముదిరిన కర్ర. అంత లేతా అంత ముదురూకాకుండా మధ్యరకంగాఉన్న వెదురుగడ; ఇది విసనగర్రలకూ చేటలకూ పని కొస్తుంది. (తె. 23).

లేతబొంగు. 1. పర్యా. కవులబొంగు, కొత్తకర్ర, కొత్తవెదురు, దవ్వకర్ర (1). నేతకట్టె, నేతకర్ర, నేతబొంగు, నేతివెదురు, లేతకట్టె, లేతకర్ర, లేత కోలు, లేతవెదురు (2), లేవడికర్ర. ఒక సం॥ నుంచి రెండు సం॥లవరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పని కొస్తుంది; మొక్క కార్తీకమాసంలో పుట్టి సంక్రాంతి ముందు కోతకువస్తుంది; మెత్తగా పచ్చగా నాణ్యంగాఉండి పేడు సులువుగా చీల్చడానికి వీలవు తుంది; లోపల టోలు తక్కువ; గడచుట్టూ బూడిద లాంటిపదార్థం ఏర్పడిఉంటుంది (ఈ బూడిదనుబట్టి మొక్కవయస్సు నిర్ణయిస్తారు); కొన్ని గడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది; (కో. 5, 8, 9; తె. 5-7, 10 13-18, 20-20, 28, 29, 31); 2. లావుగానూ టోలుగానూ ఉండే లేత వెదురుగడ; పేడుతీయడం సులువు, (కో; 2).

లేతరువ్వ: ఉ. నేత—; లేతగాఉన్న ఈతబరిగె. (కో. 25).

లేతవెదురు: 1. పర్యా. చూ. నడిగర్ర. ఒక నెల నుంచి మూడునెలలవరకు వయస్సుగల లేత వెదురుకర్ర; దీన్ని చీరి చేట, జల్లెడ మొ॥ వాటికి కట్టుకట్టడాని కవసరమయ్యే తీగ (చూ.)లు తియ్య డానికి పనికొస్తుంది. (రా. 10); 2. పర్యా. చూ లేతబొంగు (1). ఒక సం॥నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేత వెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పనికొస్తుంది; మొక్క కార్తీక మాసంలో పుట్టి సంక్రాంతి ముందు కోతకు వస్తుంది; మెత్తగా పచ్చగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చడానికి వీలవుతుంది; లోపల టోలు తక్కువ. గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది (ఈ బూడిదను బట్టి మొక్క వయస్సు నిర్ణయిస్తారు); కొన్ని గడలు తెలుపు, ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చ రంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మంద ముంటుంది (కో. 1, 2, 14, 31).

లేతసీద: ఆకులతో ఉన్న లేత వెదురురెమ్మ; దీన్ని పశువులు తింటాయి (కో. 22).

లేప: పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడు లావూ ఒకటి రెండుగజాల పొడుగూ ఉంటుంది; ములుగర్రగానూ దోమతెర కర్రగానూ గాలం బరుగుగానూ వాడ తారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలి ఉంటుంది (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది (తె. 21).

లేపబొంగు: గట్టితనంలేని పేడు వచ్చే వెదురుగడ; పేడు ఎటు ఒడితే అటు వంగిపోతుంది; కర్ర (చూ.)లు చీలడానికి పనికిరాదు (తె. 18).

లేపు: (క్రి.) పర్యా. చూ. పాపు. భాగాలుగా విడ దీయడం; వెదురుగడనుగాని బద్దనుగాని ఒక చివర కత్తితో చీల్చిన తరవాత ఒక పాయ కాలికింద తొక్కిపట్టి రెండో పాయ చేత్తోపట్టి లాగుతూగాని రెండుబద్దల్నీ రెండు చేతులతో విడదీస్తూగాని వేరు చేస్తారు (కో. 2, 23).

లేవడి కర్ర: పర్యా. చూ. లేతబొంగు (1). ఒక సం॥ నుంచి రెండు సం॥ల వరకు వయస్సుగల లేతవెదురుగడ; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి పని కొస్తుంది; మొక్క కార్తీక మాసంలో పుట్టి సంక్రాంతి ముందు కోతకు వస్తుంది; మెత్తగా పచ్చగా నాణ్యంగా ఉండి పేడు సులువుగా చీల్చ డానికి వీలవుతుంది; లోపల టోలు తక్కువ; గడ చుట్టూ బూడిదలాంటి పదార్థం ఏర్పడి ఉంటుంది (ఈ బూడిదను బట్టి మొక్కవయస్సు నిర్ణయిస్తారు); కొన్ని గడలు తెలుపు ఆకుపచ్చ, లేతాకుపచ్చ, ముదురాకుపచ్చరంగుల్లో ఉంటాయి; గడ మూడు నాలుగంగుళాల మందముంటుంది. (కో. 25).

లైట్‌స్టాండు: (ఇం. Light stand) గేస్‌లైటు పెట్టుకొనే పేముస్టేండు. (తె. 22).

లొట్ట: 1. పర్యా. చూ. టోలు (1). వెదురుగడలోపల ఒక కణుపునుంచి మరొక కణుపుమధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్ని టికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4. 1. (తె. 31; రా. 9); 2. పర్యా. చూ. దోనె. వెదురుగడను నిలువుగా రెండుపాయలుగా చీల్చినప్పుడు ఒక కణుపునుంచి ఇంకో కణుపువరకు కాలవమాదిరిగా పల్లంగాఉండే భాగం. (తె. 4).

లొట్టబొంగు: 1. పర్యా. చూ. కవురుబొంగు (1).

తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలి పోయిన వెదురుగడ; తెల్లగాగాని నల్లగాగాని అవు తుంది; సరయిన జిగిఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; జేలి తడకలకు మాత్రం పనికొస్తుంది. (కో.2); 2. పర్యా. చూ. బోలుబొంగు. కణుపు కణుపుకూమధ్య లోపల గుల్లగాఉండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది (తె. 28, 20).

లోడెం: జేంపు పై భాగంలో రంధ్రం (ద్వారం)చుట్టూ ఉండే కట్టు (తె 8)

లోద్దగనెబొంగు: పర్యా. లోతుగనెబొంగు. కణుపు లోపలివరకుఉండే వెదురుగడ; చీల్చేటప్పుడు కత్తికి తెగకుండా కణుపు అడ్డుకుంటుంది. (తె. 22).

లోద్ది: పర్యా. జొల, సెల (2). లోయ; గుట్టల నడుమ పల్లపుప్రదేశం. (తె. 5, 9, 17).

లోద్ది(ల)బొంగు: పర్యా. జాలకర్ర, మడబొంగు (1), సరివెదురు, సెలబొంగు. లోయలో పెరిగిన వెదురు గడ; మెత్తగా, బోలుగా ఉంటుంది; కణుపులు దూరదూరంగా ఉంటాయి; మేదరిపనికి బాగా ఉపయోగం. (తె. 5, 8, 9, 21).

లోగట్టు చూ. లోపటికట్టు; పర్యా. లోపలివడుకు. చేటలోపలి అంచుచుట్టూ పెట్టి బిగించే వెదురుబద్ద (కట్టు) (తె. 3, 4, 12, 13, 28).

లోగనుపు: ఉ. - గెన్పు; పర్యా. చూ. బొడ్డుగనుపు (1); వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు లోతుగాపడే బొడ్డులాంటి గుర్తు. చూ. చిత్రం 9.1 (కో. 3).

లోగుండీ: పర్యా. చూ. గుండు (1). జల్లెడఅంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచికట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడతట్టుమీద దీన్నిపెట్టి తట్టుచివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడఅంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒకబద్ద, ఈ రెంటి మీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (కో. 23).

లోతు: చేటలో రెండుమూలల మధ్యగాని ఒక మూల నుంచి కొమ్ముపరకుగాని పల్లంగా ఉన్న భాగం. (కో. 23).

లోతుగనె: పర్యా. చూ. బొడ్డుగనుపు(1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసి నప్పుడు లోతుగాపడే బొడ్డులాంటి గుర్తు. చూ. చిత్రం 9.1 (తె. 20).

లోతుగనెబొంగు: పర్యా. లోద్దగనెబొంగు. కణుపు లోపలివరకు ఉండే వెదురుగడ; చీల్చేటప్పుడు కత్తికి తెగకుండా కణుపు అడ్డుకుంటుంది (తె. 23).

లోతుమూల: చేటగోడకు ఇవతల లోతుగాఉన్న మూల; దొప్పలా ఉంటుంది; (కో. 17).

లోనగొమ్ము: పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందు భాగంలో రెండుమూలలను (కొనలను) కలుపుతూ అడ్డంగా వేసిన చటికెన వేరెతులావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కడ్డించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 29.2 (కో. 13).

లోను ఇల్లు, గుడిసె. (తె. 29)

లోపటికట్టు: చూ. లోగట్టు. (కో. 2; తె. 17).

లోపటిగుండు: పర్యా. చూ. గుండు (1). జల్లెడ అంచు కట్టేటప్పుడు రింగులా గుండ్రంగా వంచి కట్టిన రెండుమూడు వేళ్ళ వెడల్పుబద్ద; జల్లెడతట్టు మీద దీన్నిపెట్టి తట్టు చివర్లను దీనిచుట్టూ వంచుతారు; ఇది జల్లెడ అంచు లోపలిభాగంలో అడుగున ఉంటుంది; దీనికి బయటనుంచి ఒకబద్ద, ఈ రెంటిమీంచి ఇంకో మందంబద్ద వేస్తారు. చూ. చిత్రం 30 క. 1. (తె. 19).

లోపలిగనుపు: పర్యా. చూ. బొడ్డె (1). వెదురుబద్దకు పల్లపుభాగంలో ఉండే కణుపు; ఎత్తుగా ఉంటుంది; కత్తితో చెలిగేస్తారు. (రా. 1).

లోపలివడుకు: ఉ. —వొడ్కు; పర్యా. లోగట్టు. చేట లోపలి అంచుచుట్టూ పెట్టి బిగించే వెదురు బద్ద (కట్టు). (రా. 11).

లోబొంగు: పర్యా. బంబు, దండెబొంగు, దొబ్బుడు బొంగు, నడిబొంగు, బొంగు (5). (తుంగ)చాప నేతమగ్గంలో ఒకవరస పోగుల అని లేపడానికి పోగులనడుమ దూర్చిన లావుపాటి వెదురుగడ; గజం పొడుగుంటుంది; తొక్కుడు దబ్బకూ దిగ దండుకూ మధ్య ఉంటుంది. చూ. చిత్రం 120 క. 2. (కో. 3).

లోభాగం: జల్లెడ అడుగుకు లోపలివైపు; లోతునున్న భాగం. (కో. 28).

లోంబ్రు: కోళ్ళబుట్ట అల్లకంలో వదిలిన కంత. (రా. 4).

## వ

వక్క: ఉ. అక్క, ఒక్క, వొక్క 1. పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒక భాగం; (తె. 9, 18, 22, 28; రా. 11);

2. పర్యా. చూ. బద్ద (1). వెదురుగడ నిలువుగా నాలుగు భాగాలుగా చీలిస్తే వచ్చే భాగం; గడంత పొడుగునా సుమారు రెండువేళ్ళ వెడల్పు ఉంటుంది (తె. 22); 3. పర్యా. చూ. దబ్బ (10). తుంగ పోచను నిలువుగా మధ్యకు చీలిస్తే వచ్చే భాగం; బద్ద (రా. 10).

పక్కాకు బుట్ట: ఉ. —బుట్ట; వక్క, ఆకులు మొ॥ తాంబూల ద్రవ్యాలు పెట్టుకోడానికి అల్లిన బుట్ట; మరచెంబు ఆకారంలో ఉంటుంది; చూ. చిత్రం 69 చ (రా. 9).

వంక: ఉ. వొంక 1. కొడవలి వంపు (తె. 26); 2. వాగు కన్న చిన్న నీటిపాయ (తె. 1).

వంక కట్టె: ఉ. అంక—; పర్యా. చూ. వంక కర్ర (1). పాము పడగమాదిరిగా మొదలు వంపు తిరిగిన వెదురుకర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ (తె. 23).

వంక కర్ర: ఉ. వొంక—, వొంకె—; 1. పర్యా. కండ్లకట్టె; కన్ను కట్టె, కొరికిడి కట్టె (1), చేతి కర్ర (2), పడిగె కట్ట, పిట్ట కర్ర, బుర్ర కర్ర, ముడుసు కట్టె, మోతి కర్ర, మోర్కట్టె, లట్టు, వంక కట్టె. పాముపడగ మాదిరిగా మొదలు వంపు తిరిగిన వెదురు కర్ర; సుమారు గజం పొడుగుంటుంది; వేళ్ళు చెలిగేసిన చోట్ల మచ్చలుంటాయి; చేతికర్రగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 8 చ (కో. 9, 29; తె. 18); 2. పర్యా. కంకబొంగు(2), కుంటి వెదురు; పాము వంక బొంగు, ముల్సు, రాట (1), వంకటి కర్ర. ప్రతి కణుపుదగ్గరా వంపు తిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగ పడదు (కో. 3, 14, 22, 29, 27, 30).

వంకటి కర్ర: ఉ. వొంకటి—; పర్యా. చూ. వంక కర్ర (2). ప్రతి కణువు దగ్గరా వంపు తిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు (కో. 29).

వంక బొంగు: పర్యా. చూ. వంక కర్ర (2). ప్రతి కణుపు దగ్గరా వంపు తిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు (కో. 5).

వంకరవాసం: పర్యా. చూ. వంకకర్ర (2). ప్రతి కణుపు దగ్గరా వంపు తిరుగుతూ పెరిగే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడదు (కో. 14).

వంకాయల గంప: వంకాయలు అమ్మడానికి అల్లిన వెదురుపేళ్ళ గంప (కో. 16).

వంకె: ఉ. అంకె, వొంకె; పర్యా. గుర్రం కర్ర, గుర్రం (1), చిక్కడి (1), వంకెన. వెదురుపేడు గీకడానికి వాడే ఒక పనిముట్టు; X ఆకారం బద్దల/కర్రల మీద ఒక పొడుగాటి కర్రగాని బద్దగాని అమరుస్తారు; దానిమీద పేడు ఆనించి కత్తిని వెనక్కి ముందుకూ లాగుతూ పేడు గీకుతారు; చూ. చిత్రం 14 చ (తె. 6–9, 18, 20, 23).

వంకె కర్ర: పర్యా. కర్ర (10), చిక్కడి కర్ర; వంకె కోల. వంకె (చూ.) నిర్మాణంలో X ఆకారం కర్రలకు కట్టిన గజం పొడుగు వెదురుకర్ర. చూ. చిత్రం 14 చ. 1 (కో. 31).

వంకెకాలు: ఉ. అంకె—; పర్యా. కాలు (19). వంకె (చూ.)కు X ఆకారంలోని కిందిభాగం (కింది రెండు కర్రలు లేదా బద్దముక్కలు); చూ. చిత్రం 14 చ. 3. (తె. 23).

వంకెకోల: పర్యా. చూ. వంకెకర్ర. వంకె (చూ.) నిర్మాణంలో X ఆకారం కర్రలకుకట్టిన గజం పొడుగు వెదురుకర్ర. చూ. చిత్రం 14 చ. 1. (తె. 23).

వంకెచెవులు: పర్యా. చెవులు. వంకెనిర్మాణంలోని X ఆకారానికి పైభాగం. చూ. చిత్రం 14 చ. 2. (తె. 23).

వంకెతల: ఉ. అంకె—; పర్యా. మూతి (7). వంకె (=పేడు గీయడానికి వాడేది)కు X ఆకారం దగ్గరుండే పొడుగాటికర్ర చివరిభాగం చూ. చిత్రం 14 చ. 5. (తె. 23).

వంకెన: పర్యా. చూ. వంకె. వెదురుపేడు గీకడానికి వాడే ఒకపనిముట్టు; X ఆకారంబద్దల/కర్రలమీద ఒక పొడుగాటి కర్రగాని బద్దగాని అమరుస్తారు; దానిమీద పేడు ఆనించి కత్తిని వెనక్కి ముందుకూ లాగుతూ పేడు గీకుతారు; చూ. చిత్రం 14 చ. (తె. 25).

వంకెబట్టు: (క్రి.) వంకె (చూ.) అనే సాధనంమీద వెదురుపేడు పెట్టి సన్నగా గీకడం. (తె. 20).

వంకెబద్ద: ఉ. వొంకె—: పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచికట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికి మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; చూ. చిత్రం 69 క. 4. (తె. 31).

వంకెబుట్ట: ఉ. వొంకి—; పట్టుకోడానికి వంకరబద్ద పెట్టిఅల్లిన వెదురుపేళ్ళబుట్ట. (కో. 10).

వంకొంకకఱ్ర: (< వంక + వంక–) పర్యా. చూ. వంకకఱ్ర (2). ప్రతికణుపుదగ్గరా వంపుతిరుగుతూ పెరిగే వెదురుగడ; సేదరిపనికి ఉపయోగపడదు. (కో. 24).

వంగదీయు: (క్రి.) ఉ. ఒంగ–, పర్యా. చూ. వంచు(1). గంప, తట్ట, గుల్ల, మానె మొ॥ అల్లేటప్పుడు అడుగు (చూ.) అల్లకం పూర్తయిన తరవాత ఎత్తుభాగం అల్లడానికి నేలబారున ఉన్న నిలువుల్ని పైకి లేపడం. (కో. 9).

వంగి(పోయి)నకఱ్ర: ఉ. ఒంగి(పోయి)న–; పర్యా. వంపువెదురు, వాలుగఱ్ర. పైన బరువు ఎక్కువ కావడంవల్లా గాలివల్లా మధ్యకు వంగిపోయిన వెదురుగడ; వంగినచోట పేడు విరుగుతుంది. (కో. 23, 24, 27).

వంగు: ఉ. వొంగు; పేముకుర్చీలో కూర్చొనే భాగంలో సీటుకఱ్రకు అమర్చే వంపుకఱ్ర. (కో. 12, 19).

వజ్జెట్టు: (క్రి.) ఉ. వొజ్జెట్టు; తాటాకు(రేకు)ను సాపు చేయడం. (కో. 20).

వంచు: (క్రి.) ఉ. అంచు, ఒంచు, వొంచు 1. చూ. వంపు; 2. పర్యా. మలుచు(1), వంగదీయు. గంత, తట్ట, గుల్ల, మానె మొ॥ అల్లేటప్పుడు అడుగు (చూ.) అల్లకం పూర్తయిన తరవాత ఎత్తుభాగం అల్లడానికి నేలబారునఉన్న నిలువుల్ని పైకిలేపడం. (కో. 1–3, 5, 22, 26, 27, 29–31; తె. 13, 16, 17, 21; రా. 8, 10, 11); 2. పర్యా. చూ. మలుపు(3). చేట మొ॥వాటి అల్లకంలో పేడు ఒక వైపునుంచి మరోవైపుగాని కిందికీ మీదికీగాని తిప్పడం. (తె. 22).

వంచుడుబద్ద: పర్యా. చూ. నిలుగు(2). గంప, తట్ట, బుట్ట, సజ్జబుట్ట మొ॥వాటి అల్లకంలో అడుగు నుంచి అంచుదాకా నిలువుగావేసిన మందంపేడు; దీన్ని గంటిబద్ద నుంచి తీస్తారు. (తె. 29).

వంజేరు: పర్యా. చూ. కొమ్ము (2). చేట ముందు భాగంలో రెండుమూతులను (కొసలను) కలుపుతూ అడ్డంగావేసిన చిటికెనవేలెడు లావు వెదురుబద్ద; మొదట దీనికే పేళ్ళు ఎక్కించి ఇక్కణ్ణించే అల్లకం మొదలెడతారు. చూ. చిత్రం 20, 2. (తె. 29).

వట్టి: (విశ.) తడి ఆరిపోయిన; ఎండిపోయిన. (తె. 21).

వట్టికఱ్ర: ఉ. వొట్టి–; పర్యా. చూ. ఎండుబొంగు(1). ఎండిపోయిన వెదురుగడ; ఉప్పలం తెగులుసోకి గాని నీళ్ళు అందకగాని పొదమీదే గడ ఎండి పోతుంది. (కో. 6).

వట్టిగడ్డి: ఉ. ఒట్టి ; పర్యా. సిబ్బెనుగడ్డి చల్లదనమూ సువాసనాఇచ్చే ఒకరకం గడ్డి; దీన్ని చిల్మాన్లు (= చల్లదనంకోసం వేలాడదీసే తడకలు; చూ.) కట్టడానికి ఉపయోగిస్తారు. (తె. 31).

వట్టినార: ఉ. వొట్టి ; కలబందమట్టను నానబెట్ట కుండా తీసిన నార. (రా. 5).

వట్టిపెరటుకఱ్ర: ఉ. వొట్టి–; పురుగు తొలవడం వల్ల సగభాగం పచ్చిగానూ సగభాగం ఎండిపోయీ ఉండే వెదురుగడ. (కో. 4).

వట్టిబొంగు: ఉ. ఒట్టి–; వొట్టి–; పర్యా. చూ. ఎండుకఱ్ర (2). ఇంటికితెచ్చిన తరవాత ఎండి పోయిన వెదురుగడ; నాలుగురోజులు నానేసి దీన్నుంచి పేడుతీస్తారు. (తె. 4, 9, 16).

వట్టివేరు: ఉ. వట్టేరు; పర్యా. వట్టివేరుపుల్ల. సువాసన ఉండే ఒకరకం మొక్కవేరు; ఎండాకాలంలో చల్ల దనంకోసం గుమ్మాలకూ కిటికీలకూ వట్టివేళ్ళ తడకలుకట్టి నీళ్ళు చల్లుతారు. (తె. 6, 8–10).

వట్టివేరుచిక్కు: ఉ. వట్టేరు–; వట్టివేళ్ళతో కట్టిన తడక; చూ. చిక్కు. (తె. 14).

వట్టివేరుపుల్ల: ఉ. వట్టేరు–; పర్యా. వట్టివేరు. సువాసనఉండే ఒకరకం మొక్కవేరు; ఎండా కాలంలో చల్లదనంకోసం గుమ్మాలకూ కిటికీలకూ వట్టివేళ్ళ తడకలుకట్టి నీళ్ళు చల్లుతారు. (తె. 10).

వడగంప: పర్యా. చూ. బియ్యంగడుగు బుట్ట. బియ్యం కడిగి గాలించినతరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసి ఉంచేబుట్ట, కొంచెం పలచగాఉంటుంది; కొన్నిచోట్ల కింద సన్నగాఉండి పోనుపోను వెడల్పుగాఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి ఒకేతీరుగాఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగుమూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది (దీన్ని చేటమాదిరిగా అల్లు తారు); సంతర్పణవంటలకు వాడతారు; చూ. చిత్రం 48. (రా. 8).

వడబుట్ట:[1] పర్యా. చూ. బియ్యంగడుగు బుట్ట. బియ్యం కడిగి గాలించిన తరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసిఉంచే బుట్ట; కొంచెం పలచగాఉంటుంది; కొన్ని చోట్ల కింద సన్నగాఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి ఒకే తీరుగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగుమూల లుగాఉండి పైన గుండ్రంగాఉంటుంది (దీన్ని చేట మాదిరిగా అల్లుతారు); సంతర్పణవంటలకు వాడ

తారు; చూ. చిత్రం 48. (కో. 4).

వడబుట్ట:[2] వడలు (గారెలు) అమ్మడానికి విశాలంగా అల్లిన బుట్ట. (కో. 9).

వడి: (—వేయు) పర్యా. చూ. అని (9). ఈతచాప అల్లకానికి ఒక చేతిలోకితీసుకొన్న (ఆరు) ఆకులను ఇంకోచేతిలోకి తీసుకొన్న (ఏడు) ఆకులతో పడుగు పేకలుగా కూర్చిన భాగం. (తె. 26).

వడికర్ర: పర్యా. చూ. చేతికర్ర (1). చేతికి ఊతగా పట్టుకొనే వెదురుకర్ర; మూడునాలుగు వేళ్ళ లావు సుమారు రెండుగజాల పొడుగూ ఉంటుంది; కోలు లేకుండా గట్టిగా ఉంటుంది; దీనికొసా మొదలూ ఒకే లావుంటాయి; సాము చేయడానికి కూడా ఉపయోగపడుతుంది. (రా. 3).

వడికర్రలు: (బ.) ఉ. —కట్లు; పర్యా. చూ. ముక్కాల కర్రలు. (తుంగ)చాప నేసేమగ్గం మధ్య భాగంలో గుడిసెమాదిరిగా అమర్చి నిలబెట్టిన మూడుకర్రలు; వీటిలో సమాంతరంగా నిలబడి ఉండే రెండుకర్రలకు అనికర్ర (= అని మార్చడానికి)ను వేలాడదీస్తారు; కొన్ని ప్రాంతాల్లో దీనికి అచ్చు (= తుంగపోచలను దగ్గరికి జరపడానికి పోగులు కూర్చిన చెక్క)ను వేలాడదీస్తారు. చూ. చిత్రం 120 క. 1. (రా. 2).

వడిదబ్బ: పర్యా. చూ. పొట్టదబ్బ. ఈతకమ్మపొట్ట (చూ.) చీరితీసిన బద్ద; గంప మొ॥ అల్లేటప్పుడు నిలువులకు వాడతారు. చూ. చిత్రం 11.2 (తె. 9).

వడివేయు: (క్రి.) ఉ. వడేయు; పర్యా. పేడు (8). నారకు పురిబెట్టడం; మెలిదిప్పుతారు. (రా. 4).

వడుకు: (క్రి.) ఉ. వొడ్కు; కలబందనార కొన ఒకటి కదురుకుకట్టి కదురు తిప్పుతూ నారపోచలతో దారం తయారుచేయడం. (కో. 3; రా. 10).

వడేయు: (క్రి.) 1. బియ్యం గాలించి నీళ్ళు ఓడిపోయేటట్లు చెయ్యడం. (కో. 17; తె. 8, 30); 2. వడబోయడం. (తె. 9).

వడ్డెరతట్ట: వడ్డెరవాళ్ళు కంకరమోసే గంప. (తె. 26).

వడ్లగంప: పర్యా. చూ. గంప (5). ఈతచువ్వలతో అల్లినగంప; గుల్లకన్న పెద్దది; ధాన్యం పోసుకోడానికి ఎరువు చేరవేయడానికి వాడతారు. (తె. 14).

వడ్లగాదె: పర్యా. చూ. గుమ్మి (2). ఒకచోట స్థిరంగా ఉంచి పెద్దమొత్తంలో వడ్లు మొ॥ పోసిపెట్టుకోడానికి వెదురుపేళ్ళతో అల్లినది; సుమారు గజం ఎత్తూ ముప్పావు గజంనుంచి గజంన్నరవరకు వెడల్పూ ఉంటుంది; కొన్నిచోట్ల కింద నాలుగు మూలలుగానూ పైన గుండ్రంగానూ, కొన్నిచోట్ల కిందినుంచి మీదికి గుండ్రంగానూ, కొన్నిచోట్ల కింద వెడల్పుగా గుండ్రంగానూ మధ్య కొంచెం వెడల్పుగా ఉండి పోనుపోను మూసుకొచ్చే విధంగానూ, కొన్నిచోట్ల కింద గుండ్రంగానూ పోను పోను పైన సన్నగానూ ఉంటుంది; కొన్నిచోట్ల దీనికి శిఖరంలాంటి కప్పు ఉంటుంది; రెండుబస్తాల నుంచి 12 బస్తాలవరకు ధాన్యంపట్టే పరిమాణంలో ఉంటాయి; చూ. చిత్రాలు 74 క-ట. (కో. 1).

వడ్లగుమ్మి: వడ్లు పోసుకొనే ఈతచువ్వల గాదె; చూ. గుమ్మి. (తె. 14).

వడ్లజల్లెడ: వడ్లు పట్టుకొనే జల్లెడ. (తె. 7; రా. 11).

వనరు: ఉ. ఒనరు; వసతి; సౌకర్యం. (తె. 3).

వంపు: ఉ. అంపు, ఒంపు, వొంపు; 1. పర్యా. చూ. వెన్ను (4). మేదరికత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ, మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 డ. 3. (రా. 10); 2. పర్యా. చూ. గావు. ఎరకలికత్తి (కొడవలి)లో వంపుదిరిగి పదునుగా ఉన్న భాగం. చూ. చిత్రం 113.3 (కో. 3, 14; రా. 8); 3. పర్యా. చూ. మడుపు (1). గంప, తట్ట, గుల్ల, సిబ్బి మొ॥ వస్తువుల అల్లకం పూర్తయిన తరవాత మిగిలిన నిలువుల చివర్లను వెనక్కితిప్పి అంచులోపలికి దోపినప్పుడు వచ్చినవంపు. చూ. చిత్రం 47 క. 1. (కో. 28).

వంపు[2]: (క్రి.) 1. రూ. వంచు(1). (కో. 25, 26, 28; తె. 18, 19, 22, 24, 25); 2. చేటమూలలు అల్లినతరవాత ఎత్తుభాగాన్ని (వెనకాల) పైకి లేపడం. (కో. 31).

వంపుడుబద్ద: ఉ. అంపుడు—; ఒంపుడు—, వొంపుడు—; 1. పర్యా. చూ. కమాన్‌బద్ద(1). చేతిబుట్ట, కంతబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టినబద్ద; చేత్తో పట్టుకోడానికి మేకుకు తగిలించడానికి వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (కో. 31; తె. 16, 21); 2. పెళ్ళిబాసికానికి వంచి కట్టిన పలచటి వెదురుబద్ద; వేలెడు వెడల్పు ఉంటుంది. చూ. చిత్రం 108. 1. (తె. 6).

వంపులకొట్టం: ఉ. వొంపుల—; రెండువైపులా ఏటవాలుగా వాలేకప్పున్న ఇల్లు. (రా. 9).

వంపువెదురు: ఉ. ఒంపెదురు; పర్యా. చూ. వంగి(పోయి)నకఱ్ఱ. పైన బరువు ఎక్కువకావడం వల్లా గాలివల్లా మధ్యకు వంగిపోయిన వెదురుగడ; వంగినచోట పేడు విరుగుతుంది. (కో. 22).

వరస: ఉ. ఒరస; తాటిచాప అల్లకంలో ఒకవైపునుంచి మరోవైపు మూలగా సాగేరేకు(లు). (కో. 23)

వరాలు: (బ.) (<వరహాలు) డబ్బు; పెళ్ళికి నిశ్చితార్థం చేసుకొనేటప్పుడు తాంబూలంలో డబ్బు పెడతారు. (కో. 1).

వరిమళ్ళపంతా: ఉ. —పంత; వరిమళ్ళలాంటి పనివరస (=డిజైను) వచ్చేటట్లు అల్లినవిసనగఱ్ఱ. (తె. 9).

వలం: 1. పర్యా. చూ. మొదలు(1). వెదురుగడ మొదటిభాగం; వేళ్ళకుపైది; కొసకన్న లావుగా ఉంటుంది. చూ. చిత్రం 4. 2. (కో. 24); 2. పర్యా. దొడ్డు, లావు. (కో. 24, 31).

వలుంసులక: ఉ. వొలుం—; పర్యా. ముతకసులక. చేంతాళ్ళు పేనడానికివాడే లావుపాటి సులకతాడు. (కో. 25).

వలుంవారం: ఉ. వొలుమోర; పర్యా. లావీనె(1). మామూలుకఱ్ఱ (చూ.) కన్న కొంచెం మందంగానూ వెడల్పుగానూ ఉండేకఱ్ఱ; గంప మొ॥వాటి అల్లకంపనిలో ఎత్తుగా వచ్చేభాగం అల్లడానికి ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 47 క. 2. (కో. 31).

వాకిలితడక: ఉ.— తడక, —తడికె 1. పర్యా. గనుమతడక, గుమ్మంతడక(1), తడక(2), తలుపుతడక, దువారంతక(1), మూతతడక(3), మొత్తతడక(1), రెక్క(2). గుమ్మానికి అడ్డంగా తలుపుమాదిరిగా పెట్టే వెదురుతడక; మామూలు పూరిళ్ళకూ గుడిసెలకూ పెడతారు. (కో. 3–6; రా. 8, 10); 2. పర్యా. చూ. దర్వాజాతడక. తడకలతో కట్టిన ఇంటిముందు భాగానికి తలుపుతో సహా అమర్చిన పెద్దతడక; చూ. చిత్రం 38 క. (కో. 12).

వాగు: వర్షాకాలంలో మాత్రమే పారే చిన్నఏరు. (తె. 1–4).

వాగుజాలుబొంగు: పర్యా. జోబస్తలంకఱ్ఱ. వాగు ఒడ్డునగాని ఏటి ఒడ్డునగాని పెరిగిన వెదురుగడ; మెత్తగా ఉంటుంది. (తె. 30).

వాడి: ఉ. అడి, వాడె; రూ. వాండి; పర్యా. చూ. పదును(1). కత్తి, అంబు, చురకత్తి ఉలి మొ॥ వాటివాడి; మెత్తగా తెగేభాగం; కొయ్యడానికి నరకడానికి వీలయినది. చూ. చిత్రాలు 12 క–డ; 16 క–వ. (కో. 24; తె. 11, 13, 16).

వాడీలు: (బ.) ఒకతెగ; చేపలుపడతారు; వీళ్ళకు జాలరివాళ్ళతో కంచంపొత్తేగాని మంచంపొత్తు లేదు. (కో. 29).

వాండి: చూ. వాడి (కో. 24).

వాదర: చూ. వాయిదార (కో. 3–7, 31; రా. 4).

వాదరపోయు: (క్రి.) పర్యా. చూ. బండపు. కత్తి మొ॥ వాటి పదును పోవడం (కో. 3).

వాౘె: నాగలికి కాడి అమర్చడానికి వాడే తాడు; వారిజె; దీని కొసకు పొడుగాటి ఉంగరం ఉంటుంది; ఏ నారతో అయినా పేంతారు; కొన్నిచోట్ల దుసేరు తీగలతో పేనింది (తె. 9, 17).

వాయనం చేట: ఉ. వాయినం ; 1. పర్యా. చూ. మూసి వాయనం చేట. ముత్తైదువ చనిపోయి నప్పుడు ఆమె పేరుమీద మూసివాయనం (సాంగం; పసుపు, కుంకుమ మొ॥ పెట్టి ఇచ్చే చేట; వాయన మిచ్చేటప్పుడు పైన మరో చేట బోర్లిస్తారు (కో. 2, 3); వాయనమిచ్చే చేట; వినాయక చవితినాడు దీంతో బ్రాహ్మడికి వాయనదానమిస్తారు (రా. 8).

వాయనం: పర్యా. సాంగం. నోములూ పండుగలూ చేసుకొనేటప్పుడుగాని, పునిస్త్రీ చనిపోయినప్పుడు గాని (దానంగా) ఇచ్చేది; పునిస్త్రీ చనిపోయినప్పుడు ఆమె పేరు మీదుగా వాయనం (పసుపు, కుంకుమ, గాజులు మొ॥పెట్టి) ఒక పునిస్త్రీకి దానంగా ఇస్తారు; అంచుకట్టని చేటలో వాయనంపెట్టి పైన మరో చేటతో మూస్తారు (కో. 2, 3, 12, 19, 20, 28; రా. 8, 10).

వాయి: ఉ. అయి, వాయ; పర్యా. చూ. పదును (1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥ వాటి వాడి; మెత్తగా తెగే భాగం; కొయ్యడానికి నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు 12 క–డ; 16 క–వ. (కో. 3, 8–18 31; తె. 15, 17, 20).

వాయిదం: ఉ. ఆయిదం, ఆయుదం; పర్యా. చూ. పదును (1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥ వాటి వాడి; మెత్తగాతెగేభాగం; కొయ్యడానికీ నరకడానికీ వీలయినది. చూ. చిత్రాలు. 12 క–డ; 16 క–వ. (తె. 7–10, 18, 22, 24–28, 31; రా. 11).

వాయిదార: ఉ. ఆయిదార్, ఆయుదారం, వాయిదారు; రూ. వాదర; పర్యా. చూ. పదును (1). కత్తి, అంబు, చురకత్తి, ఉలి మొ॥ వాటి వాడి; మెత్తగా

తెగే భాగం; కొయ్యడానికి నునుపడానికీ వీలయినవి. చూ. చిత్రాలు 12 క-ఢ; 16 క-న (తె. 5, 6, 10, 21-23, 28, 30; రా. 1, 7, 9).

వాయి మడుపు: (క్రి.) అల్లగా మిగిలిన నిలువు భాగాన్ని మలిచి దానిపక్క నిలువుపగ్గర అంచు లోపలికి దోపడం (రా. 9).

వార: ఉ. ఓర, వోర; 1. పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీస్తే వచ్చే ఒక భాగం (తె. 29); పర్యా. చూ. పలుకు (2). సుద్ది బద్ద (చూ.) ను నిలువుగా బద్ద వెడల్పులో సగానికి చీల్చిన భాగం (గడలో ఎనిమిదో భాగం); దీన్నించి పేడు తీస్తారు; వేలెడు వెడల్పు ఉంటుంది (కో. 5, 10, 15; తె. 8, 23); 3. పర్యా. చూ. గోవ (2). నిలువుగా చీరిన గంటిబద్ద (చూ.) మూడు నాలుగు భాగాల్లో ఒకటి; గంటిబద్ద వెడల్పులో మూడో వంతుగాని నాలుగో వంతుగాని ఉంటుంది; దీన్నించి గంపలూ, బుట్టలూ, మొ॥ అల్లడానికి సరిపోయే ఈనె (=తీగలాటి సన్నటి భాగం)లు తీస్తారు (కో. 3, 16-18; తె. 16-19, 21-26; 4. పేడంత వెడల్పూ నాలుగుపేళ్ళ మందమూ ఉన్న పేడు; ఇది తడకలు అల్లడానికి పనికొస్తుంది; దీంతో అల్లిన తడకను వారతడక అంటారు. (తె. 24,22); 5. అల్లడానికి కావలసిన పరిమాణాల్లో పేడు తీయడానికి చెక్కిన బద్ద. (కో. 6, 12, 17; తె. 3), 6. పర్యా. చూ. కర్ర (9). గోవ (వార)నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరిన భాగం; పేడువెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (కో. 19, 23, 25, 27, 31); 7. పర్యా. చూ. నిలువు (1). తడక, పిల్లలపొది, కొడమ మొ॥వాటి అల్లకంలో నిలువుగావచ్చే బద్ద లేదా పేడు; మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు; కొన్నిచోట్ల మందం లోనూ వెడల్పులోనూ తేడాలుంటాయి. (కో. 31; తె 31); 8. పర్యా. చూ. కర్ర (2). చేట అంచు కట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడులావుండే కడ్డీలాంటి వెదురుబద్ద, చేట అంచుకు లోపలి నుంచి ఒకబద్దా వెలుపలినుంచి ఒకబద్దాపెట్టి ఈ రెంటిమీదినుంచి ఈ రెంటికీమధ్య సందులో ఇరికే టట్లు సందునుమూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్ర పెట్టినతరవాత కట్లుపడతాయి. (కో. 20-23, 25, 26, 28, 31); 9. పర్యా. చూ. కర్ర (1). జల్లెడ అంచుకట్టడానికి లోపలిగుండు, బయటు (వెలుపలి బద్ద)లమీంచి, ఆ రెంటిమధ్య కొంతభాగం ఇరికిస్తూ వేసిన గుండ్రంగా వంచికట్టిన రెండుమూడువేళ్ళ వెడల్పుబద్ద. (కో. 21, 25, 28); 10. మామూలు పేడుకంటె రెట్టింపుమందమున్న పేడు; దీనిని మొ॥ అల్లడానికి ఉపయోగిస్తారు. (తె. 24).

వారగర్ర: 1. పర్యా. చూ. గంటిబద్ద (1). గంటి గనుపుగుర్తు (=వెదురుగడను పెరిగిన కొమ్మ నరికేస్తే మిగిలేకొమ్మగుర్తు) ఉన్న వెదురుబద్ద; ఇలాటివి గడకు రెండువస్తాయి; ఇది కర్రకూ నిలువులకూ పనికొస్తుంది; అనవిప్రాంతంవాళ్ళు దీనిని పారేస్తారు. చూ. చిత్రం 9. (తె. 23); 2. పర్యా. గోడుదబ్బ (1). ఊకగంప మొ॥ వాటి అల్లకంలో నిలువులకువాడే వెదురుపేడు; మందం బద్దకంటె కొంచెం వెడల్పుతక్కువగానూఉంటుంది; దీన్ని గంటిబద్దనుంచి తీస్తారు. (కో. 17, 18); 3. పర్యా. చూ. గోలుగర్ర. గుండ్రంగానూ కాస్త లావుగానూఉండే కర్ర (చూ. కర్ర); గంప మొ॥ వాటి అల్లకంపనిలో కట్టుచుట్టడానికీ అడుగుదొక్క డానికీ పనికొస్తుంది. (తె. 30).

వారగా: (క్రి. విశ.) పర్యా. గేడిగా, ఏటవాలుగా; పుల్లలతడక (చూ. చిల్మాను)కోసం పుల్లలను ఇలా చెక్కుతారు. (తె. 10).

వారంచు: నిలువుగాచీల్చిన అంచు ( బద్ద నిలువునా సగానికి లేదా గడలో ఎనిమిదోభాగం)లో సగభాగం; బద్దను రెండంచులుగానూ; అంచును రెండు వారంచులుగానూ చీలుస్తారు. (కో. 2).

వారతడక: ఉ. వారతడికె, వోరతడిక, వోరతడక; 1. నిలువులు (వారలు)పెట్టి అల్లిన తడక. (తె.28); 2. వారగర్రలతో అల్లిన తడక; ? ఫ్రేము బద్దలు వస్తాయి; మూరకొక పైబద్దవేస్తారు. (తె. 31) ;3. రెండుతడకలుకలిపి ఒకటిగాకట్టిన తడక. (తె. 26); 4. వెదురుపేళ్ళతో పలచగా అల్లినతడక. (కో.12).

వారలుబట్టు: (క్రి.) ఉ. వార్లు—; పర్యా. చూ. వారలొత్తు. వెడల్పు వెదురుబద్దనుంచి పేడుకు సరిపోయేటంత వెడల్పుగా సన్నటిబద్దలు (వారలు) చీరడం; దీన్నించి పేడు చీలుస్తారు. (కో. 3; 5).

వారలెత్తు: (క్రి.) ఉ. వార్లుఎత్తు; పర్యా. చూ. వారలొత్తు. వెడల్పు వెదురుబద్దనుంచి పేడుకు సరిపోయేటంత వెడల్పుగా సన్నటిబద్దలు (వారలు)

చీరడం; దీన్నుంచి పేడు చీలుస్తారు. (కో. 6).

వారలొత్తు: (క్రి.) ఉ. వార్లొత్తు, సరుములొత్తు. వెడల్పు వెదురుబద్దనుంచి పేడుకు సరిపోయేటంత వెడల్పుగా సన్నటిబద్ద (వారలు) చీరడం; దీన్నుంచి పేడు చీలుస్తారు. (కో. 12, 15-18).

వారు: పర్యా. చూ. పెండెవార. బుట్ట, తట్ట, గంప మొ॥వాటి అల్లకంపనిలో కట్టు (బొద్దు) చుట్టడానికి ఉపయోగించే కర్ర (చూ. కర్ర); పేడులోసగం వెడల్పు కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది; బద్దకు పల్లంగా ఉండే భాగంనుంచి చీల్చితీస్తారు. చూ. చిత్రం 47 క, 6. (రా. 9).

వాలిపోయినకర్ర: పర్యా. పడుకర్ర. మొదలు కాలిపోయిగాని పుచ్చిపోయిగాని గాలిపల్లగాని విరిగిపడిన వెదురుగడ. (కో. 28).

వాలుగర్ర: పర్యా. చూ. వంగి(పోయి)నకర్ర. పైన బరువు ఎక్కువకావడం వల్లా గాలివల్లా మధ్యకు వంగిపోయిన వెదురుగడ; వంగినచోట పేడు విరుగుతుంది. (కో. 28).

వావిలికట్టె: ఉ. ఆయిల్-; వాయిల్—; పర్యా. వావిలిబరిగె. వావిలిపొదనుంచి తీసిన చువ్వ(బరిగె); బండిజల్ల, గొర్రెపిల్లలపొది, పేడతట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది; పచ్చిగా ఉన్నప్పుడు ఆకుపచ్చరంగులోనూ ఎండిన తరవాత గచ్చకాయ రంగులోనూ ఉంటుంది; గుండ్రంగా ఉంటుంది; గజంనుంచి నాలుగైదుగజాల పొడుగువరకు ఉంటుంది. దీన్ని చేలగట్లవెంట కంచెగా వేస్తారు. (తె. 7, 9, 14, 16).

వావిలి బరిగె: ఉ. వాయిలి—, వాయిల్ బర్రిగె; పర్యా. వావిలి కట్టె. వావిలి పొదనుంచి తీసిన చువ్వ (బరిగె); బండిజల్ల, గొర్రెపిల్లల పొది, పేడతట్ట మొ॥ అల్లడానికి పనికొస్తుంది; పచ్చిగా ఉన్నప్పుడు ఆకుపచ్చ రంగులోనూ పండిన తరవాత గచ్చకాయ రంగులోనూ ఉంటుంది; గుండ్రంగా ఉంటుంది; గజంనుంచి నాలుగైదు గజాల పొడుగు వరకు ఉంటుంది; దీన్ని చేలగట్ల వెంట కంచెగా వేస్తారు (తె. 14).

వాసం: 1. పర్యా. చూ. వెదురు బొంగు. వెదురు పొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి 20 గజాల వరకు లావూ ఉంటుంది; మొదట లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొ॥న ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ గంప మొ॥ అల్లుతారు; చీల్చని గడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (కో. 10, 21); 2. పర్యా. వాసాలవెదురు, వెన్నుగర్ర (2). కప్పు ఏటవాలుగా ఉండే ఇంటికి వెన్నుగర్రగా పనికొచ్చే వెదురుగడ; లావుగానూ, పొడుగ్గానూ ఉంటుంది; మూడు నాలుగంగుళాల మందముంటుంది; పందిరికి కూడా వాడతారు. (కో. 16, 17, 19, 21, 26, 28, 29; తె. 13, 26).

వాసాలకట్ట: పర్యా. చూ. కట్ట (1). ఒకచోటికి చేర్చి కట్టిన వెదురుగడలు లేదా వెదురుబద్దలు; ఒకమనిషి మోయడానికి వీలయినవి. (కో. 11).

వాసాలవెదురు: ఉ. వాసాలెదురు; పర్యా. చూ. వాసం(2). కప్పు ఏటవాలుగా ఉండే ఇంటికి వెన్నుగర్రగా పనికొచ్చే వెదురుగడ; లావుగానూ, పొడుగ్గానూ ఉంటుంది; మూడు నాలుగంగుళాల మంద ముంటుంది; పందిరికికూడా వాడతారు. (కో. 31).

వాసూరుబొంగు: పర్యా. చూ. ముల్లెం(పు)బొంగు. వెదురుగడల్లో ఒకరకం; పెళుసుగా ఉంటుంది; సుమారుగా చెయ్యంత లావునుంచి స్తంభంలావు వరకు ఉంటుంది; కణుపుచుట్టూ ముండ్లు ఉంటాయి; లోపల బోలుగా ఉంటుంది; మేదరిపనికి ఉపయోగ పడదు; నిచ్చెన, బండిదండి (తొట్టిగడ), ఇంటి వాసం మొ॥వాటికి పనికొస్తుంది; ఎక్కువకాలం పొదకు ఉండడంవల్ల దీని కణుపులదగ్గర పెరిగే కొమ్మలు లావెక్కి కణుపు గట్టిపడుతుంది; కాబట్టి దీన్ని చీల్చడం కష్టం; మామూలుగా దీని కణుపుల మధ్య ఎడం ఎక్కువ; ఇది ఎక్కువగా కొండలు, గట్లు మొ॥వాటిమీద మొలుస్తుంది. (కో. 2).

విడికాయితం: ఉ. యిడి—; విడాకులపత్రం; ఆలుమగలు విడిపోవడానికి రాసి ఇచ్చింది. (తె. 7).

విడిపురి: ఉ. ఇడి—; ఒంటిపురి; తాడు పేనడానికి వడిబెట్టిన పురుల్లో ఒకటి. (రా. 5).

విత్తనంగుంపు: ఉ. యిత్తనం—; పర్యా. చూ. పూసగనుపు. వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన సన్నచిల్ల (కొమ్మ) నరికేసినప్పుడు మిగిలిన చిన్నగుర్తు; ఈ గుర్తున్నగడ చీల్చడం సులువు. (కో. 25).

విదిలించు: (క్రి.) కలబందనార పట్టల్ని చేత్తో పట్టుకొని మట్ట రెండోకొసల్ని కట్టెతో కొట్టడం. (రా. 10).

విప్పు: (క్రి.) ఉ. యిప్పు; విడదియ్యడం; కొబ్బరి పీచు తోచలను దేనికది విడదీస్తాం. (కో. 25).

విబూది: ఉ. ఈబ్ది, యిబూది, వూద్ది; రూ. ఈ ప్తి ఈఋ; పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడచుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడ పుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (తె. 6, 26, 27; రా. 10).

వియ్యంపొత్తు: ఉ. యియ్యం- , పర్యా. ఇవ్వడం తీసుకోవడం, (పెళ్ళిసంబంధాల్లో) ఆడపిల్లలను ఇచ్చి పుచ్చుకోడాలు; వియ్యమందడం; పెళ్ళిసంబంధం కలుపుకొనే అనుకూలత. (తె 8, 9).

విల్లునంబు: (బ.) వెదురుబద్దలతో చేసిన విల్లూ అమ్ముా (విల్లమ్ములు). (కో. 9).

విసనగర్ర: ఉ. ఇసన- , ఇసిన- , ఇస్న- , యిఇస్—, యిసన—, విసిన- , విసిని--, —కర్ర; పర్యా. పంకా, విసర్కాన. గాలికోసం విసరడానికి వెదురుపేళ్ళతో అల్లినది; చదరంగా ఉంటుంది; పట్టుకోడానికి ఒక చుకకాడ(సన్నటిబద్ద)ఉంటుంది; కొన్నిచోట్ల కాడకు వెదురుగొట్టం తొడుగుతారు; మామూలుగా పొయ్యి విసురుకోడానికి వాడతారు; చూ. చిత్రం 31 క. (కో. 2, 3, 5-10, 14, 91; తె. 3-16, 17, 19, 21-28, 31; రా. 1-10).

విసనగర్రకాడ: పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచువెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (కో. 17).

విసనగర్రడుగు: ఉ. ఇసినకర్రడుగు; విసనగర్ర అడుగుభాగం. (రా. 8).

విసనగర్రదబ్బ: ఉ. ఇసనకార—, యిసనగర్ర—; చూ. విసనగర్రబద్ద. (రా. 5, 7).

విసనగర్రనేత: ఉ. ఇస్నకర్ర ; పర్యా. విసనగర్రల్లకం (1). మూడుపేళ్ళ కిందికీ మూడుపేళ్ళ పైకీ వచ్చేటట్లూ మధ్యన గార (చూ.) వచ్చేటట్లూ (విసనగర్ర మొ॥) అల్లే విధానం. (తె. 27).

విసనగర్రపేడు: ఉ. ఇసనకర్ర , ఇసినకర్ర -, ఇస్న—; పర్యా. గనుపుపేడు (2). విసనగర్ర అల్లకంకోసం పొడుగు గనుపులుగల (మూరెడుగాని అంతకన్న పొడుగ్గాగాని ఉన్న) వెదురుగడనుంచి తీసినపేడు; దీనికి మధ్యన కణుపుల గుర్తులుండవు (కణుపుల గుర్తులుంటే అల్లకం కుదరదు). కో 6, 11); తె. 31).

విసనగర్రబద్ద: ఉ. ఇసినికర్ర—, రూ. విసనగర్ర దబ్బ; పర్యా. చూ. బద్ద (4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టం తొడిగే బద్దకు చివర గొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట.2 (కో. 15).

విసనగర్రల్లకం: ఉ. ఇసినకర్రల్లకం, యిసనగర్ర ల్లకం; 1. పర్యా. విసనగర్ర నేత. మూడుపేళ్ళ కిందికీ మూడుపేళ్ళ పైకీ వచ్చేటట్లు మధ్యన గార (చూ.) వచ్చేటట్లూ (విసనగర్రలు మొ॥) అల్లే విధానం (తె. 7; రా. 8, 9); 2. మలకమంచం అల్లడంతో విసనగర్ర డిజైను వచ్చేలా అల్లేపద్ధతి (రా. 4).

విసర్కాన: ఉ. ఇసర్కాన; పర్యా. చూ. విసనగర్ర. గాలికోసం విసరడానికి వెదురుపేళ్ళతో అల్లినది; చదరంగా ఉంటుంది; పట్టుకోడానికి ఒకచుకకాడ (సన్నటిబద్ద) ఉంటుంది; కొన్నిచోట్ల కాడకు వెదురుగొట్టం తొడుగుతారు, మామూలుగా పొయ్యి విసురుకోడానికి వాడతారు; చూ. చిత్రం 31 క (తె. 1, 2).

వీపు: ఉ. ఈపు, యీపు 1. పర్యా. చూ. వెన్ను (1). వెదురుగడ చుట్టూ సున్నగా ఉన్న భాగం; గడ పచ్చిగా ఉన్నప్పుడు ఆకుపచ్చగానూ ఎండిన తరవాత పసుపచ్చగాగాని తెల్లగాగాని ఉంటుంది (తె. 3, 24); 2. పర్యా. వెన్ను (9). ఈతకమ్మ వెనకాల (కింది) భాగం నున్నగా ఉంటుంది. చూ. చిత్రం 11.5; 3. పర్యా. చూ. వెన్ను (4). మేదరికత్తికి ముందుగా ఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది. కత్తికి ఒక వైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12. ద. 3. (తె. 12, 15; రా. 1, 4, 5, 8, 9, 11); 4. పర్యా. చూ. వెన్ను (7). ఎరకలకత్తి (కొడవలి)కి పైన మందంగా ఉండే భాగం; కత్తికి ఒకవైపు పదునూ ఒకవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 13 క. 4 (తె. 13, 16); 5. కొడవలి వంపు దిరిగిన వెన్నుభాగం; పదును భాగం కన్న మందంగా ఉంటుంది. (తె. 21; రా. 6); 6. పర్యా. అడుగు (2). నేలకు ఆనే చేట కింది భాగం (తె. 21).

వీపుకర్ర: ఉ. యీపు—; పర్యా. చూ. పసదుగర్ర.

వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగముున్న బద్ద చీల్చగా వచ్చిన కర్ర (చూ.); గంప మొ॥ వాటి అల్లకంలో అడుగు చుట్టడానికి గంప ఎత్తుభాగంలో రెండుకర్ర వరస తరవాత అందం కోసం పట్టీలాగా కొన్ని వరసలు వేయడానికి వాడతారు. చూ. చిత్రం 63.1 (తె. 16).

వీపుకసి: ఉ. బీపు—; తాటేకు (రేకు) వెనక (వీపు) భాగం; ఉబ్బెత్తుగా ఉంటుంది (కో. 26).

వీపుతడక: ఉ. ఈపుతడ్క. 1. పర్యా. చూ. పసరు తడక. కేవలం పచ్చపేడు (= పైభాగం పచ్చగా నున్నగా ఉన్న వెదురుపేడు) అల్లిన తడక; దీని దర ఎక్కువ (తె. 2). 2. వెదురుబద్దల అల మారుకు వెనక (వీపు) వైపుండే తడక (తె. 5).

వీపుదబ్బ: ఉ. ఈపు—; యీపుదెబ్బ; 1. పర్యా. చూ. పసరుదబ్బ (1). పసరువన్నెలో నున్నగా ఉండే పైభాగంతో వచ్చిన వెదురుబద్ద (తె. 1, 2); 2. పర్యా. చూ. వెన్నుదబ్బ. ఈతకమ్మ వెన్ను (చూ.) చీరి తీసినబద్ద; గంప మొ॥వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. చూ. చిత్రం 11.4 (తె. 13, 16; రా. 8, 9).

వీపుపేడు: ఉ. ఈపుపేడు, ఈప్పేడు, యీప్పేడు; పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరినప్పుడు పచ్చగా నున్నగా ఉండే పైభాగంతో కూడి ఉన్న పేడు (తె. 2, 13; రా. 8).

వీపుబరిగె: పర్యా. చూ. వెన్నుదబ్బ. ఈతకమ్మ వెన్ను (చూ.) చీరి తీసినబద్ద; గంప మొ॥ వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు చూ. చిత్రం 11.4 (తె. 14).

వీరన్న: ఉ. యీరన్న; వీరభద్రుడు; మేదరిపనివాళ్ళు కొందరు వీరభద్రుణ్ణి కొలుస్తారు.

వీసె: ఉ. ఈసె; 1¼ కిలో బరువు; కొబ్బరినులక వీసెల్లో తూస్తారు (కో. 5, 29).

వీసె ఉక్కుకత్తి: ఉ. ఈసుక్కు—; వీసెడుబరువు ఉక్కుతో చేసినకత్తి. (రా. 4).

వీసెకాలువీసె ఉక్కుకత్తి: ఉ. ఈసకాలీసుక్కు—; వీసెంబావు బరువు ఉక్కుతో చేసినకత్తి. (రా. 4).

వెడతడక: ఉ. —తడ్క; పర్యా. చూ. మెడ్డ. నిలువుబద్దలు నేలలో పాతడానికి వీలుగా పెట్టి అడ్డం బద్దలతో అల్లిన తడక; దీనిచుట్టూ గోడమాదిరిగా మన్ను మెత్తుతారు; అకవి ప్రాంతంలో ఇలా చేస్తారు. (చూ. మెత్త; మాం. వృ. కోశం-4, వాస్తుపదజాలం; పుట 345). (తె. 31).

వెడల్పని: (< వెడల్పు + అని) ఉయ్యాల మొ॥వాటి అల్లకంలో వచ్చే నాలుగైదు నిలువులు కలిపినపట్టి. (రా. 10).

వెడల్పనె: (< వెడల్పు + ఈనె) పర్యా. చూ. వెడల్పుపేడు. వేలున్నర వెడల్పు ఉండే వెదురు పేడు; చాప మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 27, 28).

వెడల్పుపేడు: ఉ. ఎడల్పు—; రూ. ఎల్పుపేడు; పర్యా. బద్రె, వెడల్పనె. వేలున్నర వెడల్పు ఉండే వెదురుపేడు; చాప మొ॥ అల్లడానికి పనికొస్తుంది. (కో. 9, 16).

వెడల్పుబిలుకు: ఉ. ఎడెల్పుబిల్కు; వెడల్పుగా ఉన్న వెదురుబద్ద. (తె. 8).

వెంటబెండు: ఉ. యెంట—; 1. పర్యా. చూ. బిలుకు(1). జల్లెడ అంచు కట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండుచుట్టూ వేసే రెండుమూడు వేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలి గుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు చివర్లు (కర్పడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండు బద్దలపైనా మరో మందం బద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3. (తె. 13); 2. పర్యా. చూ. వెనకకట్టు (1). చేట వెలుపలి అంచుచుట్టూ పెట్టి బిగించేబద్ద (కట్టు). చూ. చిత్రం 29.7. (తె. 13).

వెదురడితి: ఉ. ఎదురడ్తి; పర్యా. చూ. అడితి (1). వెదురుగడల అమ్మకం జరిగేచోటు; అడవినుంచి తెచ్చి ఇక్కడ అమ్ముతారు. (కో. 18).

వెదురీనె: ఉ. ఎదురు ఈనే; పర్యా. చూ. కర్ర (3). గోవ (వార)నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్లబుట్ట మొ॥వాటి అల్లకంలో నిలువులచుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (కో. 8).

వెదురు: ఉ. ఎదరు, ఎదురు, యెదురు; 1. అడవుల్లో పొదగా పెరిగే తృణజాతికి చెందిన మొక్క; (Dendrocalamus hamiltonii, Man.); దీనిగడలు చీల్చి మేదరిపనికి వాడతారు; చూ. వెదురుబొంగు; చూ. చిత్రం 1. (కో. 1-31; తె. 1-12, 23, 27, 30; రా. 1-11); 2. పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5

గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగా ఉండి పోను పోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥వాటికి పనికొస్తుంది. చూ. చిత్రం 4. (కో. 1, 2, 23, 25, 26, 29, 31; తె. 1 9, 29; రా. 2-4, 11).

వెదురుకంజి: ఉ. యెదురు—; జేనెడుపొడుగు పెరిగిన వెదురుమొక్క లోపలిభాగం; మూడునాలుగు రోజుల్లో పెరిగిన మొక్కకు పైపొరలు తీసేస్తే తేగలాంటిది వస్తుంది; దాన్ని కూర వండుకుంటారు. (కో. 27, 28).

వెదురుకటుకులు: ఉ. ఎదురు –; పర్యా. చూ. వెదురుధాన్యం. వెదురుపొదకు కాసిన గింజలు; పువ్వులోపల ఉంటాయి; మామూలుగా గోధుమ గింజ ఉరువులో ఉంటాయి; పైపొట్టుతీసేస్తే వెదురు బియ్యంవస్తాయి; కాపుకాసే సమయంలో పొద చుట్టూ అలికి రాలినగింజలను ఏరుకొని తెచ్చుకొంటారు. (కో. 23).

వెదురుకట్టె: పర్యా. చూ. వెదురుబొంగు. వెదురు పొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదలు లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపుచొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగాఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4. (రా.4.5).

వెదురుకడెం: (< —కడియం) పర్యా. చూ. కర్ర(4). జల్లెడ అంచుకట్టడానికి లోపలిగుండు, బిలుకు (వెలుపలిబద్ద)లమీంచి, ఆ రెంటిమధ్యా కొంత భాగం ఇరికిస్తూవేసిన గుండ్రంగా వంచికట్టిన రెండు మూడువేళ్ళ వెడల్పుబద్ద. (కో. 8).

వెదురుకర్ర: ఉ. ఎదురు –, యెదురు ; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4. (కో. 3, 4, 12, 17, 19, 24, 27, 28, 30; రా. 4).

వెదురుకుదురు: ఉ. యెదురు—; పర్యా. వెదురు దొంక. వెదురుపొద (= గుమ్మి) పాదు.

వెదురుకొమ్ము: పర్యా. కొమ్ము (1), మొగి (1), మొవ్వ, మోసు (2). వెదురుమొలక; జేనెడు పొడుగునుంచి మూరెడు పొడుగుదాకా నిటారుగా కోసుగా పెరిగింది; ముట్టుకుంటే విరిగిపోయేటట్లు మెత్తగా ఉంటుంది; దీనికి ఆకులూ రెమ్మలూ ఉండవు; మామూలుగా వెదురుదుంపలోంచిగానీ నరకగా మిగిలినగడ కణుపులోంచిగానీ పుడుతుంది; (మూడునాలుగు రోజుల వయస్సులో) లేతగా ఉన్నప్పుడు దీని పైపొరతీసేసి లోపలిభాగాన్ని కూర వండుకుంటారు; చూ. చిత్రం 3. (కో. 27).

వెదురుకొమ్ములకూర: ఉ. యెదురు—; వెదురు కొమ్ము (= వెదురుమొక్క చివర మెత్తగా పొరలు పొరలుగాఉండే మొవ్వ)లో ఉండే తేగలాంటి మెత్తటిపదార్థంతో వండిన కూర. (కో. 22).

వెదురుగడ: ఉ. ఎదురు—; – గడె, – గెడ; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపుచొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్ని చీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4. (కో. 15 16; తె 7).

వెదురుగడ్డ: పర్యా. ఎత్తెగడ్డ కుదురు (2) గడ్డ (2), దుబ్బ, దుబ్బు (1), దుంప (1), బుర్ర (1), ముజ్జ, మోసు (1). వెదురుగడకు భూమిలోపల వేళ్ళతోసహా ఉన్నదుంప; వెదురుగింజ భూమిలో పడినతరవాత దుంప ఏర్పడుతుంది; ఇది కొంచెం గుండ్రంగానూ లావుగానూ ఉంటుంది. దీంట్లోంచే వెదురుమొక్క మొలుస్తుంది; దీనినుంచి ఒక తల్లి వేరూ కొన్ని పిల్లవేళ్ళూ భూమిలోకి పోతాయి,

(కో. 8; తె. 26).

వెదురుగంధం: ఉ. ఎదురుగందం; వెదురుగడకు పైన పచ్చగా నున్నగాఉండే భాగాన్ని బండమీద అరగదీస్తే వచ్చేగంధం; దవడలలోపల పూసి నప్పుడు ఇది రాస్తే తగ్గుతుందట. (కో. 17).

వెదురుగమ్మ: ఉ. ఎదురు ; పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒకభాగం. (కో. 21).

వెదురుగింజలు: ఉ. ఎదురు--; పర్యా. చూ. వెదురు ధాన్యం. వెదురుపొదకు కాసిన గింజలు; పువ్వు లోపల ఉంటాయి; మామూలుగా గోధుమగింజ ఉరువులో ఉంటాయి; పైపొట్టు తీసేస్తే వెదురు బియ్యం వస్తాయి; కాపుకాసే సమయంలో పొద చుట్టూ అలికిరాలిన గింజలను ఏరుకొని తెచ్చు కొంటారు. (కో. 8).

వెదురుగుట్ట: పర్యా. చూ. మండె (1). వెదురుగడల పోగు; మామూలుగా అడ్డదిడ్డంగా వేసినవి; కొన్ని చోట్ల వరసగా పేర్చినవి; అడవిలోగాని ప్రభుత్వంవారి వెదురు డిపోలోగాని అడితీల్లోగాని వేస్తారు; పరిమాణంతోగాని సంఖ్యతోగాని నిమిత్తంలేదు. (కో. 18).

వెదురుగుమ్మి: ఉ. ఎదురు--; రూ. వెదురుగూమి, వెదురుగూము; పర్యా. ఎత్తెదెట్టు, కంకకుదురు, కంకచెట్టు, కంకపెనం, కుదురు(1), కొద, గుమ్మి (1), పిడెం, పొది (1), పొంత, వెదురుపొది. వెదురుగడలు పెరిగిన పొద; ఒక చదరపు గజం నుంచి మూడునాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొని ఉంటాయి; ఒకపొదలో 20 నుంచి 200 గడల వరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాతగాని, పొదలో ఒక వెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాతగాని పొద కావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20, 30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (కో. 9, 10, 14; తె. 8).

వెదురుగూమి: ఉ. -గూఃవిః; చూ. వెదురుగుమ్మి. (కో. 6).

వెదురుగూము: చూ. వెదురుగుమ్మి. (కో. 3).

వెదురుగొట్టం: 1. పర్యా. చూ. మందుగొట్టం. పశువులకు మందుపోసే వెదురుగొట్టం; మొత్తం బోలుగా ఉండి ఒకచివర మూసి ఉంటుంది; రెండో చివర పశువునోట్లో దూర్చడానికి వీలుగా ఏటవాలుగా చెక్కి ఉంటుంది; చూ. చిత్రం 113. (కో. 24); 2. పర్యా. చూ. ఊదుడుగొట్టం. పొయ్యి ఊదుకోడానికి లోపల బోలుగా ఉన్న వెదురుగొట్టం. (కో. 9).

వెదురుచట్రం: ఉ. ఎదురుసట్రం; పర్యా. చూ. చట్రం (1). మంచం, బద్దలతడక, చాటుతడక, చెంద్రిక తడక, కళ్యాణమంటపం మొ॥వాటి తయారీకి నాలుగు వెదురుబద్దలతోగాని, గడలతో గాని దీర్ఘ చతురస్రాకారంగాగాని, చతురస్రా కారంగాగాని చేసినదొడ్డి; చూ. చిత్రం 82.2 (కో. 8).

వెదురుచిల్మాను: ఉ. చిల్మను; పర్యా. చూ. పులలతడక. వెదురుపుల్లలూ పురికొసలూపెట్టి అల్లిన తడకచాప; గుమ్మాలకుగాని, వరండాలకు గాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (తె. 8).

వెదురుచివ: ఉ. - శివ; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూల మంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగా ఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపుచొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4. (రా 8).

వెదురుచువ్వ: ఉ. ఎదురుసువ్వ; పర్యా. చువ్వ (3). సన్నగా పొడుగ్గా ఉండే ఒకరకం వెదురుపేడు (కో. 8).

వెదురుతడక: ఉ. ఎదరతడిక; ఎదురుతడిక; 1. పర్యా. తడక (1). వెదురుపేడుతో చతురస్రంగా గాని దీర్ఘచతురస్రంగాగాని అల్లినది; నిలువుకు పలచటి బద్దా అడ్డానికి మందం పేడూ పెట్టి అల్లు తారు; ఇళ్ళలోనూ బయటా చాటుకోసంగాని ఇంటి కప్పు కింద రేకుల కింద పందిరి మీదా కప్పడానికి గాని వాడతారు. చూ. చిత్రం 36 క (కో. 11). 3. పర్యా. చూ. బండిజల్ల (1). ఎరువు మొ॥ పోసుకొని రావడానికి బండిమీద వేసే వెదురుతడక; అడుగూ పక్కలూ ముందుభాగమూ మూసి ఉంటాయి; వెనకాలా పై భాగమూ తెరచి ఉంటాయి; చూ. చిత్రం 32 (కో. 13).

వెదురుతీగ: పర్యా. చూ. నది (1). చేట, జల్లెడ, పిసనగర్ర మొ॥ వాటికి కట్లు కట్టడానికి లేతవెదురు గడనుంచి తీసిన పలచటి మెత్తటిపేడు; ఎటు వంచినా విరగదు (రా. 5).

వెదురుతుక్కు: ఉ. ఎదురు—; పర్యా. చూ తుక్కు. వెదురుబద్దలూ పేడూ చీల్చేటప్పుడు వచ్చే పుల్లల్లాంటి చిన్నచిన్న ముక్కలు; పొయ్యి లోకి పనికొస్తాయి (కో. 18).

వెదురుతోట: వెదురుగడల కోసం పెంచే తోట (కో. 15).

వెదురుదొంక: పర్యా. చూ. వెదురుకుదురు. వెదురు పొద (=గుడ్సు), పొదు (కో. 31).

వెదురుధాన్యం: ఉ. యెదురుదాన్యం; పర్యా. కంక గింజలు, వెదురుకటుకులు, వెదురుగింజలు. వెదురు పొదకు కాసిన గింజలు; పువ్వులోపల ఉంటాయి; మామూలుగా గోధుమగింజ ఉరువులో ఉంటాయి; పైపొట్టు తీసేస్తే వెదురుబియ్యం వస్తాయి; కాపు కాసే సమయంలో పొదచుట్టూ అలికి రాలిన గింజ లను ఏరుకొని తెచ్చుకుంటారు (కో. 24).

వెదురుపచ్చబద్ద నురగ: పర్యా. పసరు (1), వెదురుగడ పచ్చిగా ఉన్నప్పుడు చుట్టూఉండే ఆకు పచ్చని పొర; నున్నగా మెత్తగా ఉంటుంది; పసి పిల్లల అజీర్ణవ్యాధికి మందుగా వాడతారు. (కో. 20).

వెదురుపంట: వెదురుకాపు; 12 నుంచి 60 సం॥ల వరకు వెదురుపొద కాపు కాస్తుంది; కాపు కాసిన తరవాత పొద చనిపోతుంది (కో. 6, 12).

వెదురుపని: ఉ. ఎదురు—; పర్యా. మేదరిపని. వెదురు గడలు చీల్చి చేట, జల్లెడ మొ॥ వస్తువులల్లే పని (కో. 39).

వెదురుపలుకు: ఉ. ఎదురు—; పర్యా. చూ. వెదు రుప్పు. వెదురుగడలోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్ని చోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డ కట్టడంవల్ల తయారవుతుం దంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్ట వ్యాధి నివార ణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగా లకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్లతిరు మనిగోర, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది; పెద వులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపి రాస్తే తగ్గుతుంది. (12, 27)

వెదురుపాము: ఉ. ఎదురు—, యెదురు—; పర్యా. వెదురుపేసు. వెదురుగడలోపల టొలుగాఉన్నచోట దారపుపోగుల్లా ఏర్పడ్డ పదార్థం; సేమ్యాలాగ ఉంటుంది; కొన్ని కణుపులకుమాత్రమే ఉంటుంది; తొడలో నొప్పివచ్చినప్పుడు దీన్నినూరి పట్టువేస్తే నొప్పి తగ్గిపోతుందట. (కో. 12, 27, 31).

వెదురుపాలు: ఉ. ఎదురు—; పర్యా. చూ. వెదు రుప్పు. వెదురుగడలోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లోమాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగాఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డ కట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడ లకూ ముదురుగడలకూమాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణ వ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనా లకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్లతిరుమని గోర, పైడిపత్తి కలిపి పూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలికగాని పగిలి నప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (కో. 15–18, 25; 28, 29; తె. 29).

వెదురుపిచ్చు: ఉ. ఎదురు—; పర్యా. చూ. గనుపు సందు. వెదురుగడకు రెండుకణుపుల మధ్యభాగం; కొన్నిటికి పొడుగ్గానూ కొన్నిటికి పొట్టిగానూ ఉంటుంది. (రా. 9).

వెదురుపుల్ల: పర్యా. కదురుపుల్ల, కదురుబిళ్ళకు తొడిగే పుల్ల; వెదురుపుల్లగాని ఆనపకడ్డీగాని వాడతారు. చూ. చిత్రం 119. 1. (కో. 3).

వెదురుపేగు: ఉ. ఎదురు—; పర్యా. వెదురుపాము. వెదురుగడలోపల టొలుగా ఉన్నచోట దారపు పోగుల్లా ఏర్పడ్డపదార్థం; సేమ్యాలాగఉంటుంది; కొన్ని కణుపులకుమాత్రమే ఉంటుంది; తొడలో నొప్పివచ్చినప్పుడు దీన్ని నూరి పట్టువేస్తే నొప్పి తగ్గిపోతుందట. (కో. 12, 16, 18).

వెదురుపొది పర్యా. చూ. వెదురుగుమ్మి. వెదురు గడలు పెరిగిన పొద; ఒక చదరపుగజంనుంచి మూడునాలుగు చదరపుగజాల వైశాల్యం ఉంటుంది; కొన్నిచోట్ల గడలు పెనవేసుకొనిఉంటాయి; ఒక పొదలో 20 నుంచి 200 గడలవరకు ఉంటాయి; వెదురువిత్తనం భూమిలోపడ్డ తరవాతగాని పొదలో

ఒక వెదురుగడను కొట్టకుండా వదిలేసిన తరవాత గాని పొదకావడానికి 5 నుంచి 10 సం॥ల కాలం పడుతుంది; 20-30 సం॥లకు కాపుకాస్తుంది. చూ. చిత్రం 1. (కో. 28).

వెదురుప్పు: ఉ. ఎదురుప్పు, యెదురుప్పు; పర్యా. ఎత్తిపాలు, కంకపాలు, గురుగుపీసు, గూగు, తవాచ్చి, పాలగడ్డ, పాలు, పిండిపాలు, బొంగుటం, బొంగుతవాచి, బొంగుతవాశిర్, బొంగుతాసు, వెదురు పలుకు; వెదురుపాలు, వెదురుబుగ్గిలం. వెదురుగడ లోపల కణుపుకు అంటుకొనిఉండే తెల్లటిపదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లాఉంటుంది; కొన్ని కణుపుల్లోమాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగాఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డకట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూమాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టలవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణవ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్లతిరుమనిగౌర, పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది (కో. 1-19; తె. 2; రా. 4-11).

వెదురుబద్ధ: ఉ. యెదురు ; పర్యా. చూ. కమాన్‌బద్ధ (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥ వాటికి వంచి కట్టినబద్ధ; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4 (కో. 25).

వెదురుబద్ధల చెయ్యి: వెదురుపేళ్ళతో అల్లిన హస్తం గుర్తు; ఒక రాజకీయపక్షం ఎన్నికల చిహ్నం (తె. 14).

వెదురుబియ్యం: పర్యా. కంకబియ్యం, కక్కుపాలు. వెదురుపొదకు 12-60 సం॥ల మధ్య కాసినగింజల మీది పొట్టు తీస్తే వచ్చేవి; సాధనం వెదురుబియ్యం జొన్నల్లాగానూ ముళ్లెం వెదురుబియ్యం గోధుమల్లాగానూ ఉంటాయి; వీటిని (గోండ్లు, కోయ, మన్నెం మొ॥) అడవిజాతులవాళ్ళు తింటారు; కొందరు అన్నం వండుకుంటారు; కొందరు రవ్వగాగానీ పిండిగాగాని విసిరి గటక (జావలాంటిది) కాచుకుంటారు లేదా రొట్టెలు చేసుకొంటారు; పిలాలుగూడా చేసుకొంటారు; మంచిబలవర్ధక ఆహారమేగాక వేడిచేస్తుంది కూడా; సాధనం వెదురు 12 సం॥ల ప్రాంతంలోనూ ముళ్లెంవెదురు 60 సం॥ల ప్రాంతంలోనూ కాస్తుంది; కాసిన తరవాత వెదురుపొద ఎండిపోతుంది (కో. 6, 7, 9, 10, 12, 21, 24, 27, 28, తె. 2, 23, 31; రా. 4, 5).

వెదురుబుగ్గిలం: పర్యా. చూ. వెదురుప్పు. వెదురుగడ. లోపల కణుపును అంటుకొని ఉండే తెల్లటి పదార్థం; పచ్చకర్పూరం పలుకుల్లా ఉంటుంది; కొన్ని కణుపుల్లో మాత్రమే ఉంటుంది; మామూలుగా ఉప్పగా ఉంటుంది; కొన్నిచోట్ల చప్పగా ఉంటుంది; వర్షాకాలంలో గడలోకి నీళ్ళుపోయి గడ్డ కట్టడంవల్ల తయారవుతుందంటారు; పండిన గడలకూ ముదురు గడలకూ మాత్రమే ఉంటుంది; స్త్రీల తెల్లబట్టవ్యాధి నివారణకూ, తేలుకాటుకూ, అజీర్ణ వ్యాధికీ, మేహరోగాలకూ, కడుపునొప్పికీ, విరేచనాలకూ, ఉబ్బసానికీ మందుగా వాడతారు; నాలిక పగిలినప్పుడు తెల్లతిరుమనిగౌర పైడిపత్తి కలిపిపూస్తే తగ్గుతుంది; పెదవులుగాని నాలికగాని పగిలినప్పుడు దీన్ని తేనెతో కలిపిరాస్తే తగ్గుతుంది. (కో. 30, 31).

వెదురుబుట్ట: ఉ. ఎదురు—; ప్లాస్టిక్‌తీగతో అల్లే వెదురుపేళ్ళ బుట్ట. (కో. 6).

వెదురుబొంగు: ఉ. వెదురు—, యెదురు—; పర్యా. ఎగిశెకట్టె, ఎదటికర్ర, ఎదటిబొంగు, ఎత్తెకట్టె, ఎత్తెబొంగు, ఎవుశెబొంగు, కంకబొంగు (1), కర్ర (1), గడ, గడకర్ర, బొంగు (1), బొంబు, మేదరికర్ర (1), వాసం (1), వెదురు (2), వెదురుకట్టె, వెదురుకర్ర, వెదురుగడ, వెదురుచివ, వెదురుబొంబు, వెదురువాసం, వెదురుపొదకు పెరిగిన గడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూలమంత మందం వరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన చేతికర్ర మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం. 4. (కో. 6-10, తె. 1-5, 7, 8, 12, 23, 27, 28, 30; రా. 6-10).

వెదురుబోద్దు: ఉ. యెదురు —; పర్యా. చూ. కట్ట(1). ఒకచోటికి చేర్చికట్టిన వెదురుగడలు లేదా వెదురు బద్దలు: ఒకమనిషి మోయడానికి వీలయినవి

(కో. 30).

వెదురుబొంబు: (< ఇం. — bamboo) ఉ. ఎదురు —; పర్యా. చూ. వెదురుబొంగు. వెదురు పొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగ పడుతుంది; సుమారు 5 గజాలనుంచి 20 గజాల వరకు పొడుగూ మూడువేళ్ళ మందంనుంచి దూల మంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్నమవుతుంది; మూర కొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4 (రా. 1).

వెదురుమంచం: ఉ. ఎదురు—; పర్యా. మంచం(1). పడుకోడానికి వెదురుగడలతోనూ, బద్దలతోనూ చేసిన మంచం; కొన్నిటికి తలాపుదిక్కున ఎత్తుగా ఉంటుంది; చూ. చిత్రం 108, (కో. 6, 9, 10).

వెదురుమసి: ఉ. ఎదురు—; పర్యా. చూ. బూడిద; లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్ని చోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (కో. 9).

వెదురువాసం: ఉ. ఎదురు -; పర్యా. చూ. వెదురు బొంగు. వెదురుపొదకు పెరిగినగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. సుమారు 5 గజాలనుంచి 20 గజాలవరకు పొడుగూ మూడువేళ్ళ మందం నుంచి దూలమంత మందంవరకు లావూ ఉంటుంది; మొదట లావుగాఉండి పోనుపోను సన్న మవుతుంది; మూరకొక కణుపు చొప్పున ఉంటుంది; మామూలుగా గడలోపల గుల్లగా ఉంటుంది; దీన్నిచీల్చి చేట, జల్లెడ, గంప మొ॥ అల్లుతారు; చీల్చనిగడ నిచ్చెన, చేతికర్ర మొ॥ వాటికి పనికొస్తుంది; చూ. చిత్రం 4. (కో. 11, 13).

వెదురుసీల: ఉ. - శీల; మేకులా ఉపయోగించే వెదురుపుల్ల. (తె. 10).

వెదుర్లమండె: పర్యా. చూ. పెంట(2). వెదురుకోపు. (వెదురుపొదలు పెరిగే అడవిప్రదేశం) దగ్గర ప్రభుత్వం ఏర్పాటుచేసిన కొట్టు; కోపునుంచి వెదురుతెచ్చి ఇక్కడపేర్చి మేదరివాళ్ళకు అమ్ము తారు; మేదరివాళ్ళు వాటిని ఇక్కడే చీల్చుకుంటారు (నగానికి చీల్చినబొంగులే అమ్మాలని ప్రభుత్వ నియమం. (రా. 2).

వెదుర్లాటు. (< వెదురు + ఇం. lot) ఉ. ఎదుర్లాటు; పర్యా. చూ. లాటు. అడ్డంగా పేర్చిన వెదురుగడలు; ప్రభుత్వం వెదురుడిపోలోగాని అడితిల్లోగాని అడవిలోగాని నేలమీద పేరుస్తారు; మామూలుగా వెయ్యి గడనుంచి ఆరువేల గడవరకు పేరుస్తారు; కొన్నిచోట్ల ఒకలాటీలో పట్టేటన్ని గడలు. (కో. 18).

వెనకకట్టు: ఉ. ఎన్క—, యెన్క—; 1. పర్యా. పైగట్టు, పైవడుకు, బయటికట్టు, వెంటబెండు(2). చేట వెలుపలి అంచు చుట్టూపెట్టి బిగించే బద్ద (కట్టు). చూ. చిత్రం 29.7. (తె. 3, 4, 12, 17); 2. పర్యా. చూ. బిలుకు (1). జల్లెడఅంచు కట్టడానికి వెలుపలినుంచి లోపలి గుండుచుట్టూ వేసే రెండుమూడు వేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలి గుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు (చూ.) చివర్లు (కర్పడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండు బద్దలపై మరో మందంబద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3., (తె. 17).

వెనకచ్చు: ఉ. యెనకచ్చు; చాపనేత మగ్గంలో ముందచ్చుకు అవతల అమర్చే అచ్చు; ఒక వరస అనిపోగులు దీంట్లోంచి దూరుస్తారు; తొక్కుడు చెక్క తొక్కినప్పుడు ఒకవరస అనిపోగులు కిందికి వచ్చి రెండువరసలకూనడుమ సందు ఏర్పడుతుంది; ఆ సందులో తుంగపోచ దూరుస్తారు. చూ. చిత్రం 120 చ. 7. (కో. 6).

వెనకట: ఉ. యెన్కట; పూర్వం; వెనక(టి). (తె 8).

వెనకబిలుకు: ఉ. ఎన్కబిల్కు; పర్యా. చూ. బిలుకు (1). జల్లెడ అంచుకట్టడానికి వెలుపలనుంచి లోపలి గుండు చుట్టూవేసే రెండుమూడువేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలిగుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు (చూ.) చివర్లు (కర్పడ) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండుబద్దలపైనా మరో మందం బద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3. (తె. 5, 27).

వెనకబొంగు: ఉ. యెన్క—; పర్యా. చూ. ఎగ దండు. చాపనేతమగ్గం మొదటిభాగంలో (నేత పనివాడు కూర్చొనేవైపు) అమర్చిన లావాటిపలక; పోగులను లాగిపట్టిఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూపోతారు; లావుగా దీర్ఘచతురస్రాకా రంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30) రంధ్రా లుంటాయి; ఈ రంధ్రాలగుండా పోగులనుదూర్చి దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు

ధారంకొలుకులుగాని తొడుగుటే ఇనుపమ్మ్ ని తొడుగుతారు. చూ. చిత్రం 120 చ. 2 (కో. 10).

వెనకమొత్త: ఉ. ఎన్కి– ; బండొడ్డరజల్ల (చూ.) వెనకభాగం. (తె. 7).

వెనకట్టు: (< వెనక + కట్టు) చేటగోడ (ఎత్తుది) వెనకభాగం అంచు లోకట్టు (చూ.) కర్ర (చూ.) కలిపిచుట్టిన బిగింపు. (కో. 18).

వెనుక: పర్యా. చూ. వెన్ను (4) · మేదరికత్తికి మందంగాఉన్న పైభాగం; సుమారు వేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 డ. 3. (రా. 2).

వెన్ను: ఉ. ఎన్ను, యెన్ను; 1. పర్యా. దాలెం(3), వీపు(1). వెదురుగడచుట్టూ నున్నగా ఉన్నభాగం; గడ పచ్చిగా ఉన్నప్పుడు ఆకుపచ్చగానూ ఎండిన తరవాత పసుప్పచ్చగాగాని తెల్లగాగాని ఉంటుంది. (కో. 12; తె. 18); 2. వెదురుధాన్యం గింజలగుత్తి కాడ. (కో. 27); 3. రూ. ఏను(4); పర్యా. వీపు(2). ఈతకమ్మ వెనకాల (కింది)భాగం; నున్నగా ఉంటుంది. చూ. చిత్రం 11.5. (కో. 3, 25);4. రూ ఏను(1); పర్యా. ఊపురం(1),ఒడ(1), తల(2). నడ్డిపూస, నెత్తి(1), పెడ(1), పెనికె, పెరకసే...ట్ట(1) మడం(1),మూడు(1),మొండె, మొద్దు(2), వంపు(1), వీపు(3), వెనుక మేదరి కత్తికి మందంగా ఉన్న పైభాగం; సుమారువేలెడు వెడల్పున పలకగా ఉంటుంది; కత్తికి ఒకవైపు పదునూ మరోవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 12 డ. 3. (కో. 6, 8, 9, 11, 28; తె. 5, 7, 9, 13, 17, 19 20, 31); 5. పర్యా. చూ. మూపురం. మేదరికత్తి వెన్ను (చూ.) పదునంచువైపు వంపు దిరిగిన భాగం. చూ. చిత్రం 12 జ. 4. (కో. 24); 6. పర్యా. బుడుపు(3). అంబు (చూ.) పడగకు మధ్య ఉబ్బెత్తుగా ఉండేభాగం. (కో. 6); 7. పర్యా. వీపు(4). ఎరకలికత్తి (కొడవలి)కి పైన మందంగా ఉండే భాగం; కత్తికి ఒకవైపు పదునూ ఒకవైపు వెన్నూ ఉంటాయి. చూ. చిత్రం 13 క. 4. (తె. 7, 11, 20); 8. పర్యా. మడం(4), మాదు(3) చురకత్తిపీపు; ఒకవైపు పదునూ రెండోవైపు పీపూ ఉంటాయి. చూ. చిత్రం 16 చ. 4. (కో. 8, 24); 9. వెదుపేళ్ళ కుర్చీలో వీపు ఆనుకొనే వెనకభాగం; పసురుపేడుతో అల్లినచాప బిగిస్తారు. (తె. 31).

వెన్నుగర్ర: ఉ. యెన్ను ; 1. పర్యా. చూ. పసరు గర్ర. వెదురుగడకు పైన పచ్చగా నున్నగా ఉండే భాగమున్నబద్ద చీల్చగా వచ్చినకర్ర. (చూ.); గంప మొ॥వాటికి అల్లకంలో అడుగు చుట్టడానికీ గంప ఎత్తుభాగంలో బెండుకర్రవరస తరవాత అందం కోసం పట్టీలాగా కొన్నివరసలు వేయడానికీ వాడతారు. చూ. చిత్రం 53. 1. (తె. 17); 2. పర్యా. చూ. వాసం(2). కప్పు ఏటవాలుగా ఉండే ఇంటికి వెన్నుగర్రగా పనికొచ్చే వెదురుగడ; లావుగానూ పొడుగ్గానూ ఉంటుంది; మూడు నాలుగంగుళాల మందముంటుంది; పందిరికి కూడా వాడతారు. (తె. 6); 3. పర్యా. చూ. బద్ద(4). విసనగర్ర పట్టుకోడానికి అల్లకంలో ఒక అంచు వెంబడి అమర్చిన సన్నటి వెదురుబద్ద; కొన్నిచోట్ల దీనికి గొట్టం తొడుగుతారు; గొట్టంతొడిగే బద్దకు చివరగొట్టం జారకుండా ఉండడానికి బుడిపె ఉంటుంది. చూ. చిత్రం 31 ట. 2. (తె. 13); 4. పర్యా. చూ. కర్ర(2). చేట అంచుకట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒకబద్దా వెలుపలినుంచి ఒకబద్దా వెలుపలినుంచి ఒకబద్దా పెట్టి ఈ రెంటి మీదినుంచి ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్లు సందునుమూసేస్తూ 'కర్ర'ను పెడతారు; కర్రపెట్టిన తరవాత కట్లు కడతారు. (తె. 13).

వెన్నుదబ్బ: ఉ. యెన్ను–, పేద్దెబ్బ; పర్యా. ఒడు దబ్బ, గుండుదబ్బ (3), పట్టెవబ్బ (1), పసరు దబ్బ (2), పీపుదబ్బ (2), పీపుబరిగె, సరం (1). ఈతకమ్మవెన్ను (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥ వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. చూ.చిత్రాలు 11. 4. (కో. 3; తె. 7, 9, 11, 13, 14, 22).

వెన్నుపలుకు: ఉ. యెన్ను—; పర్యా. పసరుధాలెం వెదురుబద్ద పసరుభాగం (పచ్చగానున్నగా ఉండేది) తో బద్దవెడల్పునా తీసిన దాలెం; చూ. దాలెం. (తె. 6).

వెన్నుపేడు: ఉ. వెన్ను–, యెన్ను—, యెన్ను బేడు; పర్యా. చూ. పసరుపేడు. వెదురుబద్ద చీరి నప్పుడు పచ్చగా నున్నగాఉండే పైభాగంతో కూడి ఉన్న పేడు. (కో. 8, 12, 24; తె. 6–8, 17, 19; 31).

వెన్నుపేడుతడక: ఉ. ఎన్నుపేడు తడ్క–; పర్యా. చూ. పసరుతడక. కేవలం పచ్చపేడు (=పైభాగం పచ్చగా నున్నగాఉన్న వెదురుపేడు)తో అల్లిన

తడక; దీనిధర ఎక్కువ. (తె. 8, 10).

వెన్నుబిలుకు: ఉ. ఎన్నుబిల్కు; పర్యా. చూ. బిలుకు (1). జల్లెడ అంచుకట్టడానికి వెలుపలినుంచి లోపలిగుండు చుట్టూవేసే రెండుమూడువేళ్ళ వెడల్పు వెదురుబద్ద; లోపలిగుండుకూ బిలుకుకూ మధ్యన జల్లెడతట్టు చివర్లు (కర్పన) ఇమిడ్చి ఉంటాయి; ఈ రెండుబద్దలపైనా మరో మందంబద్ద (కర్ర) ఉంటుంది. చూ. చిత్రం 30 క. 3. (తె. 26).

వెంపలిచీపురు: ఉ. ఎంపలిశీపురు; ఇల్లూ వాకిలీ ఊడ్చుకోడానికి వెంపలిమొక్కలతో కట్టిన చీపురు; వెంపలిమొక్కలను పీకి ఎండేసినతరవాత వాటి మీద నీళ్ళుచల్లుతూ కట్టకట్టి తరవాత బండకింద అణగబెడతారు. (తె. 21).

వెలుకంచాప: "Welcom" అనే అక్షరాలువచ్చేటట్లు నేసిన చాప. (రా. 2).

వేటకొడవలి: ఉ. యేటకొడలి; పర్యా. చూ. గైకొడవలి. భూమ్మీదనిలబడి ఈతచెట్టుమీంచి మట్టలు కొయ్యడానికి పొడుగాటికట్టెకు అమర్చిన కొడవలి; కొన్నిచోట్ల ఈ కొడవలికాడ చివరిభాగం ఉంగరంలా వంపుదిరిగి ఉంటుంది; మరికొన్నిచోట్ల గొట్టంలా ఉంటుంది. చూ. చిత్రాలు 116, 117. (తె. 21).

వేతచాప: ఉ. యేతసాప; పర్యా. చూ. గచ్చంతడక. ఒకమూలనుంచి పేళ్ళువేసుకుంటూ గచ్చాలు (చూ. గచ్చం) వచ్చేటట్లు చేటమాదిరిగా అల్లిన వెదురు చాప. (కో. 22).

వేరు: ఉ. యేరు, యేలు; వెదురుదుంపలోంచి భూమిలోకిపారిన సన్నటి తీగలాంటి చెట్టువేరు; మూలం; కొబ్బరిచెట్టుకు వేలెడులావు వేళ్ళనుంచి దారప్పోచంత సన్నటివేళ్ళవరకు పారతాయి. (కో. 25, 27, 31; తె. 17, 18, 23).

వేళ్ళుదిగు: (క్రి.) వేళ్ళు మొలవడం; కొన్ని వెదురుగడలకు మొదటికణుపుకు వేళ్ళుపుడతాయి. (తె. 17).

వేస్టుపేపర్‌బుట్ట: (< ఇం. Waste paper—) చిత్తుకాగితాలు వేసుకోడానికి తాటియీనెలతో అల్లిన బుట్ట. (కో. 12).

## శ

శబరి: (సరుకు) ఉ. శపిరి, శబిరి; 1. ఎండిపోయిన వెదురుగడ; తెప్పలుకట్టి . రవాణా చేస్తారు; (కో. 17); 2. రాజమండ్రిలో దొరికే వెదురుగడ; నాణ్యమైంది. (కో. 15).

శాటుబెట్టు: (క్రి.) పర్యా. చరుచు. ఎరకలికత్తి మొ॥వాటికి కమ్మరికొలిమిలో పదునుబెట్టడం; నిప్పుల్లో కాల్చి సుత్తితో సాగగొడతారు. (తె. 18).

శాని. (< హిం. శాన్; విశే.) నాగరికమైన, నాణ్యమైన, సున్నితమైన. (తె. 17).

శాందార్: (హిం) నాగరికుడు. (తె. 17).

శారదాంబ: కథలు చెప్పడం వృత్తిగాగల ఒకతెగ వాళ్ళు (శారదగాండ్లు) వాయించే తంబుర (తె. 21).

శింగరి: చూ. సెంగేరి (1). (తె. 14).

శిడగ: 1. పర్యా. చూ. జంట (1). వెదురుగడ కణుపులోంచి పుట్టిన కొమ్మకు రెండువైపులా పెరిగిన చిల్లలజత; మూరెడువరకు పెరిగి ఎండిపోతాయి; కొన్ని గడలకు పెద్దకొమ్మ లేకుండా ఇవిమాత్రమే పెరుగుతాయి; ఇలాటి చిల్లలు క్రమంగా కొమ్మమాదిరిగా అవుతాయి. (కో. 27); 2. చూ. శిడిగ. (కో. 29).

శిడిగ: రూ. శిడగ(2), శిడింగ; పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపుదగ్గర పెరిగిన చిన్న కొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాల పొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెరకర్రగానూ గాలంబరుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దానిమొదలు కణుపుకు మిగిలి ఉంటుంది; (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది, (కో. 22).

శిడింగ: చూ. శిడిగ. (కో. 29)

శిత్త: పచ్చ (వెదురుగడకు ఉండేది). (కో. 28).

శిలాటిబొంగు పర్యా. దడెబొంగు. అడవిచివర్లో పెరిగిన వెదురుకర్ర; దీని కణుపులదగ్గర చిన్న చిన్న కొమ్మలు ఎక్కువగా వేస్తాయి; మేదరిపనికి ఉపయోగపడదు. (తె. 22).

శూర్కబుట్ట: ఉ. – బుట్టి. బియ్యం పోసుకొనే ఒకరకం వెదురుబుట్ట; పలికకన్న ఎత్తు ఎక్కువగా ఉంటుంది; దీని మూతిదగ్గర వెదురుకర్ర (తీగ)తో వేసిన కట్టు ఉంటుంది; అడుగున చతురస్రంగానూ పైన గుండ్రంగానూ ఉంటుంది. చూ. చిత్రం 49 (కో. 24).

శేకు: జనుము, గోగు మొ॥ మొక్కలపై చర్మం; నార వచ్చేది; ఎండిన జనుం మొక్కలు ఊరేసి పైచర్మం ఒలిచి నార తీస్తారు (కో. 30).

శేకుతాడు: శేకు (చూ.) నుంచి తీసిన నారతో పేనిన సన్నటితాడు (దారం); చాపలనేతలో నిలువుకు

వాడతారు (కో. 9౮).

శేఠ్: (< హిం. శేఠ్) పర్యా. ఆసామి. వెదురుగడల వ్యాపారి (తె. 17.)

శేషం తట్ట: పర్యా. చూ. మట్టి తట్ట (1). బావుల నుంచిగాని బయటగాని మన్నుమోసే తట్ట; మూతి విశాలంగా పళ్ళెం మాదిరిగా ఉంటుంది (కో. 25).

శేరు: $1\frac{1}{4}$ కిలో ధాన్యం కొలత (తె. 18).

శేరుగుల్ల: శేరు ($1\frac{1}{4}$ కిలో) ధాన్యం పట్టే వెదురు పేళ్ళ గుల్ల (తె. 23).

శ్రీశైలంబొంగు: ఉ. సిరిసైలం—; శ్రీ సైయిలం—; శ్రీశైలం అడవి ప్రాంతంలో పెరిగిన వెదురుగడ (తె. 3, 5, 12, 13, 15).

## స

సకం: పర్యా. చూ. అడుగు (1). చేట సమతలభాగం; కిందిదిగాని పైదిగాని; అల్లకంలో మూలలు మలపక ముందు అంతవరకు అల్లినదాన్ని ఇలా అంటారు; అంచుకట్టని చేట; చూ. మంతు (కో. 21).

సగం పచ్చె: పర్యా. చూ. చెక్క (1). వెదురుగడ నిలువుగా సగానికి చీలిస్తే వచ్చే ఒక భాగం (తె. 16).

సంగటిబుట్ట: ఉ. —బుట్టి; సంగటిముంతలు పెట్టుకొని వెళ్ళే వెదురుపేళ్ళ బుట్ట (4).

సజ్జ: పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగానూ కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈ బుట్ట అడుగున గద్దె ఉంటుంది; బఠాణీలు వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళు కూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు; చూ. చిత్రం 139. (కో. 22, 23, 26, 28).

సజ్జకొయ్య: పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టిన బద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (కో. 28).

సజ్జబద్ద: పర్యా. చూ. కమాన్‌బద్ద (1). చేతిబుట్ట, కంతబుట్ట, గద్దెబుట్ట, గ్లాసుబుట్ట మొ॥వాటికి వంచి కట్టినబద్ద; చేత్తో పట్టుకోడానికీ మేకుకు తగిలించడానికీ వీలుగా ఉంటుంది; కమాను (ఆర్చి) మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 69 క. 4. (కో. 29).

సజ్జబుట్ట: పర్యా. చూ. చేతిబుట్ట (1). బజారునుంచి కూరగాయలు మొ॥ తెచ్చుకోడానికి పనికొచ్చే వెదురుబుట్ట; చేత్తో పట్టుకోడానికీ చిలక్కొయ్యకు తగిలించడానికీ వీలుగా ఒక వెదురుబద్ద వంచి కడతారు; పైన మూత ఉంటుంది; మూతలు కొన్నిచోట్ల సిబ్బిమాదిరిగాను కొన్నిచోట్ల పళ్ళెం మాదిరిగాను ఉంటాయి; కొన్నిచోట్ల ఈబుట్ట అడుగున గద్దె ఉంటుంది; బటాణీలు, వేరుసెనక్కాయలు మొ॥ అమ్మేవాళ్ళుకూడా దీన్ని ఉపయోగిస్తారు; దీనికి కళ్ళు ఉండవు; చూ. చిత్రం 139. (కో. 26).

సజ్జవార: పూలసజ్జల అల్లకానికి వాడే వెదురుపేడు; మానెవార పేడుకన్న వెడల్పు తక్కువ. (కో. 27).

సట్టు: పర్యా. చూ. బొడుపు (2). ఈతకమ్మకున్న ఆకు తెంపిన తరవాత ఆకు తెగినచోట పడేగుర్తు. (రా. 9).

సత్తుపల్లిబొంగు: ఖమ్మం జిల్లాలోని సత్తుపల్లి అడవిప్రాంతంలో పెరిగిన వెదురుగడ; 30 గజాల పొడుగుంటుంది. (కో. 14; తె. 7, 8, 28).

సనబద్ద: ఈతజల్లమొత్త (చూ.) మీద అమర్చిన బద్ద. (తె. 31).

సందు: **1.** పర్యా. చూ. టోలు (1). వెదురుగడ లోపల ఒక కణుపునుంచి మరొక కణుపువరకు మధ్యలో నిలువుగా ఉండే ఖాళీ; ఇది కొన్నిటికి వెడల్పుగానూ కొన్నిటికి సన్నగానూ ఉంటుంది; కొన్నిటికి అసలు ఉండదు. చూ. చిత్రం 4. 1. (రా. 3); **2.** చేట మొ॥ అల్లేటప్పుడు అల్లుతున్న పేడు అయిపోతే అల్లకం కొనసాగడానికి, దానికి ఇంకో పేడు కలిపిన చోటు. (తె. 30); 3. పర్యా. చూ. కంత(1). జల్లెడ అడుగు అల్లకంలో పేళ్ళ మధ్య ఉన్న సన్ననిఎడం; జల్లించుకొనేటప్పుడు నూకలు మొ॥ కంతలగుండా కిందికి దిగిపోతాయి. చూ. చిత్రం 30 క. 2. (తె. 2, 15, 18, 22; రా. 1); 4. పర్యా. చూ. ఖానా(5). ఉయ్యాల అల్లకంలో అడుగుభాగంలోనూ పక్కలా బద్దల మధ్య వచ్చిన సందు; గడి. (తె. 8).

సందుకపెట్టె: (< హిం. సందూక్ = పెట్టె) ఉ.

సందక్క—; పర్యా. చూ. పెట్టె(1). చీరలూ సంచెళ్లూ మొ॥ బట్టలు పెట్టుకొనే వెదురుబద్దలపెట్టె; చతురస్రాకారంలోనూ దీర్ఘ చతురస్రాకారంలోనూ ఉంటుంది; చూ. చిత్రం 41. (తె. 7);

సందుపెట్టు: (క్రి.) ఉ. —పెట్టడం, —పెట్టు, సందెట్టు; పర్యా. ఎదురువేయు. చేట మొ॥ అల్లే టప్పుడు అల్లుతున్న పేడు అయిపోతే అల్లకం కొనసాగడానికి దానికి ఇంకోపేడు కలిపిపెట్టడం. (కో. 15, 17; తె. 28, 30).

సందెడు: చంకసందును పట్టినన్ని (తె. 18).

సన్నకంక: పర్యా. చూ. సన్నం(పు)బొంగు. రెండంగు ళాలనుంచి ఆరంగుళాలవరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపుసన్నగా ఉండి సులువుగా చీలు తుంది; కణుపులమధ్య ఎడంఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (తె. 28).

సన్నకట్టె: 1. పర్యా. చూ. సన్నం(పు)బొంగు. రెండంగుళాల నుంచి ఆరంగుళాలవరకు లావుండే సన్నటివెదురుగడ; కణుపుసన్నగా ఉండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడంఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్ని టికి బోలుండదు (రా. 4); 2. పర్యా. చూ. సన్నం బరిగె. వేలెడు లావుకన్న తక్కువ ఉండే ఈత చువ్వ (బరిగె); గుల్లలు మొ॥ అల్లడానికి పని కొస్తుంది (తె. 8).

సన్నకర్ర: 1. పర్యా. చూ. సన్నం(పు) బొంగు. రెండంగుళాలనుంచి ఆరంగుళాల వరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగా ఉండి సులు వుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్ని టికి బోలుండదు (కో. 3; తె. 16); 2. చూ. సన్నంగర్ర. సన్నగా ఉన్న వెదురుపేడు; మామూలు వెదురుపేడు వెడల్పులో సగం వెడల్పు పేడుకన్న పొడుగ్గానూ ఉండి (గుండ్రంగా కాక) పలకగా ఉన్నది (తె. 9.); 3. పర్యా. చూ. కర్ర (3). గోవ (వార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరిన భాగం; పేడువెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్టగుల్ల, బుట్ట మొ॥ వాటి అల్లకంలో నిలువుల చుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1 (రా. 2); 4. పర్యా. చూ. సిబ్బివార, సిబ్బి అల్లడాని కుపయోగించే కర్ర (చూ.); దారం మాదిరిగా సన్నగానూ గుండ్రం గానూ ఉంటుంది (రా. 9..11).

సన్నంగర్ర: చూ. సన్నకర్ర (2) (తె. 13).

సన్నచిట్టె: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గర దగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికి చేతికర్రలకూ ఉపయోగిస్తారు (కో. 7).

సన్నజువ్వ: పర్యా. చూ. (సన్న(ం) బరిగె. వేలెడు లావుకన్న తక్కువ ఉండే ఈతచువ్వ (బరిగె); గుల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది (తె. 9).

సన్నతడక: ఉ. —తడక్క—; పర్యా. సన్నపేడు తడక. సన్నటి వెదురుపేడుతో అల్లిన తడక (తె. 15).

సన్నతుంగ: గట్టిగా సన్నగాఉండే మేలిరకం తుంగ; చాపలనేతకు పనికొస్తుంది. (కో. 3, 8; రా. 4).

సన్నదాలెం: నిలువుగా చీరినబద్ద మూడునాలుగు భాగాల్లో ఒకటి; పలచగాఉంటుంది; దీన్నించి పేళ్ళు తీస్తారు. (కో. 27).

సన్న(ం)తాడు: కొంచెం సన్నగాపేనిన కొబ్బరితాడు. (కో. 21, 29).

సన్నపలక: ఉ.-పక్క—; జమ్ముచాప నేసేటప్పుడు మగ్గానికి అమర్చిన నిలువుపోగులమధ్య జమ్ము పుల్లనుదూర్చి అది నేతలో కలిసిపోయేటట్లు చేస్తో కొట్టే సన్నటిపలక; దీనికి రంధ్రాలుంటాయి; దీనికిముందు ఇట్లాంటిదే ఇంకొక పెద్ద పలకకూడా అమరుస్తారు. (రా. 10).

సన్నపునులక: సన్నగాఉండే నులకతాడు. (కో. 25).

సన్నపెండె: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర; చిటికెనవేలెడు లావునుంచి బొటనవేలెడు లావువరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికి చేతికర్రలకూ ఉపయోగిస్తారు. (రా. 3).

సన్నపేడు: పర్యా. చూ. అడిపోగు (1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొడ్డడుగూ అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నపేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండు భాగాలుగా నిలువునాచీలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికి ఉపయోగిస్తారు.

చూ. చిత్రం 47 క. 3. (కో. 9).

సన్నపేము: పర్యా. సన్నపేముబెత్తం, సన్నబెత్తం. సన్నగాఉండే పేముకర్ర, $\frac{1}{8}$ అంగుళంనుంచి $\frac{1}{4}$ అంగుళంవరకు మందం ఉంటుంది; దీన్ని చీరితీసిన తీగబుట్టలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీరకుండా బొగ్గుతట్టలు అల్లుతారు; చీరిన పైభాగం (నార) కాలిస్తేవచ్చే బూడిదను కొబ్బరినూనెలో కలిపి తలకుపెట్టుకొంటే వెంట్రుకలు బాగా పెరుగుతాయట. (కో. 9).

సన్నపేముబెత్తం: పర్యా. చూ. సన్నపేము. సన్నగా ఉండే పేముకర్ర; $\frac{1}{8}$ అంగుళనుంచి $\frac{1}{4}$ అంగుళం వరకు మందం ఉంటుంది; దీన్ని చీరితీసిన తీగబుట్టలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీరకుండా బొగ్గుతట్టలు అల్లుతారు; చీరిన పైభాగం (నార) కాలిస్తే వచ్చే బూడిదను కొబ్బరినూనెలో కలిపి తలకు పెట్టుకొంటే వెంట్రుకలు బాగా పెరుగుతాయట. (తె. 22).

సన్నపేళ్ళచేట: ఉ. —బేళ్ళ—, —పేల్లకాట, —పేళ్ళకాట, సన్నేల్లకాట; పర్యా. గోడువారచేట. సన్నటి వెదురుపేళ్ళతో అల్లినచేట; మామూలుగా దీన్ని మూడుపేళ్ళమీదగాని (చూ. మూటాల) నాలుగుపేళ్ళమీదగాని (చూ. నాటాల) అల్లుతారు. (కో. 2, 3, 5; తె. 1, 16, 28; రా. 2, 5, 6).

సన్నపేళ్ళమంచం: ఉ. సన్నపేల్ల—; సన్నటి వెదురుపేళ్ళతో అల్లినచాప పరిచిన వెదురుమంచం. (తె. 1).

సన్నబద్ద: పర్యా. సన్నబిలుకు. వెడల్పు తక్కువగా ఉండే వెదురుబద్ద. (కో. 28).

సన్నబిలుకు: ఉ. —బిల్కు; పర్యా. సన్నబద్ద. వెడల్పు తక్కువగా ఉండే వెదురుబద్ద. (తె. 8).

సన్నబెత్తం: పర్యా. చూ. సన్నపేము. సన్నగాఉండే పేముకర్ర; $\frac{1}{8}$ అంగుళంనుంచి $\frac{1}{4}$ అంగుళంవరకు మందం ఉంటుంది; దీన్ని చీరితీసిన తీగబుట్టలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది; దీన్ని చీరకుండా బొగ్గుతట్టలు అల్లుతారు; చీరిన పైభాగం (నార) కాలిస్తే వచ్చే బూడిదను కొబ్బరినూనెలో కలిపి తలకు పెట్టుకుంటే వెంట్రుకలు బాగా పెరుగుతాయట. (కో. 19).

సన్నబేడుతడక: పర్యా. సన్నతడక. సన్నటి వెదురు పేడుతో అల్లినతడక. (తె. 15).

సన్నబేళ్ళల్లకం: మూడేసి సన్నటిపేళ్ళతో అల్లేతీరు; చూ. మూటాల. (రా. 8).

సన్నబేళ్ళవిసనకర్ర: పర్యా. చూ. సన్నవిసనగర్ర. మెత్తగా ఉండే సన్నటిపేళ్ళతో అల్లిన విసనగర్ర. (కో. 15).

సన్నబొద్దు: ఉయ్యాల అడుగు అంచుభాగంలో చుట్టూ సన్నగా ఉబ్బెత్తుగా అల్లినభాగం. (తె. 7).

సన్నబొంబు: పర్యా. చూ. సన్నం(పు)బొంగు. రెండంగుళాలనుంచి అరంగుళాల వరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగా ఉండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (రా. 1).

సన్నం(పు)బొంగు: ఉ. సన్నబ్బొంగు; పర్యా. కట్టబొంగు (1). (కో. 14). చిట్టెదురు (1), చిట్టిబొంగు, సన్నకంక, సన్నకట్టె (1), సన్నకర్ర (1), సన్నబొంబు, సన్నవెదురు, సామెరవెదురు, సుల్కుంబొంగు (1). రెండంగుళాలనుంచి అరంగుళాలవరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగాఉండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (తె. 1–3, 6, 7, 8, 12, 15–17, 20–22, 24–27, 30, 31; రా. 6).

సన్న(o)పేడు: ఉ. సన్నవేడు; పర్యా. ఈనె (2), మట్టుపోండ్ల, లాక (3), సన్నీనె (2), సల్లపేడు. వెడల్పు చాలా తక్కువగా ఉన్న వెదురుపేడు; కొన్నిచోట్ల చాలా పలచగా ఉన్నది (కో. 2, 15, 24; తె. 1, 6, 15, 31, రా. 2).

సన్న(o)బరిగె: పర్యా. చిట్టిబర్ర, సన్నకట్టె (2), సన్నజువ్వ, సన్నీతకట్టె. వేలెడు లావుకన్న తక్కువ ఉండే ఈతదువ్వ (బరిగె); గుల్లలు మొ॥ అల్లడానికి పనికొస్తుంది (తె. 14, 20).

సన్నంరేకు: వెడల్పు తక్కువగా ఉండే తాటేకు (కో. 26).

సన్నరంపం: చిన్నచిన్న పండ్లుండే రంపం; పేముకర్ర కొయ్యడానికి వాడతారు (తె. 22).

సన్నవిసనగర్ర: ఉ. సన్నిస్నకర్ర; పర్యా. మెతకవిసనకర్ర, సన్నబేళ్ళ విసనగర్ర, మెత్తగా ఉండే సన్నటి పేళ్ళతో అల్లిన విసనగర్ర (తె. 22, 28).

సన్నవెదురు: ఉ. సన్నెదురు; పర్యా. చూ. సన్న(o)పు బొంగు. రెండంగుళాలనుంచి అరంగుళాల వరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగా ఉండి సులువుగా చీలుతుంది; కణుపుల

మధ్య ఎడం ఎక్కువ; కొన్ని గడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు (కో. 6, 11, 14. తె. 29; రా. 1-3).

సన్నవేళ్ళ అల్లకం: (< సన్నవేళ్ళ —) వేలెడు వెడల్పుకన్న సన్నంగా ఉండే పేళ్ళతో అల్లే విధానం; మూడుపేళ్ళ గచ్చంమీద అల్లుతారు; చేట, విసనగ్రర మొ॥ ఇలా అల్లుతారు (తె. 18).

సన్నసాదనం: పర్యా. సాదనం (3). మేదరిపనికి ఉపయోగపడే వెదురుగడల్లో సన్నరకం (కో. 13, 14).

సన్నాకు: వెడల్పు తక్కువగాఉన్న ఈతాకు. (తె. 19, 22; రా. 8).

సన్నీతకట్టె: (< సన్న + ఈత —) పర్యా. చూ. సన్నంబరిగె; వేలెడులావుకన్న తక్కువఉండే ఈత చువ్వ (బరిగె). గుల్లలు మొ॥ అల్లడానికి పని కొస్తుంది. (తె. 13, 16).

సన్నీనె: (< సన్న + ఈనె) ఉ. సన్న ఈనె. 1. పర్యా. చూ. పేడు (1). వెదురుబద్ద సన్నగా చీలిస్తే వచ్చే పొయ; సుమారు చిటికెనవేలెడు వెడల్పూ గోరంత మందమూ గజంన్నరపొడుగూ ఉంటుంది; చేట, జల్లెడ మొ॥ అల్లడానికి వాడతారు; అల్లేవస్తువును బట్టి దీని పొడుగు వెడల్పులు నిర్ణయించుకొంటారు. (కో. 19); 2. పర్యా. చూ. సన్న(ం)పేడు. వెడల్పు చాలా తక్కువగాఉన్న వెదురుపేడు; కొన్నిచోట్ల చాలా పలచగాఉన్నది. (కో. 3, 5, 27, 28; తె. 1); 3. పర్యా. చూ. సిబ్బవార. సిబ్బి అల్లడానికి ఉపయోగించే కర్ర (చూ.); దారం మాదిరిగా సన్నగానూ గుండ్రంగానూ ఉంటుంది. (రా. 4).

సపయిదబ్బ: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగా రాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (తె. 8).

సపాయిగోటు: పర్యా. ఒంటెంచు. ఈతచాప నిలువులో కొసలనుమూసేస్తూ ఒకచేపోరగా కుట్టిన అంచుపట్టె; అడ్డంకొసలను మూస్తూ రెండు అంచు పట్టెలను కుడితే నిలువుకొసలను ముయ్యడానికి ఒంటెంచుపట్టె కుడతారు. (తె. 21).

సపాయిబండిజల్ల. పురపాలకసంఘంవాళ్ళ చెత్తబండి (సపాయిబండి)మీద పరిచే జల్ల. (తె. 7).

సపోర్టు: (< ఇం. Support) పేముకుర్చీ వెనక భాగంలో వెనకకాలు కొస్తా హాండ్లుకర్ర కొస్తా అనుకొనేటట్లుపెట్టిన కర్ర. (కో. 19).

సప్ప: 1. విసనగర్రకు కాడగా అమర్చే బద్ద; అపర్చకపుంది ఇలా అంటారు. (కో. 5); 2 కోల; నాగలి మొదటిభాగంనుంచి బయటికి కనిపించే కొన. (కో. 30).

సమకట్టు: చదరం. (కో. 3).

సమర్తచాప: ఉ. సంర్తచాప; ఆడపిల్ల మొదటిసారి రజస్వలయినప్పుడు కూర్చోడానికి పరిచే నలు చదరపు వెదురుచాప. (కో. 26).

సమసిపోవు: ఉ. సమసి—; అరిగిపోవడం. (తె. 4).

సరఖం: బండి గడిగొయ్య (పంగలగాఉన్న ఒసి గొయ్య)లమీంచి తొడిగే వెదురుకర్ర; కొన్నిచోట్ల తాటిపట్టె తొడుగుతారు. (తె. 9).

సరందబ్బ: చూ. సరుసుబద్ద. (రా. 8).

సరం: 1. పర్యా. చూ. వెన్నుదబ్బ. ఈతకమ్మ వెన్ను (చూ.) చీరితీసినబద్ద; గంప మొ॥ వాటి ఎత్తుభాగం అల్లడానికి వాడతారు. చూ. చిత్రం 11. 4. (రా. 8); 2. (విశ.) తిన్నటి, పొడుగాటి. (రా. 2).

సరాబులు: (బ). పర్యా. చూ. కమ్మర్లు. ఇనప పనిముట్లు మొ॥ చేసే పనివాళ్ళు;

సరాబువాళ్ళు: (బ.) ఉ. సరాబోల్లు; బంగారునగలు చేసే పనివాళ్ళు; వాళ్ళ తెగ. (కో. 25).

సరిదీయు: (క్రి.) పేనినతరవాత దాడును ఒక కొమ్మకుకట్టి లాగడం. (రా. 4).

సరిపిరంబెట్టించు: (క్రి.) పర్యా. చూ. చరిపించు. పదునుపోయి మొండిగాఅయిన కత్తి మొ॥ వాటిని కొలిమిలోకాల్చి సుత్తితోకొట్టి వాడిగాచేయించడం; మేదరికత్తికి పదునుపోయినప్పుడు కమ్మరిచేత ఇలా చేయిస్తారు; కొన్నిచోట్ల మేదరివాళ్ళే చేసు కొంటారు. (కో. 11).

సరివెదురు: పర్యా. చూ. లొద్ది(ల)బొంగు. లోయలో పెరిగిన వెదురుగడ; మెత్తగా బోలుగా ఉంటుంది; కణుపులు దూరదూరంగా ఉంటాయి, మేదరిపనికి బాగా ఉపయోగం. (తె. 29).

సరుము: ఉ. సర్మ, సర్వ్మ. 1. పర్యా. చేట సరుము, దాలెం (5.) చేట అల్లకానికి కొలత ప్రకారం (మూడు మూళ్ళ జేనెడు) నరికి సున్నగా గీకిన సుద్దిబద్ద; (తె. 13, 18, 19-25); 2. పర్యా. చూ. పలుకు (2). సుద్దిబద్ద (చూ.)ను నిలువుగా

బద్ద వెడల్పులో సగానికి చీల్చిన భాగం (గడలో ఎనిమిదో భాగం); దీన్నించి పేడు తీస్తారు; వేలెడు వెడల్పు ఉంటుంది (కో. 5, 15); 3. పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాఫుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగిన కొమ్మ నరకేసిన చోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతి గడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి (కో. 7).

సరుముదబ్బ: ఉ. సర్మ—; చూ. సరుముబద్ద (కో. 7; రా. 10).

సరుముపేడు: ఉ. సర్మ—; పర్యా. చూ. సుద్దిపేడు. సుద్దిబద్ద (చూ.) నుంచి తీసిన వెదురుపేడు (రా. 5).

సరుముబద్ద: రూ. సరందబ్బ, సరుముదబ్బ; పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాఫుగా వచ్చే వెదురుబద్ద; వెదురు గడకు పెరిగిన కొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి (రా. 5).

సరుములొత్తు: (క్రి.) ఉ. సర్మ—; పర్యా. చూ. వారలొత్తు. వెడల్పు వెదురుబద్దనుంచి పేడుకు సరిపోయేటంత వెడల్పుగా సన్నటిబద్దలు (వారలు) చీరడం; దీన్నించి పేడు చీలుస్తారు (కో. 15).

సర్క్రా: (హిం.) గింజ (తె. 22).

సర్క్రాదాల: పత్తిగింజలు మోసే పెద్ద వెదురుపేళ్ళ గంప (తె. 22).

సలుగు: ఉ. సల్గు; పర్యా. చూ. అడ్డం. తడక, బంటి జల్ల, పిల్లల పొది, ఉయ్యాల, చెంద్రిక మొ॥ వాటి నిలువులచుట్టూ అడ్డంగా అల్లే మందంపేడు లేదా పలచటిబద్ద; మామూలు పేడుకన్న మందంగానూ వెడల్పుగానూ ఉంటుంది. (తె. 23, 28).

సలువునజీరు: (క్రి.) ఒత్తిన ఈతమట్టను చీరేప్పుడు చీరుతున్న చీలికతోపాటు మట్టని ఎడంచేత్తో బాగా కిందికి వంచకుండా చీరడం; ఇలా చీరటంవల్ల నారపోచ పలచగావస్తుంది. (తె. 9).

సల్పపేడు: రూ. సల్పానిపేడు; పర్యా. చూ. సన్న(ం) పేడు. వెడల్పు చాలా తక్కువగాఉన్న వెదురు పేడు; కొన్నిచోట్ల చాలా పలచగాఉన్నది. (రా. 7).

సల్పాకు: (<సలప+ఆకు) పలగాఉండే ఈతాకు. (రా. 9).

సల్పాటు: (విశ.) రూ. సల్పాని; పలచటి; పలచటి పేడును సల్పాటు (సల్పాని) పేడు అంటారు. (రా. 8).

సల్పాటుగా: (క్రి. విశ.) పలచగా; వెదురుపేడుగాని బద్దగాని మందంగాలేనప్పుడు ఇలా అంటారు. (రా. 6, 8, 9).

సల్పాని: (విశ.) చూ. సల్పాటు. (రా. 9).

సల్పానితడక: ఉ.—తడ్క; పర్యా. పలచని తడక. పలచటి వెదురుపేడుతో అల్లిన తడక. (రా. 11).

సల్పానిపేడు: చూ. సల్పపేడు, (రా. 9, 11).

సల్వడిపెట్టె: (<చలిమిడి—) పసుపు, చలిమిడి (బియ్యప్పిండి, బెల్లంకలిపిన ఒకరకం తీపిపదార్థం) పెట్టుకొని ఆడపిల్ల అత్తవారింటికి తీసుకువెళ్ళే పెట్టె. (కో. 29).

సళ్ళు: (<సడలు) ఉ. సల్లు; వదులు; రెండు పురులనుకలిపి తాడు పేనేటప్పుడు పురి పెట్టకుండా పేనితే తాడు వదులువచ్చి తొందరగా తెగుతుంది. (తె. 9).

సవకలం: ఉ. సొకులం; 1. పర్యా. చూ. బద్ద (1). వెదురుగడ నిలువుగా నాలుగు భాగాలుగా చీలిస్తే వచ్చేభాగం; గడంత పొడుగునా సుమారు రెండు వేళ్ళ వెడల్పు ఉంటుంది. (కో. 22); 2. పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటి గనుపు (చూ.) లేకుండా సాఫుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటి గనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 20, 22).

సవరగా: ఉ. సొరగ; పర్యా. చదరంగా. చదునుగా; సమాంతరంగా; మట్టంగా; వెదురునుగాని బద్దను గాని (ఏటవాలుగా కాకుండా) అడ్డంగా నరికే సందర్భంలోను వెదురుగడలను చిందరవందరగా కాకుండా సమానంగా పేర్చే సందర్భంలోను వాడుక. (తె. 16).

సవరంకర్ర: రూ. సవేరంకర్ర; పర్యా. చూ. సైర బొంగు (1). వంకలు లేకుండా నిటారుగా పెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గా ఉంటుంది; నిచ్చెన మొ॥వాటికి పనికొస్తుంది (కో. 23).

సవారల్లకం: ఆరేసి వెదురుపేళ్ళతో అల్లే విధానం. (రా. 8).

సవారికచ్చరంచాప: ఉ. —సాప; పర్యా. చూ.

కచ్చడం తడక, కచ్చడం బండిమీద నీడకోసం గుడిసె మాదిరిగా కప్పేతడక లేదా చాప; కొన్నిటికి ముందువేపూ కొన్నింటికి ముందువెనకలా పడగ మాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండుపొరలుగా అల్లి జతకూరుస్తారు; దీని అంచుచుట్టూ చేటమాదిరిగా కట్టు (బద్ద)వేసి అంచు కడతారు; పలచటి పేడుతో అల్లినదాన్ని చాపఅనీ, నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లిన దాన్నిగాని చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డం బద్దలూ వేసినదాన్నిగాని బద్దలపళంగా అల్లినదాన్ని గాని పలచటిబద్దలతో అల్లినదాన్నిగాని తడక అనీ అనడం మామూలు; చూ. చిత్రాలు 34 క, చ (తె. 27).

సవారిచాప: ఉ. —సాప; పర్యా. చూ. కచ్చడం తడక, కచ్చడం బండిమీద నీడకోసం గుడిసె మాదిరిగా కప్పే తడక లేదా చాప; కొన్నింటికి ముందువేపూ కొన్నింటికి ముందు వెనకలా పడగ మాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నింటిని రెండుపొరలుగా అల్లి జత కూరుస్తారు; దీని అంచుచుట్టూ చేట మాదిరిగా కట్టు (బద్ద) వేసి అంచు కడతారు; పలచటిపేడుతో అల్లినదాన్ని చాప అనీ, నిలువులుపెట్టి అడ్డంగా పేడుతో అల్లిన దాన్నిగానీ చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డంబద్దలూ వేసినదాన్నిగానీ బద్దలపళంగా అల్లిన దాన్నిగానీ పలచటిదద్దలతో అల్లినదాన్నిగానీ తడక అనీ అనడం మామూలు. చూ. చిత్రాలు 34 క, చ (కో. 15).

సవారిబండితడక: ఉ. తడ్క; పర్యా. చూ. కచ్చడం తడక, కచ్చడం బండిమీద నీడకోసం గుడిసెమాదిరిగా కప్పేతడక లేదా చాప; కొన్నింటికి ముందువేపూ కొన్నింటికి ముందువెనకలా పడగ మాదిరిగా ముందుకు పొడుచుకొచ్చి ఉంటుంది; కొన్నిటిని రెండు పొరలుగా అల్లి జతకూరుస్తారు; దీని అంచుచుట్టూ చేటమాదిరిగా కట్టు (బద్ద)వేసి అంచుకడతారు; పలచటిపేడుతో అల్లినదాన్ని చాప అనీ, నిలువులు పెట్టి అడ్డంగా పేడుతో అల్లినదాన్ని గాని చాపకు బిగువుకోసం నిలువుబద్దలూ అడ్డం బద్దలూ వేసినదాన్నిగాని బద్దలపళంగా అల్లినదాన్ని గాని పలచటిబద్దలతో అల్లినదాన్నిగాని తడక అనీ అనడం మామూలు; చూ. చిత్రాలు 34 క, చ.

సవారునేత పేము.కుర్చీల అల్లకంలో ఒకరకం పని వరస (డిజైను). (కో. 18).

సవార్లగుమ్మటం: పర్యా. గుమ్మటం. సవారులోపల కడియం (రింగు)లా వంచికట్టిన వెదురుబద్ద; ఇలాంటివి ఏడు ఉంటాయి; కింద వెడల్పుబద్దపెట్టి రానురాను సన్నటివి పెడతారు; చూ. చిత్రం 95. (తె. 6).

సవేరంకర్ర: చూ. సవరంకర్ర. (కో. 24).

సాగుడు: పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడుకన్న ఎక్కువ ఎడమున్న భాగం. (కో. 16).

సాగుడుగన: చూ. సాగుడు గనుపు. (తె. 8).

సాగుడుగనుపు: రూ. సాగుడుగన; పర్యా. చూ. గనసాగుడు. వెదురుగడ కణుపులమధ్య మూరెడు కన్న ఎక్కువ ఎడమున్న భాగం. (కో. 17).

సాంగంచేట: పర్యా. చూ. మూసివాయనం చేట. ముత్తైదువ చనిపోయినప్పుడు ఆమె పేరుమీద మూసివాయనం (సాంగం; పసుపు, కుంకుమ మొ॥) పెట్టిఇచ్చే చేట; వాయనమిచ్చేటప్పుడు పైన మరో చేట బోర్లిస్తారు. (కో. 2).

సాంగం: పర్యా. వాయనం. నోములూ పండుగలూ చేసుకొనేటప్పుడు గాని, సారెపెట్టేటప్పుడు గాని పునిస్త్రీ చనిపోయినప్పుడుగాని (దానంగా) ఇచ్చేది; పునిస్త్రీ చనిపోయినప్పుడు ఆమె పేరుమీదుగా వాయనం (పసుపు, కుంకుమ, గాజులు మొ॥ పెట్టి) ఒక పునిస్త్రీకి దానంగా ఇస్తారు; అందుకట్టని ఒక చేటలో వాయనంపెట్టి మరో చేటలో మూస్తారు. (కో. 2).

సాంచె: ఉ. సాంచై; పర్యా. చూ. చట్రం (1). మంచం, బద్దలతడక, చాటుతడక, చెంద్రికతడక, కళ్యాణమంటపం మొ॥వాటి తయారీకి నాలుగు వెదురుబద్దలతోగాని గడలతోగాని (దీర్ఘచతురస్రా కారంగాగాని చతురస్రాకారంగాగాని) చేసిన దొడ్డి. చూ. చిత్రం 82. 2. (తె. 15, 28).

సాత్పడి: మేదరివాళ్ళలో ఒకతెగ. (రా. 1).

సాదన(ం)కర్ర: పర్యా. చూ. మేదరికర్ర(2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగానూ ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గులగాఉంది కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది. కణుపుదగ్గర ఒకచేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి

ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (కో. 23, 25, 28, 29).

సాదనపువెదురు: ఉ. సాదనవెదురు; చూ. సాదనం వెదురు (కో. 2).

సాదనబ్బద్ద: (< సాదనపు+బద్ద) పర్యా. చూ. సుద్దిబద్ద) వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాఫుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసిన చోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి, ఇవి తడకకూ పేడుకూ పనికొస్తాయి (కో. 25.)

సాదనం: 1. పర్యా. చూ. మేదరికఱ్ఱ (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాఫుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (కో. 10, 13, 14, 20); 2. మేదరిపనికి ఉపయోగ పడే వెదురుగడల్లో లావురకం; ఇళ్ళకు కూడా ఉపయోగపడుతుంది (కో. 12, 15, 18); 3. పర్యా. సన్నసాదనం. మేదరిపనికి ఉపయోగపడే వెదురు గడల్లో సన్నరకం (కో. 19).

సాదనం బొంగు: పర్యా. చూ. మేదరికఱ్ఱ (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చగా పొడుగ్గా ఉంటుంది; కణుపుల మధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాఫుగా వస్తుంది; కణుపు దగ్గర ఒకటేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (కో. 2, 14; తె. 7, 10, 27).

సాదనం వెదురు: చూ. సాదనపు వెదురు; పర్యా. చూ. మేదరికఱ్ఱ (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపుల దగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాఫుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఉపయోగం (కో. 11, 17, 22, 28, 29, 31).

సాదా అల్లకం: ఉ. సాదల్లకం; చేట మొ॥ వాటిని ఎలాంటి డిజైనూ (పువ్వు మొ॥) లేకుండా మామూలుగా అల్లేపని (కో. 2, 3; రా. 4).

సాదా గచ్చం: పర్యా. చూ. రెంటాలగచ్చం (2). రెంటాల అల్లకం (చూ.)లో అడ్డంపేడుకు పైకీ కిందికీవచ్చే రెండుపేళ్ళ కూర్పు; చేట, విసనగఱ్ఱ మొ॥ రెంటాలగచ్చంవేసి అల్లుతారు. (కో. 3).

సాదాగడి: బద్దలతోకట్టిన తడకలోవచ్చే మామూలు (చతురస్రాకారపు) కంత. (కో. 8).

సాదాగణుపు: ఉ. సాద—; పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడఉండే హద్దు; గడచుట్టూ ఉబ్బెత్తుగాఉంటుంది; అంతమేరకు లోపలి ఖాళీని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మవేస్తుంది. చూ. చిత్రం 4. 3. (రా. 7).

సాదాచాప: ఉ.—సాప; రంగులుగానీ డిజైన్లుగానీ లేకుండా మామూలుగానేసిన చాప. (కో. 3; రా. 2, 6).

సాదాచేట: ఉ. శాట; పర్యా. మూటాలచేట. మూడు పేళ్ళమీద (చూ. మూటాల) అల్లే చేట. (తె. 4).

సాదాజంగిడి: ఉ. సాద –; పేళ్ళమధ్య ఎడంలేని (జంగిడి); చేపలువేసుకొని రావడానికీ వడియాలు ఎండబెట్టుకోడానికీ పనికొస్తుంది. (కో. 20).

సాదాజల్లెడ: పర్యా. గట్టిజల్లెడ. పేళ్ళదగ్గర దగ్గరగా పెట్టి చిక్కగా అల్లిన జల్లెడ; కన్నాలు చాలా సన్నగాఉంటాయి; మామూలుగా వడ్లలోని మట్టి పెళ్ళలూ మెరిగెలూ మొ॥వి తీసెయ్యడానికి వాడతారు. (రా. 8).

సాదాతడక: (హిం. సాదా—) ఉ. సాద తడ్క; మామూలు వెదురుపేడుతో అల్లిన తడక; దీనికి మందంపేడు వాడరు; బురకతడకకు భిన్నంగా ఉండేది. (తె. 4).

సాదాపేడు: పర్యా. చూ. సుద్దిపేడు. సుద్దిబద్ద (చూ.) నుంచితీసిన వెదురుపేడు. (కో. 24).

సాదాబద్ద: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాఫుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకుపెరిగిన కొమ్మ

నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగా రాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేటుకూ పనికొస్తాయి. (కో. 21).

సాదాబొంగు: ఉ. సాద –; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా మరీ పొడుగ్గా కాకుండా ఉండే మామూలు వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడుతుంది. (తె. 16).

సాదావిసనగర్ర: ఉ.—ఇస్నగర్ర, — యిసనగర్ర; పర్యా. మామూలువిసనగర్ర, మొద్దువిసనగర్ర. పట్టుకొనేకాడకు గొట్టంగానీ లోపల పువ్వులడిజైన్లు గాని లేకుండా మామూలుగా అల్లిన విసనగర్ర. (కో. 2; తె. 8; రా. 3).

సాధారణంబొంగు: ఉ. సాదార్నం –; మామూలుగా అన్నిపనులకూ ఉపయోగపడే వెదురుగడ. (తె. 28).

సానపీట: ఉ. సానె—; పర్యా. చూ. సూర్రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (తె. 15).

సానరాయి: ఉ. సానెరాయి, సార్నాయి; పర్యా. చూ. సూర్రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి. (కో. 21; తె. 13).

సానరౌతు: ఉ. సానె–; పర్యా. చూ. సూర్రౌతు. మేదరికత్తిగాని అంబుగాని నూరుకోడానికి ఉపయోగించే ఒకరకం రాయి; కొన్ని గుండ్రంగానూ పలకగానూ ఉంటాయి; కొన్నిటికి కాళ్ళుంటాయి; (తె. 26).

సాపు: (< హిం. సాఫ్) నునుపు. (తె. 16).

సాపుకర్ర: 1. పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తిముదురుగానూ కాకుండా మధ్యరకంగాఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగాఉండి కండ మందంగాఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళులేకుండాఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒక చేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికిఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం. (కో. 28); 2. పర్యా. చూ. సైరబొంగు (1). వంకరలేకుండా బిటారంగా పెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గాఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది. (కో. 27).

సాపుగనెబొంగు: కణుపు వెడల్పుగాను ఎత్తుగాను లేకుండా సాపుగాఉండే వెదురుగడ. (తె. 22).

సాపుగా: (క్రి. విశే.) (< హిం. సాఫ్—) పర్యా. నునుగా, నున్నగా; వెదురుపేడు చెక్కడానికి సంబంధించిన వాడుక. (తె. 4, 16).

సాపుచెయ్యు: (క్రి.) పర్యా. చూ. గీయు (1). వెదురుబద్దగాని పేడుగాని కర్ర (= తీగలాంటి సన్నటి వెదురుముక్క)గాని కత్తితో నున్నగా గీకడం. (తె. 13, 16).

సాపుబద్ద: ఉ. సాబ్బద్ద; పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీలినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలువస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 27, 28; తె. 15).

సాపుబొంగు: పర్యా. చూ. మేదరికర్ర(2). పూర్తిలేతగానూ పూర్తిముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడంఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళులేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒక చేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్నగుర్తు పడుతుంది; మొదలుగుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (తె. 5).

సామెరవెదురు: ఉ. సామెరెదురు; పర్యా. చూ. సన్నం(పు)బొంగు. రెండంగుళాలనుంచి ఆరంగుళాలవరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగా ఉండి సులువుగా చీలుతుంది; కణుపుల మధ్య ఎడంఎక్కువ; కొన్నిగడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (కో. 18).

సాంబ్రాణిబుట్ట: పర్యా. చూ. ఊద్దాని. తలవెంట్రుకలకు సాంబ్రాణ (ఊదు) పొగవేసుకోడానికి వాడే బుట్ట; అడుగుభాగంలో పేళ్ళమధ్య సందులుండేలాగా అల్లుతారు; సాంబ్రాణి చల్లినకుంపటిమీద దీన్ని బోర్లించి దీనిమీద తలవెంట్రుకలు పరిచి పడుకొంటారు; ముస్లింస్త్రీలు ఎక్కువగా వాడతారు;

చూ. చిత్రం 79. (కో. 3).

సొరవ: ఉ. శొర్వ; పర్యా. చూ. గోవ(3). ఇళ్ళు కట్టేటప్పుడు తాపీమేస్త్రీలు నిలబడడానికి ఎత్తున కట్టేది; (చూ. గోవ; మాం. వృ. కోశం 4, వాస్తుపదజాలం) చూ. చిత్రం 107. (రా. 3).

సొరవవెదురు: ఉ. శొర్వెదురు; పరంజా (=సొరవ) కట్టడానికి ఉపయోగించే లావుపాటి వెదురుగడ. (రా. 3).

సారెగంప: పర్యా. పెండ్లిళ్ళగంప. పెళ్ళిసందర్భంలో ఆడపెళ్ళివారు మగపెళ్ళివారికి సారె సామానుగాని, తీపివంటకాలుగాని, బట్టలుగాని పెట్టిఇచ్చే గంప. (తె. 10, 15–17, 20; రా. 10).

సారెపెట్టె: పర్యా. పెళ్ళిపెట్టె, బుర్రపెట్టె. పెళ్ళి సందర్భంగా పెళ్ళికూతురికిచ్చే సారెసామాను (కుంకుమ, పసుపు, పచ్చ, ముగ్గుపిండి, సెనగ పప్పు, కుడకలు, ఆకులు, పోకలు, కర్పూరపండ్లు, కుంకుమకాయ, బొమ్మ, అద్దం, ఈర్పెన, దువ్వెన, లక్కాకులు, నల్లపూసలు, పగడాలు మొ॥వి) పెట్టి ఇచ్చేపెట్టె; దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; అల్లకం చేటమాదిరిగా అంచుకుబద్దలువేసి కట్టు కడతారు; మూతిగూడా దీనిలాగే ఉంటుంది; ఆర్థిక స్తోమత అంతగా లేనివాళ్ళు ఇస్తారు; కొంచెం ఉన్నవాళ్ళు బంగిపెట్టె (=రెండు పొరలుగా గుండ్రంగా ఉండేది) ఇస్తారు. (కో. 2, 9, 28; తె. 3, 5, 7–10, 17, 19, 26, 28).

సాలూరుకర్ర: శ్రీకాకుళం జిల్లాలోని సాలూరు ప్రాంతంనుంచి తెచ్చిన వెదురుకర్ర. (కో. 30).

సాసానపువెదురు: ఉ. సాశానపెదురు; చూ. సాసానం వెదురు. (కో. 4, 6; రా. 4).

సాసానంబొంగు: పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తిలేతగానూ పూర్తిముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెంగుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపుల ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళులేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపు:గ్గర ఒకతేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మనరికేసినప్పుడు చిన్న గుర్తుపడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (కో. 7; తె. 13).

లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్య రకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ, లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపులదగ్గర ముళ్ళు లేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకతేకొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్న గుర్తు పడుతుంది. మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (రా. 5).

సికిరం: (< సం. శిఖరం) బోర్లించిన గొర్రెపిల్లల గూడు (పిల్లల పొది) పైకొన (తె. 1, 2).

సిగయోర: ఉ. శికయోర, సికయోర; పర్యా. పూజు. అలంకారం కోసం ఎడ్లమూతికి తొడిగే ఒకరకం అల్లకం తాడు; దీని చివర్లు కొమ్ములదగ్గర కడతారు; (కో. 29, 30).

సింకి: తాటాకు గిడుగు (చూ.) కు లోపలినుంచి కింది భాగంలో గళ్ళగళ్ళుగా ఉన్న భాగం; వెదురు బద్దలతో చేస్తారు; టోపీ ఆకారంలో ఉంటుంది (దీన్ని మీంచి తాటాకు కడితే 'గిడుగు' అవుతుంది (కో. 30).

సిటింగ్‌చేర్: (< ఇం. sitting chair) ఉ. సిట్టింగ్—; ఒకరకం పేముకుర్చీ; వెన్ను నిటారుగా పెట్టి కూర్చోడానికి మాత్రం వీలయినది (కో. 11, 19).

సిద్ధులయ్య: మేదరివాళ్ళ కులగురువు (కో. 2).

సింతూరు బొంగు: సింతూరు ప్రాంతంలో పెరిగిన వెదురు (తె. 30).

సిపాయి: (హిం. సిపాహీ) ఉ. సిపాయీ; ఇళ్ళలో సున్నం వేసేవాళ్ళు ఎక్కి నిలబడడానికి తయారు చేసిన ఎత్తయిన బల్ల; కింద ఎక్కువ వెడల్పుఉండి పైన తగ్గుతుంది; ఆరడుగుల ఎత్తుంటుంది; వెదురు గడతోనూ బద్దలతోనూ చేస్తారు. చూ. చిత్రం 110. (తె. 10).

సిపాయితడక: ఇంటిమీద ఏటవాలుగా కప్పడానికి పనికొచ్చే వెదురుతడక. (రా. 1).

సిబ్బి: ఉ. శిబ్బి; సిబ్బె; 1. రూ. జిబ్బి; పర్యా. జీవులుక. అన్నంకుండలోంచి గంజి వార్చేటప్పుడు పైనపెట్టే మూత; వెదురుపుల్లలతో అల్లుతారు; గుండ్రంగా ఉంటుంది. (కో. 4, 6, 9, 11, 15–

మూకుడు (3), మూత (2), సిబ్బెడం(1). చేతిబుట్ట (మూతబుట్ట), పూలబుట్ట, ఆకులగంప మొ॥ వాటి మూతిభాగాన్ని మూసేకప్పు; అన్నం వార్చుకొనే సిబ్బిమాదిరిగా ఉంటుంది; చూ. చిత్రం 72. (కో. 1, 8, 10; తె. 9, 22, 24; రా. 2-4, 7, 8, 10, 11); 3. పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసిపెట్టుకోడానికి వెదురు పేళ్ళతోగాని ఈతపేళ్ళతోగాని అల్లిన పళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66. (రా. 9); 4. పర్యా. రొట్టెలసిబ్బి. రొట్టెలుపెట్టుకొనే వెదురు పళ్ళెం (తె. 1; రా. 11); 5. పర్యా. చూ. తరాజుసిబ్బి(1). వెదురుపేడుతో అల్లిన తక్కెడ పళ్ళెం. (తె. 3); 6. పర్యా. కోడిసిబ్బి. కోళ్ళను పార్సల్ చేసేబుట్ట ద్వారాన్ని మూసేది; అన్నం వార్చుకొనే సిబ్బిలా ఉంటుంది. చూ. చిత్రం 65 చ. 2. (తె. 27, 31); 7. వంట పాత్రనుంచి అన్నం వార్చడానికి గుండ్రంగా అల్లినది; దుసేరు తీగలతో గాని ఈతబద్దలతోగాని అల్లుతారు. (తె. 7, 9, 11, 13, 14, 16, 20); 8. ద్రాక్షపళ్ళగంప, బత్తాయి పళ్ళగంప మొ॥వాటిని కప్పే ఈతపేళ్ళ మూత; కొన్నిచోట్ల నీళ్ళకుండీ (హౌజ్)లమీద పెట్టేది; అన్నం వార్చేసిబ్బికన్న చిక్కగా అల్లుతారు.

సిబ్బికర్ర: ఉ. శిబ్బి—; పర్యా. చూ. సిబ్బివార. సిబ్బి అల్లడానికుపయోగించే కర్ర (చూ.); దారంమాదిరిగా సన్నగా గుండ్రంగా ఉంటుంది. (తె. 17).

సిబ్బిగనె: ఉ. శిబ్బి—; పర్యా. చూ. చిప్పగనుపు. వెదురుగడ గనుపుదగ్గర పెరిగినకొమ్మ నరికివేసినప్పుడు కనిపించే వెడల్పుగుర్తు; కొమ్మలావుగా ఉండడంవల్లగాని ఒకేచోట రెండుమూడు కొమ్మలు పెరగడంవల్లగాని వాటిని నరికినప్పుడు పెద్దగుర్తు పడుతుంది; ఇలాటి కణుపు ఉన్న వెదురుగడను చీల్చడంకష్టం. (తె. 20, 24).

సిబ్బితీగ: ఉ. — తీగ; పర్యా. దుసేరుతీగ. నేలమీద పాకే ఒకరకరం తీగ; ఆకుపచ్చగా దబ్బనమంత లావు ఉంటుంది; సిబ్బి, పశువుల మూతిబుట్ట మొ॥ అల్లడానికీ తాళ్ళు పేనడానికీ పనికొస్తుంది. (తె.11).

సిబ్బిబుట్ట: ఉ. శిబ్బిబుట్ట; అన్నం వార్చుకొనేసిబ్బి లాంటి మూతగల చేతిబుట్ట; దీనికి కళ్ళుగానీ గద్దెగానీ ఉండవు; పట్టుకోడానికి ఒక వెదురుబద్ద కడతారు. (రా. 11).

సిబ్బివార: ఉ. శిబ్బెర; రూ. జిబ్బివార; పర్యా. బడుగు (2), సన్నకర్ర (4), సన్నినె (3), సిబ్బి కర్ర, సిబ్బి అల్లడానికి ఉపయోగించే కర్ర (చూ.); దారంమాదిరిగా సన్నగా, గుండ్రంగా ఉంటుంది. (కో. 22, 27).

సిబ్బెడం: 1. పర్యా. చూ. సిబ్బి (2). చేతిబుట్ట (మూతిబుట్ట), పూలబుట్ట, ఆకులగంప మొ॥ వాటి మూతిభాగాన్నిమూసే కప్పు; అన్నం వార్చుకొనే సిబ్బిమాదిరిగా ఉంటుంది; చూ. చిత్రం 72. (తె.28); 2. పర్యా. చూ. సెంగేరి. దుకాణంముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళతోగాని ఈతపేళ్ళతోగాని అల్లినపళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66. (తె 28).

సింబు: పర్యా. చూ. చిల్ల (1). వెదురుగడ కణుపు దగ్గర పెరిగిన చిన్నకొమ్మ; దాదాపు వేలెడులావూ ఒకటిరెండు గజాలపొడుగూ ఉంటుంది; ముల్లుగర్రగానూ దోమతెర కర్రగానూ గాలం బదుగుగానూ వాడతారు; కొమ్మ నరికినప్పుడు దాని మొదలు కణుపుకు మిగిలిఉంటుంది; (చూ. గంటిగనుపు); కొమ్మ(ల) ఉరువునుబట్టి పెద్దగానో చిన్నగానో ఉంటుంది. (రా. 1).

సిరిగుల్లకర్ర: కణుపుకూ కణుపుకూమధ్య లోపల సన్నని బోలుండే వెదురుగడ; మేదరిపనికి ఉపయోగపడే పేళ్ళు దీన్నుంచి ఎక్కువగా వస్తాయి. (కో.27).

సిరిచాప: ఉ.—సాప; పర్యా. తుంగచాప. పడుకోడానికీ కూర్చోడానికీ తుంగ (చూ.)తో నేసిన చాప. (కో. 14; రా. 4).

సిరిచాపనేత: ఉ. సిరిసాప —; సన్నటితుంగతో చాప నెయ్యడం. (రా. 4).

సిరిపెండె: పర్యా. చూ. కర్ర (2). చేట అంచు కట్టడానికి ఉపయోగించే సుమారు వేలెడు లావుండే కడ్డీలాంటి వెదురుబద్ద; చేట అంచుకు లోపలినుంచి ఒక బద్దా వెలుపలినుంచి ఒక బద్దా పెట్టి ఈ రెంటి మీదినుంచి, ఈ రెంటికీ మధ్య సందులో ఇరికేటట్లు సందును మూసేస్తూ కర్రను పెడతారు; కర్ర పెట్టిన తరవాత కట్లు కడతారు (కో. 24).

సిర్మాను: చూ. చిల్మాను (తె. 31).

సిర్మానుగద్దె: ఉ. సిర్మన్—; పర్యా. వట్టిగద్దె. చల్లదనమూ సువాసనా ఇచ్చే ఒకరకం గడ్డి; దీన్ని చిల్మాన్లు (చల్లదనం కోసం వేలాడదీసే తడకలు; చూ.) కట్టడానికి ఉపయోగిస్తారు. (తె. 31).

సిర్సముక్క: పర్యా. అడ్డంతుంట, గెనితె. సుమారు

మూరెడు పొడుగు వెదురుగడ ముక్క; వెదురు మంచం తయారీలో కాలుగాగాని నిచ్చెన కట్టుబడిలో మెట్టుగాగాని వాడతారు (కో. 29).

సిల్కిదారం: (< ఇం. silk—) పట్టు (సిల్కు) దారం; కొన్ని చాపలనేతకు వాడతారు (కో. 21).

సిలోన్‌కుర్చీ: (< ఇం. ceylon + హిం. కుర్చీ. ఒకరకం పేముకుర్చీ (కో. 10–12).

సీటుకర్ర: (< ఇం. seat—) పేముకుర్చీలో కూర్చునే భాగంలో బిగించే వంపుకర్ర (కో. 12).

సీట్‌దండ: (ఇం. seat—) పేముకుర్చీలో కూర్చునే భాగానికి ముందువైపు అమర్చిన పేముకర్ర (తె. 22).

సీద: ఆకులతో ఉన్న వెదురురెమ్మ (కో. 22).

సీర్వ: పర్యా. దాలెం (4), నిలువు (2), పలుకు (6). నిలువుగా సగానికి చీల్చిన గోవ (చూ.) లో ఒక భాగం; దీన్ని బదారుకర్ర (చూ.)లుగా చీల్చవచ్చు. (కో. 27, 28).

సీల: ఉ. శీల; పర్యా. మొల. చిన్న ఇనపమేకు (తె. 1, 6, 7).

సీలతడక: పర్యా. చూ. జాలి తడక (1). వెదురు బద్దలు ఎడం ఎడంగాపెట్టి మేకులుకొట్టి తయారు చేసిన తడక; బద్దకూ బద్దకూ మధ్య సందులు చతురస్రంగాని డైమన్ ఆకారంలోగాని ఉంటాయి; ఇళ్ళచుట్టూ ప్రహరీగోడ బదులు పెట్టుకొంటారు (తె. 31).

సీలేరుకర్ర: సీలేరు ప్రాంతంలో పెరిగిన వెదురుకర్ర (కో. 25).

సీసకమ్మరికట్టె: పర్యా. పూలకట్టె. గుండ్రంగాను నల్లగాను ఉండే ఒకరకం మొక్కచువ్వ (బరిగె); ఇది చేలగట్ల వెంట పెరుగుతుంది; దీనిపూలు ఎరుపు రంగులో ఉంటాయి (తె. 16).

సీసాలగంప: ఉ. సీసల ; కల్లుసీసాలు చేరవేసే గంప (తె. 14).

సుక్కిదబ్బ: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగా వచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగా రాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి (తె. 3, 4, 12).

సుంగ: కూడా (తె. 22).

సుగతిపోమ: వెదురుకర్ర పెరిగేటప్పుడు తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోవడం (కో. 23).

సుంకు: 1. పర్యా. చూ. బూడిద. లేత వెదురుగడ చుట్టూ ఏర్పడే తెల్లటిపొడి; కొన్నిచోట్ల నల్లటిది; గడపుట్టిన ఒక సంవత్సరానికి ఏర్పడుతుంది. (కో. 5; రా. 9); 2. పర్యా. బూషి. ఈతకమ్మ మీద బూడిదలాఉండే తెల్లటిపొడి. (రా. 9).

సుడిమట్ట: పర్యా. చూ. ఈతకమ్మ. ఈతచెట్టు కాండానికి (బోదె) అంటుకొనిఉన్న చోటినుంచి చివరివరకు రెండువైపులా ఆకులుపెరిగిన కట్టె; బరిగె; మొదలు లావుగాఉండి పోనుపోను సన్న మవుతుంది. చూ. చిత్రాలు 2. 1, 10. (రా. 9).

సుత: పర్యా. చూ. కొన (7). వెదురుగడ చివరి సన్నటిభాగం. (కో. 15, 17, 19, 22).

సుతిలి: (< హిం. సుత్లీ) ఉ. సుత్లి; పర్యా. పురికోస, బంగాలకోస, లంబాడికోస; గోగు, జనప, మొ॥ నారలతో మిషన్‌లో తయారైన సన్నటి పురితాడు; పుల్లలతడక (చిక్కతడక), కాపెగడ్డి చిల్మాన్లు మొ॥ తయారుచేయడానికి వాడతారు. చూ. చిత్రం 93. 3. (తె. 4, 8–10, 14, 15, 17).

సుత్త: అగరువత్తిపుల్లలు చీరడానికి పనికొచ్చే వెదురు గడ. (తె. 8).

సుత్తిబరి: పర్యా. చూ. ఎగదండు. చాపనేత మగ్గం మొదటిభాగంలో (= నేతపనివాడు కూర్చొనేవైపు) అమర్చిన లావాటిపలక; పోగులను లాగిపట్టి ఉంచుతుంది; చాపనేస్తూ దీనికి చుట్టుకుంటూపోతారు; లావుగా దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది; కొన్నిటికి (సుమారు 30 రంధ్రాలుంటాయి; ఈ రంధ్రాల గుండా పోగులనుదూర్చి దిగదండుకు కడతారు; రంధ్రాలుండని పలకకు దారంకొలుకులుగాని పొడుగాటి ఇనపచువ్వగాని తొడుగుతారు. (కో. 8).

సుత్తికామ: సుత్తికి తొడిగిన వెదురుకర్ర ముక్క. (తె. 10, 26).

సుద్దనార: పర్యా. లేతనార. పచ్చిగా, లేతగాఉండే కలబందమట్టనుంచి తీసిన నార; తెల్లగాఉంటుంది. (రా. 5).

సుద్దం: (< సం. శుద్ధం) ఆకులూ చెత్తా తీసేసి నేతకు పనికొచ్చేవిధంగా శుభ్రంచేసిన జమ్ము. (రా. 2).

సుద్ది: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురు బద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతి

గడకూ రెండు సుద్దిబద్దలువస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 6, 11).

సుద్దిగనుపు: ఉ. సుద్దిగన్ను; 1. రూ. సుద్దిగనె, పర్యా. చూ. కణుపు. వెదురుగడకు అక్కడక్కడ ఉంచే హద్దు; గడచుట్టూ ఉబ్బెత్తుగా ఉంటుంది; అంతమేరకు లోపలిఖాళీని మూసేస్తుంది; పర్వం; ఇక్కడ కొమ్మవేస్తుంది. చూ. చిత్రం 4.3 (కో. 14, 17, 18; తె. 28); 2. వెదురుగడకు కొమ్మవేయని కణుపు. (తె. 7).

సుద్దిగనె: చూ. సుద్దిగనుపు. (తె. 27).

సుద్దిచెక్క: ఉ.—సెక్క; పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.)లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగిన కొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలువస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (తె. 5).

సుద్దిడబ్బ: చూ. సుద్దిబద్ద. (తె. 8).

సుద్దితునిగ: పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసిన చోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతి గడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (రా. 3).

సుద్దిదబ్బ: ఉ. సుద్దబ్బ; చూ. సుద్దిబద్ద. (కో. 1-3 5, 9, 10; తె. 2, 7; రా. 2, 9, 11).

సుద్దిపలుకు: సుద్దిబద్ద (చూ.)నుంచి తీసిన వెదురు పేడు; వెడల్పుగానూ మందంగానూ ఉంటుంది; బండిజల్లలు మొ॥అల్లడానికి పనికొస్తుంది. (కో.18).

సుద్దిపేడు: పర్యా. సరుముపేడు, సాదాపేడు సుద్దిబద్ద (చూ.)నుంచి తీసిన వెదురుపేడు. (కో. 8).

సుద్దిబద్ద: రూ. —డబ్బ, సుద్దిదబ్బ; పర్యా. కమ్మబద్ద, కొలబద్ద (2), పోతుబద్ద, మంచిగుంపుబద్ద, మంచిబద్ద, లాక (2), సపయిదబ్బ, సరుము (3), సరుముబద్ద, సవకలం (2), సాచనబ్బద్ద, సాదాబద్ద, సాపుబద్ద, సుక్కిదబ్బ, సుద్ది, సుద్దిచెక్క, సుద్దితునిగ, సుద్దొప్ప. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలువస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 8-11, 13, 15-18; తె. 6, 7, 10, 13, 30, 31).

సుద్దొప్ప: (< సుద్ది + ఒప్ప) పర్యా. చూ. సుద్దిబద్ద. వెదురుగడ చీరినప్పుడు గంటిగనుపు (చూ.) లేకుండా సాపుగావచ్చే వెదురుబద్ద; వెదురుగడకు పెరిగినకొమ్మ నరికేసినచోట (గంటిగనుపు) చీలిస్తే బద్ద సరిగారాదు; ప్రతిగడకూ రెండు సుద్దిబద్దలు వస్తాయి; ఇవి కర్రకూ పేడుకూ పనికొస్తాయి. (కో. 15, 16).

సున్నంజల్లెడ: సున్నం జల్లించే జల్లెడ. (కో. 23).

సుర్: కత్తికి కోసుగా ఉన్నభాగం; చూ. చురకత్తి. (తె. 1).

సురంజి: వెదురుపొదలు పెరిగే ఒక కొండప్రాంతం. (కో. 31).

సుల్కంబొంగు: 1. పర్యా. చూ. సన్నం(పు)బొంగు. రెండంగుళాలనుంచి ఆరంగుళాలవరకు లావుండే సన్నటి వెదురుగడ; కణుపు సన్నగాఉండి సులువుగా చీలుతుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కొన్నిగడలలో బోలు సన్నగా ఉంటుంది; కొన్నిటికి బోలుండదు. (తె. 21); 2. పర్యా. చూ. పూసగనుపు కర్ర, కొమ్మ నరికేసినప్పుడు కణుపు దగ్గర చిన్నగుర్తుపడే వెదురుగడ; కణుపుదగ్గర పెరిగే కొమ్మ సన్నగా ఉండటంవల్ల దాన్ని నరికినప్పుడు సన్నటిగుర్తు పడుతుంది; దీన్ని చీల్చడం సులువు. (తె. 21).

సువ్వగా: (క్రి. విశ.) ఉ. సువ్వగ; పదునుదేరి; కత్తి పదునుదేరి ఉన్నప్పుడు అంటారు. (తె. 17).

సువ్వు: (క్రి.) వెదురుపుల్ల (=సన్నని కడ్డీలాంటి వెదురుఈనె)ను కత్తితో నున్నగా గీకడం. (కో.3).

సూది: ఉ. సూదు; 1. పర్యా. దబ్బలం సూది. దబ్బనానికి మొనదేలినభాగం. చూ. చిత్రం 18 చ. 1. (కో. 19. 21, 22, 23, 25, 28, 30, 31); 2. పర్యా. చూ. మొన(2). ఒకరకం అంబు (చూ.) కొడకొన; మొనదేలి ఉంటుంది. చూ. చిత్రం 15 చ. 3

సూదిచాప: ఉ. సూచాప్ప; పర్యా. చూ. పుల్లలతడక. వెదురుపుల్లలూ పురికొసలూ పెట్టి అల్లినతడక (చాప); గుమ్మాలకుగాని వరండాలకుగాని పరదాలుగా వాడతారు; చూ. చిత్రం 93. (కో. 25).

సూదిబోలు: పర్యా. చూ. గట్టికర్ర (1). సూదిపట్టేంత ఖాళీమొదలు వేలెడంత ఖాళీవరకు లోపల బోలుగా ఉండే గట్టి వెదురుకర్ర; గుట్టలమీదా రాళ్ళదగ్గరా పెరుగుతుంది; మూడు అంగుళాలవరకు లావుగా ఉంటుంది. (కో. 11).

**సూపర్‌స్పెషల్: ఉ. - పెషల్; స్పెషల్‌బొంగు**

(చూ.) కన్న లావుగా ఉండే వెదురుగడ; నిచ్చెన్లకు పనికొస్తుంది; వ్యాపారపరంగా వాడుకలోకి వచ్చినపేరు. (కో. 3; తె. 17).

సూరకత్తి: ఉ. సూర్ , సూరి ; చూ. చురకత్తి (కో. 1, 3, 5, 6, 8-10, 12, 15-17, 24-28; రా. 2, 3).

సూరీగబుట్ట: ఉ. సూర్క—, సూరీగ—, సూరుక—; పర్యా. చూ. బియ్యంగడుగుబుట్ట; బియ్యంకడిగి గాలించిన తరవాత నీళ్ళు ఓడిపోవడానికి పోసిఉంచే బుట్ట; కొంచెం పలచగా ఉంటుంది; కొన్నిచోట్ల కింద సన్నగాఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది; కొన్నిచోట్ల కిందినుంచి మీదికి ఒకేతీరుగా ఉంటుంది. కొన్నిచోట్ల కింద నాలుగుమూలలుగా ఉండి పైన గుండ్రంగా ఉంటుంది; (దీన్ని చేట మాదిరిగా అల్లుతారు); సంతర్పణ వంటలకు వాడతారు; చూ. చిత్రం 48 (కో. 10, 12, 14, 17).

సూర్దెపుల్ల: బుట్టలనేతమగ్గం పడుగులో దూర్చే సన్నటి వెదురుపుల్ల; ఒకటిమ్ముప్పాతిక గజం పొడుగు ఉంటుంది (చూ. సూరె; చూ. వృ. కోశం-2, చేనేతపదాలు) (తె. 6).

సెక: (< సం. శిఖ) పర్యా. ఎల్గడ. నిప్పుసెగ; వేడి (తె. 26).

సెకండు: పర్యా. చూ. సెకండ్‌క్లాస్ బొంగు. సుమారు 9 సెం. మీ. నుంచి 12 సెం. మీ. వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది (తె. 31).

సెకండ్‌బొంగు: పర్యా. చూ. సెకండ్‌క్లాస్ బొంగు, సుమారు 9 సెం. మీ. నుంచి 12 సెం. మీ. వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది (తె. 5).

సెకండ్‌క్లాస్‌కఱ్ఱ: ఉ. సెకండ్లాస్—; పర్యా. చూ. సెకండ్‌క్లాస్ బొంగు. సుమారు 9 సెం.మీ. నుంచి 12 సెం.మీ. వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది (కో. 3).

సెకండ్‌క్లాస్‌బొంగు: ఉ. సెకండ్—, సెకండు క్లాసు—, సెకండ్లాస్—, సెకండ్లాసు—, సెకెండ్ క్లాస్—, సెకెండ్లాసు—; పర్యా. నడితరం బొంగు, మధ్యరకం బొంగు, రెండోక్వాలిటి, రెండోరకం బొంగు, సెకండు, సెకండు బొంగు, సెకండ్‌క్లాస్ కఱ్ఱ, సెకండ్‌క్వాలిటి. సుమారు 9 సెం. మీ. నుంచి 12 సెం.మీ. వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేది (కో. 5-8; రా. 5. 6, 8, 10, 11).

సెకండ్‌క్వాలిటి: పర్యా. చూ. సెకండ్‌క్లాస్ బొంగు. సుమారు 9 సెం.మీ. వరకు లావుండే వెదురుగడ; మొదటిభాగం గట్టిగానూ చివరిభాగం బోలుగానూ కణుపులు దగ్గరదగ్గరగానూ ఉండేవి (తె. 10).

సెంగెరి: ఉ. శెంగేరి, సెంగెరీ; రూ. శింగరి, సెంజరి; పర్యా. అంచె (3), అంచెబుట్ట (3), కూరగాయల సిబ్బి, చిన్నతట్ట; జంగిడి, తట్ట (5), దాగర (3), పండ్లసిబ్బుడం, పలికెబుట్ట సిబ్బి. (3), సిబ్బుడం (2). దుకాణం ముందు కూరగాయలు, పళ్ళు, బియ్యం మొ॥ సరుకులు పోసి పెట్టుకోడానికి వెదురుపేళ్ళలో గాని ఈతపేళ్ళతోగాని అల్లిన పళ్ళెం; గుండ్రంగా ఉంటుంది; చూ. చిత్రం 66 (తె 8, 14, 22, 25).

సెంగెరిగంప: ఉ. శెంగేరి—; పర్యా. చూ. గడ్డిబుట్ట. పశువులకు గడ్డి వేయడానికి వాడే పెద్ద గంప; అడుగున వెడల్పు తక్కువుండి పోనుపోను మూతి విశాలమవుతుంది; గడ్డి కిందవేస్తే పశువులు తొక్కుతాయని దీంట్లో వేస్తారు. చూ. చిత్రం 91 (రా. 9).

సెంగెరిబుట్ట: ఉ. శెంగేరిబుట్ట; పర్యా. గుద్దసిబ్బి. అడుగున మట్టు(గద్దె) ఉండే ఒకరకం బుట్ట; పళ్ళెం మాదిరిగా గుండ్రంగానూ ఎత్తు తక్కువగానూ ఉంటుంది; చూ. చిత్రం 67. (రా. 11).

సెంచికఱ్ఱ: నిచ్చెనలకు ఉపయోగించే లావాటి వెదురుగడ. (కో. 20).

సెంజరి: చూ. సెంగెరి. (తె. 14).

సెనిక్కాయజల్లెడ: వేరెసెనక్కాయలు జల్లెడ పట్టడానికి వీలుగా అల్లినజల్లెడ. (రా. 3).

సెల: 1. గుట్టలలో పారేనీరు. (రా. 4); 2. పర్యా. లొద్ది. లోయ; గుట్టలనడుమ పల్లప్రదేశం. (తె. 6).

సెలబొంగు: పర్యా. చూ. లొద్ది(ల)బొంగు. లోయలో పెరిగిన వెదురుగడ; మెత్తగా బోలుగా ఉంటుంది; కణుపులు దూర దూరంగా ఉంటాయి; మేదరిపనికి బాగా ఉపయోగం. (రా. 8).

సెల్లెపుల్ల: 1. పర్యా. చూ. అడిపోగు (1). గంప, బుట్ట, సిబ్బి మొ॥వాటి అల్లకంలో బొద్దుగా

అడుగూ అల్లడానికి వాడే పలచటి సన్నటి పేడు (కొన్నిచోట్ల లావుది); పసరుకింది పేడును రెండు భాగాలుగా నిలువునా నిలిస్తే వస్తుంది; కొన్నిచోట్ల ఎత్తుభాగం మూతిదగ్గర అల్లడానికీ ఉపయోగిస్తారు. చూ. చిత్రం 47 క. 3. (రా. 6); 2. పర్యా. చూ. కర్ర (9). గోడ(వార) నుంచి పొడుగ్గా తీగలా వచ్చేటట్లు చీరినభాగం; పేడు వెడల్పులో సగంగాని అంతకన్న తక్కువగాని ఉంటుంది; పేడుకన్న మందంగానూ కొంచెం ఉబ్బెత్తుగానూ ఉంటుంది; గంప, తట్ట, గుల్ల, బుట్ట మొ॥వాటి అల్లికంలో నిలువుల చుట్టూ చుట్టడానికి పనికొస్తుంది. చూ. చిత్రం 47 చ. 1. (రా. 6).

సెషల్‌బొంగు: (< ఇం. special —) చూ. స్పెషల్ బొంగు. (కో. 6).

సేంపేము: చిటికెనవేలెడు లావుండే గట్టిపేముకర్ర; తెల్లగా ఉంటుంది. (కో. 3).

సేంపిలు: (< ఇం. sample) రెండడుగుల వెడల్పు గల మూసగంప (చూ.). (కో. 19).

సేలంజమ్ము: నాణ్యమైన ఒకరకం జమ్ము; దారంలా సన్నగా ఉంటుంది; చిన్నవస్తువులు అల్లడానికి పనికొస్తుంది; సేలం ప్రాంతంలో పెరిగేది కావచ్చు. (రా. 6).

సేలంచాప: ఉ. —సాప; సన్నటి జమ్ముతో నేసిన ఒకరకం చాప. (రా. 6).

సైడుకట్టు: (< ఇం. side—) పేముకుర్చీ తయారీలో కర్రలు కలిపి బిగించినచోట అల్లే అల్లకం. (కో. 19).

సైడుకట్టె: పర్యా. చూ. చిలువుబొంగు(2). నిచ్చెన తయారీలో నిలువుకువాడే వెదురుగడ; ఇలాటివి రెండుంటాయి. (తె. 3).

సైడుదబ్బ: పర్యా. చూ. అంచుబద్ద. తడక అంచుకు తొడిగిన వెదురుబద్ద. (రా. 5).

సైడుబొంగు: పర్యా. చూ. అంచుకర్ర. బండిజల్ల మొ॥వాటి అంచులకు తొడిగే వెదురుకర్ర. చూ. చిత్రం 32. 1. (తె. 2).

సైరబొంగు: 1. పర్యా. కాకివాసం (1), కాకి వెదురు (1); చక్కనికర్ర, తిన్నటికర్ర, తిన్నని వాసం, సవరంకర్ర, సాపుకర్ర (2). వంకలు లేకుండా నిటారుగా పెరిగిన వెదురుగడ; బోలు ఎక్కువగా ఉండి తేలిగ్గా ఉంటుంది; నిచ్చెన మొ॥ వాటికి పనికొస్తుంది (తె. 18, 19); 2. పర్యా. చూ. మేదరికర్ర (2). పూర్తి లేతగానూ పూర్తి ముదురుగానూ కాకుండా మధ్యరకంగా ఉండే నాణ్యమైన వెదురుగడ; లోపల కొంచెం గుల్లగా ఉండి కండ మందంగా ఉంటుంది; పచ్చిగా పొడుగ్గా ఉంటుంది; కణుపులమధ్య ఎడం ఎక్కువ; కణుపుల దగ్గర ముళ్ళులేకుండా ఉండి పేడు సాపుగా వస్తుంది; కణుపుదగ్గర ఒకటే కొమ్మ పెరుగుతుంది; ఆ కొమ్మ నరికేసినప్పుడు చిన్నగుర్తు పడుతుంది; మొదలు గుండ్రంగా నరికి ఉంటుంది; మేదరిపనికి ఎక్కువ ఉపయోగం (తె. 24, 25).

సొరిగొయ్య: పర్యా. చూ. మొదలుపోయే కర్ర (1). వెదురుగడలో మొదలున్న భాగం; లావుగా రెండు బారల పొడుగుంటుంది (కో. 23).

సొవ్వకర్ర: పర్యా. చూ. కపురుబొంగు (1). తగినన్ని నీళ్ళు అందక పచ్చదనం కోల్పోయి పాలిపోయిన వెదురుగడ; తెల్లగాగాని నల్లగాగాని అవుతుంది; సరయిన బిగి ఉండక పెళుసెక్కి పేడు తీసేటప్పుడు ఎక్కడికక్కడ విరిగిపోతుంది; శ్రేణి తడకలకు మాత్రం పనికొస్తుంది (కో. 29, 30).

సోఫా: వెనక్కి వాలి కూర్చొనే పేముకుర్చీ; సోఫా మాదిరిగా ఉంటుంది (కో. 11, 19).

సోరు: పర్యా. తొక్క (1), పొలుసు, రెమ్మ (1). వెదురుగడకుగాని దాని కణుపునుంచి పుట్టిన కొమ్మకుగాని వెదురుమొవ్వ చుట్టూగాని సన్నటి పొరలా కప్పి ఉన్న ఆకు; ఒక కణుపునుంచి ఇంకో కణుపు వరకు ఉంటుంది; లేతప్పుడు మాత్రమే ఉండి గడ ముదరగానే వాడి రాలిపోతుంది. చెరుకుగడకూ చొప్పదంటుకూ ఉన్న మాదిరిది (కో. 28, 30).

సోరుకొయ్య: పర్యా. చూ. రివ్వ. సన్నగా గట్టిగా ఉండే వెదురుకర్ర; చిటికెన వేలెడు లావునుంచి బొటనవేలెడు లావు వరకు ఉంటుంది; దీనికి లోపల ఖాళీ ఉండదు; కణుపులు దగ్గరదగ్గరగా ఉంటాయి; దీన్ని ముల్లుగర్రలకూ పందిరిపెండె కట్టుకోడానికీ చేతికర్రలకూ ఉపయోగిస్తారు (కో. 24).

స్టాండుఉయ్యాల: (< ఇం. stand—) పేముతో చేసిన ఉయ్యాల; స్టాండుకు అమర్చినది (కో. 12).

స్టీమర్: (ఇం. steamer) వెదురుతో చేసిన స్టీమర్ బొమ్మ; ఇళ్ళలో అందానికి పెట్టుకొంటారు (కో. 27, 29).

స్టీంబోటు: (ఇం. steam boat) ఇళ్ళలో అలంకరించుకోడానికి చేసిన ఓడబొమ్మ; వెదురుపేళ్ళతో చేసింది (కో. 5, 28).

స్టూలు: (< ఇం. stool) పేముతో చేసిన ఎత్తుపీట;

